తే. ధనమె పావనమంచు నెమ్మనమునందు
నెంచ కధికధనంబు వెచ్చించి స్వీయ
ముద్రణాలయమందు సుముద్రితమగు
సుకృతులను రమ్యసుమరాజిఁ బ్రకృతిమధుర
నాంధ్రభాషామతల్లిక నధికభక్తిఁ
బూజఁజేసెదువావిళ్ల పూజ్యవంశ్యు
వేంకటేశ్వరశాస్త్రి శ్రీవేంకటేశుఁ
డఖిలసుఖముల నిడి దయనరయుఁగాత!

విద్య నభ్యసించిన నేనును దన్మతానుసారినై యాయాసూత్రములకడ నాయావానికి మూలభూతములగు నాయాచింతామణి తద్వివరణ వాక్యములను జూపుచు వ్యాఖ్య వ్రాసినవాఁడ నగుటంజేసియు, బాలవ్యాకరణమునకు మూల మిదియని యిట విస్తరించి వ్రాయఁ బ్రసక్తి గలుగదయ్యె. నామనిర్దేశము సేయక తత్తన్మతములను నిరాకరించుటచేతను, వాగనుశాసనాథర్వణులనె పేర్కొనుటచేతను, దన బహులక్షణపరిశ్రమను, వాగనుశాసనాథర్వణగ్రంథమత ప్రధానానుసరణమును వ్యక్తపఱచియే యుండుటంజేసి పాణినికాత్యాయనుల సూత్రవృత్తులంబోలు సూత్రవృత్తులు గలిగి శాస్త్రపద్ధతిని సక్రమముగ సార్థకముగ విషయముల వర్ణించు నపూర్వంబగు వ్యాకృతరచనా సంవిధాన మాత్మీయబహుపరిశ్రమసిద్ధంబ యగుట సూరి తన వ్యాకృతిని మదుపజ్ఞంబని యనెనుగాని యపూర్వవిషయసృష్టమను తలంపునఁ గాదనుట స్పష్టము.

ఆదిమ గ్రాంథికాంధ్రానుశాసనములలోఁ జింతామణియు నద్దానిశేషగ్రంథమగు నథర్వణకారికలును నా రెండిటికి విపులవివరణంబగు నహోబలపండితీయమును సంస్కృతభాషలో నుండుటయు మీఁదుమిక్కిలి యహోబలపండితీయము రాద్ధాంతసిద్ధాంతపద్ధతిని దుర్గ్రాహముగ నుండుటయు నింకఁ దెనుఁగుబాసలోఁ గల యాంధ్రభాషాభూషణాదులు నిర్వచనములై యొకక్రమము ననుసరింపక కొన్ని కేవలదేశ్యపరములును గొన్ని నిరర్థకవిషయసంకలితములును గొన్ని విసుపుజనించు విపులపద్ధతి నసమగ్రముగ విషయవర్ణన మొనర్చునవియునై యుపకరింపనివగుటయుఁ, గొన్ని యముద్రితములై యడఁగియుండుటయు, నొక వ్యాకృతియైనఁ గొంతవఱకేని సమగ్రంబనఁదగినది బాలావబోధకుఁ దగినది గ్రాంథికాంధ్రస్వరూపము నెఱింగించునది తెనుఁగునఁ గానరాకుండుటయుఁ, బ్రాచీనగ్రంథసరణి పండితాదరణస్వానుభవములంబట్టి యప్పటికి శాస్త్రసరణియె విలువఁగలదిగ గోచరమగుటయు శాస్త్రపద్ధతిని గ్రాంథికాంధ్రరూపము నెఱిఁగించు నిట్టి వ్యాకరణమును దెనుఁగున రచియింపఁ జిన్నయసూరిని బ్రోత్సహించినవని సంభావింపఁ దగు.

ఈపగిదిని బాలురు కంఠస్థము చేసికొన ననువగు సంగ్రహశాస్త్ర పద్ధతిని సూత్రవృత్తులను గూర్చి పండితహృదయంగమ మగుగతిని రచించుటను, గ్రాంథికాంధ్రమున కట్టి వ్యాకరణమొం డనంతరమునను నుదయింపమిని సామాన్యముగ సర్వసమ్మతమై బాలవ్యాకృతి, సంస్కృత భాషకుఁ బాణినీయమువలె గ్రాంథికాంధ్రమునకుఁ బరమప్రమాణ వ్యాకరణమై యదితప్పనినది తప్పును నదియొప్పనినది యొప్పును నను భావన పండితలోకమునకును గల్గించి గ్రాంథికాంధ్రస్వరూపసంప్రకాశన సర్వాధికారిపదవి నధిరోహించె ఈవిషయ మంతగ సహజము గాని దగుట క్రిందివిషయమునుబట్టి విశదపడెడి.

సంస్కృతమువలెఁ గాక నిచ్చలు వ్యవహారవశమున సహజముగ నగు ననేకవిపరిణామములనందు జీవద్భాషయగు తెనుఁ గున్న దున్నటుల గ్రంథములందుఁ జొచ్చిన కాలక్రమముననైన పరిణామాసంఖ్యతకుఁ బాలైనపదజాలమునం జేసి వాఙ్మయ మనర్థక మగునని కావలయు నాదినుండి లాక్షణికులు గొన్ని నియమములం జేసి కొన్ని జాతులకు మాత్రమే సాధుత్వమును శాసించుటయు, నట్లయ్యును వ్యవహార మర్థవంతమగుటనో, కాలక్రమమునఁ గ్రొత్తక్రొత్తగఁ దోఁచెడు భావాదులఁ బ్రకటింపసమర్థమగుపదజాలము పూర్వపూర్వ గ్రాంథికాంధ్రమున సంభవింపమినో విరళముగ వాఙ్మయమున వ్యావహారికములును గ్రాంథికాంధ్రానుకరణమున నైన విజాతీయపదములును గలుగుటయు, నట్టివి ప్రచురప్రయుక్తములై యవిజ్ఞాతకారికములైన పిదపఁగాని లాక్షణికుల యామోదము నందకుండుటయు నాంధ్రవ్యాకృతుల యుత్తరోత్తరాభివృద్ధి యేతన్మూలకమె యగుటయు నాంధ్రభాషా వ్యాకరణతత్వజ్ఞులకెల్ల తెల్లమెగానఁ బ్రాచీన లాక్షణికులకు వ్యవహారము బహుళముగ వాఙ్మయమున సామాన్యముగ సంభవింపకుండఁ బాటుపడుటయే సంప్రదాయమగుట స్పష్టమయ్యెడి. ఇట్లగుటఁ బ్రాచీన లాక్షణికపద్ధతినిబట్టి చిన్నయసూరి విరళములగు మహాకవిప్రయోగములను సంగ్రహింపకవిడుటయుఁ, గ్వాచిత్కప్రయోగసాధుత్వసంపాదనార్థమైన ప్రాచీనమతములను నిరాకరించుటయుఁ బ్రాచీనములు గాకున్నను బహుళప్రయుక్తము లగువానిని సంగ్రహించుటయు,

వ్యావహారికములనూట తలంపమియు నదుష్టములే యనఁదగు. లక్షణ కర్తల పదసాధుతాసాధుతలను సంబంధించిన వాదోపవాదముల గమనించినను, వ్యావహారికాంధ్రమునకు లాక్షణికులకును యుద్ధమేకాలమునను జరుగుచునే యుండెడిదనుట స్పష్టపడును. పైని వ్రాసిన విషయములను గమనించిన బాలవ్యాకృతిని గలకాలంతలనెత్తి చూపుచుఁ బ్రసిద్ధవ్యవహారము పద్యగ్రంథములందును బ్రయోక్తవ్యమె యను శ్రీ రావుసాహేబు G. V. రామమూర్తిపంతులుగారి మార్గమును, బ్రచురప్రసిద్ధములకే సాధుత్వము నంగీకరించు పండితలాక్షణికుఁడగు సూరిగారిపద్ధతియు సహజములై తమతమవిధులను దాము నిర్వహించుటలోఁ గృతకృత్యములే యనుట సత్యదూరప్రసంగము గాదు. వాఙ్మయమెల్లఁ బరిశోధించు శ్రమను బోనిచ్చి యద్దమునందువలె దాని నగపఱచుచుఁ దద్భాషాస్వరూపమును దేటతెల్లము గావించుటయె వ్యాకరణపరమప్రయోజనమగుట నుత్తరోత్తర మాంధ్రమునఁ గల్గిన వ్యాకృతులు తత్తత్పూర్వకాలిక గ్రాంథికాంధ్రస్వరూపమును వెల్లడించునవగుటయు వానిసక్రమపరిశోధనమున గ్రాంథికభాషాపరిణామక్రమము సుబోధమగుటయు స్పష్టమె.

ఇట్టిస్థితిలో గ్రంథకాలక్రమము ననుసరింపక మూలగ్రంథవిషయములనెల్ల ముద్దగాఁజేసి భాషాసక్రమపరిణామం బేని బోధపడనిగతిని నాగరకపండితుండగు చిన్నయసూరియు వ్యాకరణముల పరమప్రయోజనమును గుర్తింపక విషయనిరూపణ మొనర్చుట చింత్యమని తోఁపక పోదు.

కాలక్రమము ననుసరించి యేర్పడెడు గ్రాంథికభాషాపరిణతిని సక్రమముగఁ దెల్పుచు భాషాసక్రమపరిణామము నెఱింగించుట సోదరీభాషల ననుసరించి సవిమర్శక జన్యజనకాదుల విచారించుచు వ్యుత్పత్తిప్రదర్శనముఖమునఁ బ్రకృతిప్రత్యయాదిపరిణామమును సుబోధము సేయుట భాషాసంబంధాదిపర్యాలోచన మొనర్పక యిచ్చవచ్చినగతిని బ్రకృతిప్రత్యయాదివిభాగము చూపుచు వేదమువలె సాధుత్వమును శాసించుట యను వ్యాకరణరచనామార్గములగు మూఁటిలో బాలవ్యాకరణము మూఁడవత్రోవనే గతానుగతికముగ ననుసరించె ననుట

స్పష్టమె ఇట్టి సిద్ధాంతపద్ధతియె సంస్కృతవ్యాకరణకర్తలనుండి క్షుణ్ణమై యొప్పుటచేతను దద్వాసనాబలమున నాంధ్రమున వ్యాకృతులను వ్రాసినవారెల్లరును నట్టిమార్గమునే పట్టియున్నవారగుటచేతను సిద్ధాంతపద్ధతికంటె భిన్నములగు రెండుమార్గములు బహులానుమాన సంకలితములగుట సిద్ధాంతపద్ధతిని సంగ్రహసూత్రరూపమున విషయమును విశదీకరించునలవాటునకు లోనైనపండితుల కుపకరింపక రుచింపనివగుటచేతను నాఁటినుండి నేఁటివఱకుఁ బండితులు వ్రాసినవ్యాకృతులు సామాన్యముగ సిద్ధాంతపద్ధతినే యాశ్రయించి యున్నవనియు నాంధ్రపండితుఁడగు సూరియు నట్టిపద్ధతినే బాలవ్యాకృతిని రచించెననియుఁ దెల్లంబ. సిద్ధాంతపద్ధతిదప్పఁ దక్కిన రెండును నాంగ్లమునఁ బరిశ్రమచేసినవారికే వేద్యములనియు నాంగ్లమునందే యారెంటికి మార్గదర్శకములగు గ్రంథములు గలవుగాన నాంగ్ల మెఱుంగని పండితు లమ్మార్గములఁ దెలిసికొని వ్యాకృతుల రచించుట దుస్సాధమనియు ననవచ్చు. గతానుగతికముగ నేర్పడిన త్రోవంబట్టి యశ్రమముగ నేపనినేని నిర్వహించుటయె ప్రాచీనపండితలక్షణమైయుండుటఁ గ్రొత్తగఁ గృషిచేసి యట్టివానిని వ్రాయుట కిష్టపడుదురా! అట్లు పరిశ్రమించి పనియొనర్చుట కదియేమి యాముష్మికమా! నిర్మోహత నాత్మశక్తిని మఱచి గోల్పోయినవారి కట్టిపని సుసాధమని తోఁచునా? అయినను గొంతవఱకేని గ్రాంథికభాషాపరిణామక్రమము గోచరించి యుపకృతి భాషాపరిణామక్రమతత్వజిజ్ఞాసువుల కగునేమో యను నూహంజేసి మూలము నాయాసూత్రముల టీకలకడ వ్రాసి చూపుచు మూలమతముతోఁ బాటుగ వివరణముల మతములంగూడ సంగ్రహముగ గ్రంథవిస్తరభీతిని సూచించుచు వ్యాఖ్య వ్రాసి తెనుఁగుతల్లి యెడల నుడుతభక్తి నగపఱచికొన్నవాఁడను. ఇంక మిగిలిన భాషాసోదరీత్వపరీక్షాదిక మాంగ్లాంధ్రోభయభాషాతత్త్వజ్ఞులకుఁ జెందినదే యగుటఁ బరిత్యజించితిని. కాని ప్రత్యయాదిస్వరూపములను వివరించు పట్టులందుఁ గొంతవఱకు సాహసించి నాయూహలను దెల్పుకొన్నవాఁడను. అవ్విషయములు భాషాతత్త్వవిమర్శకసిద్ధాంతసరణి కొకవేళ విరుద్ధముగాఁ దోఁచినను సహృదయులు యూహాసాహస్యమునేని గమనించి నను మన్నింప వేఁడుకొనువాఁడను.

ఇట్లీవిధ మెట్లున్నను నింతటి శాస్త్రపద్ధతిపటుత్వ మెసఁగ బాలురకు ధారణయోగ్యంబగుగతిని వ్యాకృతిని రచించినవాఁ డగుటనే బాలవ్యాకర్త యానాఁ డట్టి గొప్పఁదనము నందుటయు, నేఁటికిని దద్వ్యాకరణాదర్శప్రతిబింబితయశఃకాయుండై శాశ్వతుఁడై నిల్చి శ్లాఘ్యుఁడగుటయును సంభవించెనన సందియము లేదు.

ఈటీకను వ్రాయుటలో నాకు మదాంధ్రగురువర్యుల యథర్వణకారికాబాలసరస్వతీయపీఠికలును చింతామణివిషయపరిశోధనమును, గుప్తార్థప్రకాశికయు నింక ననేకుల సారస్వతవ్యాసములును బ్రహ్మశ్రీ, కోరాడ రామకృష్ణయ్య, M. A., గారి భాషాతత్త్వవిమర్శనగ్రంథరాజములును దోడ్పడినవిగాన నాగ్రంథకర్తలకెల్ల వందనముల నర్పించువాఁడను.

బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచేఁ బ్రేరితుఁడనై నానేర్చినరీతి నీబాలవ్యాకృతిని వివరించుట జరిగెఁగాన నాంధ్రపండితమండలియం దత్యంతాభిమానులై వారలకు వన్నెవాసులం గూర్చుచు నాంధ్రభాషాభివర్ధనబద్ధకంకణులై మించు నవ్వారికి సర్వేశుఁ డవారిగ నాయురారోగ్యభాగ్యాదియుతోత్తరోత్తరాభివృద్ధిని బ్రసాదించుగాతమనియు నాంధ్రపండితవిమర్శకమండలి సహృదయులై యిందలి గుణలేశములనే గ్రహించి ననుఁ బ్రోత్సహింతురుగాత మనియుఁ బరమేశునిఁ బ్రాంజలినై ప్రార్థించువాఁడను.

ఇట్లు విన్నవించుకొను సుజనపండితవిధేయుఁడు,

విజయనగరము.
15-6-36

విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రి,
శ్రీవిజయనగర మహారాజసంస్కృతకళాశాలాంధ్రోపన్యాసకుఁడు.

# విషయసూచిక.

శ్రీరస్తు.

# బాలవ్యాకరణము

## బాలవ్యాకరణసారస్యసర్వస్వపేటికాటీకాయుతము.

## సంజ్ఞాపరిచ్ఛేదము.

క. శ్రీ వెంకటేశుఁ బావని, భావించి భజించి గురుల వావిళ్లకుల
శ్రీ వేంకటేశ్వరుని సం, భావన వివరింతు సూరిపద్ధతి నెలమిన్.

ఒండొరు లభిప్రాయములఁ దెలుపుకొన సాధనములై జనులచే భాషితములగు ధ్వనులసమూహము భాష. పరోక్షవర్తుల కాశయముం దెలుప నేర్పడిన ధ్వనిసంకేతములు లిపులు. లిపి యన వర్ణము. వర్ణములు లేఖనార్హములు. లేఖన మన వ్రాఁత. అరవము, కన్నడము, తెలుఁగు మొదలగుభాషలు వాగ్రూపములును లిఖితరూపములును నగు. కేవల వాగ్రూపముల నాగరికభాషలును మనదేశమునఁ గొన్ని గలవు.

ఆంధ్రదేశమందలివారు లేక యాంధ్రులనుతెగవారు వ్యవహరించుభాష యాంధ్రము. ప్రాచీనులు వికృతి యనిరి. తెలుఁగు తెనుఁగులు నామాంతరములు.

గ్రహణధారణపటువు బాలుఁడని పండితప్రవాదము. బాలశబ్దము జ్ఞానశూన్యునందును బదునాఱేండ్లవయసు దాఁటనివానియందును వర్తించునని నిఘంటువు లనెడి. ప్రకృతిప్రత్యయాదులయు నాగమాదేశాదులయు విభాగమును బ్రకాశనముసేయుచు సుప్తిఙ్కృత్తద్ధితాంతములయు సమాసములయు సాధుత్వమును సంపాదించునది వ్యాకరణము. 'అనుశాసనము, లక్షణము, శబ్దశాస్త్రము, శబ్దానుశాసనము' అనునవి నామాంతరములు. ఆంధ్రలక్షణముల నభ్యసింపఁ గోరువారి ప్రథమోపదేశముకొఱకు గ్రాంథికాంధ్రస్వరూప మెఱుంగనివారి ప్రథమోపదేశముకొఱకు విరచితమైన వ్యాకరణమగుట సూరి దీని బాలవ్యాకరణ మనియె. వ్యాకరణము శాస్త్రసంతతిలోఁ జేరునది. శాస్త్రము లాఱు. 'తర్కము, వ్యాకరణము, ధర్మశాస్త్రము, మీమాంస, వైద్యము, జ్యోతిషము.'

ఈబాలవ్యాకరణము నన్నయచింతామణికి వివరణము. కాన దానిని దదాధారము లగువివరణములను ననుసరించి భాషను శాసించెది.

## బాలవ్యాకరణసారస్యసర్వస్వపేటిక.

సంజ్ఞ యనఁ బేరు; సంగ్రహోక్తి; గుఱుతు. పరిచ్ఛేదమన గ్రంథవిభాగము. పేరులకు సంబంధించిన గ్రంథభాగముగాన సూరి దీని సంజ్ఞాపరిచ్ఛేదమనెను.

## సంస్కృతమునకు వర్ణము లేఁబది. ౧.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః.

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ. ఇం దకారాదు లచ్చులు - కకారాదులు హల్లులు. అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది.

టీ. 'ఆద్యాయాః పంచాశద్వర్ణాః' అనునది మూలము. సంస్కృతభాషాశబ్దసిద్ధి యేఁబదివర్ణములచే నగు. ఈయేఁబది దప్ప నితరములందుఁ గలుగవు. ఇవి సంస్కృత శబ్దములని గుర్తించుటకును, వ్యవహారవశమున సంస్కృతపదములఁ బడిన యాంధ్ర వర్ణముల గుర్తించి దిద్దికొనుటకును నిది యొకమార్గము. వ్యాకరణశిక్షితమై చక్కఁగా నైన దగుట సంస్కృతనామ మాభాషకుఁ గల్గెనంద్రు. సంస్కృతపదములకు సామాన్యముగఁ దెలుఁగునఁ బ్రవేశము కలిమింజేసియు, విశేషించి సంస్కృతము తెలుఁగునకుఁ బోషకమగుటంజేసియు, సూరి మొట్టమొదట సంస్కృతవర్ణసమామ్నాయమునె నిరూపించెను.

ఇందకారాదు లచ్చులు పదునాఱు. కాదులు హల్లులు ముప్పదినాలుగు. 'అచ్చు, హల్లు' అనుసంజ్ఞలు పాణినివ్యాకరణాదినున్న సంస్కృతవర్ణసమామ్నాయనిరూపకము లైన మాహేశ్వరసూత్రముల ప్రత్యాహారనియమముల ననుసరించి యైనవిగాని యిందలి వర్ణసమామ్నాయమునుబట్టి కలిగినవి కావు. కావుననే సూరి యచ్చులను హల్లులను వేఱుపఱచి చూపుచు నచ్చులయు హల్లులయు విభాగ మీలాగుననే మీఁద నెఱుంగున దని వివరణము వ్రాసికొనె. వలసినపుడెల్ల వానిం బేర్కొనుట గ్రంథవిస్తృతికిని జేటౌనుకును, గారణమగుంగాన, నొక్కొక్కసమూహముం దెలుప నొక్కొక్కసంజ్ఞను శాస్త్రకర్తలు చేసికొందురు. ఒక్కసున్న కనుస్వారమనియు, రెండుసున్నలకు విసర్గమనియుఁ బేర్లు. ఇవి మాహేశ్వరసూత్రస్థములు గావు. వీనిని యోగవాహములని తరువాతివా రంగీకరించిరి. అకారమాదిగా విసర్గాంతము గలవర్ణము లచ్చులు. కకారమాదిగా ళకా

రాంతము గలవర్ణములు హల్లులు. అనుస్వారవిసర్గము లచ్చుచేర్పునంగాని యుచ్చారణము నందనివగుటచే 'అం, అః' అని నిర్దేశించె. కకారాదులం దకారములు సుఖోచ్చారణమున కైనవిగాన వానికి హల్ సంజ్ఞ కలుగదు. అచ్చుకూర్మినిగాని హల్లునకు స్పష్టోచ్చారణములేమి స్పష్టమయ్యె. దీన నచ్చునకగు ప్రాణసంజ్ఞయు, హల్లునకగు ప్రాణిసంజ్ఞయు సార్థకములు. కాన హల్ సంజ్ఞ 'క్, గ్, ప్' అను మున్నగు వ్యంజనములకే యగు. హల్లుల వ్యంజనము లందురు. సంస్కృతవ్యాకర్తలు ప్రక్రియాప్రయోజనము నపేక్షించి యనుస్వారవిసర్గముల నచ్చులందును హల్లులందును జేర్చిరి. ఇందట్టి ప్రయోజనము లేమిని, సహజోచ్చారణము ననుసరించి వాని నచ్చులలోనె చేర్చెను. కకారమునకుఁ బూర్వమున నున్నవిసర్గమును జిహ్వామూలీయ మనియు, పకారమునకుఁ బూర్వమునన్నవిసర్గమును నుపధ్మానీయ మనియు నందురు. ఉచ్చారణము నూఁతగఁగొని యైన యీసంజ్ఞలును, నవ్వాని కట్టియుచ్చారణము నేఁడు తోఁచకుంటంజేసి తద్భేదమును బరిత్యక్తములు. ఇట్లే 'ఇక్ యణ్' అనుమున్నగు పాణినీయప్రసిద్ధము లనాదృతములు. ౡకారము సంస్కృతవ్యాకరణజ్ఞులచే ఌవర్ణదీర్ఘముజేసి సాధితమును, మంత్రశాస్త్రసిద్ధమునునగుట నాదృతము. 'ఆది క్షాంతాస్మృతా వర్ణాః' అను నభియుక్తోక్తి ప్రసిద్ధము. కాని సంస్కృతవ్యాకర్తలు షాంతపదమధ్యమున క్షకారాంతములఁ బఠించిరి. నిఘంటుకర్తలును నాత్రోవనె యనుసరించిరి. కాన నది కషవర్ణముల కలయికచే నైనదని తెలిసెను. దాన నది వర్ణాంతరము గాదయ్యె. దానిని స్వతంత్రవర్ణమన్న క్త, స్త, మున్నగు సంయుక్తములం గూడ స్వతంత్రవర్ణము లనవలసి వచ్చునుగదా యని వ్యాకర్తల యాశయము. ళకారము మాహేశ్వరసూత్రసిద్ధముః గాకున్నను ననాదిగ దీనియుచ్చారణము దేవభాషం దోఁచుచుండుటంజేసి వర్ణాంతరముగ నాదృతమయ్యె. 'అగ్ని్ౕమణ, అధుక్షత్' అను మున్నగువానిసిద్ధికొఱకు మాహేశ్వరసూత్రములందు హకారము ద్విరావృత్తమయ్యెఁ గాని యిందుఁ బ్రసక్తము గామినట్లు గాదయ్యె.

సాధారణముగ నిందలిసంజ్ఞలు పాణినీయస్థములె. పరుషము సరళముమొదలగు పాణినీయస్థములు గానివి లేకపోలేదు. ''పండితసంప్రదాయప్రసిద్ధములును ననాదులును నగుసంజ్ఞ లపరిత్యాజ్యములు. ఆంధ్రభాషాజ్ఞాన మార్జింపఁగోరువారు సంస్కృతభాషాజ్ఞానమును బడసినవారై యుండవలెనుగాన నట్టివారి కాప్రాచీనసంజ్ఞలే సుబోధములగు. కృతకములు పాఠకక్లేశదాయకములు'' అను మున్నగునాశయములతో సూరి విరివిగ, సంస్కృతవ్యాకర్తృసమ్మతములగు సంజ్ఞలనే యిం దుపయోగించెను. సంస్కృతవర్ణసమామ్నాయము ప్రసిద్ధమగుట మూల మక్షరసంఖ్యనే తెలిపెను. అయినను నిది వివరణమగుట సుబోధనమునకై వర్ణముల నెల్ల నిరూపించెను.

## ప్రాకృతమునకు వర్ణములు నలువది ౨.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః. క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ. కొందఱమతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు. కొందఱమతంబున వక్రతమంబులుం గలవు. ఎ ఏ ఒ ఓ లు వక్రములని, ఐ ఔ లు వక్రతమములని ప్రాచీనులు వ్యవహరింతురు.

టీ. 'ప్రకృతేస్తు తే దశోనాస్యః' అనునది మూలము. ప్రాకృతభాషాశబ్దసిద్ధి నలువదివర్ణములచే నగు. ఇవి దప్ప నితరములం దగపడవు. ప్రాకృతశబ్దము లివియని గుర్తింప నిదియొకమార్గము. ప్రకృతియన సంస్కృతమనియు, దానినుండి కలిగినదగుటఁ బ్రాకృతసంజ్ఞ దీనికి సిద్ధించెననియు నందురు. ప్రాకృతమే ప్రాచీనమనియు, దానిని సంస్కరించుటచే సంస్కృతము సిద్ధించెననియు, దాన సంస్కృతప్రాకృతసంజ్ఞలు సార్థకములగుననియుఁ గొందఱందురు. సంస్కృతనాటకములందు స్త్రీలయు నీచపాత్రలయు వ్యవహారమునఁ బ్రాకృతము చూపట్టును. 'ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికాపైశాచి, అపభ్రంశము' అని ప్రాకృతము షడ్విధమగు. ఇందుఁ గొన్ని దేశభేదముచే నైనవియుఁ గొన్ని సంస్కృతభాషాదృష్టిని దోఁచెడు వికృతితారతమ్యముచే సిద్ధించినవియు నని తోఁచెడి. సంస్కృతవర్ణసమామ్నాయగతములలో 'ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఔ, ఙ, ఞ, శ, ష,' అను పదివర్ణము లిందు లేవు. ప్రాకృతవ్యాకర్తలకొందఱ మతమున హ్రస్వవక్రములును (ఎ, ఒ) గలవు. ఈమతమున నిందు నలువదిరెండువర్ణములగును. కొందఱమతమున వక్రతమములును (ఐ ఔ) గలవు. ఈమతమున నిందు నలువదినాలుగుకలుగును. 'ఏఙఝో వక్రాః, వక్రతమ ఐచ్' అని చింతామణికర్త యనుటచే మూలస్థప్రాచీనశబ్దవాచ్యుఁడతఁడే యగు. బహుత్వము పూజ్యతాద్యోతకము. వ్రాఁతలో ఏఓలు వక్రతను, ఐఔలు మిక్కిలి వక్రతను గలిగియుండుటంబట్టి వక్రవక్రతమసంజ్ఞలు సార్థకములు. 'ఏ ఓ' అను దీర్ఘవక్రముల హ్రస్వరూపము లగుట. 'ఎఒ' అనువానిని హ్రస్వవక్రము లనుటయు నన్వర్థమె. ప్రాకృతము సంస్కృతమునుండి కలిగినదనుతలంపుతోడను, సంస్కృతమునకుఁ దరువాతఁ దెలుఁగును బోషించునది ప్రాకృతమనునూహతోడను బ్రాకృతవర్ణసమామ్నాయమును సంస్కృతవర్ణసమామ్నాయమునకుఁ బిదపఁ జేర్కొనెను. ప్రసిద్ధమగుట మూలము వర్ణసంఖ్యనే తెలిపెను. వివరణమగుట సుబోధమునకై వర్ణములనెల్ల నిరూపించెను. ఇందుఁ గొందఱ యనుటంజేసి కొందఱి యనుట యసాధువని భ్రమింపనగు. కొందఱి కూడఁ బ్రాచీనప్రయోగదృష్టమగుట నుభయమును గ్రాహ్యములె యగు. (చూ. బా. క. శ. 123)

## తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు. 3.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అఁ. క గ చ ౘ జ ౙ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.

టీ. "షట్త్రింశదత్ర తే. ద్వివిధావిదుదేదోతోఽచో వక్రతమావనుస్వారౌ కగ చజయుగటడణతదనపబమయరలవసహాళంతు హల్వర్గః" అనునవి మూలములు. మూఁడు + పది = ముప్పది. తెనుఁగుశబ్దముల సిద్ధి ముప్పదియాఱువర్ణములచే నగు. ఇవి తప్ప నితరములు తెలుఁగుశబ్దములందుఁ దోఁపవు. ఇవి తెలుఁగుపదములని గుర్తింప నిదియొక మార్గము.

ప్రాకృతమున వర్గద్వితీయచతుర్థము లున్నను దెనుఁగునఁ గల్గిన ప్రాకృతసమభవములనవి చూపట్టవు, సంస్కృతభవములందును గన్పట్టవు. కాన సంస్కృతసమేతరంబైన యీభాష యచ్చ యనియుఁ, బ్రాకృతసమభవ సంస్కృతభవ దేశ్యరూపమగు తెలుఁగున కిది వర్ణసమామ్నాయమనియు సూరిమూలము నాశయమైనట్లూహించుట యుస్వరసముగాదు. అచ్చతెలుఁగుకబ్బములకర్తలును బైనాల్గింటినె యచ్చగా నాదరించిరి. కాన సూత్రమునందలి తెలుఁగున కనుదానికిఁ బ్రాకృతసమ-ప్రాకృతభవ-సంస్కృతభవ-దేశ్యరూపమగు తెనుఁగే యర్థమని యెన్నవలెను.

ఏఁబదిసంస్కృతవర్ణములలో ఋ ౠ ఌ ౡ ః ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లను పందొమ్మిదివర్ణము లిందు లేవు. సంస్కృతవర్ణముల సిద్ధింపని యర్ధానుస్వారము (ఁ) దంత్యచజలు (ౘ ౙ) హ్రస్వవక్రములు (ఎ ఒ) అను నేను వర్ణము లిందుఁ గ్రొత్తగఁ దోఁచెడి. నలువదిప్రాకృతవర్ణములలో విసర్గము (ః) వర్గద్వితీయచతుర్థము లిందుఁ గన్పట్టవు. ప్రాకృతవర్ణములఁ గలుగని హ్రస్వవక్రములు (ఎ ఒ) వక్రతమములు (ఐ ఔ) అర్ధానుస్వారము (ఁ) దంత్యచజలు (ౘ ౙ) నను నేడు వర్ణము లిందుఁ జూపట్టును.

భిన్నధ్వనులకు సంకేతము లగుటంజేసి వర్ణాంతరములును నాయాయచ్చుల సంబంధముచేతనె యీరెంటి కట్టి భిన్నధ్వని కలుగుటను మూలవర్ణములు రెండే యని సంభావింపఁదగుటంజేసి సదృశలేఖనము గలవియు, చజలయ్యేనని చజయుగమును నిర్దేశించుమూలము నభిప్రాయమైనట్లు సూరి గ్రహించి చజయుగము నిందును నాదరించెను. "దంత్యచజౌ గురు రతౌ చ బిందుయుతౌ" అని మూల మాద్యప్రకృతిప్రకృతుల వృష్టిని నూత్నముగ నైన దంత్యచజలకుఁ దనకాలమునఁ బండితసంప్రదాయసిద్ధమైన బిందులేఖనమును గుర్తుగాఁ జూపుట యివి దంత్యచజలని గుర్తింప నేదేనొకగుర్తును వానిపై నిడవలె ననునంశమును సూచించునదిగా నెన్ని సూరి తనకాలమున వానికి

గుర్తుగాఁ బ్రసిద్ధమైన తెలుఁగు రెండంకెను ౨ దా గుర్తుగాఁ జేసెనని యెన్నవలెను. దంత్యచజలపై సూరి యిడిన '౨' అనుగుర్తు తొల్లి వానిపై గుర్తుగా నుండిన బిందువు తాళపత్రలేఖనమునసైన గంటపుదూఁకుచే నిట్లు మాఱెనో లేక చజయుగమున దంత్యములు రెండవవర్ణము లగుటఁ దెనుఁగు రెండంకె చే ౨ వానిని దెలుఁగువారు గుర్తించుటచే నేర్పడెనో తకారము దంత్యమగుట నిది దంత్యమనుటకు ౨ తాముడి నిడగనా తాలవ్యమునకు గుర్తుగా నిడిన తాముడి క్రమముగ దంత్యచిహ్నమయ్యెనో తెలియకున్నది. 'రస్తవత్ర గృహ్యతే ద్వివిధః, గురు రలా చ బిందుయుతే' అనిమూలము. రేఫకు ద్వైవిధ్యము నంగీకరించి యందు గురురేఫమును బిందువుచే గుర్తించియు, వర్ణసమామ్నాయమున యరలవసహాళ్ళని దానిని స్వతంత్రవర్ణముగఁ జేర్కొనకుండుటం బట్టి భిన్నస్థానప్రయత్నములు గలవానికే కాని సదృశస్థానప్రయత్నములు గలవానికా ప్రయత్నమందె మృదుకఠినత్వములు గలిగినంతమాత్రమున వర్ణాంతరత్వము సంభవింపఁ దనుతలంపుననో, ప్రత్యేకలేఖనములేమినో యున్నను నది పండితసంప్రదాయమున బిందుచిహ్నితమును, లేఖకసంప్రదాయమున వేఱొకరూపముగను నుండి సర్వసాధారణమగు వ్యవస్థ దానికగపడమినో గురురేఫమునకు వర్ణాంతరత్వ మంగీకరింపనట్లు, సంభావించి సూరియు దానిని స్వతంత్రవర్ణముగ గణింపఁడయ్యెను.

'లఘవోఽలఘవశ్చేతి ద్వేధాంతస్థాన్ వదంతి శాస్త్రారః' అని మూలము లకారమునకు లఘ్వలఘుభేదము నంగీకరించియు, గురురేఫమువలె విడువక 'యరలవసహాళ్ళ'ని ళకారమును స్వతంత్రవర్ణముగఁ జేర్కొనుటంబట్టి, లఘ్వలఘుత్వములు లేనికాదులవంటి స్వతంత్రవర్ణము ళకారమొకటి గలదనునాశయము గలిగియున్నట్లనుమానించి సూరి ళకారమును వర్ణాంతరముగ నెంచి తళుకు, బెళుకు, త్రెళ్లు, తళతళ, మున్నగు లకారోచ్చారణమును జేయఁదగని తెనుఁగుపదములందలి ళకారమును స్వతంత్ర మనిపించి చింతామణి నన్నయప్రణీత మనుతలంపు గలిగి ప్రాచీనాంధ్రభాషాదృష్టిని వివరణమువ్రాయుఁ బాలసరస్వత్యాదుల ననుసరించె.

అప్పకవీయచింతామణి యట్లుగాక తనకాలమునకుఁ బ్రత్యేకలేఖనమును స్వతంత్రవర్ణతను గలిగియున్న గురురేఫమును నన్నయచింతామణి సూత్రములకు ముడివెట్టునదై 'సప్తత్రింశదిహాన్యే, రయుంగలయుంగవసహాశ్చహాలః' అని మాఱి ళకారముతోఁబాటుగ గురురేఫమును వర్ణాంతరముగ వర్ణించునదయ్యెను. అప్పకవీయబాలసరస్వతీయచింతామణులలో బాలసరస్వతీయచింతామణినె తఱచుగఁ బ్రమాణీకరించు నహోబలపండితీయమును జింతామణి నన్నయప్రణీతమని తానన్నమాట మఱచియె యీసందర్భ మంతగ సయుక్తికముగఁ దోఁపమినో తాత్కాలికప్రవృద్ధ గురురేఫ

భ్రమకు లోనయియు యప్పకవీయచింతామణి నీసందర్భమునఁ గాదనలేక తాను దఱిచుగఁ బ్రమాణీకరించు బాలసరస్వతీయచింతామణిని గాదని విడువలేక "గురురేఫస్య వర్ణమధ్యే పరిగణనదశాయాం 'సప్తత్రింశదిహోన్యే' 'ఇత్యప్పకవిపుస్తకపాఠోఽపి సాధురేవ' అని రెండుచింతామణులకు సామంజస్యమును గల్పించి కృతార్థ మయ్యె. బాలవ్యాకరణమునకు శేషగ్రంథ మనఁదగు త్రిలింగలక్షణశేషమును ప్రౌఢవ్యాకరణమును, 'యవలలవలె రేఫంబును బ్రయత్నభేదముచే ద్వివిధముగాన శబ్దశాసనాదులచేత నలఘురేఫము వర్ణాంతరముగ గ్రహింపఁబడదయ్యె' అని గురురేఫమును లఘురేఫభేదముగ నెన్నుటయు స్వతంత్రవర్ణము గాదనుటయుఁ శబ్దశాసనాశయములుగా నభివర్ణించి యీవిషయమునఁ బ్రాచీనమార్గానుసారులగు సూరి మొదలగువారినే యనుసరించెను.

ఇట్లిన్ని వివరణము లిన్నిరీతుల శోధించి శోధించి నన్నయ ప్రాచీనచింతామణికి గురురేఫమును వర్ణాంతరముగ నెన్నుట యిష్టము గాదని ఘోషించుచున్నను బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక మాత్ర మిప్పట్టున హరికారికల మాని 'రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః' అను నన్నయచింతామణి సూత్రమునె ప్రమాణీకరించియు, నప్పకవీయ చింతామణివలె గురురేఫమును వర్ణాంతరముగఁ జేసి యయుక్తికముగ నన్నయచింతామణి కద్దాని ముడివెట్టఁ బాటుపడుచున్నది. భాషాంతరీకరణములగు జీవద్భాషాలక్షణములు వివరణములును దామ మూలముగాఁ గొన్న వానికాలమును దాత్కాలికభాషాస్థితిని గమనింపక నాఁటినుండి తమకాలమువఱకుఁ గలభాషనెల్లను సంస్కృతవ్యాకరణవ్యాఖ్యాసంప్రదాయ వాసనావాసితములై వానికి లక్ష్యముగాఁ జేయఁదలంచి వర్తించినవగుటఁ దత్తత్కాలికభాషాస్వరూపము తేటపఱుపకుండుటేగాక తాము మూలములును బూర్వాపరసందర్భవిరుద్ధములగు సమన్వయములకుఁ బాలై వాదోపవాదములను బెంచునవై తుద కుద్దేశశూన్యములును నగుచున్నవి. పైని వ్రాసిన చర్చలెల్ల నేతన్మూలకములే యనుట పాఠకలోకమునకుఁ దెల్లమె.

బిందువున కచ్చుచేర్పునంగాని యుచ్చారణములేమి సహజము. తెనుఁగున బిందువనునాసికవర్ణజాత మైనను నది మఱల నెపుడును ననునాసిక మగుట గన్పట్టదు. వ్యాకరణప్రక్రియలో దీనిని హల్లుగా నెన్నవలసినప్రసక్తి యగపడదు. కాన నది యచ్చులలోనె చేర్పఁబడియె. ఛందఃకర్తలు మాత్రము దీనిం దఱచుగ హల్లుగనే యెంచిరి. బిందుమాత్ర మచ్చే యగునపుడు రాముఁడు రాముండను మున్నగుచోటుల ఉత్వసంధి రాదాయని శంకింపఁ జనదు.

అర్ధానుస్వార మనునాసికోచ్చారణమునకు గుఱుతు. దానియుచ్చారణము నేఁడు తొలఁగినది, నిండుసున్న యనునాసికోచ్చారణముగలదిగాన నది హల్తుల్యమె. సామ్యా

న్యముగ నచ్సంధి భిన్నపదముల యంత్యాద్యచ్చులకు సంభవించెడిఁగాని యభిన్నపదములకుఁ (ఏకపదమధ్యమున) గలుగునది కాదు. కానఁ బైస్థలములం దచ్సంధికిఁ బ్రసక్తియే లేదు. భాషాచరిత్రదృష్టిని బరిశీలించునపుడు తొల్లి యర్ధానుస్వారము లేనే లేదనియు, నెల్లచోటుల నిండుసున్నయే యొప్పెడిదనియుఁ, గాలక్రమమున నైన తేల్చిపలుకఁబడిలో నాయాచోటులందలి యనునాసికోచ్చారణము లుప్తమయ్యెననియుఁ, బిదప ననునాసికోచ్చారణ మట్టిచోటుల నుండెడిదనుటకు గుర్తుగా నర్ధబిందు వేర్పడె ననియుఁ జెప్పక తప్పదు. శాసనములందును దాళపత్రమాతృకలందును నర్ధబిందువుండఁ దగినచోటులందు నిండుసున్న నుంచుటయుఁ బూర్ణబిందువుండఁదగినతావులఁ బూర్ణము నేని యనునాసికము నేని నిల్పి పరహల్లునకు ద్విత్వముఁ గూర్చుటయుఁ జూపట్టెడి. ఇట్టి వ్రాఁతలను, సబిందుకములతోడి ప్రాసాదిసంబంధమును, బరీక్షించి పూర్ణార్ధబిందుపద నిర్ణయమును బండితప్రకాండు లొనర్చిరన నొప్పెడి.

ఆంధ్రము, వికృతి యనునవి యీభాషకు సంస్కృతనామములు. అంధకార బంధురమగు ప్రదేశమునందలివారిభాష యగుట దీని కీపేరు కలిగెనందురు. వర్ణలోప వర్ణాగమవర్ణవ్యత్యయాది పరిణామములనంది, సంస్కృతప్రాకృతములనుండి చేరిన పదజాల మిందు విరివిగఁ గన్పట్టుటంజేసియో, సంస్కృతసంగ్రహోక్తి యని తలంచియో, చింతామణి వికృతిపదమునే యాదరించె. ఆథర్వణ మాంధ్రమనిగూడ వాడెను. దేశీయములగు తెలుఁగు తెనుఁగునుడులను సంస్కృతకారికలందు వాడుటకంటె వికృత్యాంధ్ర వ్యవహారమే సరసమని చింతామణ్యాథర్వణములు తలంచి యుండనోపు. లేకున్న నన్నయభారతమున నగపడు తెలుఁగు తెనుఁగుపదముల కందుఁ బ్రవేశము లేమికిఁ గతమేమి? కేతనపెద్దనాదులు తెలుఁగునఁ దెనుఁగునకు లక్షణము చెప్పినవారలు తెనుఁగు తెలుఁగులను వాడియున్నారు. తెనుఁగునఁ దెనుఁగునకు లక్షణము చెప్పినసూరియుఁ గేతనాదులమార్గము పట్టి తెలుఁగు తెనుఁగుల వాడినాఁడు. ప్రౌఢవ్యాకృతిమాత్రము వికృతిత్వమునే యనఁగా సంస్కృతప్రాకృతపదములు తెనుఁగునఁ బ్రవేశించుటనే పరిగణించి యాంధ్రమని వ్యవహరించి వర్ణముల వర్ణించె. దీన శుద్ధజాతీయపదజాలము తెనుఁగనియు, సంస్కృతప్రాకృతసంకలితపదజాల మాంధ్రమనియుఁ గొండఱ యభిప్రాయము గావచ్చు. కాని సంస్కృతాదిమిశ్రమగు తనభాషనే తెనుఁగని నన్నయ భారతమున వ్యవహరించుటను, నట్లభిప్రాయపడుట కవకాశము లేదని తోఁచెడి. ఎవరెట్లు వ్యవహరించినను తెనుఁగుతెలుఁగులకు వ్యుత్పత్తిమాత్ర మేవారును దెల్పినవారు కారు. దేశీయోక్తులకు వ్యుత్పత్తి యేమనువిచారమేలని యూరకొనిరేమో! విమర్శకులు జాతీయమగు తెలుఁగుపదమును సంస్కృతీకరించుటంజేసి త్రిలింగపద మేర్పడిన

ట్లనుచున్నారు. ఇది బ్రాచీనసంస్కృతకావ్యములఁ గానరాక పదునాలవశతాబ్ద్యాది నుండి యగపడుటయే యట్లనుటకుఁ గతము గానోపును. త్రిలింగ త్రినగభవములు తెలుఁగు తెనుఁగులని కొందఱిమతము. ప్రకృతియందు లేనిబిందువు వికృతియందుఁ దోఁచుట గుదురమిని బిందువును గుదురుపఱుపఁ ద్రిలింగవికృతియగు తెలుఁగే లకారము నకారముగ మాఱుటంజేసి తెనుఁగయ్యెఁ గానఁ దెలుఁగుతెనుఁగులకుఁ ద్రిలింగశబ్దమే మూలమని కొందఱండ్రు. తొలకు-తొనఁకు, తొల-తొన అని లనలపరిణామము గన్పట్టు. 'వైశాఖ=వేసఁగి, పీఠ=పీఁట, పూగ=పోఁక' అనువికృతులందుఁ బ్రకృతులందు లేనిబిందువు చూపట్టెడి. కాన నుభయమును గ్రాహ్యామె యని కొందఱు తలంతురు. త్రిలింగపద మాదిభాషాకావ్యములందు దేశవాచకముగఁ జూపట్టెడిఁ గాని త్రినగపదము గానము. కానఁ బ్రాచీనత్రిలింగమునుండియే తెలుఁగు తెనుఁగులు కలిగెననుట సయుక్తిక మని కొందఱిమతము. అహోబలపత్యాదులు త్రిలింగపదమునే తెనుఁగు తెలుఁగులకు మూలముగ నూహించిరి. "త్రిలింగదేశవ్యవహారసిద్ధమగుభాష దేశ్య"మను సూత్రము ననుసరించి సూరి దేశమూలముననె భాష తెలుఁగు నాఁబరగెననియుఁ, దెలుఁగు తెనుఁగులకుఁ ద్రిలింగశబ్దమునే మూలముగ నెంచెననియు ననుమానింపఁ దగును. తెనుఁగని నకారమధ్యముగ నున్నయేతత్సూత్రాదిపదము నీవ్యాకృతి ననుసరించి వేఱొకగతిని సాధింపనవకాశము లేదుగదా! నవీనులు కొందఱు త్రికళింగమును దెలుఁగు తెనుఁగులకు మూల మనుచున్నారు. ఏది యెట్లున్నను దెలుఁగున లకారము నకారముగా మాఱుట పెక్కుచోటులం దగపడుచుండుటచేతను, త్రిలింగశబ్దభవ మను నపుడే యర్థానుస్వారము పొసఁగఁదగి యుండుటచేతను, బ్రకృతులందు లేనిబిందువు వికృతులఁ దోఁచుట క్వాచిత్క మనఁదగుటచేతను, సామాన్యముగ లాక్షణికులెల్లను ద్రిలింగవికృతులుగనే సంభావించియుండుటచేతను, లక్షణకర్తలమతమునఁ ద్రిలింగ వికృతులే తెలుఁగు తెనుఁగులని సంభావింపనయ్యెడి. తేల్ నదీప్రాంతవాసులభాసగానఁ దెలుఁగయ్యెననియుఁ, దెలినేలయందలిభాష యగుటఁ దెలుఁగయ్యెననియుఁ, దిలలు గోవులుగలదేశముగానఁ దిలగుపదమునుండి తెలుఁగయ్యెననియుం, ల-నకారములకు వ్యత్యాసము సహజమగుటంజేసియుం, లకారమే నకారముగ మాఱెననుటకును నకారము లకారముగా లేదనుటకును నాధారములు లేమింజేసియు నజంతమై వర్తకక్కురములులేనిద్రావిడ వీనులకు విందొనర్చు పలుకుబడి గలదికాన తేనె యనఁగా మధురము మనోజ్ఞము నగుట (తేనె + అగు)నగుచేర్చుటంజేసి యైనదానినుండి తెనుఁగు తెలుఁగులు పరిణమించెననియుఁ, దెలుగన్నదవికృతి యగుటఁ దెలుఁగనియు నెల్లదేశములనడుమనున్న దేశము వారిభాస యగుటఁ (తెన్నులో నున్నదగుట) దెనుఁ గయ్యెననియు (తెన్ను + అగు= తెనుఁగు)

విమర్శకులు పలురకముల వ్యుత్పత్తులను జూపినవారు. తెలుఁగు తెనుఁగులు దేశ్యములని భాషాతత్త్వవిమర్శకులమతము. వికృతులని లాక్షణికమతము. 'పరిఘవిల్లు, ఖంగులు, పైఠిణీ' మున్నగుకవిప్రయుక్తములంజేసి వర్గద్వితీయచతుర్థములఁ జేర్పవలె నండ్రు. చింతామణి యాంధ్రభాషాభాగములలో నన్యదేశ్య మప్పటికిఁ గలుగమి నొకభాగముగఁ దెలుప లేదు. దాన దేశ్యలక్షణావసరమునను నన్యదేశ్యముమాట నెత్తలేదు. ఏపరిచ్ఛేదమున నేని యన్యదేశ్యమును దలపెట్టలేదు. సాధారణముగ నీయన్యదేశ్యములు తెలుఁగున మహమ్మదీయాదిపరిపాలనాది సంబంధమునఁ గలిగిన ట్లూహింపనయ్యెడి. నన్నయాది ప్రాచీన కావ్యముల వీనియునికి గనరాదు. తరువాతికావ్యములందును నిట్టి వత్యల్పముగఁ దోఁచెడి. కాన సూరి వీనివిషయమున నుపేక్ష సూపెననుట యుచితమగు. అరవకన్నడాదిపదము లనేకములును, బ్రాకృతసమభవము లసంఖ్యములును నచ్చతెలుఁగుపదముల క్రిందనే గణింపఁబడియెడి. ఒకతల్లికి నైన సోదరీభాష లగుటంజేసియు, నేకదేశోద్భవము లగుటంజేసియు నవి యట్లు లెక్కింపఁబడుట సమంజసంబ. అయిన సంస్కృతసమమునుమాత్ర మేల యట్లనరాదండ్రేమో? వర్ణాదివికృతిచేఁ బ్రకృతికంటె దవ్వగుట యవిజ్ఞాతప్రకృతియై ప్రాకృతసమభవము లచ్చతెలుఁగునుడు లయ్యెననియు, నట్టివికృతి సంస్కృతసమములందుఁ దోఁపమి నవి యట్లు గావయ్యెననియు ననవలయును. మఱియుఁ గావ్యరచనకుఁ జాలినన్ని శుద్ధదేశ్యములు లేమి నచ్చతెలుఁగుకావ్యకర్తలు ప్రాకృతసమభవముల నుపయోగించుటంజేసి వీని నచ్చతెలుఁగుపదములని యనక తప్పినదిగాదు. మఖ్జాను, తాటాకు, కాఫీ, ఫర్లాంగు మున్నగువాని ఆ-ఫలకు వేఱుగుర్తులుండవలెనని విజ్ఞు లనుచున్నారు. జీవద్భాషాపదములందలి వర్ణముల కుచ్చారణభేదమును, నితరదేశీయభాషాపదసంబంధము కలిమిఁ గ్రొత్తవర్ణములకలిమియుఁ గలిగెడిఁ గాన నుత్తరోత్తరలక్షణములు వానికిఁ గావ్యప్రయోగార్హత విరివిగఁ గన్పట్టినచో సాధించెడినని సూరి చింతామణ్యనుసారియై వానిఁ దలపెట్టలేదనుట సమంజసము. ఇది చింతామణివివరణ మనునంశము మఱువకున్నఁ గొన్నిశంక లీగ్రంథమున సామాన్యముగఁ గలుగవు.

**ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృతసమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపఁబడు. ౮.**

ఋతువు-పితౄణము-క్లృప్తము-ౡకారము - దుఃఖము-ఖడ్గము-ఘటము - ఛత్రము-ఝురము-కంఠము - ఢక్క-రథము-ధరణి-ఫణము-భయము-పఙ్క్తి-ఆజ్ఞ-శరము-షండము.

టీ. 'అన్యే చాను ప్రవిశంతి శబ్దయోగవశాత్' అనునది మూలము. సంస్కృత సమములనఁగా నాంధ్రప్రత్యయనిమిత్తకవికృతినందిన సంస్కృతపదములు. ఈపందొమ్మిదివర్ణములును ప్రధానముగ సంస్కృతశబ్దగతము లగుటంజేసి సంస్కృతశబ్దముల మూలముననఁ గల్గునని వ్రాసెను. ఇట్లనుటంజేసి పైవర్ణములుగల తెలుఁగునుడులు లేవని తెలియనయ్యె. ఇవి సంస్కృతసమము లివి తెలుఁగుపదములని పోల్చికొనుట కిది యొక మార్గము. పరిఢవము, కఠిల్, పెఠిల్ మొదలగు దేశ్యములందును, కంఖాణము, ఖంగులు, పైఠిణీ మొదలగునన్యదేశ్యములందును బైవర్ణములలోఁ గొన్ని చూపట్టెడింగాని యట్టి దేశ్యములు ప్రాచీనకావ్యములం దగపడకుండుటంజేసియుఁ, దరువాతికబ్బముల విరళములును నగుటంజేసియు, నన్యదేశ్యవిషయమునఁ జింతామణి యాభిముఖ్యమును జూపమింజేసియు, సంస్కృతసమములమూలముననె యీవర్ణములు ప్రధానముగఁ గలుగునని సూరి యనెను.

ఇందలి యుదాహృతులలో పఙ్క్తి యని ఙకార-క కార-తకారసంయుక్తముగను, 'కంఠము, షండము' అని సబిందుకముగను సూరి నిర్దేశించుటం బరికింపఁ, బరసవర్ణమును నిత్యముగ వ్రాయవలసిన సంస్కృతపదమధ్యమందుఁ బరసవర్ణబిందులేఖనములు రెండును నదుష్టములని తెల్లమయ్యెడి. సంస్కృతపదమధ్యములందలి యనునాసికములలో నేవి తమకుఁ బూర్వమునఁగాని పరమునఁగాని వేఱొకపొల్లు హల్లును గలిగి యుండునో యాయనునాసికము ల ననునాసికములుగనే వ్రాయవలయును గాని వాని స్థానమున బిందువు వ్రాయరాదని సూచించెనన్న పఙ్క్తి, శార్ఙ్గము మున్నగునవి సబిందుకములుగ వ్రాయుట దుష్టమయ్యెడి. తెనుఁగున శార్ఙ్గమును మాత్రము సబిందుకముగ వ్రాయుట గానము. పఙ్క్త్యాదులు సబిందుకములుగనె తోఁచెడి. శాసనములందు బహుళముగఁ బరసవర్ణమె పూర్ణబిందుస్థానమునఁ దోఁచెడి. బిందుయతి సంధిగతప్రాసముల ధోరణిని బరిశీలించిన సంస్కృతపదమధ్యానునాసికములస్థానమున బిందువును వ్రాయునాచార మవిరుద్ధమయ్యెడి. అనునాసికప్రాసమునరసిన ననునాసికమునే వ్రాయవలయుననితోఁచెడి. వీనిం గమనించియె సూరి సంస్కృతపదమధ్యానునాసికములస్థానమున ననునాసికబిందులేఖనములు రెండును నదుష్టములే యని 'పఙ్క్తి కంఠము' అనునుదాహరణములచే సూచించెననుటయే సముచితమయ్యెడి.

మూలమున 'శబ్దయోగవశాత్' అని సామాన్యముగ ననుటంజేసి తెలుఁగున దేశ్యేతరదేశ్యములమూలముననను మహాప్రాణములకలిమి గుదురుపడెడి. కాని తత్సమరూపసాధనపరమై దేశ్యవిషయమున వ్యవహారమునె ప్రమాణీకరించు చింతామణి దేశ్యాన్యదేశ్యవర్ణప్రవేశమునలంతి విషయము నేతన్మూలమున సూచించెననుట సరసము.

గామి వ్యాఖ్యాతల ననుసరించి సూరియు నాదళేమునకు సంస్కృతశబ్దములనె విషయము చేసెను. ప్రాకృతమున మహాప్రాణము లున్నను దెలుఁగునఁ గలిగిన ప్రాకృతసమముల నవి లోపమిఁ దన్మూలమునఁ గలుగునని సూరి యనలేదు. భవముల నవి లేనేలేవు.

## కచటతపలు పరుషంబులని గజడదబలు సరళంబులని చెప్పంబడు. ౫.

టీ. 'కచటతపాః పరుషాఖ్యా గజడదబాస్తు సరళాః' అనునది మూలము. అయిదువర్గువులందలి తొలియక్షరము లైదింటికిఁ బరుషసంజ్ఞయు, మూఁడవవర్ణము లైదింటికి సరళసంజ్ఞయుఁ జేసెను. పరుషసరళముల కుచ్చారణమునందలి కాఠిన్యమును, సారళ్యమును దెలుపునీసంజ్ఞలు సార్థకములు. పరుషములు వర్గాదిమవర్ణములుగాన నొక్కి పలుకఁబడు. దాన నవి పరుషము లనంబరగె. వర్గప్రథమద్వితీయచతుర్థములవలెఁ గ్రమముగ నొక్కి పలుకఁబడుట హకారయోగమునఁ గష్టోచ్చారణమునంది యుండుట యనునవస్థలపాలుగామిఁ దృతీయములు సరళములు నాఁబరగెను. ఈసంజ్ఞ లాంధ్రలక్షణసిద్ధములుగాని యాద్యవ్యాకరణప్రసిద్ధములు గావు.

## ఇతరములగు హల్లులు స్థిరములు. ౬.

ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ.

టీ. 'స్థిరా ఇతరే' అనునది మూలము. పరుషసరళములు పది తప్ప నితరములు స్థిరములనుసంజ్ఞ నందెడి. వ్యాకరణప్రక్రియనుబట్టి పరుషసరళములు పరిణామార్హవర్ణము లయ్యెడి. తక్కుంగలవర్ణములకు సాధారణముగఁ బరిణామము చూపట్టమి నవి స్థిరములు నాఁబడెడి. కొన్నివర్ణములకు స్థిరసంజ్ఞకములకుఁ గొండొకచోఁ బరిణతి చూపట్టెడి. కాని యాపరిణతి పరుషములకువలె సార్వత్రికము గామి స్థిరసంజ్ఞకసార్థక్యమును గల్పింపఁజాలదు. అయాహల్లుల కాయాహల్లు లాదేశములుగఁ జూపట్టునే గాని సమూలముగ నాయాహల్లులు పోవుట సామాన్యముగ వ్యాకరణప్రక్రియలోఁ జూపట్టదు గాన వీనికీసంజ్ఞ కలిగెననియే నవచ్చును. ఇదాద్యవ్యాకృతిసిద్ధసంజ్ఞయె.

## దంత్యతాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు. ౭.

తాలవ్య చకారంబు దంత్య చకారంబునకును దాలవ్య జకారంబు దంత్య జకారంబునకును గ్రాహకములని తాత్పర్యము.

టీ. 'స్యాన్మిథస్సవర్ణశ్చ' అనునది మూలము. సంస్కృతమున చజలకుఁ దాలవ్యోచ్చారణమే గాని దంత్యోచ్చారణము లేదు. తెలుఁగుపదములందలి చజలకు దంత్య

తాలవ్యోచ్చారణములు రెండును గలవు. దాన నవి యిందు ద్వివిధము లయ్యెడి. తాలవ్యమన దవుడలc బుట్టినది. దంత్యమన దంతములc బుట్టినది. దవుడలకు నాలుక తాcకc జేసి పలుకవలసినది తాలవ్యమనియు, దంతములకు నాలుక తవిలించి పలుకవలసినది దంత్యమనియు నిర్ణయింపనగు. సవర్ణమనcగా సజాతీయము. సదృశమనుట. పలుకుబడిలో భేదమున్నను నభిన్నములుగనె యెన్నవలెనని ఫలితము. గ్రాహకమనcగా గ్రహించునది. లక్షణములందు దంత్యతాలవ్యచజలలో నెద్దానిం బేర్కొన్నను, రెండింటిని బేర్కొన్నట్లే తలంపవలెనని భావము. తాలవ్యచకారమున కగువిధి దంత్యమునకును దంత్యమున కగువిధి తాలవ్యమునకును గలుగునని క్రిందివివరణమున కభిప్రాయము.

ఇ ఈ ఎ ఏ లం గూడిన చజలు తాలవ్యంబులు. ౮.

చిలుక - చీమ - చెలి - చేమ, జిల - జీడి - జెట్టి - జేజె.

టీ. "తాలవ్యశ్చుర్వక్రః" అనునది మూలము. స్పష్టము. ఇ ఈ ఎ ఏ లు తాలవ్యములుగాన వీనిసంబంధమున చజలు తాలవ్యము లగుట యవిరుద్ధము.

అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చజలు దంత్యంబులు. ౯.

చలి-చాప-చుక్క-చూపు-చొక్కు-చోటు-చౌక, జముcడు-జాతర-జున్ను-జూలు-జొన్న-జోలి-జౌకు. ఐదంతములయిన చజలు సమేతరశబ్దములందు లేవు.

టీ. సూత్రమునందలి యేడచ్చులసంబంధమున చజలు దంత్యములగును. కంఠోష్ఠ్యము లగువీనిచేర్పున చజలు దంత్యములగుట వింత. చింతామణి వ్యవహారమున దంత్యములుగc బలుకcబడున వత్వవిశిష్టములును దాలవ్యములుగc బలుకcబడున వెత్వవిశిష్టములును నని జేన చేద చేట చెడ యనుమున్నగువానిసంస్కరించుచున్నట్లును, నత్వవిశిష్టము దంత్యమని తాలవ్యచజలరూపమును వేఱుపఱచుచున్నట్లును, సందేహాస్పదములగునవి అకారైకారములే యగుట నోత్వమునకుc బ్రసక్తియే లేమి వక్రశబ్దమేకారబోధకమగుచున్నట్లును, గ్రహించియు, నాయాయచ్చులతోడc గూడినపు డాయాచజలను వేఱొకరీతిని బలుకుట పొసcగదని సంభావించియు, సూరి వర్ణములలో చజలకె యచ్చులభేదమున నిట్టిభిన్నోచ్చారణము సంభవించుటంజేసి దానిని గష్టపడి తెలిసికొనునక్కఱను దీర్చి సుబోధముగానించుటకే మూలము నిట్లు వివరించెననవలెను. చింతామణియందువలెc గాక యిం దాయాయచ్చులసంబంధముచే చజలకుc గలిగెడు దంత్యతాలవ్యతల నిర్ణయించునీసందర్భము చూపట్టుటంబట్టి వర్ణసమామ్నాయమున చజలను రెండిటినే నిల్పుట యుచితమని తోcచెడి. ప్రాకృతమున దంత్యచజలు లేకున్నను దెనుcగునమాత్ర మా ప్రా

కృతచజలకు దంత్యతయు సిద్ధించుచున్నది. సంస్కృతసమములందలి చజలు తాలవ్యములేగాని దంత్యములుగామి వాని కీవిధులతో సంబంధములేదు. కాన నీసూత్రమును బూర్వసూత్రమును సంస్కృతసమేతర పదవిషయము లనుట స్పష్టము. ఐదంతములైన చజలు సమేతరమైన తెలుఁగున లేవు. 'చైవులసాకిరి చాయమగఁ'డనునది చూపట్టుంగాని 'చయివుల'అని దిద్దనగుటఁ ద్యాజ్యము. ఇది కేవల సంస్కృత సమవిషయము.

**సంస్కృతసమంబులం దికారాంతములయిన శబ్దములయుపధా చజలు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగును. ౧౦.**

ఇవి దప్ప సంస్కృతసమంబులందు దంత్యచజలు లేవని తాత్పర్యము. ఉపధ యనఁగాఁదుదివర్ణమునకు ముందువర్ణము. అర్చి-అర్చులు; రోచి-రోచులు; వీచి-వీౘులు; రాజి-రాౙులు; వాజి-వాౙులు. మఱియు రాౙిశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి. ఇతరములయిన చజల కుదాహరణములు: చంద్రుఁడు-చామరము-చక్రిక-చూర్ణము-చోరుఁడు-చౌర్యము-జయము-జాతి-జుగుప్స-జూటము ఇత్యాదులు.

టీ. ఇదియు దంత్యచజవివరణమేగాన 'అద్దంత్యాః'అనునదే మూల మనవలయును. సంస్కృతసమములందలి చజలకును గొన్నియెడలఁ దెనుఁగునఁ గలుగుదంత్యత వివరింప నీసూత్ర మారబ్ధము. ఇకారాంతములైన సంస్కృతసమముల చజలు బహువచనయోగమున నుకారాంతములై దంత్యోచ్చారణము నందును. ఈయవస్థయందుఁ దప్ప నితరములకు సంస్కృతసమముల చజలకు నెపుడును దంత్యత సిద్ధింపదు. 'ఉపధ' ఇది పాణినీయసిద్ధసంజ్ఞ. 'అలోఽన్త్యాత్పూర్వ ఉపధా''అని సూత్రము. తుదివర్ణమునకుఁ బూర్వమున నున్నవర్ణ ముపధ యనంబడు. ఆంధ్రప్రత్యయమాత్రమును జెందినది సంస్కృతసమము. 'అర్చి+లు'ఇందుఁ దుదివర్ణ మికారము. దీనికిఁ బూర్వవర్ణము చకారము. బహువచనప్రత్యయము లువర్ణము. ఇది పరముగాఁ దుదియికార ముకారమై చజలకు దంత్యోచ్చారణముం గూర్చునుగాన నాసందర్భమునందలి చజలు దంత్యము లగుచున్నవి. ఇట్లేతక్కినవూహించునది. అచ్చులు=స్వరములు:—ఇందీసూత్రము వర్తింపకున్నను దీనికి దంత్యోచ్చారణమె ప్రసిద్ధము. అచ్చులు=ముద్రలు: తెనుఁగుశబ్దమగుట 9 చే దంత్యత సిద్ధించెడి. ఇట్లే మంచము (ఖట్వా) అనునపుడు తద్భవమగుట దంత్యత గల్గెనని యెంచునది. మఱియు గోచి, బూచి, సంచి, తేజి, జాజి, విరవాజి మున్నగువాని కేకవచన బహువచనములందుఁ దాలవ్యదంత్యతల సాధింప 8-9 సూత్రములు సమర్థములుగాన సంస్కృతసమములకు సంబంధించిన యీసూత్రమున కవి లక్ష్యములు గాఁజాలవు.

ఈసూత్రమికారాంత సంస్కృతసమముల చ జ లకు బహువచనము పరమగునపుడె దంత్యతను సాధించునదగుటఁ దాఁ దత్సమపరిచ్ఛేదమున సాధించిన రాజన్ శబ్దప్రథమైకవచనరూపమగు 'రాజు' అనుదాని కేకత్వబహుత్వముల దంత్యతను సాధింపసమర్థముగామి "మఱియుం రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి" నని సూరి వివరణము వ్రాయవలసి వచ్చెను. ఈతఁడు మహత్వమున స్వార్థపరమగును 'రాజన్' శబ్దమునకును, 'రాజు' రూపము కలుగునని శాసించినవాఁడు (తత్స. 78 సూ.) గాన నీతనిమతమున దంత్యత వ్యస్తరాజన్ శబ్దరూపములగు రాజు, రాజుచేత మున్నగువానికే గాక ఖగరాజు, ఖగరాజుచేత మున్నగువానికిని సంభవించునని సంభావింపవలయును. దీనివిస్తృతికయి తత్సమపరిచ్ఛేదమునందలి 78 సూత్రవ్యాఖ్యల నరయునది. 'రాజన్' శబ్దముతుది నున్న 'అన్' అనుభాగమును లోపింపఁజేయను, దంత్యోచ్చారణ ముత్వమూలమున సిద్ధింపఁజేయను, దత్సమరూపసాధనసందర్భమున సదా డువర్ణమును విధించుచింతామణియాశయమును గమనించియే సూరి యిట్లు వ్రాసెననుట సముచితమగుటంజేసి చింతామణియు వీనికి దంత్యతను సాధించునదే యని విశ్వసింపఁదగును. ఒకేశబ్దమునందలి జకారము నొకమాఱు తాలవ్యముగను మఱియొకమాఱు దంత్యముగను శ్లేషయందుఁ బలుకవలసి యుండు ననువింతను బాలవ్యాకరణమునకన్న నధికముగఁ గనపఱచునుద్దేశముతోడ జకారం బుభయంబగునని సూత్రించి 'పాండురాజయశము' అనుదాని నుదాహరించి యిందజయశమను రామాయణార్థమున (అజయశము) జకారమును దాలవ్యముగను, భారతార్థమున (పాండురాజ! సంబుద్ధి) దంత్యముగను సమన్వయించుచు రాజు వైకృతమనుదానిని గేచిన్మతముగను నిరూపించుచు రాజు వైకృతమని వ్రాసినవ్రాఁతలనుబట్టి స్వార్థపరమైనరాజుశబ్దము దంత్యమనువిషయమున నాతఁడును జింతామణిసూరులనే యనుసరించువాఁ డనుట తెల్లము. "స్వార్థప్రధానే భావే స్యాత్ రాజ్ఞో డుః పుంసి చేతనే" అని చింతామణిని వివరించు నాథర్వణమును రాజు ఖగరాజులందలి జకారములకు దంత్యములనెడు సూరి సీతారామాచార్యులమార్గములకు మార్గదర్శకమే యగుచున్నది. గుప్తార్థప్రకాశికమాత్రము పాండురాజయశమను నుదాహరణమందలి భారతార్థమునసైన జకారమును గూడ పాండురోగముచేఁ బ్రకాశించువాఁడను వ్యుత్పత్తికల్పనముమూలమునఁ దాలవ్యముగఁ జేయుచుఁ, గేచిన్మతము ననుసరించి తత్సమజకారములెల్లఁ దాలవ్యములనియు వైకృతములు దంత్యములనియుఁ బరిష్కరించుట యుంచితమని సమ్మతించుచు హరికారికామూలకాశయముతో బాలవ్యాకరణాశయమును సమ్మతించెడువివరణముల యాశయమును గమనించుట మాని తన విమర్శనపాటవమును బ్రకటించుచున్నది. లక్షణకర్తలమతమున స్వార్థపరమైన రాజన్

శబ్దజకారములు దంత్యములనియు దంత్యేతర సంస్కృతశబ్దగత చ జ సాధారణ్యము గామిని, 'జేఁడు, రాయఁడు' అను తెనుఁగు నుడులు ప్రసిద్ధములైయున్నను, దంత్యోచ్చారణ స్త్రీసమస్వరూపములంబట్టియు నిద్దాని నచ్చతెలుఁగుకబ్బములకర్తలు వైకృతమని భ్రమించి తమకావ్యముల నుపయోగించి యుండరనియు, దాన సంస్కృతసమవైకృతవాదద్వయము వెడలెననియు, ఫలితమును గ్రహించుట యుచితము. ఇట్లు దంత్యోచ్చారణముం జేసియైన రాజుశబ్దము వైకృత మనుభ్రమయే వలరాజు మున్నగు సమాసముల నిందుఁ గల్గించెనని విశ్వసింపఁదగును. స్వార్థపరరాజన్ శబ్దజకారములఁ గేచిన్మతము ననుసరించి తాలవ్యములుగ నుచ్చరించుటకు నించుకయు నవకాశములేమి లాక్షణికుల దంత్యతాసిద్ధాంతమే రమణీయమని తోఁచెడి.

## నకారంబు ద్రుతంబు. ౧౧

టీ. 'ద్రుతాఖ్యో నః' అనునది మూలము. దీనివివరణ మీక్రిందిసూత్రమున నరయునది.

## ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు. ౧౨.

ప్రథమా కయి పట్టి యొక్కేతరములయిన విభక్తులు - ఉత్తమపురుషైకవచనంబులు - భూత తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనంబులు - ఆశీరాద్యర్థంబులయిన యెడుతవర్ణకంబులు-శతృ తు మానంతర్య చేదాద్యర్థకంబులు - నేను తాను పదంబులును-వలె ప్రభృతులును ద్రుతప్రకృతికంబులు. నన్నున్ - నాచేతన్-నాతోడన్-నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ - నాకున్ - మాలోపలన్ - మాయందున్ - వత్తున్-వచ్చెదన్-వచ్చెన్-వచ్చున్ - వచ్చెడున్-ప్రసన్నులయ్యెడున్ - కావుతన్ - కొట్టుచున్ - కొట్టన్-కొట్టఁగన్ - కొట్టుడున్ - కొట్టినన్-వలెన్ - ఎంతయున్ - పోలెన్ - అయ్యున్ ఇత్యాదు లూహ్యంబులు.

టీ. నకార మంతమందుఁ గలశబ్దములు ద్రుతప్రకృతికములు. "నకారంబు ద్రుతం"బను పైసూత్రమునుబట్టి నకారమాత్రమునకు ద్రుతసంజ్ఞ కలుగుచుండ నీక్రింది పట్టికమూలమున నిట్టినకారములు ద్రుతములని వ్యావర్తకముగఁ జూపుచు నకారసామాన్యమునకు ద్రుతసంజ్ఞ సిద్ధింపకుండఁజేయుటకు యత్నించుచున్నాఁడు. "అన్యే ద్రుతప్రకృతయో యే స్వ్యర్థా్యనుజీవిత ద్రుతా నిత్యమ్" అనునది మూలము.

ప్రథమావిభక్త్యేకవచనబహువచనములను జతుర్థీప్రత్యయములలో 'కై' అనునదియుఁ బంచమీప్రత్యయములలో 'పట్టి' అనునదియు షష్ఠీప్రత్యయములలో యొక్క

యనునదియుఁ దప్పఁ దక్కిన ప్రత్యయములెల్లను ననఁగా ను, చేత, తోడ, కొఱకు, వలన, కంటె, కు, లోపల, అందు, న, అనునవి ద్రుతప్రకృతికములు. ఇదంత శబ్దములపై నిదంతములుగ మాఱెడు ని, కి అనువికృతులును ద్రుతప్రకృతికములె. ప్రథమాక్షరశేషములైన చే, తో అనునవియు ద్రుతప్రకృతికములె యగును. మఱియుఁ జతుర్థ్యర్థకమగు 'పొంటె' అనునదియుఁ, బంచమ్యర్థకమగు 'కన్న' అనునదియు ద్రుతప్రకృతికములె యగు. ప్రత్యయము లాయాశబ్దములకుఁ దుదిని జేరునవిగాన నాయాప్రత్యయము లంతమందుఁ గలశబ్దములెల్ల ద్రుతప్రకృతికములే యని గ్రహింపవలెను.

నన్నున్: ద్వితీయాంతము. నాచేతన్, నాతోడన్: తృతీయాంతములు. నాకొఱకున్: చతుర్థ్యంతము. నావలనన్, నాకంటెన్: పంచమ్యంతములు. నాకున్, మాలోపలన్: షష్ఠ్యంతములు. మాయందున్: సప్తమ్యంతము. వత్తున్, వచ్చెదన్: లాద్యుత్తమపురుషైకవచనములు. వచ్చెన్: భూతార్థకప్రథమపురుషైకవచనము. వచ్చున్, వచ్చెడున్: తద్ధర్మాద్యర్థకప్రథమపురుషైకవచనములు. ప్రసన్నులయ్యెడున్, కావుతన్: ఎడుతవర్ణకాంతాశీరాద్యర్థకములు. కొట్టుచున్: శత్రర్థకము. కొట్టన్, కొట్టఁగన్: తుమున్నాద్యర్థకములు. కొట్టుడున్: అనంతర్యార్థకము. కొట్టినన్: చేదాద్యర్థకము. నేను, తాను: అస్మదాత్మన్ శబ్ద ప్రథమైకవచనములు. ప్రథమాంతములుగాన వీనికిఁ గళాత్వమెసిద్ధించెడిఁగాన నిట్లు నిర్దేశింపవలసివచ్చెను. ఎంతయున్, పోలెన్, అయ్యున్, వలె ప్రభృతులు. మిగులన్, మఱలన్, కడున్, వెంటన్ మొదలగునవి ప్రభృతి శబ్దముచే వాచ్యములగు నవ్యయములు. మూలమునఁ దద్ధర్మాశీశ్చేదర్థకములకాదిపదమును జేర్చుట కాయాప్రత్యయము లాయర్థములందేగాక మఱికొన్నియర్థములందును గలుగునవగుట నాయాయర్థములం దాయాప్రత్యయములతోఁగూడినవానినెల్ల సంగ్రహించుటకని తలంపవలయును. తెలుఁగున నత్వవిశిష్టనకారమును ద్రుతమన వీలు లేదు. ఐనను, 'ద్రుతాఖ్యో నః' అని చింతామణి వర్ణసమామ్నాయగతరూపమునే నిర్దేశించి ద్రుతసంజ్ఞను జేయుట యిది హల్లునకెయగువిశేషసంజ్ఞగానను, కేవల వ్యంజనము నచ్చుచేర్పక పలుక నవకాశములేమిఁ దెలుఁగునుడి పలుకుబడి యాచితింబట్టి యుత్తు చేదునుగానను, ద్రుతమజ్విశిష్టమైనను గాకున్నను నీసంజ్ఞచెల్లునను నుద్దేశముతో నైనదిగా నెంచి సూరి యిట్టి పొల్లురూపమునందిన నకారములకును ద్రుతసంజ్ఞ గలుగును జుడీ యని తెలుపఁ బట్టికలో ద్రుతప్రకృతికములనెల్లఁ బొల్లులతో నిర్దేశించెను. ఈపట్టికయందుఁ జూపఁబడిన ద్వితీయాది విభక్తులకును, నాయాయారూపములకును, నాయాసందర్భములం దుత్వవిశిష్టమైన నకారము తుదను గల్గునని సూరి

సూత్రించియున్నాఁడు. అవసానంబున ద్రుతస్వరలోపము బహుళముగఁ గల్గునని సంధిపరిచ్ఛేదమున సూత్రించినాఁడు. ద్రుతస్వాత్వరూప ముత్వవిశిష్ట నకారమని సంధిపరిచ్ఛేదమున వివరణము వ్రాసినాఁడు. ఇకారంబుమీఁది కు ను వు క్రియా విభక్తులయుత్వమున కిత్వమును సూత్రించి సాధించినాఁడు. ద్రుతస్వాత్వరూపము మీఁదఁ బరుషములకు సరళములు గలుగుట సూత్రించి చూపినాఁడు. ద్రుతస్వరము సంశ్లేషప్రతిబంధకముగా నూహించి సంశ్లేషమును సూత్రముఖమున సాధించినాఁడు. ఈసందర్భములఁ బరిశీలింప నీతనిమతమున నుత్వవిశిష్టనకారమే ద్రుతమనుట సాధారమగును. ఇఁకఁ బ్రథమేతరసూత్రసందర్భమునను నిఁకాదిసూత్రప్రణాళికయందును ద్రుతప్రకృతికములఁ బొల్లునకారము లంతమందుఁగలవిగా నిర్దేశించియున్నాఁడు. దీన ద్రుతప్రకృతికము లచ్ సంధివిషయములుగా వానితుది నున్న ద్రుతము లుత్వాచ్కమై దోఁచునను నాశయము గలిగియుండుట తెల్లమగు. పైసందర్భములంబట్టి యుత్వవిశిష్టమైయుండుట పొల్లురూపముగ నుండుట యను రెండేరూపములుగాని (ను అనునదే యికారాంతములపైని యగుంగాన నువర్ణముగనే దాని గణింపవలెను) యితరరూపములు ద్రుతమునకు సంభవింప వను దృఢవిశ్వాసముతో సూరి యుండుట స్పష్టమయ్యె. దీన "నకారంబు ద్రుతంబు," అనుసూత్ర ముత్వవిశిష్టమును పొల్లురూపమును నైననకారములను రెండిటిని బోధించునదిగా సూరి యెన్నెననుట స్పష్టమయ్యె. 'ద్రుతాఖ్యో నః' అనుమూలమును, నిదేయర్థము నిచ్చునదిగ సూరి తలంచెననుట పునరుక్తము. మూలమెట్టిదానినేని వ్యంజనరూపమునందఁ గలుగుదానిని నకారమును ద్రుతమనఁదగునను నాశయముగలదగుట సూరియిమ్మార్గమందేకదేశగ్రహణముచేసైన దనఁదగును. ఈపట్టికలో ద్రుతప్రకృతికముగ నిరూపించిన ద్వితీయావిభక్తి ను రూపమని నువర్ణంబు ద్వితీయయనుదానిచే స్పష్టమగు. తక్కుంగల సుబ్విభక్తులతుదిని నువర్ణ మాగమముగఁ దృతీయాదులకు నుమాగమంబగునను దానిచే సిద్ధించుచున్నది. మిగిలిన తిఙంతములలోఁ గొన్ని ప్రత్యయరూపనువర్ణ మంతమందుఁ గలవియుఁ, గొన్ని సూత్రవిహితద్రుతాంతము లైనప్రత్యయములతోఁ గూడినవియు నైయున్నవి. ఎంతయు నిత్యాదుల తుది నున్న నువర్ణము సముచ్చయాద్యర్థములఁ గలిగినదగుట నవ్యయరూపము. (దీని నీతఁడు సాధింపలేదు). వలె నిత్యాదు లవ్యయములగుట వానితుది ద్రుతమును నవ్యయరూపమె యగును. ఇట్టివానిస్వరూపము నెఱింగింపలేమి వీనితుదిని ద్రుతమెట్లు కల్గెనో యీ వ్యాకృతింబట్టి నిర్ణయింపరాదు. ఈద్రుతములెల్ల నాయాపదములతుదల నిల్చునవే. మఱియు సంధ్యాదులందు వీని కదృశ్యతను సూరి కొన్నియెడల సూచించియున్నాఁడు. తాను నేనులలోఁ దుదిని ద్రుతమున్నను నది ప్రథమాసంబంధి

యగుట ద్రుతము కాఁజాలదనుశంకను దొలఁగించు తలంపుతోడను, దాను నేనులను వర్ణములు తానాయనుప్రకృతులకుఁ గలిగినవగుటఁ బ్రథమాసంబంధము లైనను శబ్దసహజములు గాక యాగమములుగఁ గల్గుటంజేసి ద్రుతములే యని సూచించు నుద్దేశముతోడను, సూరి పట్టికలోఁ దాను నేనుల నిర్దేశించెనన్న శబ్దసహజములై శబ్దాంతమున నిల్చిన యేనువర్ణములకును ద్రుతసంజ్ఞ సిద్ధింపదని స్పష్టపడును. కానఁ బైసందర్భముల ననుసరించి శబ్దసహజములుగానివియుఁ బ్రత్యయాగమావ్యయాత్మకము లైనవియుఁ, బదములతుదినె నిల్చునవియుఁ, దాము లుప్తములయ్యుఁ బదములయర్థాదులకు భంగమును గూర్పఁజాలనివియు నగునుత్వవిశిష్టనకారములును గొండొకచో వానికే యైన పొల్లురూపములును ద్రుతము లనునొకలక్షణము సిద్ధించెడి. దీన ద్రుతమనునది యుండవలయునన్న నుండునదియుఁ బోవలయునన్నఁ బోవునది యు నని స్పష్టపడినది గాన ద్రుతసంజ్ఞ సార్థకమగుచున్నది. ఇట్లు దీనిలక్షణమును సూరి వానివానిముఖముననేగాని స్వీయవాక్యములవివరింపమింజేసి పాఠకసుబోధమునకై ప్రౌఢవ్యాకర్త "నకారం బసాధారణంబు ద్రుతం"బని సూత్రించి యసాధారణపదము నకుఁ బ్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టమని వివరణము వ్రాసి ద్రుతమనఁగా నొల్లనియెడ మఱఁగిపోవునదని ద్రుతసంజ్ఞకు సార్థక్యమును గూడఁ జూపుచు నున్నా నిత్యాదులందు మాత్రము ద్రుతస్వరద్రుతలోపములు గలుగవని ద్రుతలక్షణమును వివరించినాఁడు. ఈతఁడు 'ద్రుతాఖ్యో నః' అనునన్నయద్రుతలక్షణమవయవావ యవినకారవ్యంజనసాధారణమనుతత్వమును, నన్నయ ద్రుతసంశ్లేషములని తానెన్నిన యన్విష్టసఖీత్యాదులచే నెఱింగినవాఁడయ్యుఁ దాఁ జెప్పిన యుత్వవిశిష్టనకార మనునర్థ మునుగూడ నాసూత్రమున సామాన్యనిర్దిష్టమైన 'నః' అనుదానినుండి యుద్ధరింప నవకాశ మయ్యెడిఁగాన నన్నయచింతామణి తన్నివిషయమున విరోధించునది గాదనుటకే 'ద్రుతాఖ్యో నః' అనుసూత్రమును బ్రమాణీకరించెననియుఁ గావుననే 'అన్విష్టసఖి-పెన్ను రము-చక్కఁబెట్టు కమ్మందేనె' మున్నగువానిని సూత్రాంతములచే సాధించికొనెననియు గ్రహింపవలెను. కాన నీసందర్భమున 'ద్రుతాఖ్యో నః' అనుసూత్రమునకుఁ బ్రౌఢ వ్యాకర్తయు సూరిమార్గమునే యనుసరించి యర్థముచేసెనని తెల్లమయ్యె. 'ఉన్నాను' అనుదానివిషయమున నందలి ద్రుతమునకు స్వరలోప లోపార్ధపూర్ణబిందురూపకార్య ములు గల్గునవనుట మాత్రము ప్రౌఢవ్యాకర్త సూరికంటెఁ గ్రొత్తగఁ జెప్పె. ద్రుతము సహజముగఁ దుదినిగలిగియుండునవి ద్రుతప్రకృతికములని వ్యుత్పత్తి.

వ్యాకరణప్రక్రియ ననుసరించి యెల్లశబ్దములు నాయాప్రత్యయములమూల మునను, నర్థవిశేషప్రకాశకమై చేరెడు నుపవర్ణముమూలమునను, నాగమనువర్ణముల

మూలమునను ద్రుతప్రకృతికము లగుచుండుటంజేసియు, శబ్దసహజములగు నకారము లకు ద్రుతసంజ్ఞ సిద్ధింపమింజేసియు వ్యాకరణసిద్ధద్రుతాంతములకే సూరి ద్రుతప్రకృతి కమును బర్యాయముగఁ జేసెను. చింతామణిప్రణాళికలో నిట్లాయావానికి వేర్వేఱు ద్రుత విధానములు లేకుండుటే గాక "అన్యే ద్రుతప్రకృతయో యే స్యుర్వ్యానుజీవి తద్ద్రుతా నిత్యమ్" అనుదానిచేఁ గళలుగానివానికెల్ల నకారము నిత్యముగ నగుట నందలి ద్రుత ప్రకృతికసంజ్ఞ సార్థకము. ఇం దట్టిప్రక్రియ లేమి ద్రుతప్రకృతిక మనుమాట నేతి బీరకాయను బోలె. పరికింప నిద్దానింబట్టి పోలెనిత్యాదులు ద్రుతప్రకృతికములును దక్కుఁగలవి ద్రుతాంతములును నయ్యెడి. మూలము తత్తదర్థకసంస్కృతపదములచేఁ దెలుఁగుపదముల నెఱింగించునదైనను, "నః-మోః" అని తెలుఁగును సంస్కృతవిభక్తి నిడి వాఁడుటను, నథర్వణుఁడు 'ఓయిపదే, అడాంతత్వమ్, ల్వాదివర్ణకే," అని యను టను, గమనించియుఁ దత్తదర్థకసంస్కృతపదములకంటె నసందిగ్ధార్థప్రతిపాదకములు దేశ్యములె యని యెంచియుఁ గావలయును సూరి దేశ్యములనె గ్రహించుటయు, వానిని సంస్కృతపదములుగ భావించి పరమునను్న సంస్కృతపదములతోఁ గలుపుటయే గాక 'యొక్కటరములు, పడ్వాదులు' అనుమొదలగుచోటుల గుణయణాదేశాదులం గూర్చు టయుఁ, జరిగెనని తోఁచెడి.

## ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు. ౧౩.

రాముఁడు - రాములు - హయము - విష్ణువు - గోడ - మేడ- అయ్య - అమ్మ - రామునికయి జ్ఞానముఁబట్టి - నాయొక్క - వచ్చిరి- వచ్చితివి-వచ్చితిరి-వచ్చితిమి-రాఁడు - రారు - రాదు-రావు - రాము - కొట్టక - తిట్టక - ఎత్తిలి - ఒత్తిలి - ఊరక - మిన్నక - బళి-అక్కట- ఏల - ఇత్యాదు లూహించునది.

టీ. "తిఙ్మధ్యశేషషష్ఠీ సుప్కర్మప్రవచనీయజవిభక్తిః, కించిత్ప్రశంసనార్థక సంతాపయదాతదా కిమేవాంశ్చ. క్త్వా కిల తూష్ణీ మాద్యా నభిదధతి కళా ద్రుతో న యేషాం స్యాత్" అనునది మూలము. ద్రుత మంతమందు లేనిశబ్దములు గళలగును. స్వచ్ఛములైనవనుట. 'రాముఁడు, రాములు, హయము, విష్ణువు, గోడ, మేడ, అయ్య, అమ్మ' అనునవి డు ము వు లంతమునఁ గలిగినవియుఁ, బ్రథమైకవచన లోపము నందినవియునగు వివిధశబ్దప్రథమారూపములు. (సుప్ ప్రథమా మాత్రవాచకమని గ్రహించె) 12 సూత్రమునఁ బ్రథమాకైపట్టియొక్కటరములు ద్రుతప్రకృతికము లగుటంజేసి యిందు వానినే మొట్టమొదటఁ గళలుగఁ జూపు

చున్నాఁడు. రామునికై:—ఇది చతుర్థ్యేకవచనము. జ్ఞానముంబట్టి:—పట్టివర్ణకము చేరిన పంచమ్యేకవచనము. నాయొక్క:—యొక్కవర్ణకము చేరిన షష్ఠ్యేకవచనము. (మూలస్థశేషషష్ఠి) కై పట్టి యొక్క:—ఏకవచనబహువచన సాధారణములగుట కళా లక్షణమును దత్సాధారణ మగును. వచ్చిరి:—రేఫాంతభూతకాలిక ప్రథమపురుష బహువచనము. వచ్చితివి, వచ్చితిరి:—భూతకాలికమధ్యమైకవచన బహువచనములు. వచ్చితిమి:—మాంతభూతకాలికోత్తమబహువచనము. (ఇవి మూలస్థతిఙ్మధ్యోదాహరణములు. "తిఙ్మధ్యనామకాస్స్యుర్మధ్యమపురుషాశ్చయే రమాంతాశ్చ" అని మూలము.) రాఁడు, రారు, రావు, రాము:—ఉత్తమైకవచనవ్యతిరిక్త వ్యతిరేకప్రథమ మధ్యమోత్తమైకవచన బహువచనములు. తిట్టక, కొట్టక:—వ్యతిరేకక్త్వార్థకములు. ఎత్తిలి, ఒత్తిలి:—దేశ్యావ్యయములు. ఊరక, మిన్నక:—తూష్ణీమర్థకములు. ("తూష్ణీమాద్యాః" అని మూలము) బళి:—ప్రశంసనార్థకము, అక్కట:—సంతాపార్థకము. ఏల:—ప్రశ్నార్థకము. అట్లు, అట్టి, ఇట్టి, ఎట్టి, ఏమి, మఱి, మిక్కిలి, కొంచెము. ఆహా, ఔర, రాముఁడే, అట్టిద-రాముఁడ ఇత్యాదు లాదిపదగ్రాహ్యములు. సంధి 13 సూత్రమున అపుడిపుడెపుడనునవి నిత్యప్రథమైకవచనములని ప్రతిపాదించుఁగాన "యదాతదా" యను మూలమున కుదాహరణ మిందుఁ జూపఁబడలేదు. ఈతనిమతమునఁ గూర్చిగుఱించు లు క్త్వార్థకములుగఁ దలంపఁబడినవగుట గతార్థము లనవలెను. కాని యిందుఁ గ్త్వార్థకోదాహృతి లేదు. వ్యతిరేకక్త్వార్థకములమూలమునఁ గ్త్వార్థకములకును గళాత్వమూహింపవలెను. ద్రుతప్రకృతికముల పట్టికలోఁ జేర్పకుండుటచేతను వీనికిఁ గళాత్వమనుమానింపఁదగును. తృతీయార్థకమగు చేసియుఁ బంచమ్యర్థకమగు నుండియు నా యాధాతువుల క్త్వారూపములనుతలంపునఁ జేర్పలేదని భావింపనగు. చేసి తృతీయార్థకమని చెప్పనేలేదు. ఉండి స్పష్టముగ శబ్దమనినవాఁడు. చేసిక్రియలలోఁ గ్త్వారూపముగ సాధించినాఁడు.

"అనఘ యిది యేటిశప మే, మనుపమదుఃఖితులమగుట నాధారము లే, కను సంతానోచ్ఛేదం బున" అనుభారతాదిపర్వ ద్వితీయాశ్వాస పద్యమునందలి 'లేకను' అనుదానింబట్టి కొందఱు వ్యతిరేకక్త్వార్థకము ద్రుతప్రకృతికమని భ్రమింతురు. ఇట్టి భ్రమను దొలఁగింపనే సూరి "కొట్టక, తిట్టక" అని రెండుదాహృతులు చూపెను. మఱియుఁ బ్రౌఢవ్యాకర్త 'లేకను' అనుదానిలో నుపర్ణము సముచ్చయార్థకమని చెప్పఁజూచి వ్యతిరేకక్త్వార్థము కళయ యని సిద్ధాంతముచేసెను. ఇచ్చో సముచ్చయార్థము ప్రసక్తము గామి 'లేమిని' అని దిద్దుట యుచితమని సుప్రార ... దెల్పెడి. యతినిర్బంధము లేని కందపద్యపాదమగుట ... సవరించినను ద...ని



నువర్ణము సముచ్చయద్యోతకమే, గాక యర్థవిశేషమును బ్రకటించునదియునని ప్రౌఢ వ్యాకర్త యిచ్చిన ప్రయోగసరణి ననుసరించి గ్రహింపవలసియుండునుగాన లేకుండుట యొక్క యతిశయమును నువర్ణము సూచించునట్లు గ్రహించి బహుపుస్తకగతమును ననేకులకు లాక్షణికకవులకు దుత్తప్రకృతిక మనుభ్రమ నుదయింపఁజేసినదియుం నగు నీపాఠమును బ్రౌఢవ్యాకర్తృమతము ననుసరించి స్వరసమని గ్రహించుటయే సరసమని తోఁచెడి. (చూ. ప్రౌఢ. సంజ్ఞ 8)

## హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును. ౧౮.

అడఁకువ - అడంకువ - అరఁటి - అరంటి - ఎఱుఁగుట - ఎఱుంగుట - బలఁగము - బలంగము - మగఁటిమి - మగంటిమి.

టీ. 'హ్రస్వాత్పూర్ణోఽపి భవేత్' అనునది మూలము. అచ్చునకే హ్రస్వదీర్ఘప్లుత భేదముగాని హల్లునకు లేదుగాన హల్లునుగూర్చియైన సందర్భములందు నాయాయచ్చు లతోఁ గూడినహల్లుల నట్లభేదముగ వ్యవహరించెనని గ్రహింపవలెను. మఱియుం వ్యంజనము లచ్చు చేర్పు లేక యుచ్చారణము లేనివగుటయు నట్లు వ్యవహరింపవలసె నని యెన్నునది. కాఁగా హ్రస్వమున కనఁగా హ్రస్వాచ్చునకును హ్రస్వాచ్చుతోఁ గూడినహల్లునకును నని గ్రహింపవలెను. వికల్పమనఁగా నొకమాఱు కలుగుట యొక మాఱు కలుగకుండుట. నిండుసున్న యఱసున్న యని సున్న ద్వివిధము. సిద్ధపూర్ణము, సాధ్యపూర్ణము. సిద్ధఖండము, సాధ్యఖండము. అను భేదమునఁ బైరెండును రెండేసి విధములగు. సిద్ధమనఁగా శబ్దసహజమైనది. సాధ్యమనఁగా వ్యాకరణప్రాప్తమైనది. ఇందు సామాన్యముగ ఖండబిందువనుటంజేసి సిద్ధసాధ్యఖండములకు రెండింటికి స్వీకారము గలిగెడిఁగాని యట్లన నవకాశము చాలదు.

ఇందలి యుదాహరణములలో 'మగఁటిమి' అనునది తప్పఁ దక్కినవెల్లను సిద్ధఖండములు గల పదములని చెప్పవలసియున్నను నీవ్యాకృతిపద్ధతి ననుసరించి యాప విభక్తి కటివర్ణము ద్వితీయాద్యేకవచనములందే వచ్చునదగుటచేతను, టివర్ణమునకుఁ బూర్వము కల్గినఁ బూర్ణమే కలుగఁదగి యుండుటచేతను, దద్ధితప్రకరణమున నర్ధబిందువుతో డి, టి వర్ణము సాపవిభక్తికముగ సమర్థించుకొనలేకయే యిమియను తద్ధితప్రత్యయముతోఁగూడినదీనిని మగఁటిమ్యాదులు యథాప్రయోగముగ గ్రాహ్యములను సూత్రాంతరమున సాధించుటచేతను, నీసూత్రము హ్రస్వముమీఁదఁ బూర్ణార్ధములయునికిని సామాన్యముగఁ దెలుపునది గాక ఖండముసుద్దిష్టముగఁ జేసికొని పూర్ణమును దానికి విధించున

దగుటచేతను సాధ్యమనలేక దానినిగూడ సిద్ధఖండముగనే గ్రహించె ననవలసియున్నది. మఱియు దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదనుసూత్రము సామాన్యముగ బిందు మాత్రమును విధించెడి వ్యాకరణవిధులచేఁ గలుగు ఖండపూర్ణములలో దీర్ఘము మీఁదిపూర్ణమును వారింప సమర్థమైయుండుటంజేసియు, నిఁక హ్రస్వముమీఁద ఖండ పూర్ణములు సామాన్యబిందువిధానములచేతనే సంభవించునవగుటంజేసియు, నీసూత్రము సిద్ధఖండములనే పూర్ణములఁజేయునదని గ్రహింపవలయును. కానఁ గుఱుచయచ్చున కును నట్టియచ్చుతోడిహల్లునకును దరువాత నున్నసిద్ధఖండము (లఘువుమీఁదనున్న దనుట) వికల్పముగఁ బూర్ణమగునని సూత్రార్థము సంభవించెడి.

అడఁకువ; ఇందుఁ గు వర్ణమునకుఁ బూర్వమున నున్నసిద్ధఖండము పూర్ణము గాఁగ 'అడంకువ' అయ్యెను. పూర్ణరూప మద్దానికిఁ గలుగనిపక్షమున 'అడఁకువ' అను సహజరూపమే యుండును. ఇట్లే తక్కుంగలవూహ్యములు.

బిందువనునాసికోచ్చారణమునకు గుఱుతు. అనునాసికోచ్చారణము నిల్చియున్న దానిగుఱుతగుబిందువు పూర్ణరూపమునె కల్గియుండును. అట్టియుచ్చారణము లుప్తమైన నం దట్టియుచ్చారణ ముండెనని తెలుప నర్ధబిందువు (ఖండము)ంచుట యాచార మయ్యెను. కాఁగాఁ దొల్లి యనునాసికోచ్చారణము గలిగి నేఁడు దానియుచ్చారణము గనరాని పదజాతి పూర్వావస్థను బ్రకటింప సూరి యీసూత్రమును రచించెననుట స్పష్టము. కాని యుచ్చారణమున లేనిరూపమును సిద్ధముగఁ జేసికొని యుచ్చారణము నద్దానికిఁ గట్టుటకన్నఁ జారిత్రకదృష్టిని బ్రాచీనపూర్ణమును నర్ధముగాఁ జెల్పుట సుబో ధమగుమార్గముగానఁ బూర్ణబిందువు హ్రస్వముమీఁద వికల్పముగ నర్ధమగునని హ్రస్వము మీఁద బూర్ణఖండముల రెంటియునికిని సూచించుట సరసమగునని తోఁచెడి. ఇదియును దీని తరువాతివిధియును గ్రమముగ వైకల్పికమును నిత్యమును నగుటంజేసి యీరెండు సూత్రములలో నేదేనొకదానియం దవధారణార్థకమును జేర్చి యొకదానిని విడువఁ దగునను కొందఱయాశయము. కాని యట్లైనఁ గ్రమముగ వికల్పముగ దీర్ఘముమీఁది ఖండమునకుఁ బూర్ణము గాదనియు, నిత్యముగ హ్రస్వముమీఁది ఖండము పూర్ణమగు ననియు నపార్థములగుంగాన నమ్మార్గమనాదరణీయము. ఖండమును స్థానముగఁజేసి పూర్ణమును విధించుటచేత నారింజ గావంచ పావంచేత్యాదులందు ఖండము గలుగ కుండుట ఫలముగా ననుమానింపఁదగును.

ఉచ్చారణము లేనిఖండమును వ్రాఁతలో విడువఁదగునని కొందఱందురు గాని ఖండము నుద్దిష్టముగఁ జేసికొని పూర్ణమును విధించునట్టియు, ద్రుతమున కర్ధబిందు రూపమును బ్రక్రియలోఁ జూపునట్టియు సూర్యాది లాక్షణికుల మతము ననుసరించి

యు, శ్లేషకావ్యములఁ గొన్నిపట్టుల దీని యుపయోగము చూపట్టుట నవలంబించియు, ఖండస్థిత్యభావములఁ బదములం దర్థభేదము కలుగుట గమనించియు నిది యపరిత్యాజ్య మని యనవలయును.

## దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు. ౧౫.

వాఁడు - వీఁడు - రాఁడు - లేఁడు - కాఁబోలు - కాఁబట్టి - గోఁగులు - రేఁగులు.

టీ. 'దీర్ఘాచ్ఛేత్ఖండ ఏవ స జ్ఞేయః' అనునది మూలము. దీర్ఘాచ్చునకును దీర్ఘాచ్చుతోఁగూడిన హల్లునకును దరువాత బిందుసామాన్యమును విధించువ్యాకరణ విధులచేఁ గలుగు పూర్ణబిందువు నిత్యముగ సంభవింపదని సూత్రార్థము. ఇట్లనుటంజేసి శబ్దసహజమగు పూర్ణమును, నట్టిఖండమును, సాధ్యఖండమును నుండఁదగునని విశద మయ్యెను. జిత్తు బిందుపూర్వం బగు నను మొదలగు బిందుసామాన్యమును విధించువిధులచే ఖండపూర్ణములు రెండును నాయాచోటులఁ గలుగుచుండ నీసూత్రము దీర్ఘముమీఁదఁ బూర్ణమును వారించుటకై సూత్రిత మయ్యెనని సూరియాశయము నభివర్ణింపఁదగును. దీన నీసామాన్యసూత్రము బిందుసామాన్యమును విధించువిధులతోఁ జేరి దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము గాదని యడ్డుచు, శాస్త్ర మేయేచోటులందుఁ గంఠోక్తముగ దీర్ఘము మీఁదఁ బూర్ణమును విధించునో యట్టిచోటులందె సాధ్యపూర్ణమునునికిని దోఁపఁ జేయునదగును.

వాఁడు, వీఁడు:—ఈరెండిటియందును ప్రథమైకవచనమగు డుఙ్ అనుదానికిఁ బూర్వము జిత్తు బిందుపూర్వం బగుననువిధిచే ఖండపూర్ణములు రెండును ప్రాప్తములుగా దీర్ఘముమీద నగుట ఖండమే సిద్ధించెనని గ్రహించునది. వాండు, వీండు, అనురూప ములు గలుగవనుట. రాఁడు, లేఁడు:—వ్యతిరేకార్థకము లగువీనికిఁ బ్రథమపురుషైక వచనమున డుఙ్ ప్రత్యయమునకు ముందు నెఱసున్న దీర్ఘముమీఁదఁగానఁ గలుగలేదు. కాఁబోలు, కాఁబట్టి:— 'కాను' అను నుజ్యంతముమీఁద పోలుపట్టులు పరములుగా సరళాదేశము గలిగినపిదప నాదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసామాన్య విధిచే ఖండపూర్ణములు రెండును గలుగుచుండఁ బూర్ణ మీసూత్రముచే వారింపఁబడి నది. గోఁగులు, రేఁగులు:—గోను రేనుశబ్దములతుది నువర్ణమునకు గుఙ్ కలుగగా గుఙ్కు ఙకారము పోవుప్రత్యయముగాన జిత్తు బిందుపూర్వంబగు సామాన్యబిందువిధిచే ఖండపూర్ణములు రెండును ప్రాప్తింపఁగాఁ బూర్ణము వారింపఁబడియెను. వాండిత్యాది

పూర్ణబిందురూపములు నన్నెచోడాదిగ్రంథములందుఁ బ్రాసములలోఁ గానంబడియెడి. నిందుసున్నయే ప్రాచీనరూపమును దానిని దెల్పఁబలుకుటచే నర్ధబిందువును, నేర్పడెఁ గానఁ బ్రాచీనమున నట్టిరూపములు గలుగుట యవిరుద్ధము. కాన నిందుసున్న నే యుద్దిష్టముగఁ జేసికొని యర్ధబిందువును విధేయముగఁ జేయుట యుచితము. ఇందలియుదాహరణములలోని యర్ధబిందువులెల్ల సాధ్యములే యగుట నిది సాధ్యబిందువిషయక మనుట పునరుక్తము.

## సంస్కృతసమేతరములయిన తెలుఁగుశబ్దములయందుఁ బరుష సరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది. ౧౬.

వంకర - కలఁకువ - మంచె - త్రాఁచు - దంట - దాఁటు-కొంత - కోఁత ఇత్యాదు లూహ్యంబులు.

టీ. సంస్కృతసమమనఁగాఁ దెలుఁగుప్రత్యయములు మాత్రము చేరిన సంస్కృతప్రకృతులు. ఇట్టివిదప్ప నితరములందు—ప్రాకృతసమ-సంస్కృతభవ-ప్రాకృతభవ-దేశ్యములందు, క చ ట త ప గ జ డ ద బ అనునక్షరములకుఁ బూర్వమే యుండిన బిందువుండునని తాత్పర్యము. వీనిపూర్వమునఁ దప్పక యుండవలె నను నియమములేదు. ఉన్న వీనికిఁ బూర్వమే తోఁచునుగాని యితరహల్లులకు ముందుండదు. కంసాలిపదము మాత్ర మీవిధికి వ్యతిరేకము. కమసాలిలోని మకారము వ్యవహారమున బిందువయ్యె. కాని యీవిధిచే నిందు బిందువు వ్రాఁత విరుద్ధమేయగుఁ గానఁ గమసాలి యనియే సాధురూప మనఁదగు. 'తృతీయే ప్రథమే వర్ణే పర ఏవ హి దృశ్యతే బిందురైకృతమధ్యే తు నాన్యవర్ణే పరే తు సః' అనునాథర్వణము మూలము.

ఈనియమముచేఁ బ్రాకృతసమభవ-సంస్కృతభవ-దేశ్యరూపమగు తెలుఁగున బిందువాకరీతిగ నుండిన నెచట నుండునో కొంతగఁ దెలిసికొనుట సుకరమగును. ఈవిధి సామాన్యముగ సిద్ధములనే గాక సాధ్యముల నెఱింగించుటకును దోడుపడెడి.

## యకారంబును వు వూ వొ వో లును దెలుఁగుమాటలకు మొదట లేవు. ౧౭.

ఎవఁడు-ఎక్కడ-ఏమి-ఏల - ఉండ-ఊరు - ఒకఁడు - ఓడ. హరి యతఁడు-నిద్రవోయె నిట్టిచోట్ల సంధివశంబున వచ్చిన యకార వకారంబులుగాని పూర్వసిద్ధంబులు గావు. వోఢృ వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృతసమంబులందు సహితము వు వూ వొ వో వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది. ఉదకము - ఊర్మిక - ఓదనము.

టీ. స్వతంత్ర ప్రయోగార్హములైన తెలుఁగుమాటలకు మొదట యకారమును ఉ ఊ ఒ ఓ లతోఁగూడిన వకారమును జూపట్టవు. వు వూ వొ వో లనుటంజేసి పదాది నాయచ్చులతోఁ గూడిన వకారమే యుండదనియు,నితరాచ్చులతోఁ గూడిన వకార ముండఁదగుననియు, యకారసామాన్యమునే పేర్కొనుటంజేసి యేయచ్చుతోఁ గూడిన యకారమును బదాది నుండఁదనియు గ్రహింపవలెను. ఇది కేవలము తెలుఁగుపదముల కగువిధి. దీనిచే యెవఁడు, యెప్పుడు, యేమి అనుమున్నగువానియందలి పదాదియకా రముల హలంశములును, వుండ, వొకఁడు, వూరు, వోడ, వుండు మొదలగువానియందలి పదాదివకారముల హలంశములును, బరిత్యాజ్యములని తెల్లమయ్యె. కాన ఎవఁడు, ఎప్పుడు, ఏమి, ఉండ, ఊరు, ఒకఁడు, ఓడ, ఉండు అనునవియే సాధువులనియు, యకార-వకారములు గలవసాధువులనియు విశదమయ్యెను. లాక్షణికులమతమున శేష షష్ఠీప్రత్యయమైన యొక్క యకారాదిపదమే యైనను నద్దానికి స్వతంత్రప్రయో గము లేమింజేసి యది వాక్యాదినుండి పదాదియకారమును స్థిరపఱుపఁ జాలదుగాన నది దీనికి బాధకము గాఁజాలదు. తత్వ మరసిన ఏకఒక్కయొక్కలపరిణామము తెల్లమగుంగాన నది యకారాదిపదమే గాదనియు నాయాశబ్దములపైఁ జేరినపుడు సంధ్యభావమున నైన యడాగమముతోఁ గూడి యొక్క యై లాక్షణికదృష్టికి యొక్క యయ్యెననియుఁ దోఁచెడి.

పదాదిని యవ లుండకున్న "హరి-యతఁడు-నిద్రవోయె" అనుపదములయాదిని యవ లెట్లు కల్గెనని శంకించికొని యట్టిస్థలముల వ్యాకరణముచేఁ గలిగిన యవలుగాని శబ్దముపుట్టుకతోఁ గలిగినవి గావని సమాధానమును వ్రాసినవాఁడు. పూర్వసిద్ధములు = శబ్దమునందుఁ దొలుతనుండి యుండినవి. సంస్కృతసమంబులలోఁ గూడ మూలమున నిచ్చిన రెండుశబ్దములు దప్ప ఉ ఊ ఓ లతోఁ గూడిన వకారమాదినిగలపదము లేదని భావము. పొట్టి ఒకారము సంస్కృతమున లేనేలేదు గాన దానితోఁగూడిన వకారము మాట సంస్కృతసమప్రస్తావన యగునిందుఁ దలంపఁబడలేదు. వోఢృవోఢవ్యేతర సంస్కృతసమములందును వు వూ వొ వో, అనునవి యాదియందుఁ గలపదములు లేవనెనుగాని 'వోళికా, వోఢా, వోరకః, వోఢజః' అని వోకారమాదియందుఁ గలశబ్ద ములు సంస్కృతకోశములం దగపడుచున్నవి. ఐనను సూరి, వు వూ వొ వో లలోఁ నొక్క వోకారాది శబ్దములే కోశములందుఁ జూపట్టుటంబట్టియు నవ్వానికిని దఱచు గాఁ బ్రయోగ మాంధ్రకావ్యముల నగపడకుండుటంబట్టియు నిట్లు వ్రాసెనని యనఁదగు.

'ఆద్యః క్రియాసు భూతార్థద్యోతితమాద్యగం వినా సర్వః' అనుమూలము యెవఁడు యెపు డిత్యాదులందుఁ బదాదియకారమును వ్యవహారము ననుసరించి యంగీ

కరించినదిగానఁ గ్రియలలో భూతార్థమును దెలుపు (పోయెను) నట్టియుఁ బదము తొలినున్నదియు నగుయకారములను విడిచి తక్కిన తెనుఁగుపదముల నున్నయకారము లెకారవిశిష్టములని తెలిపినది. కావుననే సంధివేళలందు 'సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః' అని యాపదాదియకారమున కజ్వద్భావమును దానికి విధించికొనవలసి వచ్చినది. అనఁగా హలంశమును విడువవలెననుట. మూలము 'యవడు, యప్పుడు' మున్నగునవి యెత్వవిశిష్టములుగాని యత్వవిశిష్టములు గావని సరసముగ వ్యవహారోచ్చారణము నున్నదాని నున్నట్లు తెల్పుచు సంస్కరించి సాధురూపములఁ జూపి సంధిసమయముల నపరూపములు గలుగకుండ దాని హలంశమును, విడువవలెనని నిరూపించినది. కాఁగా 'వచ్చెన్ + యెపుడు = వచ్చెనెపుడు' అనియేగాని 'వచ్చెన్యెపుడు' అని గాదన్నది. అప్పకవ్యాదులు ''పదాదిని యకారము నంగీకరింపనేల ? దాని కజ్వద్భావమును విధింపనేల'' అని తలంచి కావలయు దాని నంగీకరింపనివారై 'అద్యః క్రియాసు భూతార్థసముద్యోతినం వినాసర్వః' అని అద్యగం అను పదాది యకారాంగీకార సూచకమగుదళమును దీసివైచి యొక్క భూతార్థకమగు యెకారము దప్పఁ దక్కినవెల్ల నత్వవిశిష్టములే యని తెలిపినారు. కాని పదాది యకారమున కజ్వద్భావమును విధించు సూత్రము చింతామణిలో నగపడుచుండుటం జేసియుఁ, జింతామణిశేషగ్రంథమగు నాథర్వణము 'వికృత్యాదిగతో యోఽత్ర స్యాచ్ఛబ్దాంతరయోగతః, ప్రాణమాత్రావశేషస్స్యాత్' అని వికృతిశబ్దాదిని యకారముండుటయును దాని హలంశమును సంధివేళలఁ బరిత్యజింపవలె ననుటయుఁ బ్రతిపాదించుచుండుటంజేసియుఁ, బదాదియకారాంగీకారపాఠమే ప్రాచీనమనుటకు సందియములేదు. అప్పకవీయమునఁ బదాదియకారమున కజ్వద్భావము విధించుసూత్రమును దానియాంధ్రీకరణమును లేనేలేవని యహోబలపతి వ్రాసినాఁడు. కాని ప్రకృతమచ్చుపడియున్న యప్పకవీయములందెల్ల నాకారికయును దానియాంధ్రీకరణపద్యములును నగపడుచున్నవి కాన నవి పదాదియకారము నంగీకరింపని యప్పకవిప్రణాళికకు విరుద్ధములగుటఁ దరువాతివారు తెలియక చేర్చినప్రక్షిప్తపద్యములని విశ్వసింపనగును. నన్నయచింతామణి పదాదినుండని వర్ణములఁ దెలుపునదిగాక సందేహనిర్ణయమొనర్చు నదగుటంజేసి పదాది నాయాయక్షరము లుండవనువిషయము నప్రసక్తముగ భావించెను. ''వికృతిపదాదౌ ప్రథమాంతఃస్థ తృతీయానునాసికౌ న స్తః (య-ణ) క్వచిదపి న స్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ(వు-వూ-వొ-వో)'' అను నప్పకవి చింతామణియు, దాని నీసందర్భమున ననుసరించిన సూరి బాలవ్యాకరణమును బదాదినుండని యక్షరములఁ దెల్పునవగుటంజేసి ఙ-ఞ-ళ యనునక్షరములు లాదియందుఁ గలపదము లుండ

వనియుఁ జెప్పకుండుట కొఱంత యనవలెను. ఎందును, ఙఞాదిపదములు లేమిని, నా వర్ణములు తెలుఁగువర్ణములుగామిని నిటఁ దలఁప నప్రసక్తములని విడిచెనని యుత్తర మీఁదగు.

## యరలవలు లఘువులని యలఘువులని ద్వివిధంబు లగు. ౧౮.

హరియతఁడు-ఇత్యాదులం దాగమ యకారము లఘువు-తక్కిన యకార మలఘువు. విఱుగు మెఱుఁ గిత్యాదులందు రేఫంబలఘువు. ఇదే శకటరేఫ మని చెప్పఁబడును. శకటరేఫము తత్సమ తద్భవము లందు లేదు. పెరుగు కరు గిత్యాదులందు రేఫంబు లఘువు. ఏఱులు పాఱులు త్రాఱులని బహుత్వమందు రలడల కాదేశ మయిన ఱకార మలఘువు. తల నెల యిత్యాదులందలి లకారము లఘువు. అతఁడువలికె నిత్యాదులందున్న పాదేశవకారము లఘువు. తక్కిన వకార మలఘువు. వర్ణసమామ్నాయమందలి ఱ-కారము వర్ణాంతరముగాని యలఘు ఱ-కారము గాదని యెఱుంగునది.

టీ. 'లఘువోఽలఘువశ్చేతి ద్వేధాంతస్థాన్ వదంతి శాస్త్రారః' అనునది మూలము. వీనికి సంస్కృతమున నంతఃస్థములని పేరు. నోటిలోపలిభాగము నంటి పలుకఁబడునవి గాన వీని కీపేరు కల్గెను. లఘువు = చులకనైనది. గురువు=బరువైనది తేల్చి పలుకఁబడునవి, (నొక్కి) యూఁది పలుకఁబడునవి యని భావము. సంధిరాని చోటుల నచ్చునకుఁ బరమందున్న యచ్చునకైన యకారము లఘువు. ఇట్లే సంధిలో పవర్ణమున కగువకారము లఘువు. ఆయాచోటుల రలడలకైన ఱ-కార మలఘువు. శబ్దసిద్ధములు యవలలఘువులు. వ్యాకరణముచేనైనవి లఘువులు. వ్యాకరణముచేనైన ఱ-కార మలఘువు. శబ్దసిద్ధమైనది లఘువు. శకటరేఫములెల్ల నలఘువులు. రేఫములెల్ల లఘువులు. కేవలము సంస్కృతప్రాకృతసమభవేతరంబగు పదజాతియందే యలఘురేఫము గన్పట్టునని సూరియాశయ మైనట్లు శకటరేఫము తత్సమతద్భవములందు లేదనువ్రాఁత స్పష్టపఱచుచున్నది. అలఘురేఫము శకటరేఫము శకటము బండిరాయనునవి సమానార్థకములు. సర్వలక్షణసారసంగ్రహకర్త ప్రౌఢవ్యాకర్త మొదలగువారు తద్భవపదములందును శకటరేఫ ముండుటను 'ఘురరీ = గొఱ్ఱె, పర=పెఱ, భీరు=పిఱికి, గరుత్=గఱి' అను మున్నగునుదాహరణముల మూలమున సూచించియున్నారు. వేదము లెట్లట్లె వర్ణము లనాదిసిద్ధములగుట వర్ణసమూహమునకు వర్ణసమామ్నాయ మనువ్యవహారము సిద్ధించెను. (౩ సంజ్ఞాసూత్రమున) తెలుఁగువర్ణములలోఁ దుదినున్న ఱ-కారము కాదుల వంటి స్వతంత్రవర్ణ మనియు, దానికి లఘ్వలఘుత్వములు లేవనియుఁ గాన దానిని మాత్ర

మలఘుళకారమని యుచ్చారణసాదృశ్యము ననుసరించి భావింపరాదనియుఁ దెలుపుటకై వర్ణ సమామ్నాయమందలి ళకారము వర్ణాంతరముగాని యలఘుళకారము గాదని సూరి వివరణమును వ్రాసెను. గుప్తార్థప్రకాశిక మాత్రము పైవివరణమునందలి కాని యనుదాని నగుధాతువ్యతిరేక నిజేరూపముగ నెన్ని వర్ణాంతరము గానటువంటి యలఘుళకారము గాదని నఙ్ద్వయఘటితముగ నన్వయించి వర్ణసమామ్నాయమునందలి ళకారము వర్ణాంతరమును నలఘువును నగునని వివరించినది. తళుకు బెళుకు మున్నగు వాని నలఘువులుగఁ జూపక యిందు లకారమున కలఘురూపము వ్యాకరణముచేఁ గలుగు ళకారమని స్పష్టముగఁ జూపుటచేతనే వర్ణసమామ్నాయమున నిట్టియాదేశ భూతమగుళకారమునకుఁ బ్రవేశము లేదనియు వర్ణసమామ్నాయమునందలి ళకారము కాదులవలె లఘ్వలఘుత్వముల నందని స్వతంత్రవర్ణమనియు స్పష్టమగుచున్నది. వ్రాఁతలో భేదమున్నను గురురేఫమును లఘురేఫభేదమగునలఘువుగనే స్పష్టపఱచుటం బట్టియు నిట్టియలఘువులకు వర్ణసమామ్నాయమునఁ బ్రవేశము లేదని విశదమగుచున్నది. లఘ్వలఘుయుపలవిషయమున శంకయే లేదు. ఐనను గుప్తార్థప్రకాశికవలె నేరైన విమర్శక పాఠకులు వర్ణసమామ్నాయగత ళకారమునకును నలఘువునకును గలయుచ్చారణతౌల్యమును బట్టియు లేఖనసాదృశ్యమునుబట్టియు నిదే యది యదే యిది యని భ్రమ ప్రమాదములకు లోనగుదురేమోయని సూరి యట్టిభ్రమప్రమాదములు గలుగుట కవకాశమీయకుండ నిట్టివివరణమును వ్రాసికొనెను. కానఁ బైసమన్వయము నిరాకరమనక తీరదు. మఱియు నిట్టివ్యతిరేకనిజ్యంత విశేషణ, వ్యతిరేకసమాపక క్రియలతోఁ గూర్చిన నఙ్ద్వయార్థకవాక్యములందు నిజ్యంతమునకును వ్యతిరేకసమాపక క్రియకును గర్తయొకటే యైయుండుట తెలుఁగువాక్యములందు సహజముగఁ జూపట్టును. ఇట్టి వాక్యములందు నిర్ధార్యము నిర్ధార్యముచేతనే నిర్ధారితమగును గాన నిజ్యంతవిశేషణ క్రియలకుఁ గర్త యొకటే గాక తీరదు. అది తప్పుగాని పనిగాదు. ఇందుఁ బని కర్త. ఇదియే నిజ్యంతమునకును సమాపక క్రియకును గర్త. 'వర్ణసమామ్నాయమందలి' అను నిందలివివరణవాక్యమున వర్ణసమామ్నాయమందలి ళకారమనునది కర్త. నిజ్యంతవ్యతిరేకసమాపకములగు కానికాదులలో నిజ్యంతమున కలఘుళకారమును సమాపకమునకు వర్ణసమామ్నాయమందలి ళకారమును గర్తలగుచున్నవి. ఇందు నిర్ధార్యమగు వర్ణసమామ్నాయగతళకారము తద్భిన్నమగు నలఘుళకారముచే నిర్ధారితమగుట చూపట్టెడి. ఇట్లు భిన్న కర్తృకత్వము భిన్నవిషయప్రదర్శనముచే నిర్ధార్యమును నిర్ధారణముచేయుట యనునవి వికల్పార్థకమగు కానియను నవ్యయముతో నైనవ్యతిరేకసమాపక క్రియాఘటితవాక్యములందే కనుపట్టును. కాన వర్ణసమామ్నాయమందలి యను సూరివివరణవాక్యము నఙ్

ద్వయార్థకము గాఁజాలదని నొక్కి పలుకుటే గాక యిందలి కానియనునది వికల్పార్థక మగుట వర్ణసమామ్నాయగత శకార మలఘువుగాదని స్పష్టముగ సిద్ధాంతీకరించునదిగాఁ జెప్పవలసియున్నది. సూరిమతమున వర్ణసమామ్నాయ గతశకార మలఘువని సిద్ధాంతీకరింప గుప్తార్థప్రకాశిక బద్ధకంకణమై వీని భేదమును మఱచినదిగానఁ గాని కాదులలోఁ గానియనుదాని కలఘుశకారమును గాదనుదానికి వర్ణసమామ్నాయగతశకారమును గర్తలై భిన్నకర్తృకత స్పష్టమగుచున్నను నేకకర్తృకమనియే భావించియుండనోపును. గుప్తార్థప్రకాశిక వర్ణసమామ్నాయమందలి యను సూరివివరణవాక్యపుఁ బ్రణాళికను దూచాతప్ప కనుకరించునదై 'కాశీవాసియగు బ్రాహ్మణుఁడు విద్వాంసుఁడుగాని విప్రుఁడుగాఁడు' అని యొక యపూర్వవాక్యమును సృజించెను. నఞ్ద్వయార్థకవాక్య మిది యేకకర్తృకముగాఁ దోఁచినను నిట్టివాక్యములం దొక్క విషయముననే గాని రెండుభిన్నవిషయములకు నిర్ధారణ మప్రసిద్ధమగుట నిట్టివాక్యరచన తెలుఁగువాక్యపద్ధతికి విరుద్ధమని చెప్పకతీరదు. ఇందుఁ గర్తృభూత బ్రాహ్మణు నందున్న బ్రాహ్మణత్వముననేగాక విద్వత్త్వమునకును నిర్ధారణము సిద్ధ మగుచున్నది. ఇట్టియెడల బ్రాహ్మణవిద్వాంసుఁడని రెంటిని నిర్ధార్యములు చేయుట తగును. తాఁ గ్రిందనిచ్చిన 'న చ నస్వీకృతమర్థగౌరవమ్' అనుదానిలో నర్థగౌరవమొకటియే నఞ్ద్వయమున నిర్ధారితమగుచుండుట దాను గన్నారఁ గాంచుచు నిట్టివాక్యమును గల్పించుట కలఘుశకార-వర్ణసమామ్నాయగతశకారముల మేళవించునభినివేశమే గదా కారణము. అలఘుశకారమే యగునెడల నలఘువులకు వేనికిని లభింపని వర్ణాంతరత్వమును దీనికొక్క దానికి లభింపఁజేయుటకుఁ బాటుపడిన నప్పాటయుక్తము గాకుండునా? కాన గుప్తార్థప్రకాశికయందలి యీసందర్భము నిర్మూలమనఁదగును.

ఇఁక వర్ణసమామ్నాయమున లేని యలఘుశకారము నాయాతావులందు రలడలకు నిత్యవైకల్పికములుగా నెట్లెచ్చటినుండి గొనివచ్చి బాలవ్యాకరణము విధించుచున్నదని వర్ణసమామ్నాయమందలిశకారము నలఘువుగఁ జేయు పూనికతో గుప్తార్థప్రకాశిక చూపు యుక్త్యంతరమును విచారింతము. అలఘులకారము పూర్ణముగ వర్ణసమామ్నాయగతశకారముననే యుచ్చారణసాదృశ్యము ననుసరించి పోలునదగుటచేత వర్ణసమామ్నాయగతశకారలేఖనముననే, కాలక్రమమునఁ బొందఁగల్గెననియు నట్టిలేఖన మద్దానికిఁ దనకాలమున సిద్ధమైయుండుటచే వానివాని కలఘూచ్చారణము గల్గుననుటకు మాఱుగా నలఘులకార మగునని చెప్పెననియు సంభావింపవలసియున్నదిగానఁ బైయుక్తియు నసాకరమె యనక తీరదు.

మూల మంతఃస్థముల లఘ్వలఘుప్రస్తావనను సూచనామాత్రముగ సూచించునదిగాని దానినే ప్రధానముగఁ గొన్నది గాదు. ముఖ్యముగ సంస్కృతప్రాకృతసాధా

రణముగాని రేఫాలఘుత్వమును మాత్రమే ప్రతిపాదించుట కారబ్ధమయ్యెనని యెన్న వలయును. మఱియు నానాఁ డలఘులకారమునకుఁ బ్రత్యేకలేఖనము లేదనువిషయమును 'రోలః' అని రేఫకు లకారమును మాత్రమే విధించుటనుబట్టియు డలలకుఁ దద్విధాన మగపడకుండుటంబట్టియు నాయాస్థలముల వానివాని కలఘుత్వమును యథాసంభవముగ నుచ్చరించుటను బాఠకులకే వదలుటంబట్టియు 'గురురతౌ చ బిందుయుంతౌ' అని బిందువుచే నలఘురలల గుర్తించుటనుబట్టియు విశదమయ్యెడి. కాన మూలము ననుసరించియు వర్ణసమామ్నాయగతళకారము కాదులవంటి స్వతంత్రవర్ణమే యనక తీరదు గాన దద్వివరణమగునిందును నది ప్రత్యేకవర్ణమే యనియు దాని నలఘువుగ నెన్నుట నిర్మూలప్రసంగమనియు సిద్ధాంతీకరింపనగును. దీననే 'రోళః' అను మూలపాఠ మమూలస్థ మయ్యెడి.

## సంస్కృత ప్రాకృతతుల్యంబగు భాష తత్సమంబు. ౧౯.

| సంస్కృతము. | | | సంస్కృతసమము. |
|---|---|---|---|
| రామః | ... | ... | రాముఁడు. |
| విద్యా | ... | ... | విద్య. |
| హరిః | ... | ... | హరి. |
| ధేనుః | ... | ... | ధేనువు. |
| భూః | ... | ... | భువి. |
| పితా | ... | ... | పిత. |
| గౌః | ... | ... | గోవు. |
| నౌః | ... | ... | నావ. |
| ద్యౌః | ... | ... | దివి. |
| హృద్ | ... | ... | హృది. |
| జగత్ | ... | ... | { జగత్తు<br>{ జగము. |

ఇత్యాదు లూహ్యాంబులు.

| సంస్కృతము. | | ప్రాకృతము. | | ప్రాకృతసమము. |
|---|---|---|---|---|
| అగ్నిః | ... | అగ్గీ | ... | అగ్గి. |
| ఆటిః | ... | ఆడీ | ... | ఆడి. |

| సంస్కృతము. | | ప్రాకృతము. | | ప్రాకృతసమము. |
|---|---|---|---|---|
| ఆలిః పఙ్క్తిః | ... | ఓలీ | ... | ఓలి. |
| కటుః | ... | కారో | ... | కారము. |
| గౌరవమ్ | ... | గారవం | ... | గారవము. |
| జటా | ... | జడా | ... | జడ. |
| మిరా | ... | మేరా | ... | మేర. |
| యమః | ... | జమో | ... | జముఁడు. |
| రాజ్ఞీ | ... | రాణీ | ... | రాణి. |
| శృఙ్గారః | ... | సింగారో | ... | సింగారము. |
| శ్రీ | ... | సిరి | ... | సిరి. |

ఇత్యాదు లెఱుంగునది.

టీ. 'తుల్యాతు సమా' అనునది మూలము. సంస్కృతమునకును బ్రాకృతమునకును సమమగుభాష తత్సమము. తత్ = ఆసంస్కృతప్రాకృతములకు, సమము=తుల్యమైనది. సంస్కృతప్రాకృతపదములు తెలుఁగున నున్నవున్నటులఁ బ్రయోగింప ననుకరణవిధిచేఁ దప్ప వీలులేమిని సమములయి యుండుటే సంభవింపదు. ఇఁక డుజాదిప్రత్యయయోగ మునంది తెలుఁగునఁ గలుగుట సామాన్యముగఁ జూపట్టును. అపుడును డుజాదులయోగ మునఁ బ్రాతిపదికముల కుత్వాదులును దుదిహల్లునకు ద్విత్వోత్వాదులును జూపట్టక మానవు. కాన నాయాహానినిబట్టి మాత్రము సమము గాదని యన నవకాశములేదు. అట్లు గాదన్న సమములె సామాన్యముగ లేకపోవలసివచ్చును. ప్రకృతిమధ్యమునందలి యక్షరము లెట్టిమార్పునందకుండుటయు డుజాదియోగమునసైన యుత్వాదులను మాత్ర మే చెందుటయుం సమలక్షణముగ సంభావింపవలయును. ఆదిభాషయందు భూద్యాల కగుసప్తమ్యంతములే (భువి, దివి) తెనుఁగునఁ బ్రాతిపదికము లగునని తత్సమపరిచ్ఛేద మునఁ జెప్పుటంజేసి యవి తత్సమములే, యని యంగీకరింపవలెను. 'రాముఁడు, ధేనువు, గోవు' డువులు చేరినసమముల కుదాహరణములు. హరి, విద్య:— ప్రథమైక వచనలో పముకలిగినసమముల కుదాహరణములు. 'జగత్తు జగము' అనునవి ద్విత్వోత్వములు, ముపర్ణకముఁ జేరినవాని కుదాహరణములు. ఇట్లే తక్కిన వూహ్యములు. కారమను బ్రాకృతసమమునకుఁ గటుశబ్దమును మూలముగఁ జూపుటకంటె వర్ణసారూప్యము నను సరించి క్షారశబ్దమును మూలముగఁ జూపుట యుచితమని ప్రౌఢవ్యాకర్త క్షారశబ్దము కారమర్థము గలదియె యని యర్థతౌల్యమును గూడ 'క్షారలవణవర్జనం చ' అని సప్ర మాణముగఁ జూపినాఁడు,

అగ్నీత్యాదులు ప్రాకృతపదములకు వర్ణసారూప్యముచే మిగుల దగ్గఱగా నున్న వియుఁ, బ్రాకృత ప్రాదికములంబోలి మార్పునందక యున్నవియు నగుట వానిని బ్రాకృత సమములుగఁ జేర్కొనెను.

## సంస్కృతప్రాకృతభవంబగుభాష తద్భవంబు. ౨౦.

| సంస్కృతము. | | సంస్కృతభవము. |
|---|---|---|
| ఆకాశః | ... | ఆకసము. |
| కుడ్యమ్ | ... | గోడ. |
| చన్ద్రః | ... | చేందురుఁడు. |
| తమఙ్గః | ... | తమగము. |
| తామరసమ్ | ... | తామర. |
| నారాచః | ... | నారసము. |
| నిభః | ... | నెపము. / నెవము. |
| ముఖమ్ | ... | మొకము. / మొగము. |
| మృగః | ... | మెకము. / మెగము. |
| వక్రః | ... | వంకర. |
| వేసరః | ... | వేసడము. |
| సముద్రః | ... | సంద్రము. |
| సూచీ | ... | సూది. |
| స్మరః | ... | మరుఁడు. |
| హరణమ్ | ... | అరణము. |
| హరితాళమ్ | ... | హరిదళము. |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము. | | ప్రాకృతము. | | ప్రాకృతభవము. |
|---|---|---|---|---|
| అఙ్గారః | ... | ఇంగాలో | ... | ఇంగలము. |
| అప్సరాః | ... | అచ్ఛరా | ... | అచ్చెర. |
| ఆశ్చర్యమ్ | ... | అచ్ఛేరం | ... | అచ్చెరువు. |
| పఞ్చాశత్ | ... | పణ్ణాసా | ... | పనస. |
| పృథివీ | ... | పుఢవీ | ... | పుడమి. |
| ప్రయాణమ్ | ... | పయాణం | ... | పయనము. |
| ప్రవాళః | ... | పవాళో | ... | { పవడము. పగడము. |
| మత్సరః | ... | మచ్ఛరో | ... | మచ్చరము. |
| యజ్ఞః | ... | జణ్ణో | ... | జన్నము |
| లక్ష్మీః | ... | లచ్ఛీ | ... | లచ్చి. |
| విష్ణుః | ... | విణ్హూ | ... | వెన్నుఁడు. |
| వైద్యః | ... | వెజ్జో | ... | వెజ్జే. |
| స్తమ్భః | ... | ఖంభో | ... | కంబము. |
| స్థూలమ్ | ... | థోరం | ... | తోరము. |

ఇత్యాదులు తెలియునది.

'ప్రకృతిద్వయజా తజ్జా' అనునది మూలము. సంస్కృతప్రాకృతములనుండి పుట్టినభాష తద్భవము. తత్=ఆసంస్కృతప్రాకృతములనుండి, భవము=పుట్టినది. వర్ణలోప-వర్ణాగమ-వర్ణవ్యత్యయముల నంది సంస్కృతప్రాకృతపదసంబంధ మూహాగోచరముగఁ జేయుపదజాలము తద్భవమని తాత్పర్యము. పట్టికయందలిభవములలోఁ గొన్ని సంస్కృతభవము లగుటయుఁ గొన్ని ప్రాకృతభవము లగుటయుం వర్ణసన్నిహితసంబంధముమూలము ననే యయ్యెను. వర్ణలోప-వర్ణాగమ-వర్ణవ్యత్యయాదివికారముల నందినపదములలో నేవేవి యేవేవితోడ దగ్గఱసంబంధము గలిగియుండునో వానివానిని నాయాసంస్కృతప్రాకృతభవములుగ నిర్ణయించెను.

ఇందలియుదాహరణములెల్ల సంస్కృతపదములు మూలముగఁ గలవియైగానఁ బ్రాకృతసమభవములనెల్ల సంస్కృతభవములుగ నిర్ణయించి ప్రాకృతసమభవవిభాగము లనావశ్యకము లనఁ జనును. కాని సంస్కృతమునఁ జూపట్టని ప్రాకృతదేశ్యములనుండి

కలిగినపదములు తెలుఁగున నేవైనఁ జూప శక్యమేని యవ్విభాగములకు సార్థక్యము సంభవింపకపోదు.

## త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు. ౨౧.

ఊరు - పేరు - ఇల్లు - ముల్లు - కోట - పేట - దూడ - మేడ - కోఁత - లేఁత - తావి - మోవి - ఇత్యాదు లరయునది.

టీ. 'ప్రవాహినీ దేశ్యా' అనునది మూలము. దేశ్యమనఁగా దేశమునఁ బుట్టినది. సంస్కృతప్రాకృతసమత్వముగాని భవత్వముగాని యించుకేని యూహాగోచరముగాని పదజాలము దేశ్యమని భావము. త్రిలింగదేశమనఁగాఁ దెలుఁగుదేశము. అందు వ్యవహారప్రసిద్ధమైనభాష దేశ్యమనంబడును. శ్రీశైల - దాక్షారామ - కాళేశ్వరము లను మూఁడు క్షేత్రముల శివలింగములు గలప్రదేశముగానఁ ద్రిలింగసంజ్ఞ దానికిఁ గలిగె నందురు. అనఁగాఁ బైమూఁడు శివక్షేత్రముల మధ్యవర్తి యగుదేశమని భావము. మూఁడు కళింగములు గలదేశముగానఁ ద్రికళింగమనుసంజ్ఞ కలిగెననియు దానినుండి త్రిలింగశబ్దము గలిగెననియుఁ గొందఱందురు. ప్రతాపరుద్రీయమునఁ ద్రిలింగపదము గనుపట్టుచున్నది. పైవివరణము త్రిలింగపదవ్యాఖ్యానావసరమునందద్వ్యాఖ్యాత కుమారస్వామి యజ్వ యొనర్చెను. ఈచర్చ దేశచరిత్రజ్ఞులదగుటంజేసి పరిత్యక్తము. నాఁడును బట్టియే భాషకును దానివ్యవహరించుప్రజలకునుఁ దెలుఁగువ్యవహారముకల్గెనని సూరియభిప్రాయపడుట స్పష్టము. ఇందలియుదాహృతులకెల్ల సంస్కృతప్రాకృతపదములసంబంధమూహాగోచరము గూడఁ గామింజేసి శుద్ధదేశ్యములని సూరియూహ. ప్రౌఢవ్యాకర్త మాత్ర మిందలి కోట కోట్టశబ్దభవముగను పేట పింతాశబ్దభవముగను దెలిపెను. ప్రకృతివికృతుల కర్థభేదము క్వాచిత్కమగుటను, సామాన్యముగ అకారాంతభవములకుఁ గాఁదగు నాంధ్రప్రత్యయము చేరమిని, కోటపేటలని జనవ్యవహారము ప్రసిద్ధమగుటను, సూరి కోటపేటలను దేశ్యములుగనే యెంచియుండును. పేట పల్లెయనునర్థము నిచ్చునది గాక (ముత్యాలపేట) యొకపరుసంజెప్పునదన్న నీచర్చకే సంగతిలేదు. పింతాభవమన్న పేటలో టవర్ణమునకు ముందర్ధబిందు వీడవలయును.

సలక్షణముగ సంస్కృతప్రాకృతసమభవములఁ దెల్పి తద్భిన్నముగ దేశ్యమును నిర్దేశించుటంజేసి సమభవదేశ్యరూపమగుతెనుఁగున కంతకునుఁ దెనుఁగులాక్షణికులు సంస్కృతప్రాకృతములనె మూలమనిరను విమర్శకోక్తి నిరాకరమయ్యెను. దేశ్యవిషయమునఁ దాము మూలమును జూపఁజాలక మిన్నకుండ వారిపై నానిందమోపుట కించుకేనవకాశము లేదు గదా! ఇఁక ద్రావిడభాషాసంబంధమును బరిశీలించి యాయావానికి

మూలముల నాయాభాషనుండి చూపెడు భాషాతత్త్వశాస్త్రజ్ఞత మాత్ర మాంధ్రలాక్షణి కులకు లేదనునంశము సత్యమనక తీరదు. కేవల మాద్యప్రకృతిం బరిశీలించినపండితులే యాంధ్రవ్యాకరణకర్తలును దద్విమర్శకులును నగుటయుం భాషాతత్త్వపరిశీలన మవ్వారి బుద్ధికి రానిదియైనగుట నమ్మార్గము తొల్లి యనాదృతమయ్యెను.

లక్షణవిరుద్ధంబగుభాష గ్రామ్యంబు. ౨౨.

వస్తాఁడు - తెస్తాఁడు - వచ్చేని - తెచ్చేని - వచ్చేవాఁడు - తెచ్చేవాఁడు - వచ్చేటివాఁడు - తెచ్చేటివాఁడు. ఈభాష ప్రయోగంబున కనర్హంబు.

టీ. 'అనియమాద్గ్రామ్యమ్', 'పామరాదిప్రయుక్తం యత్తద్గ్రామ్యమభిధీయతే' అనునవి మూలములు. లక్షణమనఁగా శాస్త్రము. వ్యాకరణశాస్త్రమునకుఁ గట్టువడని పదజాలము గ్రామ్యమని తాత్పర్యము. గ్రామ్యమనఁగా ననాగరకుల యసభ్యవ్యవహారము. గ్రామ్యము నియమరహితమగు మార్పుగలదిగాన నియమమునకు లొంగనిదానినెల్ల లక్షణకర్తలు గ్రామ్యమని వ్యవహరించుట యాచారమయ్యెను. అనుశాసనమునకుఁ గట్టు పడనివగుట నిందలి యుదాహృతులెల్ల గ్రామ్యములు. ఇట్టి యసభ్యమగు నియమమునకుఁ గట్టువడనిభాషను గ్రంథములఁ బ్రయోగింపరాదని గ్రహించునది. ఇందలిగ్రామ్యపదమున కసభ్యవ్యవహారమేగాక యనుశాసనవిరుద్ధమను నర్థమయ్యెడిఁ గాన, నుత్తరసూత్రము నందలి కఱకంఠాదులకును గ్రామ్యత కలుగుచున్నది. ఆలంకారికగ్రామ్యము, వైయాకర ణికగ్రామ్యమునని గ్రామ్యము ద్వివిధమగు. అర్థవిచారము ప్రధానముగఁ గొన్నవా రాలంకారికులు. శబ్దవిచారము ప్రధానముగ నెంచెడువారు వైయాకరణులు. ఇది వ్యాకరణముగాన నిం దర్థవిచారమువలనిగ్రామ్య మప్రసక్తమనుతలంపున నవిచారితము. 'గ్రామ్యం తత్తద్విధా సాధు' అను నాథర్వణము ననుసరించువాఁడై, ప్రౌఢవ్యాకర్తయుం నిట్టియసభ్యవ్యవహార మాయానీచపాత్రలధోరణికి నైజమైయుండునుగాన, నాయవసర ముల గ్రంథములందును నుపయోగింపనగునని వివరించెను. దీన నిట్టి యసభ్యనియమ రహితవ్యవహారము సామాన్యముగ గ్రంథప్రయోగార్హము గాదనుట స్పష్టపడెడి.

ఆర్యవ్యవహారంబులదృష్టంబు గ్రాహ్యంబు. ౨౩.

పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యంబయిన గ్రహింపందగు నని తాత్పర్యము. కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము.

---

టీ. 'కలకంఠముఖా హితాః' అను నాథర్వణము మూలము. ఇందుదాహృతము లెల్లఁ గవిప్రయుక్తములు. కాన నార్యవ్యవహార మనఁగాఁ దొల్లిటికవీశుల గ్రాంథిక ప్రయోగములె యయ్యెడి. తొల్లిటివారివ్యవహారమునకు గ్రంథప్రయోగములె శరణ్యములనుట నిర్వివాదము. కానఁ బూజ్యులగు కవుల గ్రాంథిక ప్రయోగములు నియమమునకుఁ గట్టుపడనివైనను బరిగ్రాహ్యములే ప్రయోగార్హములే యని భావము. అనుశాసనమునకుఁ గట్టుపడనియట్టి కవీశుల ప్రయోగములకు మాత్రమే గ్రంథప్రయోగార్హత యంగీకార్యము; కాని యట్టివానిని మఱికొన్నిటిని మాత్ర మనుకరణవిధిని గల్పించి ప్రయోగింపరాదు. ఇట్లనకున్న వ్యవహారమంతయుఁ బ్రయోగార్హమె యయ్యెడి. ఇవియెల్ల భారతప్రయోగములు.

'బహువ్రీహి స్త్రీసమఘటితంబ చూపట్టెడి' నను నియమంబునకుఁ గట్టువడమింజేసి కలకంఠుఁడు గ్రామ్యమయ్యెను.' (చూ. సమా. 6) 'కర్మధారయము త్రికపూర్వకమైయేని, స్త్రీసమపూర్వకమైయేని, మువిభక్తిచిహ్నితపదపూర్వకమైయేని, యగు' నను నియమమునకుఁ గట్టుపడనివగుటంజేసి, 'కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజేడలు' అనునవి గ్రామ్యములయ్యెను. తెలుఁగువిభక్తిచేరని సంస్కృతపదములకు వేనికి నేసమాసమును దెలుఁగుపదములతోడఁ గలుగదు గాన 'ప్రాణగొడ్డము జీవగట్టు' అనునవి గ్రామ్యములయ్యెను.

బాలసరస్వతి కలకంఠశబ్దమును మిశ్రబహువ్రీహిగ భావించి కలకంఠశబ్దగత తకారమును సమాసాంతప్రత్యయముగ సమర్థింపఁ బాటుపడెను. తదనుసారియై యహోబలపండితుఁడును దీని మిశ్రబహువ్రీహిగఁ దలంచి 'క్వచిదంతిమవర్ణస్య సమాసాంతత్వమిష్యతే' అనునథర్వణకారికను నలరువిల్తుఁ డిత్యాదులందు శబ్దగతముగాని యంతిమవర్ణమునకు సమాసాంతతనుగల్పించుదాని నాధారముగఁ జేసికొని యసంగతముగఁ గలకంఠశబ్దగతతకారమును సమాసాంతప్రత్యయముగఁజేయయత్నించినవాఁడు. 'కలకంఠముఖా హితాః' అని యథర్వణుఁడు 'గ్రామ్యం తత్తద్విధా సాధు' అను పూర్వార్థముచే వ్యావహారిక గ్రామ్య గ్రాహ్యతావసరమును ముందు దెల్పి పిదప మహాకవి ప్రయుక్తములగు వీనికిఁ బ్రక్రియం జూపఁ బాటుపడక సూరిపలెనే కవిప్రయుక్తములగుటఁ గ్రాహ్య మనుచుండ వీని ట్లసంగతముగ నథర్వణకారికకు ముడివెట్టి సాధింపఁ దలంచుట యసంగతముగాన నీసందర్భ మనాకరము. ప్రౌఢవ్యాకర్త కలకంఠశబ్దమును గరకంఠశబ్దభవముగాను, బ్రాణగొడ్డమును బ్రాణకుట్టకశబ్దభవముగాను, సంస్కృతకపిలశబ్దమునుండి కలిగిన కవిలశబ్దమొండు గలదనుచుఁ గపిలశబ్దఘటితసమాసత్రయమును గవిలశబ్దఘటితములుగాను సిద్ధాంతీకరించి, హంసయానభవములగు నంచయానేత్యాదు

లందు యానపదమవికృతంబై నిల్చినట్లే ప్రాణగొడ్డమునఁ బ్రాణపదము నిల్చెనని యుక్తిని గనుపఱచి చిన్నయసూరి గ్రాంథికగ్రామ్యములుగ నెన్నినవానిలో జీవగఱ్ఱకుఁ దప్ప నితరములకెల్ల సామాసికగ్రామ్యతను దొలఁగించినాఁడు. కఱ్ఱను నేసంస్కృతశబ్ద భవముగాను నిరూపింప శక్యముగామిఁ గావలయు దానిని మాత్రము వదలెను. అయినను నసాంధ్రవర్ణమగుఱకారయోగమునం జేసి కావలయు నాతఁడు తనశబ్దరత్నాకరమునఁ గఱకంఠశబ్దమును వైకృతగ్రామ్యముగ నిరూపించినాఁడు. రేఫశకటరేఫ ప్రాసానంగీకార మీశబ్దసాధుత్వమువిషయమున నిందఱ కిన్నిచీకాకులఁ గల్పించెను. శాసనముల గోపర్యాయముగఁ గవిలశబ్దము గన్పట్టును. కాని వాఙ్మయమున నిందలి సమాసత్రయమును వదలినచో నెచటను వ్యస్తముగఁ గాని సమస్తముగఁ గాని తెలుఁగున వర్ణపర్యాయముగ కవిలశబ్దమును నిరూపింప నశక్యము. కానఁ బ్రౌఢవ్యాకర్త కవిలశబ్దకల్పనమును గృత్రిమమే యయ్యెడి. మఱియు వీనిని సూరి పకారమధ్యములుగ నిరూపింప, వానియుఁబుసుఁ దలంపక, ప్రౌఢవ్యాకర్త వకారమధ్యములుగ నెన్నుట వింతగా నున్నది. ఇంతకు వవప్రాసానంగీకార మిట్టియసంగతసిద్ధాంతముల నాతనిచేఁ జేయించె ననుట యుచితము. అంచయానపదమున నుత్తరపదీభూతయానపద మవికృతమై గన్పట్టు. ప్రాణగొడ్డశబ్దమునఁ బూర్వపదీభూతప్రాణపదమె యవికృతాంతంబు. ప్రాణగొడ్డాంచయానలకు సమాసైక్యము లేదు. కాన వీనికి సాటియె లేదు. భవములలోఁ బూర్వోత్తరపదములలో నేదైన నవికృతాంతము గావచ్చుననినఁ గపిలశబ్దసమాసత్రయమును కఱకంఠేత్యాదులును సాధువులగుటయే గాక భవకల్పనమువలని ప్రయాసమును ఱకారమనాంధ్రవర్ణమగుటవలని గ్రామ్యతయుఁ దప్పిపోవును గదా! అట్లే జీవగఱ్ఱను జీవకాష్ఠశబ్దభవమన్న దాని గ్రామ్యతయుఁ దొలఁగుంగదా! కాన నివ్వాని విషయమున నైన త్రిలింగలక్షణశేషకర్తృసిద్ధాంతము లస్వరసములని తోఁచెడి. కవిప్రయుక్తము లగుట గ్రామ్యములను సూరిసిద్ధాంతమె రమణీయము.

కావ్యభాషకె వ్యాకరణము. కావ్యభాషాస్వరూపప్రకాశనమె వ్యాకరణప్రయోజనము. 'వచ్చాఁడు తెచ్చాఁడు,' అనునిట్టివి కావ్యములఁ గానరావు. కాన వ్యాకరణ మిట్టివానిని గావ్యప్రయోగానర్హములుగ నెన్నుట యుచితము. జనవ్యవహారముననున్న జీవద్భాష యనంతములగుమార్పుల నందుటయు, నాయాకాలపుఁగవులట్టిభాషయందలి పదజాలమును గ్రాంథికభాషానియమబద్ధముగఁ జేసి ప్రయోగించుటయుఁ గలదు. కాని వ్యవహారమున నున్నయట్లే యేగ్రంథములందును నేకవియును బ్రయోగించుట గానము. కాన గ్రాంథికభాష వ్యవహారభాషకంటె విలక్షణమగుట కలిగెను. జీవద్భాషాపరిణామ మొక కట్టుఁబాటునకు లొంగునది గాదు. ఆయాకాలపుఁ

గవు లాయావ్యవహారపదముల నున్నవున్నటులఁ బ్రయోగింపక సంస్కరించి ప్రయోగించుటంజేసి ప్రాచీనగ్రాంథికభాషానుకరణ మవ్వానియందుఁ దోఁపక మానదు. అనుకరణమునఁ బ్రమాదములుగలుగుట సహజమగుటం జేసి కొన్నిట వైరుధ్యము చూపట్టవచ్చును. కాని సామాన్యముగ నియమైక్యమే యగపడుచుండునుగాన గ్రాంథికభాషాస్వరూప మంతగ నియమశూన్యమున నవకాశము లేదు. నియమసాదృశ్యముంజేసియేని గ్రాంథికభాష సర్వజనసాధారణము గానోపును. ఏకాలమున నేమండలమున నున్నకవి యాయామండలములందలి యాయాకాలపు నియమరహిత వ్యవహారము నున్నదున్నట్లే గ్రంథముల నుపయోగించునేని, యాయాకాలములం దాయామండలములవారికె యవి యర్థమగుటయుఁ, దరువాతివారికిని దదితరమండలములవారికిని నవి దుర్గ్రాహ్యములగుటయుం, నొక్కొకమండలపుభాష కొక్కొకకాలపుభాష కొక్కొకనిఘంటు వొక్కొకలక్షణ ముదయింపవలసి యుండుటయు ననివార్యములగును. కాన సర్వకవుల గ్రంథములు సర్వసాధారణము లగుటకొఱకు, నియమైక్యముకలిగి సరూపత యూహ్యమగునట్లేని గ్రాంథికభాష యుండుట యావశ్యకము. కావుననే గ్రాంథికనియమశూన్యజనవ్యవహార మగ్రాహ్యమని లక్షణకర్తలు తీర్మానించుట జరిగెను. ఇందలి యుదాహృతులెల్లఁ గవిప్రయుక్తములే యగుట వ్యవహారశబ్దమును గవిప్రయోగవిషయముగ నెన్నుట యనాకరము గాఁజాలదు. గ్రామ్యసంజ్ఞకు సంబంధించిన విషయములం దెల్పునవగుట నీరెండుసూత్రములును సంజ్ఞాప్రకరణమున నుండఁదగినవి కానోపును.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము.

---

# సంధిపరిచ్ఛేదము.

అవ్యవహితోచ్చారణమున వర్ణములకుఁ గాని పదములకుఁ గాని కలిగిన కలయిక సంధి నాఁబడును. సంధియందగు వర్ణలోప-వర్ణాగమ-వర్ణాదేశాదుల నిరూపించు గ్రంథభాగముగాన సంధిపరిచ్ఛేద మనంబరగెను. తెలుఁగు సామాన్యముగ నజంతభాష గానఁ దఱచుగ నచ్సంధియే గాననగు. అర్థభంగము గానిచో నగు నవ్యవహితోచ్చారణమున నైనవర్ణలోపమే సంధిస్వరూపమని ఫలితము నెంచనగు.

## ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు. ౧.

పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడు.

| | | | | |
|---|---|---|---|---|
| రాముఁడు | ... | అతఁడు | ... | రాముఁడతఁడు. |
| సోముఁడు | ... | ఇతఁడు | ... | సోముఁడితఁడు |
| మనము | ... | ఉంటిమి | ... | మనముంటిమి. |
| అతఁడు | ... | ఎక్కడ | ... | అతఁడెక్కడ. |
| ఇతఁడు | ... | ఒకఁడు | ... | ఇతఁడొకఁడు. |

టీ. 'సంధిర్నాచోఽచ్యనుతః' అనునది మూలము. సంధి యనఁ గూడిక. ఆద్యంతవర్ణములయేకీభావము సంధియని సామాన్యలక్షణము. ఇది యచ్సంధిసందర్భ మగుటం జేసియు, నందుఁ దెనుఁగున విశేషించి పరరూపసంధియె చూపట్టుటం జేసియుఁ, దొలియచ్చునకును దరువాతియచ్చునకును దరువాతియచ్చాదేశమగుటయే సంధిలక్షణముగా నెన్నెను. పూర్వపరాచ్చుల రెండింటిస్థానమునఁ బరాచ్చు నిల్చుట యచ్సంధిస్వరూపమనుట స్పష్టము. 'పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భవేత్' అనునాధర్వణమీమాటకాధారము. ఆదేశమనఁగా నున్నదానిని లేక యున్నవానిని ద్రోసి యొకటి దానిస్థానమున లేక వానిస్థానమున నిల్చుట. వర్ణద్విత్వమును నుమ్టుగాగమాదులును ద్రుతమునకగు బిందుసంశ్లేషాదులును నవ్యవహితోచ్చారణమూలకములే యగుటనయ్యవి సంధిపరిచ్ఛేదవిషయకములేయని సంభావింపవలెను. కాన కేతనాదులు చెప్పినట్లు పూర్వపదాంత్యవర్ణ ముత్తరపదాదిమవర్ణముతో నితరావ్యవహితమై కలియుటయే

సంధి యనుట లెస్స. రాముఁడు+అతఁడు:—ఇందుఁ బూర్వపదాంత్యాచ్చగు ఉకారము నకుఁ బరపదాద్యచ్చగు అకారము పరముఁగాగ నీసూత్రముచే నారెండచ్చులకును బరపదాద్యచ్చగు అకార మాదేశముగా 'రాముఁడతఁ' డయ్యెను. ఇట్లే తక్కినవుదాహ్యాములు. వ్యాకరణశాస్త్రపద్ధతిలో తకారవ్యంజనముఁ (త్) జేర్చినవి తత్కాలముచే యనఁగా నిర్దిష్టమగు నవస్థనే తెల్పున వగుటంజేసి సూత్రస్థమగు 'ఉత్' అనునది హ్రస్వోకారమునే తెల్పెడి. సంస్కృతమునుండి తెలుఁగునఁ గలుగు దీర్ఘాంతశబ్దములకు హ్రస్వము వెంటనే కలుగునుగానఁ దెలుఁగున నవి హ్రస్వము లైయే యుండును. అపుడు వాని కాయావిధులచే సంధి కలిగెడి. ఏకాక్షర సంస్కృతశబ్దములకును దేశ్య దీర్ఘాంతములకును హ్రస్వము సంభవింపమింజేసి యవి యాయాసంధివిధులకు విషయ ములు గాఁజాలవు. ఇదంతయుఁ బరీక్షించియే సూరి యత్వేత్వోత్వసంధివిధులందు తకారవ్యంజనమును "అ, ఇ, ఉ." అను నచ్చులకుఁ జేర్చి (అత్, ఇత్, ఉత్,) హ్రస్వములకు మాత్రమే సంధి విధించెను. 'అత్తు, ఇత్తు, ఉత్తు,' అను ద్విత్వోత్వరూప ము లుగాగమద్విత్వములనందినవని యెఱుంగునది. (చూ. తత్సమ. 68.)

ద్రుతపూర్వములగు ఉకారముల కీసూత్రముచే సంధి రాదనునంశము ప్రథమే తరేఁకాదిసూత్రసందర్భములచే స్పష్టమయ్యెడి. అఖండపదమున కవ్యవహితోచ్చార ణము సంభవించుట సహజము. వ్యస్తములగు పదముల కవ్యవహితోచ్చారణ మైచ్ఛి కము గానోపునుగాన నట్టివైచ్ఛికతను దొలఁగించి నిత్యముగ సంధి విధింప నీసూత్ర మారబ్ధమయ్యెను. సంస్కృతమునఁ బ్రత్యయప్రకృతులయు, ధాతూపసర్గములయుఁ, సమాసాంతర్గతపదములయుఁ సంధి మానరానిది. ఇతరములగుతావుల నది వైచ్ఛికము. తెనుఁగున వాక్యారంభముమొదలుకొని వాక్యాంతమువఱకు నడుమ నేదేనొకసంధి గాకతీరదు. కానఁ దెలుఁగువాక్యముల విసంధియే గనుపట్టదనుట స్పష్టము. ఇందు వికల్పార్థకము లెవ్వియు నగపడమి నీవిధి నిత్యమని గ్రహించునది.

## ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగానగును. ౨.

| | | | | |
|---|---|---|---|---|
| నన్నున్ | ... | అడిగె | ... | నన్నడిగె. / నన్నునడిగె. |
| నాకొఱకున్ | ... | ఇచ్చె | ... | నాకొఱకిచ్చె. / నాకొఱకునిచ్చె. |

| | | | |
|---|---|---|---|
| నాకుఀ | ... | ఆదరువు ... | నాకాదరువు. నాకునాదరువు. |
| నాయందుఀ | ... | ఆశ ... | నాయందాశ. నాయందునాశ. |
| ఇందుఀ | ... | ఉన్నాఁడు.... | ఇందున్నాఁడు. ఇందునున్నాఁడు. |
| ఎందుఀ | ... | ఉంటివి ... | ఎందుంటివి. ఎందునుంటివి. |
| వచ్చుచుఀ | ... | ఉండెను. ... | వచ్చుచుండెను. వచ్చుచునుండెను. |
| చూచుచుఀ | ... | ఏగెను ... | చూచుచేగెను. చూచుచునేగెను. |

టీ. 'అనాదిషు విభక్తిషూతో వా' అనునది మూలము. ద్రుతపరకములగు ద్వితీయాదివిభక్తులందలి ఉకారములకును, శత్రర్థక చువర్ణమునందలి యుకారమునకును నచ్చు పరమగునపుడు సంధి వికల్పముగా నగును. వికల్పమనఁగా నొకమాఱు కలుగుట యొకమాఱు కలుగకుండుట. శత్రర్థకచువర్ణము క్రియాపరి. 43-వ సూత్రముచే సిద్ధించును. ఇది ద్రుతాంతము. ఇది ద్రుతపూర్వోకార సంధివిధానమగుటం జేసి పూర్వపరాచ్చులకు నడుమనుగల ద్రుతము వాని యవ్యవహితత్వమును జెఱచునదిగ భావింపరాదు. మఱియుఁ బూర్వపరాచ్చులనడుమ నున్న ద్రుతము సంధివిధానసామర్థ్యముచేతనే లోపించునదిగఁ దలంపవలెను. సంధిలో నవసానమున ద్రుతస్వరద్రుతలోపముల విధించువిధినిఁ బ్రవర్తింపఁజేయుట యస్వరసమని తోఁచెడి. ఇంతియగాక తృతీయాదివిభక్తులకు నుమాగమమును విధించువిధులను, యుష్మదస్మదాత్మార్థకములకు ద్వితీయైకవచనబహువచనములందు 'నిన్నును, మిమ్మును, నన్నును, మమ్మును, తన్నును, తమ్మును,' అనురూపముల నిపతించు సూరి వ్రాఁతయు వచ్చుచును నని శత్రర్థమును సాధించు ప్రణాళికయుఁ బ్రథమేతరవిభక్త్యుకారములకును బరపదాద్యచ్చునకును నడుమ నున్నది యుత్వవిశిష్టనకారమని యనకతీరదు. అట్లయ్యు నిందు సూరి ద్వితీయాదివిభక్తులయు శత్రర్థకములయుం ద్రుతమును బొల్లురూపముగ నిర్దేశించి సంధిని విధించుటనుబట్టి ద్రుతప్రకృతికము సంధివిషయముగా దాని ద్రుతము లుప్తాచ్కమై యచ్సంధిలో నదృశ్యమగునని యనుమానింపవలసి

యున్నది. 'అచాం సంధౌ ద్రుతోఽదృశ్యః స్థితోఽపి చ భవేత్సదా' అనునాథర్వణ మిందులకుఁ బ్రమాణము. నన్నున్ + అడిగె:— ఇది ద్వితీయావిభక్తిస్థోకారమున కుదాహరణము. పూర్వపదాంత్యాచ్చగు ఉకారమునకును బరపదాద్యచ్చగు అకారమునకును బరపదాద్యచ్చగు అకారమే యాదేశమగుట 'నన్నడిగె' నయ్యెను. ఇది వికల్పవిధిగాన సంధి కలుగకున్నఁ బొల్లునకారము పరపదాద్యచ్చుతోఁ జేరును గాన 'నన్నునడిగె' నగును. లేదా పూర్వసూత్రముచే ద్రుతమువీఁది యుకారమునకును సంధియయ్యెననియేని సంభావించునది. ఇట్లే 'నిన్నడిగె, నిన్నునడిగె, మిమ్మడిగె, మిమ్మునడిగె'అను మొదలగు యుష్మదస్మదాత్మార్థక ద్వితీయైకవచనబహువచనరూపముల సంధిప్రక్రియ నూహించునది. పైరూపములు ద్విత్వరహితము లగునపుడు సంధి రాదని ద్విత్వరహితములగు ద్వితీయోకారములకు సంధి రాదనుసూత్రముచేఁ బ్రౌఢవ్యాకర్త శాసించి ననేలె మొదలగురూపముల వారించెను. కాని వీనినేగాక యిట్టివానిని మఱి కొన్నింటినిగూడ జడ్డక్కారంబు పదాదిస్వరముతోఁ గూడునపుడు జడ్డుకు లోపంబు లేదని శాసించి సూరి వారించువాఁడుగానఁ ద్రిలింగలక్షణశేషకర్తృప్రయాసము వ్యర్థమని తోఁపనగు. కాని జడ్డక్కారేత్యాదిసూత్రము జడ్డలులేని ద్వితీయోకారముల నీసూత్రమునకు విషయములు గాకుండ నడ్డఁజాలనిదగుటను, జడ్డక్కారము సంధించునపుడే యడ్డఁగలుగుటను త్రిలింగలక్షణశేషకర్త కట్టిప్రయాసము కలిగెనన వచ్చు; కాన ద్వితీయోకారములు సద్విత్వములు తమసహజద్విత్వరూపములతోడ వెలయునపుడే వానియుత్తులు సంధివిషయములగుఁగాని లాతిచోఁ గావనుఫలితమును బాఠకులు మఱువరాదు. 'నన్నున్' ఇత్యాదులందలి యుకారము విభక్తిస్థోకారము గాదు. నువర్ణకోకారము గాదగుంగాని యవి యదృశ్యమయ్యెను. కాన నీసూత్రమిట్టివానియందు వర్తింపదని శంకింపనగును. సూరి వీనిని ద్వితీయాంతములుగా నిపతించుటను బట్టియు నిశ్శంకముగ ద్వితీయావిభక్త్యుకారముగ నిందుదాహరించుటను బట్టియు విభక్త్యుకారమే యని విశ్వసింపవలెను. "న్నుమ్మూహ్రస్వశ్చాదేరమిశసి చ" అని వీనిప్రక్రియను సాధించుమూలమున కేతఁడు ద్వితీయైకవచన బహువచనములందుఁ బ్రత్యయముల కాదేశములుగా 'న్ను,మ్ము' అనునవి కలుగునను నర్థమును జేసెనని యనుమానింతమన్న నింక ద్వితీయాప్రత్యయము లేమి నువర్ణము కలుగుట యసంభవమై 'నన్నున్' అని యుదాహరించుటే యసంగతమగును. కళలుగాని వానికి ద్రుతము తగిలియుండుననుశాస్త్రము (ఆన్యేద్రుతప్రకృతయో యేస్యుర్హ్యానుజీవితద్రుత 'నిత్యమ్) చింతామణియందువలె నిందుఁ గానరామి నీయూహయుం నస్వరసమే యగుచున్నది.

అమ్‌శస్సులు పరముగా న్ను,మ్ము కలిగెనని యాతఁడు భావించెనని యూహింతమన్న 'నన్నును' ఇత్యాదులందలి నువర్ణకోకారమే విభక్తిస్థోకారము గాఁదగుటయు 'న్నుమ్మూ'లయుకారము గాకపోవుటయు సంభవించి యిందుఁ బొల్లులతో వాని నుదాహరించుటయే యసంగతమగు. ఇఁక సంస్కృతసంప్రదాయము ననుసరించి యమ్యవయవముగను శసవయవముగను న్నుమ్మూలు గల్గెనని సూరి యూహించె ననుకొందమన్నను బ్రకృతులందలియుకారములు విభక్తిస్థోకారములు గాఁజాలవు. కాని ద్వితీయావయవమనుటం జేసి యవయవిధర్మ మవయవమునఁ గొంతవఱకుఁ దేవచ్చునని యాతఁడు భావించెనేమో తెలియకున్నది. లేక యిట్టిచిక్కుల గమనించియే ద్వితీయాంతములుగఁ జల్లగా నిపతించి యుదాహరించెనో? పైని వ్రాసిన త్రిలింగలక్షణశేషకర్తృధోరణిం గమనించినను నాతఁడును నన్ను నిత్యాదిద్విత్వములందలి యుకారములు ద్వితీయావిభక్త్యుకారము లనుభావనయే కలిగియుండెననుట తెల్లము. న్నుమ్మూలు ద్వితీయాసాధారణములును నితరవిభక్తిసాధారణములు గాకుండుటను గమనించు వీనిని ద్వితీయోకారములుగ నిరూపించెనని తోఁచెడిని. బాలసరస్వతి నన్నైలె ననుదాని నిద్దాని కుదాహృతిగఁ జూపలేదు. అహోబలపతి యమ్శస్సులకు, న్నుమ్మూ లాదేశములని యంగీకరించి 'అన్యే ద్రుతప్రకృతయో యే స్యుర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్' అనుదానిచేఁ దుదిని నకారము తవిలించి నన్నున్ ఇత్యాదులందలి యుకారముల విభక్తిస్థోకారము లనిపించి ప్రథమేతరసూత్రమునకు విషయములుగాఁ జేసి నన్నైలె నిత్యాదిరూపముల సాధించెను. చింతామణివిషయపరిశోధనకర్తయు 'నన్ను' అనుదానిద్విత్వమునందలియుకారమును ద్వితీయోకారముగఁ జింతామణి ననుసరించి సమర్థింప నవకాశము లేదనియే తెలిపెను. కాని దానివంటిదే యగు 'మమ్ము, తమ్ము, మిమ్ము' అనువానియందలి యుకారములను మాత్రము ద్వితీయోకారములుగ సమర్థింపఁ బూనుట వింతగా నున్నదనక తీరదు. మనశబ్దశస్సునకు మాత్రమే లకారాదేశమును, విధించుటంబట్టి, నీనాతాశబ్దములద్వితీయాబహువచనములకు లకారాదేశము గలుగదనియు 'మ్ము'రూపములమీఁది శస్ప్రత్యయము నపదాన్యవ్యయేత్యాదివిధిచే లుప్తమగుననియు దాన 'మమ్ము, మిమ్ము, తమ్ము' అనురూపములందు ద్విత్వములందలి యుకారములు ద్వితీయోకారము లగుచున్నవనియుఁ గావున నాయుకారముల ననాదిసూత్రసంధివిషయములుగఁ జేయనగుననియు, వ్రాయుచు, వానితుదిని 'అన్యేద్రుతప్రకృతయో, యే స్యుర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్' అనువిధిచే ద్రుతమును గూర్చి, మమ్మున్ + ఇట్లు = మమ్మిట్లు అను నట్టిరూపములనుసాధించెను. (చూ. చిం. వి. ప. పేరా 99) తామన్నట్లె

ద్వితీయా బహువచనప్రత్యయము నపదాన్యవ్యయేత్యాదిసూత్రముచే లుప్తమగుటంజేసియుఁ దత్స్థానమునఁ బ్రత్యయ మేదియుఁ గలుగకుండుటంజేసియు, 'మ్ము' అనునది ప్రకృతికి శస్సు పరముగా నాగమముగ వచ్చినదగుటంజేసియు, 'మ్ము' అనుదానియందలి యుకారము ద్వితీయోకారమన నెట్లవకాశమయ్యెనో తెలియకున్నది. 'రామున్ + అభిరామున్' ఇత్యాదులందు ద్వితీయోకారము లేమింజేసి, విభక్తిస్థోకారములు గన్పట్టని యాయా విభక్త్యంతములైనశబ్దములందలి యుకారమునకు సంధి రానేరాదను దానుచేసిననియమమునకు (చూ. చి. వి. ప. పేరా. 96) లుప్తవిభక్తులగుట విభక్తిస్థోకారములు లేనివై ద్వితీయాంశములుగ నున్న మమ్ము తమ్ము మమ్మిత్యాదులేల విషయములుగావో తోఁపకున్నది. నన్నయప్రయోగములను జింతామణి విరోధించునది కాదను తలఁపునఁ దత్ప్రయోగదృష్టిని దా మిట్లు చింతామణిసూత్రముల సమన్వయించుట జరిగెనని తోఁచెడి. నాకొఱకున్ + ఇచ్చె=నాకొఱకిచ్చె:—ఇది చతుర్థీవిభక్తిస్థోకారమున కుదాహరణము. నాకున్ + ఆదరువు=నాకాదరువు:—షష్ఠీవిభక్తిస్థోకారమునకుదాహరణము. నాయందున్ + ఆశ=నాయందాశ:—సప్తమీవిభక్తిస్థోకారమున కుదాహరణము. ఇందుఁ + ఉన్నాఁడు=ఇందున్నాఁడు. ఎందున్ + ఉంటివి=ఎందుంటివి:—ఈరెండును సప్తమీవిభక్తిప్రతిరూపకావ్యయము లగుటంజేసి వీనియందలి యుత్తులు విభక్త్యుకారసమములే యనుభావనతో వీనిని సూరి యుదాహరించెనందురు. కాని యత్తదిదమర్థకములగు నమహద్వాచకములగు, ఆ-ఈ-ఏ-శబ్దముల కందు వర్ణకము కలుగ సప్తమ్యేకవచనమున నేర్పడినరూపములుగ 'ఎందు-అందు-ఇందు'అను వాని నిరూపింప నగుటంజేసి పైయుదాహరణములందలి యుకారములు విభక్తిస్థోకారములని సమ్మతింపఁదగును. పక్షాంతరమున వానికి దేనియందు దానియందు దీనియందనురూపములు గలుగనగును. వచ్చుచుఁ + ఉండెను=వచ్చుచుండెను. చూచుచుఁ + ఏగెను=చూచుచేగెను:—ఈరెండును శత్రర్థకచువర్ణకోకారసంధి కుదాహరణములు. సంధి కలుగనపు డీరూపములంచెల్లఁ బూర్వపరాచ్చులనడుమ ద్రుతము నిల్చునుగాన నన్నునడిగె నిత్యాదిరూపము లగును. ప్రయోగప్రక్రియల దృష్టిని మూలముకంటె భిన్నముగ నిందు శత్రర్థకదళ మాదృతము. రాముఁ + ఈక్షించె. ఇత్యాదులందు విభక్తిస్థోకారము లేమి నీసూత్రముచే సంధిరాదనియు నిట్టివి ద్రుతప్రకృతికము లగుట నిఁకాదిసూత్రనిషేధమునకుఁ బాలై 'రామునీక్షించె' ననియేగాని 'రామీక్షించె'నను నట్టిరూపములు గలుగవనియు గ్రహించునది. ఉత్వసంధి కళోకారములకేగాని ద్రుతప్రకృతికోకారములకుఁ బ్రాప్తింపదుగాన 'రాముఁ + ఈక్షించె' ఇత్యాదులు తద్విషయములు గాఁజాలవు. కాని యిందు మొదటి యుత్వసంధిసూత్రము కళోకారపరమే యనునపుడు

ద్రుతాద్రుతప్రకృతికోకారములకు సంధిని విధించు సామాన్యసూత్రమే లేకుండుటచేతను, నుదాహరణములంబట్టి యట్లే యిత్వసంధిని నత్వసంధిని గళేకారాకారపరములను నపుడు ద్రుతాద్రుతప్రకృతికేకారాకారములకు సంధిని విధించుసామాన్యశాస్త్రము లగపడకుండుటచేతను, ద్రుతప్రకృతికోకారేకారాకారములకు సంధి ప్రాప్తియే లేమి నీవికల్పవిధియేగాక నిఁకాదినిషేధము, నేమ్యాదివికల్పవిధి యత్వసంధివికల్పవిధి మున్నగునవి శాస్త్రసంప్రదాయవిరుద్ధవిధు లనవలసివచ్చును. నిషేధముఖముగనో నిత్యముఖముగనో యాయాసామాన్యవిధుల నారంభించి యాయావానికి విశేషవిధులచే నిత్యవైకల్పికత్వములఁ గల్పించుట శాస్త్రసంప్రదాయము. కావుననే దీనిమూలమగు చింతామణి 'సంధిర్నాచోఽచ్యుతః'అని యుకారభిన్నమునకు సంధి రాదని నిషేధముఖముగ సంధి నారంభించి యాయావిశేషవిధులచే నాయాయచ్చులకు సంధిప్రాప్తి లేనివానికి నిత్యవైకల్పికసంధులను సమకూర్చుచున్నది. కాన నుత్తునకె యచ్చు పరంబగునపుడు సంధియగునని యవధారణముంజేర్చి సూత్రించిన నాయాతక్కుంగల నిత్యవైకల్పికవిధులకు సార్థక్యము సంభవించి శాస్త్రసంప్రదాయము సురక్షిత మయ్యెడి. మఱియు నుత్వేత్వాత్వసంధి సామాన్యసూత్రములు ద్రుతప్రకృతికాద్రుతప్రకృతిక సామాన్యములని యెన్ని ద్రుతప్రకృతికాచ్చులను గూడ వానికి విషయములంజేసి యిఁకాదిసూత్రనిషేధమునకు సార్థక్యమును గల్పించుటయు నావశ్యకమే యనక తీరదు.

ప్రథమేతరసూత్రము ననుసరించియు, నిఁకాదిసూత్రప్రారంభము ననుసరించియు, నేమ్యాదిసూత్రమునఁ గిషష్ఠిని జేర్చుట ననుసరించియు, ద్రుతమధ్యస్థితి స్వరసంధిప్రతిబంధకము గాదని యనక తీరదు. కాన నుత్వాత్వేత్వసంధివిధులు ద్రుతప్రకృతికాద్రుతప్రకృతికసాధారణము లయ్యెడి. కాఁగా నెచటఁ గంఠోక్తముగనే ద్రుతప్రకృతికములకు స్వరసంధి విహితమగునో యవిదక్క నన్యములెల్లను, నాయాయాస్వరసంధివిధులకు గుఱియై యిఁకాదిసూత్రనిషేధమునకుఁ బాలగునని యెన్నవలసియుండును. ఇట్లనునపుడే యిఁకాదిసూత్రనిషేధమునకు సార్థక్యమును, నిఁకాదిస్వరసంధివిధానమునకు సాఫల్యమును, "ప్రథమేతరవిభక్తిపిధినిరవకాశంబుగావున దీనిని బాధించెడి" నను సూరివాక్యమునకు సాధారతయు, నుత్వేత్వాత్వసంధిసూత్రములు సామాన్యములు కళావిషయము లనుట కాధారమును,గుదురుపడెడి. సూత్రమున శత్రర్థకచువర్ణకోకారమున కనుటంజేసి యుఁన్నశబ్దము పరంబగునపుడగు చువర్ణకోకారమున కీవిధి కలుగదని గ్రహించునది. (చూ. క్రియాపరి. 14 సూ.) ఈరెండు చువర్ణములకుఁ గల భేదము క్రియ 14 లోఁ గాంచునది.

సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయినస్వరంబునకు యడా
గమంబగు. 3.

ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు.

| | | | | |
|---|---|---|---|---|
| మా | ... | అమ్మ | ... | మాయమ్మ. |
| మీ | ... | ఇల్లు | ... | మీయిల్లు. |
| మా | ... | ఊరు | ... | మాయూరు. |

టీ. 'యశ్రుతిమార్యాలఘుయం ప్రవదంతి ప్రాణతః పరం ప్రాణమ్' అనునది మూలము. సంధిరానిచోటులందు స్వరమున కవ్యవహితపరముగ నున్నయచ్చునకు యడాగమ మగును. ద్రుతప్రకృతికాచ్చులకు సంధిరానపుడు పూర్వపరాచ్చులనడుమ నకారమే నిల్చియుండునుగాన నం దీసూత్రము వర్తింపదని గ్రహించునది. కాఁగాఁ గళలగు స్వరములకు సంధిరానపుడు పరస్వరమునకు యడాగమము కలుగునని తేలినది. 'యట్ + ఆగమము=యడాగమము.' ఆగమమనఁగా నున్నదుండఁగా నధికముగ మఱియొకవర్ణము కలుగుట. టకారపుఁబొల్లు తుదిం జేర్చి నిర్దేశించినయాగమము నిర్దిష్టమున కాద్యవయవముగఁ గలుగునని సంస్కృతవ్యాకర్తలసంప్రదాయము. 'యట్' అనుదానియందలి టకారమునకు నిర్దిష్టమున కాద్యవయవముగ నది కల్గుటయే ఫలము. కాన నది ప్రక్రియలోఁ గానరాదు. ఇట్లేదేనొక ప్రయోజనమును గోరి ప్రత్యయాదులందు నిబద్ధమై ప్రకృతియం దాదృతముగాక విడువఁబడునట్టి దిత్తని వ్యవహరించుటయు సంస్కృతవ్యాకర్తలసంప్రదాయమె. మఱియు 'యట్' అనుదానియందలి యకారమందున్న అకారము సుఖోచ్చారణార్థమని యెన్నవలెను. ఇదియుసంస్కృతవ్యాకర్తృప్రసిద్ధమార్గమె. కాఁగా 'య్'అనుపొల్లుయకారము పరాచ్చున కవయవముగఁ గల్గునని ఫలితము తేలినది. అత్వేత్వోత్వములకు హ్రస్వములకే సంధివిధాన మగపడెడి కాని దీర్ఘాంతములకవ్వానికి సంధివిధానములు లేవు. కాన నిందలి మూఁడుదాహృతులును స్పష్టముగ సంధిప్రాప్తిలేనివే యగుచున్నవి. మా + అమ్మ=మా + య్ + అమ్మ=మాయమ్మ. ఇట్లే తక్కిన రెండు నూహ్యములు. ఇట్టియాగమములం దాగమవర్ణములందలియచ్చులుచ్చారణార్థములు గావన్న నవదాదిస్వరసంధికేని నాయాస్వరసందివిధులకేని నిత్యప్రవృత్తిని గల్పించి రూపసాధనమును జేయవలసియుండును.

బాలవ్యాకరణమున 'ట్, క్, మ్,' అనుపొల్లులు చేర్చి యాయావాని కాద్యంతములఁ గలుగుటకుఁగా నిర్దిష్టములైన యాగమము లించుమించుగ ముప్పది కనఁబడెడి.

ఆగమములెల్ల నెల్లయెడల నిర్దిష్టములగు నచ్చులతోడనే కల్గుననియు నచ్చు, వానికిఁ బరమగునపు డవదాదిస్వరసంధికేని యాయాయచ్ సంధివిధులకేని నిత్యప్ర

వృత్తి సంభవించుననియుఁ దలంచిన నాగమములొకచోఁ బొల్లురూపముతోడను నొకచో నిర్దిష్టాచ్చుతోడను గల్గుననుటయు వానిం బ్రక్రియనుబట్టి యూహించు శ్రమయు లేకుండును. ఇందధికముగ నిర్దిష్టములగు నచ్చులతోడనే యాయా ప్రకృతులకుఁ గలుగునవి కాననగును. పొల్లురూపముగ నగునవి యల్పముగఁగన్పట్టును. ఆయాయచ్చులతోఁ గూడినవి పొల్లురూపమునఁ గల్గునవనియు నాయాయచ్చులతోఁగూడినవి నిర్దిష్టములగునచ్చులతోడనే గలుగనవనియు నిరూపింప నశక్యము. అనఁగా వేనిమీఁది యచ్చులు సుఖోచ్చారణమే ప్రయోజనముగాఁ గలవో, వేనిమీఁదియచ్చులు సుఖోచ్చారణప్రయోజనము గలవి గావో నిర్ధారించుటకు మార్గము లేదనుట. వ్యాకరణ ప్రక్రియ ననుసరించియే యాగమవర్ణములయందలి యచ్చుల కాయా ప్రయోజనములను తెలిసికొనవలెను గాన నిర్దిష్టాచ్చుతోనె యగుననుమార్గమె సమంజసమని తోఁచెడి. టకారవ్యంజనము తుదిం జేర్చినది నిర్దిష్టమున కాద్యవయవముగను, కకారవ్యంజనము తుదిం జేర్చినది నిర్దిష్టమున కంత్యావయవముగను, మకారవ్యంజనము తుదిం జేర్చినది నిర్దిష్టము నంత్యాచ్చునకుఁ బరముగను, నగుననుసంస్కృతవ్యాకరణసంప్రదాయ మాయా వలసిన సందర్భములం దనుసరించునది. తాలవ్యాచ్చు పరమగునపుడు తాలవ్యమగుయకారము శ్రుతిసుఖముంబట్టి వచ్చుట సహజముగాని తద్భిన్నమోష్ఠ్యాదికము పరమగునపుడును యకారమే యగుట యసహజముగఁ గన్పట్టెడి. 'ఆయతివ సుశోభనాకృతి' అను మొదలగు నుదాహృతులంబట్టి (ఆయతివ=ఆస్త్రీ, ఆయతి=ఉత్తరకాలము.) హత్త్వ సార్థక్యము నూహించునది. 'సహల్చాచ్చ భవేత్క్వచిత్' అనునాథర్వణ మిందులకుఁ బ్రమాణము.

## అత్తునకు సంధి బహుళముగా నగు. ౮.

| | | | | |
|---|---|---|---|---|
| మేన | ... | అల్లుఁడు | ... | మేనల్లుఁడు.<br>మేనయల్లుఁడు. |
| పుట్టిన | ... | ఇల్లు | ... | పుట్టినిల్లు.<br>పుట్టినయిల్లు. |
| చూడక | ... | ఉండెను | ... | చూడకుండెను.<br>చూడకయుండెను. |

బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమసంబోధనాంతంబులకు సంధి లేదు.

| | | | | |
|---|---|---|---|---|
| అమ్మ | ... | ఇచ్చెను | ... | అమ్మయిచ్చెను. |
| దూత | ... | ఇతఁడు | ... | దూతయితఁడు. |
| చెలువుఁడ | ... | ఇందము | ... | చెలువుఁడయిందము. |

సంస్కృతీయంబునకు సంధి యగునని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునికకృతులం దొకానొకచోటఁ స్త్రీవాచక తత్సమంబులకు సంధి గానంబడియెడు. గంగనుకాసె. నెలఁతిచ్చెను. వెలయాల్వాదుల సంధిలేమి బాహుళకముచేతనే యని యూహించునది.

టీ. 'వాతః' అనునది మూలము. హ్రస్వాకారమున కచ్చు పరమగునపుడు సంధి బహుళముగా నగును. బహుళమనఁగాఁ గొన్నియెడల నిత్యముగఁ గలుగుటయుఁ, గొన్నియెడలఁ గలుగకుండుటయుఁ, గొన్నియెడల నొకమాఱు కలిగి యొకమాఱు కలుగకుండుటయుఁ గొన్ని యెడల వేఱొకరీతి నగుటయు నను సంస్కృతవ్యాకరణసంప్రదాయ మిందనుసరణీయము. పైనాల్గు నొక్కచోఁ గనుపడనక్కఱలేదు. వీనిలోఁ గొన్ని తోఁచినను బహుళమనవచ్చును. ఇందు వేఱొకరీతిని సంధిజరుగుటయను బహుళప్రయోజనము గానరాదు. దీనికై 38 సంధిసూత్రము నరయునది. మేన + అల్లుఁడు:— పూర్వపదాంత్యాచ్చగు అకారమునకును నుత్తరపదాద్యచ్చగు అకారమునకును బరపదాద్యచ్చగు అకార మాదేశముగా మేనల్లుఁ డయ్యెను. సంధి కలుగనపుడచ్చుకంటెఁ బరమగునచ్చునకు యడాగమము కలుగ మేన + య్ + అల్లుఁడు=మేనయల్లుఁ డగును. ఇట్లే తక్కిన వూహ్యములు. వికల్పముగ సంధియగుట కివి యుదాహరణములు.

స్త్రీవ్యక్తిని జెప్పుశబ్దములయుఁ దత్సమశబ్దములయు, సంబోధనములయుఁ, నంతముల కనఁగా నత్తున కచ్చుపరమగునపుడు సంధి దీనిచేఁగలుగదు. ఇది యప్రవృత్తిరూప బహుళప్రయోజనము అమ్మ:—ఇది స్త్రీవాచకము. స్త్రీవ్యక్తిని జెప్పునది గాన స్త్రీవాచక మయ్యెను. దూత:—ఇది తత్సమము. దూతాదులకు స్త్రీత్వము బహుళమనుసూత్రముచే సిద్ధము. తత్సమశబ్దము సంస్కృతసమవాచకము. చెలువుఁడ:—ఇది యాహ్వానార్థకముగాన సంబుద్ధి. సంధి దీనికిఁ గలుగదుగాన 3 సూ. చే యడాగమమురా అమ్మ + య్ + ఇచ్చెను=అమ్మయిచ్చెనని యగును. ఇట్లే తక్కినవూహ్యములు. అమ్మిచ్చెననరాదని భావము. ఈసందర్భము ననుసరించి సమభవాదిభేదము ననుసరింపక యెల్ల పదముల అకారములును నీసూత్రమునకు విషయములే యనియు నందు స్త్రీవాచకతత్సమసంబోధనములయత్తులకే యీనిషేధమనియుఁ గమనింపఁదగు.

'కుత్రచిత్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యత్ర చ్యుతో భవేత్' అని యథర్వణాచార్యులు సంస్కృతసమశబ్దమునచ్చునకు సంధి కలుగవచ్చునని సామాన్యముగ ననిరి గాని పూర్వకవిగ్రంథముల నట్టిప్రయోగములతివిరళములగుటంజేసి సంస్కృతసమముల

యత్తునకు సంధి రాదను తనమాట నాతనివిధి విరోధించునది గాదని సూరియాశయము. మఱియుఁ గుత్రచిత్తనుటంజేసి యవ్విధి సర్వసాధారణము గాదనుటయు స్పష్టమె. నవీనులకావ్యములందు స్త్రీవాచకతత్సమసంబోధనాత్తులకు సంధి యగపడెడిఁ గాని యది బహుళముగఁ బ్రాచీనకవిప్రయోగదృష్టము గామిఁ బాటింపరానిదని సూరి నిరాకరించెను. దూత:—ఇది సంస్కృతసమము. దీనియత్తునకు సంధిరాదు. ఇట్లే గంగయనుశబ్దము తుదినున్న అకారము సంస్కృతీయము. తత్సమాచ్చని భావము. సంస్కృతపద మున్నదున్నటులఁ దెలుఁగునఁగలుగదుగాన సంస్కృతీయమనుదానికిఁ దత్సమాచ్చనున దర్థమని యనక తీరదు. సూరిమతమున దీని కచ్చుపరముగా సంధి రాదుగాన గంగ+అను కానె, గంగయనుకానెయనియే రూపము కలుగును. కాని నవ్యులు గంగనుకానె యని సంధిఁ గూర్చి ప్రయోగించిరి. సహజాదంతములకే గాక యిందు వ్యాకరణముచే సిద్ధించిన భ్రాత బ్రహ్మ మున్నగుకృతకాదంతములును గ్రాహ్యములే గాఁదగును. నెలఁత:—ఇది స్త్రీవాచకము. దీనియత్తునకు సంధి కలుగదుగాన నెలఁతయిచ్చె ననియే రూపమగు. కాని నవ్యులు సంధిఁగూర్చి నెలఁతిచ్చె నని ప్రయోగించిరి. వెల+ఆలు:—ఇచ్చో నీవిధి ప్రవర్తింపఁదగును. కాని వెలాలనురూప మగపడమి నిందలి బహుళగ్రహణముచే నిందీవిధి వర్తింపదనెను. అవధారణార్థకాకారమునకుఁ గొన్నిట సంధిరామికిని (గోడయ) బహుళగ్రహణమునే యాధారముగఁ గొనవలెను. ఇది కేవలాప్రవృత్తిరూప బహుళప్రయోజనమని యెన్నఁదగు. వెలయాలనియే యడాగమము కల్గినరూపము సిద్ధించును. శ్రేష్ఠతావాచకంబులగు నార్యాంబాద్యర్థకశబ్దములు పరములగుచో నన్నియచ్చులకు సంధి నిత్యమని త్రిలింగలక్షణశేషకర్త దీనినేగాక యిందలి యత్వేత్వాదిసంధివిధులఁ గూడ సవరించుట నరయునది. ప్రయోగమార్గ మెఱిఁగి శ్రుతిసుఖమును బాటించుచు నాయాచోటులం దీసంధికిఁ బ్రవృత్త్యప్రవృత్తి వైకల్పికత్వముల ననుమానింపవలె ననునంశము బహుళగ్రహణముచే సూచితముగానఁ ద్రిలింగలక్షణశేషకర్త 'సంధిర్నిత్యం ప్రత్యయాచ స్తథార్యాదిగతస్య చ' అనునాథర్వణము ననుసరించి దానినే విశదపఱచెననఁదగును. ఇట నవధారణార్థకాకారము పరమగునపుడును గొన్నియెడల నెల్లయచ్చులకు సంధియగునని పూరించుట యావశ్యకము. ఇందలి గంగనుకానె యను ప్రయోగమాముక్తమాల్యదయందలిది. 'చేష్టఁడిగె శ్రీరంగభర్తంచు' అను తత్సమాకారమునకు సంధిగూర్చిన రూపములును నంద యగపడెడి. ఆథర్వణుఁ డట్టివానిని సాధువులని యన్నవాఁడు. ఇట్లుండ సూరి వాని నసాధువులు నవ్యములుననుట జీవద్భాషాకావ్యప్రయోగతత్వవిరుద్ధమును జింత్యమును నని యనక తీరదు. కాని యిట్టిరూపములు నన్నయాది ప్రాచీనులకావ్యములందుఁ గనుపట్టకుండుటయు, నానంతరులకావ్యములందును నిట్టివత్యల్పముగఁ దోఁచుటయుఁ, దనలక్షణము నన్నయచింతామణి ననుసరించున

దగుటయుం, నియమము బహుళపదానుసారి యగుటయు, శ్రుతిసుఖార్థ మేర్పడినసంధి యిట్టివానియందుఁ గటువుగఁ దోఁచుటయు, సూరి యట్టివానిసంధియసమ్మతికిఁ గారణములు గానోపును. 'రాజులొద్ద - పుట్టినిల్లు - తామరసనేత్రలిండ్ల' మొదలగుకొన్ని సమాసములందును నీవిధికిఁ బ్రవృత్తి ప్రయోగదృష్టము.

ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగానగు. ౫.

ఏమి-మఱి-కిషష్ఠి-అది-అవి-ఇది-ఇవి-ఏది-ఏవి- ఇది యాకృతిగణంబు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏమి | ... | అంటివి | ... | { | ఏమంటివి<br>ఏమియంటివి. |
| మఱి | ... | ఏమి | ... | { | మఱేమి<br>మఱియేమి. |
| హారికిన్ | ... | ఇచ్చె | ... | { | హారికిచ్చె<br>హారికినిచ్చె |

టీ. 'ప్రాయస్తు స్యాత్క్వాదికస్యేతః' అనునది మూలము. ఏమియనున దాది యందుఁగల పదసమూహ మగుట నేమ్యాదులని వ్యవహరించెను. ఇది యిత్వసంధివిధి యగుటచేత నాదినున్న యేమియనుదానివలెనే తక్కినవియు నిదంతములే యని యూహింపనగును. కాన నిందుఁ జేరఁదగిన విదంతములేయనుట నిర్వివాదము. ఇదంతాకృతిసాదృశ్యముగలవెల్ల నిందుఁ జేర నర్హము లగుటంజేసి యిది యాకృతిగణ మయ్యెను. హ్రస్వేకారాంతముల కచ్చు పరమగునపుడు సంధి వికల్పముగ నగును. ఏమి:—ఇది కిమర్థకము. మఱి:—పునరర్థకము. కిషష్ఠి:—ఇకారాంతములమీఁద కివర్ణకముగా మాఱినషష్ఠీప్రత్యయము. ప్రథమేతరసూత్రమున ద్రుతపూర్వవిభక్త్యకారమునకే సంధి యగు. దాన కిషష్ఠి తద్విషయము గాదయ్యె. ఇఁక నది యిఁకాది నిషేధమునకు గుఱిగాఁగ దానికి వికల్పసంధి సాధింప నెంచి యిందుఁ జేర్చెనని గ్రహించునది. కావుననే కిషష్ఠి యని కంఠోక్తముగ సూత్రించెను. ఇదంతములమీఁది కిషష్ఠి యనుటంజేసి ద్వితీయైకవచనమును నివర్ణముగా మాఱినదానిని గ్రహింపరాదు. ఏమి+అంటివి:—సంధిలోఁ బూర్వపరస్వరములకు రెండింటికిఁ బరస్వర మాదేశముగా ఏమంటివగును. సంధి గాకున్న యడాగమము పరపదాద్యచ్చునకుఁ గలుగ ఏమియంటివని రూపమగును. ఇట్లే తక్కినవాని ప్రక్రియను గమనించునది. హారికిన్+ఇచ్చె:—సంధిలో ద్రుతస్వరము ద్రుతమును నదృశ్యముగా హారికిచ్చెనగును. సంధిగాకున్నఁ బొల్లు నకారము పరాచ్చుతోఁ గలియఁగ హారికినిచ్చెనని యగును. ఇదొక్కటితక్క నిందుఁ గలవియుం జేరఁదగునవియుం గళలె యగును. మూలముమతమున నిది ప్రాయస్సంధి

యగుటంజేసి తఱచుగ నాయావానియందు నిత్యప్రవృత్తియే చూపట్టెడి. సాధారణముగ నిత్యసంధి శ్రుతిసుఖమును జెఱుపునదగుటంజేసి కాలక్రమమున దీనికి వైకల్పికత్వము సిద్ధించె. దాన నీవిధి యిట్లు వికల్పవిధిగ మాఱెను, గాన శ్రుతిసుఖమునకు భంగము రానిగతి నీసంధికిఁ బ్రవృత్త్యప్రవృత్తులఁ గల్పింపవలెనని తెలియఁదగినది.

క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగానగు. ౬.

| | | | | | |
|---|---|---|---|---|---|
| వచ్చిరి | ... | అప్పుడు | ... | { | వచ్చిరప్పుడు. వచ్చిరియప్పుడు. |
| వచ్చితిమి | ... | ఇప్పుడు | ... | { | వచ్చితిమిప్పుడు. వచ్చితిమియిప్పుడు. |

టీ. 'ప్రథమశ్చోత్తమశ్చైవ క్రియేతో వా భవేత్ చ్యుతిః' అను నాథర్వణము మూలము. మధ్యమపురుషక్రియేకారములు మీఁదిసూత్రపునిత్యసంధికి విషయములు. ఉత్తమపురుషైకవచనమును ఎడిపర్ణకము గలిగిన లాట్ ప్రథమపురుషైకవచనమును, ద్రుతప్రకృతికము లగుటంజేసి యిఁకాదిసూత్రనిషేధమునకు గుఱియై సంధివిషయములు గాఁజాలవు. ఇఁకఁ బ్రథమపురుషైకవచనములకు వేనికిని దుదిని కారము సంభవింపదు. భూతకాలికక్రియలందే సాధారణముగ నిత్వము చూపట్టెడి. కానఁ గళలగుభూతకాలికప్రథమోత్తమపురుషబహువచనముల తుది నున్నహ్రస్వేకారమున కచ్చు పరముగా సంధి వికల్పముగ నగుఁనని సూత్రార్థము లభించెడి. వచ్చిరి + అప్పుడు:— ఇందు వచ్చిరనునది భూతకాలికప్రథమపురుష బహువచనరూపము. సంధి కలుగ వచ్చిరప్పుడగును. సంధిరానిచో యడాగమము కలుగ వచ్చిరియప్పు డగును. వచ్చితిమి + ఇప్పుడు:—వచ్చితి మనునది యుత్తమపురుషబహువచనము. సంధి కలుగ వచ్చితిమిప్పుడనియుఁ గాకున్న వచ్చితిమియిప్పు డనియు నగును.

సూరి 'వచ్చితిని' అను నుత్తమపురుషైకవచనము నిం దుదాహరింపలేదు. ద్రుతప్రకృతికమగుట నిఁకాదినిషేధమునకు విషయముగఁ జేసెనందమన్న నందును దీని నుదాహరింపలేదు. చింతామణివలె దీని నేమ్యాదిసంధివిషయముగఁ జేసెనందమన్న నందును దీని నుదాహరింపమి నట్లనుమానింప వీలులేదు. చింతామణియం దిత్వసంధి విధానములు రెండే యుండుటంజేసి దీనిం గిమాదులలోఁ జేర్చి ప్రాయోగ్రహణమునం జేసి సంధిరాదని బాలసరస్వతి 'కొలిచితినంబ'నని యుదాహరించె. అహోబలపండితుఁడు కిమాదులలోనె దీనిం జేర్చెనుగాని యందలి ప్రాయశ్శబ్దమును వికల్పపరముగ నెన్ని 'చేసితచ్యుతార్చనము చేసితినచ్యుతార్చన'మని యుదాహరించెను. చింతామణిని విప

రించునథర్వణుఁడు 'ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవేత్ చ్యుతిః' 'నిత్య మన్యస్య' అని యుత్తమపురుషైకారమునకు వికల్పసంధినే యంగీకరించి వచ్చితినిపుడు వచ్చితిపు డనురూపములనే సిద్ధింపఁజేయువాఁడని వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు. కిమాదిసూత్రవ్యాఖ్యాసందర్భమునను నహోబలుఁడు 'కొలిచితఖ్ధిజన్, కొలిచితినబ్ధిజన్' అని యుదాహరించెను. అప్పకవి 'బ్రదికితినన్నగన్' అని యుదాహరించి దీనికి సంధి రాదని తెల్పినాఁడు. చింతామణివిషయపరిశోధనకర్త యుత్తమపురుషైకవచనమును గిమాదిసూత్రవిషయముగనే చేసియుఁ జింతామణి ననుసరించి 'కొలిచితినిన్' అను మున్నగురూపములే యుత్తమపురుషరూపములు గానోపునుగాన వీనికి సంధి కల్గిన 'కొలిచితినంబను' అనియుఁ గలుగకున్న 'కొలిచితిని నంబను' అను మున్నగురూపము లేర్పడు ననెను. చింతామణిలో ద్రుతప్రకృతికముల కచ్చుపరమగునపుడు సంధిని వారించు సామాన్యసూత్రము లేమింజేసియు నచ్ సంధివిధులెల్ల ద్రుతప్రకృతికాద్రుతప్రకృతిక సామాన్యము లగుటంజేసియు వారువారెల్ల నానారీతుల నీరూపసాధనమువిషయమున వివదించుట జరిగెనని తోఁచెడి. ఇందు సూరి సంధిప్రణాళిక కెట్టిరూపములు సమ్మతములో నిందు స్పష్టముగ నుదాహరింపమిని బరిశీలింపవలసియున్నది.

ఇకారాంతధాతువులఁ దెనుఁగున సామాన్యముగఁ గానము. భూతకాలిక తివర్ణ యోగముననే క్రియలికారాంతములగుట సంభవించెడి. క్రియాపదములం దిత్తని సామాన్యముగ ననుటంజేసి క్రియలందలి తుదియికారములెల్ల నీసూత్రసంధికి విషయములే యగును. మధ్యమపురుషైకారములకు నిత్యసంధి విహితమగుటంజేసి యవి మాత్ర మిందుఁ జేరవు. ఏమ్యాదిసంధిక్రియేకారవిషయము గాక శబ్దాంత్యేకారవిషయమగుట యుదాహరణములనుబట్టి స్పష్టమగును. క్రియేత్తని కంఠోక్తముగఁ గ్రియేకారములకు సంధిని విధించుట నిందుమాని యగతికముగ నుత్తమపురుషైకారమును నేమ్యాదులలోఁ గూర్చుటయు నయుక్తికమె యగు. ఇఁకాదినిషేధము కంఠోక్తముగఁ గ్రియేకారములకు సంధిని విధించుదీనికి బాధకము గాఁజాలదు. మఱియు నిది కళేకారములందు సావకాశమన్న నిఁకాదిసూత్రమును ద్రుతపరకములగు నట్వేత్వోత్వరూపములందు సావకాశమే యనకతీరదు. ద్రుతప్రకృతికము నచ్ సంధివిషయముంజేయ ద్రుతాచ్చు లుప్తమగునని యంగీకరింపక తీరదు. కానఁ బైకారణముల ననుసరించి వచ్చితిని+ఇపుడు=వచ్చితిన్+ఇపుడు:—సంధి రాఁగ వచ్చితిపుడగును. సంధి రాకున్న వచ్చితినిపుడగుననియనఁదగు. క్రియేత్తనుటంజేసి సంధిలో ద్రుతస్వరము లుప్తము గాదన్న ద్రుతమున కచ్చు పరమగునపుడు ద్రుతమే నిల్చుట ప్రసిద్ధముగాన సంధి కలుగ 'వచ్చితినిపుడు', కలుగకున్న 'వచ్చితినినిపుడు' అని యగును. మధ్యమపురుషమున లిఙ్లాడ్వకారమాత్రము

నకు లోపము రాఁగాఁ దత్పూర్వతివర్ణకేకారమే సంధివిషయమైనట్లు 'వచ్చితిని' అనునది యచ్సంధిలో 'వచ్చితిన్' అనురూపమునందినను దత్పూర్వతివర్ణకేకారమే యీసూత్రసంధికి విషయమగుట వచ్చితిపుడనురూపము గానోపును. మధ్యమపురుషమున వకారమాత్రమునకే లోపము గలుగుటంజేసి వకారసంబంధమగు నికారముసంబంధము తివర్ణకమునకు సిద్ధించెడిఁగాన నందు సంధిసూత్రమునకుఁ బ్రవృత్తి గలిగెననియు 'వచ్చితిని' ఇత్యాదులందు సంధిలో ద్రుతస్వరము లుప్తమగుట దానియికారముసంబంధము తివర్ణమునకు లేమి సంధి యిందుఁ గలుగదనియునన్న వచ్చితినిపుడనియే యగుంగాని యాపక్షమున తివర్ణకముమీఁది యిత్తులకు మాత్రమే యీసూత్రములు సంధిని విధించునవని స్పష్టముగా సూత్రకర్త చెప్పకుండుట యనుచితముగ నున్నదనక తీరదు. కానఁ బైని వివరించినప్రకారముత్తమపురుషైకవచనమున కచ్సంధిరూపము లేర్పడుచున్నను దుల్యబలవిరోధవిధులలోఁ బరకార్యమే బలవత్తరమను సంస్కృతవ్యాకరణమర్యాద ననుసరించి యిఁకాదిసూత్రకార్యము పరకార్యమగుటచేతను, నది ద్రుతపూర్వస్వరసంధినిషేధవిధాన మగుటచేతను, సంధిని ద్రుతస్వరలోపము కలిగిన 'వచ్చితిన్ + ఇపుడు' ఇత్యాదులందు దానికే ప్రవృత్తికలిగి వచ్చితినిపుడను మున్నగురూపములేర్పడుననుటయే బాలవ్యాకరణపద్ధతికిఁ దగియుండునుగాని వచ్చితిపు డిత్యాదిరూపములుకలుగుననుట యర్హము గాదని యంగీకరింపవలయును. ఇట్టిబాలవ్యాకృతిసంస్కారమే 'గాండివి నొవ్వఁ బల్కితిటు' అనుప్రయోగమును బల్కి యిటు; బల్కితిని' అని మార్చిననుట తెల్లము. చింతామణివ్యాఖ్యాతలును విమర్శకులును, వచ్చితినిపుడను జాతిరూపముల నేకగ్రీవముగ నంగీకరించినవారు. ఒక్కయహోబలుఁడు తక్క నన్యులెవ్వరును నుత్తమైకవచనసంధిరూపములుగ వచ్చితిపుడనుజాతిరూపముల నంగీకరించినవారు గారు. కావ నిద్దాని నిఁకాదిసూత్రనిషేధమునకే పాలుచేసి వచ్చితినిపుడని సాధించుటయే బాలవ్యాకరణప్రణాళికకు సమ్మతమని యంగీకరించుట సరసమును సాధారమును నగునని తోఁచెడి. ఇఁక నిఁకాదిసూత్రమున 'ఉండెడిన్ + అతఁడు' అని యుదాహరించి యుండెడినతఁడని సాధించుటనుబట్టి యిట్టివానియికారము క్రియాపదంబులం దిత్తునకనుదానికి విషయము గాదనుట స్పష్టము. కాఁగా నీసూత్రము ద్రుతపరకములుగాని క్రియేకారవిషయమనుట తెల్లమయ్యె. ఉత్తమపురుషబహువచనము నిందుదాహరించి వికల్పసంధిని జూపుటంజేసి యెవరెట్లన్నను బాలవ్యాకరణమతమున దీనికి సంధివికల్పముగ నగునని చెప్పక తీరదు. కాఁగా నిందుఁ బ్రథమపురుషమునకు వికల్పసంధి విధించుట చింతామణికంటె విశేషమనియు నిదియు 'ప్రథమే చోత్తమే చైవ' అను నథర్వణకారికను గళే కారవిషయముగ సమన్వయించుటచేఁ గలిగినదనియు సంభావింపవల

యును. 'నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః' అని ప్రథమమధ్యమైకారములకు నిత్యసంధిని విధించు చింతామణిని 'ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవేత్ చ్యుతిః నిత్యమన్యస్య' అనియాథర్వణము నిత్యసంధివిషయమైన ప్రథమపురుషైకారమునకు వికల్ప సంధిని విధించుచు సవరించుటంబట్టి తత్కాలముననే ప్రథమపురుషైకారమునకు వికల్ప సంధి ప్రసిద్ధమయ్యెనని యనుమానింపఁ దగును. ఇట్టిస్థితిలోఁ 'గూర్చుండిరి యొండొరు' అను శ్రీనాథప్రయోగమును బరపురుషక్రియలఁ బ్రకృతిభావముగలనే యని యప్పకవి యధిక్షేపించుట యసంగతము. గుప్తార్థప్రకాశిక నిత్యమిత్యాదిసూత్రస్థపురుష శబ్దము ప్రథమపురుషబోధకముగ నెన్ని ప్రథమోత్తమపురుషములకు వికల్పసంధిని మధ్యమపురుషమునకు నిత్యసంధిని గల్పించుచు నీయర్థము నే యాథర్వణము తెల్పుననుచున్నది. ఆథర్వణ మిప్పట్టునఁ జింతామణిసూత్ర మట్టియర్థము నీయకుండుటంబట్టి యట్టిగొఱంతను దీర్పఁ బుట్టినదిగానఁ జింతామణిసూత్రార్థము నే యేకరువు వేయునది గాఁజాలదు. మఱియు నన్నయప్రయోగములందు బ్రథమమధ్యమైకారములకు నిత్యసంధియె గన్పట్టు. వీని కెచటనైన సంధ్యభావము నన్నయప్రయోగములందుఁ జూపట్టిన నప్పట్టులు వాక్యాంతపాదాంతత్వములు సంభవించుటను సంధి చేయ నక్కఱ లేనిచోటులే యైయుండుననుట సాహసముగాదు. కానఁ జింతామణి ప్రథమపురుష వికల్పసంధిని బ్రతిపాదించునట్లుగ నర్థముచేయుట ప్రాచీనవాఙ్మయప్రయోగవిరుద్ధ మనుటకు సందియము లేదు.

ఇట్లు పరిశీలింప నీసూత్రము కళేకారవిషయమై వికల్పసంధిని వానికి విధించునదగుటచేత మచ్చిన కికారాంతమైన యొకధాతురూపమును నేమ్యాదులలోఁ సూచనకై చేర్చి యీసూత్రమును త్యజించుటయే యుచితమని తోఁచెడి. "ఏమ్యాది సూత్రము శాబ్దికేకారవిషయము; ఇది క్రియేకారవిషయము." అను భేదముఁదప్ప నితరమంతయుఁ నభిన్నమె.

## మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును. ౭.

| | | | | |
|---|---|---|---|---|
| ఏలితివి | ... | అపుడు | ... | ఏలితివపుడు. |
| ఏలితి | ... | ఇపుడు | ... | ఏలితిపుడు. |
| ఏలితిరి | ... | ఇపుడు | ... | ఏలితిరిపుడు. |

టీ. "నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః" అనుదానిని వివరించు 'నిత్యమన్యస్య' అనునాథర్వణము మూలము. మధ్యమపురుషైకవచన బహువచనములతుది యికారములకు నిత్యముగా సంధి యగును. లిఙ్లోట్టులవకారమునకు వికల్పముగ లోపము కలుగునను

విధిచే మధ్యమపురుషైకవచనమున వకారముమాత్రము లోపించినను నీవిధి ప్రవర్తించునని గ్రహింపవలెను. భూతకాలికరూపములందే యికారము తోఁచునుగాన నీసూత్రమునకు భూతకాలికమధ్యమపురుషరూపములే విషయములనుట స్పష్టము.

ఏలితివి + అపుడు:—పూర్వపరస్వరములస్థానమునఁ బరస్వరమకారము నిలువ ఏలితివపుడగును. మధ్యమపురుషవకారము లోపింప "ఏలితి + అపుడు = ఏలితపుడు" అని యగును. ఏలితిరి + అపుడు = ఏలితిరపుడు. ఇందు వికల్పము విభాష మొదలగు వికల్పతం దెల్పుపదములు లేమి నీవిధి నిత్యమనియే భావింపవలెను. ఈసంధి యెల్ల లాక్షణికుల మతమునను నిత్యమే.

## క్త్వార్థంబైనయిత్తునకు సంధిలేదు. ౮.

వచ్చి ... ఇచ్చెను ... వచ్చియిచ్చెను.

టీ. "క్త్వార్థేతో న భవేత్సదా" అనునాథర్వణము మూలము. క్రియ 38 సూత్రముచేఁ గ్త్వార్థమున ధాతువున కికారము విధింపఁబడినది. ఏకవస్తువ్యాపారములను దెల్పెడు రెండుక్రియలలో ముందు జరిగినవ్యాపారమును దెలుపుక్రియకు నికారము కలుఁగు. అట్టియికార మంతమందుఁ గల క్రియారూపములకు సంధిగాదు. సంధి కలుగ నపుడు పరస్వరమున కవయవముగ యడాగమము కలుగును. వచ్చి + ఇచ్చెను = వచ్చి యిచ్చెను. చేసి + అడిగెను = చేసి యడిగెను. 'త్యక్త్వా, కృత్వా, గత్వా' ఇత్యాదులు సంస్కృతక్త్వాప్రత్యయాంతములు. విడుచు + ఇ, విడిచి = చేయు + ఇ = చేసి, పోవు + ఇ = పోయి మొదలగునవి తెలుఁగునందలి క్త్వార్థకములు. క్త్వాస్థానమునఁ దెలుఁగున క్రియల కికార మంతమునఁ గలుగు. ధాతువు సోపసర్గమైనను నను పసర్గమైనను క్త్వాప్రత్యయము సంస్కృతమునఁ గలుగును. ధాతువు సోపసర్గమగునపుడే ల్యప్ అను ప్రత్యయము క్త్వాప్రత్యయస్థానమునవె యందుఁ గలుగును. సంస్కృతమున నైన క్త్వాల్యప్పుల రెండింటి స్థానమునను తెలుఁగున నికారమే క్రియాంతమునఁ గలిగెడి.

ఇప్రత్యయాంతావ్యయమునకు సంధియుఁ జూపట్టెడునని త్రిలింగలక్షణశేష కర్త ప్రయోగముల నుదాహరించి బాలవ్యాకరణముత్రోవ నిప్పట్టున నవరించినాఁడు. విజయవిలాసాదికావ్యములం దీసంధి యచ్చటచ్చటఁ జూపట్టెడి. ప్రాచీనకావ్యము లందును గ్త్వార్థకేకారసంధి కలదందురుగాని యట్టివానిం గొన్నింటిని శబ్దపల్లవములుగ సమర్థించియుఁ గొన్నింటిని వేఱొకలాగున సంస్కరించియుఁ గనరాకుండఁ జేసిరనుట యసంగతము గాదు. 'క్త్వార్థేతో న భవేత్తని' యధర్వణుఁడు శాసించుటనుబట్టి యాకాలముననే క్త్వార్థకేకారసంధివిషయకవాదము గలదనుట నిర్వివాదము.

ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు. ౯.

ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని.

వచ్చుఁ ... ఇపుడు ... వచ్చునిపుడు.

చూడఁ ... అయితి ... చూడనయితి.

ఉండెడిఁ ... అతఁడు ... ఉండెడినతఁడు.

ఇఁక-ఇఁగ-ఎట్టకేలకు-ఎట్టకేని.-ఈయవి యిఁకాదులని యెఱుంగునది; వీనికి సంధివైకల్పికము.

టీ. ఈక్రింద నుదాహరించిన నాల్గుశబ్దములకుఁ దక్క నితరములగు ద్రుతప్రకృతికములకు వేనికిని సంధిరాదు. ద్రుతప్రకృతికములకు సంధి ద్రుతపూర్వాచ్చునకే యగును గాని ద్రుతాచ్చునకుఁ గాదు. అనఁగా నచ్ సంధివిషయమున నీనాల్గుశబ్దములందలి ద్రుతములు తప్ప నితరశబ్దములందలి ద్రుతములెల్ల నచ్ సంధి కడ్డును గలుగఁజేయునవి యని గ్రహింపవలయును. మఱియు ద్రుతప్రకృతికమును సంధివిషయముగఁ జేయ ద్రుతమునందలి యచ్చు లోపించుననియు గ్రహింపవలెను. వచ్చును+ఇపుడు = వచ్చుఁ+ఇపుడు=వచ్చునిపుడు. వచ్చిపుడని సంధి గలుగదు. వచ్చుననునది తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనము. ఇది ద్రుతాంతము. ఇందు 'ను' అను ద్రుతమునకుఁ బూర్వమున నున్న 'చ్చు' అని దానియందలి ఉకారమునకు సంధి కలుగదు. చూడను+అయితి= చూడఁ+అయితి=చూడనయితి. ఇందు 'చూడను' అనునది వ్యతిరేకార్థకోత్తమపురుషైకవచనము. 'అయితి' అనునది దాని కనుప్రయుక్తమైన లిడంతంబైన యగుధాతూత్తమపురుషైకవచనము (చూ. క్రియ. 114) 'చూడను' అనునది ద్రుతాంతము. ఇందు 'ను' అను ద్రుతమునకుఁ బూర్వమున నున్న డకారమునందలి అకారమునకు సంధిరాదు. ఉండెడిని+అతఁడు = ఉండెడిఁ+అతఁడు=ఉండెడినతఁడు. 'ఉండెడిని' అనునది తద్ధర్మప్రథమపురుషైకవచనము. ఇది ద్రుతాంతము. ఇందు నివర్ణకమునకుఁ బూర్వమున నున్న డకారమునందలియికారమునకు సంధిరాదు. ఉత్వాత్వేత్వాంతములకు ద్రుతప్రకృతికములకు సంధి రామికి నివి క్రమముగ నుదాహరణములు. ఉత్వాత్వేత్వ సంధివిధులందు ద్రుతప్రకృతికములకుఁ బ్రవేశమే లేదన్న వీనికి సంధి ప్రాప్తియే లేదు. కాన నాయాసూత్రముల సంధుల కివి గుఱియై యేతత్సూత్రనిషేధమునందునని గ్రహింపకున్న నివ్విధికి సార్థక్యము సంభవింపదు. ఈసూత్రము ద్రుతపూర్వస్వరముల కెల్ల సంధిని నిషేధించునదగుటఁ బ్రథమేతరసూత్రమునందలి ద్రుతపూర్వోకారములెల్ల నేతత్సూత్రనిషేధమునకు లక్ష్యములు గావలసినవే! కాని ప్రథమేతరసూత్రోదాహరణ

ములపట్లను నీసూత్రమే ప్రవర్తించునెడలఁ బ్రథమేతరసూత్ర ముదాహరణాంతరములు లేమిని నిరర్థకమై పరిత్యాజ్యమయ్యెడి. ప్రథమేతరసూత్రమున కా ద్రుతపూర్వోకారములే విషయములుగాని యన్యములు లేవు. ఈసూత్రమునకన్నన్నో ద్రుతపూర్వాచ్ప్రపంచమంతయు లక్ష్యమె యగును. కాన ద్రుతాంతములైన ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణములయుకారములనే యాధారముగఁ జేసికొని పుట్టిన ప్రథమేతరవిధి వానియభావమున లక్ష్యశూన్యమై నిరవకాశమై ప్రథమేతరశత్రర్థచువర్ణకోకారేతరములగుబహులక్ష్యములందు వర్తించెడి సావకాశవిధి నిఁకాదిసూత్రమును బాధించి తానే ప్రథమేతరశత్రర్థచువర్ణోకారములకు సంధిగూర్చునని భావము. ప్రథమేతరసూత్రలక్ష్యములు ద్రుతప్రకృతికము లిఁకాదినిషేధమునకు విషయములు గావని తాత్పర్యము.

ఆంధ్రశబ్దచింతామణియందలి యత్వేతోత్వసంధిసూత్రములు ద్రుతప్రకృతికాద్రుతప్రకృతికసాధారణములగుట ద్రుతపూర్వాచ్చులకెల్ల సంధి సంప్రాప్తమగుటం జేసియు, ద్రుతమున కచ్చు పరమగునపుడు ద్రుతలోపసంశ్లేషములు విధింపఁబడమిం జేసియుఁ, బదాదియకారమునకు ద్రుతముతోడి సంశ్లేషమును, నది పరమగునపుడు ద్రుతమునకగులోపమును, వారింప "స త్వత్రాజ్వతాంకార్యంజ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః" అనుసూత్రము సమర్థమై యుండుటం జేసియు, 'లుక్సంశ్లేషౌ నాచి' యను సూత్రము ద్రుతప్రకృతికమున కచ్చు పరమగునపుడు సంధిలోఁ గలిగెడు ద్రుతాదృశ్యతను స్వపూర్వస్వరాశ్రయణరూపమగు ద్రుతసంశ్లేషమును, వారించి తన్మూలమునసైన 'వచ్చుక్-ఇపుడు' అనురూపమైన వ్యవహితోచ్చారణమును, నాఁపి ద్రుతమును బరాచ్చుతోడనే కూర్పవలెనను(వచ్చునిపుడు) విషయమును నిరూపించునదిగా భావించి తదాధారముగ నీసూత్రమును సూరి సూత్రించియుండనోపును. 'లుక్సంశ్లేషౌ నాచి' అనుదానిని ద్రుతప్రకృతికస్వరసంధి నిషేధపరముగ సంభావించి యుండనోపునని యభిప్రాయము. సంధి 17 లో దీనివిస్తృతి నరయునది.

## అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగనగు. ౧౦

ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనంబడు. తఱచుగ ననుటచేత నొకానొకచోట వైకల్పికసంధియుం గలదని తాత్పర్యము.

| | | | | |
|---|---|---|---|---|
| ఔర | ... | ఔర | ... | ఔరౌర |
| ఆహా | ... | ఆహా | ... | ఆహాహా |
| ఎట్టూ | ... | ఎట్టూ | ... | ఎట్టెట్టూ |

| | | | | |
|---|---|---|---|---|
| ఓహో | ... | ఓహో | ... | ఓహోహో |
| ఏమి | ... | ఏమి | ... | ఏ మేమి.<br>ఏమి యేమి. |

ఏగి యేగి యనుచోఁ గ్త్వార్థంబగుట సంధిలేదు.

టీ. ''ఆద్యస్యామ్రేడితేఽంత్యలోపశ్చ'' అనునది మూలము. ఒకపద మాయా యర్థవిశేషప్రకాశమున రెండుమాఱు లావృత్తమగును. అందు రెండవరూపమున కామ్రేడితమని సంజ్ఞ. అట్టియామ్రేడితము నాఁబడు రెండవరూపము పరముగాఁగ మొదటి రూపము నంత్యాచ్చునకు సంధి సాధారణముగ నగును. కొండొకచో వికల్పసంధియు సంభవించును. ద్విరుక్తము = రెండుమాఱులు పలుకఁబడుపదము. పరరూపము = రెండవ రూపము. ఔర + ఔర:—ఔర యనురూపముయొక్క ద్విరుక్తము. ఇందు రెండవ మాఱు పలుకఁబడు పద మామ్రేడితము. అది పరముగా మొదటిపదము నంత్యాచ్చగు అకారమునకు సంధి కలిగి పూర్వపరముల నున్న అకారౌకారములస్థానమున నౌకారమే నిల్చి 'ఔరౌర' అని యయ్యెను. ఇచ్చోమాత్రము 'ఔరయౌర' యనరాదు. ఇట్లే 'ఆహయాహ' యనరాదు. తక్కినమూఁడుదాహరణములందు సంధి కలుగుటయుఁ గలుగకున్న యడాగమము కలుగుటయు నగునని యెఱుంగవలయును. క్త్వార్థమునకు ద్విరుక్తి కలిగినను క్త్వార్థమైన యికారమునకు సంధి రాదనువిధింజేసి యచ్చో సంధి రాదనియే గ్రహింపవలెనుగాని యీసూత్రముచే సంధి కలుగునని గ్రహింపరాదు. ఏగి యేగి:—ఇది క్త్వార్థకమున కైన ద్విరుక్తరూపము. ఇచ్చో సంధిరామి యడాగమమే కలుగ ఏగియేగి యయ్యెను. ఈసంధి వికల్పముగఁ గొన్నియెడల నగుటకును గొన్నియెడల నిత్యముగ నగుటకును గొన్నియెడల రాకుండుటకును దఱచు శబ్దము శరణ్యము. ప్రయుక్తముల ననుసరించి దీని నుపయోగించికొనవలయును. బహుప్రసిద్ధప్రయోగములంబట్టి యేగులోనర్థబిందువు లేదనియే యనఁదగును.

అంద్వవగాగమంబులందప్పు నపదాదిస్వరంబు పరంబగునప్పు డచ్చునకు సంధియగు. ౧౧.

| | | | | |
|---|---|---|---|---|
| మూర | ... | ఎఁడు | ... | మూరెఁడు. |
| వీసె | ... | ఎఁడు | ... | వీసెఁడు. |
| అర్థ | ... | ఇంచు | ... | అర్థించు. |
| నిర్జి | ... | ఇంచు | ... | నిర్జించు. |

అంద్వవగాగమంబులు పరంబులగునపుడు యథాసంభవముగా గ్రహించునది. రాములందు-రాములయందు-హరియందు-ఎనిమిదవది - ఎనిమిదియవది.

టీ. 'పరిమితే సమస్తానామ్' 'సంధిర్నిత్యం ప్రత్యయాచః' అనునవి మూలములు. స్వతంత్రప్రయోగమున కర్హములుగానివి యపదములు. అవి యాయాప్రకృతులం గూడియే యర్థవంతములగు. అయావాని కాయాయర్థాదులందగు ప్రత్యయములని యనఁదగు. అట్టి యపదముల తొలియచ్చు పరమగునపుడు పూర్వముననున్న వేయచ్చులైనను సంధి నిత్యముగఁ గలుగును. 'అందు' అను సప్తమీవిభక్తిప్రత్యయమును, సంఖ్యకుఁ బూరణార్థమున నగు 'అవ' అనునదియుఁ బరమగునపుడు ప్రయోగానుసారముగ నీసంధికిఁ బ్రవృత్త్యప్రవృత్తులఁ గల్పించుకొనవలెను. మూర + ఎఁడు:—మానార్థకమగు 'మూర' అనుదానికి తద్ధితప. 25 సూ॥ చే 'ఎఁడు' అనువర్ణకము కలిగెను. 'ఎఁడు' అనునది మానార్థకముతోఁ గలిసియే గాని స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడదు. కాన నిది యపదము. దీనియాద్యచ్చు ఎకారము. ఇది పరముగాఁ బూర్వమునచ్చునకు సంధి యయ్యె. అకారైకారముల రెండింటిస్థానమున ఎకారము కలుగ మూరెఁడను రూపమయ్యెను. వీసె + ఎఁడు=వీసెఁడు, ఇదియుం మానార్థకశబ్దరూపమే నిర్జి + ఇంచు:—ఇది సంస్కృతధాతువున కించుగాగమము క్రియ. 63సూ॥ చేఁ గలిగిన రూపము. ఇందు 'ఇంచు' అనుదానికి స్వతంత్రప్రయోగము లేదు. ఆయాధాతువులకిది చేరియుండును. కాన నిది యపదము. సంధిరా నిర్జించని యగును. ఇట్లే అర్థించని యెఱుఁగవలెను. భారతాదులందు 'ఏము వెలిగాఁగ మాతండ్రికించుసెట్లు' అనుచోటులందలి ఇం చనునది స్వతంత్రప్రయోగార్హమగు ధాతువగుట నద్దాని నపద మనఁజనదు. అరయనరయ నాయావ్యాపారవాచకములగు క్రియల కిష్టపడనునర్థమున నిదియె చేరెడిఁ గాని లాక్షణికు లిద్దాని వివక్షింపమిని బ్రత్యయమనవలసివచ్చెను. రాముల+ అందు=రాములందు: సంధికలిగినరూపము. రాములయందు: సంధిరానిరూపము. హరియందు: సంధిరానిరూపము. హరందనుసంధిరూప మప్రసిద్ధము. ఎనిమిది + అవది= ఎనిమిదవది: సంధిరూపము, ఎనిమిదియవది: సంధిరానిరూపము, ఇట్లే ప్రయోగదృష్టి నీసంధి కలుగుట కలుగకుండుటయు నరయవలయును. అంద్వవగాగమములు పరములగునపుడు తప్ప నితరములు పరములగునపు డీసంధి నిత్యముగ నగునని గ్రహించునది "సంధిర్నిత్యం ప్రత్యయాచః" అను నాథర్వణమునుగూడ నీవిషయమున సూరి యాదరించెననుట స్పష్టము.

**కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల ఱడల కచ్చుపరంబగునపుడు ద్విరుక్తటకారంబగు. ౧౨.**

| | | | | |
|---|---|---|---|---|
| కుఱు | ... | ఉసురు | ... | కుట్టుసురు. |
| చిఱు | ... | ఎలుక | ... | చిట్టెలుక. |
| కడు | ... | ఎదురు | ... | కట్టెదురు. |
| నడు | ... | ఇల్లు | ... | నట్టిల్లు. |
| నిడు | ... | ఊరుపు | ... | నిట్టూరుపు. |

టీ. 'కేచిదాదౌ ద్వివర్ణకాః' అనునాథర్వణము మూలము. కుఱుచిఱుశబ్దముల తుదినున్న గురురేఫమునకును, కడు నడు నిడుశబ్దములతుదినున్న డకారమునకును నచ్చు పరమగునపుడు ద్విత్వటకారము (ట్ట) కలుగును.

కుఱు + ఉసురు=కుట్ ట్ + ఉ + ఉసురు=కుట్టుసురు. కడు + ఎదురు=కట్ ట్ + ఉ + ఎదురు=కట్టెదురు. ఇట్లే తక్కినవూహ్యములు. 'కుఱు చిఱు' అనునవి వృత్తియం దంత్యమగుహల్లు లోపించిన ''కుఱుచ చిఱుత'' అనువానిరూపములు. 'కడు' అనునది వృత్తియం దంత్యద్రుతము లోపించిన 'కడున్' అనుదానిరూపము. 'శిట్ఱలి, కుఱ్ఱుయిర్, కట్టాణి, నెట్టుయిర్ప్పు', అను నరవభాషారూపములనుబట్టి యీద్విత్వవిధానమును సూరి కల్పించెనంద్రు. సాధారణముగ నిట్టిరూపములు నన్నయభారతభాగమున నగపడమింజేసి కావలయు నాతనిచింతామణి యీవిషయమున నేమియుఁ జెప్పదయ్యెను. 'కడునెండ' అనునట్టిరూపములే యందు వ్యస్తములు గాననగునని తోఁచెడి. చిఱుతశబ్దమునకగు టకారద్విత్వమందుమృగ్యము గాఁదగు. ఇందుఁ జిఱుశబ్దమునకైన ద్విత్వటకారరూపములను బ్రౌఢవ్యాకర్త చిట్టిశబ్దరూపములుగ సంభావించి సాధుత్వమును దెల్పినాఁడు. (చూ. ప్రౌఢ. సం-4.)—చిఱుతపులి చిఱుతకూఁకటినాఁడు మొదలగువానింబట్టి చిఱుత చిఱులే తొల్లిటివనవలెను. పిదప నిదియే చిట్టియైయుండనోపుఁగాన నీసూరిపద్ధతియే హృద్యమనఁదగు. ఇందు సమాసముననని యనకున్నను నీవిధి సమాసవిషయమనియే చెప్పవలెను. కాన కడునెండ, చిఱుతయూర్పు మున్నగువ్యస్తములం దీవిధి వర్తింపదని యెన్నవలెను. ప్రక్రియలో 'ఱుడు' అనువానిలో రడలకుమాత్రమే ద్విత్వటకారము విధించుటంజేసి వానిపైనుండు నుత్వము మిగులుచున్నది. ఉత్వము మిగులునన్న నపదాదిస్వరసంధికేని యుత్వసంధికేని నిత్యప్రవృత్తి ననుమానింపక తీరదు. కాన ఱుడుల కుత్వసహితములకే ద్విరుక్తటకారము విధించుట యుచితమని తోఁచెడిని.

టుగాగమాది సామాసికసంధికార్యప్రాప్త్యర్హత లేమింజేసియు, సమాసపూర్వావయవోదంతములకువలెఁ గాక యిందలి యుదంతములతుదిహల్లులకు మాత్రము ద్విరుక్తటకారాదేశ మగుటంజేసియుఁ బ్రధానముగఁ గల్గునది యుత్వసంధియే యగుటంజేసియు,ద్విరుక్తటకారాదేశ మపదాదిస్వరసంధివలె నచ్చు పరమగునపు డిందలి యుదంతములకు నిత్యముగ నగుటను సూచించుసంకల్పమునంజేసియు, నివ్విధానమును సామాసికసంధిసూత్రములలో మాని నిత్యాపదాదిస్వరసంధిసూత్రమువెనుకనే సూరి నిలిపె ననఁదగుంగాన నీసందర్భము ప్రకరణభంగదోషయుతమను గుప్తార్థప్రకాశికోక్తి విచార్యము.

## ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వలు బహుళము గానగు. ౧౩.

| | | | | |
|---|---|---|---|---|
| వాఁడు | ... | కొట్టె | ... | వాఁడు గొట్టె.<br>వాఁడు కొట్టె. |
| అపుడు | ... | చనియె | ... | అపుడు సనియె.<br>అపుడు చనియె. |
| నీవు | ... | టక్కరివి | ... | నీవు డక్కరివి.<br>నీవు టక్కరివి. |
| మీరు | ... | తలఁడు | ... | మీరు దలఁడు.<br>మీరు తలఁడు. |
| వారు | ... | పోరు | ... | వారు వోరు.<br>వారు పోరు. |

అప్పు డిప్పు డెప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతములు; వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుఁగునది ఈకార్యము కళలగు క్రియాపదములమీఁద సహితము కానంబడియెడి.

| | | | | |
|---|---|---|---|---|
| రారు | ... | కదా | ... | రారు గదా.<br>రారు కదా. |
| వత్తురు | ... | పోదురు | ... | వత్తురువోదురు.<br>వత్తురుపోదురు. |

టీ. "గసడదవా స్స్యుః ప్రథమామాత్రాత్" అనునది మూలము. ప్రథమాంతముమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగును. ప్రయోగదృష్టిని బరిశీలించునపు డిక్కార్యము కళాంతములమీఁదఁ గలుగునదిగ సంభావింపక తీరదు. ప్రథమావిభక్తి కళగానఁ బ్రథమపదము కళల కుపలక్షణమని గ్రహించునది. మూలస్థమగు 'మాత్రాత్' అనునది యిట్టియర్థమును గల్పించుటకుఁ బ్రమాణ మండ్రు. కాని డుమువులు తుదిని గలిగినట్టియు, నవి గలుగనట్టి చెట్టుమొదలగునట్టియు శబ్దములనుబోధింప మాత్రపదము నిల్పెనని ప్రాచీనభాషాదృష్టిని జెప్పకతప్పదు. కాని దీని నూతఁగఁ గొనియే లాక్షణికు లీసంధిప్రవృత్తివిషయమునఁ బలుపోకల పోయినారు. వాఁడు + కొట్టె:—'వాఁడు' అనునది ప్రథమ. దీనిమీఁది పరుషమగు కకారమునకు గకార మీవిధిచేఁ గలిగి 'వాఁడు గొట్టె' అని యయ్యె. ఈవిధి వికల్పముగాన 'వాఁడు కొట్టె' అని పరుషమునకు గకారము కలుగనిరూపమును బక్షమున నేర్పడెడి. ఇట్లే చ ట త పలకు స డ ద వ లు గల్గిన తక్కినయుదాహరణము లూహ్యములు. ఇందు రెండవయుదాహరణమునం దాదిపదమగు 'అప్పుడు' అనునది నిత్యైకవచనమగుటంజేసి దానిని బ్రథమగనే భావింపవలెను. 'అప్పుడు'లనిగాని, 'అప్పుడును, అప్పుడు చేత' నని గాని, యితరవచనములందును నితరవిభక్తులందును నిది యుండదు గాన, నిత్యైకవచనమని సూరియాశయము. వాగనుశాసనులు=ఆంధ్రశబ్దచింతామణికర్త. "తిఙ్మధ్యశేషషష్ఠీసుస్కర్మప్రవచనీయజ విభక్తీః, కించిత్ప్రశంసనాద్భుతసంతాప యదా తదా కిమే వాంశ్చ. క్త్వాకిలతూష్ణీమాద్యా నభిదధతి కళాద్రుతో న యేషాం స్యాత్" అని నన్నయ కళాశబ్దవివరణసందర్భమునఁ (సున్) బ్రథమాభిన్నములఁగ (యదా తదా) నెప్పుడప్పుడనువానిని జేర్కొనుటంబట్టి తా నెప్పుడప్పుడనువానికి నిరూపించిన ప్రథమాంతత్వ మాధారమగుమూలగ్రంథప్రణాళికకు విరుద్ధమని యేరైన శంకింతురేమో యని యనుమానించి సూరి, (సున్) ప్రథమను గళగా నిరూపించియు నప్పుడెప్పుడనువానిని దిరుగఁ గళలలో వాగనుశాసనులు పేర్కొనుటకు, కళాసమూహమును విస్తరించి చూపుచు సుబోధము చేయుటే ఫలముగాన నాతనికిఁ బ్రథమకంటె నెప్పుడిప్పుడనునవి భిన్నములనుతలంపు లేదనియు, దానఁ దాను బ్రథమలన్నమాట కాతనిమాట విరోధించునది గాదనియుఁ దాఁజేసినప్రసంగము సుసంగతమే యనియు సమాధాన మప్పుడిప్పు డెప్పు డనువాక్యద్వయమున నిరూపించినాఁడు. కాని సుబంతావ్యయరూపముల ద్వివిధమగు కళాశబ్దసమూహమునఁ బ్రథమనువిభక్త్యంతములలోను, నెప్పుడప్పుడనువాని నవ్యయములలోను జింతామణికర్త నిరూపించుటనుబట్టి వీనిని బ్రథమాంతములుఁగ నాతఁడు భావింపలేదనుట స్పష్టము. అవ్యయములకును (సున్) ప్రథమాప్రత్యయము గలుగుననియు, నది లోపించుననియు, దాన వానికిఁ బదత్వసిద్ధి

కలుగునవియు ననెడు సంస్కృతవ్యాకరణమర్యాద ననుసరించినను వీనియందు సుబంత ములకంటె వైలక్షణ్యము గన్పట్టుచునే యుండును. కాన వానిని చింతామణి సుబంత కళలకంటె భిన్నములుగ నెన్నియుండనోపును.

పైయంశముల గమనించిన నేను వానిని బ్రథమైకవచనములుగ గ్రహించితి ననక యాతనికిని నాయభిప్రాయమే వీనివిషయమునఁ గలదని నిపుణముగ సూరి వ్రాయుట చింత్యము. మీరు + తలఁడు=మీరు దలఁడు:—ఇందు దలఁడనునది తలఁచు ధాతుమధ్యమపురుష బహువచనరూపమా గాక తలఁగు ధాతురూపమా యని సందియం బందనగును. కాని క్రియాప. 101 సూత్రమున నంత్యాక్షరలోపమునకు స్పష్టముగాఁ దలఁచిత్యాది చువర్ణాంత ధాతువుల నుదాహరించి విషయములుగాఁ జేయుచుండుటం బట్టియు నందే పిలుచు మొదలగుపదముచే తలఁగిత్యాదులు గ్రాహ్యములుగాఁదగునని సూచించుటంబట్టియుఁ దలఁడనునది సూరిమతమున తలఁచుతలఁగుధాతువుల మధ్యమ పురుష బహువచనరూపములలో నేదన్నను బాధలేదు.

శాసనములందును, నన్నయప్రయోగములందును నీసంధికిఁ బ్రథమమీఁద నిత్యప్రవృత్తియే గలదు. అథర్వణునికాలమున కీసంధిప్రవృత్తివిషయమున నిత్య వైకల్పికత లసంఖ్యములయ్యెను. కావుననే "పరుషావా స్వరూపేణ ప్రథమాంతో పరిస్థితాః, కాకా సంబోధనే చాపి హ్యవ్యయే కర్మధారయే. అచేతనార్థకే శబ్దే ఇతి శృంగారభూషణః, కేచిదాద్యస్య వానస్యాత్ న చ ప్రాసే యతౌ తు వా, కేచిద్వయోర్వికల్పత్వం యతౌ సర్వత్ర కేచన." అని యెల్లయెడలను వికల్పముగ నగుటను యతిప్రాసస్థలములఁ బ్రవృత్త్యప్రవృత్తులను యథాసంభవముగ సిష్టానుసారముగ నందుటను నథర్వణుఁడు విపరింపవలసివచ్చెను. పిదప రానురానీసంధి వైకల్పికమై యైచ్ఛికముగఁ బరిణమించెను. 'గసడదవాః స్యుః పదాద్వంద్వే' అని చింతామణికర్త మఱియొకసూత్రము నారంభించుటంజేసి వ్యస్తమున నీవిధి వికల్పముగఁ గలుగనగునను నుద్దేశము గలవాఁడనుటకును నవకాశము లభించెడి. కాని సమాసత సిద్ధించిన నేకపదత్వ మేర్పడుటయుఁ దానఁ బ్రథమాంతముమీఁది కచటతపలన నచ్చోటుల నవకాశములేకుం డుటయు, గమనించి ద్వంద్వమునఁ దిరుగ, గసడదవాదేశవిధానముమూల మొనర్చెననుటయే హృద్యము. మఱియు సర్వలక్షణసారసంగ్రహకర్త కవిసంశయ విచ్ఛేదకర్త మున్నగువా రీసంధిప్రవృత్త్యప్రవృత్తులఁ బలుగతుల ననుమానించినారు. సూరి సూత్రమున బహుళపదముంజేర్చి యీసంధి ప్రవృత్త్యప్రవృత్తులను యథా సంభవముగఁ బాఠకులే యూహింతురుగాకని నిపుణముగఁ దెలిపినాఁడు. 'ఈవిధి కళలగు క్రియాపదములందును గనఁబడెడి' అని 'రారుగదా' ఇత్యాదులందె యీవిధి

ప్రవృత్తిని నిరూపించుటంబట్టి కళలలోఁ గ్రియాపదములమీఁదనే దీని వికల్పప్రవృత్తి కనుజ్ఞ సూరి సూచించెనుగాని యెంత, కొంత యనుమున్నగుకళలపైఁ గాదనెనని మాత్రము గ్రహింపరాదు. ప్రథమమీఁది యనుటంజేసి ప్రథమలనే గ్రహింపఁ దనియుఁ బ్రథమ ద్రుతప్రకృతికములుగానివానికి సూచకమనియు ద్రుతప్రకృతికములు గానిక్రియలును నేతద్విధివిషయములుగ నెన్నవచ్చుననియును దెలుపుటకో యాకే సూరి యావివరణవాక్యమును వ్రాసెనని యెన్నవలెను. ఇట్లనిన వివరణమందలి సైత మనునది సార్థకమగు. ఈవిధి వ్యస్తపదవిషయము.

## తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు. ౧౮.

| | | | | |
|---|---|---|---|---|
| వాఁడు | ... | కంసారి | ... | వాఁడు కంసారి. |
| వీఁడు | ... | చక్రపాణి | ... | వీఁడు చక్రపాణి. |
| ఆయది | ... | టంకృతి | ... | ఆయది టంకృతి. |
| అది | ... | తథ్యము | ... | అది తథ్యము. |
| ఇది | ... | పథ్యము | ... | ఇది పథ్యము. |

టీ. "న వికృతిశబ్దాత్పరతస్సాంస్కృతికానాం భవంతి గసడదవాః" అనునది మూలము. ఇందలి తెనుఁగుపదము సంస్కృతసమేతరమును దెల్పెడి. అనఁగాఁ బ్రాకృతసమ - సంస్కృతభవ - ప్రాకృతభవ - దేశ్యపదబోధకమని భావము.

కళలగు తెనుఁగుపదములకంటెఁ దరువాతనున్న సంస్కృతశబ్దముల కచటతపలకు గసడదవలు గలుగవు. అనఁగా సంస్కృతసమేతరములకుఁ బరమున నైన సంస్కృతసమముల యాదినున్న పరుషములు గసడదవలుగా మాఱవని తాత్పర్యము. వాఁడు + కంసారి:—వాఁడనునది తెలుఁగుపదము. దానికంటెఁ బరమునున్న కంసారియను సంస్కృతపదము నాదినున్న కకారమునకు గకారము రాలేదు. కాన 'వాఁడు కంసా' రనియే యగును. ఇట్లే మీఁదియుదాహరణములలో 'చక్రపాణి, టంకృతి, తథ్యము, పథ్యము' అనునవి సంస్కృతపదములు. కాన వానియాదియున్న చటతపలు సడదవలుగా మాఱలేదు. ఉత్తరసూత్రమును బట్టి యిదియు వ్యస్తపదవిషయమనియే గ్రహింపనగుంగాని మిశ్రసమాసములందలి సాంస్కృతికముల కీయాదేశము రాకుండ వారించుట యావశ్యకముగాన నుభయవిషయముగ నెన్నవలెనని తోఁచెడి. ఇందలి తెలుఁగుపదము ప్రాకృతసమభవ-సంస్కృతభవ-దేశ్యవాచక మగుటచేతను, తెలుఁగుపదముల తరువాతిసంస్కృతశబ్దముల పరుషములకే యీనిషేధమగుటచేతను, తెలుఁగుపదములతరువాతి తెలుఁగుపదముల

పరుషములకును సంస్కృతపదములమీఁది సంస్కృతశబ్దములపరుషములకును సంస్కృత పదములతరువాతి తెలుఁగుశబ్దములపరుషములకును గసడదవాదేశము గలుగనగును. దీన "కావలియైసురరాజ్య శ్రీవాలింపంగ" అను మున్నగు ప్రయోగములు సురక్షితము లయ్యెడి. మఱియుఁ, దెనుఁగుపదములమీఁది సంస్కృతశబ్ద కతపలకును గదవా దేశము ప్రయోగదృష్టమని ప్రౌఢవ్యాకర్త 'వీరల్గోపించిన, ఇట్లు దపంబు, వేవణములు' మున్నగువాని నుదాహరించి సూరి యీసూత్రమును సవరించినాఁడు. (చూ. ప్రౌ. సంధి.5) మఱియు "జగములనెల్లెడన్...ఎం, తగుమతులైన నోర్తురె" యని తిక్కన యుఁ బ్రౌఢవ్యాకర్తృసవరణకు మార్గదర్శకుఁ డైనాఁడు. వ్యస్తములేగాక సమస్తము లును నీసూత్రనిషేధమునకుఁ బాలగుననియే గ్రహింపవలెను. (చూఁడు మీఁదిసూత్రము)పైని నిరూపించిన విషయముల వివరింపనే యథర్వణుఁడు "వికృతాః పరుషాశ్చ స్యుస్సుశ్లిష్ట ఆద్యపదాదిగాః, నవో గసడదవాస్సేఽపి పరుషాః ప్రథమాహితాత్" అని మూలమును వివరించినాఁడు. దీనఁ దెలుఁగులమీఁది సంస్కృతపరుషములు గసడదవలు గాకుండుట చింతామణికర్తనాఁటికే గాక యథర్వణునినాఁటికిని నిల్చియే యుండె ననియుఁ దరువాత నీవిధికి సడల్పు సంభవించెననియు ననుమానింపఁదగును. నన్నయ భాషలో నేఁడిట్టి వచ్చుపడిన పొత్తముల నగపడవు గాని, ప్రాచీనశాసనభాషలో "ఇందు ప్రత్యక్షమై ఉర్వీజముల్, వ్రాకె, తమ్ముఁడు ప్రతాపమున, విభుండు సక్రి" అను ప్రయోగము లగపడెడి.

## ద్వంద్వంబునం బదంబుపయిపరుషములకు గసడదవలగు. ౧౫.

| | | | | |
|---|---|---|---|---|
| కూర | ... | కాయ | ... | కూరగాయలు. |
| కాలు | ... | చేయి | ... | కాలుసేతులు. |
| టక్కు | ... | టెక్కు | ... | టక్కుడెక్కులు. |
| తల్లి | ... | తండ్రి | ... | తల్లిదండ్రులు. |
| ఊరు | ... | పల్లె | ... | ఊరుపల్లెలు. |

టీ. "గసడదవాస్స్యుః పదాద్ద్వంద్వే" అనునది మూలము. ఇది తెలుఁగుద్వంద్వ సమాసము విషయము. తెలుఁగున ద్వంద్వసమాస మాచ్ఛికపదములకేగాని సంస్కృతపద ములతోడ నాచ్ఛికములకుఁ గలుగదు. అందును దొలిపదము స్త్రీసమమే యైయుండ వలెను. (చూ. బాల. సమాస. 7.) కాన తెలుఁగుద్వంద్వమునఁ దొలినున్న స్త్రీసమంబగు పదమునకుఁ దరువాతివగు తెలుఁగుశబ్దములపరుషములకు నిత్యముగా గసడదవలు కలుగు నని సూత్రార్థము లభించెడి. కూర + కాయ:—ఇది యాచ్ఛికద్వంద్వము. ఇందు రెండును

దెలుఁగుపదములే.అందును కూరను తెనుఁగుపదము ప్రథమైకవచనలోపమును నిత్యముగఁ బొందినదగుట స్త్రీసమము. దీనికిఁ బరమున నున్న తెలుఁగుశబ్దమగుకాయపదములందలి కకారమునకు గకారము నిత్యముగఁ గల్గి "కూరగాయ"లను రూపమయ్యెను. కూరకాయ లనిగాదని గ్రహించునది. ఇట్లే తక్కినవూహ్యములు.గసడదవాదేశశాస్త్రము (సంధి 13) నిత్యముగాదు. సమాసమునకై ననేకపదీభావనంజేసియు నిట్టివానియం దావిధి వర్తింపదు. కాన నిత్యముగ నీవిధి యారబ్ధము. కాన సంధి 13 సూత్ర మైచ్ఛికశాస్త్ర మని స్పష్టపడెను. మఱియు సాచ్ఛికద్వంద్వమున నిత్యవిధానముంజేసి యితరాచ్ఛిక మిశ్రసమాసముల నీవిధి యైచ్ఛికమని గ్రహింపఁదగును. కాని "నల్లగలువ, వెలిదమ్మి, వేగంటి" మొదలగువానియందు నిత్యముగ నగుటయు, నాఁపసేను,కనుపపులు,కడలిరాచూలి"మొదలగువానియం దీవిధి కప్రవృత్తియుఁ గన్పట్టెడి. ద్వంద్వసమాసమున నిత్యమను నీపునర్విధానమునంజేసి 13 సూత్రము వ్యస్తపదవిషయమును వికల్పమును నయ్యెడి. ప్రౌఢవ్యాకర్త యిట్టి యాచ్ఛికద్వంద్వములందును చ ఠ పలకు సదవలు గల్గుట చూపట్టదని 'అప్పాచెల్లెండ్రు, అందచందములు, రాకపోకలు, కండతుండెములు' మున్నగువానిం జూపి సూరి యీసూత్రమును సవరించినాఁడు. (చూ. ప్రౌఢ. సంధి. 6) "స్యుర్ఛిన్నా ఏవ తస్మాత్తే వినాద్వంద్వం హ శేర్మతే" అని యథర్వణుఁడును ద్వంద్వమున నీవిధి నిత్యముగ నగుటనే సూచించినాఁడు. దీనింబట్టి ప్రౌఢవ్యాకర్త యివ్విషయమున నిచ్చినవానిం బోలునవి నన్నయాథర్వణులనాఁడు లేవనియుఁ దరువాత నేర్పడినవనియుఁ దెల్లమయ్యెను. సముచ్చయమునం దిదంతములపైనైన 'యుం ను' అనునది లోపింపఁగాఁ దత్పూర్వస్వరము దీర్ఘమగుట వ్యవహారప్రసిద్ధమగుటంజేసి "అన్నా దమ్ములు, తల్లీతండ్రులు" మున్నగురూపములు వ్యస్తములుగాని సమస్తములు గాఁ జాలవని తోఁచెడి. ఐనను 'అప్పాచెల్లెండ్రు' మున్నగురూపము లర్వాచీనలాక్షణికుల మతమున ద్వంద్వములే యై సాధుత్వము నందినవి.

ద్రుతప్రకృతికములమీఁది పరుషములకు సరళములగు. ౧౬.

| | | | | |
|---|---|---|---|---|
| పూచెను | ... | కలువలు | ... | పూచెను గలువలు. |
| తోఁచెను | ... | చుక్కలు | ... | తోఁచెను జుక్కలు. |
| చేసెను | ... | టక్కులు | ... | చేసెను డక్కులు. |
| నెగడెను | ... | తమములు | ... | నెగడెను దమములు. |
| మొగిడెను | ... | పద్మము | ... | మొగిడెను బద్మము. |

టీ. "పరుషా ద్రుతప్రకృతికాత్సరళాః స్యుః" అనునది మూలము. ద్రుతమంతమందుఁ గలపదములు ద్రుతప్రకృతికములు. అట్టి ద్రుతప్రకృతికములకంటెఁ బరమున నున్న క చ ట త పలకుఁ గ్రమముగా గ జ డ ద బలు నిత్యముగనగును. పూఁచెను + కలువలు:—'పూఁచెను' అనునది ద్రుతప్రకృతికము. ఇందు 'ను' అనునది ద్రుతము. (చూ. క్రియ. 16) దీనికి 'కలువ' అనుశబ్దమునాదినున్న కవర్ణము పరముగ నున్నది. కాన దానికి గకార మాదేశముగా 'పూఁచెను గలువలు' అనురూప మయ్యెను. ద్రుతప్రకృతికములకుఁ బరముననుండు పరుషములు తత్సమాదిశబ్దముల కేవానికి సంబంధించినవైనను నీకార్యము కలుగును. "నెగడెను + తమములు=నెగడెను దమములు, మొగిడెను + పద్మములు=మొగిడెను బద్మములు" అని సంస్కృతసమముల పరుషములకు గజడదబాదేశమును నిరూపించుటచేఁ బై విషయము స్పష్టపడెడి. ఆదేశమనఁగా నొకదానిం ద్రోసి పుచ్చి మఱియొకటి తత్స్థానము నాక్రమించుట. ఇందు క చ ట త పలను ద్రోసి క్రమముగ వానిస్థానమున గ జ డ ద బలు నిల్చుచున్నవి కాన నివి వాని కాదేశములయ్యెనని గ్రహించునది. తక్కుంగలయుదాహృతు లూహ్యములు.

ఈసరళాదేశ ముత్వవిశిష్టద్రుతముమీఁద నన్నయకాలమున నగపడదనియుఁ బొల్లురూపమునందిన ద్రుతముమీఁదనే యగపడుననియు దాన "కవదొనలును గాండీవము......మే, ను విదపడిగియొద." అని యప్పకవి సంధిగతప్రాసమున కిచ్చిన తిక్కనభారతలక్ష్యము "ఏను పిదప" అనియే యుండఁదగుననియు, "గసడదవాదేశవిషయమున నాత్మాస్మచ్ఛబ్దములను 'ఆత్మాస్మదోర్విస్సై వైతే'"అని పృథక్కరించుటంబట్టి యది కలుగదనియుఁ బైవాదము చేయువారి యాశయము. అట్లయిన లాక్షణికాసమ్మతమగు పవప్రాసము సంధిలుకతన ఛందోనియమము దుష్టమగుంగదా యనుశంక కలుగకపోదు. "ఆవసరజ్ఞుండయి కపిలకన్నులు కపిలగడ్డము కపిలజడలు" అని నన్నయ కపిలశబ్దఘటితసమాసత్రయమును సూరి యెన్నినట్లే పకారమధ్యములుగఁ బ్రయోగించి పవప్రాసమును గూర్చినవాఁడగుటఁ దిక్కనయు నట్టిప్రాచీనమార్గముపట్టి "ఏనుపిదప" అనుస్థలమున పవప్రాసముం గూర్చెననియుఁ దరువాతి లాక్షణికులమతమున నుత్వవిశిష్టద్రుతముపై సరళాదేశమును పవలకుఁ బ్రాసము లేకుండుటయు సిద్ధములయ్యెఁగానఁ బైనుదాహరించిన తావులందు లేనిపోనిసందేహములు గలిగెననియుఁ బైవాదముచేయువారు సమాధానమిత్తురు. "యతిప్రాసాదిస్థలములనుండి కదల్పరాని ప్రయోగముల నుత్వవిశిష్టద్రుతముపైఁ గల్గినసరళాదేశమును ధ్రువపఱచుటకుగాను నన్నయభారతభాగమునుండి యుదాహరించుట దుస్సాధము. ఒకవేళ నగపడినను నవి యాయాయర్థవిశేషప్రకాశనమునకైన ద్రుతము లై యుండనోపెడిఁగాని పోయినను నున్నను బదార్థమునకు భంగము

తేని ద్రుతములు గాఁజాలవు." అని పైవాదమువారియభిప్రాయము. మఱి కొందఱు "ఏను"అనుదాని కవధారణార్థకమగు అకారముం జేర్చి కళగా మార్చి గసడదవాదేశము కూర్చి "ఏన విదప"అని సమర్థించిరి. కొందఱు "అస్మచ్ఛబ్దము" 'నేను' అనురూపము గలిగియుండునపుడే గజడదబాదేశము సిద్ధించును. అది 'ఏను' అని వికృతినందినపుడు గసడదవాదేశవిషయమే యగును. కాన 'ఏను విదప' అను ప్రయోగము సిద్ధించుట కడ్డంకి లేదందురు. ఇట్లే "నీచెప్పినపెద్దలు,...యే చక్కంబెట్టువాఁడనే పాండవులన్" అనుతిక్కనప్రయోగమున 'యేచక్కంబెట్టు' అనుస్థలమున గజడదబాదేశము రాకుండుట కన్పట్టెడి. కొందఱిచ్చో యేనుశబ్దము నేననుదానికంటె భిన్నమై లుప్తద్రుతాంతం బయ్యెఁగాన నిచ్చోటిచకారమునకు జకారము కలుగలేదనియు గసడదవాదేశము వికల్పవిధియగుటఁ గలుగలేదనియు నందురు. మఱికొంద ఱందలిది యేనుశబ్దలుప్తశేషమగు ఏరూపము గాదనియుం 'కొని' యనుదానికిని, 'వాఁడను' అనుదానికిని బ్రశ్నార్థకమగు నేకారము చేరఁగా నైనరూపములనియు సమర్థించి "వారలను నవలంబించియా నేను బాండవులను జక్కఁబెట్టువాఁడను?" అనఁగా వారల నాధారముగఁ జేసికొనకయే స్వయముగఁ బాండవుల సాధింతును." అనునర్థము నిచ్చునదిగ సంభావించి యచ్చోటి జకారాదేశమునకుఁ బ్రసక్తియే లేదనిరి. 'చక్కఁబెట్టువాఁడను' అను క్రియ నేననుకర్తను దెల్పుటకు సమర్థమైయుండుటంబట్టి గొనిపదముతరువాతి "యే" అనునది ప్రశ్నార్థకముగ నంగీకరించుటయే యుచితమగును. అట్లే "వాఁడనే" అనుదానియందలి నేయనుదానిని నేనుశబ్దక్షిప్తరూపముగఁ దలఁచి పాండవశబ్దాదిగతపకారమునకు బాదేశమేల కలుగలేదని శంకించికొనుటకన్ననుత్తమైకవచనసూచకమగు 'ను' అనుదానితోఁ బ్రశ్నార్థకైకారము సంధించి 'వాఁడనే' అనురూప మేర్పడెననుటయే సమంజసము. రెండు ప్రశ్నార్థకములు స్వయముగా నేనొక్కఁడనే సాధింతుననుటను దృఢపఱచునవని యీపక్షమున నెన్నవలెను. ఈపక్షమున గసడదవాదేశము వికల్పవిధి గాన రాదయ్యెనని యెన్నునది. ఇఁక "ధృతరాష్ట్రుండును బుత్రులున్వనము......గా, నతగం బొందుటకార్యము"అను తిక్కనప్రయోగమున ద్రుతప్రకృతికముమీఁద సరళాదేశము గాకపోవుట చూపట్టెడు ననువిషయమును బరిశీలింతము. కొంద ఱిచ్చోఁ గాన యనునది కాననశబ్దవికృతియగు కానశబ్దపుఁ బ్రథమారూపముగాను 'తగన్' అనునది 'తెగన్' అనునట్లును (నాశార్థక తెగుధాతునుజ్యంతము) ననుమానించి కాన తెగఁగా వనావృతవృత్తంబులుగాని సింహములకు వేగంబ చేటొందునని పూర్వమున కన్వయించి సరళాదేశాభావమును సమర్థించుచు గసడదవాదేశముగూడ వికల్పవిధి యగుటఁ గలుగలేదని తీర్మానించిరి. కొందఱు కావున ననునర్థమిచ్చు కానయే యైనను నది ద్రుతప్రకృతికమని సమర్థింప సమర్థములగు ప్రాచీనప్రయోగములు లేమి కళ యనఁ దగుననియుఁ గాన నిట

గసడదవాదేశము రామి మాత్రమే విశేషమనియు నండ్రు. కొందఱు కాను లేక కాన్ అనుప్రకృతి కవధారణార్థకమగు అకారము చేర్పఁగ కాన అనురూపము కలుగు ననియు నది అగుటయే యనునర్థ మిచ్చెడిఁగాన నచ్చో కాబట్టియే యనునర్థము పొసఁగెడిననియు నండ్రు. ఇఁక "ధృతరాష్ట్రుం డవినీతి సేసినను... వేఁగ తెగంబాఱను..." అను తిక్కనప్రయోగమున వేగ ననునది ద్రుతాంతమగుట 'తెగన్' అనుదాని తొలి తకారము దకారముగా మాఱకుండుట లక్షణవిరుద్ధమనియు నచ్చో దకారాదేశము గల్గిన ప్రాసభంగము వాటిలుననియు నండ్రు. ఇచ్చో వేగమను ప్రకృతినుండి ములోపము కలుగ 'వేగ' అనురూప మేర్పడినట్లు నిర్ణయింపనగుఁ గానఁ గళయే యయ్యెడి. దీనిని ద్రుతాంతముగాఁ జేయవలెనన్న 'వే' అను వేగమనుశబ్దపుఁ గ్లుప్తరూపమునకు 'కాను' అను నుజ్యంతమును జేర్చి సాధింపవలసియుండును. కాను, కను, కన్ అని మాఱుట ప్రసిద్ధమును వ్యాకర్తృసమ్మతమును నైనవిషయము. (చూ. క్రియ. 115-116: చూ. ప్రౌఢ. 23) కాన నిచ్చో వేగనునది వేగముశబ్ద లుప్తమువర్ణకరూపముగ నెన్నుటయే యుచితమని తోఁచెడి.

## ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు. ౧౭.

సంశ్లేషం బనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట.

పూచెను గలువలు ... పూచెంగలువలు. / పూచెఁగలువలు. / పూచెన్గలువలు.

తోఁచెను జుక్కలు ... తోఁచెంజుక్కలు. / తోఁచెఁజుక్కలు. / తోఁచెన్జుక్కలు.

చేసెను డక్కులు ... చేసెండక్కులు. / చేసెఁడక్కులు. / చేసెన్డక్కులు.

నెగడెను దమములు ... నెగడెందమములు. / నెగడెఁదమములు. / నెగడెన్దమములు

మొగిడెను బద్మము ... { మొగిడెంబద్మము.
మొగిడెఁబద్మము
మొగిడెన్బద్మము.

పక్షంబున స్వత్వంబగు; స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము.

టీ. "తద్ద్రుతం చ బిందుస్స్యాత్, అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సంతి తే పరతః" అనునవి మూలములు. ఆదేశసరళములు:—పూర్వసూత్రముచేఁ బరుషముల కాదేశములుగ వచ్చిన గ జ డ ద బ లాదేశసరళములు. వీనికిఁ బూర్వముననున్న ద్రుతమునకు వికల్పముగ బిందువును సంశ్లేషమును గలుగును. బిందుసంశ్లేషములు రెండు కార్యములునుఁ బర్యాయముగ వికల్పముగ నగునని గ్రహింపవలెను. పైరెండుకార్యములును వికల్పములగుట రెండును గలుగనపుడు ద్రుతము తనసహజరూపముతోడనే యుండును. బిందుశబ్దము పూర్ణార్ధములను రెండింటిని బోధించునది కానఁ బ్రక్రియలో హ్రస్వదీర్ఘముల గమనించుచు యథాసంభవముగ పూర్ణార్ధబిందువులఁ గూర్చుకొనవలెను. సంశ్లేషమనఁగా ద్రుతము తనకుఁ దరువాత నున్నహల్లుతోఁ గలిసికొనుట. హల్లు వేఱొకహల్లుతోఁగలియుట తనపైనుండునచ్చు పోవునపుడే సంభవించెడిఁగాన సంశ్లేషవిధానమునకు ద్రుతము లుప్తాచ్కమగుననుటయే తాత్పర్యముగ నభివర్ణింపఁదగును. ఐనను సూరి "పూచెన్ కలువలు" అను వ్యవహితోచ్చారణమున కవకాశ మీయకుండుటకై తరువాతిహల్లుతోఁ గూడుటయే సంశ్లేషలక్షణముగ నిర్వచించి యుండనోపును. కాని యట్టి వ్యవహితోచ్చారణము తరువాతిపదమునర్థము నాకాంక్షించు ప్రయోజనమునంజేసి కలుగనే కలుగదని చెప్పఁదగునుగాన నీవివరణము స్పష్టార్థమయ్యెడి. పూచెను + కలువలు:—ఇందు కలువశబ్దమందలి కకారమునకుఁ బూర్వసూత్రముచే గకారము గలిగెఁగాన నది యాదేశసరళము. దానికిఁ బూర్వమున నున్న 'పూచెను' అనుపదముతుదినున్న 'ను' అనునది ద్రుతము. దానికి నెఱసున్న యాదేశము గాఁగ "పూచెంగలువ" లనియు, నరసున్నగలుగ "పూచెఁగలువ"లనియు, సంశ్లేషము గలుగ "పూచెన్గలువ"లనియు, నీకార్యము లెవ్వియుఁ గలుగకున్న "పూచెను గలువ" లనియు రూపము లేర్పడెడి. ఇట్లే జ డ ద బలాదేశసరళములు పరములగునపుడును రూపముల నూహించికొనునది. దీర్ఘముమీఁది ద్రుతమైన నర్ధబిందువు మాత్రమే దానికగునని గ్రహింపవలెను. (చూ. సంధి 23 టీక.)

నన్నయకు ద్రుతద్విత్వమిష్టమని చూప "అన్నిష్టసఖి" అనునాతనిప్రయోగము నుదాహరించి "లుక్సంశ్లేషో నాచి" యని సూత్రించుట ప్రయోగవైరళ్యసూచనార్థమను

సీతారామాచార్యులు గారివ్రాత ననుసరించి ద్విత్వసంశ్లేషములు పర్యాయము లనియు, సంశ్లేషమనఁగా మీఁదిహల్లుతోఁ గూడుటే యనియు సూరివలెనే యాతఁడును భావించి యుండుట స్పష్టము. "అలుకి చ సంశ్లేషస్స్యాత్" అను సూత్రవ్యాఖ్యలో "నస్య పరవర్ణేన సాకం సంశ్లేషశ్చ భవేత్" అనుసహోబలునివ్రాతయే సూరి-సీతారామాచార్యుల సంశ్లేషవిషయకములకు వ్రాతలకు మూలము. అహోబలపతి "వాక్యాంతగత పదానాం చ" అనుసూత్రము వ్యాఖ్యలో 'పద్యభేదావసానే తు శ్లిష్టతా నస్య కథ్యతే" అనునథర్వణకారిక నాధారముగఁగొని 'వచ్చెన్' అనురీతి విద్రుతసంశ్లేషములనియు నంగీకరించుటంజేసి ద్రుతము తనకుఁ బూర్వమున నున్నయచ్చు నంటి వ్రేలాడియుండు టయు సంశ్లేషలక్షణముగనే గ్రహించెననకతీరదు. ఇమ్మతము మాత్రము బాలప్రౌఢ వ్యాకర్తలచే ననాదృతము. "నోవాద్విత్వం క్వచిద్ధిష్టం పరప్రాణేన సంగతేః" అని యాథర్వణ మిట్టిరూపముల విరళములనియని వానిని ద్విత్వములనియే వ్యవహరించెను. 'క్వచిచ్ఛిష్టం' అను పాఠాంతరముంబట్టి కొందఱు ద్విత్వసంశ్లేషములు భిన్నములనియు ననఁగా రెండు హల్లులకలయిక ద్విత్వమనియు ద్రుతము పూర్వాచ్చునంటియుండుట సంశ్లేష మనియు నంద్రు. సమానవర్ణైక్యము ద్విత్వమనియు నసమానవర్ణైక్యము సంశ్లేష మనియుఁ గొందఱిమతము. పొల్లుహల్లున కుచ్చారణము లేదు. అది యచ్చుతోఁగూడి యున్నపుడే దానియుచ్చారణము సుగోచరమగు. ఉచ్చారణసుఖముం గోరి యాయా వర్ణములకును బదములకును నుత్వము తెలుఁగునఁ జేర్చుట సహజము. అట్టి సుఖోచ్చారణార్థమేర్పడిన యచ్చు కొన్నియెడల సుఖోచ్చారణము మూలముననే వేఱొకగతిని మాఱెడి. ద్రుతము పైపద్ధతి ననుసరించియే యుత్వవిశిష్ట మయ్యెను. లుప్తాచ్కమగుద్రుత సంబంధముననే పరుషములు సరళములగుట సహజము. ద్రుతము సుఖోచ్చారణార్థమైన యుత్వముతోఁ గూడినపుడు దాని పోఁకు పరుషములకుఁ గలుగమి నవి సరళములగుట యసహజము. పైయంశములను గమనించియే యాంధ్రశబ్దచింతామణి పొల్లురూప మగుద్రుతమే పరుషముల సరళములుగా మార్చును, బిదప బిందురూపమునందును, నర్థ్వామైనదిగ సంభావించెను. మఱియు ద్రుతము పొల్లురూపముగ నున్నపుడు తాను నిల్చుటకుఁ దనకుఁ బూర్వమున నుండునచ్చే యాధారమగుట బిందురూపమును దానంద నపుడు స్వపూర్వస్వరమునుబట్టి వ్రేలాడియుండుటయే దాని సహజస్థితి యయ్యెడి. ద్రుతము పొల్లురూపముగ నున్నపుడుగాని పూర్ణబిందురూపమున నున్నపుడుగాని తనకుఁ బూర్వముననున్నయచ్చునకే గురుత్వమును గూర్చుచున్నదిగాన నదియ దాని యునికి కాధారమనుట సయుక్తికము గదా! కావుననే చింతామణి యాదేశసరళములకు ముందున్నపొల్లురూపమగుద్రుతమునకు స్వపూర్వస్వరాశ్రయణము సహజమై

యగుటంజేసియు, నవ్యవహితోచ్చారణమున హలంతరసంయోగము స్వభావసిద్ధమగుటం జేసియు నేరూపమగుసంశ్లేషమును నిరూపింప దయ్యెను. ఇఁక సహజసరళములు పరములగునపుడు ద్రుతమునకు లోపము వికల్పముగ విధించుటంజేసి లోపము రానిపక్షమున నెట్టిరూపమగునో యను పాఠకులకగు సందియమును వారింప ద్రుతలోపము గలుగునపుడు 'అలుకి చ సంశ్లేషస్స్యాత్' అని సంశ్లేషమగు ననవలసివచ్చినదిగాన నీవిషయమును గమనించినను జింతామణి ద్రుతము తనకుఁ బూర్వమున నున్నయచ్చు నంటియుండుటయే సంశ్లేషముగ భావించె ననక తీరదు. అచ్చు పరమగునపుడు ద్రుత మచ్సంధివిధులచే నదృశ్యమగుటయు స్వపూర్వస్వరమునంటి ప్రేలాడి యుండుటయు నసహజములును నసభిమతములును నగుట వానిని వారించుటకై "లుక్సంశ్లేషా నాచి" అనుసూత్ర మారబ్ధమయ్యెననుట చింతామణి ప్రణాళికకుఁ దగియుండు నను నంశమును గమనించినను జింతామణి ద్రుతము తనకుఁ బూర్వమున నున్నస్వరము నంటియుండుటయే సంశ్లేషముగ భావించెననుట సుబోధమగును. బాలప్రౌఢవ్యాకృతులు సుఖోచ్చారణమునకైన యుకారముతోఁ గూడినద్రుతముమీఁదనే సరళాదేశము విధించినవగుటంజేసియు నట్టిద్రుతముమీఁదియుకారము తొలఁగినంగాని హలంతరయోగ మద్దానికి సిద్ధింపమింజేసియుఁ బొల్లుహల్లు తరువాతిహల్లును గూడుట స్థూలదృష్టికిఁ దోఁచునదగుటంజేసియు సుబోధమునకై ద్రుతమునకగు హలంతరసంయోగమునే సంశ్లేషముగ భావించినవి. కాఁగా నన్నిష్టసఖిత్యాదులు సుఖోచ్చారణార్థ మింకొక నకారము చేరినరూపములగుట ద్రుతద్విత్వములనుట తగుననియు నిట్టియాంచ్ఛికరూపముల ప్రక్రియను దత్సమరూపసాధనపరమగుచింతామణి తలపెట్టనే లేదనియు, వానిని ద్రుతసంశ్లేషములుగ నెన్ని ప్రౌఢవ్యాకర్త "లుక్సంశ్లేషా నాచి" అనుసూత్రమందలి సంశ్లేషమునకు లక్ష్యములుగఁ జేయుట తనకనుకూలించుగతిని దాఁజేసినసమన్వయమేగాని మూలాభిప్రాయ మట్లుగామి నిర్మూలప్రసంగమనియుఁ దోఁచెడి. మఱియు మూలమున, ద్రుతమున కచ్చుపరముగా నింకొక నకారమును విధించువిధి గానరామిని, నెల్లయెడల నట్టితావులను, నకారమైన, నచ్చరత్వమే గలుగఁజాలమిని 'లుక్సంశ్లేషానాచి' అను విధికే యావశ్యకత లేమిని, నీసూత్రము పదాదియకారమున 'సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య' అనుదానిచే రజ్వద్భావముగా, నగుస్థితినిగాని, నకారాంతరమును నడుమఁగూర్చి యచ్చరత్వమును కొ[illegible]చి లోపసంశ్లేషములఁ జేయరాదనిగాని బోధించునదనుట సరసమని తోఁచెడి. కాన నెట్లరసినను, సంశ్లేషమన ద్రుతము తనకు ముందున్న స్వరము నంటియుండుటయే యని ప్రాచీనలాక్షణికులయాశయమనుట తెల్లమయ్యెను. అన్నిష్టసఖిత్యాదులవంటి వానిని నాలంకారికులు దుస్సంధులనుటంజేసి అన్న+ఇష్టసఖి = అన్నిష్టసఖి, అని ప్రక్రియచూపి ఉన్న+ఎడల = ఉన్నెడల, ఉన్న+అతఁడు ఉన్నతఁడు, అనునన్నియ

ప్రయోగములవలె సాధుత్వమును సంపాదించుటయే ప్రాచీనసమ్మతమార్గమైనట్లభివర్ణింపఁ దగును. (చూ. నరసభూపాలీయము. దోషప్ర.'')

ప్రకృతిభావ మనఁగా ద్రుతము బిందురూపమునుగాని హలంతరసంయోగరూపమునుగాని పొందక నిల్చియుండుట. ఈవ్యాకర్తృమతమున నుత్వవిశిష్టరూపమే ద్రుతసహజరూపమగుట బిందుసంశ్లేషములు గలుగనపుడు నుస్వరూపముతోడనే ద్రుతము నిల్చియుండునుగాన నదియె స్వత్వరూపముగ సంభావితమయ్యెను. పూచెను గలువలు. ప్రకృతిభావము = ద్రుతమునకు బిందుసంశ్లేషరూపమగుసంధి కలుగక సహజస్థితి యొప్పుట. చింతామణిమతమున ద్రుతము పొల్లురూపమే యగుట దాని కిట్టియెడల స్వపూర్వస్వరాశ్రయణరూపసంశ్లేషమే సహజరూపమయ్యెడిఁగాన నందుఁ బ్రకృతిభావ మద్దానికి విహితము గాలేదు ఇట్టి స్వత్వరూపమును విధించుటకు సూరికి ''ఇ ఈ ఐభ్యః పరం స్వత్వం నిస్స్యాద్యదన్యత్ర నుర్భవేత్'' అను నాథర్వణము మూలము గానోపును. 36 సంధిసూత్రముచే నేకాక్షరశేషములైనవానికిఁ బరుషములు పరము గానగు నుగాగమమునకు సంశ్లేషము సంభవింపకుండుట కిందలి విభాషాపదము నియమము గాఁగలదు. చూ. సంధి 36-37.

### ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాషనగు. ౧౮.

| | | |
|---|---|---|
| వచ్చెను ... | గోవులు ... | వచ్చెగోవులు<br>వచ్చెన్గోవులు<br>వచ్చెనుగోవులు |
| మెఱసెను ... | ఖడ్గము ... | మెఱసెఖడ్గము<br>మెఱసెన్ఖడ్గము<br>మెఱసెనుఖడ్గము |

టీ. ''లుగ్వా ద్రుతప్రకృతికాత్పరతస్సరళే స్థిరే చ నస్యస్యాత్'', ''అలుకి చ సంశ్లేషస్స్యాత్'' అనునది మూలము. కచటతపలకైన గజడదబలుగాక శబ్దసహజములైన గజడదబలు పరములగునపుడు ద్రుతమునకు లోపసంశ్లేషములు పర్యాయమున నగును. లోపసంశ్లేషములు రెండును వికల్పముగ నగునవేయగుట నవి రానపుడు ద్రుతమునకుఁ బ్రకృతిభావమే కలిగెడి. వచ్చెను + గోవులు:—'గోవులు' అనుపదము నాదినున్న గకారము శబ్దసహజము. అది పరముగా 'వచ్చెను' అనుపదము తుదినకారము లోపింప ''వచ్చె గోవు''లనియుఁ, దదభావమున ద్రుతముమీఁది హల్లుతోఁగూడ

"వచ్చెన్గోవు"లనియుఁ, దదభావమున ద్రుతమునకుఁ బ్రకృతిభావము సిద్ధింప "వచ్చెను గోవు"లనియు రూపము లేర్పడును. 'ఖడ్గము' అనుపదమునందలి ఖకారము స్థిరము. అది పరముగాఁ బూర్వరూపమువలెనే రూపత్రయ మేర్పడునని గ్రహింపవలెను.

## వర్గయుక్సరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి. ౧౫.

| | | | | |
|---|---|---|---|---|
| వచ్చెను | ... | ధాత్రీపతి | ... | వచ్చెంధాత్రీపతి. |
| పాడెను | ... | గంధర్వుఁడు | ... | పాడెంగంధర్వుఁడు. |
| కన్ | ... | దోయి | ... | కందోయి. |

టీ. "బిందుం ప్రవదంతి తం క్వచిత్ కేచిత్" అనునది మూలము. వర్గయుక్కులు = కాదివర్గపంచకమునందైన ద్వితీయచతుర్థాక్షరములు. సరివర్ణములని తాత్పర్యము. సరళములు = కాదివర్గులైదింటిలోఁ గల మూఁడవయక్షరములు. ఇందలి సరళశబ్దము సహజసరళములనే బోధించెడి. 'ఖ ఘ చ ఝ ఠ ఢ థ ధ ఫ భ' అనుపది వర్ణములు వర్గయుక్కులు. శబ్దాదిసహజములగు గ జ డ ద బ లే తత్సూత్రస్థ సరళశబ్దవాచ్యములని ఫలితము. ఇవి పరములగునపుడు ద్రుతమునకుఁ గొన్నియెడలఁ బూర్ణబిందువు కలుగును. ఒకానొకచో ననుటంజేసి యివ్విధి క్వాచిత్కమని గ్రహించునది. వచ్చెను + ధాత్రీపతి:—ఇందు ధాత్రీపతిశబ్దాదిగతధకారము వర్గయుక్కు. ఇది పరముగాఁ దత్పూర్వమున నున్న 'వచ్చెను' అనుశబ్దముతుది నున్న ద్రుతమునకు బిందువు కలుగఁగా "వచ్చెం ధాత్రీపతి" యయ్యె. పాడెను + గంధర్వుఁడు:—ఇందు గంధర్వశబ్దాదిగకారము సరళము. ఇది పరముగాఁ దత్పూర్వద్రుతమునకు బిందువాదేశముగఁ గలిగెనుగాన "పాడెంగంధర్వుఁ" డనురూప మేర్పడెను. కన్ + దోయి:—దోయిశబ్దాది దకారము సరళము. ఇది పరముగాఁ దత్పూర్వముననున్న 'కన్' అనుదాని తుదినకారమునకు బిందు వాదేశముగఁ గల్గెఁగాన "కందోయి" రూపము సిద్ధించెను.

'కన్ను' అనుశబ్దమునందుఁ దుదినువర్ణముక్రింది నవర్ణమునకు ప్ర.కీ.ప. 7 సూత్రముచే లోపము గలుగ 'కను' అనియుఁ, దానితుది నువర్ణముమీఁదియుత్వమునకు ప్ర.కీ. ప. 16 సూత్రముచే లోపము కలుగ 'కన్' అనియు రూపమేర్పడెడి. కాన నిందలి పొల్లునకారము శబ్దసహజమే యనక తీరదు. శబ్దసహజమగు నవయవనకారమునకు ద్రుతసంజ్ఞ సూరి యొచటను సమ్మతింపలేదు. కాన నిందు మాత్రము సూరి తన ప్రణాళికకు విరుద్ధముగా శబ్దావయవ నకారమునకు బిందువును విధించుటయు దానిని

ద్రుతమని వ్యవహరించుటయు నసంగతమును నగతికమును ననక తీరదు. కాని 'కన్ను + దోయి' అను షష్ఠీసమాసమున సామాసికవిభక్తిలోపశాస్త్రముచే యొక్కవర్ణకము లోపించినపిదప సంధి 25 సూత్రముచే నుదంతమైన కన్నుశబ్దముమీఁద దోయిశబ్దము నాదినున్నదకారము సహజసరళము పరముగా నుగాగమము కలిగి కన్ను + న్ + దోయియై ప్రకృతులకు వర్ణలోపవర్ణాగమవర్ణవికృతు లాచ్ఛికసమాసముల వివిధములుగఁ గన్పట్టునను ప్రౌఢ. సమాస. 36 చేఁ గన్ను శబ్దమందలి 'న్ను' అనునది లేక ప్రకీర్ణ. ప. 7-16 లచే శేషించిన 'న్' అనునది లుప్తమై యాగమముగాఁ గల్గిన ద్రుతముతోఁగూడి 'కన్' అయ్యెననియు, నాగమనకారమునకు ద్రుతసంజ్ఞ నిరాఘాటముగ సిద్ధించెడిఁగాన సూరి దానిని ద్రుతమని వ్యవహరించి బిందువును విధించెననియు, నవయవనకారమునకును ద్రుతసంజ్ఞ నంగీకరించి సూరి బిందువిధానమొనర్చెనని యన నక్కఱ లేదనియుఁ గొందఱండ్రు. (చూ. చి. విషయ ప. పేరా 128) ఉదంతముపై నుగాగమము కర్మధారయముననే గాని తత్పురుషమున సిద్ధింపదని సంధి 25 సూత్రమునందలి యుదాహరణములు స్పష్టముగఁ జాటుచుండుటంజేసి నుగాగమసిద్ధి షష్ఠీతత్పురుషమగు నిందు సంభవింపదనియు గత్యంతరములేమి నిచ్చోఁ జమాత్రము 'కన్' అనునవయవనకారమునే సూరి ద్రుతమని వ్యవహరించి బిందువిధానముంజేసి కందోయిరూపసిద్ధి యొనర్చెననియుఁ గొందఱండ్రు. సూరి యిచ్చోఁ దన ద్రుతసంజ్ఞ గుదురమిని, ప్రౌఢవ్యాకర్త పేఁబది యిత్యాదులందుఁ బలె (చూ. ప్రౌ. సమా. 24) నేమియు నెఱుంగని వానివలె బిందువునవయవనకారమునకు విధించెననిమాత్ర మనక తీరదు. చింతామణి యవయవనకారమునకు ద్రుతకార్యములు బాహుళికము లనుతలంపుతో నున్నదిగాన నిట్టివి తత్సమ్మతములే యయ్యెడి. మఱియు నందు షష్ఠీసమాసమునందలి షష్ఠ్యంతపదమునకు ద్వితీయాతౌల్యము సంభవించెడిఁగాన నేతత్సాధుత్వవిషయమునఁ బ్రతిబంధమే యగపడదు. వర్గయుక్కులు బరమగునపు డీవిధి క్వాచిత్కముగనే గాన నగు. సరళములు పరములగునపుడు సాధారణముగఁ గన్పట్టఁదగును. కాన నొకానొకచోనను దళము ననుసరించి ప్రయోగానుసారముగ నేతదుపయోగము నరయునది. 'పూర్ణబిందువును' అను సముచ్చయమునంజేసి యథాసంభవముగఁ బూర్వసూత్రముచే నగు లోపసంశ్లేషములును గలుగునని యనుమానింపఁదగును. "కందోయి కన్దోయి" కదోయి గాదు. చూ. సంధి 22 సూ. ద్రుతమునకు మకారము పరమగునపుడు ప్రాసములందు బిందువు విధించి యప్పకవ్యాదు లనునాసికప్రాసముం బొసఁగఁజేసిరి. చూ. అప్పక. 3 ఆ. 342-343 ప. 5 ఆ. 159 ప. తిమ్మకవియు నిమ్మార్గమునే యనుసరించెను. ప్రౌఢవ్యాకర్త "కేచిద్వదంత్య భేదత్వ మనుస్వారమకారయోః." అనునాథర్వణ

మునుబట్టి యట్టిచోటుల ద్రుతమునకు మకారమే యాదేశముగ విధించి వారి నిరాకరించెను. మూలసూత్రస్థమగు 'క్వచిత్' అనుదళమునకు వారొనర్చినవివరణ మిది. ఇందప్పకవి యొనర్చిన బిందువివరణమె సూరి పర్గయుక్కులను కల్పనమునకు బీజము (చూ. అప్పక. 5 ఆ. 152-157 పద్యములు.)

'నఖండః ప్రథమార్ధ్రస్యాన్నస్య లోపశ్చ నేష్యతే' అను నథర్వణకారికకు వ్యాఖ్యానము చేయుచుఁ గవిజనమండన మొసంగిన 'చెంగల్వ, కందోయి, కెంజాయ' అను నుదాహరణత్రయమునుండి సూరి 'కందోయి' అను దానిని స్వీకరించి యుదాహరించుట స్పష్టపడుచుండుటచేత హరికారికాకర్తయే యీసందర్భమును సంస్కృతీకరించుచు నుదాహరణాంతరముం గానక కందోయివంటిదానిని జందోయిని గల్పించి యుండుననఁదగుట నీసందర్భమున సూరిపై హరికారికాచౌర్య మారోపించు గుప్తార్థప్రకాశికాప్రసంగ మసత్యసంకలిత మనఁదగును. మఱియు సూరి 'ఇత్తు-తుంట్లు కన్నెఱికము-లంజె-ముట్టుత' అనుపదముల నసభ్యములనక యుదాహరించియుండుటం జేసి చందోయిని గందోయిగా మార్చెననుటయు ననాకరంబ.

అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగానగు. ౨౦.

వాఁడు వచ్చెన్-వాఁడు వచ్చె-వాఁడు వచ్చెను; ఈలోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబయి యుండు, గుర్వవసాయి యగుపద్యంబుతుదను స్వత్వంబు లేదు. అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధ నేవన్.

టీ. "వాక్యాంతగతపదానాం చ" అనునది మూలము. అవసాన మనఁగాఁ దుది. అచ్చును హల్లును బరముగాక యుండుట. ఏదియుఁ మీఁద లేకపోవుట. అట్టియెడల ద్రుతమందలి యచ్చునకేని యచ్చుతోఁడి ద్రుతమునకేని లోపము బహుళముగ నగును. ద్రుతస్వరమునకు మాత్రమే లోపము కలుగ 'వాఁడు వచ్చెన్' అని యగును. ద్రుతమున కంతకు లోపము గలుగ 'వాఁడు వచ్చె' అగును. ఈ రెండును బహుళములగుటఁ గాకున్న 'వాఁడు వచ్చెను' అను సహజరూపము నె ద్రుతము కలిగి యుండును. 'వాఁడు వచ్చె'నని కర్తతోఁ గూర్చి యుదాహరించుట వాక్యసమాప్తిని సూచించుచుఁ బరమున నేదియు లేదని తెల్పుటకని గ్రహింపవలయును. ఈవిధి కాయాపద్యముల తుదలందలి గణముల యంత్యాక్షరములకు సంబంధించిన గౌరవ లాఘవముల ననుసరించి ప్రవృత్త్యప్రవృత్తుల నూహించికొనునది. అనఁగాఁ దుది

యక్షరము గురువు గావలసిన ద్రుతస్వరలోపమును లఘువు గావలసిన స్వరముతోడి ద్రుతమునకు లోపమును లేక దానికిఁ బ్రకృతిభావమును నిట్లీ గతిని గౌరవలాఘవములు గుదిరి గణభంగము గాకుండున ట్లీవిధి నుపయోగించికొనఁ దగునని భావము. గురువు తుద నుండవలసిన కంద ద్వితీయ చతుర్థపాదాంతములందు మాత్రము ద్రుతమునకు స్వత్వరూపమును గల్పింపరాదు. ద్రుతస్వర ద్రుతలోపములు రెండును వైకల్పికములే యగుటఁ బక్షమున స్వత్వరూపము కలిగెడిఁ గాన గుర్వంతము లగు పద్యపాదములందు మాత్ర మట్టిరూపము గలుగదని వివరణమును సూరి వ్రాసికొనవలసి వచ్చెను. "అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్" ఇది కంద పద్య చతుర్థపాదము. ఇందుఁ దుదిని గురు వుండవలెను. మఱియు నిందుఁ దుది గణము గగము. స్వత్వరూప మిచ్చో నంగీకరించిన 'సేవను' అని గణము చెడును గాన నిచ్చో ద్రుతస్వరలోపమే యగుననియుఁ స్వత్వరూపము గలుగదనియు గ్రహింపవలెను. ఇట్లే తక్కినచోటు లూహ్యములు. గుర్వవసాయి యనుటంజేసి లఘ్వవసాయి యగుపద్యము తుదినినుండిన స్వత్వరూప ముండఁదగును. కాని యట్టి చోటులందును స్వత్వరూపమును ద్రుత మందరాదని 'పద్యావసానే సర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతాం' అను నథర్వణవచనము విశదీకరించెడి. వ్యవస్థ యనఁగాఁ గట్టుఁబాటుగాన గణానుసారముగ నిబద్ధమై యుండునని భావము గ్రహింపఁదగు.

కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. ౨౧.

అదియునున్గాక - దివంబునుంబోలె.

టీ. "ద్రుతాద్ద్రుతః క్వచిచ్చాత్ర దృశ్యతే కవిభాషితే" అను నాథర్వణము మూలము. కొన్ని చోటులందు ద్రుతమునకుఁ బరముగ ద్రుతమే చూపట్టును. అదియును + గాక:—'అదియును' అనుదాని తుదినువర్ణము ద్రుతము. దానికిఁ బరముగ ద్రుతమే కలుగఁగా 'అదియును + న్ + గాక=అదియునున్గాక' అని రూప మేర్పడెను. దివంబును+పోలె:—అనుదాని తుదినువర్ణము ద్రుతము. దీనిపై మఱి యొకద్రుతము వచ్చి 16—17 సంధిసూత్రములచే సరళాదేశ బిందురూపములు కలుగఁగా 'దివంబునుం బోలె' ననురూప మేర్పడెను. ద్రుతముపైఁ గల్గిన ద్రుతమునకుఁ బ్రయోగములందు స్వత్వరూపము సాధారణముగఁ జూపట్టదు. ఈ యంశమును గమనించియే గావలయు సూరి నుగాది వ్యవహారమును జేయక నిపుణముగ అకారమును సుఖోచ్చారణమునకై చేర్చి నకారమనెనని తోఁచెడి. "నకారంబు ద్రుతం" బని

గదా సామాన్యలక్షణము. 'అదియును' అనున దదిశబ్దముమీఁద యుఁవర్ణపూర్వకముగ నుశబ్దము సముచ్చయమునఁ గల్గిన రూపము. 'దివంబును' అనునది యివార్థకమగు పోలె పరముగాఁ గల్గిన సద్రుతరూపము. ఇది వ్యాకర్తృమతమున సమాసము. (చూ. ప్రౌఢ. సమాస ప. 38-39 సూ.) ఆలంకారికులమతమునను నిట్టివి సమాసములే. (చూ. నరసభూ. అలం. ప్ర) 'అదియునున్నా దివంబునున్నా' అను వ్యవహారమును, బహుత్వాద్యర్థప్రకాశనమును గుఱిగాఁగొని యీరూపము లేర్పడి యుండనోపును. ఇందలి యుదాహరణముల ననుసరించి యచ్చు పరమగునపుడు ద్రుతముమీఁద ద్రుతమగుట సూరికి సమ్మతమైనట్లు తోఁపదు. కాని యచ్చు పరమగునపుడును నిక్కార్యము ప్రయోగములఁ గన్పట్టెడి. మఱియు గణప్రతిబంధమునఁ బూర్వ నువర్ణమునకుఁ గురుత్వము వలయునేని యివ్విధి యాదరణీయము గాక తీరదు. కాఁగా నీవిధి యొక్కచో నిరర్థకముగను నొక్కచో నర్థవిశేషద్యోతకముగను గల్గునని ఫలితము తేలెడి.

**అఁట యిఁక చుఁడు శబ్దంబులందప్పు నుడితొలిహ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు. ౨౨.**

**ముంగొంగు - క్రొంబసిఁడి - కన్దోయి.**

టీ. 'న ఖండః ప్రథమార్ధ్రస్వాన్నస్య లోపశ్చ నేష్యతే' అను నాథర్వణము మూలము. ఇందలి ఖండబిందువనునది సిద్ధసాధ్య ఖండబిందువాచకమనుట యుదాహృతులంబట్టి తెల్లము. అఁట:—కిలార్థమును దెల్పు నవ్యయము; కళ. వారఁట, నీరఁట. వ్యవహారమున నేఁడిది 'అష' అయ్యె. ఇఁక:—ఇతఃపరము మఱియును నను నర్థములం దెలుపు నవ్యయము; ద్రుతప్రకృతికము. ఇఁక నేమయ్యె, ఇఁక నొక కారణము గలదు. చుఁడు:—చూడుఁడను మధ్యమపురుష బహువచన నిపాతరూపము. వచ్చును జుఁడీ. నిపాత మనఁగా వ్యాకరణ సాధారణవిధికి సంబంధింపమిని ప్రక్రియ చూపక యిది యిట్లుండునని శాసింపఁబడెడిది. పై మూఁడు మాటలందప్పు మాట మొదటి కుఱుచ యక్కరమునకుఁ దరువాత నరసున్న కలుగదు. మఱియు పదము తొలిహ్రస్వమునకు మీఁదనున్న ద్రుతమునకును లోపంబు సంభవింపదు. పలుకు తొలిహ్రస్వముపై నరసున్న పై మూఁడు శబ్దములందే చూపట్టెడిఁగాని సిద్ధ సాధ్య ఖండములలో నేదియుఁ దదితరములగు శబ్దముల తొలిహ్రస్వముపై సంభవింపదని తాత్పర్యము. ద్రుతమునకు 17 సంధి సూత్రముచేఁ గలుగు పూర్ణార్థములలో నర్థమును బలుకు తొలిహ్రస్వముమీఁద వారింపను, సంధి 24 సూత్రముచే నగు సామాసిక ద్రుతలోపము ప్రథమహ్రస్వము తరువాతి ద్రుతమునకుఁ గలుగకుండఁ జేయను నీ సూత్ర మారబ్ధము. ముందు+కొంగు. సంధి 36 సూత్రముచేఁ దొలి

యచ్చు వర్ణములకెల్ల లోపము. ము + కొంగు. 37 సంధి సూత్రముచే నుగాగమము. ము+న్ +కొంగు. 16 సంధి సూత్రముచే సరళాదేశమును, 17 చేఁ బూర్ణబిందువు మాత్రము కలుగ "ముంగొం" గను రూప మేర్పడెడి. ఇట్లే క్రొంబసిడియు నయ్యెడి. కన్దోయిప్రక్రియ 19 సూత్రపుఁ డీకలోఁ జూపఁబడినది. ఇందుఁ బ్రథమ హ్రస్వముమీఁది దాగమనకారమగుట ద్రుతమని యుక్తి చూపఁబడినది. ఇది ద్రుత లోపము రామి కుదాహరణము. కందోయి యని బిందు రూపమును నుండఁదగును. 17 సూత్రమందలి విభాష వ్యవస్థిత మగుటంజేసి ముంగొంగు క్రొంబసిడీత్యాదులందు సంశ్లేషము గలుగదు. సంధి 17 నందలి విభాషా పదమున కట్టి వ్యవస్థ ప్రాఁతాది శాస్త్రమునకు సంబంధించిన నుగాగమమునకే యయ్యెడిఁ గానఁ గన్దోయీత్యాదులందు 18 చే సంశ్లేషము మాత్రము సంభవించెడి. 19 సంధి సూత్రముచే బిందువు సిద్ధించెడి. ఇవి మూఁడును సమాసపదములు గాన సంధి 26 సూత్రముచే స్వత్వరూపము గలుగదు. కాఁగాఁ గందోయియందలి ద్రుతమునకుఁ బూర్ణబిందుసంశ్లేషములును, ముంగొంగు క్రొంబసిడి రూపద్వయమునందలి ద్రుతమునకుఁ బూర్ణబిందువొక్కటి మాత్రమే కలుగుననియు ఫలితము లేలెడి. 'కన్దోయిచల్లగానిటు కన్దోయి' అని విజయ విలాసము. సమాసమున ద్రుమునకే లోపముగల్గిన బిందుసంశ్లేషములు గుదురమి నపరూపములు గలుగుఁ గాన ద్రుతలోపము గలుగదనెను. నుడి=మాట-పదము. పదము తొలిహ్రస్వముమీఁద ఖండబిందువనుటంజేసి మాట తొలిదీర్ఘముపై ఖండము సంభవింప దనుననునాశయము విశదమగును. అర్ధబిందువును గుర్తించుట కిది యొక మార్గము.

కవిజనమండనవాక్యముల యథావస్థితముగఁ దత్సమము 15-58 మొదలగు చోటుల ననువదించినట్లే యిచటను 'ఇందుచేతనే' ఇఁక-అఁట ఇత్యాదుల సిద్ధఖండము లుండుట; ఇందలి చకారమువలన 'చుఁడు' అనుచో సిద్ధఖండము ప్రవర్తిల్లుచున్నది' అనువాక్యముల ననుసరించి యఁట యిఁక చుఁడులఁ జేర్కొన్నట్లు స్పష్టపడుచుండుట చేత, హరికారికలో లేనిదానిం గూర్చి టంకపుఁబోడి యదికి సూరి పశ్యతోహరుఁ డయ్యెనను నీసందర్భమునందలి గుప్తార్థప్రకాశికోక్తి యసత్యమని విశదమయ్యెడి.

తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు. ౨౩.

| | | |
|---|---|---|
| తాను ... చదివె ... | | తాఁ జదివె<br>తాను జదివె |
| తాను ... వినె ... | | తా వినె<br>తాను వినె |

దీర్ఘంబుమీఁదిదిగాన దీనికి నెఱసున్న లేదు.

టీ. 'వాత్మాస్మదోర్ద్రుతస్య స్యాల్లుక్' అనునదియుఁ దద్వివరణమగు "వినా ద్వితీయం స్యాదస్మదాత్మనోః స్వంతయోరపి నోః" అనునాథర్వణమును మూలములు. 12 ద్రుతసంజ్ఞాసూత్రమున ద్రుతప్రకృతికములుగఁ బరిగృహీతములైన నేనుదానువాని ద్రుతమునకు సరళస్థిరములు పరములగునపుడు 17-18 సంధిసూత్రములచే నగుసంశ్లేషము మాత్రము కలుగదు. దీర్ఘముమీఁదిదిగాన నెఱసున్న దీనికిఁ గాదు. కాన నాదేశసరళములు పరమగునపుడు 17 చే నర్ధబిందుస్వత్వములును, సహజసరళస్థిరములు పరములగునపుడు 18 చే లోపస్వత్వరూపములును మాత్రమే సంభవించెడి. తాను + చదివె:— 16 చే సరళాదేశము. తాను+జదివె. 17 చే నర్ధబిందురూపమును, స్వత్వమును, గలుగ "తాఁ జదివె, తాను జదివె." అనురూపములు గలుగు. 'ఇట్లే, నేను గంటిని; నేఁగంటి' నిత్యాదు లూహ్యములు. తాను+వినె:—వినెను లోనివకారము స్థిరముగాన 18 చే లోపస్వత్వములు సిద్ధింప "తాను వినె, తా వినె"నని రూపములయ్యెడి. ఇట్లేదీర్ఘముమీఁది ద్రుతమునకు సరళస్థిరములు పరములగునపుడు కార్యము లూహ్యములు. నేనుదానులమీఁది ద్రుతమునకు సంశ్లేషము గలుగదనునీవిధి దీర్ఘములమీఁది ద్రుతములకెల్లనుపలక్షణమని ప్రయోగములంబట్టి గ్రహింపఁదగును. పూర్ణబిందువు దీర్ఘముమీఁది ద్రుతమునకుఁ గలుగదనుటంజేసి యట్టిశ్రుతియే దీర్ఘముమీఁదిసంశ్లేషమునకును సంభవించెడిఁ గాన సంశ్లేషము గూడ నిషిద్ధమే యని పాఠకులు గ్రహింపకపోరనునాశయముతోఁ గావలయు సూరి యివ్విషయమును వివరింపఁడయ్యెను. చింతామణి యిట్టిసంశ్లేషమును మాన్పనే 'వాత్మాస్మదోః' అనుసూత్రము నారంభించియుండనోపునని, ఫలాంతరములేమి నూహింపనగును. (చూ. అహో. పం. పుట. 232)

సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు. ౨౮.

ఎల్లయర్థములు - ఎల్లకలుషములు; సర్వపర్యాయంబయినయెల్లశబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.

టీ. 'ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' అనునది మూలము. సమాసమున ద్రుతమునకు నిత్యముగ లోపము గలుగును. ఎల్లన్ + అర్థములు:—ఇది కర్మధారయము. కాన 'ఎల్లన్' అనుదాని తుదిద్రుతము లోపించి పరాచ్చునకు యడాగమము గలుగ 'ఎల్లయర్థములు' అనురూప మయ్యెను. ఇట్లే తక్కినయుదాహరణ మూహ్యము. ద్రుతము లోపించుటంజేసి "యెల్లకలుషము"లనునపుడు సరళాదేశమును ద్రుతమునకగు బింద్వాది

రూపములును గలుగవయ్యెను. సమస్తమునునర్థమిచ్చు నీయెల్లశబ్దము ద్రుతమంతమందుఁ గల యవ్యయమనియు, ద్రుతాంతమగు దీనికి సమాసమునందే విశేష్యమునకుఁ బూర్వమున నుండుట సంభవించుననియు, వ్యస్తమున విశేష్యమునకుఁ బరముగనే యుండుననియు, నిది ద్రుతాంతవిశేషణావ్యయమని సమర్థించికొన సూరి 'సర్వపర్యాయంబైన' అని వివరణము వ్రాసికొన్నవాఁడు. దీనిచే నెల్లశబ్దము ద్రుతాంతంబై వ్యస్తమునఁ గాని సమాసమునఁ గాని విశేష్యమునకుఁ బూర్వమున నుండుట సంభవింపదనుట స్పష్టమయ్యెను. ప్రౌఢవ్యాకర్త "సర్వపర్యాయంబైన యెల్లశబ్దమునకు సప్తమియు నసమాసంబున విశేష్యమునకు ముందుఁ బ్రయోగంబును జూపట్టెడిని" అని "ఎల్లయందును దావసియించుట, ఎల్లన్ శిష్యులఁ గొంచువత్తునో," అను నుదాహృతుల నొసంగి సూరి యీధోరణిని సవరించినాఁడు.

"కర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణపూర్వంబగు"నను నీగ్రంథమందలి నియమమునను సరించి (చూ. సమాస 5) 'ఎల్లన్' అనునది ద్రుతాంతమగుటఁ గర్మధారయలక్షణ మిందుఁ గన్పట్టదయ్యె. స్త్రీసమపదము ప్రథమైకవచనలోపముగల్గిన వానికి వేనికైనను నుపలక్షణమనియేని సమానార్థకత భాసించుటంజేసియే కర్మధారయమనియేని, యంగీకరింపవలెను. పరిశీలింప 'ఎల్ల' అనునది కళయు. దీనిపై సముచ్చయమున యుపర్ణపూర్వకమై నుశబ్దము గలుగ నెల్లయును నగును. నుశబ్దము యుపర్ణపూర్వము గాకయు వచ్చుట ప్రౌఢవ్యాకర్త చెప్పినట్లు (చూ. ప్రౌఢ. శబ్దప. 106 క్రింద) బహుప్రయోగదృష్ట మగుటంజేసి 'ఎల్లన్, ఎల్లను,' ఏర్పడెడి. కాన నిది విశేష్యమునకు ముందు 'ఎల్ల' అని యున్నది దానిసహజకళారూపమనియు సర్వమనునర్థమిచ్చు విశేషణావ్యయముగాన మీఁదివిశేష్యముతో సమసించెననియు ననవలెను. 'ఎల్లన్ శిష్యులన్' అని ద్రుతాంతంబై విశేష్యమునకు ముందున్న సముచ్చయముం గూడిన వ్యస్తరూపమని సంభావింపవలెను. వెనుక నున్నపు డెట్లును వ్యస్తమునక తీరదు. దీనిని ద్రుతాంతావ్యయముగా నంగీకరించుటంజేసి యీయొక్కదానితుదిద్రుతము లోపింపఁ జేయుటే సూరి యీసూత్రమునకు ఫలము. సమాసములలో నెచటను నీద్రుతలోప సూత్రమునకుఁ బ్రసక్తియే యగపడదు. మఱియు నీనిత్యవిధింజేసి సమాసములఁ గొన్నియెడల ద్రుతలోపము గలుగదనియు సూరికిఁ జెప్పికొనవలసివచ్చినది. (చూ. మీఁదు) కాన దీనిం ద్రుతాంతావ్యయముగ నంగీకరింపక కళగా నెన్ని యీసూత్రమును సూత్రింపకుండుటే సూరి చేయఁదగుననుట యయుక్తము గాదని తోఁచెడి.

ఆంధ్రశబ్దచింతామణి 'షష్ఠీ భవేద్ద్వితీయా తుల్యా' అని సమాసగతషష్ఠ్యంతపదములకు ద్వితీయాతుల్యతను విధించునదిగాన నచ్చోటులందలి ద్వితీయాద్రుతమును

లోపింపఁజేయుట తప్పరానిదగుటంజేసి 'ద్రుతస్య లుక్సమాసేషు' అను సామాసిక ద్రుతలోపశాస్త్రమును సూత్రించికొనెను. ఇందట్టినిర్బంధము లేమి నట్టిమూలసూత్రమును వ్యాజింపక యెల్లశబ్దము నొక్కట దానిం దెచ్చి యవ్విధికి ముడివేసి యనుకరించుట యసంగతమని తోఁచెడిని. మఱియు నివ్విధిని విడిచిన నితరసమాసములందు ద్రుతలోప మసంభవమగుటంజేసి 25 సంధిసూత్రమున విధానసామర్థ్యముచే దీనికి లోపము లేదను ప్రయాసమును దలఁబ్రాలు మొదలగుసమాసముల ద్రుతమునకు లోపము లేదని సూత్రించు శ్రమయు లేకపోయెడిని. ఈసూత్రము నాదినున్న 'సమాసంబునయందు' అను ప్రయోగము నీలక్షణకర్త సాధింపలేదు. జడముల సప్తమ్యేకవచనమునకు నవర్ణము విధించుటంజేసి యందునకుఁ బూర్వముననున్నది నవర్ణకమసినఁ బ్రత్యయముమీఁదఁ బ్రత్యయము కల్గుట శాస్త్రవిరుద్ధమగుటంజేసి యలాక్షణిక మయ్యెడి. అందువర్ణకము పరముగా నుమాగమము విధించెనుగాని నగాగమము విధించియుండలేదు. కాన నీరూప మీవ్యాకృతిచే దుస్సాధమె. 1. 'తనువున యందు 2. అనిమిషనాయకత్వమునయందు 3. ఉరమునయందు' అను మున్నగు నన్నయభారతప్రయోగము లీరూపమును సాధువుగాఁ జేయుచున్నవి. తరువాతివారలకావ్యములందును నిట్టిరూపములు తఱచుగఁ జూపట్టెడి. కావుననే ప్రౌఢవ్యాకర్త యుదంతజడమునకుఁ గొన్నియెడల నందువర్ణకము పరముగాఁగ నవర్ణకమును విధించి యిట్టిరూపములను సాధింపవలసివచ్చెను.

**సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునప్పుడు నుగాగమంబగు. ౨౫.**

ఇచటం బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులచే మూఁడురూపంబులు. సరళంబులు పరంబులగునపుడు లోప సంశ్లేష పూర్ణబిందువులచేత మూఁడురూపములు. విధానసామర్థ్యమువలన దీనికి లోపము లేదు. వక్ష్యమాణవిధిచే స్వత్వము లేదు.

చిగురు ... కయిదువు ... { చిగురుంగయిదువు<br>చిగురుఁగయిదువు<br>చిగురున్గయిదువు.

తళుకు ... గజ్జెలు ... { తళుకుగజ్జెలు<br>తళుకున్గజ్జెలు<br>తళుకుంగజ్జెలు

సింగపు ... కోదమ ... { సింగపుంగోదమ<br>సింగపుఁగోదమ<br>సింగపున్గోదమ }

ఉన్నతంపు ... గోడుగు ... { ఉన్నతంపుగోడుగు<br>ఉన్నతంపున్గోడుగు<br>ఉన్నతంపుంగోడుగు }

నలుఁగడాదుల నీయాగమంబు లేదండ్రు. ఈయాగమంబొకా నొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి - గఱువపున్మురువు.

టీ. 'నుమోఽచతః' అనునదియు 'పరుషే సరళే చైవ సమాసే నుముతో భవేత్ ... వికారాచ్చాపి కేచన...అమిశ్రే స్త్రీసమాత్క్వచిత్' అనిదానిని బరుషసరళములు పరములగునపుడని వివరించు నాథర్వణమును మూలములు. సమాసములందు హ్రస్వోకార మంతమందుఁగల స్త్రీసమములకును, నమహన్నపుంసకముల కదంతములకుఁ బ్రథమైకవచనమునఁ గల్గు మువర్ణమునకు సమాసమున నాదేశములగు పుంపువర్ణములకును, బరుషసరళములు పరములగునపుడు నుమాగమ మగును.

చిగురు + కయిదువు:—చిగురు:—ఇది స్త్రీసమముదంతము. చిగురను నాయుధ మని యర్థముగాన కర్మధారయసమాసము. కయిదువునందలి యాదివర్ణము కకారము పరుషము. ఇది పరముగా నుమాగమము కలిగె. 'నుమ్' అనునది పొల్లుమకారము పోవు ప్రత్యయముగాన మిత్తు. ఇది ప్రకృతియంత్యాచ్చుకంటె నవ్యవహిత పరముగ నగును. కాఁగా చిగురును + కయిదువు. సరళాదేశము చిగురును + గయిదువు. ఇది సమాసము గాన 17 చే నగు బిందుసంశ్లేషస్వత్వములలో మీఁదివిధిచే స్వత్వరూపము నిషిద్ధ మగుట నర్థపూర్ణబిందుద్వయమును, సంశ్లేషమును గ్రమముగఁ గల్గును. కాన 'చిగురుఁ గైదువు, చిగురుంగైదువు, చిగురున్గైదువు' అని రూపత్రయ మేర్పడును. పరుషములు పరములగునపు డిట్లే రూపత్రయ మూహ్యము. దీర్ఘముమీఁదనైనఁ బూర్ణబిందుసంశ్లేషములు రెండును నుండక నర్ధబిందురూపమే యగుననుమాట మఱువరాదు. 'ఉన్నతంపు+గోడుగు.—ఇది సహజసరళమున కుదాహరణము. ఉన్నతము + గోడుగు:—సంధి 32 సూత్రముచే మువర్ణకమునకు పువర్ణము రాఁగ ఉన్నతంపు+గోడుగు. 'గోడుగు' అను పదము నాదిది గకారము సరళము. ఇది పరముగా నుమాగమము. 'ఉన్నతంపును+గోడుగు సంధి 18 సూత్రముచే ద్రుతమునకు లోపసంశ్లేషములును 19 చేఁ బూర్ణబిందువును వికల్పముగఁ గాఁగ 'ఉన్నతంపుగోడుగు, ఉన్నతంపున్గోడుగు, ఉన్నతంపుం

గొడుగు' అని రూపత్రయము సిద్ధించును. ఇట్లే సరళములు పరములగునపుడు రూపత్రయ మూహ్యము. ముపర్ణమునకు పువర్ణము కలిగినపుడును నిట్లే పరుషసరళములు బరములగునపుడు యథాశాస్త్రముగ రూపముల సాధించికొనునది. పూర్వసూత్రముచే నీద్రుతమే పోవునేని విధానము వ్యర్థమగుంగాన సూత్రవిహితమైన యీద్రుతము విషయమున నాలోపవిధి వర్తింపదని గ్రహింపవలెనని 'విధానసామర్థ్యముచే' అను సూరివివరణమునకుఁ దాత్పర్యము. మీఁదివిధిచే స్వత్వరూపము గలుగదుగాన స్వత్వరూపమునకు సంబంధించిన సందేహమును బొందనవకాశములేదు. నలు+కడలు:—ఇది సంఖ్యాపూర్వముగాన ద్విగువు. నాలుగుశబ్దము 'నలు' అనురూపమును బొందెను. (చూ. ప్రౌఢ 92, 99) ఇందు 'నలు' అనునది స్త్రీసమము. దీనికిఁ బరుషము పరముగా నున్నది. ఐనను నుమాగమను గలుగదని కొందఱందురు. గసడదవాదేశమే గలిగి 'నలుగడ'యనియే యగును. ద్రుతకార్యములు ద్రుతము లేమిని సంభవింపవు. కాన 'నలుంగడలు, నలున్గడలు, నలుగడలు' అనురూపములుఁ సిద్ధింపవు. కాని 'నలుంగడ'లని శ్రుతికింపుగ రూపము వినఁబడెడి. ఈవాక్యమును సూరి వ్రాయుటకు "సరసాదిత్యనేన నలుగడలు ఇత్యాదివ్యావృత్తిః" అనునహోబలునివ్రాత మూలము. దీన మూలమున 'నలుఁగడ' అనుపదమునందలి గకారమునకు ముందున్న యర్ధబిందువు ప్రమాదపతిత మనవలెను. ఒక్కచో నీనుమాగమము స్థిరము పరమగునపుడును గన్పట్టుచున్నది. గరుపము+మురువు:—గరువపు+మురువు. గరువపు+ను+మురువు=గరువపున్మురువు. స్థిరము పరముగా సంశ్లేషరూపము. ఇందలి యుదాహరణముల ననుసరించి యీవిధి కర్మధారయమందే యగునని యనరాదు. సమాసంబులందను బహువచనమునం జేసి కర్మధారయేతరంబులందును ననఁగాఁ దత్పురుషమునను నీనుమాగమ ముదంతాచ్ఛికముల మీఁదఁ గలుగునని యెన్నవలెను. 'మిరియంపుంబొడి, పునుగుందావి, కన్నుంగవ' ఇత్యాదులు తత్పురుషమునసైన నుమాగమమునకు లక్ష్యములు కవిప్రయుక్తములు గన్పట్టెడి. పుంపులుగూడ నుదంతములే యగుటంజేసి యీకార్య ముదంతములకుఁ గలుగుననినఁ జాలునుగాని సహజోదంతస్త్రీసమములమీఁదనే యని పాఠకు లర్థముఁ జేసికొందురే మో యని పుంపులమీఁదఁ గూడ నగునని సూరి నిర్వచింపవలసివచ్చెను. ప్రథమైకవచనము దోఁపనియాచ్ఛికశబ్దములు స్త్రీసమములని విశదపఱుచుట యైనది.

ఇచ్చో 'నుమ్మోచ్చతో హల్యథర్వణాచార్యమతాత్' అని యప్పకవి చింతామణి పాఠ మగపడెడి. అథర్వణము చింతామణివివరణమనియు నందు లేనివిషయములను సందిగ్ధములగువానిని వివరించునదనియుఁ ననుట యయుక్తికము గాదు. మూలము నాధారముగఁ జేసికొని వివరణము వెడలునుగాని వివరణము నాధారముగఁ జేసికొని

మూలము పుట్టదు. కాన వివరణము మతము మూలమునఁ బ్రస్తావింపఁబడుట యసంభావ్యము. మఱియు నాథర్వణమున సామాన్యముగ హల్లు పరమగునపుడు నుమాగమ విధాన మగపడదు. దాన హల్లు పరమగునపుడు నుమాగమము గల్గుట యథర్వణునిమత మనుటయుఁ బొసఁగదు. కావునఁ బై పాఠ మప్పకవి యథర్వణుని పేరిటఁ గల్పించిన కృతక పాఠమనియే యనఁ దగును.

## సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు. ౨౬.

టీ. సమాసములందు ద్రుతమునకు స్వత్వరూపము సంభవింపదు. స్పష్టము. 'ఉన్నతంపునుగొడుగు; సరసంపునుబలుకు' అనునట్టిరూపము లేర్పడవని భావము.

## తలఁబ్రాలు మొదలగుసమాసంబుల ద్రుతమునకు లోపములేదు.౨౭.

తలఁబ్రాలు - ఒడిఁబ్రాలు - నేసఁబ్రాలు-ఊరఁబంది- ఊరఁబిచ్చిక. తోడఁబుట్టువు - తోఁబుట్టువు - ఒల్లఁబాటు - ఒడఁబాటు - ఇత్యాదులు.

టీ. తలను + ప్రాలు:—ఇందుఁ దలననుదానితుదిద్రుతము సమాసమందలి దగుట లోపము రాలేదు. సరళాదేశ మర్ధబిందువు పూర్ణబిందువుఁ గలుగ 'తలంబ్రాలు, తలఁబ్రాలు,' అనురూపము లగును. 'తలప్రాలు' అని గాదు. సమాసముగాన స్వత్వరూప ముండదు. ఈసూత్రము క్రింది యుదాహరణములందు ద్రుత మాగమముగఁ గల్గెననుట కాధార మగపడదు. ఇందు "తలఁబ్రాలు, ఒడిఁబాలు, ఊరఁబంది, ఊరఁబిచ్చిక," అనునవి సప్తమీతత్పురుషములన్న విభక్తిలోపము గలిగి నుమాగమము గల్గె ననవలెను. లేదా సామాసికవిభక్తిలోపశాస్త్ర మాయాసమాసములందు సహజముగ నున్న ప్రత్యయములకు సంబంధించినదేగాని యాయావిభక్తులకు మాఱుగఁ గల్గిన మఱియొకవిభక్తులకు (ద్వితీయాదులకు; సప్తమికిట ద్వితీయ) సంబంధించినది గాదన్న నివి యలుక్సమాసములనియుఁ బ్రకృతులద్రుతమునకే లోపము గలుగదని తెల్పుసూత్ర మిది యనియు ననవలయును. (చూ. తత్పురుషసామాసికవిభక్తిలోపత్వము సంధి 43-44) అట్లే "తోడఁబుట్టువు, తోఁబుట్టువు" అనునవి తమ సహజద్రుతములతో నిల్చినవనియు, వానితుదిద్రుతముల లోపమునే, యీసూత్రము నిషేధించునదనియు ననవలెను. ఇఁక 'నేసఁబ్రాలు' అనుదానియందు ద్రుతము సహజమని యెట్లు నిరూపింపవలసియుండునన నేసవిషయమైన యని విషయసప్తమియని సమర్థింపవలెనని తోఁచెడి. ఇఁక 'ఒల్ల, ఒడ' అనునవి ద్రుతాంతములని వ్యస్తప్రయోగముంజూపి సమర్థింప నవకాశము లేమిని నుమాగమము వీనికి 'సరసాత్' అనునాథర్వణోక్తి ననుసరించి సిద్ధించెనని చెప్పవలెను. పైయంశములను గమనింపఁగాఁ గొన్ని సహజద్రుతాంతములగుట వానితుది

ద్రుతములు సామాసికద్రుతలోపశాస్త్రమునకు విషయములు గాకుండను, గొన్ని యిందు సూత్రించుట మఱచినను, నుమాగమము సమాసమున సంభవించిన రూపములగుట వానియాగమద్రుతము లోపింపకుండఁ గాపాడను, నీసూత్ర మారబ్ధమయ్యెననియు దాన నిది సహజాగమద్రుతద్వయమునకును సమాసములందు లోపమును నిషేధించుశాస్త్రమనియును ననుట యుచితమని తోఁచెడి. ఇంతకంటె నీసమాసపదములందలి పూర్వపదములు సమాసమున ద్రుతాంతంబు లగుననియుఁ వాని తుదిద్రుతములు సామాసికద్రుతలోపశాస్త్రమునకు విషయములు గావనియుఁ ననుట యొప్పెడి. ఇందు ద్రుతములెట్లు కల్గెనో యివి యేసమాసములో తెల్పక నిపుణముగ సూరి ద్రుతమునకు లోపము గలుగదని సూత్రించుట యసంగతముగ నున్నది. సామాసికద్రుతలోపశాస్త్రమునకు ద్రుతాంతమునే విషయముగాఁ జేయుటంబట్టి యీసమాసములఁ బూర్వపదములు ద్రుతాంతములనియే భావించెనేమో? అట్లనినను 'ఒల్ల-ఒడ' అనువాని నట్లన నవకాశము గానరాదు గదా! మఱియుఁ వీనిని సమాసము లుగ నేల యంగీకరింపవలెనో తెలియకున్నది. వీనిని సమాసము లనుటకు నుమాగమము గల్గుటయే ప్రయోజనము గదా! అట్టిప్రయోజన మీవ్యాకృతిలో నుదంతేతరాచ్ఛిక పదములపై సిద్ధింపమి నీసూత్రమున కర్థము కన్పట్టకున్నది. ఈరూపములు పూర్ణార్థ ములతోఁ బ్రయోగప్రసిద్ధములగుటను ద్రుతము గలిగినంగాని యారూపములు సంభ వింపకుండుటను నిందలి రెండుపదములు వేఱొకయర్థమును బోధించుటను గమనించి సమాసములనుచుఁ దాను వీనిపై నుమాగమమును సాధింపకున్నను సమాసతను సాధింప కున్నను నిపుణముగ ద్రుతమునకు లోపము రాదని సూరి తెల్పుట యసంగతముగా నున్నదనక తీరదు. ఈరూపములందు సంశ్లేషము ప్రయోగప్రసిద్ధమైన ట్లగపడదు. పూర్వోత్తరపదములయన్వయసంబంధమునుబట్టి యిందలి యుదాహృతులు సమాసా భాసము లనుట సముచితమని తోఁచెడి.

కర్మధారయంబులందుత్తునకచ్చుపరంబగునపుడుటుగాగమంబగు.౭౬-

| | | | | |
|---|---|---|---|---|
| కఱకు | ... | అమ్ము | ... | కఱకుటమ్ము. |
| నిగ్గు | ... | అద్దము | ... | నిగ్గుటద్దము. |
| సరసపు | ... | అలుక | ... | సరసపుటలుక. |

టీ. 'సామానాధికరణ్యేషూదంతానాం టుగాగమోఽచి స్యాత్' అనునది మూలము. కర్మధారయసమాసములందు హ్రస్వోకారాంతము లగుశబ్దముల కచ్చు పర మగునపుడు టుగాగమము నిత్యముగ నగును. ఆచ్ఛికోదంతమును (స్త్రీసమము) పుంప్వా

దులచే నుదంతము లైనశబ్దములును నుదంతపదముచే గ్రాహ్యములు. కర్మధారయంబు లందను బహువచనమునంజేసి కర్మధారయమేగాక శేషషష్ఠీతత్పురుషమును గ్రాహ్యమ యని తోఁచెడిని.

కఱకు+అమ్ము:—ఇది కర్మధారయము. 'కఱకు' అనునది యుదంతస్త్రీసమము. దీనికి 'అమ్ము' అనుశబ్దము నాదినున్న అకార మచ్చుపరముగా టుగాగమము. 'టుక్' అనునది కకారము లోపించు ప్రత్యయము గానఁ దొలిపదమున కంతావయవముగ నగును. కఱకు+ట్+అమ్ము=కఱకుటమ్ము. ఇట్లే 'నిగ్గుటద్దము' ప్రక్రియను గ్రహించునది. సరసపు+అలుక:—'సరసము' అను దానితుదిని గర్మధారయమున పువర్ణము కలిగిన రూపము. పువర్ణముదంతము. దీని కచ్చుపరముగా టుగాగమము. సరసపుటలుక. ఇట్లేంపు వర్ణమునకును, నుదంతస్త్రీసమములకును నజాదిపదము పరమగునపుడు కర్మధారయమున టుగాగమ మూహించికొనవలెను. 'వేల్పుటావు, కప్పురపుటనంటులు' ఇత్యాదులందుఁ దత్పురుషేతరసమాసములందును నీటుగాగమము గానవచ్చెడి. మఱియుఁ గర్మధారయమున నుదంతములపైనే గాక యితరములగువానిపైఁ గూడ నీటుగాగమము గన్పట్టుచున్నది. "మిద్దెటిల్లు, పల్లెటూరు, తేనెటీగ, దుక్కిటెద్దు." కాని ప్రాచీనభాషలో నిట్టిరూపములుండు టరుదగుటంజేసి, చింతామణి 'సామానాధికరణ్యేషు' అని యేకార్థీభావరూపసామర్థ్యముగల కర్మధారయభేదముల నెల్ల గ్రహింప బహువచన ప్రయోగము చేసెఁగాని తత్పురుషమును సంగ్రహింపఁ గాదని చెప్పవలసియుండుటచే వానివివరణమగు నిందును సమాసములను బహువచనమున కదేయర్థ మనుట లెస్స.

కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు. ౨౯.

| | | | | |
|---|---|---|---|---|
| పేరు | ... | ఉరము | ... | పేరుటురము. పేరురము. |
| చిగురు | ... | ఆకు | ... | చిగురుటాకు. చిగురాకు. |
| పొదరు | ... | ఇల్లు | ... | పొదరుటిల్లు. పొదరిల్లు. |

టీ. కర్మధారయసమాసమునఁ బేరు మొదలగుశబ్దముల కచ్చుపరమగునపుడు టుగాగమము వికల్పముగ నగును. పేర్వాదు లనుటంజేసియుఁ గ్రింది యుదాహృతులంజేసియు నిందుఁ జేరఁదగినవి సహజోదంతములైన యాచ్ఛికస్త్రీసమశబ్దములే యని

యెన్నునది. 28 సూత్రముచే వీనికి నిత్యముగ టుగాగమము సిద్ధించుచుండుటంజేసి వికల్పముగఁ గల్గుటకై యీసూత్ర మారబ్ధమయ్యెనని గ్రహింపవలెను. పేరు+ ఊరము:—'పేరు' అనునది స్త్రీసమము. దీని కచ్చు పరమైనదిగాన టుగాగమము కలుగ 'పేరు+ట్+ఊరము=పేరుటూరము' అనురూపము సిద్ధించెను. టుగాగమము గలుగనపు డుత్వసంధి నిత్యముగఁ గల్గి 'పేరూరము' అగును. ఇట్లే తక్కినరూపము లూహ్యములు. ఇందలి విభాషాపదమునకు వ్యవస్థచేసి 'పల్లెటూ' రిత్యాదుల సాధించుట యుచితమని తోఁచెడి. ఆగమశాస్త్ర మనిత్యమను సంస్కృతవ్యాకర్తలసంప్రదాయము ననుసరించి టుగాగమము నందని 'చిగురాకు' మున్నగు నీసూత్రోదాహృతుల సాధింపనగునుగాని సుబోధకై సూత్రాంతరమున వీనిని సూరి సాధించెననఁదగును.

## పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు. ౩౦.

| | | | | |
|---|---|---|---|---|
| పేద | ... | ఆలు | ... | పేదరాలు. |
| బీద | ... | ఆలు | ... | బీదరాలు. |

పేద-బీద-ముద్ద-బాలెంత-కొమ-జవ-అయిదువ-మనుమ-గొడ్డు-ఇట్టివి పేదాదులు. ఇందు జవ్వనిశబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది. 'ఏకాంతమునందు నున్న జవరాండ్ర' నని ప్రయోగము.

టీ. పేద మొదలగు నాచ్ఛికముల కాలుశబ్దము పరమగునపుడు రుగాగమము నిత్యముగ నగును. పేద+ఆలు:—రుగాగమము. పేద+ర్+ఆలు=పేదరాలు. ఇట్లే తక్కినయుదాహరణముల సాధించునది. ఇదియు కకారముపోవు ప్రత్యయముగానఁ బ్రకృతి కంతావయవముగ నగునని యూహించునది. ఈయాగమములమీఁది యచ్చులు సుఖోచ్చారణమున కైనవగుట లోపించుననియుం దాన పొల్లులే (ట్, ర్) మిగులుననియు గ్రహించునది. జవ్వని+ఆలు:—ఇందు 'జవ్వని' అనుదానికి 'జవ' అనునాదేశమగును. జవ+ర్+ఆలు=జవరాలు. "ఏకాంతమునందున్న జవరాండ్రను" అని యల్లసాని పెద్దన మనుచరిత్రమునఁ బ్రయోగించెను. కాన జవ్వనిశబ్దమునకు 'జవ' అను దాని నాదేశముగఁ జెప్పక తీరదని సూరియాశయము. ఇది సామాన్యముగ నాచ్ఛిక విషయము. 'రేఫ ఏవ క్వచిద్భవేత్' అనునాథర్వణము దీనికి మూలము. "జవరాలు వ్యతిరిక్తా—భూయాంస ఇత్యాచార్యోక్తేః, వర్ణలోపాగమానైకే సర్వస్మిన్ స్తద్భవేపదే ఇత్యథర్వణోక్తేశ్చ నస్య లోపః." అనునహోబలఃనివ్రాంత జవరాలు రూపసిద్ధివిషయ

మునవ్రాసిన సూరివ్రాఁతకు మూలము. అందును, 'ఇక్కడజవ్వనశబ్దమునకు జవాదేశము' అను కవిజనమండనవాక్యము సూరికి ముఖ్యానుసరణీయమయ్యెనని తోఁచెడి.

**కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబునగు. ౩౧.**

ధీర ... ఆలు ... ధీరురాలు.

గుణవంత ... ఆలు ... గుణవంతురాలు.

**ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము.**

టీ. 'దారార్థేఽత ఉదపిరః' అనుమూలమును, దానిని 'అఝ్లోరాలుశబ్దేన సమానార్థకతా యది, సమాసస్తత్ర చోద్రస్స్యాత్' అని వివరించు నాథర్వణమును మూలములు. కర్మధారయమున తత్సమాదంతశబ్దముల కాలుశబ్దము పరమగునపుడు వానితుదియత్తునకు హ్రస్వోకారమును దత్పరముగ రుగాగమమును నిత్యముగ నగును. ధీరురాలు:—ధీరాశబ్దమునకు నామంబులతుది దీర్ఘంబునకు హ్రస్వంబగు ననువిధిచే హ్రస్వము గలుఁగ 'ధీర' అని యగును. ఇట్లే 'గుణవంతమ్' అను తత్సమము 70-71 చేసైన ద్వితీయాంతతుల్యప్రాతిపదికత్వాంతిమమకారములోపములు గలుగ 'గుణవంత' అను నదంతతత్సమప్రాతిపదిక మేర్పడును. వీనితుదియత్తుల కుత్వము గలుగ 'ధీరు + ఆలు, గుణవంతు + ఆలు' అనురూపము లగును. రుగాగమ మాదేశోత్వమున కంతావయవముగఁ గలుగ 'ధీరుర్ + ఆలు=ధీరురాలు, గుణవంతుర్ + ఆలు = గుణవంతురాలు' అను రూపము లేర్పడును. ఇట్లే 'విద్వాంసమ్ = విద్వాంస = విద్వాంసుర్ + ఆలు - విద్వాంసురాలు' (విదుషియనుట) ఇట్లే యిట్టిరూపములు గలుగుట యూహ్యము. కర్మధారయంబునందును నేకవచనమునంజేసి యీసూత్రము తత్పురుషవిషయము గాఁజాలదు. కాన 'గుణవంతురాలు' అనుదానికి గుణవంతునిభార్య యనరాదు. గుణవతి యనియే యర్థము. మఱియుఁ దత్పురుషమున నదంతతత్సమప్రాతిపదికము గల్గుటయుఁ బొసఁగదుకాన నట్టివీసూత్రమునకు విషయములు గావనుటయె సరసము. కానఁ దత్పురుషపక్షమున 'ధీరునాలు, గుణవంతునాలు' అని యిట్టివి 34 సూత్రముచే నగు నుమాగమవిషయము లయ్యెడినని యూహించు టుచితము. ఇచ్చోటి సమాసమున నాలుశబ్ద మాఁడుదానినే చెప్పునుగాని భార్యావాచకముగాదు. (చూ. అహో. పం. పుట 227-228) శుద్ధాదంతసంస్కృతపదములనక తత్సమంబు లనుటంజేసి హ్రస్వాంతిమాక్షరలోపాది కార్యవిశేషములు గల్గి తత్సమము లనిపించుకొనినవానికే యిందు గ్రహణమనుట స్పష్టము. మఱియు నీసమాసమున నదంతసంస్కృతసమము

కంటెఁ బరమగు నాలుశబ్దము భార్యాపర్యాయముగాక యాఁడుదానినే చెప్పునదను టంజేసియు, నిది కర్మధారయసమాసవిషయ మనుటంజేసియుఁ, బూర్వపదము విశేషణమే యైయుండవలెననుట స్పష్టము. కాన నెన్నివిధముల గమనించినను నీవిధిని దత్పురుషము విషయముగాఁ జేయ నవకాశము గానరాకున్నది. కర్మధారయంబు త్రికస్త్రీసమధాతుజవిశేషణపూర్వకంబై యుండునను నియమ మిచటఁ గుదురమి నధర్వణుఁ డన్నట్లు సమానార్థకతయే (విశేషణవిశేష్యభావము) కర్మధారయలక్షణముగ నిం దెన్నవలెను. కర్మధారయమున సంస్కృతమున స్త్రీలింగవిశేషణములకుఁ బుంవద్భావమగుంగాన నట్టిపద్ధతి నిచ్చోటునను, గుణవద్ధిరాదులపుంలింగా దంతరూపములే తొలి నిల్చెననియు విభక్త్యభావముచే నుత్వాభావము గుదిరెననియు నేని గ్రహింపఁదగునని కొందఱందురు. ఏమైన నిట్టివి కర్మధారయాభాసములనుట యుచితమని తోఁచెడి.

''సంబంధే క్వచిదర్థస్స్యాదసంబంధే విలక్షణః,'' అనునాధర్వణమును, ''ఇత్యాదావపి స్త్రీమాత్రపరత్వాత్'' అను నహోబలునివ్రాఁతయు ''ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపర''మను సూరివివరణమునకు మూలములు.

పొదరిల్లుమొదలగు రేఫాంతాచ్ఛికసమాసములయనుకరణమున నుత్వము సుఖోచ్చారణార్థము తొలిపదముతుదిం జేర్పఁగ నిట్టిరూపము లయ్యెనని భాషాతత్త్వవిమర్శకు లందురు.

## కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు. ౩౨.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సరసము | ... | మాట | ... | { | సరసపుమాట. సరసంపుమాట. |
| విరసము | ... | వచనము | ... | { | విరసపువచనము విరసంపువచనము. |

టీ. ''మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ'' అనునది మూలము. కర్మధారయసమాసములందు మువర్ణకమునకు 'పు, ంపు' అనునవి పర్యాయమున నిత్యముగ నగును. మువర్ణకము=ముప్రత్యయము. ముప్రత్యయమున కాదేశములుంగ విధించుటంజేసి యిట్టిసమాసములందు (సమాస 25) సామాసికవిభక్తిలోపశాస్త్రముచే మువర్ణకము లోపింపదని గ్రహించునది.

సరసము + మాట:—ఇందు సరసమనుమాట తుదిమువర్ణమునకు పుంపులలో 'పు'వర్ణము కలుగ ''సరసపుమాట'' యగును. 'ంపు' అనువర్ణము గలుగ 'సరసంపుమాట'

అగును. ఇట్లే తక్కినయుదాహరణముల ప్రక్రియ నూహించునది. తత్సమ 41 సూత్రము వివరణమున మువర్ణకమునకు విధించుకార్యము ముగాగమమునకును గలుగుననుటంజేసి సరసములు + వచనములు. సమాసవిభక్తిలోపశాస్త్రముచే బహువచన లువర్ణకము లోపించినపిదప లేక కారక 20 సూత్రముచే మువర్ణకాంత విశేషణముల కేకత్వము సిద్ధించినపిదప పుంపులు గలుగనగునుగాన బహుత్వమునఁ గూడ సరసంపువచనములు సరసపువచనములను రూపద్వయమేర్పడెడి. కర్మధారయంబులందను బహువచనమునంజేసి శేషషష్ఠియందు యొక్క లోపింప ముగాగమాంతములైన పూర్వపదముల ముగాగమము మువర్ణమునకును నీవిధి గల్గునని కొందఱందురు. కాని ప్రాచీనకావ్యముల నిట్టివి గనరామిని, నెల్లకర్మధారయముల సంగ్రహింపనే మూలనివరణములు, బహువచనప్రయోగము చేసెననుటలెస్స. పైని నియామించిన ప్రకార మిక్కార్యములు బహుత్వమందునను గలుగుననుటయేగాక యిట్టిచోటుల మువర్ణకమున కనుటంజేసి మువర్ణకమునకు తత్సమ 42 చే 'ంబు' ఆదేశము సంభవింపదనియు గ్రహింపవలెను. లేదా యథర్వణునిప ఈ "సామానాధికరణ్యేషు బహుత్వార్థే పరేఽపి చ ముభ్యోర్భవేతాం పుంపావ్యాఖ్యాచ దేశావత్ర సర్వదా" అని ముబులకు పుంపులగునేని సమ్మతింపవలెను. పైయథర్వణకారిక యందలి 'సామానాధికరణ్యేషు' అనుబహువచనమే కర్మధారయంబులందను బహుత్వమునకు బీజము. చింతామణియందు విభక్తులెల్లఁ బరమగునపుడును బ్రథమైకవచనమునను మువర్ణకము విధింపఁబడినను విభక్త్యేకవచనముననే పుంపులగుననుటంజేసి ప్రథమైకవచనమునకు మాత్రమే యీవిధి వర్తించుననుట తెల్లము. కాన చింతామణిపద్యమున బహుత్వమున పుంపులను గుదుర్పవలెనన్న నందును "ఏకత్వం భేదకగతబహువచనానాం చ దృశ్యతే వికృతౌ" అని వికృతివిశేషణగత బహుత్వమున కేకత్వము సాధింపఁబడిన దగుటంజేసి యది సుసాధమే యగును. ప్రౌఢవ్యాకర్త తామరకాకు పరమగునపుడు పుగాగమము గల్గునని తామరపాకు సాధించి దీనిం బూరించుట నరయందగినది. "మ్బుము" అనునవి "పుంపు"గా మాఱుటంబట్టి మువిభక్తిముకారయతులు సార్థకము లయ్యెడి.

## ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చుపరమగునపుడు నుగాగమంబగు. 33.

| | | | | |
|---|---|---|---|---|
| చేయు | ... | అతఁడు | ... | చేయునతఁడు. |
| చేసెడు | ... | అతఁడు | ... | చేసెడునతఁడు. |

టీ. 'నస్యాత్తద్ధర్మోక్తః' అనునది మూలము. హ్రస్వోకార మంతమందుఁ గల తద్ధర్మార్థకవిశేషణముల కచ్చు పరమగునపుడు నుగాగమము గలుగును. ఉదంత

మనుటంజేసి యిదంతమగుచేసె డీత్యాదు లగ్రాహ్యములనుట స్పష్టము. విశేషణము లనుటంజేసి చేయు నిత్యాది తద్ధర్మార్థకసమాపకము లీసంధికి విషయములు గాఁజాలవని గ్రహింపవలెను. క్రియ 44-45 సూత్రములచే నీవిశేషణములు సాధింపఁబడినవి. చేయు+అతఁడు:—నుగాగమము. చేయున్+అతఁడు=చేయునతఁడు. ఇట్లే తక్కినవి గ్రహించునది. తద్ధర్మార్థకములకే యనుటంజేసి యితరోదంతముల కికార్యము సంభవింపదు.

కళలపట్టికలోఁ జేరనివెల్ల ద్రుతప్రకృతికములే యను భావనంగల్గి చింతామణి వివరణములగు నాథర్వణబాలసరస్వతీయాహోబలపండితీయములు 'నస్యాత్తద్ధర్మోత్తః' అను సంధినిషేధపాఠమునే యాదరించి ద్రుతప్రకృతికములగు తద్ధర్మక్రియాతజ్జన్యవిశేషణోకారములకుఁ జింతామణిలో నత్వేత్వోత్వ సంధిసూత్రములు ద్రుతప్రకృతికాద్రుతప్రకృతిక సామాన్యములనువిషయము నూఁతఁగఁగొని సంధిప్రాప్తిని సూచించుచు నిచ్చోటుల సంధ్యభావమునే ప్రతిపాదించుచున్నవి. మఱియు మూలస్థమగు తద్ధర్మపదము ద్రుతప్రకృతికోదంతములైన తద్ధర్మవిశేషణ తత్సమాపక క్రియలను రెంటిని బోధించునదిగానెన్ని వాని రెండింటిసంధిని నిషేధించునదీసూత్రమని నిర్వచించినారు. ఇందులకు ''ప్రథమశ్చోత్తమశ్చైవ తాసు తద్ధర్మసంజ్ఞికౌ, భూతాద్యవిషయౌ తత్ర చైకత్వార్థాభిధాయకౌ, ఉదంతౌచ సదానాంతౌ న సంధిస్తత్ర కల్ప్యతే' అను నథర్వణుని తద్ధర్మపదాదుల వివరణమును, దద్ధర్మక్రియలందుండు నుకారమునకు సంధిలేదని సామాన్యముగఁ దద్ధర్మోకారములనెల్ల నీసూత్రమునకు విషయములుగఁ జేయు బాలసరస్వతివ్రాఁతయు, 'తద్ధర్మోకారస్యాపి సంధిర్న స్యాత్, తద్ధర్మపదేన తద్ధర్మక్రియా తజ్జన్య విశేషణం చ గృహ్యతే' అని యథర్వణబాలసరస్వతులనే యనుసరించు నహోబలునివ్యాఖ్యయుఁ బ్రమాణములు. మూలమునందలి సూత్రక్రమ మరసినను నిది సంధ్యభావవిధానపరమే యగు. అప్పకవి యీనిషేధము ద్రుతప్రకృతికములగు తద్ధర్మసమాపకక్రియావిషయముగ నెన్ని తద్ధర్మార్థకవిశేషణములకు 'ధాతుపదసంభవానా ముత స్తథానుమపి' అని యచ్చుపరమగునపుడు నుమాగమము నొకక్రొత్తపాఠముం గల్పించి విధించెను.

విశేషణములను ద్రుతప్రకృతికములుగ నెన్నుట తనకాలపుఁబండితులకును దనప్రణాళికకును సమ్మతము గామింజేసియుఁ, జింతామణి ప్రణాళిక ననుసరించినను దద్ధర్మార్థకవిశేషణములు తమకుఁ బరములగు విశేష్యములతో నన్వితము లయినపుడు సమాసత యవశ్య మంగీకార్యమగుటయుం సామాసికద్రుతలోపశాస్త్రమువలని ద్రుతలోప మనివార్యమగుటయుం స్పష్టపడుటచే లుప్తమైన ద్రుతమును బునరుద్ధారణము

చేయుటకే యీసూత్ర మారబ్ధమయ్యెననుట సయుక్తికమను తలంపునంజేసియుఁ, జింతామణిసందర్భము పూర్వసగ్రచ్చినట్లు సక్రమముగ నున్నదని సిద్ధాంతీకరించుట యశక్యమగుటంజేసియుం, 'లుక్సంశ్లేషా నాచి' యనునది యితర ద్రుతప్రకృతికముల ద్రుతము లుప్తముగాకుండ నిల్ప సమర్థమై యుండుటంజేసియు, నప్పకవి తద్ధర్మవిశేషణములకు నుమాగమము విధించుచుఁ దోడుపడుచుండుటంజేసియు, సూరి మూలమును, నకార విధాన పరముగనే యెంచెనని తోఁచెడిని.

## షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పరమగు నప్పుడు నుగాగమంబగు. ౩౮.

| | | | | |
|---|---|---|---|---|
| రాజుయొక్క | ... | ఆజ్ఞ | ... | రాజునాజ్ఞ. |
| విధాతృయొక్క | ... | ఆనతి | ... | విధాతృనానతి. |

టీ. 'షష్ఠ్యా ఉతోఁచి నుమ్నే చ' అనునది మూలము. ప్రయోగముల ననుసరించి మూలస్థమగు చకారమునకు ఫలముగ ఋకారమును గూడ మూలమునకంటె నధికముగ సూరి సంగ్రహించెనని తోఁచెడి. సూత్రము నందలియుకారము సహజ కృత్రిమోదంతముల రెండింటిని బోధించును. దీర్ఘాంతము లసంభవములగుటఁ దపరకరణ మనాదృతము. షష్ఠీతత్పురుషమున సమాసిక విభక్తిలోప విధిచే లుప్త షష్ఠీప్రత్యయములైన యుకార ఋకారాంతపదముల కచ్చు పరమగునప్పుడు నుగాగమము గలుగును. రాజుయొక్క + ఆజ్ఞ:—యొక్కకు లోపము. రాజు + ఆజ్ఞ. ఇం దుకారాంతమైన రాజుశబ్దము నుకారమున కంతావయవముగ నుగాగమము. రాజు + న్ + ఆజ్ఞ = రాజునాజ్ఞ. విధాతృయొక్క + ఆనతి:—తత్సమ 53 సూత్రముచే విధాతృశబ్దమున కత్వ స్త్రీవద్భావములు వికల్పముగ నగుటఁ బక్షమున విధాతృఁడను రూపమేర్పడు. అట్టిరూపమె ఋకారాంతము గాఁదగుట నిందు దానికె గ్రహణము. తత్సమ 23 సూత్రముచే నిగాగమము పాక్షికమగుటంజేసి విధాతృయొక్క యనిరూపమగును, కాన నిగాగమము గలుగనిరూపమె యిందు గ్రాహ్యము. యొక్కకు లోపము. విధాతృ + ఆజ్ఞ. దీనిచే నుగాగమము. విధాతృ + న్ + ఆజ్ఞ = విధాతృనాజ్ఞ. నిగాగమము గలిగియున్న పక్షమున నుకార ఋకారాంతములగుట సంభవింపమిని యొక్కకు మాత్రమే లోపముగలిగి 'విధాతృనియానతి, రామునియాజ్ఞ' మున్నగురూపములే సిద్ధించెడి. నిగాగమేకారమునకు సంధియేగలిగినచో 'రామునాజ్ఞ' యగునుగాని నిగాగమాభావమున 'రామునాజ్ఞే' త్యాదులు సిద్ధింపమిని, 'విధాతృనియాజ్ఞే' త్యాది నిగాగమేకార సంధ్యభావరూపములు ప్రయుక్తములై ప్రసిద్ధములగుటను, నీవిధానము సార్థకమగు

టయేగాక నిగాగమే కారమునకు సంధి రాదనువిషయమును స్పష్టపఱచెడిని. షష్ఠీప్రత్యయములు చేరినపదములలో నొక్క యొక్క ప్రత్యయము చేరినవానికే మీఁది పదముతోడఁ దత్పురుషము పొసఁగఁదగియుండుటచేత సూత్రమునందలి షష్ఠీసమాసపదము యొక్క షష్ఠీతత్పురుషమునే బోధించును. మూలము సమాసపూర్వావయవ యొక్క షష్ఠ్యంతమునకు ద్వితీయాతౌల్యము గలుగ ద్రుతము సామాసికద్రుతలోపవిధిచే లోపింప నద్దానిఁ బునరుద్ధరింపనే యట్లు నువ్విధాన మొనర్చియుండునని తోఁచెడి. కొన్నిచోటుల షష్ఠీసమాసమున నుకార బుకారముల కచ్చు పరమగునపుడును నుగాగమమునకు లోపంబగునని ప్రౌఢవ్యాకర్త, 'శిరసందము, బచ్చింట' మున్నగు ప్రయోగములం జూపుచు నీసూత్రమును సవరించినాఁడు. ఇట్టి నుగాగమము గలుగని ప్రయోగములు 16 శతాబ్దివాఙ్మయమునుండి ప్రవృద్ధినందిన ట్లనుమానింపఁదగును.

**ఉదంతస్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు. ౩౫.**

| | | | |
|---|---|---|---|
| సొగసు | ... | తనము ... | సొగసుందనము.<br>సొగసుఁదనము.<br>సొగసున్దనము. |
| సరసపు | ... | తనము ... | సరసపుందనము.<br>సరసపుఁదనము<br>సరసపున్దనము. |
| తెల్ల | ... | తనము ... | తెల్లందనము<br>తెల్లఁదనము.<br>తెల్లన్దనము. |

టీ. 'నువ్మోప్పాత్శః' అను మూలమునకే యిదియు వివరణము. 'తనే చ కుత్రచిత్' అని మూలమును వివరించునాథర్వణము మూలము. హ్రస్వోకార మంతమందుఁగల స్త్రీసమశబ్దములకును గర్మధారయమున మువర్ణకమున కగు పుంపులకును, గుణవాచకములగు నదంతశబ్దములకును భావమునస్సైన తనము పరమగునపుడు నుగాగమమగును. తద్ధిత 1 సూత్రముచేఁ దనవర్ణకము గలుగును. లుప్తప్రథమైకవచనములైన యాఁచ్ఛికములు స్త్రీసమములు. సొగసు+తనము:—నుగాగమము. సొగసు+ను+తనము. 16 చే సరళాదేశము. సొగసు+ను+దనము. 17చే బిందుసంశ్లేషములు. ''సొగసుందనము, సొగసుఁదనము, సొగసున్దనము'' అను మూఁడురూపము లేర్పడును. తద్ధితవృత్తిగాన

స్వాత్వరూపముగలుగదని యెన్నవలెను. ఇట్లే తక్కిన వూహ్యములు. తనము పరుషాది పదమగుటచేఁ బరుషసరళములు పరమగునపుడు సామాన్యముగ నుగాగమమును విధించు 25 సంధి సూత్రమున నుదంతాచ్ఛికములయు, పుంపులయు, మీఁది నుమాగమరూప ములఁజేర్చి యదంతగుణవాచకముమీఁది నుమాగమమునే యీసూత్రవిషయ మొనర్పఁ దగునండ్రు. కాని 25 సూత్రము కర్మధారయముననే యగుంగాని షష్ఠీతత్పురుష మనఁదగు తద్ధితవృత్తిని గాదని తలంచి కావలయు సూరి యట్లు చేయఁడయ్యెను. తెల్ల + తనము:—తెల్ల యిది గుణవాచకము. తెల్ల, నల్ల మున్నగునవి వర్ణవాచకములు—గుణవాచకములని 6 తద్ధితసూత్రము స్పష్టపఱచెడి. నుమాగమ సరళాదేశ బిందుసంశ్లేషములు పర్యాయమునఁ గలుగఁ గ్రమముగ తెల్లన్ + దనము. "తెల్లఁదనము, తెల్లందనము, తెల్లన్దనము" అనురూపములు గలుగును. ఇట్లే యదంతగుణవాచకములకెల్లఁ దనము పరముగా రూపత్రయ మూహ్యము.

## సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు. ౩౮.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాఁత | ... | ఇల్లు | ... | ప్రాయిల్లు.<br>ప్రాఁతయిల్లు. |
| లేఁత | ... | దూడ | ... | లేదూడ<br>లేఁతదూడ |
| పూవు | ... | రెమ్మ | ... | పూరెమ్మ.<br>పూవురెమ్మ. |

టీ. 'శబ్దానామాదిభాగేషు నూతనత్వాదిబోధకాః, ఏకద్విపర్ణశబ్దాస్స్యు రర్థభేదేఽపిచ క్వచిత్' అను నాథర్వణమును మూలముగఁగొని ప్రాఁతాదిశాస్త్రమంతయుఁ గల్పితము. సమాసమునఁ బూర్వపదములైన ప్రాఁతాదిశబ్దముల యాద్యచ్చు తరువాతి యక్షరములకెల్లను బహుళముగ లోపము గలుగును. ప్రాఁత మొదలగు నీసందర్భమునందలి సమాసపూర్వపదములెల్ల విశేషణములే యగుటంజేసి కర్మధారయమే సూత్రస్థమగు సమాసమున ననుపదముచే వాచ్యమగును. బహుళపదప్రయోజనము మీఁద స్పష్టపడును. ప్రాఁత + ఇల్లు:—ప్రాఁతయను పదమునందుఁ దొలియచ్చు 'ప్రా' మీఁదియాకారము. దాని తరువాతి యక్షరములకెల్ల నీసూత్రముచే లోపముగలుగ 'ఁత' అను భాగము లోపించును. దీర్ఘముపై సంధి రాదుగనుక యడాగమము గలుగును. కాన ప్రా + ఇల్లు, ప్రా + య్ + ఇలు = 'ప్రాయిల్లు' అని రూపమగును. బహుళముగా 'ఁత' అను

నది లోపింపనున్న యడాగమము కల్గి 'ప్రాఁతయిల్లు' అనియు నుండఁదగును. అత్వసంధి బహుళమగుట నిందుఁ గలుగదన్నఁ బ్రాఁతిల్లనురూప మేర్పడదు. ఇట్లే యచ్చు పరమగు నపుడును స్థిరములు పరములగునపుడును రూపము లూహించునది. వర్ణములనుటంజేసి యచ్చులు హల్లులుగూడఁ దొలియచ్చుమీఁదివి లోపించునని గ్రహించునది. ప్రాఁతే త్యాదులం దర్ధబిందువు తనకాశ్రయమగు పరుషము పోవుటచేఁ దానును దొలఁగెనని కాని యచ్చులలో నీవ్యాకృతిని జేరుటచేఁ దొలఁగెనని కాని భావింపవలయును. అసమాసమనను, ననఁగాఁ బూర్వావయవము గాకున్నను, బూశబ్దము పూవుశబ్ద పర్యాయమనఁగా నేకాక్షరశేషము గానోపునని ప్రౌఢవ్యాకర్త 'కాలకంఠునిశిరసు పూ గగనగంగ' అని యుదాహరించి దీనిని నవరించె.

## లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు. 32.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాఁత | ... | కెంపు | ... | ప్రాఁగెంపు. |
| లేఁత | ... | కొమ్మ | ... | లేఁగొమ్మ. |
| పూవు | ... | తోఁట | ... | పూఁదోఁట. |
| మీఁదు | ... | కడ | ... | మీఁగడ. |
| కెంపు | ... | తామర | ... | కెందామర. |
| చెన్ను | ... | తోవ | ... | చెందోవ. |

చెన్నుశబ్దము వృత్తిని శోణార్థకంబు; బహుళగ్రహణముచే మీఁదుప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు; వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

టీ. పూర్వసూత్రముచే నాద్యక్షరశేషములైనవానికి కచటతపలు పరములైనచో నుమాగమమగును. అనఁగా కచటతప లాదియందుఁ గలిగినపదములు పరములైనపుడా ద్యక్షరశేషములగు పదములకు నుమాగమము సంభవించుననిభావము. ప్రాఁత+కెంపు:— పూర్వసూత్రముచే 'ఁత' అనుదానికి లోపము. నుమాగమము. ప్రా+న్+కెంపు. సరళాదేశము. ప్రా+న్+గెంపు. దీర్ఘముమీఁదఁగానఁ బూర్ణబిందుసంశ్లేషములును, సమాసముగాన స్వత్వరూపమును గలుగవు. ఇఁక ద్రుతమునకర్థబిందువే 17 సంధిసూత్ర ముచేఁ గలుగ 'ప్రాఁగెంపు' అని రూపమగును. ఇట్లే 'లేఁత+కొమ్మ=లే+కొమ్మ=లే+ న్+కొమ్మ=లేఁగొమ్మ' అని ప్రక్రియ నూహించునది. ఆద్యక్షరశేషమగునది హ్రస్వాంత

మైన 22 సంధిసూత్రముచే ఖండబిందువు గలుగదు గాన 17 చేఁ బూర్ణమే గలుగునని యెన్నవలెను. "కెంపు + తామర = కె + తామర = కె + ఁ = తామర = కె + ఁ + దామర = కెందామర" అని ప్రక్రియ యేర్పడును. ఇట్లే యథాసంభవముగ లోపరూపము లూహ్యములు. ఇందు వికల్పప్రవృత్తిరూపబహుళప్రయోజనము నిరూపితము. 17 సంధిసూత్రమునందలి విభాషాపదమునకు వ్యవస్థ గల్పించుటంజేసి యీ ప్రాఁతాదిశాస్త్రమున నాద్యక్షరశేషములగువానిమీఁదఁ బరుషములు పరముగాఁగ నగుద్రుతమునకు సంశ్లేషము సంభవింపదు. కాన "కెన్దామర చెన్దోవ" యనురూపము లేర్పడవని గ్రహింపవలెను. అచట నట్టికార్యమును గలిగింపనియదిగ నెన్నుటయే వ్యవస్థ. ఇది సంస్కృతవ్యాకర్తల సంప్రదాయము. 17 సంధిసూత్రముచే నగు బిందుసంశ్లేషములు పర్యాయముగఁ గలుగుట విభాషాపదశక్తింజేసియే యగుటచేత నిట్టిచోటుల సంశ్లేషరూపమును సంభవింపఁ జేయకుండుటకై దానినే నియమింపవలసియుండును గాన నదియే వ్యవస్థితమయ్యెనని యెన్నవలెను. చెన్నుశబ్దమునకు వ్యస్తమున నందము విధము నను నర్థములు ప్రసిద్ధములైనను సమాసగతమగునపుడుమాత్ర మద్దాని కెఱుపే యర్థముగానఁ జెందోవేత్యాదులందలి చెన్నుశబ్దమున కెఱ్ఱని యనియే యర్థము. కాన నందమైన విధమైన యనునర్థములు సమాసగత చెన్నుశబ్దమునకుఁ జెప్పరాదని చెన్నుశబ్దమును నీక్రింది సూరివివరణమున కాశయము. శోణార్థకముగాని చెన్నుశబ్దము నామవాచకమగుట కర్మధారయమున నట్టిదానికిఁ బూర్వావయవవిశేషణముగఁ బ్రయోగము గలుగదని ఫలితము. ఈవిధి బహుళమగుటంజేసి ప్రాతయి ల్లిత్యాదులందువలెనే మీఁదు మొదలగునుదాహరణములందును దొలియచ్చులమీఁది వర్ణములకు లోపము గలుగనిపక్షమున మీఁదుగడ మొదలగురూపము లేర్పడ నవకాశముండుటంజేసి పాలమీఁది తెట్టె పెరుగుమీఁది తెట్టె యర్థమగునపుడట్టిరూప (మీఁదుగడ)మ ప్రసిద్ధమగుట నట్టివానిని వారింప బహుళపద మాధారమగు ననియుఁ గాన నట్టిరూపములందు బహుళపదశక్తింజేసి తొలియచ్చులమీఁది వర్ణములకెల్ల లోపము నిత్యముగఁ గల్గుననియు నందులకే సూత్రమున బహుళపదము గృహీతమయ్యెననియుఁ దెలుపుటకై సూరి బహుళగ్రహణముచే నను వివరణము వ్రాయవలసి వచ్చెను. అనఁగా మీఁగడేత్యాదులందుఁ దొలియచ్చులమీఁది వర్ణములకెల్లను నిత్యముగ లోపము బహుళపదముశక్తింజేసి సుసాధమగునని భావము. ఇది నిత్యప్రవృత్తిరూపబహుళప్రయోజనము. సంశ్లేషాభావను ముందే నిరూపితము. ఇందలియుదాహరణములంబట్టి నుగాగమ మాచ్ఛికసమాసవిషయమని స్పష్టపడుటంజేసి తత్సమము పరమగునపుడును నుగాగమము గలుగునని ప్రౌఢవ్యాకర్త "ముంగోపము వింజామ"రమని యుదాహరించి దీని సవరించె.

**క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమం బునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు. ౩౮.**

క్రొత్త ... చాయ ... క్రొంజాయ.
క్రొత్త ... చెమట ... క్రొంజెమట.
క్రొత్త ... పసిఁడి ... క్రొంబసిఁడి.
క్రొత్త ... కారు ... క్రొక్కారు.
క్రొత్త ... తావి ... క్రొత్తావి.

పరుషేతరంబులు పరంబు లగునపుడు నుగాగమప్రాప్తి లేమిం జేసి వానికి ద్విత్వంబగు.

క్రొత్త ... గండి ... క్రొగ్గండి.
క్రొత్త ... నన ... క్రొన్నన.
క్రొత్త ... మావి ... క్రొమ్మావి.

కెంధూళి కెంజడలని ప్రయోగంబులు కానంబడియెడి. బహుళ గ్రహణముచేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబు లేదు. క్రీఁగడుపు-క్రీఁగాలు - క్రీఁదొడ - ఇత్యాదులం గ్రిందుశబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణముచేత నని యెఱుఁగునది.

టీ. వృత్తిని దొలియచ్చుమీఁది వర్ణములెల్ల లోపింప నర్హములైన ప్రాఁత మున్నగుశబ్దములలోఁ జేరు క్రొత్తశబ్దమునకుఁ బరుషములు పరంబులగునపుడు నుగాగమము కొన్నిచోటులందును పరుషమునకు ద్విత్వము కొన్నితావులందును నగపడును. క్రొత్త + చాయ:—36 చే నాద్యక్షరశేషముగా క్రొ+చాయ, 37 చే నుగాగమము రా క్రొ + న్ + చాయ, బిందువు 17 చేఁ గలుగ "క్రొంజాయ." ఇట్లే యాద్యుదాహరణత్రయము ప్రక్రియనూహించునది. క్రొత్త + కారు:—36 చే నాద్యక్షరశేషముగా క్రొ + కారు అని యగును. అనంతరమున నీవిధిచే నుగాగమాదులనడ్డి ద్విత్వము పరహల్లగు కకారమునకుఁ గలుగ "క్రొక్కారు" అగును. ఇట్లే తక్కిననరూపమూహ్యము. పరుషవర్ణములుగాక సరళ స్థిరములు క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషమునకుఁ బరములయ్యెనేని 37 సూత్రము పరుష ములు పరములగునపుడే నుగాగమము విధించెడిఁగాని సరళస్థిరములు పరములగునపుడు విధింపదుగాన నుగాగమమురాకకే యోగ్యత లేమిం జేసి యాసరళస్థిరముల కీసూత్రముచే

విధింపఁబడు నుగాగమద్విత్వములలో నొక్కద్విత్వకార్యమే సంభవించునని పరుషే తరంబులను వివరణమున కాశయము. క్రొత్త+గండి=క్రొ+గండి=క్రొగ్గండి. ఇట్లే తక్కిన వాని ప్రక్రియ నరయునది. సామాన్యముగ నెల్లయెడల నుగాగమము పరుషములు పరములగునపుడే గలుగుటయు నద్దానికిఁ బరుషముల సరళములుగమార్చుట తాను బిందాది రూపములనందుట ఫలములని పాఠకు లెఱింగినవిషయమే. ప్రాఁతాదిశాస్త్రమునందలి నుగాగమద్విత్వకార్యములు కేవలమాచ్ఛికసమాసములకు సంబంధించినవిగాని మిశ్రములకైనవి గావు. అట్లని ప్రాఁతాదులు సమములతో సమసింపవని తలంపరాదు. అట్లు కేవల మచ్చతెనుఁగుసమాసముల నగుకార్యములు కెంధూళీత్యాదులందు మిశ్రసమాసములందు నందునుఁ బ్రాఁతాద్యాచ్ఛికసమాసములందువలెఁ గాక స్థిరము పరమగునపుడు సంభవించుట కన్పట్టుటంజేసి సూరి దీనిని నిపతించి సాధించె. కెంజడలనునది యాచ్ఛికసమాస మైనను సరళము పరమగునపుడు ద్విత్వకార్యమే 33 చే సంప్రాప్తమగుట దీనిని గూడ నిపతింపవలసివచ్చెను. నియమమునకు లొంగని కవిప్రయుక్తముల నిట్లుండునని శాసించుట నిపతించుట. 'క్రొత్త+కుండ' ఇత్యాదులందు 36 సూత్రమునందలి బహుళపదముశక్తింజేసి తొలియచ్చుమీఁదివర్ణములకు లోపమే గలుగదు. కాన 37-38 సూత్రములచే నుగాగమమును, దన్మూలకమైన సరళాదేశబిందురూపములును, ద్విత్వమును, సంభవింపవని గ్రహించునది. "క్రొంగుండ క్రొగ్గుండే"త్యాద్యపరూపములు గలుగవని ఫలితము. ఇది నిత్యముగ నప్రవృత్తిగ రూపమైన బహుళప్రయోజనము. క్రిందుశబ్దముతో సమసించిన కడుపు కాలు తొడ శబ్దములు పరములగునపుడు క్రిందుశబ్దము లుప్తశేషంబై 'క్రి' యను రూపమునందఁ బరుషములు పరములగుటంజేసి 37 చే నుగాగమము సిద్ధించి సంధి 16 చే సరళాదేశము గలిగి సంధి 17 చే హ్రస్వముమీఁదిదగుట నుగాగమమునకు నిండుసున్నయే సంభవించి 'క్రింగడు'పిత్యాది రూపములు గావలసిరాఁగా 36 సూత్రమునందలి బహుళపదముశక్తింజేసి 36 చే లోపింపఁగా మిగిలిన తొలియచ్చు దీర్ఘమగునని బహుళగ్రహణఫలము నభివర్ణించుచు సూరి "క్రీఁగడుపు-క్రీఁగాలు-క్రీఁదొడ"లను రూపములనే సాధువులని వివరింపవలసి వచ్చెను. దీర్ఘముమీఁదిదగుట నాగమద్రుతమున కర్థబిందువే 17 సంధిసూత్రముచే సిద్ధించెడి. కాన 'క్రీఁగడుపు, క్రీఁగాలు, క్రీఁదొడ' అనియే రూపము లేర్పడెడిఁగాని చెందొవేత్యాదులవలె క్రింగడుపిత్యాదులు సిద్ధింపవని క్రిందివివరణమున కాశయము. 36 చే లుప్తశేషమైన భాగమందు తొలియచ్చేదైనఁ దద్దీర్ఘమే దానికగునని గ్రహింపవలెను. ఆయాయచ్చు సంబంధమునన యాయాహల్లులు దీర్ఘము లగుననుట పునరుక్తము. ఇది మఱియొకలాఁగగుట యను బహుళప్రయోజనముగ భావించునది.

అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి. ౩౯.

ఒకానొకశబ్దంబున కొకానొకశబ్దము పరంబగునపుడు తొంటి యట్లు లోపనుగాగమంబులును గొండొకశబ్దమున కొకానొకశబ్దము పరంబగునపుడు లోపద్విత్వంబులును బ్రయోగంబులందుఁ జూపట్టెడు నని తాత్పర్యము.

| | | | | |
|---|---|---|---|---|
| పది | ... | తొమ్మిది | ... | పందొమ్మిది. |
| తొమ్మిది | ... | పది | ... | తొంబది. |
| వంక | ... | చెఱఁగు | ... | వంజెఱఁగు. |
| సగము | ... | కోరు | ... | సంగోరు. |
| నిండు | ... | వెఱ | ... | నివ్వెఱ. |
| నిండు | ... | వెఱఁగు | ... | నివ్వెఱఁగు. |
| నెఱ | ... | తఱి | ... | నెత్తఱి. |
| నెఱ | ... | నడుము | ... | నెన్నడుము. |
| నెఱ | ... | మది | ... | నెమ్మది. |
| నెఱ | ... | వడి | ... | నెవ్వడి. |

ఇత్యాదులు ప్రయోగంబులవలనం దెలియునది.

టీ. పూర్వసూత్రములందుఁ జేర్పఁబడనిశబ్దములకుఁ గొన్నింటికిని దొలి యచ్చుమీఁది వర్ణములలోపమును, బరుషములు పరములగునపుడు నుగాగమమును, సరళస్థిరములు పరములగునపుడు ద్విత్వమును గల్గుట చూపట్టెడి. ప్రయోగానుసారముగ నీప్రాఁతాదిశాస్త్రకార్యములఁ బ్రవర్తింపఁజేయునది యనుటే యీసూత్రము క్రిందివివరణమున కభిప్రాయము. పది+తొమ్మిది:—36 చే 'ది' అనునది లోపించును. పిదప 37 చే నుగాగమము. సంధి 16 చే సరళాదేశము. సంధి 22 చే ఖండము రారాదు గానఁ బూర్ణమే సంధి 17 చే నగు. ప+న్+తొమ్మిది=ప+న్+దొమ్మిది=పందొమ్మిది. 17 నందలి వ్యవస్థితవిభాషచే సంశ్లేషమును, 26 చే స్వత్వమును సంభవింపకుండుట స్మరించికొనునది. ఇట్లే తరువాతియుదాహరణత్రయము ప్రక్రియ నరయునది. నిండు+వెఱ=ని+వెఱ=నివ్వెఱ. వకారము స్థిరముగాన 38 చే ద్విత్వము గలిగెను. తరువాతి

యుదాహరణము ప్రక్రియ నిట్లే గమనించునది. నెఱ + తఱి = నె + తఱి = నెత్తఱి. క్రొక్కారిత్యాదులందువలె నుగాగమాదుల నడ్డి 38 చే ద్విత్వమే కలిగెనని యెన్నవలయును. తక్కిన నెఱశబ్దమాదియందుఁ గలయుదాహరణత్రయమున నెఱశబ్దము తరువాతనున్నవి స్థిరవర్ణమాదియందుఁ గలపదములే యగుటంజేసి 38 సూత్రము క్రింది వివరణము ననుసరించి పరుషేతరములు పరములగునపుడు, నుగాగమము సంభవింపమిని ద్విత్వమే గలుఁగ నివ్విజేత్యాదులవలె నెన్నడుము నెమ్మది నెవ్వడి యని యేర్పడిన రూపములని యెన్నవలయును. నెఱ + నడుము = నె + నడుము = నెన్నడుము. ఇట్లే ప్రక్రియను గమనింపవలెను. నెన్నడేత్యాదులందలి పూర్వపదము సంపూర్ణార్థకమగు నెఱ యనుటకంటె రమ్యార్థకమగు నెఱి యనుట సరసమని ప్రౌఢవ్యాకర్త సవరించినాఁడు. నడుమునకుఁ బూర్ణతకంటె మనోహరత యాపాదించుట వర్ణ్యమున కుత్కర్షాధాయకమని యాతనితలంపు. అట్లన్నను దొలియచ్చుమీఁదివర్ణములకు లోపముఁ బరవర్ణమునకు ద్విత్వముఁ గల్గినపిదప రూపభేదము మాత్ర మేర్పడదు. ఈరీతిని యథాసంభవముగఁ గవిప్రయుక్తముల ననుసరించి కార్యముల గమనించికొనవలెను. నెమ్మన మిత్యాదులందలి సమముల యాదిస్థిరములకును నీద్విత్వము గల్గుననుట కిందలి నెమ్మదియే గుఱుతు. ఐనను సుబోధకై యాచ్ఛికసమాసములందలి వింతలను విస్తరించి సూరి చూపెనని యెన్నవలెను. ఇందుఁ బందొమ్మిది సంగోరులు కర్మధారయములనుట కవకాశము గానరాదు. కావుననే యొకానొకదాని కొకానొకటి పరమగునపుడను వివరణమునకు గుఱిగాఁ జేసెనని తోఁచెడిని. కాని తక్కినవెల్లఁ గర్మధారయములే యగుట నియమశూన్యమగు నీవిధికి లక్ష్యములుగఁ జేయుట యసంగతముగా నున్నట్లు తోఁచునుగాని యిది యంతయుఁ బ్రాఁతాదిశాస్త్రప్రపంచమే గాన సుబోధకై యట్లు విస్తరించెనని మాత్రమే ఫలము నూహించుకొనవలెను. 'ఇది యంతయు నుమ్మోచ్చెతః' అను మూలము వివరణముగ గ్రహించునది. రెండు + నాళ్లు = రెన్నాళ్లు మూఁడు + నాళ్లు = మూన్నాళ్లు అనునట్టి వాని నిందుఁ జేర్పవలెనని ప్రౌఢవ్యాకృత్యాశయమైనట్లు తోఁచెడి.

**ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారం బగు. ౪౦.**

ఈసూత్రంబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు విషయంబని యెఱుంగునది.

| | | | | |
|---|---|---|---|---|
| కడ | ... | కడ | ... | కట్టకడ. |
| ఎదురు | ... | ఎదురు | ... | ఎట్టయెదురు. |

కడ - ఎదురు - కొన - చివర - తుద - తెన్ను - తెరువు - నడుము - పగలు - పిడుగు - బయలు - మొదలు - ఇత్యాదులు కడాదులు.

టీ. "క్వచిదర్థవిశేషే స్యుః కేచిదాదౌ ద్వివర్ణకాః" అను నాథర్వణమును, దీనిని "నట్టనడుమ, కొట్టకొన, ఎట్టయెదురు, కట్టకడ, పట్టపగలు, మిట్టమిఱ్ఱు; ఇత్యాదుల ద్విరుక్తటకారాదేశము" అని వివరించు కవిజనమండనమును మూలములు. అత్యంతార్థమున ద్విరుక్తములగువానియందలి తొలిపదము తొలియచ్చుల మీఁది వర్ణములకెల్ల హ్రస్వాకారమంతమందుఁగల ద్విత్వటకార మాదేశమగును. (ట్ట). మిక్కిలి యనునర్థమున రెండుమాఱులు పలుకఁబడునవే యీవిధికి విషయములని యీక్రింది వివరణమున కభిప్రాయము. ఆదరాద్యర్థముల ద్విరుక్తములైనవి దీని కుదాహరణములు గావని భావము. కాన ఔరౌరేత్యాదులం దీవిధి గలుగదు. కడ+కడ:—మిక్కిలితుద యనునర్థమున నిది ద్విరుక్తమయ్యె. కాన మొదటిపదమునందలి తొలియచ్చుమీఁది వర్ణములకు 'డ'అనుదాని కదంతద్విత్వటకార మాదేశముగాఁగ "క+ట్ట+కడ=కట్టకడ" అని రూపమగును. ఇట్లే "ఎదురు+ఎదురు," అనునుదాహరణమున మొదటిపదము నందలి తుది 'దురు' అనువర్ణములకు 'ట్ట' ఆదేశముగా నత్వసంధి బహుళమగుటఁ గలుగమి యడాగమము సిద్ధింప 'ఎట్టయెదురు' అనురూప మేర్పడును. ఇట్లే తొలి యచ్చును దొలియచ్చుతోఁ గూడినవర్ణమును విడిచి తక్కుంగలవర్ణములకెల్ల ద్విత్వ టకార మదంతమైనదాని నాదేశముగఁ జేయుచు నీక్రిందియుదాహరణములనెల్ల సాధించుకొనునది. అదంతద్విత్వటకార మాదేశముగఁ గల్గుననుటం జేసి యాద్విత్వ టకారముపై నుండు అకారమత్వసంధికి విషయమై పోరానిదనియు నిట్టియెడలఁ బరమున నచ్చున్న యడాగమమే కలుగునుగాని ద్విత్వటకారముమీఁది యకార మత్వసంధి విషయము గాదనియు నిర్ణయమును గ్రహించునది. ద్విరుక్తమున రెండవరూపమున కామ్రేడితమని సంజ్ఞయని ముందే నిరూపితము. వర్ణములకెల్ల ననుటంజేసి తొలి యచ్చునకుఁ దరువాత నెన్నివర్ణములున్నను వానికెల్ల ద్విత్వటకార మాదేశమగునని యెన్నవలెను. ఇట్లత్యంతార్థమున ద్విరుక్తములు గాఁదగినవాని నరసికొని యథాసంభవ ముగ నీవిధిని వర్తింపఁజేయవలెనుగాని ద్విరుక్తములనెల్ల దీనికి విషయములఁ జేయ రాదు. మూలము దేశ్యవైచిత్రిని నిరూపింపఁ దలంపమినో, తననాఁ డిట్టివి లేమినో, స్పష్టపఱుపదయ్యె.

## ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు. ౭౧.

అప్పటికిన్ ... అప్పటికిన్ ... { అప్పటప్పటికిన్.<br>అప్పటికప్పటికిన్.

అక్కడన్ ... అక్కడన్ ... { అక్కడక్కడన్. / అక్కడనక్కడన్.

ఇంటన్ ... ఇంటన్ ... { ఇంటింటన్. / ఇంటనింటన్.

ఊరన్ ... ఊరన్ ... { ఊరూరన్. / ఊరనూరన్.

ఇంచుకనాఁడిత్యాదులందు బహుళగ్రహణముచేత నంత్యమాక్షరలోపంబు నగు.

ఇంచుక ... ఇంచుక ... { ఇంచించుక. / ఇంచుకించుక.

నాఁడు ... నాఁడు ... { నానాఁడు. / నాఁడునాఁడు.

టీ. "ఆద్యస్యామ్రేడితేఽంత్యలోపశ్చ" అనునది మూలము. ద్విరుక్తములలో రెండవది యామ్రేడితము. త్రిరుక్తి కామ్రేడితసంజ్ఞ కోశప్రసిద్ధమైనను బ్రయోగాభావమున నిందగ్రహీతము. అది పరమగునపుడు విభక్తిలోపము బహుళముగానగును. అప్పటికిన్ + అప్పటికిన్:—ఇందు రెండవదాని కామ్రేడితసంజ్ఞ. అది పరముగా మొదటిదానితుదినున్న 'కిన్' అను షష్ఠీవిభక్తిప్రత్యయమునకు లోపము. అప్పటి + అప్పటికిన్: ఇచ్చో నేమ్యాదిసంధికి నిత్యప్రవృత్తి గలుగును. 'అప్పటప్పటికిన్.' ఈ విభక్తిలోపము బహుళమగుట సంభవింపనిపక్షమున నేమ్యాదులలో కిషష్ఠి చేరియుండుటంజేసి వికల్పముగ సంధిరాఁగ 'అప్పటికప్పటికిన్' అనియు, సంధిగానపుడు 'అప్పటికి నప్పటికిన్' అనియు రూపములేర్పడు. విభక్తిలోపము గల్గినపుడు 'అప్పటియప్పటికి' నను రూపము మాత్రమేర్పడదని గ్రహించునది. సంధి 13 గసడదవాదేశ శాస్త్రమున నపుడనుదానిని నిత్యైకవచనాంతమనియెను. ఇట నప్పటికనిగివర్ణకము పరముగా నౌపవిభక్తికటివర్ణము గల్గిన యప్పటికనురూప ముదాహరించె. దీన నిదియు దీనింబోలు నిపుడెపుడులును గతిచిద్విభక్తులలో నేకవచనములందు మాత్రమె ప్రయుక్తములగు నవ్యయములనుట స్పష్టము. దీననే యపుడనునది ప్రథమైకవచనమని సూరి యెంచి యుండనోపును. "అపుడు-అప్పటికంటె-అప్పటిలో-అప్పటికి-" అని యిట్లు వ్యవహారమునను నేకవచనములందె కొన్నివిభక్తులలో మాత్రమె యపుడిపు డెపుడులకుఁ బ్రయోగము చూపట్టెడిఁ గదా. 'అక్కడన్ + అక్కడన్:—ఆచోటును, లేక యా

దిక్కును'అని యర్థముచేసిన నిది ద్వితీయాంతమగును. అచోటునందని యర్థముచేసిన సప్తమ్యర్థమున నైన ద్వితీయాంతమగును. కాన నిందు మొదటిపదము పొల్లునకారము ద్వితీయాచిహ్నము లోపించిన "అక్కడ+అక్కడ" అని యగును. పిదప నత్వసంధి కేని యపదాదిస్వరసంధికేని నిత్యప్రవృత్తిఁ గల్పించిన 'అక్కడక్కడ' అను రూప మేర్పడును. 'అక్కడ యక్కడ' అని మాత్రము గాదు. ఈవిధి గలుగనపుడు తుది నకారముపొల్లు పరపదాద్యచ్చుతోఁ జేరి 'అక్కడ నక్కడన్' అని రూప మేర్పడును. ప్రత్యయముల కనక విభక్తియని సామాన్యముగ ననుటంజేసి ప్రత్యయములకును, నాయా విభక్తుల కాదేశములుగఁ గల్గిన విభక్త్యర్థకములకును, లోపము గలుగునని గ్రహింప వలసియున్నది. "ఇంటన్+ఇంటన్, ఊరన్+ఊరన్" అను నుదాహరణములం దత్వము సప్తమ్యర్థప్రకాశకమై అచ్ఛిక 38 సూత్రముచేఁ గలిగెను. కాన నందు 'అన్' అను భాగమును విభక్తిగా నెన్ని దానికి లోపముచేసిన "ఇంట్+ఇంటన్ = ఇంటింటన్, ఊర్+ఊరన్ = ఊరూరన్" అని రూపములయ్యెడి. లేదా తుదిని నిల్చిన పొల్లు నకారమునే విభక్తిసంబంధియగుట విభక్తిగా నెన్ని లోపింపఁజేసి యత్వ సంధ్యపదాదిస్వరసంధులలో దేనికేని నిత్యప్రవృత్తి నూహించి సాధించికొనవలెను. ఇవి ఔపవిభక్తికము లగుట వీని ద్వితీయాంతరూపములు 'ఇంటిని, ఊరిని' అనియే యుండును గాన వీనిని ద్వితీయాంతములన నవకాశము లేదు. ద్వితీయైకవచనమున నౌపవిభక్తిక ప్రత్యయములు గలుగవన్నను 'ఇల్లును, ఊరును' అనియే యగుం గాన ద్వితీయాంతములన వీలులేదు. కాన నిందు నిర్దిష్టములైనవి సప్తమ్యంతములగు నౌప విభక్తికరూపములనియుఁ, బైని నిరూపించిన ప్రకారమే విభక్త్యర్థకమునకు 'అన్' అనుదానికి లేక పొల్లునకారమునకు లోప మీవిధిచేఁ గలుగుననియు నంగీకరింపక తీరదు. ద్రుతాంతమును సంధివిషయముగఁ జేయఁ దుది ద్రుతము పొల్లురూపమగుట సహజమని ముందే నిరూపితము. సూత్రమునందలి బహుళపదముశక్తింజేసి విభక్తి విభక్త్యర్థకములకే గాక కొన్నిపదములందలి తుదియక్షరములకును ద్విరుక్తము పరముగాఁగ లోపము గలిగెడి. కాన 'ఇంచుక+ఇంచుక, నాఁడు+నాఁడు' అను నుదాహరణములందుఁ గ్రమముగ 'క, డు' అను వర్ణములకు లోపము బహుళముగఁ గలిగి 'ఇంచించుక, నానాఁ' డనురూపములు సిద్ధించెడి. 'ఇంచించుక' అను స్థలమున కవర్ణము తుదిది లోపించినపిదప నుత్వసంధి లేదా యపదాదిస్వరసంధి కలుగునని గ్రహించునది. 'నానాఁడు' అను నుదాహరణమునఁ దన కాశ్రయమగు 'డు' వర్ణము పోవుటంజేసి నాఁడు శబ్దము తొలినున్న నకారము స్థిరము పరమగుటంజేసి మొదటి నాఁడు శబ్దమునందు 'డు' వర్ణమునకుఁ బూర్వముననున్న యర్ధబిందు వనాశ్రయమగుట

స్వయముగ నదృశ్యమయ్యెనని గ్రహించునది. ఈయంతిమాక్షరలోపము వికల్పమగుటఁ గలుగనిపక్షమున 'ఇంచుకించుక' అని యత్వసంధి గలిగిన రూపమును, 'నాఁడు నాఁ'డను సహజరూపమును నేర్పడెడి. 'ఇంచుకయించుక' యను నత్వసంధ్యభావమున యడాగమము కలిగినరూపమును సభ్యముగఁ దోఁచెడి. మూల మంత్యలోపము నే తెల్పెడి. కాన 'నప్పటప్పటి' కనునది తక్కఁ దక్కుంగలవెల్లఁ దన్మతముననే చీకాకును బడనక్కఱలేక సుసాధములయ్యెడి. "అద్రుతానామజాదీనాం ద్విరుక్తావంత్యలోపితా, అన్యేషాం చ ద్విరుక్తౌ స్యుర్బహులోపాగమా మతాః." అని 'ఆద్యస్యామ్రేడితేఽంత్యలోపశ్చ' అను మూలమును వివరించు నాథర్వణ మీప్రక్రియకు మూలమని తోఁచెడి.

## అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. ౪౨.

అందదుకు - ఇఱ్ఱింకులు - ఇల్లిగ్గులు - చెల్లచెదరు - చెల్లాచెదరు - తుత్తుమురు - తుత్తునియలు - మిఱుమిట్లు - ఇత్యాదు లెఱుంగునది

టీ. భృశార్థమున ద్విరుక్తములైన యీసూత్రముక్రిందిరూపములందు సంధిలోఁ గలుగు వర్ణలోపాగమాదులను మహాకవిప్రయోగములమూలముననే తెలిసికొనవలసి యుండుటయు నొక నియమమునకు నట్టివనేకవిధములగుట లొంగని వగుటయు సూరి వీనిని నిపతించి యిట్టివానికిఁ గవిప్రయోగములనే శరణముగాఁ జేర్కొనెను. (యథాప్రయోగముగ = ప్రయోగానుసారముగ) కవుల కావ్యముల నిట్టి వెట్లున్న నట్లే యుండునని గ్రహింపవలెననుట. అదుకు+అదుకు:—ఇందు రెండవ దామ్రేడితము పరముగా మొదటిపదము నాదినున్న అకారమునకుఁ దరువాతనున్న వర్ణములకెల్లఁ బూర్ణబిందుపూర్వకమగు దకార మాదేశమగుటఁ గన్పట్టును. అందదుకు: మిక్కిలి యదుకని యర్థము. ఇంకులు+ఇంకులు:—ఇందుఁ దొలియచ్చుమీఁది వర్ణములకెల్ల ద్విత్వరేఫ (ఱ్ఱ) మాదేశముగఁ గల్గెను. ఇఱ్ఱింకులు: మిక్కిలి యింకులని యర్థము. ఇగ్గులు+ఇగ్గులు:—ఇందుఁ దొలియచ్చుమీఁది వర్ణములకెల్ల ద్విత్వలకార (ల్ల) మాదేశమగుట చూపట్టును. ఇల్లిగ్గులు: మిక్కిలి వెనుక కొఱఁగుటలని యర్థము. చెదరు+చెదరు:—పూర్వోదాహరణమునందువలెనే ద్విత్వలకారము తొలియచ్చు మీఁది వర్ణముల కాదేశమయ్యెను. చెల్లచెదరు: మిక్కిలి చెదరుట యని యర్థము. చెల్లాచెదరు:—ద్విత్వలకారము దీర్ఘాంతమగుటయే యిందు పూర్వోదాహృతికంటె విశేషము. తుమురు+తుమురు:—ఇందుఁ దొలియచ్చుమీఁదివర్ణములు లోపించి పరమగు

తకారమునకు ద్విత్వము గల్గుట విశేషము. తుత్తుమురు: మిక్కిలి పొడియనియర్థము. తునియలు + తునియలు = తుత్తునియలు:—పూర్వోదాహృతివలెనే తొలియచ్చు మీఁదివర్ణములు లోపించి పరతకారమునకు ద్విత్వము కల్గెను. మిక్కిలి చిన్నముక్కలని యర్థము. మిట్లు + మిట్లు = మిఱుమిట్లు:—ఇందుఁ దొలియచ్చుమీఁది వర్ణముల కుత్వవిశిష్టమగు శకటరేఫ మాదేశమయ్యెను. చూచుట కశక్యమైన తేజస్సును జూచుటచే దృష్టి పలురంగులు గలదగుట యర్థము. ఇట్లే ప్రయోగదృష్టములు గ్రాహ్యములు.

## చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులం దగు. ౪౩.

| | | |
|---|---|---|
| నీచేతన్ ... | ప్రోపు ... | నీచేతిప్రోపు. |
| నాతోడన్ ... | చెలిమి ... | నాతోడిచెలిమి. |
| నీవలనన్ ... | భయము ... | నీవలనిభయము. |

టీ. 'ఇచ్చ విభక్త్యంతిమస్య' అనునది మూలము. చేత - తోడ - వలనల కిది సర్వాదేశముగాక తదంతముల కగునని యెన్నవలెను. చేత-తోడ-వలనలు విభక్తులును శబ్దములును గ్రాహ్యములుగాఁదగునని సామాన్యోక్తింజేసి తోఁచెడి. దీన చేతదంతములయుం స్వతంత్రశబ్దములయుం తోడి తత్పురుషములను, సంగ్రహింప సూరిసమాసములందని బహువచనప్రయోగము సేసెనని తోఁచెడి. 'చేత, తోడ, వలన' అను విభక్తు లంతమందుఁ గల పదములకు మీఁది పదములతో నైన తత్పురుషసమాసములందు హ్రస్వేకార మావిభక్తిప్రత్యయముల కంతమందగును. ఈవిధానమునంజేసియే యీ విభక్తిప్రత్యయములకు సామాసిక విభక్తిలోపవిధిచే లోపము గలుగదని గ్రహింపవలయును. ఇత్వము విభక్తిప్రత్యయముల 'అన్' అను తుదిభాగముల కాదేశము లగునని గుప్తార్థప్రకాశిక ప్రక్రియను గనుపఱచుచున్నది. కాని చేత తోడ వలన లని సూరి లుప్తద్రుతములుగ నిర్దేశించుచు వాని కిత్వము గల్గుననుటంజేసి సామాసికద్రుత లోపవిధిచేఁ బైమూఁడు ప్రత్యయముల తుదిద్రుతములు సమాసభావన గల్గినతోడనే లోపించుననియుం, నట్టి లుప్తద్రుతములకుఁ బూర్వమునను‌న్న అకారముల కికార మాదేశమగుననియుం గ్రహించుట సయుక్తికమని తోఁచెడిని. బాలసరస్వతి అకారమున కికారమని స్పష్టముగా వివరించినాఁడు. నీచేతన్+ప్రోపు:—ద్రుతలోపము. నీచేత + ప్రోపు. తకారమునందలి అకారమునకు హ్రస్వేకార మాదేశము. 'నీచేతిప్రోపు.' ఇట్లే తక్కిన పూహ్యములు. మూలము విభక్త్యంతిమమున కనుటంజేసి నిర్బాధము. ఇది యలుక్సమాసవిషయమనుట స్పష్టము. చేతోవికృతులం దీవిధి వర్తింపదు; 'చేయి, వలను, తోడు' అను సుబంతములకును సమాసమున 'చేతికట్టు; ఆవలనిచూడ్కి

తోడివాఁడు' అని యిత్వము గల్గినరూపములు చూపట్టుఁగాని యవి లాక్షణికమత మున నాపవిభక్తికవర్ణములుగ సంభావ్యములగుట సంధివిధికిఁ బ్రవృత్తి లేదని యన వలెను. కాని సుబంతస్వతంత్రశబ్దములే ప్రత్యయములుగ లెక్కింపఁబడుట సమాస ముల నెల్లెడల నౌపవిభక్తిక వర్ణములే గలిగెననుటయు దాన చేయి-వలను - తోడుల కనుట సరసమనియుఁ దోఁచెడి. ఇట్లే లోని-మీఁది-తరువాతి, మొదలగువానికిని సమా సమున నౌపవిభక్తికేత్వము గాననగు. చేత - తోడ - వలనలకుఁ దిది నికారమై యత్వసంధికి నిత్యప్రవృత్తి గలిగెనని యేని భావించునది.

అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు. ౨౨.

| | | | | |
|---|---|---|---|---|
| నాయందుఁ | ... | కరుణ | ... | నాయందలికరుణ. |
| ఇందుఁ | ... | జనులు | ... | ఇందలిజనులు. |
| ఎందుఁ | ... | వారు | ... | ఎందలివారు. |

ఎందుశబ్దమున కలిగాగమము కొందఱు లేదండ్రు.

టీ. "జేరలి చ" అనునది మూలము. 'అందు, ఇందు, ఎందు' అను మూఁడింటికి సమాసమున 'అలిక్' అను నాగమము గలుగును. నాయందుఁ+కరుణ:—సంధి 24 చే ద్రుతలోపము. ఇదికకారము పోవు ప్రత్యయము గాన నంద్వాదిత్రయమున కంతావ యవముగ నగును. నాయందు+అలి+కరుణ అపదాది స్వరసంధి నిత్యముగ నేని యుత్వ సంధియేని గలుగును. 'నాయందలికరుణ.' ఇట్లే తక్కినయుదాహరణము లూహ్యములు. "అందు, ఇందు, ఎందు" అనుమూఁటిలో నందునకు మాత్రమే సప్తమీప్రత్యయమగుట కర్త్రాతయొప్పుటచే నాశబ్దముతోఁ జేర్చి నాయందలియని నిర్దేశించెను. తక్కినరెండింటి కట్టియర్థ్యాతలేమి నట్లు చూపఁజాలఁడయ్యెను. అందునకుఁ బ్రత్యయమగుట కర్థ్యాతయే గాక తత్రార్థకమై ప్రత్యేకప్రయోగమునకును నర్హ్యాతయొప్పెడిఁగాన అందలివారనియుఁ గాఁదగును. ఇందులకు 'సాశ్రయానాశ్రయాపి స్యాత్తత్రార్థగతసప్తమీ'యను నథర్వ ణునివివరణము తోడుపడెడి. 'అంద్వాదీనాం శక్తిమన్నాత్రతాపి క్వచిదిష్యతే' అని యథర్వణుఁ డివి ప్రాతిపదికములై కొన్నిప్రత్యయములతో నుండఁదగుటను గూడ సూచించినాఁడు. చింతామణి 'జేరలి చ'అను సూత్రముచే నగు నల్యాగమము సిద్ధిం చుటకొఱకే 'అంద్విందునాస్తు సప్తమీ'అని యిందను దానింగూడ సప్తమీప్రత్య యముగ నంగీకరించెనుట 'సవిధవర్తినామిందు' అనియనుటంజేసి స్పష్టపడెడి. మఱి కొంతకాలమున కెందనుదానికిఁ గూడ లాక్షణికు లల్యాగమము నంగీకరించిరి. అథర్వణుఁడు 'అల్యాగమస్స్యాదంద్వింద్వోర్భ్వేదిజ్ఞసిచేతయోః, తథాతోడవిభక్త్యా చ

సమాసే కవిసమ్మతేః' అని 'జేరలి చ, ఇచ్ఛవిభక్త్యంతిమస్య' అనుమూలసూత్రముల వివరించినాఁడు. దీనింబట్టి ప్రయోగానుసారముగ జేరులచ యని కొందఱూహించు పాఠము మూలస్థముగాక కృతకమనుట తెల్లము. సూరి యీత్రోవనే పట్టి 43, 44 సూత్రముల వివరించినాఁడు. "ఎంద్విత్యా సేన కిమపరాద్ధమ్" అను నహోబలపండితీయ వాక్యమునుబట్టి ఎందునకుఁ గూడ నల్యాగమము నంగీకరించె. అంద్వాదిశబ్దత్రయ మధికరణలక్షణాభిధాయకములగు దేశ్యశబ్దములుఁగాన వీనిని సప్తమ్యంతములుగ నెన్ని యల్యాగమము చేయనగునని యహోబలపండితీయాశయము. ప్రాచీనమున మాత్రము అందులదానవు ఇందులదానవు ఎందులదానవు అనునట్టి రూపములే తోఁచెడిఁగాని యలిగాగమరూపముతోడి రూపములు సామాన్యముగ నివి యలిగాగమము గలిగినవని సమర్థింపఁదగినవి గన్పట్టవు. శాసనప్రయోగములను నన్నయభారతప్రయోగములను గమనించిన అందు ఇందు ఎందులు కళలనియుఁ బిదప వీనికి సముచ్చయము చేరుట ద్రుతప్రకృతికత్వము గలిగెననియు విశదమగు. సంధి 2 సూత్రములో నిరూపించిన ప్రకార "అందు ఇందు ఎందు"అనునవి 'ఆ-ఈ-ఏ' అను సమహదర్థముల కందువర్ణకము చేరిన సప్తమ్యేకవచనములుగఁ జెప్పనగుంగాన వీని కలిగాగమము గలుగుట నిర్వివాదమని తోఁచెడి. అథర్వణాదు లెందుశబ్దమున కల్యాగమము నంగీకరింపమిని గొందఱెందుశబ్దమున కలిగాగమము లేదండ్రని సూరి వివరించికొనవలసివచ్చెను. ఈయలిగాగమము పరమగునపుడు 2 సూత్రముచే నందునకు సంధి గలుగదని యెన్నవలెను. నాయందునలివారు గాదనుట. సామాసిక ద్రుతలోపశాస్త్రముచే ద్రుతము పోయినను బ్రత్యయోకార మున్నదిగానఁ గల్గిన నిత్యముగ సంధి గల్గఁదగును. సమాసత నంగీకరించునపుడే యీరెండుసూత్రములచే నగుకార్యములు గల్గెడి. వ్యస్తమునసైన నాయందుఁ గరుణ నీచేతఁ బ్రోపను మున్నగు రూపములు గలిగెడి. ఇంద్వెందులకు వ్యస్తముగఁ బ్రయోగము ప్రసిద్ధమగుట ననిర్దిష్టము.

ఆధారార్థకావ్యయములగుటఁ దొల్లిటిభాష నివి కళలు. అవ్యయము గొన్ని విభక్తులుగల్గి ప్రయుక్తమగుట చూపట్టెడిఁగాన నాపద్ధతిని దొల్లిటి తెనుఁగున కువర్ణకముతోడి కలయిక యమరెననియు నపుడు తత్సంగతిని నందుల కిత్యాదిరూపము లేర్పడెననియు నూహింపనగును. ఇట్లే యలిరూపము లకారముపై నికారము సమాసమునఁ గాఁగలిగె ననఁదగు. కాలక్రమమున వీనిమీఁద చేత-కొఱకు-వలన-కంటె-కు చేర్పఁగా ననుకరణమునంజేసి 'అందుకు, అందున' కిత్యాదిరూపములు గలిగెనని ఫలితము.

ఇత్యాలిగాగమవిధానములంబట్టి యొక్క-యొక్క షష్ఠీతత్పురుషము తక్కఁ దెనుఁగున విభక్తి లోపించి తత్పురుషార్థమును వినాశకఱచు తత్పురుషము వేఱొకటి

లేదనుట స్పష్టము. మఱియు నేతద్వ్యతిరిక్త విభక్త్యంతములకు విభక్తిలోపము చేసైన నిజమైన తత్పురుషమె మృగ్యమనుటయుఁ దెల్లమె. ఇంకను నిట్టి సమాసముల విభక్తి లోపము గల్గినచో షష్ఠీసమాసతయే భాసించెడిననుటయుఁ దెల్లంబుకాన విభక్తి లోపము సమాస 25 చేఁ గలుగకుండుటకై యీవిధులు (44-45) గలిగెనని గ్రహింపఁ దగును.

## అది యవి శబ్దంబులయత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు. ౪౫.

| | | | | |
|---|---|---|---|---|
| నా | ... | అది | ... | నాది. / నాయది. |
| నా | ... | అవి | ... | నావి. / నాయవి. |

ఉదంతములగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద లోపంబు లేదనియు నిదంతంబులగు తద్ధర్మవిశేషణంబులమీఁద నిత్యంబనియు బహుళ గ్రహణముచే నెఱుంగునది.

వచ్చునది-వచ్చునవి - వచ్చెడిది-వచ్చెడివి.

టీ. 'శబ్దాత్తచ్ఛబ్దాత్' అనునది మూలము. సమాస 8 చే నెల్లశబ్దములకు సంబంధార్థమునఁ దచ్ఛబ్దముతో సమసించుట సిద్ధించెడి. సంబంధార్థకప్రకాశకముయొక్క-షష్ఠి. సంబంధార్థమున శబ్దములతో సమసించినయదియవుల తొలి అకారములకు లోపము బహుళముగ నగును. నాయొక్క+అది. సామాసికవిభక్తికి యొక్క-కు నిత్యముగ లోపము. నా+అది. అదిశబ్దము నాదినున్నహ్రస్వాకారమున కీవిధిచే లోపము. నాది. ఈవిధి బహుళమగుటఁ గలుగనపుడు దీర్ఘాంతములపై సంధివిధానము లేమి యడాగమము రా నాయదియని రూపమేర్పడును. ఇట్లే హ్రస్వాంతములమీఁది యదియవుల కును రూపములు గలుగును. హ్రస్వాకారాంతములపై నదియవులయత్తున కత్వసంధి తదభావముల (తనది-తనవి-తనయది-తనయవి) నత్వలోపము గలుగనక్కఱలేకయే రూపములు సిద్ధించెడిఁగాని యాకారాంతములయం నికారాంతములయు నుకారాంత ములయుమీఁద నావశ్యకమగుట నీవిధి సర్వశబ్దపరముగ సంభావింపక తీరదు. ఉకారాంతములమీఁద నత్తునకు లోపము గలుగనపుడు 34 చే నుగాగమమురాకను స్మరించునది. (రామునది) వృత్తిశబ్దము సమాసవాచకమగుట స్పష్టము. ఐనను నెల్ల శబ్దములు సంబంధార్థమున నదియవులతో వర్తించుట నిట వృత్తి యనెనని తోఁచెడి.

ఇందలి బహుళపదముశక్తింజేసి యీవిధి పొట్టియుకార మంతమందుఁగల తద్ధర్మార్థకవిశేషణములపై నుండు నదియవులయత్వమును లోపింపఁజేయదనియు హ్రస్వేకారమంతమందుఁగల తద్ధర్మవిశేషణములమీఁది యదియవుల యత్తుల నిత్యముగ లోపింపఁజేయుననియు సూరి యీ క్రిందివివరణమున కభిప్రాయము. వచ్చు+అది:—ఇచ్చో 'వచ్చు' అనునది తద్ధర్మార్థకోదంత విశేషణము. దీనికిఁ బరముననున్న అదిశబ్దాకారమునకు లోపము బహుళగ్రహణమునంజేసి గలుగదు. కాన వచ్చు పరమగుటంజేసి 33 సంధిసూత్రముచే నుగాగమము గలుగ 'వచ్చునది' అనియే రూపమగు. ఇట్లే యుదంత తద్ధర్మార్థకమునకు అవిశబ్దము పరమగునపుడును రూప మూహించికొనునది. 'వచ్చెడు' అను నెడువర్ణకము చేరిన తద్ధర్మవిశేషణరూపములమీఁద నిట్లే యదియవుల మీఁదినున్న అకారమున కీవిధిచే లోపము రాకుండుటయు 33 సంధిసూత్రముచే నుగాగమమును నూహించునది, వచ్చెడి+అది:—ఇది యిదంత తద్ధర్మవిశేషణము. దీనిమీఁది యదియవుల తొలి అకారములకు బహుళగ్రహణమునంజేసి నిత్యముగ లోపము గలుగ 'వచ్చెడి+ది=వచ్చెడిది. వచ్చెడి+వి=విచ్చెడివి.' అనురూపము లేర్పడును. 'వచ్చుది, వచ్చువి, వచ్చెడియది, వచ్చెడియవి' యనునట్టి రూపములు సిద్ధింపవని భావము. ఇవియెవులను శబ్దములను జేర్చినచో ముందేగాని, పరమునఁ జేర్పరాదని (ఇవి నీవి; ఎవి నావి?) దీనిచేఁ దేలుచున్నది. మఱియు వృత్తిననుటంజేసి వ్యస్తమునఁ బూర్వపదీభూతములగు వీనికైన యత్తులకు లోపము గాదనుటయు స్పష్టము. సమాస 9 సూత్రముచే వీనికి యదియవులు పరములగుట సంభవించునుగాన నీ వివరణమును సూరి వ్రాసికొనవలసివచ్చెను. క్రియ 44, 45 సూత్రములచే నీ విశేషణము లేర్పడును. దీని విస్తృతి సమాస 8 లో నరయునది.

## పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణ బిందువులు విభాష నగు. ౨౬.

| | | | | |
|---|---|---|---|---|
| భయము | ... | పడె | ... | భయపడె.<br>భయంపడె.<br>భయముపడె. |
| సూత్రము | ... | పట్టె | ... | సూత్రపట్టె.<br>సూత్రంపట్టె.<br>సూత్రముపట్టె. |

ఈకార్యము కర్తృవాచి మువర్ణకమునకుఁ గలుగదు.

గజము పడియె - అశ్వము పడియె.

టీ. 'ప్రథమావైభక్తికమోర్బిందుశ్చ మహాఙ్ పతిక్రియార్థేషు' అనునది మూలము. పడు, పాటు, మొదలగు పడుధాత్వర్థకములును, పట్టె, పెట్టు మొదలగు సూత్రస్థాదిపదవాచ్యశబ్దములును, బరములగునపుడు ప్రథమైకవచనప్రత్యయమగు 'ము' అనుదాని కొకమాఱు లోపమును నొకమాఱు పూర్ణబిందువును నీరెండును వికల్పము లగుట నొకమాఱు స్వస్వరూపముతో నుండుటయుఁ గలుగును. భయము+పడె:—పడె ననునది పరమయ్యెఁగాన భయముశబ్దము తుదినున్న మువర్ణకమునకు లోపము గలుగ 'భయపడె'ననియుఁ బూర్ణబిందువు రాఁగ 'భయంపడె'ననియు నీరెండుకార్యములు సంభవింపకున్న 'భయముపడె'ననియుఁ రూపత్రయ మేర్పడును. భయమును బొందెనని వీని కర్థము. ఇట్లే తక్కిన యుదాహరణము ప్రక్రియను గమనించునది. పూర్ణబిందు విధానముం జేసి యర్ధబిందువు గలుగదని గ్రహించునది. ఈసూత్రముచే నగు లోప పూర్ణబిందు కార్యములు గర్తను జెప్పు పదమునకు సంబంధించిన ముప్రత్యయమునకుఁ గలుగవు. అనఁగాఁ గారక 24 చే ద్వితీయకు బదులుగాఁ గల్గిన ప్రథమకు, సంబంధించిన మువర్ణమునకు మాత్రమే గలుగునని భావము. భయంపడు మొదలగువానికి భయము నందెనని యర్థమగుటచే నచ్చటి పడుధాతురూపమునకు భయమనునది కర్తగాక యన్యము దేవదత్తాదికము కర్త యయ్యెడిఁగాన నచ్చో నీకార్యములు గలుగనగును. గజముపడియె నిత్యాదులందు పడినది గజమే గాన నచ్చటి పడుధాతురూపమునకు గజమే కర్త యగుటచే నది కర్తృవాచి యగుంగాన దాని మువర్ణకమున కీకార్యములు సంభవింపవు. ఇట్లే అశ్వము పడియె నను స్థలమునఁ బాటునందినది యశ్వమేగాన నట్టి కర్తృవాచకమగు దాని మువర్ణమునకు లోప పూర్ణబిందువులు గలుగ నేరవు. పడ్వాదులకుఁ గర్తలగు పదముల మువర్ణకముల కీకార్యములు రావనియుఁ, వానికిఁ గర్తలు గానట్టియుఁ గర్మార్థకములై మువర్ణకాంతము లైనట్టియుఁ బదముల మువర్ణకములకే యీ కార్యములు గలుగునని ఫలితమును గ్రహించునది.

మూలము ప్రతిక్రియార్థములు పరములగునపుడు మాత్రమే మువర్ణకమున కీ కార్యములు విధించెడి. అనఁగాఁ బడుధాతురూపములు పరములగునపుడే యనుట. అథర్వణుఁడు 'అదంతపాదిశబ్దేషు పత్యర్థే బిందులోపకౌ, వర్ణకస్యాత్ర కథితౌ క్వచిత్సుకవిసమ్మతేః' అని పాటు మొదలగు నానారాది పడుధాతురూపములు పరములగునపుడును నీకార్యములు గల్గునని 'పతిక్రియార్థేషు' అను మూలమునందలి బహు

వచన ప్రయోగమునకు సారస్యముం జూపుచు, వివరించెను. ఈమూలవివరణముల ననుసరించినను, పెట్టు పట్టు మున్నగునవి పరమగునపుడు మువర్ణకమున కీకార్యములు గలుగుట పొసఁగదు. ప్రాచీనమునఁ గానరాకున్నను పట్టు-పఱచు-పెట్టు-మొదలగునవి పరమగునపుడు గూడ నీ లోపబిందుకార్యములు పూర్వపద మువర్ణకమునకుఁ గవి ప్రయోగములఁ గన్పట్టుచుండుటంజేసి మూలమునందలి 'పతిక్రియార్థేషు' అను బహువచనప్రయోగమును, నథర్వణుని పై వివరణమును, నాధారముగఁగొని సూరి పఱ్వాదులని యాదిశబ్దము మూలమున గణముగా నీశబ్దములనెల్ల నిరూపించి యివి యెల్లఁ బరమగునపు డీకార్యములు గలుగనగునని వివరించెనని తోఁచెడి.

## మధ్యమపురుష మువర్ణకంబునకు హాలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు. ౮౭.

| | | | | |
|---|---|---|---|---|
| చూడుము | ... | నన్ను | ... | చూడు నన్ను.<br>చూడుము నన్ను. |
| ఇటు | ... | చూడుము | ... | ఇటు చూడు.<br>ఇటు చూడుము. |

చూడుమనియె - వినుమనియె. ఇచ్చట నచ్చు పరంబయినది కాఁబట్టి లోపము లేదు.

టీ. 'ప్రార్థనార్థే మురేకత్వే కథ్యతే మధ్యమార్థకః, విభాషాం తం వదంత్యేకే న ప్రాణేతు కదాచన' అను నాథర్వణము మూలము. మధ్యమపురుషైకవచన క్రియల తుదినున్న మువర్ణమునకు హల్లు పరమగునపుడును నేదియుఁ బరముగ లేనపుడును వికల్పముగ లోపము గలుగును. చూడుము+నన్ను:—ఇచ్చో 'చూడుము' అను మధ్యమపురుష క్రియకుఁ దుదినున్న మువర్ణకమునకు నన్ను శబ్దము నాదినున్న నకారము హల్లు పరమైనదిగాన లోపము గలుగ 'చూడు నన్ను' అని రూపమేర్పడెను. ఇటు చూడుము. ఈవాక్యమున 'చూడు' అనుదానితో వాక్యము పరిసమాప్తమగుట నేదియుఁ బరముగ లేదుగాన నవసానమున మువర్ణకము లోపింప 'ఇటు చూడు' అను రూపమేర్పడెను. హల్లు పరమగుటగాని యేది పరముగ లేకపోవుటగాని సంభవించునపుడే యీకార్యము విధింపఁబడుటచే నచ్చు పరమగునపు డీలోపము గలుగదని గ్రహింప వలెనని సూరి స్పష్టపఱచెను. చూడుము+అనియె-వినుము+అనియె:—ఇందు మధ్యమ మువర్ణకముల కచ్చుపరముగ నుండుటంజేసి మువర్ణకమునకు లోపము గలుగదు. కాన నుత్వసంధి గలిగి 'చూడుమనియె, వినుమనియె' ననియే రూపము లేర్పడునుగాని

‘చూడనియె, విననియె’ ననురూపములు సంభవింపవని క్రింది వివరణమున కభిప్రాయము. ప్రౌఢవ్యాకర్త యాడిదె (ఆడుము+ఇదె=ఆడిదె) యను మున్నగు ప్రయోగముల నుదాహరించి యచ్చు పరమగునపుడును మధ్యమ మువర్ణకలోపము కొన్నియెడలఁ జూపట్టెడినని యీసూత్రమును సవరించినాఁడు. ఇట్టివి విరళము లగుటను, నవీనము లగుటను, శ్రుతికటువు లగుటను సూరి వివరింపక విడిచెనని తోఁచెడి.

## వ్యతిరేకమధ్యమమువర్ణకంబున కెల్లయెడలలోపంబువిభాషనగు. ౭౮.

నమ్మకుము...ఇట... { నమ్మకిట.<br>నమ్మకుమిట.

టీ. వ్యతిరేకక్రియకుసంబంధించిన మధ్యమపురుషైకవచనమువర్ణకమున కచ్చు పరమగునపుడును హల్లు పరమగునపుడును నేదియుఁ బరము గానపుడును లోపము వికల్పముగఁ గలుగును. ‘నమ్మకుము, చేయకుము, చెప్పకుము’ ఇత్యాదులు వ్యతిరేకక్రియామధ్యమపురుషైకవచనములు. నమ్ముమిత్యాదుల వ్యతిరేకరూపములగుట నవి వ్యతిరేకమధ్యమపురుషరూపము లయ్యెను. ఎల్లయెడల ననుటంజేసి యజ్ఝల్లులలో నేది పరముగ నున్నను లేక పోయినను ననునర్థము లభించెడి. నమ్మకుము+ఇట:—ఇట నీవిధిచే నచ్చు పరమగుడు లోపము గల్గినపక్షమున నుత్వసంధి గలిగి ‘నమ్మకిట’ ననియుఁ, మువర్ణకలోపము సిద్ధింపని పక్షమున ‘నమ్మకుమిట’ ననియు రూపము లేర్పడెడి. ఇట్లే హల్లు పరమగునపుడును ‘నమ్మకు వారిని, నమ్మకుము వారిని’ ననుమున్నగురూపము లేర్పడు. ఇట్లే యేది పరముగ లేనపుడును ‘వారిని నమ్మకు, వారిని నమ్మకుము’ అను మొదలగురూపములు గలుగును. మధ్యమ మువర్ణకమునకు వలెనే వ్యతిరేకమధ్యమ మువర్ణకమునకును నచ్చు పరమగునపుడు లోపము గలుగదని యథర్వణాహోబలులయాశయము. దాన ‘జాగొనరింపకో జనకజాహృదయేశ, తలంపకమ్మ’ మున్నగు నచ్చుపరమగునపుడైన వ్యతిరేకమధ్యమమువర్ణకలోపరూపము లసాధువులని వారనిరి. ‘నమ్ముము, నమ్మకుము’అను నీజాతివెల్ల మధ్యమపురుషైకవచనములే యైనను, వ్యతిరేకము గానిదానికిని వ్యతిరేకమునకును, నచ్చు పరమగునపుడు రూపభేదము లేర్పడుచుండుటంజేసి వేఱు సూత్రములను విరచింపవలసి వచ్చెనని గ్రహించునది.

## ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమముడుజ్ఝులకు లోపంబు విభాషనగు. ౭౯.

ఉండుము...ఉండుము... { ఉండుండుము.<br>ఉండుముండుము.

కొట్టుఁడు...కొట్టుఁడు... { కొట్టు కొట్టుఁడు.
కొట్టుఁడు కొట్టుఁడు.

టీ. ద్విరుక్తములైన మధ్యమపురుషైకవచనబహువచనరూపములందు తొలినున్న రూపములకుఁ దుదినున్న ము, డు, అనువానికి వికల్పముగ లోపము గలుగును. ముడుజ్ఞు లనఁగా మధ్యమైకవచనబహువచనప్రత్యయములు. ఆమ్రేడితార్థము ముందే వివరింపఁబడినది. ఉండుము+ఉండుము:—ఇందు మొదటిపదముమువర్ణ మీవిధిచే లోపింప నుత్వసంధిచే 'నుండుండు' మనురూప మగును. మువర్ణలోపము గలుగనియెడల నుత్వసంధియే కలిగి 'ఉండు ముండు' మని యగును. ఇట్లే తక్కిన రూప మూహ్యము. మూలమువలె నంత్యలోపము గల్గు ననకుండుటంజేసి యామ్రేడితము పరముగా సుబ్విభక్తి లోపమున కొకశాస్త్రము యజంతాజాదిపదసంధి కొకసూత్రము మధ్యమ ముడుజ్ఞులలోపమున కొకసూత్రము సూరికి సూత్రించికొనవలసి వచ్చెను. ఆమ్రేడితము పరమగు నపుడు కృతహ్రస్వమునకు దీర్ఘంబగునని 'లేలెమ్ము; పోపొమ్ము;' అని యుదాహరించి త్రిలింగలక్షణశేషకర్త దీనిని సవరించుట సరయునది. దీన మువర్ణకమేగాక సద్విత్వ మువర్ణకమును నీలోపమునకు విషయమని తేలెడి.

## విసర్గంబున కనుకరణంబున లోపంబగు. ౫౦.

వర్ధతాం శ్రీః—అనిరెు. వర్ధతాం శ్రీ యనిరెు.

టీ. 'లోపో నమ ఆదికే విసర్గస్య' అనునది మూలము. ఇది మొదలుగా నైదు సూత్రములు సంస్కృత సుప్తిజంతముల నున్న వున్నటులఁ దెనుఁగునఁ బ్రయోగించుట కుపాయమును సూచించుమూలమున నపుడగు కార్యవిశేషములఁ జేర్కొనును. అనుకరణమనఁగా నొకదాని నొకటి పోలుటకుఁ బాటుపడుట యని యర్థము. సంస్కృత శబ్దజాలమెల్లఁ దెలుఁగున వెలయించి సంస్కృతభాషాతౌల్యము తెలుఁగునకు సంపాదింపఁ బడునట్టిపాటును దెల్పుప్రకరణముగాన నిది యనుకరణప్రకరణ మగును. ఇందులకు 'అను' అనునది సాధనముగాన ననుకరణమనియుఁ ననఁదగును. కరణమన సాధనము. 'అను' అనుదానిం దుదిం జేర్చి సంస్కృతపదములు తెలుఁగుభాషలోనికి లాఁగఁబడుచున్నవిగాన ననుకరణమను పేరు గల్గెనని భావము. 'అను-అని-అన్న-అన్-అనిరెు' ఇత్యాదులను ధాతురూపము లనుకరణమున గ్రాహ్యములనుట స్పష్టము.

విసర్గాంతమైనపదమునుగాని వాక్యమునుగాని యనుకరణము చేయునపుడు వాని తుదివిసర్గమునకు లోపము గల్గును. వర్ధతాం శ్రీః+అనిరెు:—'వర్ధతాం శ్రీః' అను వాక్య మనుకరణము చేయఁబడునదిగాన దీనితుదివిసర్గము లోపించెడి. పిదప దీర్ఘాకార ముపై సంధివిధానము లేమిని శుద్ధసాంస్కృతికమగుటను ననుధాతురూపాదినున్న

అకారమునకు యడాగమము గలుగ "వర్ధతాం శ్రీ" యనియే ననురూప మేర్పడును. లోపింపఁదగిన విసర్గమునకుఁ బూర్వమున నున్నవి హ్రస్వాచ్చులే యైనను శుద్ధసాంస్కృతికము లగుట సంధి గలుగదనియే గ్రహింపవలెను. ఆయాసందర్భములం దాయాపాత్రలసంభాషణయందే ప్రసక్తి యనుకరణమునకుఁ గలిగెడిఁగాన ననుధాతురూపములకే ప్రవేశ మిందుఁ దఱచుగఁ గలిగెడి. కాని యనుకరణము "ఇతి-ఇత్థమ్-ఏవమ్" అను మున్నగువానిచే జరుపుటగూడఁ గన్పట్టును. కాని వీనితో ననుకరణము చేయఁ నపుడు మాత్ర మివి తెలుఁగువిభక్తి చేరిన సిద్ధసమాసాదిగతపదములే యైయుండును. ఉ. "జగత్ ఇత్యాదులు గ్రాహ్యములు, రాజతే ఇత్యాదిధాతువులు." కొన్నియెడల ననుకరణము చేయకయే సంస్కృతవాక్యములఁ దెలుఁగునఁ బ్రయోగించుటయుఁ జూపట్టునని ప్రౌఢవ్యాకర్త 'అంటితి నమశ్శివాయ పాహ్యత్సురాలి' మున్నగువాని నుదాహరించె. శుద్ధసంస్కృతవాక్యరచన యనుకరణహీనమై తెనుఁగుకబ్బములఁ గన్పట్టెడి. సదా సర్వదా స్వస్తిసాహి మున్నగువాని కనుకృతి గన్పట్టదు. జయపద మనుకృతి లేకయే తెలుఁగునఁ బ్రయుక్తమై గన్పట్టుచున్నదని ప్రౌఢవ్యాకర్త 'జయ నారాయణ పుండరీక' అని యుదాహరించె. సాధారణముగ ననుకరణమే చూపట్టు. క్వాచిత్కముగ నేవో కొన్నియనుకరణము చేయఁబడనివి గనుపట్టు. కాన మిగిలినవీనివిశేషములను నియమములను బ్రయోగములవలన నెఱుంగునది.

అనుకృతిని నమశ్శబ్దముతుదియత్తున కోత్వము విభాషనగు. ౫౧.

తుభ్యంనమః ... అనె... { తుభ్యం నమో యనె. / తుభ్యం నమ యనె. }

ఈకార్యము లాఁతిచోసహితము గనంబడియెడి. గతానుగతికో లోకో యటంచుౘ.

టీ. 'నమశ్శబ్దవిసర్గస్య లోప ఓత్వమపీష్యతే' అను నాథర్వణము మూలము. అనుకరణమున 'నమః' అనుదాని తుదివిసర్గము నిత్యముగ లోపించును. ఆవిసర్గమునకుఁ బూర్వమున నున్న మకారముమీఁది అకారమునకు ఓకారము వికల్పముగఁ గలుగును. విసర్గలోపము పూర్వసూత్రప్రాప్తమున కనువాదము. ఓకారవికల్పవిధానమె యీసూత్రము క్రొత్తగ విధించిన కార్యము. 'తుభ్యం నమః + అనె,' ఇందు 'తుభ్యం నమః' అనున దనుకరింపఁబడియె. ఈవాక్యముతుదినున్న 'నమః' అనుదానివిసర్గము లోపించి మకారముమీఁది అకారమున కోత్వము వికల్పముగ సిద్ధింప 'తుభ్యం నమో' అనురూప మేర్పడు. ఓత్వము గలుగనియెడల విసర్గలోపము నిత్యముగాన నది సిద్ధించి యడాగమము పరపదాద్యచ్చునకయి 'తుభ్యం నమ యనె' అని రూపమగును. నమో యను

ఓదంతావ్యయమును సంస్కృతమునఁ గన్పట్టుటచే నమశ్శబ్ద మోదంతముగఁ గన్పట్టు నపు డోదంతావ్యయ మనియు, 'నమః' అని యున్నపుడు విసర్గాంతమనియుఁ జెప్ప నగునుగాన, నోత్వవిధాన మనావశ్యకమని యెన్ని చింతామణి చేయలేదనియు, దాన నీవిధియు నట్టిదేయగుననియు ననవచ్చును. అథర్వణుఁ డోత్వమును 'నమశ్శబ్దవిసర్గస్య లోప ఓత్వమపీష్యతే' అని నమశ్శబ్దమునకు విధించుటంజేసి యీతఁడును నాదారినే పోయెనుగాన నాతనివివరణ మెట్టిదైన నిదియు నట్టిదె యయ్యెడి. లుప్తవిసర్గమునకు ముందున్న అకారమున కోత్వము గలుగుట నమశ్శబ్దమునకేగాక యితరమునకుఁ గూడ నగపడుచున్నది. 'గతానుగతికో లోకః + అటంచు' ఇందు గతానుగతికో లోక యను ననుకృతివాక్యమున లోకశబ్దమువిసర్గము 50 చే లోపించినపిదప కకారముపైనుండు అకారమున కోకారముగల్గి లోకో యనునోదంతరూప మయ్యెడి. ఇట్లితరముల కోత్వము గలుగుట యరుదని చెప్పవచ్చును.

## అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు. ౫౨.

| | | | | |
|---|---|---|---|---|
| కింతత్ | ... | అనియె | ... | కింతత్తనియె. |
| కస్త్వమ్ | ... | అనియె | ... | కస్త్వమ్మనియె. |

టీ. 'అహమాదీనాం ద్విత్వమ్' అనుమూలమును వివరించు 'అంత్యగస్య హలో ద్విత్వం భవేదనుకృతే పరే' అనునాథర్వణము మూలము. అనుకరింపఁబడునది హలంత మైన దానితుదిహల్లునకు ద్విత్వమగును. 'కింతత్ + అనియె' ఇందనుకరింపఁబడిన కింతత్తు దాని తుదితకారము పొల్లునకు ద్విత్వము రాఁగ 'త్త్' అగును. అది యనుధాతురూపము నాదినున్నఅకారముతోఁ జేరి 'కింతత్తనియె' ననురూపమగును. 'కస్త్వమ్+అనియె' ఇందు కస్త్వమ్మనుదాని తుదిమకారమునకు ద్విత్వము గలిగి 'మ్మ్' యను ధాతురూపము నాది నున్న అకారముతోఁ జేరి 'కస్త్వమ్మనియె' నని రూపమేర్పడును. పదాంతమున వికల్ప ముగ సున్నయుం నుండనోపునుగాన నట్టియెడల సున్నను మకారముగా భావించుటయేని మకారాంతమునే పరిగ్రహించి ద్విత్వమును గూర్చుటయేని చేయవలయును. ఇది నిత్య సూత్రము.

## అనుకరణంబునం దహమాదులమకారంబునకు ద్విరుక్తి విభాషనగు. ౫౩.

దాసోహమ్ ... అనె ... { దాసోహమ్మనె. / దాసోహమనె.

తత్కర్తవ్యమ్...అనె... { తత్కర్తవ్యమ్మనె. / తత్కర్తవ్యమనె.

టీ. 'అహమాదీనాం ద్విత్వం' అనునది మూలము. పొల్లుమకారము తుదిఁ గల వానికిఁ గొన్నిటికి వికల్పముగ ద్విత్వవిధాన మావశ్యకమగుటఁ బ్రత్యేకసూత్రమారబ్ధము. అనుకరణమున 'అహమ్'అను మున్నగుశబ్దములతుదినున్న పొల్లు మకారమునకు ద్విత్వము వికల్పముగ నగును. 'దాసోహమ్ + అనెను.' ఇందు 'దాసోహ'మను ననుకరింపఁబడుదాని తుదిమకారమునకు ద్విత్వము గలిగి (మ్మ్) పరాచ్చుతోఁ గలియఁగ ''దాసోహమ్మనె'' ననియు, మకారమునకు ద్విత్వము రానపుడు పొల్లుమకారము పరాచ్చుతోఁ జేరి ''దాసోహమనె'' ననియు రూపము లేర్పడును. ఇట్లే తక్కినయుదాహరణముల ప్రక్రియను గనుంగొనునది. ఇట్లే యేహలంతములహల్లులు నిత్యముగ ననుకరణమున ద్విత్వముం జెందఁదగినవో వానిని బూర్వసూత్రమునకు, వికల్పముగఁ జెందఁదగిన మకారాంతముల నిందును జేర్చికొని రూపముల యథాసంభవముగ సాధించుకొనునది.

ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమంబగు. ౫౭.

ఇయం ధేనుః...అనె...ఇయంధేనువనె.

అనుకృతిని నిమదకుం గుఱుచ యగునని యొకండు వలికె నది నిరాకరంబు. దుర్బలస్య బలం రాజా యన వినవే.

టీ. 'తత్రోతో వుర్భవేన్నిత్యమ్' అనునాథర్వణము మూలము. ఉదంతమగు సంస్కృతప్రాతిపదిక మనుకరింపఁబడునపుడు దానివిసర్గము 50 సూత్రముచే నిత్యముగ లోపించిన పిదప 'వుక్' అనునాగమము నిత్యముగ నగును. 'ఇయం ధేనుః + అనె' 'ఇయం ధేనుః' అనున దనుకరింపఁబడునది. దీని విసర్గము లోపించిన పిదప ధేనుశబ్దము తుదియుకారమునకు 'వు' ఆగమముగఁ గల్గును. కాన 'ఇయం ధేనువనె' అని రూపమగును. వుగాగమము కకారము పోవునాగమముగాన నిర్దిష్టమున కంతావయవముగ నగుటను స్మరించునది. ఈవిధి నిత్యముగాన నుదంతము వుగాగమరహితమై 'ఇయం ధేను అనె' అనురూపమును బొందదని గ్రహింపవలెను. 'వు' అనునాగమముచుకారమునకును నను ధాతురూపాద్యకారమునకును సంధి నిత్యము. ఇయం ధేను వనె. దీర్ఘాంత మనుకరణమున హ్రస్వాంతమగునని యొకరనిరిగాని యది మూలములేని ప్రసంగముగాన నిరాకరమని సూరి వ్రాసెను. 'దుర్బలస్య బలం రాజా + అన':—ఇందు రాజాయను దీర్ఘాంతశబ్దము తత్సమ 54 చే హ్రస్వము గాఁజాలదని భావము. తత్సమ 54 సూత్రమనుకరణమున నగుప్రక్రియను బోధించునదిగాక తత్సమప్రాతిపదికములఁ దయారుచేయునదిగాన నిందు దానికిఁ బ్రసక్తి చూపట్టదని భావము. అనుకరణమున దీర్ఘమునకు హ్రస్వము గలుగుననుమాట సూరికాలపువా రెవరో యన్నమాటగాని ప్రాచీనులన్నమాట గాదు

గాన నొకండని యనాదరముగ సూరి వ్రాసియుండనోపును. ఇట్లీసూత్రపంచకమున శుద్ధసంస్కృతమునకే యనుకరణార్థ్నాత మూలము ననుసరించి ప్రతిపాదించినను నే భాషాపదము ననుకరింపవలసివచ్చినను నీయనుధాతురూపముల నంతమందుఁ జేర్చి తెలుఁగున ననుకరింపవచ్చుననుట నిర్వివాదము. ఇందులకు 'అహేయమన్యదేశీయం యత్తదేవ ప్రయుజ్యతే' అనునథర్వణోక్తి యాధారమయ్యెడి. ఇది సామాన్యముగ నన్యదేశ్యముల నున్నవున్నటుల నుపయోగింపవలె నను నంశమును సూచించునదైనను నట్లు ప్రయోగించుట కనుకరణమును మార్గాంతరముగానఁ బ్రమాణముగ స్వీకృతము. తెనుఁగునను సాధారణముగ ద్విరుక్తములగు పదార్థధ్వన్యాది వాచకముల కనుయోగ మునసె యనుకరణమగపడు. అట్టియెడలఁ గొన్నింటికి ముగాగమంబై సలసలమనునట్టి రూపములేర్పడును." అను విశేషమును బ్రౌఢవ్యాకృతినిబట్టి గ్రహించునది.

## వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గాదని యార్యులండ్రు.౫౫.

సత్యము సర్వశ్రేయము - అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థములు. ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంతమందు చూపట్టెడు.

ఇది సంధిపరిచ్ఛేదము.

టీ. న స్యాద్వాక్యవిరామేతు సంధ్యభావోఽపి దోషకృత్' అనునది మూలము. ఈసంధిపరిచ్ఛేదము ననుసరించి యజంతములు (కళలును) ద్రుతాంతములునగు నాంధ్ర భాషాపద ప్రపంచమునకు వాక్యవిన్యాసమున సంధి గలుగుటయె తోఁచెడిగాన వాక్యముల కెల్ల నేకవాక్యతయే సంధికార్యములంజేసి సిద్ధింపఁగా నట్టియవస్థను దొలఁగింప నీవిధి యారబ్ధమయ్యెను. కర్తృకర్మక్రియలతో వాక్యము పరిసమాప్తమైనచో మిగిలిన వక్తవ్యముం దెలుపు రెండవవాక్యముతో మొదటివాక్యమును గలుపనక్కఱలేదని యీవిధి కభిప్రాయము. "సత్యము సర్వశ్రేయము" అనుటతో నొకవాక్యము సమాప్తమయ్యెను. "అది లేనిచో" నను రెండవవాక్యమును వేఱుగనే (మొదటివాక్యముతోఁ గూర్పక) ప్రారంభింపవచ్చును. "సత్యము సర్వశ్రేయ మదిలేనిచో" నని సంధిచేయ నక్కఱలేదని భావము. ఇది గద్యకు సంబంధించిననియమము. పద్యమున మాత్రము వాక్యసమాప్తియుఁ బాదసమాప్తియు (రెండును) సంభవించునపుడే సంధికూర్చుట మానవలెనుగాని వాక్యాంతమైనను బాదాంతము గానపుడును, బాదాంతమైనను వాక్యాంతము గాని యపుడును విసంధి చేయరాదు. వాక్యాంతపాదాంతత్వములు రెండును సంభవించునపుడే పద్యముల సంధి మానవచ్చునని భావము. "సమధిగమము సత్యంబుతో సరియు గావు; ఎఱుగుమెల్ల అంతఁ గొందఱధికహాస్యంబునేసిరి; అడవినేమిరో సెదనిరి. క్రమము

వడసి యొక్క సమయంబు సేసిరి; ఒనరదాని తెఱంగు" "పడగనున్న హనుమ భయవిహ లుండు గాఁడు; అరదమునకు సూతుఁ డచ్యుతుండు." అను ప్రయోగములంబ వాక్యాంత పాదాంతములగుట సంభవించినపుడే పద్యముల విసంధి యగపడుననుట నిర్వివాదము. గద్యమునఁ బాదనియమము లేదుగాన వాక్యసమాప్తి యగుడు సం మానవచ్చును. ఇం దుదాహరణమున నుత్వ సంధ్యభావమే ప్రదర్శితమైనను నెల్ల సంధ లును గద్యయందు వాక్యాంతమునఁ గలుగవనియు, నట్లే పద్యమున వాక్యాం పాదాంత్యములు సంభవించినపిదపఁ గలుగకపోవచ్చుననియు గ్రహించునది. సంస్కృ మున గద్యలో సంధి యైచ్ఛికము. తెనుఁగున నది పనికిరాదన నీవిధి యారబ్ధమ ఫలితము.

ఇది సంధిపరిచ్ఛేదము సమాప్తము.



# తత్సమపరిచ్ఛేదము.

సంస్కృతప్రాతిపదికములకు డు - ము - వు - లు - మొదలగు ప్రత్యయములను విధించి సంస్కృతసమములను సిద్ధింపఁజేయుం గ్రంథభాగముగానఁ దత్సమపరిచ్ఛేదము నాఁబడెను. తత్సమముల కార్యవిశేషములను దేల్పుగ్రంథభాగమని ఫలితము. సంస్కృతప్రాకృతసమంబగు భాషకుఁ దత్సమసంజ్ఞ సిద్ధమైనను నీపరిచ్ఛేదమునఁ బ్రాకృతసమముల ప్రస్తావనమే గానరామిని గేవల సంస్కృతసమముల రూపసాధన ప్రక్రియయే యగపడుచుండుటను దత్సమశబ్దము సంస్కృతసమవాచకమే యగును. దీనఁ దచ్ఛబ్దము సంస్కృతపదవాచకమనియు దానికి సమము (దుల్యము) తత్సమ మనియుఁ దత్సమపదమున కిట వ్యుత్పత్తి నూహించికొనునది. ఇది యందును నజంత శబ్దముల ప్రక్రియం దెలుపు భాగముగాన నజంతపరిచ్ఛేదము నాఁబడును.

## డు - ము - వు - లు - ప్రథమ. ౧.

టీ. 'డుమువులవః ప్రథమా స్యాత్' అనునది మూలము. 'డు-ము-వు-లు' అను నీనాల్గును బ్రథమావిభక్తి ప్రత్యయములుగాన వీనికిఁ బ్రథమాసంజ్ఞ చేసెను. వీనివిభాగా దులు మీఁద స్పష్టపడును.

## నువర్ణంబు-ద్వితీయ. ౨.

టీ. 'కూర్చిలనునయోర్భవేద్ద్వితీయాతు' అనునది మూలము. 'ను' అనునది ద్వితీయాప్రత్యయమగుట దీనికి ద్వితీయయని పేరు. మూలము కూర్చిని ద్వితీయ యనె డిఁగాని యిది కూర్చుధాతు క్త్వార్థకరూపముగా నిరూపింప నవకాశముండుటచే దీనిని ద్వితీయాప్రత్యయముగ సూరి దలంపలేదని తోఁచెడి. ఇట్టిదానిఁ బ్రత్యయమన్న గుఱించి గుఱిచి మొదలగువానింగూడఁ బ్రత్యయము లనవలసివచ్చునుగాన వీనిని సూరి యుపే క్షించెనని తోఁచెడి. ఈతనివ్యాకృతిపద్ధతియందు 'ల' అనునది ద్వితీయాప్రత్యయము గాక ద్వితీయాదిబహువచనములందుఁ గలుగునాగమముగ నెన్నఁబడుటచేఁ బ్రత్యయ ముగ ననాదృతము. మఱియు 'మహతోనితావిభక్తాః టాదౌ వచనద్వయేక్రమేణ స్తః' అని మూలము తృతీయాబహువచనము మొదలుగా నెల్లవిభక్తుల బహువచనములందును లకారవిధానముం జేయుచుండుటచేత ద్వితీయా బహువచనమందును నదే యనినఁ బ్రక్రియ సక్రమముగ నుండుననియుఁ బైరీతి ననుసరించి లకారము బహుత్వప్రకా

శకమేగాని విభక్తిప్రత్యయము గాదనియుఁ దలంచి సూరి దీనిని ద్వితీయగాఁ జెన్నఁడయ్యెను. ఇంతియగాక మూలమునందువలె నిందుఁ గళగానిదానికెల్ల ద్రుతము తుది నంటు ననుపద్ధతి యసాధృతముగాన 'రాములను' ఇత్యాదిరూపములసిద్ధికై ద్వితీయా బహువచనమున లకారము ప్రత్యయమన్నను నువర్ణము చేర్పక తప్పదుగానఁ దక్కిన తృతీయాదిబహువచన రూపములందువలె నిందును లకార మాగమముగనే యంగీకృతమై నువర్ణమే ప్రత్యయముగ లెక్కింపఁబడెనని గ్రహించునది. ఇట్లే నియనునదియు నాగమ మని తలంచియుఁ డుమంతంబుమీఁదను నికారాంతాదుల మీఁదనునగు నివర్ణకము నువర్ణక పరిణామరూపమే యనియుం జెన్ని నివర్ణమును బ్రత్యయముగ జెన్నక తత్సమ 23-24-25-26 లచే నువర్ణకముచు నివర్ణకముగాఁ మార్చి కృతార్థుఁడయ్యెను.

## చేత-తోడ-తృతీయ. ౩.

టీ. 'తో చేత తోడ చే చ తృతీయాయాః' అనునవి మూలము. 'చేత-తోడ' అనునవి తృతీయా ప్రత్యయములుగాన వీనికిఁ దృతీయసంజ్ఞ చేసె. మూలము 'తో-చే' లనుగూడఁ దృతీయా ప్రత్యయము లనుచున్నను, జేత-తోడల యాద్యక్షరశేషములే యవియని స్పష్టపడుచుండుటం జేసి సూరి 10 సూత్రముచే వానిని జేత - తోడల యాద్యక్షరశేషములుగ జెన్ని సహజతృతీయా ప్రత్యయములుగ గణింపఁడయ్యెను. 'తోడుత-చేసి-మెయి-పై-మయి' ననునవి స్వతంత్రపదములుగాఁ దలంపఁబడుటచు బ్రత్యయములుగ లెక్కింపఁబడవయ్యె. మూల మిట్టిభావనం జేసియే వీనిని బ్రత్యయము లనదయ్యెఁగానఁ దదనుసారముగ సూరియు ననఁడయ్యె.

## కొఱకు-కయి-చతుర్థి. ౪.

టీ. 'కొఱకు కై చతుర్థ్యాస్తు' అనునది మూలము. 'కొఱకు-కయి' అనునవి చతుర్థీప్రత్యయము లగుటఁ జతుర్థి నాఁబడును. 'కయి' అనునది కైగాను క్రియ 103 సూత్రముచే వికల్పముగ నగుంగాన 'కై' యని మూలము ననుసరించి యనలేదు. మఱియు మూలానుసారముగ 'కై' యన్న పై 103 క్రియాసూత్రముచే 'కయి' సిద్ధింపదుగాన 'కయి'నే మూలముగ జెన్నె నని గ్రహించునది. (చూ. క్రియ. 103) తొల్లి చతుర్థీప్రత్యయముగఁ గన్పట్టు 'పొంటె' ననుదానిని, స్వతంత్రశబ్దమని యెన్ని గావలయు మూలము ప్రత్యయముగఁ దలఁపమి నీతఁడును దలఁపఁడయ్యెను.

## వలన-కంటె-పట్టి-పంచమి. ౫.

టీ. 'పట్టి-వలన-కంటె ఇతి పంచమీ' అనునది మూలము. 'వలన-కంటె-పట్టి' ఇవి పంచమీప్రత్యయము లగుట వీనికిఁ బంచమీసంజ్ఞ. 'వల్ల-కన్న' అనునవి పంచమీప్రత్య

యము లనుటకుఁ బ్రాచీనప్రయోగము లగపడమిని వాని నిందుఁ జేర్పఁగాలేదని తోఁచెడి. వీని యితరవిషయము 7 సూత్రపుఁ డీకలోఁ దుది నరయునది.

## కు-యొక్క-లోపల-షష్ఠి. ౬.

టీ. 'అథ లోపలకేకుయొక్కాస్స్యా' అనునది మూలము. 'కు-యొక్క-లోపల' ఇవి షష్ఠీప్రత్యయము లగుట షష్ఠినాఁబడెను. 26 చే కువర్ణకము కివర్ణమగుంగాన కివర్ణకము వేఱుగ నంగీకృతము గాదయ్యెను. 10 చే లోపల వర్ణకమునుండి లో సిద్ధించెడిఁగాన లో ననుదానిని వేఱుగ నంగీకరింపఁడయ్యెను.

## అందు - న - సప్తమి. ౭.

టీ. 'అంద్వింందు నాస్త సప్తమీ'అనునది మూలము. 'అందు-న'అనునవి సప్తమీ ప్రత్యయములుంగాన వీనికి సప్తమి యని సంజ్ఞ. మూల మలిగాగమము సిద్ధింపఁజేయుటకే యిందును సప్తమిగ నెన్నెనుగాని యిది సప్తమీప్రత్యయముగ శబ్దములకుఁ జేరమింజేసి సూరి యాయలిగాగమప్రయోజనమును సంధి 41 చేఁ గూర్చుటంజేసి దీనిని సప్తమీ ప్రత్యయముగ నంగీకరింపఁడయ్యెను. నవర్ణకము కారకము 18 చే జడవాచకముల కగునదనుట మఱువరాదు. మఱియు నవర్ణక ముదంతజడంబు తృతీయకు (కారకము 23 చే) నగుటను గూడ నరయునది.

కాలక్రమమున నవి జ్ఞాతప్రకృతులైన కర్మ స్వతంత్రపదముల శిష్టభాగములు ప్రత్యయములనుట నిర్వివాదము. ఈలక్షణము ననుసరించి తెలుఁగున 'డు-ము-వు-లు, ను, కు, న,' అనునవియే ప్రత్యయము లయ్యెడి. తక్కినవి యర్థవంతము లగుపడము లగుట ప్రసిద్ధము. దీన నాంధ్రభాష సంస్కృతమువలెఁ గేవల మవిజ్ఞాతప్రకృతిక ప్రత్యయభాషగాక విజ్ఞాతావిజ్ఞాతప్రకృతిక ప్రత్యయభాష యగుచున్నది. మఱియు నవిజ్ఞాతప్రకృతులుగ నెన్నఁబడు "డు-ము-వు-లు" అనువానిలో 'డు' అనునది మహత్ప్రథమపురుషైకవచన కర్తృవాచక మగువాఁ డనుదాని వా లోపింప నేర్పడిన రూపమని తోఁచెడి. ఇఁక 'ము' అనునది పొల్లు మకారమంతమందుఁ గల 'జ్ఞానమ్' మొదలగు వానికిఁ దెనుఁగున సుఖోచ్చారణార్థము పదాంతమునఁ జేరెడు ఉకారముచే సిద్ధించిన 'జ్ఞానమ్+ఉ=జ్ఞానము'మున్నగురూపముల యనుకరణమునఁ దక్కఁగలవానికిని గల్గినదని తోఁచెడి. 'వు' అనునది ఉకారాంతశబ్దులమీఁద నోష్ఠ్యోచ్చారణతైల్యమునంజేసి సుఖోచ్చారణమునకై వువర్ణముగా నైన 'శంఖువు' ఇత్యాదుల యనుకరణవిధ నన్యములకును గలిగినదని తోఁచెడి. 'లు' అనునది బహుత్వప్రకాశకమగు 'పలు' శబ్దము పకారము లోపింపఁగా సిద్ధించినదేమో యని యనుమానము పొడమెడి. 'గళ్-గళు' అనువాని

గకారము లోపింప నేర్పడినదని విమర్శకాశయము. ఇట్లే ద్వితీయా ప్రత్యయమగు నువర్ణము 'తను - నిను - నను' అనువానియాద్యక్షరములు లోపింప నేర్పడినదేమో యని సందియము గలిగెడి. 'కు' అనునది 'ఒక' శబ్దమునందు ఒకారము లోపింపఁగా సుఖోచ్చారణమునకై తెలుఁగునఁ జేరిన ఉకారముతో సిద్ధించినరూపమో లేక ఒకారము తనసహజమగు నుకారస్వరూపమునంది కవర్ణముపైఁ బడుటను సిద్ధించిన రూపమో యని యనుమానము గలిగెడి. 'న' అనునది నడు లేక నడుము శబ్దము నాద్యక్షరశేషమో ఊరునం దిత్యాదులఁ బ్రకృతిప్రత్యయములకు నడుమ సుఖోచ్చారణార్థమైన 'న్' అనుదానితోఁ గలిసి నందుగా నేర్పడినరూపమునుండి 'ందు' అనుదాని వేఱువఱుప నరూపమునంది యనుకరణవిధిని గృత్రిమోదంతములకును సప్తమ్యేకత్వమున సిద్ధించినదో యని యూహ పొడమెడి. ఏమైననేమి? పైని నిరూపించినవి యవిజ్ఞాతప్రకృతులగుటఁ బ్రత్యయములు నాఁబరగెనని తేలినది. భాషాతత్త్వవిమర్శకులు సర్వద్రావిడభాషాలోడనమున సీప్రత్యయములంగూర్చి పేజోకరీతిని వ్రాసిరి. (చూ. కో. రా. సంధి) తత్తదర్థబోధకములగు శబ్దములు దువినిగూర్చి విభక్త్యర్థముల బోధింపఁగాఁ గాలక్రమమున నవ్వాని యాద్యక్షరాదు లుచ్చారమున లోపించుడు నవి ప్రత్యయములైనవని నాయూహ.

## తృతీయాదులకు నుగాగమంబగు. ౮.

రామునిచేతను - రామునితోడను - రామునికొఱకును - రామునివలనను - రామునికంటెను - రామునకును - రామునియందును.

టీ. కళలుగాని (కయి పట్టి యొక్కలు దప్ప) తృతీయాదివిభక్తులకుఁ దుదిని నువర్ణము చేరును. రామునిచేత: ఇది తృతీయావిభక్తి యగు చేతవర్ణకము చేరినపదము, దీనితుదిని నుగాగమము గలుగ 'రామునిచేతను' అని యగును. విభక్తులు ప్రత్యేక ప్రయోగమున కనర్హములును బ్రకృతితోడనే యుండునవియు నగుటఁ బ్రకృతితోడ నవ్వానిని గూర్చి నుగాగమము గల్గెననుటకే రామునిచేతనను నట్టివి చూపఁబడెను. ఇట్లే తక్కిన వూహ్యములు. 10 చేఁ బ్రథమాక్షర శేషములైనవానికిని నీనుగాగమము 'ఏకదేశ వికృత మనన్యవత్' అను సూక్తింబట్టి యగునని గ్రహించునది.

## కయి-పట్టి-యొక్కలకు నుగాగమంబు లేదు. ౯.

రామునికయి - జ్ఞానముఁబట్టి - రామునియొక్క.

టీ. 'కయి-పట్టి-యొక్క' అను విభక్తులతుదిని నువర్ణము గలుగదు. ఇవి కళలు గాన వీనికి నుగాగమప్రాప్తి లేదని గ్రహించునది. 'రామునికయిను' ఇత్యాదులు

సిద్ధింపవని భావము. మూలము కళలుగానివానికెల్ల 'అన్యే ద్రుతప్రకృతయో యే స్యుర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్' అని నకారమును జేర్చునదిగాన నందీరెండుసూత్రములకు మూలముగపడదు. కాన 'అన్యే ద్రుతప్రకృతయో' అనుదానినే పైరెండుసూత్రములకు మూలమనవలెను.

## చేత-తోడ-లోపల-వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు. ౧౦.

ప్రత్యయంబు వర్ణకంబని ప్రాచీనులు వ్యవహరింతురు.
రామునిచే - రామునితో - వనములలో.

టీ. 'చేత-తోడ-లోపల' అను ప్రత్యయములందలి ప్రథమాక్షరములైన, 'చే-తో-లో' అనునవి వికల్పముగ మిగులును. వికల్పమనుటంజేసి పక్షమున 'చేత-తోడ-లోపల' అనియు నుండవచ్చును. "రామునిచే, రామునిచేత." తక్కినవిట్లే గ్రహించునది. నుగాగమ మాద్యక్షరశేషములకును నగు ననవలెనుగాని 'రామునిచేను గరుణచూపఁబడెను, రామునితోను దిరిగె, వనములలోను బరగె.' అనునట్టి స్వత్వ రూపము లరుదని తోఁచెడి. 'ప్రత్యయ ఇహ వర్ణకః' అని చింతామణి ప్రత్యయమును వర్ణకమని వ్యవహరించెను. తదనుసారముగఁ దద్వ్యాఖ్యాతలును బ్రత్యయమును వర్ణకమనిరి. కానఁ బ్రత్యయమును వర్ణకమని యనిన ప్రాచీనులు చింతామణి కర్తృ తద్వ్యాఖ్యాతలే యని యెన్నవలెను.

## డు-ము-వు-న-లేకవచనంబులు. ౧౧.

ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు. రాముఁడు-సోముఁడు - వనము - ధనము - ధేనువు - భానువు.

టీ. మొదటి 7 సూత్రములచేఁ జెప్పఁబడిన ప్రత్యయములలో 'డు-ము-వు-న' అను నాల్గును నేకత్వమునే బోధించెడి. అనఁగా నివి ప్రకృతి కేకవచనముననే యగు నని భావము. ఇందు 'డు-ము-వు' అనునవి యాయా ప్రకృతులకుఁ బ్రథమైకవచనమునను, 'న' అనునది యుదంతములకు సప్తమ్యేకవచనమునను, సిద్ధించునవగుట వీని నేకవచనములుగా నిరూపించుట పొసఁగెను. ఈపైని నిరూపించిన ప్రత్యయములతోఁ గూడినపదము లొకపదార్థమునే బోధించెడిఁ గావునను, నట్టిశక్తి ప్రత్యయమునకే గలదుగావునను వీని నేకవచనములని యంటిరని సూరి యీక్రిందివివరణమున కాశయము. ఈక్రింది డు-ము-వు-లతోఁ గూడినపదము లాయాపదార్థముల యేకత్వమునే బోధించుచున్నవిగాన నవి యేకవచనములయ్యెను. ఇట్లే 'చెట్టున' అను నవర్ణక మొక్క

చెట్టునే తెలిపెడిఁగాన నిత్యాదులందలి నవర్ణకమును నేకవచనమే యని యెఱుంగవలయును. ఈనవర్ణకము కారక 23 చే నుడంతమునకుఁ ద్వితీయైకవచనమునందే సిద్ధించెడిఁగాన నాయవస్థను గమనించినను, నిది యేకవచనమే యయ్యెడి. మూలమును సుబోధకై సూరి యిట్లు వివరించెను.

## లువర్ణంబు బహువచనంబు. ౧౨.

బహుత్వసంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు. రాములు - సోములు - వనములు - ధనములు - ధేనువులు - భానువులు.

టీ. పదార్థములయనేకతను బోధించు ప్రత్యయము బహువచనము. క్రింది యుదాహరణములందు, 'రామ' ఇత్యాదిప్రకృతులకుఁ జేరిన లువర్ణకము రాములయుఁ దక్కుంగలవానియు ననేకత్వమును దెల్పెడిఁగాన నిది బహువచన మనంబరగెను. 31 సూత్రముచే బహుత్వబోధకముగా లువర్ణమును విధించుటంజేసి యదియు బహుత్వబోధకమే యని గ్రహించునది.

## తక్కినవి యుభయంబులు. ౧౩.

మిగిలిన ప్రత్యయము లేకత్వ బహుత్వములకు బోధకములని యర్థము. వనమును - వనములను - వనముచేతను - వనములచేతను. వనముతోడను - వనములతోడను.

టీ. తక్కిన ప్రత్యయములెల్లను నాయాప్రకృతులతోఁ గూడి వాని యేకత్వమును బహుత్వమును గూడఁ దెల్పునుగాన నవి యేకవచన బహువచనసాధారణములని భావము. 'వనమును-వనములను' ఇత్యాదులందు 'ను' మున్నగు ప్రత్యయము లేకవచన బహువచన సాధారణములై గన్పట్టుచుండుటంజేసి యవి యేకత్వబహుత్వబోధకములై యుభయములు నాఁబరగెనని సమన్వయము. కాని ద్వితీయాది బహువచనములందు లకారమే బహుత్వప్రకాశకముగాని ప్రత్యయములు గావనునంశము లకారాభావమున బహుత్వము వెల్లడిగామిని స్పష్టము. కావున ద్వితీయాది బహువచనములందుఁ బ్రత్యయములను బహుత్వబోధకములుగా నెన్నుట యస్వరసమనియు నీప్రత్యయము లేకవచనబహువచనసాధారణము లనుటయే యుచితమనియుఁ దోఁచెడి.

## ఓయామంత్రణంబునందగు. ౧౪.

ఓయనుశబ్దము సంబోధనంబునం దగునని యర్థము. ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపంబడును. ఓశబ్దంబు తొలంగియు సంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును ఓరాముఁడ. ఓ రాములార - రాముఁడ - రాములార.

టీ. 'ఓయీ౽త్యామంత్రణే చ వికృతౌ స్యాత్' అనునది మూలము. ఆమంత్రణము సంబోధనమనునవి పిలుచుటనుదానికిఁ బర్యాయములు. పిలుచుటను జెప్పునది ఓకారము. పిలుచుటయందుఁ బిలువఁబడుదానిం జెప్పుపదమునకుఁ దొలుఁదొల్త 'ఓ' అనువర్ణము గలుగును. ఓకార మామంత్రణార్థకమనియు నిది యామంత్రితవాచకమున కవ్యవహితపూర్వముగా నుండుననియు నభిప్రాయము. సంబోధ్య మనఁగాఁ బిలువఁదగినది. సంబోధ్యవాచకమనఁగాఁ బిలువఁదగిన పదార్థమును జెప్పుపదము. సంబోధ్యవాచకమునకును ఓ శబ్దమునకును నడుమ నేపదమును నుండరాదని ఇది సంబోధ్యవాచకంబున కనువివరణమున కభిప్రాయము. క్రింది యుదాహరణములందు సంబోధ్యవాచకమగు రామశబ్దమున కవ్యవహితపూర్వముగ నోశబ్దముండుటను గమనించునది. రాముఁడు సంబోధ్యుఁడుగానఁ దద్వాచకము సంబోధ్యవాచకమని యెన్నునది. సంబోధనవాచకము ఓశబ్దము సంబోధ్యమునకు ముందు చేర్పకయె ప్రయోగింపవచ్చును. రాముఁడ! అనియుం ననఁదగునని భావము. దీన నీవిధి యైచ్ఛికమని తేలెను. సంబోధ్యవాచకమునకును నోశబ్దమునకును నడుమ సందర్భయోగ్యమగు పదములతోడి వ్యవధాన ముండఁదగునని 'ఓవిను వీధినున్న ఖచరోత్తములార' అని యుదాహరించి ప్రౌఢవ్యాకర్త సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపఁబడునను సూరివాక్యమును సవరించినాఁడు. సంబోధ్యవాచకమునకు సంబంధించిన విశేషణము దానికి సంబంధించిన యితరపదమునని వ్యవధానస్వరూపమును గూడ నిర్వచించినాఁడు. 'ఓయీ౽త్యామంత్రణే చ వికృతౌ స్యాత్' అని (ఓయి) రెండక్షరముల పాఠమునే బాలసరస్వతియు నథర్వణుఁడును మూలస్థముగా నెన్నిరి. అథర్వణుఁడు దాని నాధారముగఁ గొనియే యందుఁ దుదివర్ణమునకు లోపమును బ్రతిపాదించి ఓ శబ్దమును సిద్ధింపఁజేసినవాఁడు. స్త్ర్యామంత్రణమున ఓయి శబ్దప్రయోగము పొసఁగమింజేసి పురుషామంత్రణమున వికల్పముగను, స్త్ర్యామంత్రణమున నిత్యముగను 'యి' అను తుదివర్ణమును లోపింపఁజేయ నహోబలుఁడు పాటుపడినవాఁడు. ఇదంతయు నేలయని సూరి 'ఓ' అను నొక్కయక్షరము పాఠమునే ప్రమాణీకరించినవాఁడై వానికి యివర్ణము క్రింది సూత్రముచే సంపాదించి యథర్వణ-బాలసరస్వ-త్యహోబలాంగీకృత రూపములనెల్ల సంపాదించినాఁడు.

ఓశబ్దంబునకుం బురుష నీచస్త్రీపురుషామంత్రణంబులందు యి-సి-రి-వర్ణంబులు విభాష నంతాగమంబులగు. ౧౫.

ఓయిరాముఁడ - ఓరాముఁడ - ఓసిదుష్టురాల - ఓదుష్టురాల-ఓరిదుష్టుఁడ - ఓదుష్టుఁడ.

టీ. 'ఓయీత్యామంత్రణే చ వికృతౌ స్యాత్' అను చింతామణిని 'వికృతా వత్ర లోపస్స్యాత్సంబుద్ధ్యోయిపదే తు యేః, నీచతాయాం రిసీ స్యాతాయ్' అని వివరించు నాథర్వణము మూలము. మగవాని యామంత్రణమునఁ దద్వాచకమగు ఓశబ్దమునకుఁ దుదిని 'యి' అనుపదియుం, నీచురాలి సంబోధనమున 'సి' అను వర్ణమును, నీచపురుషుని యాహ్వానమున 'రి' అను వర్ణమును వికల్పముగఁ గలుగును. 'ఓయి-ఓసి-ఓరి' అని యేర్పడునని భావము. వికల్పమగుటఁ బక్షమున 'ఓ' అని యుండును. ఓ రాముఁడ:—ఇది యుత్కృష్టపురుషామంత్రణముగాన నామంత్రణవాచకమగు ఓశబ్దమునకు 'యి' అను వర్ణ మంతమున నాగమముగఁ గల్గి 'ఓయి రాముఁడ!' అను రూపమయ్యెను. 'యి' అను వర్ణము వికల్పముగ నయ్యెడిదిగానఁ బక్షమున 'ఓరాముఁడ' అను రూప మేర్పడును. 'ఓ దుష్టురాల' ఇత్యాదులందు దుష్టత్వముచే స్త్రీ నీచురాలగుచున్నది గానఁ దదామంత్రణవాచకమగు ఓశబ్దమునకు 'సి'వర్ణము చేరి 'ఓసి దుష్టురాల' అనురూపము సిద్ధించును. సివర్ణము గలుగని పక్షమున 'ఓదుష్టురాల' అగును. 'ఓదుష్టుఁడ' ఇత్యాదులందు దుష్టత్వముచేఁ బురుషుఁడు నీచుఁడు నాఁబడుచున్న వాఁడుగానఁ దదామంత్రణవాచకమునకు 'రి'వర్ణము గలిగి 'ఓరి దుష్టుఁడ' అనురూపమగును. రివర్ణము గలుగనియెడల 'ఓదుష్టుఁడ' అనురూపము సిద్ధించును. నీచత్వమునకు దుష్ప్రవర్తన దుశ్శీలములే కారణములుగ నెంచి స్త్రీపురుషుల నీచత్వమును నిర్ణయించికొనవలసి యుండుట నుదాహరణములు సూచించుచున్నవి. కాని యధమజాతి స్త్రీపురుషామంత్రణమునను దద్వాచకమగు నోశబ్దమునకు 'సి-రి' వర్ణములు గలుగుట చూపట్టును. నీచస్త్రీ పురుషామంత్రణమున 'సి-రి' వర్ణములు విధించుటంజేసి మొదట్చెప్పఁబడ్డ యివర్ణ ముత్కృష్ట పురుషామంత్రణ విషయమును, దుష్టుఁడు గాని సామాన్య పురుషుని యాహ్వానము విషయమును నయ్యెడినని గ్రహింపవలసియున్నది. మీఁది సూత్రము ననుసరించినను దక్కువజాతి యాఁడుదానిని నట్టిపురుషుని సంబోధించునపుడును లేక యెక్కువజాతి స్త్రీపురుషుల సంబోధించునపుడును, లేక దుశ్శీలురుగాని స్త్రీపురుషుల సంబోధించునపుడును మిత్రత్వమునంజేసియే యట్టిపిలుపు సంభవించెడినని స్పష్టపడెడిఁగాన నధమజాతి స్త్రీపురుషామంత్రణమున నోశబ్దమునకు 'సి-రి' వర్ణములు గలుగుట సూరిహృదయము గానట్లును నట్టిప్రయోగము లగపడిన వానిని మైత్రిచేఁ గలిగినవానినిగా సమర్థింపవలెననియే యాతఁడు భావించినట్లును స్పష్టమయ్యెడి. ప్రయోగములు ప్రాచీనము లిట్టె దృష్టములగుట సూరి యిట్లు నిరూపించుటకుఁ గారణమని గ్రహించునది. (చూ. అహో. 24 పుట) ఈ సందర్భ మహోబలగ్రంథానువాదము.

## ఓరి యోసి మైత్రియందుం గలవు. ౧౬.

ఓరిచిన్నికృష్ణ - ఓసిముద్దుబాల. ఓయి మొదలయినవానికి స్వతంత్రప్రయోగముం గలదు. సంగతియేమోయి-ఓసిపోవే-ఓరోరి యింకెందుఁబోవచ్చు. వీనికి దీర్ఘంబుంగలదు. ఓయీ విప్రకులావతంస- ఓరీ దుష్టనిశాటులార - ఓసీ ననుఁ జెనకరాదు.

టీ. 'క్వచిన్మైత్ర్యాం చ తచ్ఛ్రితిః' అను నాథర్వణము మూలము. నీచపురుష నీచస్త్రీసంబోధనమునకే గాక స్నేహప్రకాశక మగు పురుషస్త్రీసంబోధనమునను సంబోధనవాచకమగు నోశబ్దమునకు 'రి-సి' వర్ణము లాగమములై ఓరి ఓసిరూపములు సిద్ధించు నని యర్థము. ఓరి చిన్నికృష్ణ:—ఇచట చిన్నికృష్ణయను పురుషవాచకమగు సంబోధ్యమునకుముందు 'ఓరి' యను నామంత్రణవాచకము మైత్రిద్యోతకముగాఁ బ్రయుక్తమయ్యెను. ఇట్లే 'ఓసిముద్దుబాల' యనుచో ముద్దుబాలయను స్త్రీసంబోధ్యవాచకమునకుఁ బూర్వము 'ఓసి' అను నామంత్రణవాచకము స్నేహద్యోతకముగాఁ బ్రయుక్తమయ్యెను. 'ఓయి-ఓసి-ఓరి' అనువానికి సంబోధ్యమునకుముందే గాక స్వతంత్రముగను బ్రయోగము గలదు. అనఁగా నివి యామంత్రణవాచకము లైనను స్వతంత్రముగ నాయాపురుష స్త్రీసంబోధ్యములంగూడఁ జెప్పునవై యామంత్రణసంబోధ్యములకు రెండింటికిని వాచకమగునని భావము. ఓసి పోవె:—ఇచ్చోట నోసిశబ్దము స్వతంత్రముగఁ బ్రయుక్తమై స్త్రీసంబోధనమును జెప్పుచున్నది. ఇట్లే 'ఓరి + ఓరి= ఓరోరి' అనుచో నోరిశబ్దము పురుషామంత్రణమును స్వతంత్రముగఁ బ్రకాశితము సేయుచున్నది. 'ఓయి-ఓసి-ఓరి' అనువానికి దీర్ఘమును బ్రయోగములఁ జూపట్టెడి. ఓయీ విప్రకులావతంస:—ఇచ్చోఁ బురుషామంత్రణవాచకమగు నోయి యనునది దీర్ఘాంతమయ్యె. ఓరీ దుష్టనిశాటులార:—ఇచ్చో దుష్టపురుషామంత్రణవాచకమగు నోరి యనునది దీర్ఘాంతమయ్యెను. ఓసీ ననుఁ జెనకరాదు:—ఇందు దుష్టస్త్రీ సంబోధనవాచకమగు నోసియనునది దీర్ఘాంతమయ్యెను. తుది యుదాహృతి ననుసరించి స్వతంత్రప్రయోగార్హము లైనపుడును నీదీర్ఘాంతత్వము సిద్ధింపవచ్చుననుట తెల్లము. ఓరీ దుష్టనిశాటులార:—ఈయుదాహృతి ననుసరించి సంబోధ్యవాచకము బహువచనాంతం బైనను నామంత్రణవాచకము లివియే యగునని గ్రహించునది. 'రో ఇతి స్త్రీవాచకో భవేత్, పరత్రైవ ప్రయోగః' 'క్వచిదామంత్రణే కానోరైవ్యకృతాత్పరతో మతః' అను నాథర్వణము నూఁతగఁగొని 'రో' యను నవ్యయమును దానిహ్రస్వరూపమైన 'రొ' అనునదియుం స్త్రీవాచక సంబోధ్యములకుఁ బరమునను, 'కాన-అల-అలా' అనునవి

దేశ్య స్త్రీవాచక స్త్రీసమ సంబోధ్యశబ్దములకుఁ దరువాతను, నామంత్రణమునఁ బ్రయుక్తములై యగపడుచున్నవని ప్రౌఢవ్యాకర్త సంబోధ్యవాచకములకు మీఁదఁ బ్రయుక్తములైనవానిని బ్రయోగములతోడ నిరూపించినవాఁడు. ప్రాచీన గ్రాంథికాంధ్రమున నట్టిప్రయోగము లగపడమిని నాంధ్రశబ్దచింతామణి మూలము వీనిని దలంపమిని సూరి వీనిని దలంపఁడయ్యెను.

## స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తులనంబడు ౧౭.

తిర్యక్కులనఁగాఁ బశుపక్ష్యాదులు జడము లనఁగా నచేతనములు.

టీ. 'స్త్రీపశుజడాన్వినాన్యే మహదాఖ్యాస్తద్విశేషణాశ్చాపి' అనునది మూలము. స్త్రీవాచకములును వానికి విశేషణములగు శబ్దములును, బశుపక్ష్యాది తిర్యక్కులను జెప్పుశబ్దములును వానికి విశేషణములగు శబ్దములును, నప్రాణివాచకములును వానికి విశేషణములగు శబ్దములును దప్ప, నితరములెల్ల మహత్తులు నాఁబడును. మహద్వాచకవిశేషణములును మహత్తులేయగుటఁ బైవివరణమునుబట్టియే స్పష్టమయ్యెడి. మొత్తముమీఁదఁ బురుషవాచకములకు మహత్సంజ్ఞ యనుట స్పష్టము. స్త్రీవాచకములకు మహతీసంజ్ఞ మీఁదఁ గన్పట్టును. తిర్యక్కులనఁగాఁ బశువులు పక్షులు మొదలగునవి. జడము లనఁగా సంచారములేని కొండలు చెట్లు సముద్రములు మొదలగు ప్రాణములేనివి. వృక్షములు నవీన నాగరిక సిద్ధాంతానుసారముగఁ బ్రాణులే యైనను గమనాభావము ననుసరించి యప్రాణులుగానే యంగీకృతము లయ్యెను. మహదమహద్విచారము వివక్షాధీనము. గీన సముద్రుఁడు ఉరగులు భుజగజాలుఁడు అశ్వోత్తమున్ అనురూపములు గలుగు. 'కేచిచ్చామహతశ్శబ్దా మతే కవిశిఖామణేః, పురుషాఖ్యా భవంతి' అని యాథర్వణము. (చూ. అహో. 256 పుట.) సంస్కృతశబ్దములలింగమునుబట్టి రూపసిద్ధి చేయుట పొసఁగమిని మహదమహత్సంజ్ఞాకరణ మావశ్యక మయ్యెననుట స్పష్టము.

## క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబులగు. ౧౮.

మిత్రశరణప్రధానపాత్రాదులు మిత్రాదులు.

టీ. 'క్వచిదర్థవిశేషే తు క్లీబే తూభయరూపతా' అను నాథర్వణము మూలము. మహత్తులం జెప్పునవి యయ్యు నపుంసకలింగములుగ సంస్కృతమున నగపడు మిత్ర మొదలగుశబ్దములకు వికల్పముగఁ బుంలింగతౌల్యము సంభవించును. దీన 21-22

సూత్రములచే వాని కుత్వ-డుమ్వర్ణకములును, దకు్ర్రంగల పుంలింగశబ్దములకగు కార్య విశేషములును సిద్ధించెడి. స్నేహితునిం జెప్పు మిత్రపదమును, రక్షకునిం దెల్పు శరణశబ్ద మును, మంత్రివాచకమగు ప్రధానశబ్దమును, నిట్లే మహత్తులందెల్పు నపుంసకలింగశబ్ద ములును, నీగణమునం జేరం దగినవి. మిత్రశబ్దమాదియందుం గల గణముగాన మిత్రాదు లనెను. క్లీబంబు లనుటంజేసి సూర్యవాచకమై కేవలము పుంలింగంబగు మిత్రశబ్దమును, మహద్వాచకము లనుటంజేసి కేవలము గృహవాచకమైన శరణశబ్దమును, నమహ ద్వాచకమైన మిత్రశబ్దమును, నీవిధికి విషయములు గావని యెన్నవలెను. మహద్వాచ కములై నపుంసకలింగములైన శబ్దములే యీవిధికి లక్ష్యములని ఫలితము. పైమహ ద్వాచకనపుంసకలింగత్వములలో నేది లోపించినను నీవిధి వర్తింపదని భావము.

## జిత్తు బిందుపూర్వంబగు. ౧౯.

జకారము ఇత్తుగాఁ గలదానికి ముందు బిందువు వచ్చునని యర్థము. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు లోపింపబడు నక్షరము ఇత్తనంబడును; ఉదాహరణము మీఁద స్పష్టంబగు.

టీ. జకారము లోపించునట్టి ప్రత్యయమునకుఁ బూర్వము బిందువు గలుగును. హ్రస్వదీర్ఘముల గమనించి యర్థపూర్ణసంభవము నూహించునది. ఆయాయి కార్యవిశే షములకయి ప్రత్యయాదులతో గూర్పఁబడి లక్ష్యములందు విడిచిపెట్టఁబడు వర్ణము నకు ఇత్తని పేరు. రాముఁ డిత్యాదిరూపములందు దీనిప్రయోజనము స్పష్టపడును. 'డుమ్' అనుదానితుదిం గూర్చిన జకారము బిందువును ఘటించి లోపించునుగాన 'జ్' అనునది ఇత్తనంబడును. 'హలన్త్యమ్' అనుదాని కిది వివరణము.

## డుమ్వర్ణకంబునకుం బ్రకృతియయినది డుమంతంబనంబడు. ౨౦.

స్పష్టము.

టీ. 'డుమ్' అను ప్రత్యయము చేరుటకుఁ దగిన ప్రాతిపదికము డుమంత మనం బడును. ప్రత్యయము చేరక ముందున్న శబ్దస్వరూపమునకుఁ బ్రకృతి యని పేరు. 'రామ' ఇత్యాదులు ప్రకృతులు. డుమిత్యాదులు ప్రత్యయములు. ప్రకృతిప్రాతిపదిక ములు పర్యాయములు.

## పుంలింగంబయి మహద్వాచకంబయిననామంబు తుదియత్వంబున కుత్వంబగు. ౨౧.

నామంబనఁగాఁ బ్రాతిపదికము. ఉదా - రామ - భార్గవ - రాజ పురుష - ఇత్యాది ప్రాతిపదికములు. సిద్ధరూ-రాము-భార్గవు-రాజపురుషు.

టీ. 'మహతో೭త ఉద్విభక్తౌ' అనునది మూలము. మహత్తును జెప్పునదై సంస్కృతమునఁ బుంలింగముగాఁ బ్రసిద్ధమైన ప్రకృతి తుదినున్న అకారమున కుకారమాదేశమగును. పుంలింగమహద్వాచకత్వములు రెండును గలిగిన యదంతమగు ప్రాతిపదికమునకు నకే యుత్వ మాదేశమగును. నామ మనఁగాఁ బ్రాతిపదికము. 'ప్రాతిపదికం హి నామ' అని చింతామణి. 'డిద్ధ-రామ-భార్గవ' అను మున్నగు ప్రత్యయములు చేరని ప్రకృతులు ప్రాతిపదికములు. 'డిద్ధ' అనునది మహద్వాచకసంజ్ఞ. వీని తుదియకారమున కుకారము గలుగ 'డిద్ధు-రాము-భార్గవు' అని రూపము లేర్పడును. ఉత్వమనుటం జేసి యాదేశమగునది హ్రస్వోకారమగుటయు, నత్వంబున కనుటం జేసి హ్రస్వాకారమునకే యనుటయు స్పష్టము. 'అనుక్తమన్యతో గ్రాహ్యమ్' అనునుక్తిం బట్టి 'అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్' అను సంస్కృతవ్యాకృతిలక్షణము ననుసరించి ప్రత్యయములు చేరని ప్రకృతులను బ్రాతిపదికములుగ గ్రహించి ప్రక్రియను నడుపుకొనఁదగు. ప్రాతిపదికప్రకృతులు సమానార్థకములని ముందె ప్రోక్తము.

## పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు. ౨౨.

ఇచ్చట డుజ్జనుదానియందు జకార మిత్తుగావున జిత్తు బిందుపూర్వంబగు ననుసూత్రముచేత డువర్ణమునకుముందు సున్న వచ్చును బిమ్మట జకారము లోపించును. ఉ. డిద్ధుఁడు - డిద్ధుండు - రాముఁడు - రాముండు - భార్గవుఁడు - భార్గవుండు.

టీ. 'మహతస్సోర్డుజనితో భవేత్పుంసి' అనునది మూలము. పుంలింగమై మహత్తును బోధించుప్రకృతికంటెఁ బ్రథమైకవచనమునకు 'డుజ్' అను ప్రత్యయమగునని భావము. ప్రాచీనులు సంస్కృతస్వాదులకు డుజాదు లగుననిరి. సూరి స్వాదులు తెనుఁగునఁ గలుగనవకాశము లేదని తలంచి గావలయు నమ్మార్గమును విడిచి యాయావిభక్తుల యేకవచనబహువచనముల నాయా ప్రత్యయములు గలుగున నెను. ప్రథమాబహువచనమునందును ద్వితీయాద్యేకవచనబహువచనములందును బ్రత్యయాంతరములు సూత్రాంతరములచే విధింపఁబడి యుండుటచేతఁ బరిశేషన్యాయమున నిది పుంలింగమహద్వాచకమునకుఁ బ్రథమైకవచనమునందె యగునని గ్రహించునది. పుంలింగమహద్వాచకత్వములు రెండుధర్మములును గలపదములకే యీవిధిచే 'డుజ్' సిద్ధించెడిఁగాని యీరెండిటిలో నేది తక్కువయైనను, సిద్ధింపదని గ్రహించునది. 'వృష' ఇత్యాదిప్రకృతులు సంస్కృతమునఁ బుంలింగములైనను మహద్వాచకములు గామిని డుజ్వర్ణక మట్టివానికి సిద్ధింపదు. ''అపత్య-దైవ-దైవత'' అనుప్రకృతులు మహద్వాచకములైనను బుంలింగ

ములుగామి నట్టివానికి డుజ్వర్ణకము సిద్ధింపదు. కాన సూత్రమునందలి పుంలింగమహ ద్వాచకశబ్దములు సార్థకములయ్యెడి. డుజ్ వర్ణకము జకారము పోవుప్రత్యయముగాన 19 విధిచేత 'డు' అనుదానికిఁ బూర్వము బిందువును సంపాదించి పిదప 'డుజ్' అను దాని తుదినున్న జకారము పోవును. 'కార్యార్థమను 19-వ సూత్రమునందలి వివరణ మున కిది యుదాహరణవాక్యము. డిద్ధ:—21 చే నుత్వము-డిద్ధు. ఈసూత్రముచే డుజ్వర్ణకము-డిద్ధు+డుజ్. 19 చే బిందువును జకారలోపమును సంభవింపఁగా 'డిద్ధుఁడు-డిద్ధుండు' అనురూపము లేర్పడును. 19 వ సూత్రమందలి బిందుశబ్దమర్థ పూర్ణములకు రెండింటికిని వాచకముగాన నుభయమును సిద్ధించెను. ఇట్లు బిందుసామాన్య విధులచేఁ గలుగు బిందువువిషయమున హ్రస్వదీర్ఘములమీఁదిస్థితిని గమనించుచుఁ బ్రక్రియ నరయునది. ఇట్లే తక్కిన యుదాహరణము లూహ్యములు. 1-11 సూత్ర ములంబట్టి డు-ము-వు-లు ప్రథమైకవచనమున కగునవని స్పష్టపడుచుండుటచేతను, బ్రత్యయము ప్రకృతికంటెఁ బరముగ నగుననునంశ మాద్యవ్యాకృతింబట్టి విశదపడు చుండుటచేతను, బ్రకృతినివిడిచి ప్రత్యయముండుట యసంభవమగుటచేతను, డెనుఁగునఁ బంచమికి బదులు తఱచుగ షష్ఠిని నిల్పుట సహజమగుటచేతను మహద్వాచకమునకనునట్టి కువర్ణకాంతపదము సంబంధమును బోధించుచు వాని ప్రథమైకవచనమునకు డు-ము-వు-లగుటం దెల్ప సమర్థమైయుండుటచేతను దెనుఁగునకు సహజమైన వాక్యపద్ధతి ననుసరించి మహద్వాచకమునకు డుజ్జగునని సూరి సూత్రించెఁగాన గంటె వర్ణకాంతముగఁ జెప్ప కుండుట దోషమను నీసందర్భమునందలి గుప్తార్థప్రకాశికోక్తి యనాదరణీయము. ఇట్లే యీప్రకరణమున 39-48 సూత్రములందును దద్ధితప్రకరణమున 5-6 సూత్రము లందును క్రియ 48 సూత్రమునందును గల షష్ఠ్యంతముల కర్థము గ్రహించుచు నవైరుధ్యము నెంచునది.

## డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగ మంబు సర్వత్ర విభాష నగు. ౨౩.

రామునిని-రాముని-రామునిచేతను - రాముచేతను-రామునికిని-రామునకును. సర్వత్ర యనుట నగాగమబాధనార్థము.

టీ. డుజ్వర్ణకమునకుఁ బ్రకృతియైనదానికి ననఁగా డుజ్ వర్ణకము నందెడి దానికిఁ ద్వితీయాదివిభక్తుల యేకవచనములు పరములుగాఁగ నెల్లయెడలను నిగాగమము వికల్పమును నగును. 'రామ-' ఇది డుమంతము. దీనికి 21 చే నుత్వము. రాము. 2 చే నువర్ణకము 'రాము+ను. ఈవిధిచే నిగాగమము. 'నిక్' అనునది కకారము పోవు

ప్రత్యయముగాఁ బ్రకృతికంతావయవముగనై పిదప నద్దానితుదినున్న పొల్లుకకారము పోవును. రాము+ని+ను: 26 చేఁ దుదివిభక్తినువర్ణమున కిత్వము సిద్ధింప 'రామునిని' అని రూపమగును. ఇది వికల్పవిధియగుట నిగాగమము గలుగనిపక్షమున 25 చే నువర్ణకము నివర్ణముగామాఱి 'రాముని' అని యగును. ఇట్లే తక్కిన తృతీయాద్యేకవచనములు పరములగునపుడు పాక్షికముగఁ బ్రకృతి కంతావయవముగ నిగాగమము గల్గురూపముల గమనించునది. 28 చే నిత్యముగ షష్ఠ్యేకవచనమున నగునగాగమమును రానీయక పక్షమున నిగాగమరూపమును సంపాదించుటకై సూత్రమునందు సర్వత్రపదము సమకూర్పఁబడిన దని సర్వత్రయను నీక్రిందివివరణమున కభిప్రాయము. నిగాగమము కల్గిన 'రామునికి' అనియుఁ దదభావమున నగాగమమైన 'రామునకు' అనియు రూపములగును. చింతామణిలో 'ని' అనునదియుఁ ద్వితీయైకవచనప్రత్యయమే యగుటంజేసి ద్వితీయైకవచనమున నివర్ణవిధాన మగపడదు. తృతీయాద్యేకవచనములందు 'మహతోనిలావిభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణ స్తః, టాదివిభక్తౌ నిర్ణేత్యేకే' అనువిధులంజేసి నివర్ణము పాక్షికముగఁ గలుగఁజేసెఁగాన నీవికల్పనిగాగమవిధికిఁ బైవిధులే మూలము లన వలయును.

## అనుదంతమగు తెనుఁగుడుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును. ౨౮.

మగసిని-మగని చేతను-మగనికిని. అనుదంతంబను పర్యుదాసము చేత తమ్మునిని-తమ్ముని తమ్ముని చేతను-తమ్ము చేతను, అల్లునిని - అల్లుని - అల్లుని చేతను-అల్లు చేతను, బల్లిదునిని - బల్లిదుని-బల్లిదుని చేతను-బల్లిదు చేతను-ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికంబని యెఱుఁగునది.

టీ. హ్రస్వోకారము (ఉ) తుదిని లేని యాచ్ఛికడుమంతమునకు ద్వితీయాద్యేకవచనములందు నిగాగమము నిత్యముగఁ గలుగును. సూత్రస్థమగునుదంతశబ్దము సహజోదంతములను, కృతకోదంతములను రెండింటిని జెప్పునదిగ గ్రహించునది. 21 సూత్రముచేఁ బ్రకృతితుదినున్న అకారమున కుకారము నిత్యముగ సిద్ధించెడిఁగాన నదంత డుమంతములెల్ల నుదంతములే యగును. ఆచ్ఛిక 4 సూత్రముచే మగమున్నగుశబ్దముల తుదియత్వమున కుత్వము నిషేధింపఁబడినదిగాన నుత్వము గలుగమి నవి యనుదంతములే యయ్యెడి. కాన 'మగనిని మగనిచేత' నిత్యాదులు నిగాగమము నిత్యముగఁ గల్గినరూపములే వానికి సిద్ధించెడిఁగాని 'మగచేత మగకంటె' నను నిగాగమము రానిరూపములు గలుగవని గ్రహించునది. నిషేధార్థకమగు నశబ్దము సమాసగతోత్తర

పదముతోఁడ నన్వయించునట్లు పొందుపఱచుట పర్యుదాస మనంబడును. ప్రకృతము 'అనుదంతము' అనుదానియందలి నిషేధార్థకము 'అనుదంతము' అను సమాసమునందలి యుదంతమను నుత్తరపదముతో నన్వయించి యుదంతము గానిదాని కనునర్థబోధను గలుగఁజేయుచున్నదిగాన నిది పర్యుదాసమనంబడెను. ఇట్టిపర్యుదాసము నాశ్రయించు మున మగాదులు డుజ్ప్రాప్తివిషయమున నుదంతతుల్యములును, నిగాగమప్రాప్తి విషయమునఁ దద్భిన్నములును నగునని ఫలితము తేలెడి. 'తమ్ము-అల్లు-బల్లిదు' అను మున్నగునవి యుదంతము లగుటంజేసి వీనికి రామునిని రాముని ఇత్యాదులందువలెనే నిగాగమము వికల్పముగ ద్వితీయాదివిభక్తులయేకవచనముల నగును. 'పాక్షికము:— కల్గుట గలుగకుండుట. ఇఁక తమ్ము-అల్లు-బల్లిదు మున్నగునవి సహజముగ నుదంతములా లేక రాముమొదలగువానివలెఁ గృతకోదంతములా యని విచారింపవలసియున్నది. 34 సూత్రమున వీనిసంబుద్ధిడుజ్జునకు లోపంబు రాకుండఁజేయుటను గృతోత్కృదళమును సమర్థముగాఁ నెన్నక సంస్కృతనామంబనుదళమునే సమర్థముగాఁ బేర్కొనుటంబట్టి యివి రామున్నగువానివలెఁ గృతోత్కృములే యని సూరి యభిప్రాయపడియుండుట స్పష్టము. కాన సూత్రస్థమగు నుదంతపదము సహజకృతకోదంతములను రెంటిని బోధించు ననియుఁ దమ్ము మొదలగునవి కృతకోదంతములగుట నిగాగమము 23 చేఁ బాక్షిక ముగనయ్యెననియు గ్రహించునది. ఆచ్ఛిక 4 సూత్రమునందలి మగాదులలో నెట్లును నుత్వప్రాప్తిలేని యదంతములకే ప్రవేశముగలుగుటయుఁ దమ్ము మొదలగునవి యందుఁ జేరకుండుటయుఁ బైవిషయమునకుఁ బోషకము లయ్యెడి. మహత్సంస్కృతాదంత నామములెల్ల డుజ్నందునప్పటికిఁ గృతోత్కృములైయుండుట సహజమగుటంజేసియు డుజ్జునందఁగల మహత్సహజోదంతముల సంబుద్ధి డుజ్జునకు లోప మనాకాంక్షిత మగు టంజేసియు సంస్కృతనామం బనుదానికిఁ గృతోత్కృమనువిశేషణము గూర్పఁబడెను గాన నట్టికృతోత్కృదళమును జేఁబట్టి తమ్ముమొదలైనవి కృతోత్కృములనుట కవకా శము లేదనియు దాన నీసూత్రమునను దమ్ముమొదలైనవి కృతోత్కృములు గావనియు నీసూత్రమునను, 34 సూత్రమునను, బ్రత్యుదాహరణములుగ నీయఁబడిన 'తమ్ము-అల్లు-బల్లిదు' అనునవి సహజోదంతములే యనియు శంకింపనగును. మఱియు 23 చేఁ గృతోత్కృదంతములకుఁ బాక్షికముగ నిగాగమము సిద్ధించుచుండుటంజేసి 24 సూత్ర మునందలి యనుదంతశబ్దము కేవలాచ్ఛికసహజోదంతములకుఁ గాదనువిషయమునే బోధించెడిఁ గానఁ దమ్ముమొదలగునవి సహజోదంతములే యని సంభావింపవలెననియుఁ బ్రశ్నింపఁదగును. కాని పగతాదులబహువచనలకారంబునకు రేఫంబగునను (ఆచ్ఛిక 5) సూత్రము విన్యాసము ననుసరించి పగతాదు ళకారాంతములనియు నందు 'అల్లురు'

అనునుదాహరణ మగపడుచుండుటంజేసి యది 'అల్ల' అనునదంతశబ్దమనియు సంభావింపఁ దగియుండుటచేతఁ దక్కుంగల తమ్మ మొదలైనవియు దానితోఁబాటుగ నదంతములే యనియు, కృతోత్కమ్ములైన రూపములనియు నని విశ్వసించుట యుచితమని తోఁచెడి. పగతాదులు సహజోదంతములే యగుసెడల పగత్వాదులని సూరి సూత్రింపకుండునా? కాన 'అల్ల-తమ్మ-బల్లిఁగ' అనునవదంత ప్రకృతులనియు 'అల్లు-తమ్ము-బల్లిదు' అనునవి కృతోత్కరూపములనియు నిర్ణయింప నుచితమని తోఁచెడి. మఱియుఁ "గృతోత్కములకును వచ్చును. రామునిన్-రామున్; తమ్మునిన్-అల్లునిన్; ఇత్యాదుల నిత్యంబు." అను దీనికి మూలమైన కవిజనమండనవాక్యములును నదంతతనె వీనికి సాధించెడి. కేవలతత్సమరూప సాధనపరమగు మూలమీ ప్రక్రియ తెఱఁగు డుమంతము లకుఁజెందినచోట నిరూపింపలేదు.

## డుమంతంబుమీఁది నువర్ణకంబునుత్వంబున కిత్వంబగు. ౨౫.

నువర్ణంబు ద్వితీయ యనుసూత్రముచేత రాముసు - అని ప్రాప్తింపఁగా నీసూత్రముచేత నువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె. రాముని - భార్గవుని.

టీ. 'నిరమోమహతాం' అనునది మూలము. డుమంతమున కవ్యవహితపరముగా నున్న ద్వితీయైకవచనప్రత్యయమగు 'ను' అనుదానియుత్వమున కిత్వంబు గలుగును. నువర్ణకము నివర్ణకముగా మాఱునని భావము. రామ ప్రకృతి 21 చే ఉత్వము. రాము. 2 చే నువర్ణకము. రాము + ను: ఈవిధిచే నువర్ణకము నుత్వమున కిత్వము. రాము+న్-ఇ=రాముని. 'రామును' అనునుత్వరూపము నిగాగమాభావమున నుండకుండుటయే యీ నిత్యవిధానమునకుఁ బ్రయోజనమని గ్రహించునది. నిగాగమము గలిగినను, 26 చే నువర్ణకోకారమున కికారము నిత్యముగనయ్యెడిఁగాన నపుడును 'రామునిని' అనియే గాని 'రామునిను' అని రూపమేర్పడదు. నిగాగమము సిద్ధింపనపు డీవిధియని తెలుపుటకే యీ క్రింది వివరణమును సూరి వ్రాసికొనెనని యెన్నునది.

## ఇకారంబుమీఁది కు-ను-వు క్రియావిభక్తులయుత్వంబున కిత్వంబగు. ౨౬.

హరిని-హరికిని-శ్రీని-శ్రీకిని-వారిని-వారికిని.

టీ. ఇ-ఈలు తుదినిగలదానికిఁ బరమైన 'కు-ను-వు' అనువర్ణములయుఁ, గ్రియల కాయాపురుషవచనముల సిద్ధించిన యుకారాంతప్రత్యయములయు నుత్వమున కిత్వము గలుగును. హరి+ను:—హరి యనున దిదంతము. దానితుదియికారమునకు 'ను' అనునది పరమయ్యెను. కాన 'ను' అనుదానియుకారమున కికార మాదేశముగాఁగ హరి+న్-ఇ=

హారిని అనురూపము సిద్ధించెడి. ఇది నువర్ణకమునుత్వమున కిత్వము గల్గుట కుదాహరణము. హారి+కును:— మొదట నికారాంతముమీఁది కువర్ణకము కివర్ణమును, బిదప నికారాంతమైన కివర్ణముమీఁదినువర్ణము నివర్ణమును నయ్యెను. ఇది ముఖ్యముగ నికారాంతము మీఁది కువర్ణము కివర్ణమగుట కుదాహరణము. కారక 33 సూత్రమునందలి ''సుకృతి+వు=సుకృతివి'' అనునట్టివి యికారాంతముమీఁద 'వు-వి'యగుట కుదాహరణములు. వచ్చితి+వు=వచ్చితివి-వచ్చితి+ము=వచ్చితిమి-వచ్చితి+ను = వచ్చితిని-మున్నగునవి క్రియావిభక్తులయుత్వ మిత్వమగుట కుదాహరణములు. వారి:—ద్వితీయాదిబహువచనములందికారాంతముగ నిపతితమైన తచ్ఛబ్దరూపము. (చూ. అచ్చి. ప. 24 క్రింద) దానిమీఁది నువర్ణకము నివర్ణమీవిధిచేనగుట 'వారిని' అనురూపమయ్యెను. ఇట్లే వారికిని ననునది యూహ్యము. తకారము బొల్లు చేర్చి 'ఇత్' అని హ్రస్వేకారమును నిర్దేశింపకుండుటంజేసి 'శ్రీ+ను=శ్రీని-శ్రీ+కు శ్రీకి' అను మొదలగు నీకారాంతములమీఁది కునువులకును నీకార్యము సిద్ధించెడి. ఇఈలంతమందుఁ గలవాని కవ్యవహితపరముగవచ్చు కునువు అనునవియు నుత్వవిశిష్టములైన క్రియాప్రత్యయములును నిత్వవిశిష్టములగునను వ్యాపకశాస్త్రముగ దీని నెన్నునది. ప్రకృతియే సహజముగ ఇఈ లంతమందుఁగలది గానక్కఱలేదు. వర్ణాగమాదులచేఁ బ్రకృతి కట్టిస్థితి కలిగినను, దానిమీఁది కునువు క్రియావిభక్తుల నీశాస్త్రమునకు విషయములుగఁ జేయవచ్చును. (వచ్చిరి-వచ్చితిమి) అట్లే ప్రకృతికిదంతత ప్రత్యయాదులమూలమునఁ జెడిన నీశాస్త్రము వర్తింపదనియుం దాన హరులకు శ్రీలకు మొదలగు కువర్ణరూపములే గలుగుననియు గ్రహించునది. ఆగమవర్ణముల యోగమునంజేసి యీదంతతమాత్రము ప్రకృతికి సిద్ధించుట గన్పట్టదు.

**ఈధాతుయుష్మదర్థంబులమీఁదివానియుత్వంబున కిత్వంబురాదు. ౨౭**

ఈరు-ఈవు-ఈను-ఈము, ఈకు-నీకు-మీకు.

టీ. ఈధాతువు:— క్రియ 92 సూత్రముచే ఇచ్చుధాతువునకు సర్వాదేశముగ వచ్చు ఈయనునది. యుష్మదర్థము:— యుష్మచ్ఛబ్దార్థకములై యేకత్వబహుత్వములఁ జెనుఁగున నుండు 'నీ-మీ' అనునవి. ఇచ్చుధాతువున కంతకును నాదేశమైన ఈయను దానికిని నీమీయనువానికిని దరువాత వచ్చిన కునువు క్రియావిభక్తులయుత్వమున కిత్వము గలుగదు. ఈ+రు=ఈరు. ఇచ్చో నిచ్చు ధాతువున కంతకు నాదేశమైన ఈయను దానికిఁ దరువాతనున్న 'రు' అనుదానియుత్వమున కిత్వము పూర్వసూత్రముచే నిత్తనితపరకరణమందు లేమింజేసి సంభవింప నీవిధిచే నిషిద్ధమయ్యెఁ గాన 'ఈరి' యని గాక 'ఈరు'అనియే రూపమయ్యె. ఈయరని యర్థము. 'ఈవు-ఈను-ఈము'; అను నుదాహరణత్రయమునను బూర్వోదాహరణమునందువలెనే పూర్వసూత్రముచే నీధాతువుకంటెఁ

18

బరమయిన 'వు-ను-ము' అను క్రియావిభక్తులయుత్వమున కిత్వము వచ్చి 'ఈవి-ఈని-ఈమి' అనురూపములు సంప్రాప్తములు గాఁగ నీవిధిచే నిత్వము నిషిద్ధమై 'ఈవు-ఈను-ఈము' అనురూపములే సంభవించెనని గ్రహించునది. ఈధాతువనుటంజేసి దీనికిఁ బర ముగ నున్నవి క్రియాప్రత్యయములనియుఁ దాన నీనాలుగుదాహరణములును నీధాతువు మీఁది క్రియావిభక్తులయుత్వమున కిత్వము రాకుండుట కుదాహరణములనియుఁ జెప్పు నది. 'ఈకు-నీకు-మీకు-' అనునవి యుష్మదర్థములపైఁ గల్గిన కువర్ణకమునుత్వమున కిత్వము గలుగకుండుట కుదాహరణములు. 'ఈకి-నీకి-మీకి' అనురూపములు పూర్వ సూత్రముచే సిద్ధింపవని భావము. ఇకారముమీఁది కునువుక్రియావిభక్తులయుత్వమున కిత్వమువిధించు పూర్వసూత్రమున నికారమని సామాన్యముగ ననుటంజేసి ఈకారాంత ముల మీఁదివానికిని నీవిధి సిద్ధించుచుండఁగ నీసూత్ర మారబ్ధమయ్యె. ఇందు దీర్ఘేకా రాంతములగు నీధాతుయుష్మదర్థములే గ్రాహ్యములయ్యెడిఁగాన నీధాతుమూలమగు నిచ్చు ధాతురూపములమీఁద నీనిషేధము గలుగదని గ్రహించునది. యుష్మదర్థకములగు నీమీయను వానితోలిహల్లులు లోపించినపక్షమునను వాని కీకారాంతతయు యుష్మ దర్థకతయుఁ జెడదు గాన నపుడును నీనిషేధమునకు గుఱియగునని సూచించుటకై 'ఈకు' అని యుదాహరించెనని సంభావించునది. చింతామణి యికారాంతములకు, 'నికి' ప్రత్య యముల విధించునదియుఁ సాధారణముగ నికారాంతక్రియలమీఁద నెల్ల నికారాంత ప్రత్యయముల సామాన్యసూత్రములచే విధించి యథాసంబంధముగఁ బ్రక్రియ నూహించికొనుమని సూచించునదియుఁ నగుటచేత నీసూత్రమునకును బూర్వసూత్రమున కును మూలములందుఁ బ్రత్యేకముగఁ గనుపట్టవు.

కువర్ణకంబు పరంబగునపుడు కారబుకారంబులకు నగాగమంబగు. ౨౮

రామునకును-విష్ణునకును-సవితృనకును-విధాతృనకును.

టీ. 'నః కౌ' అనునదియుఁ దానిని నవరించు 'నః ప్రాయస్సాన్యదృకారాచ్చ' అనునాథర్వణముకు మూలములు. షష్ఠీవిభక్తిప్రత్యయమగు కువర్ణకము పరముగా నుకార బుకారాంతప్రకృతుల కంతావయవముగ నగాగమము గలుగును. రాము+కు:— కువర్ణకము పరముగాఁగ 21 చే నుదంతమైన 'రాము' అనుదానికి నగాగమము. రాము+న+కు=రామునకు, 'నక్' అనునది కకారము పోవు ప్రత్యయముగానఁ బ్రకృతి కంతావయవముగఁ గలిగెను. మఱియు యట్-మున్నగునాగమములవలె 'న' అనునది పొల్లురూపమునఁ గాక నిర్దిష్టమగు అకారయుంతమైయే (న) కలుగునని గణించునది. ఇది కృతకోదంతముమీఁద నగాగమమగుట కుదాహరణము. విష్ణు+కు:—విష్ణు+న+

కు=విష్ణునకు. ఇది సహజోదంతముమీఁదినగాగమమున కుదాహరణము. విధాతృ+కు:—53 చే విధాతృమున్నగురూపములు పక్షమున నేర్పడెడిఁగాన ఋకారాంతత సిద్ధము. దాన నగాగమము దీనిచేఁ గలుగ విధాతృ+న+కు=విధాతృన కనురూప మేర్పడును. ఇది ఋకారాంతముమీఁది నగాగమమున కుదాహృతి. పైవిషయము ననుసరించి సూత్రస్థ మగుఉకారము సహజకృత్రిమోదంతములను రెండింటిని బోధించునదనియుఁ ఋకారము సహజముగఁ గన్పట్టు ఋకారాంతములనే చెప్పెడిదనియుఁ గ్రహింపవలయును. ప్రౌఢ వ్యాకర్త కువర్ణకము పరమగునపుడు కవిత్రయమువారిప్రయోగములం దక్క నితర ముల నగాగమము చూపట్టదని సూత్రించి నగాగమాభావము నుదాహరణప్రదర్శన పూర్వకముగ సూచించి యాగమశాస్త్రమున కనిత్యతను దానిమూలమున దృఢపఱచుచు 'తూపుకు' మున్నగు పువర్ణాంతశబ్దములమీఁదికువర్ణకము—కుత్వార్థమును బోధించు నట్టిది గాకుండఁజేయుటకే 'నః కౌ' అను నిత్యవిధానము చేయఁబడెనని యీసూత్రమును సవరించెను. కాని కవిత్రయప్రయోగము, పువర్ణాంతౌపువర్ణాంతశబ్దములమీఁద నిత్య ముగఁ గువర్ణకము పరముగా, నగాగమం బగపడుచుండఁగ నపువర్ణాంతముమీఁద నేని నగాగమాభావ మవ్వారిప్రయోగములఁ గానరాకుండఁ దర్వాతివారిప్రయోగములం బట్టి నన్నయరచిత మాంధ్రశబ్దచింతామణియని నమ్మియున్న ప్రౌఢవ్యాకర్త నన్నయ సూత్రమున కిట్లు వికల్పత నాపాదించి, నగాగమాభావరూపముల 'నః కౌ' అను సూత్ర మునకు ముడివెట్టుట చింత్యమనక తీరదు. మఱియుఁ గంటెవర్ణకము పరమగునపుడును నుదంతౌమహత్తుల కందువర్ణకము పరమగునపుడును గొన్నియెడల నగాగమముచూపట్టు నని 'క్రతుశతంబున కంటె మనంబునయందు' అను మొదలగు నుదాహృతులం జూపి యీసందర్భమును సవరించినాఁడు. సూరి 'సమాసంబునయందు' అని ప్రయోగించుటే గాని రూపసాధుత్వమునకు మాత్రము దారి చూపలేదు. నిగాగమ మీనగాగమమును బక్షమున బాధించి డుమంతముమీఁద 23 చే నగుటను స్మరించికొనునది.

## ఉకారఋకారంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబగు. ౨౯.

రామునందును-విష్ణునందును-విధాతృనందును.

టీ. ఉకారాంతములకును ఋకారాంతములకును సప్తమీప్రత్యయ మగు.'అందు' అనునది పరముగా 'నుక' అనునది యాగమముగ నగునని సూత్రార్థము. ఉకార మంత ము దుండుట సహజముగఁ గాని కృత్రిమముగఁగాని సంభవింపనగు. ఋకార మంతమం దగుట యత్వస్త్రీవద్భావములుగానపుడు (చూ. తత్స 53) గలుగును. 'నుక్' అనువిధి

కకారము పోవుప్రత్యయముగానఁ బ్రకృతి కంతాగమముగ నగును. తదన్తవిధి ననుసరించి యుదంతములకు ఋకారాంతములకని యర్థము సిద్ధించును. రామునందు:—ఇది కృత్రిమోదంతమున కందువర్ణకము పరముగా నుగాగమంబగుట కుదాహరణము; 21 చే నుత్వమత్వమున కయ్యె. విష్ణునందు:—ఇది సహజోదంతమున కందువర్ణకము పరముగా నుగాగమంబగుట కుదాహృతి. విధాతృనందు:—ఇటఁ దత్సమము 53 చే నత్వస్త్రీవద్భావములు వికల్పముగ నగుంగాన నవి గలుగనిపక్షమున ఋకారాంతమగు దీనికంటె నుగాగమము నిత్యముగ నందువర్ణకము పరముగా నయ్యె. నిత్యవిధి యగుటం జేసి నుక్కురానిరూపము లసభ్యములనుట తెల్లము.

## ఆగమము-వు-వర్ణంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాషనగు. ౩౦.

వనమునందును-వనమందును-ధేనువునందును-ధేనువందును.

టీ. 'అందు పట్టి కూర్చి విభక్తిషు' అనునాథర్వణము మూలము. ఆగమమువులఁ=ప్రథమైకవచనప్రత్యయములుగాక తక్కినవచనములం దాగమములుగఁ బ్రకృతి కగుమువులు. 40 చే ముపర్ణమును 49 చే వువర్ణమును నాగమములుగ నగును. అట్టిమువు వర్ణములుతుదిని జేరిన ప్రకృతుల కందువర్ణకము పరముగా నుగాగమము వికల్పముగ నగును. వనము+అందు:—ఇందు 'ము' అనునాగమవర్ణమున కందువర్ణకము పరమయ్యెఁ గాన నీవిధిచే నుగాగమము గలుగ 'వనమునం'దనియుఁ గాకున్నయెడల 'వనమం'దనియు రూపములగు. ఇట్లే వువర్ణాంతమున కందువర్ణకము పరముగా 'ధేనువునం'దనియుం 'ధేనువం'దనియు రూపము లగుటను గమనించికొనునది. ఆగమమువులనుటంజేసి సహజమువు వర్ణాంతములకు పాము-వేము-ఆము-తావు అనునట్టివానికిఁ బూర్వసూత్రముచే నిత్యముగ, నుగాగమ మగుననియుఁ దానఁ బామందుఁ దావందనునట్టి రూపములు గావనియుం గ్రహింపఁదగును. 'నక్కు' లో నత్వయుత నకారము 'నుక్కు'లో నుత్వయుతనకారము నిల్చుననుట స్పష్టము. ప్రపూర్వసూత్రాంతమునఁ జెప్పినరీతిని ద్రిలింగలక్షణశేషము ననుసరించి యుదంతామహత్తుల కందువర్ణకముగాఁ గొన్నియెడల నాయకత్వమునయందను మొదలగురూపములఁ గూర్చికొనునది.

## బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమంబగు. ౩౧.

రాములను-రాముల చేతను-విధాతృలను-విధాతృల చేతను.

టీ. బహుత్వమునఁ గల్గిన తత్తద్విభక్తులు పరములుగాఁ బ్రకృతికంతావయవము గను విభక్తుల కాద్యవయవముగను లడాగమము నిత్యముగ నగును. డుముపునలు దప్ప

నితరము లేకవచనబహువచనసాధారణప్రత్యయములనుట స్పష్టముగాన వానినే బహుత్వవాచకములుగాను, వానితోఁ గూడినవానినే బహువచనాంతములుగాను నంగీకరింపవలసి వచ్చుటచేత బహుత్వమున రామును-రాముచేత మొదలగువానియందలి విభక్తులకే యాద్యవయవముగ లకారమును విధించెనని యెంచునది. బహుత్వమున ననుట నేకత్వమున లడాగమము గాదనియు విభక్తులకు లడాగమమని యాద్యవయవముగ వానికిఁ జేయుటంజేసి బహుత్వ ప్రకాశనశక్తి దీనికే యమరియున్నదనియు దీని విడిచిన బహుత్వప్రకాశనము జరుగమియే పైవిషయమునకుఁ బ్రమాణమనియు విభక్త్యవయవమగుటంజేసి యవయవిలోపమున నవయవలోపమును బ్రసక్తముగా సమాసము 25 విధానము సార్థకమగుచున్నదనియుఁ జెప్పఁదగును. 'రామును' అని యుండ నీవిధిచే లడాగమముగా రాములనని రూపమగు. ఇట్లే చేత మున్నగువర్ణకములకు బహుత్వమున నెల్లశబ్దములమీఁద లడాగమంబగుటను గమనించికొనునది. కాన నీవిధానము సర్వాజంతములకు సంబంధించినదని గ్రహించునది. 'విధాతృలను-విధాతృలచేత' అనునవి ఋకారాంతములద్వితీయాదివిభక్తులకు బహుత్వమున లడాగమము గలుగుట కుదాహరణములు. "లుజసో లశసోఽలాంతాత్" అని ద్వితీయాబహువచన ప్రత్యయముగను, "మహతోఽసిలావిభక్తౌ టాదౌ వచనద్వయే" అని బహుత్వమునఁ దృతీయాదివిభక్తులు పరముగాఁగ నాగమముగను లకారమును విధించు చింతామణిని దానిని "శసస్స్యాదుభయత్రాపి లస్తస్మాట్టాది రుచ్యతే" అని మహదమహచ్ఛబ్దములపరముగఁ బూరించునాథర్వణమును సాధారముగఁ గొని సూరి లకారమును నెల్లయెడలను విభక్తుల కాగమమనిన నొకచో విభక్తిగను, నొకచో నాగమముగను నంగీకరింపవలసిన ప్రసక్తి గలుగకుండునని తలంచి యిట్లెల్లయెడల దానినాగమముగనే పేర్కొనెనని గ్రహించునది. కాని చింతామణియు నాథర్వణమును, బహుత్వప్రకాశకముగ లకారము నెంచినట్లు తత్ప్రణాళిక స్పష్టపఱచుచుండుటంజేసియు, సూరి ప్రక్రియ విభక్తులకే యట్టి బహుత్వప్రకాశనశక్తి విశదపఱచుచుండుటంజేసియు, సహజముగ బహుత్వప్రకాశనమును జేయ లకారమే సమర్థమగుటంజేసియు, లకారాభావమున నాయావిభక్తులచే బహుత్వము దెలియఁబడమిం జేసియు బహుత్వద్యోతకమగు లువర్ణకమే యితరబహువచనముల లవర్ణముగ మాఱెననుట సయుక్తిక మగుటంజేసియు సూరి కొకపద్ధతి గుదిరినను నది యార్థికదృష్టికిఁ బుష్టి యొనర్చునదిగామిని బ్రాచీనప్రణాళికయే యిప్పట్టున సార్థకమని తోఁచెడి. 'నిలలు' నీనాతా మున్నగు ప్రకృతులయేకత్వబహుత్వములందు మాత్రము గలుగవని గ్రహించునది.

## సంబోధనంబునం దేకార్థంబయినపదంబుతుదియుకారంబున కకారంబగు. 32.

ఓరాముఁడ-ఓవృక్షమ-ఓశంభువ-ఓకొడుక.

టీ. ఏకత్వముం దెల్పు సంబోధ్యవాచకముతుది నున్న ఉకారమునకు అకారము నిత్యముగ నాదేశమగును. ఏకార్థము:—ఏకత్వముం జెప్పునదని భావము. ఏకత్వముం జెప్పుపదము తుదియుకారమున కకారము సంబోధనమున నగునని ఫలితము. ఓరాముఁడ:—రాముఁడు: ఇది యొకే వ్యక్తిం జెప్పునదిగాన నేకార్థంబైనపదము. 14 చే దీని కాదినామంత్రణమున ఓశబ్దంబగు. ఈసూత్రముచే డువర్ణకము నుకారమున కకారము రా "ఓరాముడ్+అ=ఓరాముఁడ" అనురూప మగును. ఇట్లే తక్కినవాని యుకారమున కకారము గలుగుటను గమనించునది. ఈకార్యము తత్సమములకే గాక తెలుఁగుశబ్దముల కెల్లవానికిని సంభవించుననియు నందును నుకారము ప్రకృతిప్రత్యయములలో నేదానికి సంబంధించినదైనను నీకార్యము గల్గుననియు సూచింప 'ఓకొడుక' అను నుదాహరణ మీయఁబడెనని గ్రహించునది. అనుదంతముల కిక్కార్యముగాదనుటే ఫలమని యెంచవలెఁగాని యపదాది స్వరనిత్యసంధివిధానమును నుత్వనిత్యసంధివిధానమును నిందుండఁగ అకార ముకారమునకు సర్వాదేశముగవిధించుట చింత్యమనఁదగు. బహుత్వమున రాకుండుటకై యేకార్థమనెననుట స్పష్టము. (రాములా, గాదనుట)

## సంబోధనంబునందుఁ బదంబుతుదియుకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు. 33.

ఓరాముఁడా-ఓరాముఁడ-ఓచెలియా-ఓచెలియ-ఓహరీ-ఓహరి-ఓతండ్రీ-ఓతండ్రి.

టీ. సంబోధనమున సంబోధ్యవాచకముతుది నున్న అకారమునకును, ఇకారమునకును దీర్ఘము వికల్పముగ నగును. అకార మాకారమును నికార మీకారమును విభాషనగునని భావము. అకారము పదసహజమును బూర్వసూత్రముచే సంభవించినదియుఁ గావచ్చును. ఇకారము మాత్రము పదముతుదిని సహజముగ నున్నదే యని గ్రహించునది. పూర్వసూత్రముచే నకారము సిద్ధించినపిదప దీనిచే దానికి దీర్ఘము గలుగ 'ఓరాముఁడా' అనురూప మగును. ఇక్కార్యము రానిపక్షమున 'ఓరాముఁడ' అని యగును. ఓచెలియా:—ఇది పదముతుదిని సహజముగనున్న అకారమునకు దీర్ఘము గలుగుట కుదాహరణము. దీర్ఘము రానిపక్షమున 'ఓచెలియ' అని రూపమగును. 'ఓహరీ!

ఓహరి!' అనునవి యికారమునకు దీర్ఘము వికల్పముగ నగుట కుదాహరణములు. ఈవిధి తత్సమములకేగాక యచ్చతెలుఁగుశబ్దములకును సంబంధించినదని సూచింప 'ఓతండ్రీ! ఓతండ్రి!' అని యుదాహరించెనని యెన్నునది. 32-33 సూత్రములచేఁ గలుగుకార్యములు సంబోధనవాచక మోకారము లేకున్నను సంబోధ్యవాచకమునకుఁ గలుగునని గ్రహించునది. 32-33 సూత్రములకుఁ గ్రమముగ "ఆమన్త్రణవుజఃపోఽస్త్యస్య క్రమేణ చాదారదాగమావంతే" అను చింతామణిసూత్రమును, "సంబోధనే వా దీర్ఘ స్స్యాదృత్పు)యోగస్య తథాగతేః" అనునథర్వణకారికయుం మూలములు. చింతామణి సంబోధ్యవాచకములతుది యచ్చులకు, ప్లుతశ్రుతిగలుగుట సహజమను తలంపుతోఁడఁగావలయు దీర్ఘవిధానముసేయ కదారదాగమాదులను నామంత్రణకార్యవిశేషములను మాత్రమే పేర్కొనెడి. ఆథర్వణ మాసంశయమును దీర్చుటకుఁ బాటుపడెను. దాని ననుసరించి సూరియీప్రక్రియ యేర్పడెననుట తెల్లము.

## కృతోత్కంబగు సంస్కృతనామంబుసంబుద్ధిడుజ్జునకు లోపంబు విభాషనగు. 34.

ఓరామ-ఓకృష్ణ. పూర్వసూత్రముచేత దీర్ఘంబు. ఓరామా-ఓకృష్ణా. సంస్కృతనామంబనుటఁజేసి ఓతమ్ముఁడ - ఓబల్లిదుఁడ - ఇత్యాదులందు లోపంబు లేదు.

టీ. 'నామన్త్రణే డుజిత్యస్యే' అనునది మూలము. హ్రస్వాకారాంతమై 21 చే నుత్వముం జెంది యుకారాంతము లైన సంబోధ్యవాచకముల డుఙ్ ప్రత్యయమునకు వికల్పముగ లోపము గలుగును. కృతోత్కము=శాస్త్రముచే నుదంతమైనశబ్దము. సంస్కృతనామము=సంస్కృతప్రాతిపదికము. ప్రాతిపదికము= ప్రత్యయము చేరనిప్రకృతి. సంబుద్ధిడుజ్జు=సంబుద్ధియందైన డుఙ్ ప్రత్యయము. ఓరాముఁడ:—ఇందు రాము అనునది 21 చే నుత్వముం జెందిన కృతోత్కప్రకృతి. దీనికి 22 చే డుజ్జు సిద్ధించెను. పిదప నీసూత్రముచే డుజ్జునకు లోపము రాఁగ 'ఓరాము' అని యగును. 32 చే దీని తుది యుత్వమున కత్వము గలుఁగ 'ఓరామ' అని యగును. 33 చే దీనితుది అకారము దీర్ఘముగాఁగ 'ఓరామా' అని యగును. ఇట్లే తక్కినయుదాహరణము ప్రక్రియ నూహించునది. సంస్కృతనామము సంబుద్ధి డుజ్జున కనకున్న 'తమ్ముఁడ' అను మొదలగు తెలుఁగుశబ్దముల డుజ్జునకును లోపము గల్గి 'తమ్మ' మొదలగు ననిష్టరూపములు గలిగెడిఁ గాన దద్వారణమునకై సంస్కృతనామసంబంధమైన డుజ్జునకని చెప్పవలసివచ్చె నని క్రిందివివరణమున కభిప్రాయము. అనఁగా నీవిధి కేవలము శాస్త్రముచే సిద్ధించిన

హ్రస్వోకారమంతమందుఁగల సంస్కృతప్రాతిపదికములకే యనిభావము. కృతోత్కములని యనకున్న సహజోదంతములకును నిత్యకార్యము గలిగి శంభా (శంభుఁడు) గురా (గురుఁడు) మున్నగు ననిష్టరూపములు గలుగవలసివచ్చునుగానఁ గృతోత్కమను విశేషణము కూర్పవలసివచ్చెను. ఈసూత్రముచే డుజ్జు లోపింప దానికి ముందున్న సున్నయు దానియాశ్రయము నశించినకారణమున నశించునని గ్రహించునది. తమ్ముఁడు మొదలగువాని సహజరూపమును గూర్చి 24 సూత్రపుఁడీక నరయునది. ఇందు డుజ్జున కనుటంజేసి 32 చే డుజ్జుయుకారమున కకారము గలుగకపూర్వమే యీలోపము గలుగునని గ్రహింపవలెను.

## ఉదంతసంస్కృతనామంబుమీఁది సంబుద్ధిడుజ్జునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు. 35.

ఓవిష్ణూ3-ఓశంభూ3 - పక్షంబునందు - విష్ణుఁడ - శంభుఁడ - ఇత్యాది.

టీ. 'డుజతౌ చ న ప్లుతస్స్యాత్సంబుద్ధావిత్యుతాం విదుః కేచిత్' అనునది మూలము. సహజముగ హ్రస్వోకార మంతమందుఁగల సంస్కృతనామములకుఁ బరమున నున్న సంబుద్ధి డుజ్జునకు ఊ 3 కారము వికల్పముగ నాదేశమగును. ప్లుతము త్రిమాత్రాకాలికము. లఘువేకమాత్రాకాలికము. దీర్ఘము లేక గురువు ద్విమాత్రాకాలికము. పొల్లర్ధమాత్రాకాలికము. మాత్ర యనఁగాఁ ద్రుటి. త్రుటి యనఁగా లఘ్వక్షరము నుచ్చరించుటకుఁ బట్టు కాలములో నాలవభాగము. ఓవిష్ణుఁడు:—విష్ణుశబ్దము సహజోదంతసంస్కృతనామము. 50 చే దీనికి ప్రువర్ణకము సిద్ధింపని పక్షమున 22 చే డుజ్జగును. ఈడుజ్జునకు సర్వాదేశముగా ఊకారము ప్లుతము గలఁగ 'ఓవిష్ణు+ఊ=ఓవిష్ణూ' అని రూపమగును. ఇది గలుగనిపక్షమున 32 చే డుజ్జుయుత్వమున కత్వము సిద్ధింప 'ఓవిష్ణుఁడ' అని యగును. 34 చే నిట్టిసహజోదంతముల డుజ్జు లోపింపదుగాన 'ఓవిష్ణ' యను మున్నగురూపములు గలుగవు. వీనికి 50 చే ప్రువర్ణకము సిద్ధించినచో 32 చే నత్వమును 33 చే దానికి వైకల్పికదీర్ఘమును గలిగి 'ఓవిష్ణువ; ఓవిష్ణువా' అను రూపము లేర్పడును. ఆమంత్రణమే యిందు విశేషముగాని ప్రత్యయాదులు ప్రథమా సంబంధములే యని యెఱుంగునది. కావుననే సంబుద్ధిని బ్రత్యేకవిభక్తిగా శాస్త్రకర్తలు గణింపలేదు. తక్కిన యుదాహరణముల ప్రక్రియ నిట్లే గమనించునది. ఇందు సంస్కృతనామసంబుద్ధి డుజ్జునకే యనుటంజేసి తెలుఁగునుదంతము లెల్ల 32-33 సూత్రవిహితములకుఁ గార్యములకే పాలగునని గ్రహించునది. దాన 'ఓచెట్టా-ఓపట్టా-ఓఊరా-ఓపేరా-ఓరాజా' అను రూపములే పొసఁగెడి.

సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు. 3౬.

ఓరాములార - ఓకృష్ణులార. దీనికిం బాక్షికంబుగ దీర్ఘంబగు - ఓరాములారా- ఓకృష్ణులారా.

టీ. 'ఆమంత్రణసుజసోస్తస్య క్రమేణ చాదారదాగమావస్తే' అనునది మూలము. సంబోధనమున బహువచనప్రత్యయమున కంతావయవముగ 'ఆరక్' అను నాగమము నిత్యముగఁ గలుగును. ఓరాములు. ఇది బహువచనాంతమైన సంబోధ్య వాచకము. ఇందుఁ దుదినున్న 'లు' అనునది సంబోధనమునందలి బహువచనము. దీని కంతావయవముగ 'ఆర' అనునాగమము గలుగ 'రాములు+ఆర = రాములార' అనురూపమగును. ఇట్లే తక్కినయుదాహరణ మూహ్యము ఈవిధి సమములకే గాక యాచ్ఛికములకును గలుగును. 33 చే నారగాగమముతుది అకారమునకు వికల్ప ముగ దీర్ఘము గలుగ 'రాములారా' ఇత్యాదిరూపములు సిద్ధించెడి. 'ఆరక్' అనునది పొల్లుకకారము పోవుప్రత్యయముగాన నిర్దిష్టమున కంతావయవముగ నగుననుట పున రుక్తి. సంబోధనమున బహువచనమున కగుకార్యమును సూచించు సూత్రమిది.

మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాషనగు. 3౭.

వినుఁడు బాలకులు - వినుఁడు బాలకులార; వచ్చితిరి కాంతలు- వచ్చితిరి కాంతలార. అన్నలార మిమ్ము నడిగెద నొకమాట - ఇచ్చట మధ్యమపురుషయోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు.

టీ. 'ఆమంత్రణసుజసోః' అను చింతామణిని బూరించెడు 'స్యాన్మధ్యమక్రియాయోగే వినా క్వచిదాగమః' అనునాథర్వణము మూలము. మధ్యమపురుషక్రియాయోగమున సంబోధనమునందు బహువచనమున కారగాగమము వికల్పముగ నగును. సంబోధనమునందు బహువచనాంతమగు సంబోధ్యవాచకము మధ్యమపురుష క్రియకుఁ గర్తయై దానితో నన్వయించుటయే మధ్యమపురుషయోగము. ఇది బహువచనాంతసంబోధ్య విషయముగాన మధ్యమపురుషక్రియ బహువచనాంతమే యైయుండును. మఱియుఁ సంబోధన మెదుటనున్నవానికే యయ్యెడిఁగాన సామాన్య ముగ సంబోధ్యవాచకమును దత్క్రియయు మధ్యమపురుషక్రియాకర్తయు మధ్యమ పురుషక్రియయును గ్రమముగఁ గాక తీరవు. వినుఁడు బాలకులు:— ఇచ్చో బాల కులను సంబోధ్యము వినుఁడను మధ్యమపురుషక్రియకుఁ గర్తయై దానితో నన్వయించు చున్నదిగాన 36 చే నారగాగమము రాలేదు. ఈవిధి వికల్పముగాన 36 చే నారగాగ మము పక్షమునఁ గల్గిన 'వినుఁడు బాలకులార' అనియు రూపమేర్పడును. అరగాగమము

గలిగినపుడు 33 చే దీర్ఘమును సిద్ధింపనగును. ఉ. వినుఁడు బాలకులారా! ఆరగాగమము గలుఁగనపుడు బాలకులనునది యేకార్థము గామింజేసి 32 చే ఆకారము సిద్ధింపదుగాన 'వినుఁడు బాలకులా' అను ననిష్టరూపము గలుగదు. మధ్యమపురుషయోగమును ముఖ్యముగ సూచింప వినుఁడను క్రియను మొదట నిడెనుగాన సంబుద్ధిని మాత్రమే 'బాలకులు వినుఁడు' అని యుండరాదని సంభావించునది. "అన్నలార మిమ్ము నడిగెదనొకమాట." ఇచ్చో 'అన్నలార' అనుసంబోధ్యము మధ్యమపురుషక్రియతో నన్వయించుట లేక దానికిఁ గర్తయై యుండుట యనునవస్థకుఁ బాలుగామి మధ్యమపురుషయోగ మన్నకారపదమునకు లేదు. మఱియు నీవాక్యమున 'అడిగెదను' అను లాడర్థకోత్తమపురుషైకవచనాంతక్రియయే యున్నదిగాన దానికి నేననునదే కర్తయయ్యెడి. దాన మధ్యమపురుషక్రియాభావమున మధ్యమక్రియాయోగమే యిందు సంబోధ్యమునకు సంభవించుట యసంభవము. ఇట్లు సంబోధ్యమునకు మధ్యమపురుషయోగము లేనపు డారగాగమము నిత్యముగనే 36 చే నగుఁగాని యీసూత్రముచే వైకల్పికముగ సిద్ధింపదనియు దాన 'అన్నలు మిమ్ము నడిగెదను' అని యనరాదనియు నీక్రిందివివరణమున కభిప్రాయము.

## అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తుమీఁది విభక్తిలకారంబునకు రేఫంబగు. ౩౮.

బాలురు-బాలురను - బాలురచేతను, నృపాలురు-నృపాలురను-నృపాలురచేతను. దయాళుశబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి. దయాళురు-దయాళురను-దయాళురచేతను.

టీ. 'లాంతాత్తు రుకా' అనునది మూలము. హ్రస్వాకార మంతమందుఁ గల్గినట్టియు దీర్ఘాక్షరమద్దాని కవ్యవహితపూర్వమునఁ గల్గినట్టియు లకార ముపధగాఁ గల్గినట్టియు మహత్తునకుఁ బరమున నున్నవిభక్తిసంబంధమగు లకారమునకు రేఫము నిత్యముగ నగును. ఇది కేవలము సమములకగువిధి. మహద్వాచకములై దీర్ఘపూర్వకములగు హ్రస్వాకారాంతలాంతప్రకృతుల బహువచనలకారమునకు రేఫాదేశ మగునని భావము. బాల+లు:—బాల: ఇది యదంతము. లకారమునకుఁ బూర్వము 'బా' అనునదున్నదిగాన దీర్ఘపూర్వము. లకారముపై నుండునకారమున కంత్యాల్లునకుముందటిది లకారమేగాన లకారోపధము. మహద్వాచకముగాన మహత్తు. దీనికంటెఁ బరముననున్న విభక్తిలకారము లువర్ణకము. ఇది 12 చే సిద్ధించెడి. దీనిలకారమాత్రమునకు రేఫ మాదేశముగాఁగ 'బాల+ర్+ఉ=అని యగును. పిదప 21 చే ప్రకృత్యంతాకారమున కుత్వము గలుగ

'బాలురు' అని రూపమేర్పడును. బాలు + ల + ను:—ఇచ్చో దీర్ఘపూర్వలాంతప్రకృతి మీఁది లడాగమలకారమునకు రేఫగలిగెను గాన 'బాలురను' ననురూపముసిద్ధించెను. లడాగమలకారము విభక్తిలకారము గాకున్నను విభక్త్యవయవముగ 31 చే విధింపఁబడుటం జేసి దీనిని విభక్తిగనే యంగీకరింపవలెనని సూరియాశయమైనట్లు బాలురను బాలురచేత నను నుదాహరణములు విశదీకరించుచున్నవి. ప్రకృత్యంతావయవముగవిధింపక విభక్త్యాద్యవయవముగ విధించుట కిట్టిచోటుల రేఫాదేశము దానికిఁ గలుగుటయే ఫలము. లళలకభేదవ్యవహారము ప్రసిద్ధమని యెంచినను దయాళుప్రకృతియందు సూత్రోక్తవిషయము లన్నియుఁ గుదిరినను, లకారాంతము గాకుండుటంజేసి రేఫాదేశము దాని విభక్తిలకారమున కీసూత్రముచే సిద్ధింపమిని దయాళుశబ్దమున కిట్లు రేఫము గానంబడియెడినని సూరి నిపతించి సాధించురీతిని వివరణము వ్రాసికొనవలసివచ్చెనని గ్రహించునది. ఈవివరణమును సూరి యిట్టివి 'ఆళుచ్' అనుప్రత్యయముయోగమున సంస్కృతమునఁ గల్గినవిగా భావించి వ్రాసెను. కొందఱు 'దయాం లాతి గృహ్ణాతీతి దయాలః' అనునట్టి కృత్రిమవ్యుత్పత్తికల్పనముచే లకారాంతముగా నిట్టివానిని సాధింప నెంచి సూరిప్రయాసమును వ్యర్థపఱుప యత్నించిరి. కాని స్పష్టముగా 'దయాళు' అని సూరి యుదాహరించుటంబట్టి యట్టికృత్రిమోక్తి కల్పన మవిచారమూలకమును ననాకాంక్షితమునని లక్షణకర్త తలంచి ప్రసిద్ధమైనరూపసాధనప్రక్రియనే యిట్టివానిరూపనిష్పత్తివిషయమున గ్రహించినట్లు స్పష్టమయ్యెడిఁ గాన నమ్మార్గము పరిత్యాజ్యము. శూలి-వాలి-కపాలి మున్నగువానియం దన్నిధర్మము లున్నను నదంతతగానరాకుండుటం జేసి వానివిభక్తిలకారమునకు రేఫము గలుగదయ్యెను. ఇది యదంతదళసార్థక్యము. ఖల మొదలగువానియం దన్నిధర్మములు గుదిరినను, దీర్ఘపూర్వము గాకుండుటచేత రేఫము సిద్ధింపదయ్యెను. ఇది దీర్ఘపూర్వదళసార్థక్యము. రామ మొదలగువానియం దన్నియుఁ గుదిరినను లకారోపధము గాకుండుటచేత రేఫాదేశము రాదయ్యెను. ఇది లోపధాదళసార్థక్యము. వాలశూల మున్నగువానియందెల్ల యవియెల్ల సరిపడినను మహత్తులు గామి నికార్యము సంభవింపదయ్యెను. బాలేత్యాదులందు ప్రకృతిస్థమగు లకారమునకే రేఫాదేశము సంభవించెడిఁగానఁ దద్వారణార్థము విభక్తిలకారదళ మావశ్యకము. కాన నీసూత్రమునందలి దళములెల్ల ననర్థములే యనియు, నింత కట్టుబాటుగ సూత్రమును రచించిన సూరి వ్యాకరణసంప్రదాయమును గట్టిగ నెఱింగినప్రౌఢ యనియుఁ నెఱుంగఁ దగుంగదా! ఇందు దీర్ఘపూర్వదళమును మాత్రము సూరి యహోబలునికంటెఁ గ్రొత్తగఁ జేర్చెను (చూ. అహోబలపం - 'ళాంతాత్తు రురౌ' అనుసూత్రవ్యాఖ్య. పుట 258) 'ద్విత్వయుక్తలాంతంబుమీఁది లులలకును రురలాదేశంబులగును' అని ప్రౌఢవ్యాకర్త శాపించి 'మల్లురకుక్' అని ప్రాసస్థానప్రయోగముంజూపి యీసూత్రమును సవరించెను.

కాని లకారప్రాసమున 'మల్లులనని' తిక్కన విరాటపర్వప్రయోగ మగపడుచుండుటచే దీనికి రేఫాదేశము వికల్పముగ నగుననవలెను.

### అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు. ౩౯.

వృక్షము-ఋక్షము; దైవము-కళత్రము-అపత్యము, క్లీబంబులు మిత్రాదు లనుసూత్రంబునఁ బాక్షికంబుగం బుంలింగత్వం బతిదేశించుటం జేసి మిత్రాదిశబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది. ఉ. మిత్రుఁడు-మిత్రము. శరణుఁడు-శరణము.

టీ. 'స్యాదమహతాం విభక్తౌ సోఽశ్చ ము.' అనునది మూలము. ఇందు 'అమహన్నపుంసకములకు' అనునది ద్వంద్వసమాసము. అదంతములకు అనునది యాద్వంద్వమునకు విశేషణము. కాఁగా నదంతములైన యమహద్వాచకములకును నదంతములైన నపుంసకలింగశబ్దములకును 'ము' అను ప్రత్యయము ప్రథమైకవచనమునఁ గలుగునని సూత్రార్థము తేలినది. 'వృషభ-వృక్ష-ఋక్ష' అను ప్రకృతు లదంతములైన యమహత్తులు. వీనికి మువర్ణకము గలుగ 'వృషభము-వృక్షము-ఋక్షము' అనురూపములు సిద్ధించును. 'దైవ-కళత్ర-అపత్య' అను నవదంతములైన నపుంసకములు. వీనికి మువర్ణకము సిద్ధింప 'దైవము-కళత్రము-అపత్యము' అనురూపము లేర్పడును. 18 చే నదంతములై, నపుంసకములైన మిత్రాదులకుఁ బుంలింగతుల్యతయుఁ బక్షమున సంభవించెడిఁగాన నదంతనపుంసకములుగ నెన్నఁబడినపు డీసూత్రముచే మిత్రము శరణము ప్రధానము పాత్రము మున్నగురూపములును నదంతపుంలింగములుగ నెన్నఁబడినపుడు 21-22లచే నుత్వడుజ్ఞులు సిద్ధింప మిత్రుఁడు శరణుఁడు ప్రధానుఁడు పాత్రుఁడు మున్నగురూపములును సిద్ధించెడినని యీక్రిందివివరణమున కభిప్రాయము. దీన నదంతనపుంసకములు మహాదమహద్వాచకములలో నేవైనను మువర్ణకమునే యందెడినని ఫలితము తేలినది. అదంతామహన్నపుంసకములు పరస్పరసాపేక్షములుగానివై మువర్ణకప్రాప్తినందుచున్నవిగాన నిచ్చో 'అమహన్నపుంసకములు' అను సముచ్చయద్వంద్వము సంస్కృతశబ్దశాస్త్రసరణిని బొసఁగదనియు నమహత్తులైన నపుంసకములని కర్మధారయము నంగీకరించుటయె శాస్త్రసమ్మతమార్గమనియుం వృక్షము వృషభము దైవతము మున్నగురూపము లీపక్షమున నమహత్త్వముకల్మినగు నపుంసకత్వాతిదేశమునను సిద్ధించుననియు గుప్తార్థప్రకాశికాకారులు, బ్ర. శ్రీ. మ. తాతా సుబ్బారాయశాస్త్రులవారలును, బ్ర. శ్రీమదాంధ్రగురువరులు వఝల చినసీతారామస్వామిశాస్త్రులవారును గూడ నీసూత్రమునందలి యమహన్నపుంసకములనునది ద్వంద్వముగాఁ దీర్మానించుచు వ్రాసినవ్యాసములపైఁ దమ

సిద్ధాంతమును వెల్లడించిరి. ద్వంద్వము శాస్త్రసమ్మత మగుఁగాక. కాకపోవుఁగాక. అది పండితవర్యులపర్యాలోచనపాత్రమై వెలసినది. ఇఁక నీసూత్రార్థము బాలురకును బాతకులకును సోదాహరణముగ సుబోధముచేయవలెనన్న నమహన్నపుంసకమును ద్వంద్వముగా నెన్నక తీరదు. మఱియు నిది ద్వంద్వసమాసముగా సూరి యెన్నకుండినచో తత్కాంగలచోటులందువలెనే శబ్దసమూహమునంతను నేకత్వవాచకశబ్దముచే నమహన్నపుంసకమునకని బోధించియుండఁడా యని సందేహము గలిగెడి. కాన నమహన్నపుంసకములకను బహువచననిర్దేశమునంజేసి దీనిని గర్మధారయముగ భావింపలేదనియు ద్వంద్వముగనే యెంచెననియుఁ దోఁచెడి. మువర్ణకప్రాప్తియోగ్యములైన యదంతామహత్తులను నదంతనపుంసకములను రెండుతెగలను బోధించుటకే సూరి యమహన్నపుంసకము లనెననియు నారెండుతెగలును నదంతములే యగుట నదంతములను విశేషణమును నిల్పెననియు దీన నీసూత్రార్థము ప్రథమోపదేశమునందు బాలురకు సుబోధమగుననియు సూరి తలంచెననుట యయుక్తికము గాదని తోఁచెడి. భాష్యాది సవిమర్శపర్యాలోచనముచే సూత్రార్థముల నెఱుంగఁగల్గుటయుఁ వృషభము-వృక్షము-దైవతమిత్యాదులు కర్మధారయసాధ్యములు గామిని గ్రమముగ నమహత్తులగుట నపుంసకకార్యార్హములనియు నపుంసకత్వాతిదేశముం జేయఁదగినవనియు విశ్వసించి సాధించుటయుఁ దూరతరదుర్గ్రాహ్యయుక్తికవిషయములగుటంజేసి సుబోధకై యమహన్నపుంసకములను దానిని ద్వంద్వముగను వానియదంతతనుజెప్పు విశేషణముగ నదంతమునుపదమును గ్రహింతును. దీన నదంతామహత్తులు పుంలింగములైనను మువర్ణకమునే పొందుననియుఁ, (వృక్షము) నదంతనపుంసకములు మహదమహద్వాచకములలో నెట్టివైనను మువర్ణకమునే పొందుననియును (దైవతము. కళత్రము. జ్ఞానము) మువర్ణకార్హముల కెల్ల గుఱిగా లక్షణార్థము గుదురుపడెడి. రామేత్యాదు లదంతమహద్వాచకములగుటను బుంలింగములగుటను నిద్దానికి విషయములుగాఁ జేయ నవకాశమే గలుగదు. కాన లింగమును గుఱిగఁగొనక యదంతామహత్తులని సామాన్యముగ ననుటకును, లింగమును జేకొని యదంతనపుంసకము లనుటకును బైని నిరూపించినలక్ష్యములసిద్ధియే కతమని సంభావింపవలెను.

## వానికి మువర్ణకేతరంబయినవిభక్తి పరంబగునప్పుడు ముగాగమంబగు. ౮౦.

వృక్షములు-వృక్షమును-ఋక్షములు-ఋక్షమును.

టీ. ప్రథమైకవచనమున మువర్ణకమును బొందఁదగిన పైశబ్దములకుఁ బ్రథమైకవచనేతరములు పరములుగా ముగాగమము గలుగును. ప్రథమైకవచనమునం దకచ్చా

దక్కినవిభక్తుల యేకవచనబహువచనప్రత్యయములు పరములుగాఁ బ్రకృతి కంతావయవముగ 'ము' అనునదాగమమగును. ప్రథమాబహువచనమును దక్కినవిభక్తులయేకవచనబహువచనములును బరములుగా నగునని తాత్పర్యము. వృక్ష:—దీనికి 12 చే లువర్ణకము. అది ప్రథమైకవచనేతరముగానఁ బ్రకృతి కంతమున 'ముగాగమముగా' 'వృక్ష + ము + లు=వృక్షములు' అనురూపము సిద్ధించును. వృక్ష:—2 చే నువర్ణకము. ఇది ద్వితీయైకవచనముగానఁ బ్రథమైకవచనేతరము. దీనిచే ముగాగనుముగా 'వృక్ష+ము + ను = వృక్షమును' అని రూపమగును. ఇట్లే తక్కినయుదాహరణములూహ్యములు. వృక్షశబ్ద మదంతపుంలింగము. అమహద్వాచకము. ఋక్షశబ్ద మదంతనపుంసకామహద్వాచకము. (నక్షత్రవాచకమగునపుడు) ఎలుగుగొడ్డు మున్నగువానిం జెప్పునదైనను నదంతపుంలింగమే యగుంగాన వృక్షశబ్దమువలెనే మువర్ణక ముగాగమప్రాప్తియోగ్యమయ్యెడి. 'విభక్తౌ చ' అనునది మూలమని గ్రహించునది.

## మువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకునగు. ౪౧.

మువర్ణకంబునకు విధించు లోపాదేశాదికార్యములు ముగాగమమునకు సహితము వచ్చునని యర్థము.

టీ. 39 చే సిద్ధించెడు ముప్రత్యయమునకు విధించునట్టికార్యములెల్లను 40 చేఁ గలిగెడు ముగాగమరూపమువర్ణమునకును గలుగును. మువర్ణకమునకు శాస్త్రముచే సిద్ధించెడు లోపాదేశాదిరూపములగు కార్యవిశేషములు ముగాగమమునకును నిత్యముగ సంభవించునని క్రిందివివరణమున కభిప్రాయము. 'లోపమనఁ గానరాకపోవుట. ఆదేశమనఁగా మఱియొకవర్ణ మున్న దానిం ద్రోసి దానిచోట నిల్చుట' అని ముందే వివరించితిని. అనంతరసూత్రమున బిందుపూర్వకబువర్ణ మాదేశముగ మువర్ణకముగాగమములకుఁ గలుగుట నరయునది. 58 సూత్రమునఁ జరిత్రాదులమువర్ణకముతోఁబాటుగ ముగాగమమును లోపించుటను గమనించునది. 72 చేఁ బ్రథమైకవచనముతోఁబాటుగ ముగాగమమువర్ణము లోపింపకుండుట గనునది. ఇట్లే ప్రక్రియాప్రయోజనముల నరసికొనునది.

## మువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందుపూర్వకబువర్ణంబేని విభాష నగు. ౪౨.

వృక్షమ్ము- వృక్షంబు; ఋక్షమ్ము - ఋక్షంబు. పూర్వసూత్రము చేత ముగాగమమున కీకార్యంబగు. వృక్షమ్ములు - వృక్షంబులు, ఋక్షమ్ములు - ఋక్షంబులు.

టీ. 'తదుపరి పునర్మబూ స్యాతామ్' అనునదియు, దానిని 'బౌపరే మస్య బిందు స్స్యాన్మాపరే మేళనం భవేత్' అని సవరించునాథర్వణమును మూలములు. 39 చే సిద్ధించిన ము ప్రత్యయమున కింకొక పొల్లుమకార మాగమముగను పూర్ణబిందువు పూర్వ మునఁగల బువర్ణమును బర్యాయమున వికల్పముగఁ గలుగును. ఈరెండును సిద్ధింపనపుడు మువర్ణము సహజరూపముతో నిల్చియుండును. మకారమునకుఁ గ్రింది మకారము జడ్డను మాముడి యని వ్యవహరించుట ప్రసిద్ధము. వృషము:—ఇందు మువర్ణకమునకు మాముడి కలుగ 'వృషమ్ము' అని రూపమగును. పూర్ణబిందుపూర్వకబువర్ణ మాదేశముగా 'వృషంబు' అని యగును. ఈరెండుకార్యములు గలుగకున్న 'వృషము' అని యుండును. పూర్వసూత్రముచే ము ప్రత్యయమునకు సిద్ధించెడికార్యములు ముగాగమ మునకును గలుగనగుటంజేసి ప్రథమాబహువచనమునను దక్కినవిభక్తులయేకవచనబహు వచనములందును నున్నముగాగమమువర్ణమునకును నీకార్యద్వయము వికల్పముగఁ గలుగ 'వృషమ్ములు-వృషంబులు - వృషములు-వృషంబును - వృషమ్మును-వృషమును-వృషమ్ముచేత-వృషంబుచేత-వృషముచేత' మున్నగురూపములేర్పడునని యీక్రిందివివ రణమున కభిప్రాయము. ఇట్లే తక్కినవి యూహ్యములు. మూలము ప్రాచీనపద్ధతింబట్టి బువర్ణమును మువర్ణకముమీఁదఁ గూర్చి మ్బురూపమును సాధించెడి. కాలక్రమమున నది ంబు రూపమయ్యెననుట తెల్లము.

## లు - ల - న - లు పరంబులగునపుడొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు. ౪౩.

వజ్రాలు - వజ్రాలను - వజ్రాన; పగడాలు - పగడాలను-పగడాన. ఒకానొకచోట ననుటచే నీకార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు సూచింపంబడియె.

టీ. 'వికృతౌ క్వచిచ్చ లోపో మోర్దీర్ఘశ్చాత ఆదిమస్య భవేత్' అనునది మూలము. ప్రథమాబహువచనప్రత్యయము 'లు' అనునది. 'ల' అనునది ద్వితీయాది బహువచనములందగు లడాగమములకారము. 'న' అనునది యుదంతజడంబునకు సప్త మ్యేకవచనమున నగు నవర్ణకము. పై 'లు, ల, న' అనునవి పరంబులగునపుడు వానికిఁ బూర్వముననున్న నాగమముకారమునకు లోపమును, నాముగాగమమువర్ణమునకు ముం దుండెడి యచ్చునకు దీర్ఘమును వికల్పముగ నగును. మువర్ణలోపతత్పూర్వస్వరదీర్ఘ కార్యములు రెండును సన్నియోగశిష్టములు. అనఁగా మువర్ణలోపము గల్గెనేని పూర్వ స్వరము దీర్ఘము గాకుండుట సంభవింపదనియు రెండుకార్యము లొకటినొకటి యాశ్ర

యించినవగుటంజేసి మువర్ణలోపము గల్గినయెడల నవశ్యము తత్పూర్వస్వరము దీర్ఘమగుననియుం భావము. మువర్ణలోపమున కెంతటిప్రాధాన్యము గలదో యంతటిప్రాధాన్యము తత్పూర్వస్వరము దీర్ఘమగుటకును గలదని గ్రహించునది. వికల్పమని యెంచి వీనిని రెండుకార్యములుగ భావించి యిది రానపు డది యది రానపు డిది యని భావింపక నొకేకార్యముగ భావించి చేసిన రెండుకార్యములను జేయుటయుఁ జేయకున్న రెంటిని మానుటయుఁ జేయవలెనని తాత్పర్యము. వజ్రము + లు:— ఇచ్చో లువర్ణకము పరముగాఁగఁ దత్పూర్వమున నున్న ముగాగమ ముకారమునకు లోపమును నా మువర్ణమునకు ముందున్న యచ్చగు 'జ్ర' అనుదానియకారమునకు దీర్ఘమును గలుగ 'వజ్రాలు' అను రూపమగును. ప్రథమైకవచనమునందక్కఁ దక్కినవిభక్తులవచనములందు మువర్ణ మాగమముగ 40 చే సిద్ధించినదనువిషయము విదితమె. కాన 'లు-ల-న' అనువానికి ముందున్న మువర్ణము ముగాగమసంబంధి గాక యన్యము గాఁజాలమింజేసి ముగాగమంబని విశేషించి యన నక్కఱలేదనియుఁ మువర్ణమనినఁ జాలుననియుశంకింపఁదగును. కాని ఊఱుము మెఱుము మున్నగుశబ్దములందు సహజముగాఁ దోఁచు మువర్ణమునకు లోపమును దత్పూర్వస్వరమునకు దీర్ఘమును గలుగకుండుటకును, మివర్ణాంతములైన కలిమి బలిమి మున్నగుశబ్దములకు బహువచనము పరమగునపుడు శబ్దసిద్ధమైన మివర్ణము 45 చే మువర్ణమగుటఁ గలుగుఁగాన నట్టిమువర్ణములకు లోపమును దన్నిమిత్తమైన తత్పూర్వస్వరదీర్ఘమును సిద్ధింపకుండుటకును ముగాగమమని సూరి యనెనని యెన్నునది. ఇట్లే 'ల' 'న' పరమగునపుడు ప్రక్రియను గమనించునది. వజ్రము:— ఇది మువర్ణకాంతమగుట నుదంతజడముగాన దీనికిఁ గారకము 18 చే సప్తమ్యేకవచనమున నవర్ణకము సిద్ధించెడి. మువర్ణకలోపమును నది నిమిత్తముగానగు పూర్వస్వరమునకు దీర్ఘమును నొక్కకార్యముగనే యెంచెననుటకుఁ గ్రిందివివరణమున సూరి యీకార్యంబునకని యేకవచనమున వ్యవహరించుటయె ప్రమాణము. ఈకార్యము గలుగనిపక్షమున 'వజ్రములు-వజ్రములను - వజ్రమున' అనురూపము లుండునని గ్రహించునది. సూత్రమున 'ఒకానొకచోట' అని యనుటచే నీవిధి సార్వత్రికము గాదనియుఁ నచట నచట శ్రుతిసుఖము తోఁచినపుడు చేయనగుననియు నీక్రిందివివరణమున కభిప్రాయము. మఱియు ముగాగమమువర్ణమునకుఁ బూర్వమున నున్నస్వరము దీర్ఘము గాఁదగిన దగునపుడే యీకార్యము చేయఁదగుంగాని తత్పూర్వస్వరము దీర్ఘమే యైయున్న నీవిధి యట్టిచోటులఁ గలుగదనియు గ్రహించునది. ఇంతియగాక యీసూత్రముచేనగు నీకార్య మకారముకంటెఁ బరమగు ముగాగమముకారమునకే కలుగుననియు నెన్నఁదగును. మూలమునందలి 'క్వచిచ్చ' అనుదళము ననుసరించి సూరి కొన్నియెడలనని

యీకార్యమునకుఁ గ్వాచిత్కతను సూచించెనుగాని యిట్టిరూపములు నేఁటివాఙ్మయము నందు విరివిగఁ గన్పట్టెడి. మూలము 'వికృతౌ' అని తెలుఁగుపదములకే యీ కార్యమగుననుచుండ సూరి సమాసము సాధారణముగ నెంచుట సరిగాదండ్రుగాని మూలము సమసంకలితభాషను గూడ వికృతియని వ్యవహరించినట్లు కొన్ని సందర్భములు స్పష్టపఱచెడిఁగాన నిది యొక దోషముగా నెన్న నవకాశము లేదని తోఁచెడి. పగడాలనియు నుదాహరించుటచేత నీవిధి సంస్కృతసమాసము సాధారణ మనుట స్పష్టము. అథర్వణుఁడు 'ప్రాయశో వైకృతపదే లోపో దీర్ఘశ్చ మోర్మతః' అని ప్రాయశ్శబ్దముచే వైకృతము గానిదానికిని నీవిధి గల్గునని సూచించుటే సూరి దీనిని సమాసను సాధారణముగ నెంచుటకు బీజమని యెన్నునది. 'ఈకార్యము కువర్ణకము పర మగునపుడును గానంబడెడి.' అని ప్రౌఢవ్యాకర్త 'భిక్షానకునవ్వత్తునో' అని యుదాహ రించి యీసూత్రమును సవరించెను. ఇక్కార్యము బహువచనములందె యగపడుచుండు టంజేసియు, 'ల్వాదివర్ణకే' అని యథర్వణుఁ డనుటంజేసియు, 'లల'లనియు, ప్రాణానం గలు గంగనను మున్నగు ప్రయోగములంబట్టి 'న' అనియు సూరి మూలమును వివరించి యుండనోపును. ''మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రాణానంగలుగంగ; వాఁడినారాచంబువరల నీనిటలానన్;'' ఇత్యాదులేకవచనంబులు'అను కవిజనమండనవాక్యములు ముఖ్యముగ మూలములనఁదగు రెండక్షరములుగాని యంతకుమించినయక్షరములుగాని గల్గినపదము లందే యీలోపదీర్ఘములకుఁ బ్రసక్తి యగపడెడి. దీర్ఘపూర్వ, ముగాగమమున కిక్కా ర్యద్వయము గలుగదనుట పూర్వస్వరదీర్ఘవిధానమునంజేసి తెల్లము.

ఇగ్గ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు. ౭౭.

ఇకారాంతములకు గ్లౌరైశబ్దములకు మఱి యుగాగమాంతం బులకుం బ్రథమైకవచనలోపంబగు. హరి - గిరి - శ్రీ - ధీ.

టీ. ఇక్=ఇ ఈ లంతమందుఁ గల ప్రకృతులు. గ్లౌ-రై. ఉగంతములు = 68 చే ప్రాప్తోకార మంతమందుఁ జేరిన ప్రకృతులు. పైవాని ప్రథమైకవచనమునకు లోపము గలుగును. రై+ఉగంతములు=రాయుగంతములు. ప్రథమైకవచన మెద్దియో ప్రాప్తిని సూచించువిధులఁబట్టి యూహించునది. ప్రాప్తిని సూచించువిధి లేనపు డనుక్త మితరవ్యాకరణమునుబట్టి గ్రహింపవలెననుపద్ధతిని సంస్కృతవ్యాకరణము ననుసరించి 'సు' అనునదే ప్రథమైకవచనప్రత్యయమనుకొని లోపమును జేయునది. హరి:—ఇది మహదాద్వాచకము. దీనికి 22 చే డుజ్ఞు ప్రాప్తించెడి. ఆడుజ్ఞునకే యీసూత్రముచే నిత్య ముగ లోపము గలుగ 'హరి'యని రూపమగును. గిరి:—ఇది యమహదాద్వాచకము. దీనికిఁ

బ్రథమైకవచన మిాదియని విధించెడువిధియే లేదుగాన 'సు' అనునదే ప్రథమైకవచన ప్రత్యయమనుకొని దానికే లోపమును జేయ 'గిరి'యని రూపమగును. ఇకారమునకని సామాన్యముగ ననుటంజేసి యీకారాంతములకును నీకార్యము గలిగెడిఁగాన 'శ్రీ, ధీ' అనునట్టివాని ప్రథమైకవచనమును లోపించెడి. శ్రీధీలకుఁ బ్రథమైకవచన మిది యని విధానము గానరాదుగాన 'సు' అనుదానినే ప్రథమైకవచనముగ నెన్నవలెను. గ్లౌ.— ఇది మహద్వాచకమన్న 'గ్లౌఁడు' గావలెనుగాన దాని వారించి 'గ్లౌ' అనియే ప్రథమైక వచనరూపమును సాధింపనిందు దీనిఁ జేర్చెనని గ్రహించునది. 'రై' ఇది యమహద్వాచ కముధనార్థకము. దీనిని స్త్రీలింగముగానెన్నిన 57 చేఁ బ్రథమైకవచనలోపము సిద్ధించెడిఁ గాని యిది మూఁడులింగములందును వర్తించునదగుటంజేసి విశేషించి యిందుఁ జేర్చెనని గ్రహించునది. కేవలము స్త్రీలింగముల ప్రథమైకవచనమునకు లోపమువిధించు 57 సూత్ర మునమాని శ్రీమున్నగు నీకారాంత స్త్రీలింగముల నిందుఁ జేర్చుట యనుచితమని తోఁపక పోదుగాని హరిమున్నగు నికారాంతముల కస్త్రీలింగములకుఁ బ్రథమైకవచనలోప విధానము వానినందుఁ జేర్చినను జేయక తప్పదుగాన నికారాంతసాదృశ్యము ననుసరించి యీకారాంతములను గూడ నిందుఁ జేర్చుటయె యుచితమని సూరి యెంచెనని తోఁచెడి. మఱియుం 57 సూత్రమమహత్తువై మువర్ణకమునందఁదగిన యదంతస్త్రీలింగ ముల ప్రథమైకవచనలోపమును విధించెడిఁగాని తక్కినవానికిఁ గాదని యుదాహరణ సారస్యము ననుసరించి యన్నచో నీవిధియందలి 'ఇక్' అనునది ఇఈలంతమందుఁగల పుంస్త్రీలింగశబ్దముల రెండింటి ప్రథమైకవచనమును లోపింపఁజేయునదనెడి సారస్యము తేలునుగాన సార్థకమయ్యెడి. ఈప్రకృతులు స్వార్థపరములగునపుడే యీకార్యము గల్గెడిఁగాని బహువ్రీహిసమాసాంతగతములైనపుడు తద్వాచ్యములనుబట్టియే యాయా ప్రథమైకవచనములు గలుగునని గ్రహించునది. 'సోర్లుగితః, స్త్రీవద్గ్లౌః,' 'ఐకారాంతం స్వరూపేణ మతే భవతి' అను చింతామణి ప్రథమసూత్రద్వయమును దుదియాథర్వణ మును నాధారముగాఁ గొని సూరి యిట్లు సూత్రించెను. రుక్కు-రాట్టు - మరుత్తు- మున్నగునవి యుగాగమాంతములు. వీనికి 48 చే వువర్ణకము గలుగ కుండుటకై ప్రథ మైకవచనలోపము నిత్యముగ విధింపఁబడియెనని గ్రహించునది.

ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు. ౭౫

హరులు - గిరులు - కవులు - రవులు - యామినులు - భామినులు. తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబు లేదు. శ్రీలు - స్త్రీలు - లక్ష్మోరిలు.

టీ. 'ఉద్విభక్తౌ' అనునది మూలము. హ్రస్వేకారమంతమందుఁ గలశబ్దములకు బహువచనప్రత్యయము పరముగాఁగ వానితుదియికారమున కుకారమాదేశమగును.

తుదియికారము హ్రస్వముగాన నాదేశమగునుకారమును హ్రస్వమె యగును. 13 చే డుమువునలు దప్పఁ దక్కిన వెల్లను నుభయములుగాఁదగుటచే బహువచనములందెల్ల నీవిధి గల్గుటను బహువచనములకు ముందు లడాగమము తోఁచియుండుటను గమనించునది. హరి+లు:—హరియనునది హ్రస్వేకారముతుదిని గల ప్రకృతి. దీనికి 'లు' అను బహువచనము పరముగాఁగఁ దుదినున్న యికార ముకారముగాఁగ 'హర్+ఉ+లు=హరులు' అని రూపమేర్పడును. ఇట్లే తక్కినయుదాహరణము లూహ్యములు. ఈవిధి యిదంత మహదమహత్సాధారణమని సూచింప 'హరి కవి—యను మహద్వాచకములతోడ' 'యామిని—గిరి' యను నమహద్వాచకములను గూడ నుదాహరించెను. సూత్రమున నికారమని సామాన్యముగ ననక 'ఇత్' అని తకారపుఁబొల్లును జేర్చి నిర్దేశించుటంజేసి హ్రస్వేకారమునకే యీకార్య మయ్యెడిఁ గాన శ్రీ-లకోరీ మున్నగునీకారాంతములతుదినున్న దీర్ఘే కారమున కుత్వము గలుగదనియు దాన శ్రులు-లకోరులు మున్నగునవిష్టరూపములు సంభవింపవనియు నీక్రిందివివరణమున కభిప్రాయము. లకోరీశబ్దము దేశ్యముగాన సూరి చెప్పకున్నను 'న చ దేశ్యపదే' అనుమూలము ననుసరించి 54 సూత్రముచే నగు హ్రస్వము గలుగదని గ్రహింపక తీరదు. మఱియు నిందీకారాంతముగ దీనిని నిర్దేశించి యుత్వము రాదనుటంబట్టియే దేశ్యములగునిట్టివానికి హ్రస్వము గలుగదను తలంపు సూరికిఁ గలదని నొక్కి చెప్పవచ్చును. కాన లకోరీలనియే రూపము లేర్పడెడి. స్త్రీ-శ్రీ-మున్నగు నీకారాంతము లేకాక్షరము లగుటంజేసి 55 చే హ్రస్వము గలుగదనియు దీనిచే బహువచనము పరముగా నుత్వాదేశము సంభవింపక శ్రీలు-స్త్రీలు-మున్నగురూపములే యేర్పడుననియు గ్రహించునది. ఈకార్యము లకోరీలను నుదాహరణము ననుసరించి తత్సమాచ్ఛికసాధారణమని తలంపవలెను.

## వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునప్పు డుత్వంబగు. ౭౬.

ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు. కలికి-కలుకులు - ములికి - ములుకులు - చెలిమి-చెలుములు-బలిమి-బలుములు. ఉపోత్తమేత్వంబున కనుటంజేసి జిగి - నిసి - ఇత్యాదులం దుత్వంబు లేదు. జిగులు - నిసులు.

టీ. 'ఇదుపోత్తమోత్తమానాం బహువచన ఉపోత్తమే త ఇద్భవతి' అనునది మూలము. ఇందలివికృతిపదము సంస్కృతసమములకంటె నితరమగుపదజాలిని బోధించునని సూరియే క్రింద స్పష్టపఱచినాఁడు. మూఁడువర్ణములు గలపదమునందలి తుది

నున్న యచ్చునకు 'ఉత్తమము' అని పేరు. దానికిఁ బూర్వముగ నున్న యచ్చునకు 'ఉపోత్తమము' అని పేరు. ఉత్తమమునకు సమీపముననున్నదని యర్థము. మూఁడు వర్ణములుగల యఖండపదమునందలి యచ్చులకీపేరులు సిద్ధించెడిఁగాన నందుఁ దుదినున్న యుత్తమమునకు సమీపముననున్న యచ్చుత్తమమునకు ముందున్నదే యగుఁగాని వేఱొకటి గాఁజాలదు. మూఁటికంటె నెక్కుడువర్ణములవానిలోఁ దుది దానికిముందున్న దానికిని నీసంజ్ఞ గలుగుననుటకు 47 సూత్రమునందుఁ బిడికిలి యని యుదాహరించుటయే ప్రమాణము. పరమున నచ్చుత్తమమునకు సంభవించినను నది వేఱొకపదమునకు సంబంధించినదే గాని తనకు సంబంధించినది గామి నద్దానితోఁ బ్రసక్తియే యీసంజ్ఞకుఁ జూపట్టదు. ఇది యికారాంతములతుది యికారమునకుఁ బూర్వముననున్న యికారమున కుకారము నాదేశించువిధి యగుటంజేసి మూఁడువర్ణములు గల ప్రకృతులలోఁ దుదిరెండువర్ణములికారాంతములై యుండునవియే యిందుఁ జేరఁదగినవనుట స్పష్టము. ఇట్లనుటంజేసి తక్కిన విదంతములై యుండరాదనిగాని తప్పక యుండవలెననిగాని గ్రహింపరాదు. వాకిలి మొదలగువానియందీవిధి వర్తింపదు. కలికియను నట్టిశబ్దములందును పోఁడిమి, తాలిమి, మేలిమి అను మొదలగువానియందును నీవిధి వర్తించు. కాన యథార్థముగ నుపయోగించుకొనునది.

కలికి:—మూఁడువర్ణముల ప్రకృతి. ఇందుఁ దుదివర్ణమగు కకారముపైనున్న యికారము త్తమము నాఁబడును. దానికి ముందున్న లకారముపైనున్న 'యికారము' ఉపోత్తమ మనం బరఁగును. దాని కుత్వమాదేశముగాఁగ 'కల్ + ఉ + కి + లు' అని యగును. పిదపఁ దుది యికారమునకు 45 చే నుత్వము గలుగ 'కల్ + ఉ + క్ + ఉ + లు = కలుకులు' అని రూపమగును. ఇట్లే తక్కినయుదాహృతు లూహ్యములు. మూఁడువర్ణములు గల యఖండపదమునందలి తుదియికారమునకు ముందున్న యికారముకార మగుననుటంజేసి జిగి-నిసి మున్నగు రెండువర్ణములపదమునందలి తుదియికారమునకుఁ బూర్వముననున్న యికారమున కుకారాదేశము గలుగదు గానఁ బూర్వసూత్రముచే బహువచనము పరమగునపుడు తుదియికారమున కుకార మాదేశముగాఁగ 'జిగులు-నిసులు' మున్నగురూపములే సిద్ధించెడిఁ గాని 'జుగులు-నుసులు' అను ననిష్టరూపములు గలుగవని యుపోత్తమేత్వమునకనుటంజేసియను క్రిందివివరణమున కభిప్రాయము. ఇదంతములైన తుదిరెండువర్ణములుగల మూఁడువర్ణములుగల యఖండాచ్ఛిక పదములలో రెండవవర్ణముపై నుండునికారముకారమగునని ఫలితమును గ్రహించునది. సమితి మున్నగు సంస్కృతసమముల కికార్యము వికృతియందనుటంజేసి గలుగదు గానఁ బూర్వసూత్రముచే నుత్వము తుది యిత్వమునకుఁ గల్గి 'సమితు' లనియే గాని 'సముతు' లనురూపము సంభవింపదని యెన్నునది. కిటికీ-బావిలీ మున్నగునవి దేశ్యములగుట వానితుదియచ్చునకు హ్రస్వము గలుఁగ

కున్నను నీసూత్రమున నికారాంతములను సామాన్యోక్తిం జేసి యీకారాంతములు గ్రాహ్యములై వానియుపోత్తమేత్వమున కుత్వము గలుగ కిటికులు-బావులులు-మున్నగురూపములు దుర్వారము లగునని తోఁచెడి. కాన 45 సూత్రమునందువలె నిత్తనుట యావశ్యకము. లేదా 45 సూత్రమునందలి యిత్తనునదే యిందలియికారపదముచే బోధింపఁబడునని యేని గ్రహింపవలసియుండును. ప్రాచీనకవిప్రయోగారూఢము లిట్టివి గామిని సూరి స్మరింపలేదో.

**రలడోపధనవార్థాదులయుపోత్తమేత్వంబున కుత్వంబుగలుగదు. ౮౨**

పందిరి - పందిరులు; పిడికిలి - పిడికిళులు; రాపిడి - రాపిడులు; తొమ్మిది - తొమ్మిదులు

టీ. పూర్వసూత్రముచే నీక్రిందివాని యుపోత్తమేత్వముల కుత్వము నిత్యముగ సిద్ధించుచుండ నొకయనుగమము ప్రయోగానుసారముగ నేర్పఱచి నిషేధించుచున్నాఁడు. 'ర-ల-డ' అనునవి యుపధగాఁ గలపదములయుఁ దొమ్మిది మొదలగు పదముల యునుపోత్తమేత్వమునకు బహువచనము పరమగునపుడుత్వము గలుగదు. పందిరి:—ఇది రోపధము. తుదియచ్చునకు ముందున్నవర్ణ ముపధయని ముందె యుక్తము. రేఫోత్తరవర్తి యగు నికారము తుదియచ్చు. దానికిఁ బూర్వముననున్నవర్ణము రేఫము. కాన రేఫమున కుపధాసంజ్ఞ సిద్ధించెడి. మఱియు నిట్టి రేఫ ముపధగాఁగలపదములందుఁ దుదియికారమునకుఁ బూర్వమున నుండెడియికార ముపోత్తమ మనంబడునుగాన దానికుత్వము గలుగదు. పూర్వసూత్రముచేఁ దుదియిత్వమునకు మాత్ర ముత్వము గలుగ 'పందిర్+ఉ+లు=పందిరులు' అనియే రూపము సిద్ధించునుగాని 'పందురులు' అనునపరూపము గలుగదని గ్రహించునది. పిడికిలి:—ఇది మూఁటికంటె నెక్కుడువర్ణములు గలపదము. లోపధము. ఉత్తమసంజ్ఞకంబగు దీనితుదినున్న యికారమునకుఁ బూర్వమున నున్న యుపోత్తమేకారంబున కుత్వము గలుగదుగానఁ బిడికులులను నపరూపము గలుగక పూర్వసూత్రముచేఁ దుదియికార ముకారమై పిడికిలు లనియే రూపమేర్పడును. ఉపోత్తమపూర్వమునకు విధానమే లేమి నుత్వమద్దానికిఁ గలుగదని గ్రహింపవలయును. పిడికిళులనుటంజేసి ఆచ్ఛిక 13 చే బహుళముగ లకారమున కలఘుళకారమగుట సూచితము. రాపిడి:—ఇది డోపధము. రాపుడులని గాక రాపిడులని రూపమగును. తొమ్మిది:—ఇది నవార్థము. తొమ్మిదిలెక్క దీనిచేఁ జెప్పఁబడునుగాన నిది నవార్థమయ్యెను. తొమ్ముదులని గాక తొమ్మిదు లనురూపమే దీనిచే సిద్ధించెడి. నవార్థాదులనుటంజేసి తొమ్మిదితోఁబాటుగ నాదిశబ్దముచే సంఖ్యావాచకములే బోధ్యములగునని గ్రహింపక ఎనిమిది-పగిది-చెయిది—మున్నగు నుపోత్త్వమేత్వమున కుత్వమునందఁదగని

వెల్ల నిందుఁ జేర్పఁదగునని యాదిశబ్దఫలమును గ్రహించునది. ఇఁక నవార్థము నవార్థ పదముతోడి యాదిశబ్దముచే వాచ్యములును దకారోపధములే యగుటంజేసి నవార్థాదు లనుట సూత్రమున మాని రలడలతోఁబాటుగ దకారమును జేర్చి రలడదోపధంబులకనినఁ జాలునని శంకింపనగును. కాని 'చెలిమి-రాపిడి' అనునుదాహరణములు క్రమముగ 46-47 సూత్రములం దగపడుటంబట్టి తద్ధితాదిప్రత్యయములయోగమునం జేసి యుత్తమోపోత్తమేత్వత్వములు సిద్ధించినపదములవిషయమునఁ గూడ నీవిధులు వర్తించునని విశదమగుచున్నదిగాన మగఁటిమి-పేదటిమి-చూడికి-పోలికి-కోరికి-మున్నగు వానియుపోత్తమేత్వ ముత్వము గాకుండుటకై దోపధమనక నవార్థాదులని యాదిపద మునే సూరి గ్రహించెననుట యుచితము. ఆదిపదవాచ్యముల కివ్విధి యథాప్రయోగ ముగ గ్రాహ్యమని నవార్థాదులనుదళమందలి యాదిపదమునుబట్టి గ్రహించునది.

ఉకారాంత గోశబ్దంబుల కంతటు వువర్ణకంబగు. ౭౭.

తరువు - ధేనువు - మధువు - గోవు. అంతట ననుట స్త్రీలింగ ప్రథ మైకవచనలోపబాధనార్థము.

టీ. 'సర్వత్రోదోతోర్వ్వర్భవతి' అనునది మూలము. హ్రస్వోకార మంతమందుఁ గలశబ్దములకును, గోశబ్దమునకును, నంతటవువర్ణకము ప్రథమైకవచనమున సిద్ధించును. ధేను-గోశబ్దములు స్త్రీలింగములగుటంజేసి 57 చే నిత్యముగఁ బ్రథమైకవచనలోపము సంప్రాప్తముగా దానిని వారింప నంతటనంటినని సూరియే యంతటననుదానికి ఫలమును వ్రాసికొన్నవాఁడు. ఈసూత్రముచే స్త్రీలింగములకుఁ గలుగువువర్ణకము 57 చే లోపింపదని ఫలితము. తరు:—ఇది యుకారాంతపుంలింగము. ప్రథమైకవచనమున వువర్ణకము రాఁగ తరువనురూప మేర్పడును. మధు:—ఇది యుకారాంతనపుంసకము. వువర్ణకము గలుగ మధువని రూపమగును. గో:—ఇది యోకారాంతస్త్రీలింగము. వువర్ణకము దీనిచే సిద్ధింప 'గోవు' అని యగును. అంతట ననుటంజేసి 57 చే వువర్ణక లోపము రాదనియు దాన ధేను-గో-అనుననిష్టరూపము లేర్పడవనియు గ్రహించునది. మూలము 'ఓతోః' అని యోకారాంతములకెల్ల వువర్ణకము విధించుచున్నను నోకా రాంతములందు గోశబ్దమొక్కటియే వువర్ణకమునందుట కర్హమై యగపడుచుండుటం జేసి సూరి 'ఓతోః' అనుదళము నాదరింపక దానిస్థానమున గోశబ్దమును మాత్రమే నిలిపెనని గ్రహించునది. 'రై-గ్లౌ' అనువానికిఁ బక్షమున 64 చే నోకారాంతత సిద్ధించినను 44 చే నోకారాంతములగు నవ్వాని ప్రథమైకవచనము నిత్యముగ లోపించుటం జేసి వువర్ణకాంతము లై యవి గన్పట్టవని యెన్నునది. మూలము మువర్ణకమువలెనే వువ

ర్ణమును బ్రత్యయాగమరూపముగ సిద్ధించుననుటను సర్వత్రయనఁగా సూరి దానిని బ్రథమైకవచనలోపబాధనార్థమని పరిగణించెను. 51 చే మహత్తుల కుదంతములకుఁ బక్షమున డుజ్జు కలుగుననుమాట మఱువరాదు. ఈకార్యము మహతీమహదమహద్వాచకములైన సహజోదంతముల కయ్యెడి. ఉగాగమాంతంబులకు 44 చేఁ బ్రథమైకవచన లోపము గల్గుఁగాన నవి వువర్ణకార్హములు గాఁజాలవు. 'స్త్రీలింగములు గాని యుదంతములగు నమహద్వాచకములకుఁ గొన్నింటికి తరు బాహు మున్నగువానికి వువర్ణకము వికల్పముగఁ గలుగుటయు రాహు అనుదానికిని, నట్లె వువర్ణకాభావ మగపడుటయు నుదంతములు కానివానికిఁ గొన్నింటికి ధర్మువు కర్మువిత్యాదుల కుత్వవువర్ణకములు వికల్పముగ నగుటయుఁ బ్రయోగసిద్ధములై యుండుటచేఁ గొన్నియదంతములకును, అర్ఘువు - అసంబుద్ధౌ భవేద్వావుర స్త్రియామ్ - భవేద్ధర్మాదిశబ్దానాం ముశ్చవుశ్చాత్ర కుత్రచిత్' అనునథర్వణకారికల ననుసరించి ప్రౌఢవ్యాకర్త రాహుబాహుశబ్దముల కంతట లోపంబు వైకల్పికంబు - అర్ఘాదులకడయచ్చున కుత్వంబును మీఁద వువర్ణకమును వైకల్పికముగా నగునని సోదాహరణముగ సూత్రించి సాధుత్వమును బైవానికిఁ గల్పించి సూరి యీసూత్రమును సవరించెను. ఈప్రయోగములు మీఁదిసూత్రమునందలి బహుళగ్రహణముచే సాధ్యములగునని కొందఱంద్రు. ప్రథమైకవచనమునను బైవానికి వువర్ణకము వికల్పముగఁ గలుగవలసియున్నదిగాన బహువచనము పరమగునపుడు వుగాగమమును విధించుసూత్రమునందలి బహుళగ్రహణముంబట్టి యేకవచనమున వువర్ణకవికల్పత సాధించుట యయుక్తికమని తోఁచెడి. ఆపక్షమువారు మఱియొకలాఁగగునను బహుళప్రయోజనమని యెంచి పైరూపముల సాధింతురని తలంపవలయును. పుట్టువు మున్నగు తెలుఁగు నుదంతములకును వువర్ణకము చూపట్టెడిఁ గాన నీవిధి యుదంతసామాన్యపర మనఁదగు.

## వువర్ణకేతరవిభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు. ౪౯.

తరువులు - తరులు - ధేనువులు - ధేనులు - గోవులు.

టీ. 'ఉటోతోర్వ్యర్భపతి మువత్' అనుదానియందలి 'మువత్' అనుదళ మిట్లు సూత్రించుటకు బీజము. ఉకారాంతములకుఁ బ్రథమైకవచనమునఁ దప్పఁ దక్కిన యితరవిభక్తుల యేకవచనబహువచనములు పరముగాఁగ వుగాగమము వికల్పముగను గోశబ్దమున కంతట నిత్యముగను గలుగునని యర్థము. తరు+లు:—'తరు' అనునదుకారాంతము. దీనికి బహువచనప్రత్యయము లువర్ణకము పరముగాఁ బ్రకృతి కంతావయవ

ముగ వువర్ణకమాగమముగఁ గలుగ తరు+వు+లు=తరువులనురూపము సిద్ధించును. వుగాగమము వికల్పముగ నగునదిగాన నది రానిపక్షమున తరులని రూపమగును. ఇట్లే తరువులను-తరులను. తరువుచేత-తరుచేత. మున్నగురూపము లూహ్యములు. తక్కినయుదాహృతులప్రక్రియ నిట్లే గమనించునది. 48-49 సూత్రములందుదంతమనక యుకారమని సామాన్యముగ ననుటంజేసి యూకారాంతైకాక్షరశబ్దములకును నికార్యము గలిగి భ్రూవుమున్నగు రూపములు సిద్ధించెడి. ఏకాక్షరశబ్దములు గానివానికి హ్రస్వము సిద్ధించెడిఁగాన నుదంతములే యగును. కకారపొల్లుగూర్చినది యంతావయవముగ నగునను మాటను నాగమమన మఱియొకవర్ణ మధికముగఁ గలుగుననునుక్తిని మఱువరాదు.

ఉకారాంతంబగు మహత్తునకు వువర్ణకము బహుళముగానగు. ౫౦

విష్ణువు-విష్ణుఁడు; శంభువు-శంభుఁడు; వసువు-వసుఁడు.

టీ. 'డుజ్మహత్పదానాం వా' అనునది మూలము. ఉకారాంతమైన మహద్వాచకమునకుఁ బ్రథమైకవచనమున వువర్ణకము బహుళముగ నగును. వువర్ణకము గలుగనిపక్షమున 22 చే డుజ్జు సిద్ధించెడి. వువర్ణకము గల్గినపక్షమున వువర్ణకేతరవిభక్తులు పరములగునపుడు 49 చే వుగాగమమును డుజ్వర్ణకము సిద్ధించినపక్షమునఁ బ్రథమైకవచనేతరస్థలముల లులని మున్నగుడుమంతకార్యములను గమనించుచుఁ బ్రక్రియ నూహించికొనవలయును. శంభు:—ఇది యుదంత మహద్వాచకము. దీని కీసూత్రముచే వువర్ణకము గలుగ శంభువగును. ఇది రానిపక్షమున 22చే శంభుఁ డగును. ఇట్లే తక్కిన వానిప్రక్రియను గమనించునది. చాత్తాదవైష్ణవుఁడుగాన సూరి విష్ణువను నుదాహృతిని దొలుత నుంచెనని తోఁచెడి. స్వయంభువు-మనువు-మధువు-పటువు మున్నగు నుకారాంత మహద్వాచకములకుఁ డుజ్వర్ణకముతోఁ బ్రయోగమగపడమి నిందలిబహుళగ్రహణమునంజేసి వువర్ణకము వానికి నిత్యమని కొందఱండ్రు. కావచ్చును. కాని సూరి వివరింపమికిఁ గతమగపడదు. 'మనుపట్వాదిశబ్దానాం నుడుజ్నిశ్చ ప్రయుజ్యతే' అని యథర్వణుఁడు మూలమును వివరించి పైమహద్వాచకములకు వువర్ణకము నిత్యముగ నగునని శాసించినవాఁడు. కేతన యథర్వణునిత్రోవనే యనుసరించినాఁడు. అహో బలునిమార్గ మట్టిదియె. కాని 'మధు - పటు' అనునవి డుమంతములైనట్లు 'చంద స్ఫూర్తి పటుండు గాంచె' అను మున్నగు భాగవతవైజయంతీవిలాసాదికావ్యప్రయోగములవలన విశదమయ్యెడి. సూరి యిట్టిచిక్కును గమనించియే కావలయుఁ బ్రాచీనప్రయోగసరణినిబట్టి యిట్టివానివిషయమున నేమియు వ్రాయక నిపుణముగ సూత్రమున బహుళపదముం గూర్చి వానిప్రక్రియను గమనించుభారము పాఠకులపైనే

మోఁపినాఁడు. కానఁ బ్రయోగానుసారముగ నుదంతమహద్వాచకముల వుడుజ్వర్ణకములసంభవమును బహుళపదముంజేసి పాఠకులు గమనింపవలెనని ఫలితము తేలెడి.

## కద్రువ నాగమాత ౫౧.

కద్రువ - కద్రువలు - కద్రువను - కద్రువలను.

టీ. నాగులతల్లి కద్రూశబ్దముచేఁ జెప్పఁబడినపుడు 'కద్రువ' అని యదంతవకారాంత మై యుండునని తాత్పర్యము. ఇట్లే తక్కినవిభక్తివచనములందును నదంతవకారాంతమై 'కద్రువలు-కద్రువలను-కద్రువలచేత' అని యుండును. ఊకారాంతవిధియగు 48 చే సాధింపరామి దీనిని నిపతించి సాధించెనని గ్రహించునది. శాస్త్రముచే సాధింపగానిదాని నిట్లుండునని శాసించుట నిపతించుట. ఊకారాంతములలో నేదియు నదంతవకారముతుదినందునది లేమి నిది నిపతనార్హమయ్యెను. ఇది నాగమాతను జెప్పునది గాక గోరోచనాద్యర్థకమగునపుడు 'కద్రువు' అని వుపర్ణాంతంబై 48 కి విషయమై రూపమగునని యెన్నునది.

## ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబునగు. ౫౨

భ్రాత-జామాత-కర్త-భర్త-హర్త-గంత-హంత.

టీ. ఋకారాంతములగు ప్రకృతులతుది ఋకారమునకు అకార మాదేశమగును. మఱియు నట్లకారాదేశమునందిన యాపదములు స్త్రీలింగములవంటివియు నగును. స్త్రీవద్భావము=స్త్రీలింగశబ్దధర్మము. ఋకారము హల్లుపై వట్రువరూపముగ నుండుననుట స్పష్టము. ఋకారాంతంబున కనుజాత్యేకవచనసామాన్యోక్తింజేసి మహదమహద్వాచకములగు ఋకారాంతముల కెల్ల నత్వస్త్రీవద్భావముల నివ్విధి విధించెడి. భ్రాతృ:—ఇది మహద్వాచకమగు ఋకారాంతము. దీనికి 22 చే నిత్యముగ డుజ్వర్ణకము ప్రాప్తించుచుండఁ దద్వారణార్థము నీవిధిచే నత్వస్త్రీవద్భావములు విధింపఁబడియెను. మీఁదిసూత్రముచే ఋకారాంతములైన విధాత్రాదుల కత్వస్త్రీవద్భావములు విభాష నగుంగానఁ బక్షమున డుజ్వర్ణకమును నట్టివాని కేర్పడియెడి. 57 చే నిత్యముగఁ బ్రథమైకవచనము లోపించుటయే స్త్రీవద్భావమును విధించుటకు ఫలము. భ్రాతృ:—దీనితుదిఋకారమున కకార మాదేశముగాఁగ 'భ్రాత్ + అ=భ్రాత' అని యగును. స్త్రీవద్భావాతిదేశమునంజేసి 57 చే నిత్యముగఁ బ్రథమైకవచనలోపము గలుగ 'భ్రాత' యని రూపము సిద్ధించును. స్త్రీవద్భావ నిత్య విధానమునంజేసి యిది మహద్వాచకమైనను నితరవిభక్తివచనములందును స్త్రీలింగశబ్దకార్యములేగాని డుమంతమహత్కార్యములు న్యాగమాదులు సిద్ధింపవనియు దాన భ్రాతలు - భ్రాతలను భ్రాతచేత మున్నగురూపములే యేర్పడునని గ్రహింపవలెను. రూపసాధనముకొఱకే స్త్రీత్వవిధా

నముగాని యిట్టి యతిదిష్ట లింగశబ్దముల విశేషణములకు మాత్రము స్త్రీత్వాదులు గలుగ వని 'విశేష్యమాత్రే స్త్రీతా స్యాత్ దుఙ్ఘాస్యాతాం చ భేదకే' అను నాథర్వణోక్తిం బట్టి యవశ్యమంగీకరింపఁదగు. అత్వస్త్రీత్వవిధానము లుత్వదుఙ్ఙులను మహదృకారాంతములకును, నందు స్త్రీత్వము ముపర్ణకాదుల నమహదత్వాంతఋకారాంతములకును, గలుగకుండుటకే విధింపఁబడినవిగాన నీవిధిచే నదంతములైనపిదప మరల నుత్వాదులు రారాదాయని శంకింప నవకాశమే లేదు. ఇట్లే యీవిధిచే స్త్రీవద్భావమునంది యదంతములైన యమహద్వాచకములగు ఋకారాంతములకు 39 చే ముపర్ణకాదులు గలుగు నని సంభావింపరాదు. దీర్ఘమగు ఋూకారము మృగ్యమగుటఁ దదంతముల ప్రక్రియా విషయమున శంకయే లేదు. మూలము డాప్ ప్రత్యయమును 'డాబవిధాత్రాదేరుః' అని విధాత్రాది వ్యతిరిక్తములగు ఋకారాంతములకు నిత్యముగ విధించి యిట్టిరూపములను సాధించెను. మఱియుఁ విధాత్రాదులకు 'తస్య చ వా' అని సూత్రించి పక్షమున దుఙాదులఁగూర్చి కృతార్థమయ్యెను. మూలముపక్షమున 'దీర్ఘాణాం హ్రస్వఃస్యాత్' అనుదానిచే నాకారాంతములకు హ్రస్వము సిద్ధించును. 'డాప్' అనునది డకారము పోవు ప్రత్యయముగాన (డిత్తు) నది తుదినున్న సంస్కృతవ్యాకృతిపద్ధతిని టిసంజ్ఞక మగునట్టి ఋకారమును లోపింపఁజేసి యగునని గ్రహింపవలెను. దీన 'డాబవిధాత్రాదే రుః' అనునది దీనికి మూలమని ఫలితము తేలెడి. మూలము సంస్కృతవ్యాకృతి పద్ధతింబట్టి స్త్రీత్వముం గూర్చుటకే 'డాప్' అనెనని యెంచియో, డాప్ప్రత్యయాంతములు హ్రస్వాంతములైనను దుపర్ణకాదులు స్త్రీత్వవిధానము లేక దుర్వారములె యగు నని తలంచియొ, సూరి యత్వస్త్రీత్వవిధానమె యిట్టి రూపములసాధింప క్షమమనియెంచి యిట్లు సూత్రించె. తక్కిన వాని ప్రక్రియను భ్రాతయను రూపమునట్లే గమనించునది. మహతీవాచకములగు ఋకారాంతములు జీప్రత్యయమును నిత్యముగ సంస్కృతవ్యాకృతిపద్ధతి ననుసరించి యందఁ దగినవి, 85 చే స్త్రీప్రత్యయసహితము లైయే యిందుఁ బ్రవేశింప నర్హములగుటంజేసి యట్టి శబ్దములు ఋకారాంతములై తెలుఁగున నగపడుటయే గుదురమి నవి యీసూత్రమునకు విషయములు గాఁజాలవని గ్రహించునది. కాఁగా జీప్ప్రత్యయాంతములు గాఁజాలని విధాత్రాదులకంటె నితరములగు, మహదమహదృకారాంతము లీసూత్రమునకు విషయములని ఫలితము నెన్నునది, దాన స్వసృ-మాతృ-పితృ - పౌత్రృ-మున్నగునవి యిందె చేరఁదగినవయ్యెడి.

**విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వస్త్రీవద్భావంబులు విభాషనగు. ౫౩.**

విధాత - విధాతృఁడు - ధాత - ధాతృఁడు - దాత-దాతృఁడు - సవిత - సవితృఁడు - నేత - నేతృఁడు.

టీ. 'అవిధాత్రాదేః, తస్య చ వా' అనుమూలమును, 'విధాతా సవితా ధాతా నేతా దాతా చ వాడుజి, భవంతి సవిధాత్రాదిస్తదన్యేన డుజిస్థితాః' అని విధాత్రాదిగణ మిది యని వివరించునాథర్వణము మూలము. సూరియు నీయైదుశబ్దములనే వికల్పముగ డుజ్జునంద నర్హములని లెక్కించుట చింతామ ణ్యాథర్వణకారి కావహోబలపండితీయములనె మూలముగఁ గొనెననుట లోకపరమప్రమాణము. మహద్వాచకములై ఋకారాంతములైన యీయైదు ప్రకృతులకు (విధాతృ-ధాతృ-దాతృ-సవితృ-నేతృ-) 52 చే నగు నత్వస్త్రీవద్భావములు వికల్పముగ నగును. అత్వస్త్రీవద్భావములు గలుగని పక్షమున మహత్తులగు వీనికి డుజ్వర్ణకము న్యాగమాది డుమంతకార్యములు సంభవింప విధాతృఁడు - విధాతృలు - విధాతృలను-విధాతృనిచేత మున్నగురూపములు గలిగెడి. అత్వస్త్రీవద్భావములు గల్గునెడల విధాత-విధాతలు - విధాతలను - విధాతచేత అను మున్నగురూపములు సిద్ధించెడి. ఇట్లే తక్కిననాల్గుదాహరణముల ప్రక్రియను గమనించునది. జీబంతములు గాఁజాలని విధాత్రాదిపంచకవ్యతిరిక్తములైన ఋకారాంతములెల్లఁ బూర్వసూత్రమునకు విషయములనియు మహద్వాచక విధాత్రాదిశబ్దపంచకమిద్దానికి విషయమగుననియు ఫలితమును గ్రహించునది.

## నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వంబగు. ౫౮.

రమా - రమ - వనితా - వనిత - విద్యా - విద్య - లక్ష్మీ - లక్ష్మి- సేనానీ- సేనాని. ఇట్లు కృతహ్రస్వములకు హ్రస్వాంతములకుఁ బోలెఁ గార్యంబగు. లక్ష్ములు - సేనానులు - సిరులు.

టీ. 'దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్' అనునది మూలము. నామమనఁగాఁ బ్రాతిపదికమనుమాట పూర్వమేయుక్తము. ప్రాతిపదికమనఁ బ్రత్యయము చేరని ప్రకృతి. ప్రాతిపదికముల తుదినున్నదీర్ఘము హ్రస్వమగును. హ్రస్వదీర్ఘత్వము లచ్చుధర్మములుగానఁ బ్రాతిపదికముల తుదివర్ణములపై నున్నయచ్చు పొట్టిదగుననియుఁ దన్మూలమున నాయచ్చున కాశ్రయమైనహల్లును హ్రస్వమగుననియు గ్రహించునది. ఈయచ్చాయచ్చను భేదము లేక యెల్లయచ్చులును బ్రాతిపదికముల తుదినున్నవి హ్రస్వములగును. హ్రస్వరూపములం జెందఁదగిన దీర్ఘాచ్చులకే యీవిధానము. దాన ఐఔలు దీర్ఘాచ్చులైనను వానికి హ్రస్వరూపము లేమిని హ్రస్వము సిద్ధింపదు. మఱియు శాస్త్రసిద్ధములైన దీర్ఘాంతములకు (రై-గ్లౌ) నిట్టివానియోకారవిధానమునకు వ్యర్థత కలుగుంగాన హ్రస్వము గలుగదు. ఏదంతము లగపడవుగాన వానివిషయమునఁ బ్రశ్నయే లేదు. ఇఁక సామాన్యముగ దీర్ఘములై ప్రాతిపదికములతుది నగపడునవి 'ఆ-ఈ-ఊ' అనునచ్చులే

యగుంగాన వానికీసూత్రముచే హ్రస్వము సిద్ధించెడి. దీర్ఘాంతములను బ్రాతిపదికములుగా గ్రహించి సమములను సిద్ధింపఁ జేయు ప్రక్రియ యిది. రమా:—తుదియాకారము హ్రస్వముగా 'రమ'యగును. ఇది యాకారము హ్రస్వమగుట కుదాహరణము. ఇట్లే తక్కిన యాకారాంతములకు హ్రస్వమూహ్యము. లక్ష్మీ-సేనానీ:—ఇవి యీకారాంతముల తుదియీకారము హ్రస్వమగుట కుదాహృతులు. దీనిచే హ్రస్వము గలుగ 'లక్ష్మి-సేనాని' యనురూపము లేర్పడును. ఇట్లే వధూ మున్నగునూదంతముల దుదియూకారమునకు హ్రస్వము గలుగుటను గమనించునది. ఇట్లు దీనిచే హ్రస్వము చేయఁబడి హ్రస్వాంతములైన యాయాయచ్చులుగల ప్రకృతులకు మహదమహాన్మహతీవాచకత్వములను, బుంస్త్రీనపుంసకలింగత్వములను,యత్వేతోత్వాంతత్వములను, ననుసరించి యాయాకార్యవిశేషములను జెప్పు నాయావిధులచే నాయాకార్యములు గలుగునని గ్రహించునది. హ్రస్వము లైనపిదప హ్రస్వాంతములకుఁ గలుగు శాస్త్రప్రాప్తములగుకార్యముల కవి పాలగునని భావము. రమ:—హ్రస్వాంతమైనదినికి 57 చేఁ బ్రథమైకవచనము నిత్యముగ లోపించుటయే యీనిత్యవిధానమునకు ఫలము. లక్ష్మి:—ఇది హ్రస్వేకారాంతమయ్యెఁగాన నిగ్లొసూత్రముచేఁ బ్రథమైకవచనలోపమును, 45 సూత్రముచే బహువచనము పరమగునపుడుత్వమును జెంది లక్ష్మి-లక్ష్ములు-లక్ష్ములను-లక్ష్మిచేత - లక్ష్ములచేత - మున్నగురూపముల నాయావిభక్తులం దందుటయే యీనిత్యహ్రస్వవిధానమునకు ఫలము. ఇట్లే సేనానీశబ్దమునకు నిత్యముగ హ్రస్వముంగూర్చుటలో ఫలమును గ్రహించునది. ఊదంతమైన వధూమున్నగునవి హ్రస్వాంతములై 48 చే వువర్ణకాదులను యథాసంభవముగ నందఁదగునవగుటయే యేతన్నిత్యహ్రస్వవిధాన ఫలమగును. కృతహ్రస్వంబగునను సూత్రివివరణమునకుఁ బైని వివరించినదే యభిప్రాయము. మీఁదిసూత్రము ననుసరించి యేకాక్షరముల తుది దీర్ఘమునకు హ్రస్వము రాదు. రమా - సేనాని - అనునుదాహరణముల ననుసరించి పుంస్త్రీలింగములైన మహతీమహదమహద్వాచకములైన దీర్ఘాంతముల కీకార్యము గలుగునని ఫలితము తేలుచున్నది. దీర్ఘాంతములు నపుంసకములు గానరామి వానిని దలంపఁబని లేదు. వనిత - రమ:—మహతీవాచకస్త్రీలింగములు. విద్య:—అమహత్స్త్రీలింగము. సేనానీ:—మహద్వాచకపుంలింగము-ఉదాహరణసారస్యము ననుసరించి వ్యస్తములకే యీవిధి యనుట స్పష్టము. కాని 'నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్; నలినరజస్సుగంధియమునానదితుంగతరంగములు;' అను నన్నయప్రయోగములంబట్టి సమాసగత దీర్ఘాంతబహ్వక్షరశబ్దములకును హ్రస్వము గలుగునని తెలియఁదగును. ఇట్టివానిం బరికించియే కావలయు నథర్వణుఁడు 'హ్రస్వో దీర్ఘసమాసేఽపి క్వచిన్నిపః ప్రయోగతః' అని

మూలమును సవరించి పైవానికి సాధుత్వమిడెను. జీబంతమునకు మాత్రమే యాతఁడు సాధుత్వమును బ్రసాదించుటంజేసి 'మహిమంగలతమసతీరసికతావిలసనములు' అను సూరనప్రయోగము ప్రకారాంతరమున సాధించికొనవలసియుండును. ఈకారాకారాంతములైన సంజ్ఞావాచకములకుఁ గొన్నింటికి రేవతిపుత్త్రుఁడు; అజక్షీరము; మున్నగువానికి హ్రస్వమును సంస్కృతవ్యాకర్తలే ప్రసాదించుటంజేసి పైప్రయోగములు నిర్బాధములయ్యెడి. మఱియుం "తి"అనువర్ణ మంతమందుఁగల క్తిన్ప్రత్యయాంతములు దప్పఁ దక్కిన కృదంతాకృదంతేకారాంతములెల్ల హ్రస్వదీర్ఘాంతము లుభయములు నయ్యెడినని సంస్కృతవ్యాకర్తలే శాసించియుండుటచే 'కనకక్షోణిధరంబు కార్ముకముగా; ధరణిధవదత్తనివిధోపధ; పురంధ్రివర్గయుంతయై;' అను శ్రీనాథ-కృష్ణరాయ-రామరాజభూషణప్రయోగములు సురక్షితములయ్యెడి. పైప్రయోగవ్యాకృతులఁ జాడఁజూడ హ్రస్వదీర్ఘాంతశబ్దవిపర్యయ మాదినుండి యుభయభాషావాఙ్మయములందు ఛందోనిరోధమునంజేసి కవులొనర్పఁ గన్పట్టెడినని ఫలితము తేలినది.

## ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు. ౫౫

క్ష్మా - మా - భా - శ్రీ - స్త్రీ - హ్రీ - ధీ - భీ - భ్రూవు.

టీ 'న చైకవర్ణేఽపి' అనునది మూలము. ఏకాచ్చుగల లేక యేకాక్షరములైన ప్రకృతులతుదిదీర్ఘమునకు హ్రస్వమగును. పూర్వసూత్రప్రాప్తహ్రస్వకార్యమునకీనిషేధము. ఏకాక్షరశబ్దము లేదీర్ఘాచ్చును గలిగియున్నను నీనిషేధమునకుఁ బాలగుననియే తలంపవలెను. క్ష్మా:—దీనికి హ్రస్వము గలుగదుగాన క్ష్మా-క్ష్మా చేత మున్నగురూపములె గలుగునని గ్రహించునది. ఇట్లే తక్కినదీర్ఘాజంతైకాక్షరశబ్దములప్రక్రియాదు లూహ్యములు. ఇందలి యుదాహృతులు నుహాత్యమహద్వాచకస్త్రీలింగములు. ఈయేకాక్షరశబ్దములు సమాసాంతముల నున్నపుడును, సమాసపదమును బహ్వక్షరముగా నెంచి హ్రస్వము పూర్వసూత్రముచే వానికిఁ జేయరాదని 'కాంపలియై సురరాజ్యశ్రీవాలింపంగ; సకలక్ష్మానేలె;' అను ప్రయోగములు తెలిపెడి. ఇది కేవలము తత్సమములకు సంబంధించిన పరిచ్ఛేదమని తలంచియొ పూర్వసూత్రము కేవలసంస్కృతసమములవిషయ మగుట దేశ్యముల కాసూత్రముచే హ్రస్వప్రాప్తియే లేదని యెంచియొ దీర్ఘాంతదేశ్యములు ప్రాచీనవాఙ్మయాదృష్టములని భావించియొ పిదపఁ గల్గినను నట్టి వత్యల్పములని యెంచియొ మూలము 'న చ దేశ్యపదే' అని దేశ్యములకు హ్రస్వము గలుగదని స్పష్టపఱచుచున్నను దదనుసారియయ్యు సూరి వానిమాట నీసందర్భమునఁ దలంపఁడయ్యెను. సామాన్యముగ నీపరిచ్ఛేదము సంస్కృతసమములకు సంబంధించినదైనను బ్రత్యయాగమాది సామాన్యకార్యములు తత్తద్దేశ్యములకును గలుగవలసియుండుటంజేసియు, 43-45

సూత్రములందు యథాక్రమముగ పగడాలు, లకోరీలని యుదాహరించియే తత్పరిచ్ఛేద గత సూత్రములచే నగుకార్యములు వలసినచో దేశ్యములకును గలుగునని సూరియే సూచించియుండుటంజేసియు, 46-47 సూత్రములు కేవలమాచ్ఛికశబ్దములకు సంబంధించినవగుటంజేసియు, 54 విధిచే దీర్ఘాంతదేశ్యములకును పూర్వవిధిచే హ్రస్వము సంప్రాప్తమగుననియే తలంచి దేశ్యములకు హ్రస్వము గలుగదని సూత్రించి నవలా - నేజా-కిటికీ మున్నగువానికి హ్రస్వరూపములు గాకుండ నడ్డుటయే చింతామణ్యనుసారి యగుసూరికి విధియని యనక తీరదు. అన్యదేశ్యములు పైతిణీ మున్నగునవి యీతనిసమ్మతిని బొందనివగుట వాని నీవిషయమునఁ దలంపకుండుట యుచితము గావచ్చును. కాఁగా దేశ్యాన్యదేశ్యములు దీర్ఘాంతములు బహ్వక్షరశబ్దములైనను వానికి దీర్ఘము సామాన్యముగఁ గలుగదని తేలినది. కాని 'హ్రస్వో దేశ్యే తు వా క్వచిత్' అని యథర్వణుఁడు దీర్ఘాంతదేశ్యములకును గొన్నియెడల హ్రస్వమును శాసించి 'కల్వలకోరియు; చక్కెరఖాణపుఁదేజి; మున్నగువానికిఁ గతి కల్పించుచుండ సూరి యట్టివానిం దలంపకుండుట చింత్యమనకతీరదు. మఱియు సమాసాంతగతైకాక్షరదీర్ఘాంతసంస్కృతసమములకును గొండొకచో 'నిస్తులాస్యశ్రీవయస్త్సంభనితీష్టనింబచ్ఛదభ్రువు' అని హ్రస్వము గానంబడియెడి. కానఁ బైసందర్భము ననుసరించి 54-55 సూత్రములలో నేదానియందేని బహుళపదముంజేర్చి యథాసంభవముగఁ బ్రయోగసాధనమునకు దారిఁజూపుట యుచితమని తోఁచెడి.

## వృద్ధాదుల డుజ్జునకు లోపము విభాషనగు. ౫౬.

వృద్ధు - వృద్ధుఁడు - మూర్ఖు - మూర్ఖుఁడు - నీచు - నీచుఁడు - గృహస్థు - గృహస్థుఁడు - చార్వాకు - చార్వాకుఁడు.

టీ. 'ధూర్తమూర్ఖా నీచవృద్ధావుదంతావపి సమ్మతౌ, ఉత్వే నైవ భవంత్యన్యే' అనునాథర్వణము మూలము. మహద్వాచకములై పుంలింగములై యదంతములై యంత్వడుజ్జులనంది వృద్ధుఁడను నిట్టిరూపములఁ బ్రథమైకవచనమునఁ బెందెదుశబ్దముల ప్రథమైకవచన ప్రత్యయమగు డుజ్జునకు లోపము వికల్పముగ నగును. ఉత్వడుజ్జులు పరస్పరాశ్రితములు గామి ననఁగా నొకదానిరాక కొకటి యాధారము గామిని డుజ్జు లోపించినపు డుత్వము నిల్చియుండునని గ్రహించునది. డుజ్జునందలి జిత్వము సాధారముగఁ గొని డుజ్జునకుఁ బూర్వము బిందువు గలిగెఁగాన నాశ్రయము లోపించుటంజేసి యదియుఁ బోవునని సూరి యెంచి దానికి లోపమును జెప్పలేదని యెన్నునది. ఉదంతరూపసంపాదనార్థమే యీసూత్రముత్పన్నమయ్యెఁ గాన డుజ్వర్ణ

కము లోపింప శేషించిన యిట్టికృత్తిమోదంతములకు వువర్ణకము గలుగదని గ్రహింప వలెను. వృద్ధాదులనుటంజేసి యదంతమహద్వాచకముల దుజ్వర్ణకమే లోపించెడిఁగాని యుదంతమహద్వాచకములకుఁ బక్షమున నైన దుజ్వర్ణకము లోపింపదనియు దాన శంభుమున్నగురూపములు గలుగవనియు గ్రహింపవలెను. దుజ్జునకు మాత్రమే లోపము విధింపఁబడుటంజేసియుఁ బక్షమున దుజ్వర్ణకముతోడి రూపములే సిద్ధించుచుండుటంజేసియు దుజ్వర్ణకలోపము గల్గినపుడును, దుమంతకార్యములు న్యాగమాదులు వీనికి సిద్ధించుననియే యెన్నవలెను. ఇందులకే స్త్రీత్వమును విధింపక దుజ్లోపమునే సూత్రించె నని ఫలము నెన్నునది. వృద్ధుఁడు:—ఇందు దుజ్వర్ణకము బిందువుతోడ లోపింప 'వృద్ధు' అని రూపమగును. ఇట్లే తక్కినవూహ్యములు. ఆథర్వణునన్యశబ్దముచే నదంత పుంలింగమహద్వాచకములకే గాక రూపు (రూపము) మున్నగువానికిఁ గూడ నుత్వ రూపమును గూర్చెడి. సూరి యట్టివానిని దద్భవములుగ నెంచి గావలయు నుపేక్షించెను. చింతామణి యిట్టిరూపములను గంఠోక్తముగ సాధింపలేదు. నన్నయభారత ప్రయోగము లిట్టి వగపడుటంజేసి కావలయు 'దుజ్మహత్పదానాం వా' అనుసూత్రపు వ్యాఖ్యలో నథర్వణకారికాధారమున నహోబలుఁడు సాధించె. చూ. అహోబ, ప. 293 పుట.

## స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు, ౫౭

రమ - క్షమ - వనిత - ఘనత - విద్య - దేవత - మీననేత్ర.

టీ. 'అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః.' అనునది మూలము. స్త్రీలింగములైన సంస్కృతప్రకృతుల ప్రథమైకవచనప్రత్యయము లోపించును. ఇదంతములెల్ల నిగ్లాసూత్రవిషయములు. ఉదంతము లుకారాంతగోశబ్దసూత్ర విహిత వువర్ణకవిషయములు. ఋకారాంతములు స్వస్వనియతస్త్రీప్రత్యయములం గూడి వచ్చునవియై 54 చే నిదంతములై యిగ్లా సూత్రవిషయములగునవి, కొన్నియు నత్వ స్త్రీవద్భావవిషయములైనవి కొన్నియు నగును. తక్కిన యచ్చు లంతములఁగల స్త్రీలింగశబ్దము లప్రసిద్ధములు. ఇఁక నాకారాంతములై 54 చే హ్రస్వములైన స్త్రీలింగశబ్దములును, నత్వస్త్రీవద్భావములనంది యదంతములైన యతిదిష్టస్త్రీలింగ శబ్దములును యీసూత్రముచేఁ బ్రథమైకవచనలోపము నందుట కర్హములని పరిశేషన్యాయమునఁ దేలినది. కావుననే యిందలియుదాహృతులెల్ల నదంతములుగనే చూపఁబడెను. ప్రకృతి స్త్రీలింగమైనఁ జాలును. మహదమహద్వాచకములలో నేదైనను బాధలేదు. రమా:—ఇది యాకారాంతస్త్రీలింగము. మహతీవాచకము. 54 చే హ్రస్వము దీనిచేఁ బ్రథమైకవచనలోపము గలుగ 'రమ' యని యగును.

స్త్రీతిర్యగ్జడ భిన్నంబను సూత్రముచే నిది యమహద్వాచక మయ్యెడిఁగానఁ బ్రథమైక వచనమున ముపర్ణక మమహన్నపుంసకసూత్రముచేఁ గలుగవలసి యున్నదిగాన నట్టి ముపర్ణరూపమును సంభవింపకుండఁజేయుటకే యీసూత్రము ప్రారబ్ధమయ్యెనని గ్రహించునది. కాఁగా సంప్రాప్తకముపర్ణకమును గానరాకుండఁజేయుటకే యీవిధియన్నపుడు, మహతీవాచకాదంతములకు ముపర్ణకేతరవిభక్తి పరమగునపుడగు ముగాగమమును లోపింపఁజేయుటకును, నీప్రథమైకవచనలోపవిధి నుపలక్షణముగా నెన్ని పైవానికిఁగల్గు ముగాగమమును నిత్యముగ లోపింపఁజేయవలె ననక తీరదు. ఘనతా:— ఇందు 'తా' అనునది భావార్థమున సంస్కృతవ్యాకృతిచే నైన ప్రత్యయము. అమహద్వాచకము. స్త్రీలింగము. హ్రస్వప్రథమైకవచనలోపములు గలుగ 'ఘనత' యని రూపమగును. మీననేత్రా:— సంయుక్తాక్షరము తుదినున్నశబ్దముగాన నిది సంస్కృతవ్యాకృతిసరణిని, స్త్రీలింగబోధకాకార ప్రత్యయయుతమై యాకారాంతమే యగును. ఇందులకు 85 సూత్రముక్రింది సూరివివరణమును దానిటీకయుఁ నరయునది. హ్రస్వప్రథమైకవచన లోపములు గలుగ 'మీననేత్ర' యగును. ఇట్లే తక్కినవూహ్యములు.

చరిత్రాదుల ముపర్ణకంబునకు లోపంబు బహుళంబుగానగు. ౫౪

చరిత్ర - చరిత్రము - చరిత - చరితము. అలక - అభిలాష - అక్షత - ఘోష - తరంగ - భ్రమ - విజృంభణ - వధ - వేగ - స్ఫురణ- హాస - ఇత్యాదులు చరిత్రాదులు. బాహుళకమువలన దర్భాదులకు ములోపంబు నిత్యంబు. దర్భ - పనస - ఇత్యాదులు.

టీ. 'చరితాదికశబ్దానాం రూపం తూభయథా భవేత్' అను నాథర్వణము మూలము. చరిత్రాదిగణ మాకృతిగణము. అమహన్నపుంసకసూత్రముచే ముపర్ణకము నందఁదగిన యదంతములే యిందుఁ జేరఁదగు ననునంశమును యిందలి యుదాహరణములే స్పష్టపఱచుచున్నవి. అందును బ్రయోగానుసారముగ నీముపర్ణకలోపవిధిని బాలకు లుపయోగించికొనవలయు ననుట కిందలి బహుళగ్రహణమే ప్రధానకారణము. 'జ్ఞాన-వృక్ష' అను నిట్టిప్రయోగము లగపడమి యథాసంభవముగ నీవిధికిఁ దావొసంగవలె ననక తీరదు. చరిత్రశబ్ద మాదియందుఁ గల గణముగాన చరిత్రాదు లనెనని గ్రహించునది. చరిత్రాదిశబ్దముల కమహన్నపుంసకసూత్రముచే నగు ముపర్ణకమునకు వికల్పముగ లోపము గలుగును. ముపర్ణకలోపవిధానము ముగాగమలోపమునకును నుపలక్షణమని గ్రహించి చరిత్రను, చరిత్రచేత మున్నగురూపముల సాధించికొనునది. బహుళగ్రహణమునంజేసి దర్భ-పనస మున్నగువానికి నిత్యముగ ముపర్ణకలోపము గలు

స్వర్గనివాసులుగనే యెంచి విష్ణుదేవుఁడు; దేవుఁ డిచ్చో వెలసెను; మహాదేవుఁడు; మున్నగురూపములసాధుత్వము నూహించునది. దేవశబ్దమున కింకొకయర్థము మృగ్యము; సురశబ్దమునకు మాత్రము మద్యమను నర్థము చూపట్టెడి. కాని యిందు సురయని హ్రస్వాకారాంతముగ నిర్దేశించుటంజేసి వేల్పును జెప్పు సురశబ్దమే యీవిషయమున గ్రాహ్యమయ్యెడి. కాన నుభయమును స్వర్గివాచకములే యగును. కాని సంస్కృతసమాసాంతగతములైన నివి సమాసపూర్వపదసంబంధమున స్వర్గివాచకములుగాకపోవుట కొన్ని యెడలఁ గలిగెడుగాన నట్టియెడల నీవిధానము గలుగకుండుటకై దేవసురశబ్దములు స్వర్గివాచకములు గావలెనను నియమము చేయఁబడియెను. భూదేవులు-భూసురులు:—అను పదములు బ్రాహ్మణులను జెప్పునవి. మఱియుఁ బదములవ్యుత్పత్తిని గమనించిన వీరు భూమియందున్నవారె యగుదురుగాని స్వర్గనివాసులు గారు. కాన నీపదములు స్వర్గివాచకములు గావు. స్వర్గివాచకములు గామింజేసి దేవశబ్దము బహువచనాంతమును నై భూదేవులనియు, సురశబ్ద మేకవచనాంతమును నై భూసురుఁడనియుఁ నుండవచ్చునని యీక్రింది స్వర్గివాచి యను సూరివివరణమున కభిప్రాయము. స్వర్గివాచకములు గానప్పుడీయుభయమును దక్కినశబ్దములవలె నుభయవచనములందు 'భూదేవుఁడు-భూసురుఁడు; భూదేవులు- భూసురులు;' అని యుండునని ఫలితము. 'తిరుమలదేవుఁడు భక్తరక్షకుఁడు; దేవుఁడింట నున్నాఁడు' ఇత్యాదులందలి దేవశబ్దము భూమిస్థదేవునే చెప్పుచున్నను, నా దేవుని యాదిమస్థిరనివాసము స్వర్గమే (అనశ్వరస్థానము.)యగుటను విశ్వసించి యొనర్చిన ప్రయోగములుగ వానిని సంభావింపవలెను. స్వర్గపదమున కిట్టిసందర్భమున శాశ్వత దైవస్థాన ముపలక్షణమని యెన్నవలసియుండును. వ్యవహారమునఁ గూడ దేవులనకుండుటయే యందులకుఁ దార్కాణము. స్వర్గివాచకములగు నీయుభయమును బ్రథమయందే గాక తక్కినవిభక్తులందును నేకత్వబహుత్వములందు 'దేవుని - దేవునిచేత - దేవునికొఱకు; సురలను సురలచేత-సురలకొఱకు;' అని ప్రయోగింపఁబడునని గ్రహించునది.

**సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబు లగు; సంస్కృతసమాసంబునఁ గావు. ౬౦.**

సురలు - అసుర - అసురుఁడు. నిఖిలసురలు - రావణాసురుఁడు. ఎల్లసురలు - ఎల్లయసురలు - ఎల్లయసురులు.

టీ. సంస్కృతసమాసాంతమున నున్నపుడు దప్ప ననఁగా వ్యస్తమున ననఁగా స్వతంత్రప్రయుక్తములగునపుడు సురశబ్దమునకు నిత్యముగను నసురశబ్దమునకు వికల్ప

ముగను స్త్రీతుల్యత సంభవించును. తెలుఁగుసమాసము తుదినున్నచో స్వార్థపరములైన వీనికి ముందుచెప్పినరీతిగనే యథాక్రమముగా నిత్యవైకల్పికస్త్రీతుల్యత సిద్ధించెడి. ఇట సమాసపదముచేఁ గర్మధారయమే గ్రాహ్యమనుట కిందలి యుదాహృతులె ప్రమాణములు. సుర:—దీనికిఁ బూర్వసూత్రముచే బహుత్వమందె ప్రయోగము గలుగు. దీనిచే స్త్రీతుల్యత నిత్యముగ సిద్ధించునుగాన మహద్వాచకమైనను బుంలింగముగామిని 21 చే దీనితుదియత్వమున ఉత్వము గలుగదు. కాన 'సురలు'అనియే రూపమేర్పడును. అసుర:—ఈసూత్రముచే స్త్రీతుల్యత సిద్ధించినపక్షమున 21-22 చేఁ బుంలింగములకగు నుత్వడుజ్ఞులు గలుగవుగాన 'అసుర' అని రూపమగును. స్త్రీతుల్యత సంభవింపనిపక్షమునఁ బుంలింగమగుటం జేసి యుత్వమును మహద్వాచకమగుటచే డుజ్ఞును గలుగ 'అసురుఁడు' అని రూపమగును. ఇట్లే తక్కినవిభక్తులందును వచనములందును నసురశబ్దమున నొకపక్షమున స్త్రీలింగకార్యములును నొకపక్షమునఁ బుంలింగడుమంతకార్యములును గల్గుటను గమనించికొనుచు రూపసిద్ధి నూహించునది. సురశబ్దమునకు మాత్రము తక్కినవిభక్తులందు స్త్రీలింగాదంతశబ్దములకగు బహుత్వకార్యములనే చేయుచు బహువచనరూపములసిద్ధిని గమనించునది. నిఖిలసురులు:—ఇందు సురశబ్దము సంస్కృతసమాసముతుదినున్నదిగాన నీసూత్రముచే స్త్రీలింగతుల్యత సంభవింపదు. పూర్వసూత్రముచే బహుత్వముమాత్రమే సురశబ్దమునకు సిద్ధించెడిఁ గాన 'నిఖిలసురులు'అను రూపమయ్యెను. పైకార్యముల ననుసరించి సురశబ్దమునకు సంస్కృతసమాసాంతమునను, వ్యస్తమునను బహుత్వమందె ప్రయోగమగపడెడిఁగాని వ్యస్తమునను, దెలుఁగుసమాసముతుదిని, దీనికి స్త్రీతుల్యత గల్గుటమాత్రము విశేషమని తేలినది. కావుననే సంస్కృతసమాసమున నని సూత్రమునఁ బేర్కొనుట సార్థకమయ్యెడి. ఎల్లసురలు:—తెలుఁగుసమాసముతుది నుండుటచే దీనికిచ్చో నిత్యముగ స్త్రీతుల్యతయే సిద్ధించెను. రావణాసురుఁడు:—ఇచ్చో నసురశబ్దము సంస్కృతసమాసగతమయ్యెఁ గాన దీని కీసూత్రముచే స్త్రీతుల్యత గలుగలేదు. కాన నసురుఁడని డుజంతరూపమే నిత్యముగఁ గల్గెను. ఎల్లయసురలు-ఎల్లయసురులు:—ఇం దసురశబ్దము తెలుఁగుసమాసముతుదినున్నదిగాన దీనికీవిధిచే వికల్పముగ స్త్రీతుల్యత సిద్ధించెను. స్త్రీతుల్యత సిద్ధించినపక్షమున 'ఎల్లయసురలు' అనియు, నది గలుగనిపక్షమున 'ఎల్లయసురులు'అనియు రూపములుగలిగెను. పైవిషయముల ననుసరించి యసురశబ్దమునకు వ్యస్తమునను, తెలుఁగుసమాసముతుదిని, స్త్రీతుల్యతవికల్పముగఁ గలుగుననియుం, సంస్కృతసమాసాంతమున నున్నది డుజంతమే యైయుండుననియుఁ దేలినది. కాఁగా 'సురుఁడు; ఉత్తమసురుఁడు; గొప్పసురుఁడు' అనుప్రయోగములు గలుగవనియు, ననఁగా నెపుడును సురశబ్దమున కదంతమహదేకవచనరూపములెల్ల విభక్తులందును గలుగవనియు, 'ఖరాసుర-

దుష్టాసుర-' అను ప్రయోగములు సిద్ధింపవనియు; నన(గా నసురశబ్దము సంస్కృతసమాసాంతమున మాత్రము స్త్రీత్వమునందదు( గాని తక్కినచోటులందు సర్వవిభక్తివచనములందు వికల్పస్త్రీత్వమునందు ననియు ఫలితమును గ్రహించునది. స్త్రీతుల్యత = స్త్రీలింగశబ్దముతో సమానమగుట. ప్రథమైకవచనలోపో - త్వాభావ - నిగాగమాభావములు స్త్రీతుల్యతావిధానమునకు ఫలములనుట పునరుక్తము.

## దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగ నగు. ౬౧.

దూత - దూతు(డు - యోధ - యోధు(డు - శుంఠ-శుంఠు(డు' బహుళగ్రహణముచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు. సింగంబుదూతయగుజంబుకంబు.

టీ. దీని కథర్వణకారికావళీవ్యాఖ్యాత యగు ద్విత్రింత్రిణీ సీతారామకవిగారి కవిజనమండనవాక్యములు మూలములు. దూతమున్నగు నదంతమహద్వాచకములకు స్త్రీత్వము బహుళముగా నగును. దూత:—స్త్రీత్వ మిద్దానిచే( గుదిరినపక్షమున( ఖంలింగత లేమి 21-22 చే నుత్వడుజ్జులురామి 'దూత'యనియే రూపమేర్పడును. స్త్రీత్వము సిద్ధింపనిపక్షమున నుత్వడుజ్జులు గలిగి 'దూతు(డు'అని యగును. స్త్రీత్వము గల్గినపు డెల్ల విభక్తివచనములందును నదంతస్త్రీలింగశబ్దకార్యములను, స్త్రీత్వము గలుగనియపుడదంతడుమంతకార్యములను జేయుచు రూపముల గమనించునది. ఇట్లే తక్కిన యుదాహరణముల ప్రక్రియ నూహించునది. వికల్పప్రవృత్తిరూపబహుళప్రయోజనమున కివి యుదాహృతులు. సింగంబుదూతయగు జంబుకంబు:—ఇచ్చో దూతయైనది నక్క. నక్కను జెప్పునది జంబుకశబ్దము. దీనికి దూత శబ్దము విశేషణము. జంబుకశబ్దము తిర్యగ్వాచకమగుటను దూతపదము దానికి విశేషణమగుటను జంబుకదూతశబ్దములు విశేష్యవిశేషణములు రెండును 17 విధిచే నమహత్తులె యయ్యెడి. కాన నిందు దూత యనునది సహజముగ సందేశహారశక్తిం జేసి మహత్తైనను నమహద్విశేషణమగుటంజేసి (అమహత్కృతవార్తాహరత్వమునంజేసి) యమహద్వాచకధర్మయుక్తంబై యమహత్తయ్యెను. ఈగతిని నమహత్వమునందిన దూతశబ్దమునకు మాత్రము నిత్యముగ స్త్రీతుల్యత గలుగుటకే సూత్రమున బహుళపదము గృహీతమయ్యె(గాన నిట్టి దూతశబ్దమున కెపుడు నుత్వడుజ్జులును డుమంతకార్యములును సంభవింపవనియు, నిత్యముగ నెల్లవిభక్తివచనములందును దీని కదంతస్త్రీలింగశబ్దకార్యములే సంభవించుననియును బహుళగ్రహణముచే నను నీక్రింది సూరివివరణమున కభిప్రాయము. యోధ-శుంఠ:—సమాసాంతమున నున్నను నీశబ్దములకు స్వార్థపరములగువానికి బహుళముగ స్త్రీత్వము

గలుగవచ్చును. 'మహాయోధ-మహాశుంఠ.' 'యోధాసురాది శబ్దానాం స్త్రీసమత్వమిహేష్యతే' అని యాథర్వణము. "అస్య స్త్రీత్వబహుత్వయోరేవ ప్రయోగః. సమాసే తు భూసురుఁడు, అసురేతి స్త్రీసమత్వప్రయోగస్తు 'ఈ యగ్నిదేవుఁ డసురకు' ఇత్యాచార్యప్రయోగాత్; ఏతత్ప్రయోగబలాదేవ ప్రపూర్వసూత్రాత్ క్వచిదిత్యనువర్త్య క్వచిత్సమాసేఽపి స్త్రీత్వమితి వ్యాఖ్యానాత్ మహాయోధ; మహాశుంఠేత్యాదిరూపం సిద్ధమ్. కిం చ స్త్రీత్వబహుత్వయోః క్వచిదేకత్ర నివేశః; క్వచిత్ స్త్రీత్వస్య పార్థక్యేన వృత్తిరున్నేయా; తేన యోధ-శుంఠేత్యాద్యా స్త్రీసమాస్సిద్ధాః. ఏవం వ్యాఖ్యాన ఏవ సురాదేరంతర్గణత్వం సిధ్యతి......" అను నహోబలపండితీయ మందులకుఁ బ్రమాణము. పైవ్యాఖ్యానము నరసియే సూ॥ 59-60-61 సూత్రముల రచించెనని గ్రహింపక తీరదు గదా! చూ. అహో. ప. పుట 313. 59-60-61 మొదలగుసూత్రములచే స్త్రీతుల్యత్వాదులనందునవి యాయాశబ్దములేగాని తద్విశేషణములు మాత్రము గానేరవు. కానఁ దద్విశేషణములకు మాత్ర మవ్వానివిశేష్యముల మహత్త్వామహత్త్వాదుల ననుసరించి డుమంతమువర్ణకాంతకార్యములే యథార్థ్యముగ నగునని గ్రహించునది. ఇందులకు 'విశేష్యమాత్రే స్త్రీతా స్యాత్ డుజ్ఞూ స్యాతాం చ భేదకే' అనునథర్వణువచనము ప్రమాణమని ముందె యుక్తము. కావున "మహానుభావులైనసురలు; అధికులైన యోధలు" అను మున్నగు పుంలింగవిశేషణములే వానికి సిద్ధించునని గ్రహింపవలయును.

పృథ్వీవాచిభూశబ్దంబునకు భువి యగు. ౬౨.

భువి . భువులు - భువిని - భువులను

టీ. 'భూదివోస్తు జా యత్తత్'అనునది మూలము. నేలను జెప్పెడు భూశబ్దమునకు 'భువి' అనునది ప్రకృతిగ నిల్చునని భావము. ఇది యికారాంత మగుటంజేసి యిదంత కార్యములు గలుగుటను గమనించునది. భువి:—ఇకారాంతమగుటం జేసి యిగ్లాసూత్రముచేఁ బ్రథమైకవచనలోపము గలుగును. భువి+లు; 45 చే నుత్వము గలుఁగ 'భువులు'అను రూపమగును. భువి+ను=భువిని. 26 చే ద్వితీయాప్రత్యయనువర్ణకోత్వమున కిత్వము. భువి+ను:—31 చే లడాగమమును 26 చేఁ బ్రకృతి తుదియిత్వమున కుత్వములుగలుఁగ 'భువులను'అని రూపమగును. ఇట్లేతక్కినవిభక్తులందును వచనములందును రూపము లూహ్యములు. భూశబ్దమునకు శాస్త్రముచే భువియనుప్రాతిపదికము సాధ్యము గామిని, 48 శాస్త్రము ననుసరించి భూవు మున్నగురూపములే కలుగవలసి యుండుట చేతను,దీనిని సూరినిపతించి సాధించెను. ఆత్మభూ-మనోభూ-ఇత్యాదులందలి భూశబ్దము భూవ్యర్థకము గాకుండుటంజేసి యట్టివానియందలి భూశబ్దమునకు భువి యనునది

గలుగకుండుటకొఱకుఁ బృథ్వీవాచకభూశబ్దమని సూరి సూత్రించెనని గ్రహించునది. 48 చే వీనికి ఆత్మభువు-మనోభువు-స్వయంభువు మున్నగు వువర్ణకాంతరూపములు గలిగెడి. పృథ్వీవాచకమైన భూశబ్దము సంస్కృతసమాసాంతమునను, నుండుట పొసఁగదు. 'పృథ్వీపరస్తు భూస్స్వాంతో నాత్మభ్వాదిరిహేష్యతే' అనునథర్వణవచన మిందులకుఁ బ్రమాణము. దీనిచే భూస్వామి యని పూర్వపదముగ నది యుండుట నిర్దుష్టమయ్యెడి. తెలుఁగున సాధ్యసమాసము-పూర్వపదముగను, నుత్తరపదముగను గూడనది చూపట్టదు. వలసినఁ దత్పర్యాయము లేక భువి యను భూశబ్దమున కైనరూపమును సాధ్యమునఁ బూర్వపరములుగఁ బ్రయోగింపవలయును.

## నౌశబ్దంబునకు నావ యగు. ౬3.

నావ - నావలు. మహానావ. కొందఱు నావి యనియు నాదేశం బగునంద్రు.

టీ. 'స్త్రోవావౌ రై నావోః' అనునది మూలము. 'నౌ' అనుశబ్దమునకు 'నావ' అనునది ప్రకృతిగ నిల్చునని యర్థము. నావ:—నౌశబ్దము స్త్రీలింగమగుటచే దానికీసూత్రముచే నైన నావయనునదియు నట్టిద యగునని యెంచి 57 చేఁ బ్రథమైకవచనలోపము చేయఁగ సిద్ధించినరూపము. నావలు:—బహువచనరూపము. ఇట్లే యదంతస్త్రీలింగశబ్దములకువలెనే తక్కినవిభక్తులందు రూపము లూహ్యములు. మహానావ:—బహువ్రీహిసమాసాంతమున నుండని స్వార్థపరమైన నౌశబ్దమునకును నీరూపము గలుగునని సూచింప 'మహానావ' అని యుదాహరించెను. ఉపసర్జనముగాక యనఁగా నన్యపదార్థముం దెల్పక స్వార్థపరమైన సంస్కృతసమాసాంతగత నౌశబ్దమునకును నావాదేశము గలుగునని భావము. బహువ్రీహిగత మయ్యెనేని సంస్కృతవ్యాకరణోక్తకార్యములు గలిగి 'అతీతనౌకుఁడు-అతీతనౌక-అతీతనౌకము.' అని మూఁడులింగములందును గన్పట్టును. ఇందులకు "త్రిలింగ్యామపి రైనావోస్సమాసే ప్రత్యయాంతతా' అను నథర్వణవచనము ప్రమాణమయ్యెడి. కొందఱు నౌశబ్దమునకు నావి యను దానింగూడ నాదేశముగఁ జెప్పిరి. 'నావి' అనున దికారాంత మగుట నిదంతకార్యముల నాపక్షమున గమనించునది. ఈపక్షమున నావులిత్యాది బహువచనరూపములు వినరాకున్నవిగాన బహుత్వమున నిత్తున కుత్వముగాదని గ్రహింపవలెను. కొందఱని యాభిముఖ్యముం జూపక సూరి వ్రాయుటకు బీజమిదియె యని తోఁచెడి.

## రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాషనగు. ౬౪

ఇగ్లౌసూత్రముచేతం బ్రథమైకవచనమునకు లోపంబు. రో-రై-గ్లో-గ్లౌ.

టీ. 'స్యాద్వక్రతమయుగ్మస్య వక్రవర్ణో ద్వితీయకః. ఐకారాంతస్వరూపేణ' అనునాథర్వణము మూలము. రై-గ్లౌశబ్దముల యైకారౌకారములకోత్వము వికల్పముగ నాదేశమగును. ఈవిధిచే వికల్పముగ నోకారాంతము లగునపుడును 'ఏకదేశవికృతమనన్యవత్' అను నుక్తింబట్టి సహజమగుస్థితినే ప్రమాణముగఁ గొని 44 ఇగ్లాసూత్రముచేఁ బ్రథమైకవచనలోపమును జేయవలెనని 'ఇగ్లా' అను నీక్రిందివివరణమున కభిప్రాయము. అనఁగా నిగ్లాసూత్రమునందలి గ్లౌ-రై యనునవి ప్రకృతిమాత్రబోధకములుగాని తదజంతప్రకృతిబోధకములు గావని భావము. ఓత్వముగలిగినపుడు (గ్లో; రో; అని) సర్వవిభక్తివచనములందును నోదంతరూపము లూహ్యములు. ఔత్వముతోడివానికిఁ బక్షమున నౌదంతరూపము లూహ్యములు. గ్లౌలు-గ్లౌలను-గ్లౌలచేత, రోలు-రోలను-రోలచేత మున్నగురూపములు చెవి సోఁకకున్నవి. స్వార్థపరములకె యివ్విధి.

## ఐకారం బీతుల్యంబు. ౬౫.

## రైని - రైకి - కైని - కైకి - పైని - పైకి.

టీ. ఐకారాంతమగుశబ్ద మీకారాంతశబ్దమునకు సమమగును. ఇదినిత్యవిధానము. 26 చేనగు విభక్తికార్యము లైకారాంతములకును గలుఁగవలసివచ్చుటంజేసియు, 26 విధి హ్రస్వదీర్ఘేకారాంతపరమగుటంజేసియు నైకారాంతముల కీకారాంతతుల్యత యతిదేశింపఁబడియెను. 26 విధి కైకారాంతముల విషయములుగఁ జేయవలెనన్న నంద న్నట్లె యికారతుల్యంబగు నన్నఁజాలునే యని శంకింపనగును. కాని సామాన్యముగ నికారతుల్యమగునన్న హ్రస్వేకారాంతతుల్యతయు నంగీకార్యమగుటంజేసి 45చే బహువచనము పరమగునపు డగునుత్వము గలిగి రులు-రులను-రులచేత-గ్లులు-గ్లులను-గ్లులచేత మున్నగు ననిష్టరూపములు గలిగెడిఁగాన వానిని వారింప దీర్ఘేకారాంతతుల్యత విధింపఁబడియెనని గ్రహించునది. 45సూత్రము హ్రస్వేకారసూత్రపరమని ఇత్తునకనుటచే స్పష్టమయ్యెడిఁగాన దానిచేనగుకార్య మీకారాంతములకుఁ దత్తుల్యములకును గలుగదు. కాన నీతుల్యత సార్థకమయ్యెడి. రై+ను:—26 చే నువిభక్తియుత్వమున కిత్వమురా 'రైని' యని యయ్యెను. రై+కు=రైకి; 26చే కువర్ణమునుత్వమున కిత్వము. ఇట్లే యీసూత్రమున కైకారాంతములైన తెలుఁగుశబ్దములును విషయములని తెలుప కై-పైశబ్దముల ద్వితీయాషష్ఠ్యేకవచనరూపము లుదాహృతములయ్యెను. కై-పై; అను మున్నగునవి 103 క్రియ. చేసైన నైకారాంతములు. ఇవి కయి-పయి అనురూపములతోడ నున్నను బహువచనమున వీనికీతుల్యతయే యగుననియుఁ దాన కయులు-పయులు మున్నగు ననిష్టరూపములు గలుగుననియు సంభావించునది. మఱియు నైకారాంతములు

గానపు డికారాంతములై యగుంగాక 26విధికి విషయము లగుట స్పష్టము. 45 విధికి విషయములు గాకుండఁజేయుటకును, 26 విధికిఁ బాలుగాఁ జేయుటకును నీతుల్యత సమర్థమయ్యెడి.

## కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు. ౬౬.

కంధరము-కంధర. విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు- విధము. కంధరా నాసికా భిక్షా దంష్ట్రా గ్రీవా పాదుకోల్కా ప్రభృతులు కంధరాదులు.

టీ. కంధరమున్నగుశబ్దములు సంస్కృతమున నాకారాంతస్త్రీలింగములు. వీనికి 54చే హ్రస్వమును 57చేఁ బ్రథమైకవచనలోపమును సిద్ధింప కంధర-కంధరలు-కంధరను-కంధరలను-మున్నగురూపములే సిద్ధించెడి. కంధరము మున్నగుమువర్ణకాంతరూపములను సంపాదించుట పక్షమున నావశ్యకమగుటంజేసియు, మువర్ణక ముగాగమములు నపుంసకాదంతములకుఁ గలుగునవి యగుటంజేసియు, 39-40 లచేఁ బక్షమున నట్టిరూపములు గలుగ వీనికిఁ గ్లీబతుల్యత గట్టఁబడియెనని గ్రహించునది. క్లీబతుల్యము=నపుంసకతుల్యము. కంధర:—దీనిచేఁ గ్లీబతుల్యత సిద్ధించినపిదప 39 చే మువర్ణకము సిద్ధింప 'కంధరము'అని రూపమగును. క్లీబతుల్యత సిద్ధింపనిపక్షమున 54 చే హ్రస్వము గలిగిన పిదప 57 ప్రథమైకవచనలోపము రా 'కంధర' అని రూపమగును. మువర్ణకము గల్గినప్పుడు ముగాగమాదులను, గలుగనిపక్షమున మువర్ణక ముగాగమలోపాదులను యథార్హముగ గమనించునది. తక్కినశబ్దముల ప్రక్రియ నిట్లే యెఱుంగునది. ఇది యాకృతిగణమగుటం బట్టియు, గణాదిస్థకంధరాశబ్దసాదృశ్యముంబట్టియుం మువర్ణకమునందఁదగిన యాకారాంతస్త్రీలింగశబ్దముల నిందుఁ గూర్పఁదగును. 'విధా' అనునాకారాంతస్త్రీలింగశబ్దము నిందుఁ జేర్చ 'విధ-విధము' అనురూపద్వయము సిద్ధింపవలసి యున్నదిగానఁ దన్నివారణార్థము విధాశబ్దము నిత్యముగఁ గ్లీబతుల్యమగునని వివరింపవలసివచ్చెను. దీన విధమనియే రూపమేర్పడెడి. ఇది నిత్యరూపబహుళప్రయోజనము. ప్రౌఢవ్యాకర్త విధాశబ్దము సంస్కృతమునఁ బుంలింగమును నగునని 'విధో విధానే'అని యజయనిఘంటువు నుదాహరించి పుంలింగరూపమునకే (విధము) తెనుఁగునఁ బ్రయోగముగాని స్త్రీలింగరూపమునకు లేదనియు దానఁ గ్లీబతుల్యత నిత్యమని వివరించు సూరివివరణ మసంగతమనియు వృక్షమిత్యాదులవలెనే విధశబ్దమునకుఁ బుంలింగమున కమహన్నపుంసకసూత్రముచే నదంతావమహద్వాచకమగుట మువర్ణకమై గలుగుననియుఁ, విధయను ప్రయోగ

మగపడమిఁ గంధరాదులలోఁ జేర్ప నేయవకాశము లేదనియు, దానఁ బుంలింగమునే గ్రహించి విధమని రూపమును సిద్ధింపఁ జేయవలెనుగాని స్త్రీలింగమును గ్రహించి క్లీబతుల్యతనుగల్పించుట యనావశ్యకవిషయమనియుఁ దెలిపి, బాలవ్యాకరణపాఠకుల నుద్బోధించినాఁడు. ఇట్లే దంష్ట్రాశబ్దంబును బుంలింగము నగునని వివరించి స్త్రీలింగాకారాంతమును గ్రహించి దష్ట్రయనియుఁ బుంలింగాదంతమును గ్రహించి దంష్ట్రమనియు రూపంబుల సాధింప నగుంగాన దీని నీయాకృతిగణమునఁ జేర్పనక్కఱలేదని సవరించినాఁడు. 'విధము, దంష్ట్రము' అనురూపములఁ బుంలింగశబ్దములనుండి పుట్టించు నీ ప్రౌఢవ్యాకరణకర్త వ్రాఁత యమహన్నపుంసకసూత్రస్థమగు 'అమహన్నపుంసకములకు' అనునది ద్వంద్వమగుటను, నదంతముల కనునది దానికి విశేషణమగుటను సమర్థింపఁజాలి యుండ దనుట స్పష్టము. ఇంతవఱ కజంతశబ్దములరూపములు సాధింపఁబడియె. ఇఁక హలంతప్రక్రియ నిరూపిత మగును. అచ్చుతుదింగలవజంతములు.

## ఇంక హలంతప్రకరణము.

హల్లుతుదినిగలవి హలంతములు. హలంతములనుగూర్చి యైనగ్రంథభాగముగాన నిది హలంతప్రకరణ మయ్యెడి. శాస్త్రముచేఁ గలుగు కార్యవిశేషములంబట్టి యిందజంతములగుచున్నను శుద్ధప్రకృతులు హలంతములె యగుట హలంతములనుట పొసఁగెడి.

### హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామంబగు. ౬౭.

రుక్-రాట్-మరుత్-వీరుత్-కర్మ-వర్మ. శ్వాశబ్దంబు దప్ప నకారాంతంబులెల్లం బ్రథమైకవచనతుల్యంబులె యగునని యెఱుంగునది.

టీ. 'ప్రథమైకవచనతుల్యం సర్వత్ర హలంతమగుణవత్ప్రకృతి' అనునది మూలము. సామాన్యముగ హలంతశబ్దములకు సంస్కృతమునఁ గలప్రథమైకవచన రూపమే తెలుఁగునఁ బ్రాతిపదిక మగునని యర్థము. సంస్కృతశబ్దములకు సాక్షాత్తుగ ననఁగా ననుకరణము చేయక ప్రత్యయాదులతో నున్నవానికిఁ దెలుఁగునఁ బ్రవేశము లేమింజేసియుఁ బ్రథమైకవచనాంతమే ప్రాతిపదికమన్న బ్రథమైకవచనముతోఁ గూడిన యట్టిశబ్దముపై మఱలఁ బ్రథమైకవచనాదిప్రత్యయములు గలుగుట శాస్త్ర సంప్రదాయవిరుద్ధమగుటంజేసియు, శాస్త్రసంప్రదాయరక్షణమునకై ప్రథమైకవచ నాంతంబనక ప్రథమైకవచనతుల్యమని సూరి సూత్రించెనని గ్రహించునది. దానివంటిది గాని యదిగాదనుటంజేసి ప్రత్యయముమీఁద మరలఁ బ్రత్యయము గలుగ లేదనుయుక్తి సురక్షితమైనది. ఇందలి యాఱుదాహరణము లాయాసంస్కృతశబ్దముల ప్రథమైక వచనరూపములు. తెలుఁగున నట్టివే ప్రాతిపదికములగునుగాన నట్లు నిర్దిష్టములయ్యెను.

ఇందుఁ దుదిరెండుదాహరణములును నకారాంతశబ్దముల ప్రథమైకవచనములు. ఒక్క 'శ్వన్' అను నకారాంతశబ్దము తప్పఁ దక్కినసంస్కృత నకారాంతశబ్దములెల్లఁ దెలుఁగునఁ బ్రథమైకవచనాంతతుల్యములే యగును. నకారాంతములలో 'శ్వన్' అనుశబ్దమును విడిచి తక్కిన మహాదమహన్నకారాంతములకెల్లను వానివాని ప్రథమైకవచనములనే తెలుఁగునఁ బ్రాతిపదికములుగ గ్రహించి యాయావిభక్తులఁ జేర్చి ప్రక్రియను గమనించికొనఁదగునని, శ్వశబ్దము దప్పనను సూరియాక్రిందివివరణమున కభిప్రాయము. హలంతములకుఁ బ్రథమైకవచనాంతతుల్యతయు ద్వితీయైకవచనాంతతుల్యతయుఁ నను రెండే యవస్థలు ప్రాతిపదికగ్రహణవిషయమున నిందగపడెడిఁగానఁ బ్రథమైకవచనాంతతుల్యతసిద్ధింపమిని శ్వశబ్దమునకు 70 చే నిత్యముగ ద్వితీయైకవచనాంతతుల్యత సంభవించునని సంభావించునది. ఇది సంస్కృతశబ్దానుశాసనము గామిని సంస్కృతశబ్దముల రూపము లెఱింగింపఁబడవు. ఇఁక నాయాహలంతశబ్దముల ప్రథమైకవచనము లెట్టులుండునో ద్వితీయైకవచనము లేగతి నుండునో యెఱుంగ సంస్కృతశబ్దానుశాసనము నేని దానిమార్గము పట్టి శబ్దరూపములఁ బ్రదర్శించుగ్రంథములనేని చదివినబాలురకే సూరి యిట మొదలుకొని చెప్పినశబ్దముల ప్రక్రియ సుబోధమయ్యెడి. మఱియు నిట్లే ప్ర[illegible] గొన్నిపట్టులు సంస్కృతభాషయందు వ్యుత్పన్నులైనవారికే సుబోధములై తక్కినవారల కగమ్యములగుట గమనించియుంటిమి. ఇట్లు సంస్కృతవాసనావాసితుల శాస్త్రసంప్రదాయములం జేసి యాంధ్రలక్ష్యలక్షణములు విరచితములగుటఁ దెలుఁగుభాషాసహజస్థితి, తెలుఁగుజాతి సహజజీవనాదికము, సుబోధములుగాఁ [illegible]ట సాహసోక్తి గాఁజాలదు. కాన నీవ్యాకరణము నెట్టివా రభ్యసింపదగ్గువారో యిది బాలవ్యాకరణమో కాదో పాఠకులే చింతించికొనవలయును. హలంతముల కచటతపాంతప్రథమైకవచనరూపములే గ్రాహ్యములిందగుఁగాని గజడదబాంతములు గాఁజాలవని గ్రహించునది. (జస్త్వరూపములుగావని భావము.)

ఉగాగమంబును ద్విత్వంబును దుధిహల్లునకగు. ౬౮

ఉగాగమాంతంబుల కిగ్లోసూత్రముచేఁ బ్రథమైకవచనలోపంబగు. రుక్కు - రాట్టు - మరుత్తు - వీరుత్తు. ఉగాగమంబు లేమింజేసి ఋచట నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచనలోపంబు లేదు. కర్మము-వర్మము-చర్మము-సుధన్వుఁడు-సుత్రాముఁడు.

టీ. 'ద్విత్వోత్వే సర్వహలాం ప్రాప్స్యేత్' అనునది మూలము. (69) కొఱకు రెండు కార్యములుగఁ దెల్పుట యానశ్యకమయ్యెఁగాన నుగాగమద్విత్వములు వేఱ్వేఱు

కార్యములని తలంపక యవి పరస్పరసాపేక్షములనియే సంభావింపఁదగును. పూర్వసూత్రముచేఁ బ్రథమైకవచనాంతతుల్యములైన హలంతముల తుదిహల్లునకు హ్రస్వోకారమంతావయవముగ నాగమమగుటయేగాక యద్దానికి ద్విత్వమును గలుగును. ద్విత్వమనఁగా నట్టిదియే మఱియొకహల్లున్నదానింగూడుట. ఉత్వద్విత్వములనందిన యట్టి హలంతము లుదంతము లగుటంజేసి యిగ్గాసూత్రముచే వాని ప్రథమైకవచన ప్రత్యయము లోపించెడినని యుంగాగమాంతముల కను సూరి యీ క్రిందివివరణమున కభిప్రాయము. రుక్కు:—67 చేఁ బ్రథమైకవచనాంతతుల్యమగుంగాన 'రుక్' అనునది ప్రాతిపదికమగును. దీనిచే ద్విత్వోత్వములుగా 'రుక్+క్+ఉ=రుక్కు' అని రూపమగును. ఇట్లే తక్కినరూపము లూహ్యములు. 67 చేఁ బ్రాతిపదికములైన ప్రథమైకవచనాంతతుల్యనకారాంతములతుదిని హల్లులేమింజేసి యీవిధిచే నుత్వద్విత్వములు గలుగ నవకాశములేదనియు, స్త్రీలింగములు గాకుండుటంజేసి 57 చేఁ బ్రథమైకవచనలోపము వీనికిఁ గలుగదనియు, నిఁక నదంతములైనవీనికి మహదమహద్వాచకత్వములను బున్నపుంసకత్వములను ననుసరించి ముపర్ణకడుజ్వర్ణకాదులఁ గూర్చి యథార్థముగ రూపములనిష్పత్తి నొనర్చికొనవలెననియు 'ఉగాగమంబు లేమింజేసి' యను నీ క్రిందిసూరివివరణమున కభిప్రాయము. కర్మ:—ఇది నపుంసకనకారాంతశబ్దప్రథమైకవచనరూపము. దీనితుదిని హల్లు లేమింజేసి యుత్వద్విత్వములు గావయ్యెను. స్త్రీలింగము గామిని 57 చేఁ బ్రథమైకవచనము లోపింపదు. ఇఁక నపుంసకమగుట నదంతమగుట నమహన్నపుంసకసూత్రముచే ముపర్ణకము గలుగ 'కర్మము' అని రూపమగును. ముపర్ణకార్థమయ్యెఁగానఁ దక్కినవిభక్తివచనములందు ముగాగమాదికార్యవిశేషముల యథార్థముగ గమనింపవలయును. ఇట్లే తక్కినరూపము లూహ్యములు. కర్మవిత్యాదిరూపములు కవిప్రయుక్తములు గానఁ బ్రౌఢవ్యాకర్తృపద్ధతి ననుసరించి యిర్ఘాదులం దట్టివానిం జేర్పఁదగుననుట పునరుక్తము. 'సుధన్వన్-సుత్రామన్' అనునవి నకారాంతపుంలింగశబ్దములు. 'సుధన్వా-సుత్రామా' అనునవి వీని ప్రథమైకవచనములు. 54 చే వీనితుదిదీర్ఘములు హ్రస్వములగును. పూర్వోక్తప్రకారమే వీనికి ద్విత్వోత్వములుగాని పుంలింగములగుట 57చేఁ బ్రథమైకవచనలోపముగానికలుగదు. ఇఁకఁబుంలింగాదంతములగుటచే 21-22 చే నుత్వడుజ్ఞులు గలుగ 'సుధన్వుఁడు-సుత్రాముఁడు' అని రూపములు సిద్ధించును. డుమంతములయ్యెఁగానఁ దక్కినవిభక్తులందు యథార్థముగ న్వాగమాదిడుమంతకార్యము లూహ్యములు. ఇట్లే నకారాంతపుంలింగశబ్దముల ప్రక్రియను గమనించునది. లింగమునుగణింపక ప్రథమైకవచనాంతతుల్యములు గాఁదగినవాని నెల్ల నిందుఁ జేర్పఁదగునని ఫలితము. ద్విత్వముగల్గి యుగాగమము గాకుండుట సంభవింపదు.

దీర్ఘంబుమీఁదిహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. ౧౯.

వాక్కు - వాకు; స్వరాట్టు - స్వరాటు.

టీ. 'ద్విత్వం తు దీర్ఘతో బహుళమ్' అనునది మూలము. దీర్ఘాక్షరమునకుఁ దరువాతనున్నహల్లునకు ద్విత్వము బహుళముగా నగును. పూర్వసూత్రముచే నుగాగమద్విత్వములు పరస్పరసాపేక్షములై నిత్యముగఁ గలుగుచుండ నీసూత్రముచే ద్విత్వమును వేఱుపఱచి బహుళముగ నగు ననవలసివచ్చెను. పూర్వసూత్రముచేఁ గలుగు నుత్వద్విత్వములలో ద్విత్వము మాత్రమే బహుళమనుటంజేసి ద్విత్వము రానిపక్షమునను నుత్వము నిత్యముగ సిద్ధింపనగునని గ్రహించునది. వాక్:—ఇది 'వాక్' అనుశబ్దము ప్రథమైకవచనరూపము. 67 చే నిదియె ప్రాతిపదిక మగును. పూర్వసూత్రముచే నుత్వద్విత్వములు రా 'వాక్+క్+ఉ=వాక్కు' అని రూపమగును. ఈసూత్రముచే దీర్ఘముమీఁదిదానికి ద్విత్వము గలుగనియెడల నుత్వము మాత్రము పూర్వసూత్రముచే సిద్ధించి 'వాక్+ఉ=వాకు' అని రూపమగును. ఇట్లే 'స్వరాట్టు-స్వరాటు' అనురూపము నూహించునది. బహుళగ్రహణమునంజేసి రాజుం దెల్పు 'రాట్' అను వ్యస్తముగ నున్నదానికి 'రాట్టు' అను దిత్వోత్వములు గల్గినరూపమే గాని యీసూత్రముచేనగు ద్విత్వము రాక యుత్వము మాత్రమే సిద్ధించిన 'రాటు' అను రూపము గలుగదని ఫలము నెన్నునది. కచటతపాంతశబ్దములే గ్రాహ్యము లీవిషయమునని ముందే తెలుపఁబడినది. 'స్వరాట్టు-స్వరాటు' అని యుదాహరించుటంజేసి స్వార్థపరమైనశబ్దములకును నీకార్యములు గలుగనగుననుట సూచితము.

మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామంబగు. ౨౦.

శ్రీమంతమ్ - గుణవంతమ్ - విద్వాంసమ్ - అనడ్వాహమ్-శ్వానమ్ - ఉపానహమ్-అప్సరసమ్ - ఇత్యాదులు.

టీ. 'గుణవద్గణో ద్వితీయైకవచనతుల్యో భవేద్వికృతౌ' అనునది మూలము. మతుప్ప్రత్యయాంతములైన శబ్దములును మతుబంతములుగాని (ఆది) మఱికొన్నిశబ్దములును ద్వితీయైకవచనాంతతుల్యము లగును. అనఁగాఁ బైవాని ద్వితీయైకవచనములే తెలుఁగునఁ బ్రాతిపదికములగునని భావము. ప్రత్యయాంతముపైఁ బ్రత్యయములు గలుగుట వ్యాకరణసంప్రదాయము గామిని దత్తుల్యమనెనని ముందే వ్రాయఁబడినది. 'శ్రీమంతమ్-గుణవంతమ్' అనునవి మతుబంతములు. 'శ్రీగలవాఁడు-గుణములు గలవాఁడు. అని యర్థము. మతుప్ప్రత్యయమునందలి మకార మొకపుడు వకారమగుంగాన 'గుణవంతమ్' అనుమున్నగు చోటులందు మకారస్థానమున వకార మగు

పడెడి. ఇందుఁ జేరఁదగినవెల్ల మకారాంతములే యైయుండును. హలంతము లేలింగము గలవైనను ద్వితీయైకవచనమున మకారాంతములగునవియే ప్రాతిపదికములుగ నిందంగీకృతములని తెలియఁదగును. స్త్రీలింగము లగునపుడు మాత్రము 85 విధానాంతరము కలిమిని సంస్కృతస్త్రీలింగరూపములును గ్రాహ్యములయ్యెడి. మీఁదు చూడుఁడు. సంస్కృతసమములసాధనమున సంస్కృతశబ్దముల ప్రథమద్వితీయైకవచనాంతములే ప్రాతిపదికములుగ నగుంగాని యన్యము గాఁజాలదనియు నేవానికిఁ బ్రథమైకవచనాంతము ప్రాతిపదికము గాఁదగునో యేవానికి ద్వితీయైకవచనాంత మర్హ మగునో యేవానికుభయమును బరిగ్రాహ్యమగునో యనువిషయములఁ బ్రయోగముల ననుసరించు దృష్టితో నరసి తెలిసికొనవలెననియు నీసందర్భమునుబట్టి గ్రహించునది. ఈ క్రింది యుదాహరణము లాయాశబ్దముల మకారాంత ద్వితీయైకవచనములు. శ్రీమంతమ్:—ఇది మతుప్ప్రత్యయాంతము. ఇట్లే గుణవంతమనునదియుం మతుబంతమే. అకారాకారాంతములకును అకారాకారోపధంబులకును గలిగిన మతుప్ప్రత్యయమునందలిమకారము వకారరూపము నందునని పాణినీయము తెల్పుచున్నది. తక్కినవానియందట్లుగాక మకారరూపముతోడనే యుండును. గుణః—ఇది అకారాంతముగాన దీనికిఁ గల్గినమతుప్ప్రత్యయము మకారము వకారమై "గుణవాన్ - గుణవంతమ్ - గుణవతీ" అని రూపములేర్పడెను. శ్రీత్యాదు లీకారాంతము లగుట 'శ్రీమాన్-శ్రీమంతమ్-శ్రీమతీ" అని రూపములేర్పడును. ఇట్లే యశస్ మున్నగునవి అకారోపధములగుట నందు "యశస్విన్-యశస్వినీ-యశస్వీ" అని వకారమే యగపడును.

### దానియంతిమమకారంబునకు లోపంబగు. ౨౧.

శ్రీమంత - గుణవంత - విద్వాంస - అనడ్వాహ-ఇత్యాది. వీని కజంతములకుం బోలె డుజాదులు యథాయోగ్యంబుగ నగు. అతఁడు శ్రీమంతుఁడు - ఇతఁడు గుణవంతుఁడు - వానివంశము శ్రీమంతము- వీనివంశము గుణవంతము. విద్వాంసుఁడు - విద్వాంసము. అనడ్వాహము - శ్వానము - అప్సరస. వక్ష్యమాణలక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదులు ఙ్యంతంబులై యిందు గ్రహింపంబడు. శ్రీమతి - గుణవతి-విదుషి-శుని. మహతి వాచ్యంబగునపుడు శ్రీమంతురాలు - గుణవంతురాలు-విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁదగు.

టీ. 'అన్యేషాం చ వా లుగంతస్య' అనునది మూలము. పూర్వసూత్రముచే ద్వితీయైకవచనాంతతుల్యమైన మతుబంతాదుల తుదినున్నపొల్లు మకారమునకు లోపము

నిత్యముగనగును. మకారము లోపించినపిదప నవి యజంతములగుంగాన నపుడు వాని వానిమహతీమహదమహద్వాచకత్వముల గమనించి యథాయోగ్యముగఁ గ్రమముగ నాలుశబ్దముతోడ సమాసమును, డుముపర్ణకములను; గూర్చుచు వానివానిరూపముల నుత్పాదించికొనవలయును. అనఁగా నమహత్తును జెప్పునా? మహత్తును జెప్పునా? స్త్రీని జెప్పునా? యని గమనించుచు దేనిం జెప్పునదైన దానికర్హములగు ప్రత్యయాదు లను గూర్చుచు రూపముల సాధించికొనవలెనని తాత్పర్యము. శ్రీమంత:—70 చే ద్వితీయైకతుల్యమైననియు దీనిచే మకారలోపమునందినదియునగు నామము. ఇది పురుషుని బోధించునదిగ నెన్నిన శ్రీమంతుఁడని డుమంతమగు. (రాముఁడు) అమహ త్తును బోధించునదిగఁ దలంచిన శ్రీమంతమని ముపర్ణకాంతమగును. (వృక్షము) స్త్రీని దెల్పునదిగ భావించిన శ్రీమంతురాలని యాలుశబ్దముతోడ సమసించిన రూపమును నందును. (ధీరురాలు) ఇట్లే మహత్తును దెల్పు 'గుణవంతమ్' అనునది గుణవంతుఁ డనియు, నమహత్తును జెప్పునది గుణవంతమనియు, మహతీవాచకమగునది గుణవంతు రాలనియు రూపములనందును. ఈరీతిగనే విద్వాంసుఁడు - విద్వాంసము - విద్వాంసు రాలనురూపములు 'విద్వాంసమ్' అను ప్రకృతికి సంభవించును. డుజ్ముపర్ణకాద్యర్హ మగువాని కాయాకార్యవిశేషములను నాలుశబ్దతోడి సమాసమునందినవాని కొపవిభక్తిక మగు నికారమును (అచ్ఛిక 30) బూర్ణబిందుపూర్వకడుపర్ణాదేశాదులను (అచ్ఛిక 11) గల్గుట తత్తద్విభక్త్యేకవచన బహువచనములందు గమనించుచు రూపముల నూహిం చునది. మహతీమహద్వాచకములు గాఁజాలనివానికి ముపర్ణకరూపమే గలుగునని గ్రహించునది. మహతీవాచకము లగునపుడు సంస్కృతశబ్దములెల్ల 85 చే నిందు వాని వానికి సంస్కృతమున నియతములైన స్త్రీప్రత్యయములతోడ వర్తింపనగుంగాన నీకా రాంతము లయియే యుండెడి. వాని తుదిదీర్ఘమునకు మాత్రము 54 చే హ్రస్వమును 44 చేఁ బ్రథమైకవచనప్రత్యయలోపమును గలుగును. శ్రీమత్:—దీనికి స్త్రీప్రత్య యము చేరిన మహతీవాచకమగురూపము 'శ్రీమతీ' యని యగును. 54 చే హ్రస్వము 44 చేఁ బ్రథమైకవచనలోపమును గలుగ 'శ్రీమతి'యగును. ఇట్లే గుణవత్ అనుదానికి గుణవతి యనియు విద్వత్ అనుదానికి విదుషి యనియు, ననడుత్ అనుదాని కనడుహీ యనడ్వాహీ యనియు, శ్వన్ అనుదానికి శుని యనియు స్త్రీలింగరూపములు గలుగును. ఈగతి నివి తెలుఁగున నికారాంతము లయ్యెఁగాన వీనికిదంతకార్యములఁ దత్తద్విభక్తి వచనములందుఁ గూర్చుచు రూపముల నూహించికొనునది. మహతీవాచకమున 31 సంధి ననుసరించి యాలుశబ్దముతోడి సమాసమును స్వనియతస్త్రీప్రత్యయముతోడి యునికియు నను నుభయమును గలుగుట విశేషము. వక్ష్యమాణలక్షణము 85 సూత్రము.

మతుబాదులు = మతుబంతములును మఱికొన్నియును. జ్యంతములు = 'జీప్+జీష్; జీన్' అను స్త్రీలింగ ప్రత్యయములు చేరిన యీకారాంతశబ్దములు. జీ+అంతములు=జ్యంతములు. జకారముపోవునదైనను సూత్ర విహితములు తద్రూపములగుట జ్యంతములను వ్యవహారము గుదిరెను. మఱియుఁ బైని పేర్కొన్న ప్రత్యయత్రయమునకు లక్ష్యము లైన వివిధశబ్దములనెల్ల సంగ్రహింప సూరి యిట్లు సామాన్యముగ జ్యంతమని వ్యవహరించెనని గ్రహించునది. మహతి:—ఇది మహత్తనుదాని స్త్రీలింగరూపము. స్త్రీవాచకమని యర్థము. స్త్రీత్వము=స్త్రీలింగధర్మము-స్త్రీవాచకధర్మము. హలంతములైన మతుబాదులకు స్త్రీలింగమున నీకారాంతరూపములే సంస్కృతమునఁ గుదిరెడిఁగాన మతుబాదులు జ్యంతములై యిందు గ్రహింపఁబడునని సూరి వివరించుటకుఁ గారణమని గ్రహించునది.

## ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబు లేదు. ౭౨.

ముదము - ఉపానహము - స్రజము.

టీ. 70 సూత్రముచే ద్వితీయాంతతుల్యత నందినట్టియుం మతుబాదులలోఁ జేరనవియునగు ముద మొదలగుకొన్ని స్త్రీలింగశబ్దములకుఁ బ్రథమైకవచనలోపము గలుగదు. మతుబాదులలోఁ జేరిన స్త్రీలింగశబ్దములయంతిమమకారమునకు 71 చే లోపము సిద్ధించినపిదప 57 సూత్రముచేఁ బ్రథమైకవచనలోపము గలిగి ముదమున్నగురూపములే గావలసివచ్చుటంజేసి యీసూత్రమును సూత్రింపవలసివచ్చెను. ద్వితీయైకవచనాంత తుల్యములై మకారాంతములై తెలుఁగునఁ బ్రాతిపదికములుగ నేర్పడిన స్త్రీలింగశబ్దముల కగుప్రథమైకవచనలోపము నడ్డుటయే యీసూత్రమునకుఁ బ్రయోజనమని ఫలితము. ఇందలి మూఁడుదాహృతులు స్త్రీలింగములే. ముదము:—70 చేఁ ద్వితీయాంత తుల్యతనంది'ముదమ్' అగును. 71 చేఁ దుది మకారమునకు లోపమురా 'ముద' అగును. పిదప నమహన్నపుంసకసూత్రముచే ముపర్ణకముగా 'ముదము' అనిరూపమయ్యె.57 చేఁ బ్రథమైకలోపము ప్రాప్తముగా దీనిచే వారించినాఁడుగాఁన ముద యను ననిష్టరూపము గలుగదు. ఇట్లే తక్కినవూహ్యములు. 'ఆపదమ్' మున్నగువానికిఁ బ్రథమైకవచన లోపముగలిగి 'ఆపద' అనురీతి రూపములు సిద్ధింపవలెనుగాన స్త్రీలింగములైనను నట్టి వాని నిందుఁ జేర్పక ప్రథమైకవచనలోపమునకుఁ బాలుగాఁదగనివానిని మాత్రమే యిందుఁ జేర్చునది. ఆపత్తిత్యాదులు ప్రథమైకవచనతుల్యతచే సాధ్యములగు. ముదాదులకని సూత్రమున నంతిమమకారలోపముచేసినరూపమును నిర్దేశించుటంబట్టి యీశబ్దములు మతుబాద్యంతర్గతములని స్పష్టమయ్యెడి.

**ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాషనగు. ౨౩.**

ఋత్విజుఁడు - ఋత్విక్కు - నీవృతము - నీవృత్తు. ఋత్విగాదికం బాకృతిగణంబు.

టీ. "ఋత్విక్" అను మొదలగునవి వికల్పముగ ద్వితీయాంతతుల్యము లగును. 70 సూత్రస్థమగు నాదిపదముచే బోధ్యమగునీ ఋత్విగాదికము మతుబాద్యంతర్గణము. ద్వితీయాంతతుల్యములు 70 చే నగును. అపుడు 71 చే వానియంతిమమకారము లోపించును. కాన 'ఋత్విజమ్; ఋత్విజ' అని యగును. ఇపుడు పుంలింగమహద్వాచకాదంత శబ్దమయ్యెఁగాన 21-22లచే నుత్వడుజ్ఞులు గలిగి 'ఋత్విజుఁడు' అని రూపమేర్పడును. ద్వితీయాంతతుల్యము గానిపక్షమున 67 చేఁ బ్రథమైకవచనాంతతుల్యమై 68 చే నుత్వద్విత్వములు గలిగి 'ఋత్విక్+క్+ఉ=ఋత్విక్కు'అని రూపమగును.డుమంతమగు నపుడు డుమంతకార్యములును గానపుడు యథాసంభవములగు ప్రథమైకవచనలోపాది కార్యములను గమనించుచు మిగిలిన విభక్తివచనములందు రూపముల నూహించునది. నీవృచ్ఛబ్ద మమహత్తును దెలుపునదిగాన ద్వితీయైకవచనాంతతుల్యమగునపుడు(నీవృతమ్; నీవృత; నీవృతము) మువర్ణకము గల్గును. ఈసూత్రముచేఁ బ్రథమైకవచనాంతతుల్యమగునపు డుత్వద్విత్వములు గలిగి 'నీవృత్; నీవృత్+త్+ఉ=నీవృత్తు'అని రూపమేర్పడును. ఇట్లే ద్వితీయైకవచనమున మకారాంతములై ప్రథమద్వితీయైకవచనాంత తుల్యత్వములను రెండిటిని బొందఁదగినవాని నిందేలింగముగలవానినైనను జేర్చి రూపముల సాధించికొనునదని యిది యాకృతిగణమను సూరిమాట కభిప్రాయము. నీవృచ్ఛబ్దము దేశవాచకము. 70చే నిత్యముగ వీనికి ద్వితీయాంతతుల్యత సిద్ధించుచుండుటంజేసి ప్రథమాంతతుల్యతయుఁ బక్షమునఁ గుదుర్ప 70 విధికి వికల్పప్రవృత్తిని గూర్ప నీసూత్రమారబ్ధమయ్యెననుట స్పష్టము.

**ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాషనగు. ౨౪.**

హనుమానుఁడు-హనుమంతుఁడు-భగవానుఁడు-భగవంతుఁడు - ఇత్యాది.

టీ. కొన్నిచోటులందు మతుబంతములైన శబ్దములందలి మతుప్ప్రత్యయమునకు సంబంధించిన తవర్ణమునకు 'ఆన' అనునది, యాదేశము వికల్పముగనగు. 'ఆన' అని యదంతముగ నాదేశించుట డుజర్థమె యనుట స్పష్టము. హనుమత్:—ఇందు 'మత్' అనునది మతుప్ప్రత్యయభాగము. అందుఁ దుదిపొల్లుతకారమునకు 'ఆన' అనునది

యాదేశముగాఁగ 'హనుమ+అన=హనుమాన' అని ప్రాతిపదిక మేర్పడును. ఇపుడిది యదంతపుంలింగమహద్వాచకమగుట నుత్వడుజ్ఝులు 21-22 లచేఁ గలుగ హనుమానుఁ డని రూపమగును. ఇట్లే 'భగవత్' అను మతుబంతము దీనిచే 'భగవ+అన=భగవాన' అని యదంతమై యుత్వడుజ్ఝులనంది భగవానుఁడనియగును. డుమంతమగునపుడు డుమంత కార్యముల న్యాగమాదులను గమనించునది. ఇవి రెండును మతుబంతములేగాన 'అన' అనునదాదేశము గాకున్న పక్షమున 70 చే ద్వితీయైకవచనాంతతుల్యములై (హను- మంతమ్-భగవంతమ్) 71 చే నంతిమమకారలోపమునంది యదంత మహత్పుంలింగము లగుట 21-22 లచే నుత్వడుజ్ఝులనంది హనుమంతుఁడు భగవంతుఁడను రూపములనం దును. ఋత్విగాదులవలెఁ బ్రథమైకవచనాంతతుల్యములగునన్నను 'హనుమత్ భగ వత్' అనువానికిఁ బైరూపములు సిద్ధింపనవకాశములేమిని అనాదేశమును సూత్రింప వలసివచ్చెనని గ్రహించునది. వీనికిఁ బ్రథమైకవచనరూపములు హనుమాన్, భగవాన్ అని యుండునుగాన నదంతములు గాఁజాలమిని, ద్వితీయైకవచనాంతతుల్యత యే సంభ వించుటను అనాదేశమైనపుడు గల్గునట్టివిరూపములు గలుగఁజాలవు. ఇందు హనుమ చ్ఛబ్దమునకు మాత్రము హనుమ యనురూపము, కవిప్రయుక్తమై యగపడెడి. 'హనుమాన్' అను ప్రథమైకవచనమును బ్రాతిపదికముగ నంగీకరించినను దుదినకారము పోవుటకు శాస్త్రములేమిని మకారమునకు హ్రస్వము గల్గిన హనుమరూపము సిద్ధింప నవకాశము గన్పట్టకున్నది. విశ్వకర్త్రిత్యాదినకారాంతములకు 'విశ్వకర్మా' అను మున్నగు దీర్ఘాంతరూపములే ప్రథమైకవచనమున నుండెడిఁగాన 54 చే హ్రస్వము గల్గినపిదప 75 చే నిత్యస్త్రీత్వము సిద్ధింప విశ్వకర్మ మున్నగునవేర్పడెడిఁగాని యిది యట్టిదీర్ఘాకా రాంత ప్రథమైకవచనరూపముగలది గామి హనుమరూప మేర్పడ నవకాశము లేదు. మఱియుఁ దుదిహల్లునకు లోపము గల్గుట సాంతశబ్దములతుది సకారమునకే యిందు సంభవించెడిఁ గాన 'హనుమాన్' అనుదానితుదినున్న పొల్లునకారము పోవుటకు విధియు నగపడదు. 77 లో నాంతమగు మనుజసంజ్ఞగా నెన్ని చేర్తమన్న నిది సహజ నాంతము (హనుమత్) గామిని, స్త్రీత్వాభావమున డుప్రాపమనివార్యమగుటను, నంతిమాక్షరలోపవిధానాభావమునను, నట్లొనర్పనవకాశము గలుఁగదయ్యెను. మఱియు నిది మతుబంతమగుటచే నవశ్యము 70 చే ద్వితీయైకవచనతుల్యమే గావలసి యున్నది. ప్రథమైకవచనతుల్యత్వము నంగీకరించిన నంతిమాక్షరలోపవిధ్యభావమున 68 చే 'హను మాన్న' అని రూపము గావలసివచ్చినది. ఇఁక నకారలోపమును విధించి చతుర్ముఖ ఋత్విగ్విప్రవాచకబ్రహ్మశబ్దమునకువలె నిత్యస్త్రీత్వమును విధించిన హనుమరూప మేర్ప డెడి. ఇట్టియొక్క శబ్దమును సాధింప నిన్నిసూత్రముల రచింపనేల యనియో హనుమ

రూపము శ్వాచిత్కమనియు 'హనుమాన్' అను ప్రకృతినుండిగల్గిన తద్భవమనుట యుచితమనియు సూరి దీనిని సాధింపక విడిచెను. వర్ణలోపము ప్రకృతిదృష్టిని వికృతి నగపడుటc దద్భవపక్షము నె సూరి యాదరించి యుండనోపును. వర్ణలోప-వర్ణాగమ-వర్ణవ్యత్యయములు ప్రకృతికంటె వికృతియందుc గ్రొత్తగc దోcచుటయే తద్భవలక్షణమని లాక్షణికుల యాశయము గదా! కావుననే శబ్దరత్నాకరకర్త 'హనుమ కనిలజుc డనియెన్' అను భారతప్రయోగమును జూపుచు వైకృతముగా దీనిని నిర్దేశించుట పొసcగెడి. వర్ణలోపాదులు గానరామిని హనుమానుc డనుదానిని 'హనుమాన్' అను ప్రకృతినుండి పుట్టినభవముగా లాక్షణికులు తీర్మానింపcజాలరైరి. ఇcక హనుమంతుc డిత్యాదులు ద్వితీయైకవచనాంతతుల్యములై యుత్వదుజ్ఞులను మాత్రమె యందినవగుట నట్టివానిం గూడc దద్భవములుగ నిరూపింపలేరైరి. చింతామ-ణ్యాథర్వణ-బాలసరస్వతీ-యాహోబలపండితీయములు హనుమ రూపమును సాధింపమిc దద్భవమనియే తలంచినవనcదగును. అహోబలపతి 'హనుమానుcడు; భగవానుcడు' అనువానిని ప్రథమైకవచనాంతప్రాతిపదికములనుండి దీర్ఘముమీcద ద్విత్వము బహుళమను విధియందలి బహుళగ్రహణమునంజేసి యిట్టియెడల నుత్వము నిత్యముగcజేసి డువర్ణకమును గూర్చి యుత్పాదించెను. ఈపక్షమున నాతcడుత్వాంతముపై బహుళగ్రహణమునంజేసియే వువర్ణకము వీనికిc గాదని తలంచియుండును. బాలవ్యాకరణమున నిగ్లాసూత్రముచే నుగాగమాంతంబులకుc బ్రథమైకవచనలోప మనివార్య మగుటచేతను బహుళగ్రహణముచే 'ఉగాగమము నిత్యముగనగుట; ప్రథమైకవచనలోపము గలుగకుండుట; డువువర్ణకములలో డువర్ణకమే కలుగుట;' అనునిన్నియసంభవకార్యములను సంభవింపcజేయుట యసంభవమనుయుక్తికమని యెన్ని సూరి యాత్రోవను విడిచి ఆనాదేశమును విధించి సాధుత్వ మవ్వానికి సంపాదించెనని గ్రహించునది. ఈప్రకరణమున మూలమగపడుచినవానికిc దప్పc దక్కినసూత్రములరచన కహోబలుని 'అన్యేషాం చ వా లుగంతస్య' అను మున్నగుసూత్రములవ్యాఖ్యయే మూలమనుటకు సందియము లేదు. (చూ. అహోబ. ప. పుటలు 382-392.) తత్వమరయ సుఖోచ్చారణార్థకోకారము 'హనుమాన్; భగవాన్;' అనువానితుదిని గావ్యవహారమున హనుమాను అనునట్టిరూపములయ్యెననియుం 'హనుమత్' అనుశుద్ధప్రకృతియందలి పొల్లుతకారముతుదిది లోపింప హనుమరూపమయ్యెననియుc దోcచెడి.

### విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు. ౨౫.

స్త్రీలింగత్వాతిదేశంబుచేత నుత్వదుజ్ఞులు లేవని యెఱుంగునది. విశ్వకర్మ - కృష్ణవర్త్మ - అశ్వత్థామ - యువ - యజ్వ - ఇత్యాదులు.

టీ. విశ్వకర్మ మున్నగు ప్రథమైకవచనాంతతుల్యములైన మహద్వాచకనాంత ప్రాతిపదికములకు స్త్రీత్వము నిత్యముగఁ గలుగును. స్త్రీత్వాతిదేశముచేఁ బుంలింగత్వము చెడుటంజేసి 21-22 లచే నుత్వడుజ్ఞులు గలుగవు. 57 చేఁ బ్రథమైకవచనప్రత్యయము నిత్యముగ లోపించును. వీనికి 'విశ్వకర్మా' అనుమున్నగుదీర్ఘాకారాంతరూపములు ప్రథమైకవచనములు. 54 చే హ్రస్వము. స్త్రీత్వము నిత్యమగుటంజేసి 57 చేఁ బ్రథమైకవచనలోపము కాఁగా 'విశ్వకర్మ' మున్నగురూపము లేర్పడెడి. విశ్వకర్ముఁడు మున్నగురూపములు గలుగవని తాత్పర్యము. 'క్వచిన్మనుజసంజ్ఞాయాం డుజ్ఞాంతాన్న విధీయతే' అని యథర్వణుఁడు మనుష్యులపేరులగువానికే యిట్లు డుజ్ఞు రాకుండుట తెల్పెను. దీన విశ్వకర్మాశ్వత్థామేత్యాదులే సూరి చెప్పినస్త్రీత్వమున కర్హములని యథర్వణునియాశయము విశదమయ్యెడి; సరస్వత్యహోబలపతుల ననుసరించి సూరి ''యువా-యజ్వ''అను మఱికొన్నినాంతములకును స్త్రీత్వమును గూర్చి డుమంతములు గాకుండ నడ్డి కృతార్థుఁ డయ్యెను. ప్రౌఢవ్యాకర్త విశ్వకర్ముఁడనియు రూపంబని సూత్రించి 'విశ్వకర్మునికూఁతు' అని యుదాహరించి డుమంత మగుటను నుత్వనిగాగమములచే స్పష్టపఱచుచు భారతప్రయోగ ద్వైవిధ్యముంబట్టి యీసూత్రమును సవరించెను. పాండురంగమాహాత్మ్యమునఁ బ్రయుక్తమైన నిగమశర్మరూపము నిందుఁ జేర్చి సాధింపనగును. 77 నందు నాంతములగు మనుజసంజ్ఞలలో విశ్వకర్మనిగమశర్మాదులం జేర్పమి నవియీసూత్రముచే నగు నిత్యస్త్రీత్వమునకె విషయము లగుట స్పష్టపడియెం గానఁ బ్రౌఢవ్యాకర్తృసవరణము సార్థకము. గుప్తార్థప్రకాశిక, ప్రౌఢవ్యాకర్త డుమంతమగుటకిచ్చిన 'విశ్వకర్మునికూఁతు' అనుప్రయోగమును 'విశ్వకర్మకుఁగూఁతు' అని సవరించి బాలవ్యాకర్తృసిద్ధాంతమునే సార్థకముచేసె. యతిప్రాసనిర్బంధములేని సీసపద్యమునందలి తావగుట ఛందోభంగము గాకుండ నెట్లు సవరించినను దగుంగాని తండ్రికిని బుత్రికకును గల జన్యజనకసంబంధముంబట్టి యట్టిసంబంధము నెఱింగించునది షష్ఠీతత్పురుషమే యనువిషయము ననుసరించియు పైపాఠము బహుపుస్తకగతమగుట ననుసరించియు 'ఇమ్ముగ విశ్వకర్మ' అను మొదలగు ప్రయోగములం గాంచియు డుమంతస్త్రీత్వరూపములు రెండును భారతకర్తకు సమ్మతములె యను ప్రౌఢాశయముతో నట్లు ప్రౌఢవ్యాకర్త వర్తించె ననఁదగును.

చింతామణియందలి హలంతశబ్దసాధనప్రక్రియను సహజముగ గమనించిన విశ్వకర్మాదులను బ్రథమైకవచనతుల్యములనే ప్రాతిపదికములుగ గ్రహించి యగుణవద్గుణప్రక్రియకే పాలుచేయవలసి యుండుటంజేసి యగుణవద్గుణపతితములకైన నిత్యసులోపమున విశ్వకర్మయువయజ్వేత్యాదిరూపములే గలిగెడి. సాధారణముగ మహా

ద్వాచకనాంతములు, డుమ్రహితములైయే ప్రయోగసిద్ధమగుటయు వ్యాకృతి బహుళ ప్రయోగానుసారి యగుటయు నట్లనుటకుఁ బ్రబలప్రమాణములు. మఱియు నిట్టివానిని ద్వితీయైకవచనతుల్యములుగ గ్రహించి ప్రక్రియను నడుపుటకుఁ బ్రయుక్తరూపసిద్ధి సిద్ధింపమి నవకాశము లేదుగదా! ఇఁక గుణవదగుణవద్గణనిత్యశాస్త్రములకు వీనిని బాలు సేయక శుద్ధసంస్కృతప్రాతిపదికములను బ్రాతిపదికముగ గ్రహించు మూఁడవ పద్ధతి లోనివానినిగా నెంచి యంతలోపమునకుఁ బాలుసేయుదమన్న నంతలోపము వైకల్పిక మగుటను నది గలుగనిపక్షమున నాంతములగు విశ్వకర్మాదులకు ద్విత్వోత్వయోగ్యత లేకుండుటను, ద్విత్వోత్వములు చేసినచో 'విశ్వకర్మన్ను' అను మొదలగు ననిష్టరూపములే గలుగవలసివచ్చుటను వీనిని గుణవదగుణవద్గణభిన్నమగు, శుద్ధసంస్కృతప్రాతిపదిక ముల గ్రహించి యంతలోపాది వైకల్పికవిధులచే డుములం గూర్చు మూఁడవగణ మున నిల్ప నవకాశ మగపడదు గదా; కాన నేవిధముగఁ జూచినను జింతామణి ననుసరించి ప్రథమైకవచనతుల్యప్రాతిపదికగ్రహణసులోపములచేతనే వీనికి బహుళప్రయుక్తరూపసిద్ధి పొసఁగుట స్పష్టపడుటంజేసి చింతామణి ననుసరించు సూరియు విశ్వకర్మాదులకు నిత్యస్త్రీత్వము నె యతిదేశించి రూపసిద్ధి సేయుటయుఁ ద్రిలింగలక్షణశేషకర్తయు నిట్టియాశయముతోడనే డుమంతరూపము దుస్సాధమని యెంచి విశ్వకర్ముఁడనియు రూపంబని సూత్రించి సాధించుటయు జరిగెనని తోఁచెడి. కాని 'క్వచిన్మనుజసంజ్ఞాయాం డుజ్మాంతాన్న విధీయతే' అను నాథర్వణము, మూలము డుమ్రూపమునే, సాధించుటను సమర్థించుటంజేసి, విశ్వకర్మాదులు, మూలమతమునఁ బ్రథమైకవచనతుల్యములై హ్రస్వమునంది, పిదప డుమంతములు నిత్యముగనైనవే యని నమ్మవలసియున్నది. కాని యగుణవద్గణాంతర్గతములగు వీని ప్రథమైకవచనమేల నిత్యముగ 'అగుణవతాం సర్వహలాం సోర్లోపః' అనుదానిచే లోపింపదనుశంకయీపక్షమున బాధింపకమానదు. కాన గుణవదగుణవద్గణవ్యతిరిక్తగణమునం జేర్చి శబ్దప్రకృతిని నామముగ నెన్ని (విశ్వకర్మన్) 'అన్యేషాం చ వా లుగంతస్య' అనుసూత్రమునందలి భాషార్థకవాకారమును శాస్త్రసంప్రదాయముంబట్టి వ్యవస్థచేసి యిట్టినకారాంతముల కంతలోపము నిత్యమని యెంచి పిదప డుజ్ఞును వీనికిఁ గూర్చుట కేవల డుమ్రూపసాధనమున కంతకంటె నుత్తమమార్గమని తోఁచెడి. స్త్రీత్వాతిదేశ మేకవచన బహువచనసాధారణమని భావించియుఁ బ్రథమైకవచనలోపము స్త్రీత్వమున కుపలక్షణముగఁ దలంచియు బహువచనముల నివ్వాని కుత్వము సిద్ధింపదని యెంచి ప్రయుక్తప్రసిద్ధములను యజ్వలు బ్రహ్మలు మొదలగువానిని సాధించికొనవలెను.

మహాద్వాచకమయిపుంలింగంబగు బ్రహ్మశబ్దమునకుస్త్రీత్వంబగు.౨౬.

బ్రహ్మ-ఈశబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు తత్త్వ తపోవేదయోగవాచకంబగునేని బ్రహ్మము నాఁబడు

టీ. మహత్తును బోధించునట్టియుఁ బుంలింగ మగునట్టియు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వము నిత్యముగ నగును. ఇది 'బ్రహ్మ'అని ప్రథమైకవచనతుల్యంబగును. 51 చే దీర్ఘమునకు హ్రస్వము. దీనిచే స్త్రీత్వము నిత్యముగఁ గలుగ 57 చేఁ బ్రథమైకవచనలోపము నిత్యముగ నగును. కాన 'బ్రహ్మ'అని రూపమగు. ఇది సృష్టికర్తను, ఋత్విజుని ననఁగా యజ్ఞకర్తచే ధనముఁ గొని యజ్ఞముచేయించువానిని, బ్రాహ్మణునిఁజెప్పును. ఈమూఁడర్థములం జెప్పునపుడే దీనికేతత్సూత్రవిహితస్త్రీత్వము గుదిరెడి. 'వేదస్తత్త్వం తపో బ్రహ్మ' అనుదాని ననుసరించి తత్త్వతపోవేదములం జెప్పునదేని యమహదదంత మయ్యెడిఁగాన ముపర్ణకమునంది 'బ్రహ్మము'అనురూపమునందును. కాన 'బ్రహ్మఁడు'అని మహత్పుంలింగమైనపుడును, 'బ్రహ్మ' అని యమహదదంతమైనపుడును, రూపము లుండవని ఫలితమును గ్రహించునది. డుమంతరూపము దీనికిఁ గలుగదని ఫలితము. స్త్రీత్వమున స్త్రీలింగకార్యములును ముపర్ణకమునందిన నమహదదంతకార్యములను మిగిలినవిభక్తివచనములందు గమనించుచు రూపముల సాధించికొనునది. తత్త్వశబ్దము పరమాత్మబోధకము. తత్త్వతపోవేదవాచకము బ్రహ్మశబ్దము నపుంసకమె యగుటంజేసి సూత్రమునఁ బుంలింగంబగు బ్రహ్మశబ్దమున కనిన, నిష్టరూపసిద్ధి కలుగుచుండ మహద్వాచకదళమేల యనావశ్యకముగ సూరి చేర్చె ననుశంక కవకాశము గలదు. కాని, బహువ్రీహిసమాసాంతమున నున్నదై యన్యపదార్థమును బోధించునిది యొకపుడు పుంలింగమయ్యు మహద్వాచకము గాకుండుట సంభవించెడిఁగాన నట్టిచోటులందు స్త్రీత్వము గలుగకుండుటకై మహద్వాచకదళముం జేర్చెనని గ్రహించునది. 'ఆశ్రితబ్రహ్మము స్వర్గము'అనుచో బ్రహ్మశబ్దము స్వర్గమును జెప్పునదిగానఁ బుంలింగమయ్యు మహద్వాచకము గామి స్త్రీతుల్యము గాలేదు. మహద్వాచకదళమునే యాదరించి పుంలింగదళమును బరిత్యజింతమన్న నపుంసకమైన పరమాత్మవాచకబ్రహ్మశబ్దము మహద్వాచకమయ్యుఁ బుంలింగము గామి దానికి స్త్రీతుల్యత సిద్ధింపకపోవలసివచ్చును. కాన సూత్రస్థములగు పుంలింగమహద్వాచకదళములు రెండును సార్థకము లనక తప్పదు. 'పుం బ్రహ్మణో వేధసశ్చ హ్రస్వత్వేనైవ సంస్థితిః' అనునాథర్వణము మూలము.

ఆత్మేమనిజంతంబులకు నాంతములగుమనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు. ౨౭.

ఆత్మ-ఆత్మము-ఆత్ముఁడు; మహిమ-మహిమము; అణిమ-అణిమము; గరిమ-గరిమము; లఘిమ-లఘిమము; దేవశర్మ-దేవశర్ముఁడు.

టీ. 'ఆత్మన ఇమనంతానాం డావా' అనునదియు, 'క్వచిన్మనుజసంజ్ఞాయాం డుష్ప్రాంతాన్న విధీయతే' అనునాథర్వణమును మూలములు. ప్రథమైకవచనతుల్యములు గాఁదగిన వీనిలో నాత్మేమనిజంతములకు స్త్రీత్వరూపమును, మనుజసంజ్ఞ యగుదేవశర్మ మున్నగువానికి 75 చేఁ బుంలింగరూపమును, సంభవింప నవకాశము లేమి నీవిధాన మావశ్యకమయ్యెను. ఆత్మన్ శబ్దమునకును నిమనిచ్ ప్రత్యయాంతములకును మనుష్యుల సంజ్ఞల కనఁగాఁ బురుషుల పేరులం జెప్పునట్టి నాంతశబ్దములకును స్త్రీత్వము బహుళముగ నగును. పైని పేర్కొన్నవి ప్రథమైకవచనాంతతుల్యములై తెలుఁగున నామములగును. 'ఆత్మా' ఇది ఆత్మన్‌శబ్దప్రథమైకవచనము. 54 చే హ్రస్వము. మహాద్వాచకమై దీనిచే స్త్రీత్వమునందనియపుడు డుజంతమై ఆత్ముఁడగును. అమహాద్వాచకమగునపుడు ముపర్ణకాంతమై 'ఆత్మము' అనురూపము నందును. స్త్రీత్వము గల్గినపక్షమున 57 చేఁ బ్రథమైకవచనలోపము గల్గి మహదమహాద్వాచకములకు రెండిటికిని 'ఆత్మ'అనురూప మేర్పడును. మహిమ మొదలుగొని నాల్గును ఇమనిచ్ ప్రత్యయాంతముల కుదాహరణములు. 'మహిమా' మున్నగునవి వీని ప్రథమైకవచనరూపములు. 54 చే హ్రస్వమును, దీనిచే స్త్రీత్వమును, బిదప 57 చేఁ బ్రథమైకవచనలోపమును గలుగ 'మహిమ' మున్నగురూపము లేర్పడును. ఈనాల్గును నమహాద్వాచకములె యగుటచే స్త్రీత్వము రానిపక్షమున నమహన్నపుంసకసూత్రముచే ముపర్ణకార్హములై 'మహిమము - అణిమము-గరిమము-లఘిమము-' అనురూపముల నందెడిని. దేవశర్మ:—ఇది మనుజసంజ్ఞ, ఒకని పేరనుట. దీని ప్రథమైకవచనము 'దేవశర్మా' అని యుండును. హ్రస్వమును దీనిచే స్త్రీత్వమును గలుగఁ బ్రథమైకవచనలోపము గలిగి 'దేవశర్మ' అని యగును. స్త్రీత్వాభావమున మహాద్వాచకమగుట డుమంతమై 'దేవశర్ముఁడు' అని రూప మేర్పడును. స్త్రీత్వము గల్గినపుడు స్త్రీలింగకార్యములను, బ్రథమైకవచనలోపము ముగాగమాదుల కుపలక్షణమను విషయమును, గమనింపవలెననుట పునరుక్తము. మూలము డాప్రత్యయము స్త్రీలింగసూచకముగను దలంచుటంజేసి 'ఆత్మ' రూపము సుసాధమనియు నది వికల్పమనుటంజేసి యంతలోపముచే 'ఆత్మము - ఆత్ముఁడు' సుసాధములయ్యెడిననియు నెంచెనని తోఁచెడి.

**మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజునాఁబడు. ౨౮.**

రాజు-ఖగరాజు. అమహత్త్వంబునందు-రాజము-వృక్షరాజము ఉపసర్జనత్వంబునందు-హతరాజుఁడు పరశురాముఁడు.

టీ. 'డుః స్యాత్సదా రాజ్ఞః' అనుచింతామణియు, దానిని "స్వార్థప్రధానే భావే స్యాద్రాజ్ఞో డుః పుంసి చేతసే" అని వివరించునాథర్వణమును మూలములు

మహద్వాచకమై యితరపదార్థమును బోధింపని రాజన్ శబ్దమునకు 'రాజు' అని స్త్రీసమముగఁ బ్రథమైకవచనముండును. అనఁగా మహత్తును జెప్పునదయ్యు బహువ్రీహి సమాసాంతమున నున్నదానికి మాత్ర మీవిధి గలుగదని తాత్పర్యము. రాజశబ్దమునకని అకారాంతముగ సూత్రమున నిర్దేశించుటంజేసి తత్పురుషకర్మధారయసమాసములతుది నున్నటజంతమై అకారాంతమైన రాజన్ శబ్దములకును స్వార్థపరములగుటంజేసి యివ్విధి గలుగుట సూచితము. స్వార్థపరమునా నితరపదార్థమును జెప్పకుండుట. బహువ్రీహిని రాజన్ శబ్దమన్యపదార్థమును దెల్పెడిఁగాన నందుఁ దాబోధించునర్థము స్వార్థపరముగాఁ జాలమి నట్టిచోటులందలి దీనివిధికి విషయము గాదని గ్రహించునది. ప్రథమైకవచనాంత తుల్యముగఁగాని; ద్వితీయైకవచనాంతతుల్యముగఁగాని; గ్రహించినను, నీరూపము గలుగఁజాలదుగాన సూరి దీనిని నిపతించి సాధించెనని గ్రహించునది. మఱియు నకారాంతములు సాధారణముగఁ బ్రథమైకవచనాంతతుల్యములే గాఁదగుటచే విశ్వకర్మే త్యాదులవలె "రాజ" అను రూపమే గలిగెడి. కాన నిపతించుట యావశ్యకమయ్యె. నిపతించుట ప్రయోజనశూన్యమగుంగాన దీనిపై వుదుజ్వర్ణకములు గలుగవని గ్రహించు నది. రాజు. ఖగరాజు:—ఇచ్చోఁ దత్పురుషసమాసాంతమునందలి రాజశబ్ద మితరపదార్థ బోధకముగాక ఖగాధిపతిసూచకమే యగుటంజేసి దీనికిని రాజురూపము గల్గెను. మహత్వ మునందనుటంజేసి యమహద్వాచకమగునెడల 'రాజము' అని ముపర్ణకాంతమె అగును. అమహత్వమునఁ బ్రథమైకవచనతుల్యమే యిది యగుంగాన 54 చే ప్రాస్వాంతమును, నమహన్నపుంసకసూత్రముచే ముపర్ణకాంతమును నగునని భావము. ఇట్లే వృక్షరాజ శబ్దమును వృక్షగతమగుశ్రేష్ఠత్వమునే దెల్పునదగుటచే నమహద్వాచక మయ్యెడిఁగాన ముపర్ణకాంతమే యగునని తాత్పర్యము.' హతరాజుఁడు పరశురాముఁ డిత్యాదులందలి రాజన్ శబ్దము స్వార్థపరముగాక పరశురాము నన్యపదార్థమును బోధించునదగుటంజేసి మహద్వాచకమయ్యు రాజురూపమునందక తాబోధించునర్థమున కాధారమగుపదమున కగులింగమునే పొందియుంత్వదుజ్జుల నందెనని గ్రహించునది. ఇట్లే మహద్వాచకమై స్వార్థపరమైన రాజశబ్దమునకు రాజు రూపము గలుగుటను గమనించునది. దీని విస్తృతి సంజ్ఞ 10 సూత్రము టీకలో నరయునది. ఖగరాజశబ్దము ఖగరాజురూపము నందినట్లే వృక్షరాజశబ్దమును 'వృక్షరాజు' అనురూపము నేల యందరాదని శంక గలుగకపోదు. ఖగవృక్షశబ్దములు రెండును నమహద్వాచకములే యైనను దత్పురుషోత్తరపదములే యైనను ఖగశబ్దము ప్రాణివాచకమును వృక్షశబ్ద మప్రాణివాచకమును నగుటచేత ఖగరాజశబ్దము తుదినున్నరాజశబ్దము ప్రభువును జెప్పునదగుటయు వృక్షశబ్దముతుది నున్నదట్లు సమర్థముగాక శ్రేష్ఠతావాచకమగుటయు సంభవించెడిఁగాన ఖగరాజశబ్దము

ఖగరాజురూపమునే వృక్షరాజశబ్దము వృక్షరాజమనురూపమునే పొందునని సంభా వించునది. ఆధిపత్యము ప్రాణినిష్ఠమును బ్రాణివిషయకమును నగుటచేత జడముల కట్టిస్థితి సంభవింపఁజాలదనుట యయుక్తికము గాఁజాలదు. మహత్త్వమును వివక్షించినచో రాజురూప మప్రాణివాచకములకును గావచ్చుననుట పునరుక్తము. కాఁగాఁ బ్రాణివిష యకప్రభుత్వద్యోతకములగు స్వార్థపరములగు రాజన్ శబ్దములకెల్ల రాజురూపము గలుగునని ఫలితము తేలినది.

## జగదింద్రజిత్తులతకారంబునకు లోపంబు విభాషనగు. ౭౯.

జగము - జగత్తు; ఇంద్రజి - ఇంద్రజిత్తు. బుత్వీగాదియగుటం జేసి యింద్రజితుండనియు వాడంబడు.

టీ. ప్రథమైకవచనాంతతుల్యములైన 'జగత్; ఇంద్రజిత్' అనుశబ్దముల తుదినున్న పొల్లుతకారమునకు లోపము వికల్పముగ నగును. ప్రథమైకవచనతుల్యము లైన వీనికి ద్విత్వోత్వములు గలిగిన రూపములే గుదిరెడి. మఱియు 'ఇంద్రజిత్' అనుదానిని బుత్వీగాదులలోఁ జేర్చినను 'ఇద్రజితుండు' అనియే రూపము గలిగెడి. బుత్వీగాదికము మతుబాద్యంతర్గణమని ముందె యుక్తము. ఎట్లు చూచి నను దుదితకారము పోవురూపము సంభవింప నవకాశమగపడమి నీవిధి యనార్థ మయ్యెను. 'జగత్' ఇది జగచ్ఛబ్దప్రథమైకవచనరూపము. 67 చేఁ బ్రథమైకవ నాంతతుల్యమై యిందు నామమయ్యెను. దీనిచేఁ దుదితకారము లోపింప 'జగ' అ అకారాంతప్రాతిపదిక మేర్పడును. పిదప నమహన్నపుంసకసూత్రముచే మువర్ణకము జగమని రూపమగును. దీనిచేఁ దుది పొల్లుతకారము పోనిపక్షమున 63 చే నుత్వద్విత మూలు గలిగి యిగ్లావిధిచేఁ బ్రథమైకవచనము లోపించి 'జగత్తు' అని రూపమగున ఇట్లే 'ఇంద్రజిత్' అను నింద్రజిచ్ఛబ్దప్రథమైకవచనాంతతుల్యప్రాతిపదికము తుదినున 'త్' అనునది దీనిచే లోపింప 'ఇంద్రజి' అగును. పిదప నిగ్లా సూత్రముచే నికారా మయ్యెఁగానఁ బ్రథమైకవచనలోపము రా 'ఇంద్రజి' అనియుఁ బొల్లుతకారము పో పక్షమున బుత్వీగాదిగణమునం జేర్చి ద్వితీయైకవచనాంతతుల్యమును 'బుత్వీజి అనుదానిని నామముగా గ్రహించి 71 చే తుదిమకారమునకు లోపముచేసి 'ఇంద్రజి' అని యకారాంతప్రాతిపదిక మేర్పడినపిదప 21-22 చే నదంతమహద్వాచకమగ నుత్వడుజ్ఞులఁ గూర్చి 'ఇంద్రజితుం' డనియును రూపములను నిష్పాదించికొనవలె తక్కినవిభక్తివచనములందును నీవిధుల కనుగుణముగఁ గార్యముల నూహించికొను రూపముల గమనించునది.

## సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగానగు. ౮౦

ఉరము-ఉరస్సు - వక్షము - వక్షస్సు - అర్చి - అర్చిస్సు - ధనువు-ధనుస్సు - ఆయువు - ఆయుస్సు. బహుళగ్రహణంబునంజేసి పయఃప్రభృతులసకారంబునకు లోపంబు లేదు. పయస్సు - వయస్సు - సరస్సు.

టీ. 'సాంతాదపయఃప్రభృతేః స్లోపః' అనునది మూలము. 68 చే నుత్వద్విత్వములు నిత్యముగ సంప్రాప్తములుగా నీవిధి యారబ్ధము. అమహద్వాచకములైన సకారాంతశబ్దములతుదిసకారమునకు లోపము బహుళముగ నగును. సాంతముల కనుటంజేసి యివి ప్రథమైకవచనాంతతుల్యములు గావనుటయు శుద్ధప్రకృతులనుటయు స్పష్టము. 'ఉరస్' ఇది యురశ్శబ్దప్రకృతి. దీనితుదిపొల్లుసకారము లోపింప 'ఉర' అగును. పిదప నమహన్నపుంసకవిధిచే నకారాంతనపుంసకమగుట మువర్ణకాంతమై 'ఉరము' అని రూపమగును. ఇట్లే సకారాంతముల తుదిసకారమునకు లోపముచేసి యథాసంభవముగ నాయావిధులచే ము-వు-వర్ణకాదులం గూర్చుచుఁ దక్కినరూపముల నూహించికొనునది. సకారలోపము గలుగనిపక్షమున 68 చే నీయుదాహృతులకెల్లను నుత్వద్విత్వములు గలిగిన ఉరస్సు మున్నగురూపములగు టూహ్యము. సకారాంతనపుంసకములగు పయస్ - వయస్ - సరస్ మున్నగువానికి సకారలోపము దీనిచేఁ గలుగకుండను, దానముపర్ణకరూపము లవ్వానికి సిద్ధింపకుండను జేయుటకు సూత్రస్థబహుళశబ్దము సమర్థమగును. బహుళగ్రహణముచే పయము - వయము - సరము మున్నగుననిష్టరూపములు సకారలోపముచే నేర్పడునవి సిద్ధింపవని భావము. నేఁటికావ్యములలో సరశ్శబ్దమునకు మాత్రము సరమని రూపమగపడెడి. హారార్థమున సరశబ్దమకారాంతపుంలింగముగాని సకారాంతనపుంసకము గామి సరమురూపము సిద్ధింపనగును. మీఁది సూత్రము ననుసరించి యిందు సకారాంతము లమహద్వాచకములే చేరఁదగునని గ్రహించునది సకారాంతములఁ బ్రకృతులనే గ్రహించెనన్నఁ బ్రథమద్వితీయైకవచనాంతతుల్యత్వముల విధించు నుభయవిధులకంటె భిన్నముగ మూఁడవమార్గము మూలమువలె నంగీకరించెననవలెను. లేదా ప్రథమాంతముమీఁది విసర్గలు సకారజాతములేయగుట సకారమునే తుదినున్నట్లెంచి ప్రక్రియను నడపెననియోని భావింపవలెను.

## మహద్వాచకంబులగుసాంతంబుల కంతలోపంబేని ద్వితీయైక వచనాంతతుల్యత్వంబే నగు. ౮౧.

అంగిరుఁడు - అంగిరసుఁడు - ఉగ్రశ్రవుఁడు - ఉగ్రశ్రవసుఁడు-ప్రచేతుఁడు - ప్రచేతసుఁడు - ఊర్ధ్వరేతుఁడు - ఊర్ధ్వరేతసుఁడు.

డుజ్జులు గలుగకుండ స్త్రీవద్భావమును, వేధశ్శబ్దమునకు నిత్యముగ నిపతింపఁబడెననియు నకార్యములు పురోధశ్శబ్దమునకు వికల్పముగఁ గలుగుటయును నవి రానిపక్షమున 81 చే ద్వితీయైకవచనాంతతుల్యమగుటయును, నిపతితము లయ్యెననియు సూరి ప్రాయు వేధశ్శబ్దమునకను నీక్రిందివివరణమున కభిప్రాయము. వేధస్:—ఇది సాంతమహ ద్వాచకమగుటచే నంత లోపము 81 చే వికల్పముగఁ గలుగుచుండ నిత్యముగను, విదప 21-22 చే నుత్వడుజ్జులు రాకుండ 57 చేఁ బ్రథమైకవచనలోపము నిత్యముగను, నిపతితము లయ్యెననియు, ఇట్లే 'పురోధస్' అను సాంతమహద్వాచకమునకుఁ బూర్వ సూత్రముచే సలోపమును 57 చేఁ బ్రథమైకవచనలోపమును వికల్పముగ నగుటయును బక్షమున ద్వితీయైకవచనాంతతుల్యమగుటయును నిపతితములయ్యెననియు సూరి నిపతన ప్రక్రియను నిర్వచించెనని తాత్పర్యమును గ్రహించునది.

మనఃప్రభృతులసకారంబునకు ద్విత్వంబు విభాషనగు. ౮3.

మనసు - మనస్సు-శిరసు-శిరస్సు-సదసు-సదస్సు. సలోపంబయ్యె నేని - మనము - శిరము - సదము.

టీ. అమహద్వాచకములైన సాంతశబ్దములతుదిసకారమునకు ద్విత్వము వికల్పముగ నగును. ద్విత్వము మాత్రమే వికల్పమనుటంజేసి యుత్వము, ద్విత్వము రానపుడు నిత్యముగఁ గలుగునని గ్రహించునది. 68 చే నిత్యముగ నుత్వద్విత్వములు గలుగవలసి యుండ నీవిధి ద్విత్వము మాత్రము వికల్పముగఁ గూర్చుట కారబ్ధమయ్యెనని యూహించునది. మనస్:—దీనిచేఁ దుదిసకారమునకు ద్విత్వము రానిపక్షమున నుత్వమే కలిగి 'మనస్+ఉ=మనసు' అని రూపమగును. ద్విత్వము గల్గినపుడు 'మనస్-స్-ఉ= మనస్సు' అని రూపమగును. ఈరెండును గలుగనపుడు 80 చేఁ దుదిసకారము లోపించి ముపర్ణకాంతమై మనమనురూప మేర్పడును. ఇట్లే తక్కినవానికిని నుత్వ-ద్విత్వోత్వ-ముపర్ణకముల తోడి మూఁడురూపము లేర్పడుటను గమనించునది. అమహద్వాచక సాంతముల కుత్వ-ద్విత్వోత్వ-ముపర్ణకరూపములను, మహద్వాచకసాంతముల కంత లోప-ద్వితీయైకవచనాంతతుల్యత్వములచే డుజంతరూపములను, గ్వాచిత్కముగ నమహ త్సాంతములుగొన్ని నిత్యముగ ముపర్ణకమునందరాని వగుటను, నట్లే మహత్సాంతములు గొన్ని నిత్యముగ స్త్రీతుల్యము లగుటను, బ్రకరణమునుబట్టి యథాసంభవముగ గ్రహింప వలెను. సూత్రములందు - సాంతనిర్దేశమునంజేసి ప్రథమైకవచనతుల్యములు మాత్రము సాంతములు గాఁజాలవని గ్రహింపఁదగును. మూలము గుణవద్ధణశబ్దములు ద్వితీయైక వచనతుల్యములును, నగుణవద్ధణశబ్దములు ప్రథమైకవచనతుల్యములును నగునని

శాసించి యీ రెంటను జేరనివి యథావస్థిత శుద్ధప్రాతిపదికములే నామములగు ననియు నభిప్రాయమును సూచించెను. సూరి యట్టిమార్గము నాదరింపమి 67-70 సామాన్యవిధులకు సాంతశబ్దప్రాతిపదిక స్వీకారప్రక్రియ విరోధించెడి. కాని సున్న సకారజాతముగాన సకారాంతముగ సహజస్వరూపముంబట్టి నిర్దేశించెనన్న నంతగ నట్టి విరోధము తోఁపదని తోఁచెడి.

## ద్యుహృచ్ఛబ్దంబులకు దివి హృది యగు. ౮౮.

దివి - దివులు - హృది - హృదులు.

టీ. 'భూదివోస్తు ఙౌయత్తత్' అనునది మూలము. ద్యుహృచ్ఛబ్దములనునది సమాసము. ఇందు 'ద్యు' అనునది దివ్ శబ్దమును బోధించెడి. (ద్యౌః) సమాసమున దివ్ శబ్దమును ద్యురూపమున బోధించుట యవిరుద్ధము. ప్రథమద్వితీయైకవచనాంతములు నామములుగ గ్రహించినను నీరూపములు గలుగవుగాన వీనిని నిపతింపవలసి వచ్చెను. ద్యుశబ్దమునకు దివి యనియు హృచ్ఛబ్దమునకు హృది యనియుఁ బ్రథమైక వచనము లగునని భావము. ద్యుహృచ్ఛబ్దముల సంస్కృత సప్తమ్యేకవచనములు ప్రాతిపదికములుగ తెనుఁగున వాని నేర్పడునని తాత్పర్యము. ఇకారాంతప్రాతిపదికము లేర్పడుటం జేసి యిగ్లొ సూత్రముచేఁ బ్రథమైకవచన లోపమును బహుత్వమున 45 చే నుత్వమును మున్నగు నిదంతకార్యముల గమనించుచు, రూపముల సాధించికొనునది. ద్యుశబ్దమునకు దీనిచే దివి కలిగిన పిదప నిగ్లొసూత్రముచేఁ బ్రథమైకవచనము లోపింప 'దివి' యని ప్రథమైకవచనము సిద్ధించును. 'దివి + లు'-45 చే నుత్వము రా దివులని యగును. ఇట్లే తక్కినరూపముల ప్రక్రియను గమనించునది. హృచ్ఛబ్దమిందుఁ బ్రయోగదృష్టిని గ్రొత్తగ గృహీతము. దివియనుదానిం గొందఱు వికృతిగా జెప్పినను, నిందు సమముగానే యెన్నఁబడి ప్రక్రియ చూపఁబడెను. 'ద్యౌ హృత్తు' అను ననిష్టరూపములు గలుగకుండుటే యీవిధికిఁ బ్రయోజనమని ఫలితము.

## స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులంగూడి యిందుఁ బ్రవర్తిల్లు. ౮౯.

| నామము. | | స్త్రీప్రత్యయాంతము. | | తత్సమము. |
|---|---|---|---|---|
| కర్తృ | ... | కర్త్రీ | ... | కర్త్రి. |
| జనయితృ | ... | జనయిత్రీ | ... | జనయిత్రి. |
| భాగ్యశాలిన్ | ... | భాగ్యశాలినీ | ... | భాగ్యశాలిని. |
| బుద్ధిశాలిన్ | ... | బుద్ధిశాలినీ | ... | బుద్ధిశాలిని. |

| నామము. | స్త్రీప్రత్యయాంతము. | తత్సమము. |
|---|---|---|
| మతిమత్ ... | మతిమతీ ... | మతిమతి. |
| గుణవత్ ... | గుణవతీ ... | గుణవతి. |
| విద్వత్ ... | విదుషీ ... | విదుషి. |
| వనజముఖ ... | వనజముఖీ ... | వనజముఖి. |
| | వనజముఖా ... | వనజముఖ. |
| మీననేత్ర ... | మీననేత్రా ... | మీననేత్ర. |

అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు జీప్ప్రత్యయంబు లేమిం జేసి మీననేత్రి-పద్మనేత్రి-ఇత్యాదు లసాధువులు.

టీ. 'నియతస్త్రీప్రత్యయస్తు సర్వాసామ్' అనునది మూలము. సంస్కృతముననున్న స్త్రీలింగశబ్దములెల్ల వానివానికి స్త్రీత్వమునఁ గల్గిన టాబాదిస్త్రీప్రత్యయములతోఁ గూడియే తెలుఁగునఁ బ్రవేశించునని భావము. కర్తృ:—ఇది ఋకారాంతము. ఋకారాంతమునకు స్త్రీత్వమున జీప్ సంస్కృతవ్యాకృతిచేఁ గల్గి కర్త్రీ యగును. ఇది జీబంతమైయే తెలుఁగునఁ బ్రవేశించుట దీనిచేఁ గుదిరెడిఁగాన 54 చే హ్రస్వము గలిగి 'కర్త్రి' యని నామ మేర్పడును. ఇగ్లోసూత్రముచేఁ బ్రథమైకవచనలోపమగు. ఇట్లే 'జనయితృ' అనునది 'జనయిత్రీ' అని జీబంతమగుంగాన జనయిత్రి యని యిందుఁ బ్రథమాంతము సిద్ధించెడి. ఈరీతిగనే 'భాగ్యశాలిన్-బుద్ధిశాలిన్-' అనునకారాంతములు స్త్రీత్వమున జీబంతము లయ్యెడిఁగాన వానికిఁ దెలుఁగున 'భాగ్యశాలిని-బుద్ధిశాలిని' అని ప్రథమైకవచనములు గుదిరెడి. 'మతిమత్-గుణవత్-విద్వత్' అను నీమూఁడును నుగి దంతములగుటచే సంస్కృతమున స్త్రీత్వమున జీబంతము లగుంగాన వానికిఁ దెలుఁగున హ్రస్వమును బ్రథమైకవచనలోపమునుగలుగ 'మతిమతి-గుణవతి-విదుషి' అనురూపములు ప్రథమైకవచనమున సిద్ధించెడి. బహువ్రీహిసమాసము తుదినున్నవై సంయుక్తవర్ణముప ధగాఁ గలుగనివై యదంతములైన యవయవవాచకములగు ముఖాదిశబ్దములు జీషంత ములు వికల్పముగ సంస్కృతమున నగుంగాన జీషంతమైన 'వనజముఖీ' యనియుఁ జీషం తము గాక టాబంతమైన 'వనజముఖా' యనియుఁ దెలుఁగున హ్రస్వము గలిగినరూపము లేర్పడెడి. సంయోగముపధగాఁగల శబ్దములలో 'నాసికోదరోష్ఠజఙ్ఘాదంతకర్ణశృఙ్గేభ్యశ్చ- అఙ్గగాత్రకణ్ఠేభ్యో వక్తవ్యమ్' అనువాని ననుసరించి "ఓష్ఠ-జఙ్ఘ-దన్త-కర్ణ-శృఙ్గ-అఙ్గ; గాత్ర-కణ్ఠ" అను నెనిమిదింటికిఁ దప్పఁ దక్కినవెల్ల జీషంతములనఁగా నీకారాంత ములు గాఁజాలవు. పైనిపేర్కొన్న యెనిమిదింటిలో 'నేత్ర'యను సంయోగోపధశబ్దము చేరమింజేసి సంస్కృతమున నీకారాంత మది గాఁజాలదు. కావున 'మీననేత్రి-పద్మ

నేత్రి' అను నీకారాంతములకు హ్రస్వము గూర్చినరూపము లలాక్షణికము లసాధువు లయ్యెడి. సంస్కృతమున నే వానికీకారాంతత సిద్ధింపనియపుడు తెలుఁగున నవ్వాని కిదంతత పొసఁగుట యసంభవమని తాత్పర్యము. మీననేత్ర:—ఇం దంత్యవర్ణ మకారము. దానికిఁ బూర్వముననున్నది సంయుక్తవర్ణముగాన నిది సంయోగోపధ మయ్యెను. అంత్యవర్ణమునకు ముందున్నదాని నుపధయని పేరని ముందె తెలుపఁబడినది. ఇట్టి సంయోగోపధములలోఁ బైని జేర్కొన్న అఙ్గగాత్రాదులగు నెనిమిదిశబ్దములకేగాని యితరములకు జీష్ కలుగమింజేసి యవి యీకారాంతములు సంస్కృతమున స్త్రీత్వ వివక్షయందుఁ గాఁజాలవు. కాన మీననేత్ర-పద్మనేత్రాదిసంయోగోపధంబులు సంస్కృతమున స్త్రీత్వమున టాబంతములే గాఁదగుటంజేసి యీకారాంతములుగ భ్రమించి హ్రస్వముఁ గూర్చి ప్రయోగించిన మీననేత్రిపద్మనేత్రీత్యాదు లసాధువులని యంగాదులకను సూరి యీక్రిందివివరణమున కభిప్రాయము. తెనుఁగునఁ బరసవర్ణ స్థానమునను బిందువిడుట యాచారమైనను నాబిందువుకూడికచే వర్ణములు సంయుక్తములగుననియే భావించి అంగ-కంఠేత్యాదుల సంయోగోపధంబులుగనే గ్రహింపవలయును. అంగాదులలోఁ జేరని మీననేత్రేత్యాదులకు సంయోగోపధంబులకును నీకారాంతత తెలుఁగున గొన్నిచోటులందుఁ గవిప్రయోగములఁ జూపట్టెడి. ముగ్ధబోధాది సంస్కృతవ్యాకృతులం దంగాదిభిన్నములకును నీకారాంతత యంగీకృతమై చూపట్టు: ఇట్లుండ 'నేతృ' అనుఋకారాంతము స్త్రీత్వమున 'నేత్రీ' అని జీబంతము (ఈకారాంతము) గాఁదగుఁగాన మీననేత్రీత్యాదులందలి నేత్రిశబ్దమునకు మీనముల నేలునదియని కొందఱర్థము చెప్పుచు నుపమేయము నిరూపితముగాకున్నను మీనములకును నేత్రములకును సాటి కవిసమయప్రసిద్ధమగుటచే నుపమానముచేతనే యుపమేయమును దానియందము మున్నగునవియు గమ్యములగునని దలంతురు. ఇట్లే పద్మనేత్రీత్యాదులందును బద్మములఁ శాసించునదని యర్థముచేసి పదములకును నేత్రములకును సాదృశ్యము సహజముగ నుండుటచే నేత్రములయందము పద్మములసొరును ధిక్కరించునని గమ్యము ననుమానింతురు. ఈరీతిగ వీని సాధుత్వపరికల్పనమున కొక కృత్రిమమార్గము గనుపట్టుననుటకె పైవిషయము నిరూపితము. కాని యిట్టివాని కుపమిత సమాసమే ప్రసిద్ధమును నదియె యుపమానోపమేయసాదృశ్యప్రతిపాదనశక్తమును నని యంగీకరింపక తీరదు.

సామాన్యముగ సంస్కృతశబ్దములలో నదంతములకు స్త్రీత్వవివక్షయందు 'టాప్' అను ప్రత్యయమును 'వన్-మన్' అనునవంతమందుఁగల శబ్దములకు 'డాప్' అనునదియు 'వ్య' అనునదంతమందుఁగల వానికి 'చాప్' అనునదియుఁ గలిగి ప్రకృతు

లాకారాంతము లయ్యెడి. ఇట్లే 'జీప్-జీష్-జీన్' అనువానిసంబంధముచేఁ గొన్ని యీకారాంతము లగును. అట్లె, 'ఊజ్' అనునది చేరుటచేఁ గొన్ని యుకారాంతము లూకారాంతము లగును. తిప్రత్యయయోగముచే యువన్‌శబ్దమునకు యువతి యనురూపము నందును. ఇట్లాయాయీయా స్త్రీప్రత్యయముల కలయికచే నేర్పడిన స్త్రీలింగములలో హ్రస్వాంతమగుయువతి యనుదానిని యథావస్థితముగను దక్కినదీర్ఘాంతములను హ్రస్వము గూర్చియుఁ దెలుఁగున స్వీకరించి వానివానికి హ్రస్వాంతముల కగుకార్యములఁ జేయుచు నాయావిభక్తులందును వచనములందును, రూపముల నుత్పాదించికొనవలసియుండును. ఆయాస్త్రీప్రత్యయములు చేరునపుడు ప్రకృతులందుఁ గల్గెడు నచ్చులలోపము మున్నగు నవాంతరకార్యవిశేషముల నాద్యవ్యాకరణమునుబట్టి తెలిసికొనవలెను.

## మహతీతరంబులగు స్త్రీలింగంబులవిశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాషనగు. ౮౬.

పద్మలత మనోహారి - పద్మలత మనోహారిణి-హృద్యంబగువిద్య-హృద్యయగువిద్య. మొదవులలోఁ గపిల వరిష్ఠంబు-కపిల వరిష్ఠ.

టీ. 'ఉభయవిధమమహతీనామ్' అనునదియు, 'అప్రాణివాచినామత్ర భవేదమహతాం స్త్రియామ్, ద్విధావిశేషణం తత్ర మానం సువచసాం వచః'' అని దానిని వివరించు నాథర్వణమును మూలములు. స్త్రీవాచకములు గానట్టి స్త్రీలింగశబ్దములవిశేషణములకు నపుంసకలింగత్వము వికల్పముగనగును. ఇయ్యది స్త్రీవాచకములుగాని సంస్కృత స్త్రీలింగశబ్దములకు విశేషణములైన సంస్కృతశబ్దములకు సంబంధించినవిధి. సంస్కృత స్త్రీలింగశబ్దముల సంస్కృతవిశేషణములు కారకము 19 సామాన్యవిధి ననుసరించి స్త్రీలింగములే గావలసియుండ స్త్రీత్వమే గాక నపుంసకతయుఁ గలుగునను విశేషము నీవిధి తెలిపెడి. సామాన్యముగ శబ్దములు ప్రాణివాచకములును నప్రాణివాచకములును నని ద్వివిధములగు. అం దప్రాణివాచకములును బ్రాణివాచకములలో స్త్రీతిర్యక్కులను జెప్పునవియును నమహత్తులు నాఁబడును. ఆయమహత్తులలోను, కొన్ని స్త్రీలింగములును గొన్ని యస్త్రీలింగములును నగును. ఆస్త్రీలింగములలోను గొన్ని స్త్రీవాచకములను గొన్ని స్త్రీవాచకములు గానివియు నగును. 'రమా-గౌరీ-వధూః' అనునిట్టివి స్త్రీవాచకములు. 'లతా-మతిః-భ్రూః-కురరీ' అనునట్టివి స్త్రీవాచకములుగాని స్త్రీలింగములు. స్త్రీలింగములలోనన్నియు స్త్రీలను బోధించునవి గాఁజాలవనియు, నందుఁ గొన్ని స్త్రీవాచకములును గొన్ని ప్రాణివాచకములును గొన్ని యప్రాణివాచకములును గాఁజాలుననిi

తాత్పర్యము. పైని వివరించిన స్త్రీలింగశబ్దముల విధముననుండు స్త్రీలింగసంస్కృతశబ్దములలో స్త్రీవాచకములుగాని యెల్ల సంస్కృత స్త్రీలింగశబ్దములకు విశేషణములైన సంస్కృతపదములకు స్త్రీలింగత్వమును నపుంసకలింగత్వమును గలుగునని యీసూత్రమున కభిప్రాయము. మహతి=స్త్రీ. స్త్రీని బోధించునదని భావము. మహతీతరము=స్త్రీని జెప్పనిశబ్దము. మహతీతరస్త్రీలింగములు=స్త్రీనిబోధింపని స్త్రీలింగములైన సంస్కృత శబ్దములు. పద్మలత మనోహారి:—పద్మలతాశబ్ద మాకారాంత స్త్రీలింగము. స్త్రీలింగమైనను స్త్రీనిజెప్పదుగాన మహతీతరము. 54 చే హ్రస్వముచేయఁ దెలుఁగునఁ గల్గిన రూపము. పూర్వసూత్రముచే నియతస్త్రీప్రత్యయములతోడఁ బ్రవేశ మంగీకృతము. ఇట్టిపద్మలతాశబ్దమునకు 'మనోహారిన్' అనునది విశేషణము. దీనికి నపుంసకలింగమును నీవిధిచేఁ గలుగునుగాన 'మనోహారి' అను నపుంసకలింగవిశేషణము గుదిరెను. నపుంసకత్వము గలుఁగనిపక్షమునఁ బద్మలతాశబ్దము స్త్రీలింగమగుటఁ దద్విశేషణమగు 'మనోహారిన్' అనుదానికిఁ గారకము 19 చే స్త్రీలింగమే సిద్ధించెడిఁగాన 'మనోహారిణీ' అను జీబంతరూపమే సంభవింపఁగాఁ దెలుఁగున దానికి హ్రస్వముఁ గూర్ప 'మనోహారిణి' యగును. ఇట్లే రెండవ యుదాహరణమునందలి విద్యాశబ్దము స్త్రీలింగము. ఇది స్త్రీని బోధింపదుగాన నమహతీవాచకము. దీనికి విశేషణమగునది హృద్యశబ్దము. దీనికి నపుంసకత్వ మీవిధిచేఁ గలుఁగ నమహన్నపుంసకసూత్రముచే మువర్ణకాంతమై హృద్యమని యగును. హృద్యమగువిద్య యని భవత్యర్థవ్యవహితముగా (అగు)ఁ జూపుట స్పష్టార్థము. ఇట్లే తృతీయోదాహరణము. కపిలశబ్దము గోవాచకము స్త్రీలింగము. స్త్రీవాచకము గామి మహతీతరము. దీనివిశేషణమగు పరిష్ఠశబ్దమునకుఁ గ్లీబత్వముఁ గల్గినపక్షమున మువర్ణకాంతమై పరిష్ఠమనియు స్త్రీత్వమే గల్గినపుడు పరిష్ఠ యనియు నుండును. ప్రాణివాచకములైనను నప్రాణివాచకములైనను, స్త్రీవాచకములుగాని స్త్రీలింగశబ్దములకే యివ్విధి గలుగుననుట కుదాహరణత్రయ మీయఁబడినది. దీన స్త్రీలింగ స్త్రీవాచకములు భిన్నములనియు స్త్రీలింగములైనవెల్ల స్త్రీవాచకములు గాఁజాలవనియు స్త్రీవాచకము మాత్రము స్త్రీలింగముగానోపుననియు (దారకళత్రశబ్దములుతప్ప) ఫలితము తేలినది. మహతీతరస్త్రీలింగముల కనుటంజేసి మహతీవాచక స్త్రీలింగముల విశేషణములు స్త్రీలింగములే యగునని గ్రహించునది. దారకళత్రశబ్దములలో దారశబ్దమునకు బహుత్వమందె పుంస్త్వము నియతమగుటంజేసి స్త్రీవాచకమైనను స్త్రీలింగము గామిని నదంతామహద్వాచకమగుటను దారములనియు; నేకత్వమునఁ బుంస్త్వము గుదురమిని, 'నిజాగ్రదారన్; నయవిదుదార;' అను మున్నగుప్రయోగము లగపడుటను, నేకత్వమున టాబంతమైనగతిని 'దార' అని స్త్రీలింగరూపమే యేర్పడుననియుఁ; గళత్ర

శబ్దము స్త్రీవాచకమైనను నిత్యనపుంసక మగుటచే నమహాన్నపుంసకసూత్రముచే ముపర్ణ కాంతమె యయి 'కళత్రము, కళత్రములు' అనురీతిగ నుండుననియుఁ దెలియవలయును. కాఁగా స్త్రీవాచకములయ్యు నీరెండును స్త్రీలింగములు గామింజేసి వీని విశేషణముల కేలింగము గలుగునో యని సందియము పొడమక తీరదు. సంస్కృతశబ్దముల లింగమశిష్యమగుటంజేసి యివ్విషయమున నీరెండుశబ్దములందలి స్త్రీవాచకత్వము నే యాధారముగఁ గొని యెల్లయెడల వీనివిశేషణములు స్త్రీలింగములే యగుననియు నుత్తమశీల ధార-మనోహారిణి కళత్రమనియే యెతద్విశేషణములు స్త్రీలింగములై యుండు ననియు గ్రహింపవలెననితోఁచెడి. కారక 19 చే విశేష్యలింగవిభక్తివచనములే విశేషణముల కగుటను గమనించునది. ఇఁక నిది సంస్కృతస్త్రీలింగములకు సంస్కృతశబ్దములు విశేషణములగునపుడగువిధియని తేలినదిగానఁ దెలుఁగున లింగము లేమింజేసి స్త్రీవాచకాంధ్రశబ్దములకు పడఁతి మున్నగువానికి విశేషణములైన సంస్కృతశబ్దముల కేలింగము గల్గునో మఱియు స్త్రీవాచకములుగాని తెలుఁగుస్త్రీసమశబ్దముల సంస్కృతవిశేషణముల కేలింగము గలుగవలయునో సూరి విశదపఱుపమి నరయవలసి వచ్చినది. తండ్రి-అన్న మొదలగునవి స్త్రీసమములైనను మహద్వాచకము లగుటచే వానిసంస్కృతవిశేషణములు పుంలింగములగుననియుం పఁడతి-లచ్చి మున్నగునవి స్త్రీసమములైనను నవి స్త్రీవాచకము లగుటంజేసి వానిసంస్కృతవిశేషణములు స్త్రీలింగములే యగుననియుఁ, జెట్టు-పిట్ట-మున్నగునవి స్త్రీవాచకములు గాక స్త్రీసమములగుటంజేసి వానిసంస్కృతవిశేషణములు నపుంసకములే యగుననియు గ్రహింపవలెనని తోఁచెడి. మహదమహన్మహతీవాచకత్వము ననుసరించి స్త్రీసమాంధ్రశబ్దముల సంస్కృతవిశేషణములలో మహద్వాచకవిశేషణమునకుఁ బుంలింగమును, నమహద్వాచకవిశేషణమునకు నపుంసకమును, మహతీవాచకవిశేషణమునకు స్త్రీలింగమును నగునని సామాన్యముగ ఫలితము గ్రహింపఁదగు. దీన 'భాగ్యశాలిని పడఁతి - బుద్ధిమతి - ఉవిద' అని స్త్రీవాచకాంధ్రశబ్దముల విశేషణములు స్త్రీలింగములే యగుననియు, 'మనోహరము-నెమిలి - హృద్యమగు విద్దె-సుందరమగుచందమామ' అని మహతీవాచకభిన్న స్త్రీసమవిశేషణములు నపుంసకములె యగుననియుం ఫలితమును గ్రహించునది. కొన్ని స్త్రీసమము లయ్యు స్త్రీవాచకములుగ నెన్నుట చూపట్టెడి. 'మిన్నేరు' అనునది యాకాశగంగాబోధకము. ఈపక్షమున నిది యమహద్వాచక స్త్రీసమమగును. కాన దీనిసంస్కృతవిశేషణము 'రమ్యము మిన్నేరు' అని ముపర్ణకాంతమె గావలెను. కాని గంగను స్త్రీవ్యక్తిగా నెన్ని 'శివజటాజూటవాసిని మిన్నేరు' అని స్త్రీలింగవిశేషణమును నిల్పుటయుఁ గాననగును. ఇఁక సామాన్యముగ విశేషణములైన యచ్చతెలుఁగుపదము లవిభక్తికములును, స్త్రీసమములును, నలింగ

ములును నగుట సంస్కృతాసంస్కృతవిశేష్యముల విశేషణములగు దెలుఁగు శబ్దముల కేలింగము గలుగుననువిషయము విశదీకరింప నక్కఱ లేదనియుఁ నట్టివి తమ సహజరూపముతోడనే (స్త్రీసమ) యెల్లప్పుడొప్పుననియుఁ జెప్పనొప్పును.

భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు. ౮౭.

భవదాదులగు హలంతసర్వనామంబులకును శతృరేఫాంతాదులకును దెనుఁగుభాషయందు వ్యవహారంబు లేదని యర్థము. సమాసంబులం దొలుతం గదిసి యిందుం బ్రయుక్తంబులగు. భవద్గుణంబులు - త్వదాశ్రయము - మత్పుణ్యము - లసద్రూపము - భవిష్యత్కాలము - ధూర్వహము - ఇత్యాదు లెఱుంగునది.

ఇది తత్సమపరిచ్ఛేదము.

---

టీ. 'భవద్గిర్ముఖశబ్దానామాద్యయోర్వ్యష్టదస్మదోః, భాషాయాం న ప్రయోగస్స్యాదితి సిద్ధాంతపద్ధతిః' అనునాథర్వణము మూలము. భవత్-తత్-యత్-యుష్మత్-అస్మత్ - మున్నగుహల్లంతమందుఁ గలిగినసర్వనామములకును, గచ్ఛత్ - లసత్ మున్నగుశతృప్రత్యయము తుదిఁజేరిన రూపములకును, గీర్-దూర్ మొదలగురేఫాంత శబ్దములకును, దెలుఁగున స్వతంత్రముగఁ బ్రయోగార్హత లేదని యర్థము. సంస్కృత సమాసము తొలుతనున్నవై యనఁగాఁ దాము కొండొకపదముతో సమసించినవై సిద్ధసమాసమురాక మూలమునఁ దెలుఁగున నివి తోఁచిన తోఁపవచ్చును. మొత్తమమీఁద సిద్ధసమాసాద్యవయవములుగనో యంతరవయవములుగనో యున్నవై సిద్ధసమాసము మూలమున నివి తెలుఁగునఁ గలిగెడిఁగాని సిద్ధసమాసము తుదినున్నవానికిని వ్యస్తములకును దెనుఁగునఁ బ్రవేశము గలుగదని గ్రహింపనగును. సిద్ధసమాసాంతావయవములైన వీనికిఁ బ్రవేశమే యంగీకృతమగునెడల నీవిధికిఁ బ్రయోజనమే శూన్య మయ్యెడిఁగాన వ్యస్తముననను సమాసాంతముననను వీనికిఁ బ్రయోగము గలుగదనియే చెప్పవలెను. ఇయ్యవాద్యవ్యాకరణపద్ధతి ననుసరించి సంస్కృతపదములతోడ సమసించినవై యాయా సమాసములనాదిమధ్యావయవములుగ నున్నవై యాయాసమాసముల మూలమునఁ దెలుఁగునఁ గలుగనగునని తాత్పర్యము. భవద్గుణములు:—ఇందు 'భవత్' అను సర్వనామము గుణశబ్దముతోడ సమసించినదై 'భవద్గుణ' అనుసమాసముమూలమునఁ దెలుఁగునఁ గల్గెను. ఇట్లే 'తత్-మత్' అను సర్వనామము లాయాశబ్దములతోడ సమ

సించి సమాసాద్యవయవములై సమాసముమూలమునఁ దెలుఁగునఁ దోఁచెను. అట్లే 'లసత్-భవిష్యత్' అనుశత్రంతములు సిద్ధసమాసాద్యవయవములై సమాసముమూలమునఁ దెనుఁగునఁ జూపట్టెడి. ఈరీతిగనే 'ధూర్' అను రేఫాంతశబ్దము సిద్ధసమాసము తోలుత నున్నదై సమాసముమూలమునఁ దెనుఁగునఁ గన్పట్టెడి. ఇంకను దెనుఁగునఁ గలుగనివి తిజంతాదులు గలవుగాని యివి సుబంతవిషయమగుట సుబంతములలో నిట్టివి మాత్రము తెలుఁగునఁ బ్రయోగింప నర్హములని తెలిపెనని గ్రహించునది. అనుకరణమున నెల్లశబ్దములును దెలుఁగునఁ గలుగనగుననుట మునుపె నిరూపితము. మఱియు నిందుఁ జెప్పిన భవచ్ఛత్రాదులకే గాక 'సర్వత్ర-సర్వథా-పరితః-సర్వతః-' మున్నగునవ్యయములకును మహాన్ మొదలగువానికిని నిందుఁ బ్రయోగము స్వతంత్రముగఁ జూపట్టదు. ఇట్టివానిని గవిప్రయోగములంబట్టి గ్రహించునది. 'సర్వదా-సదా-సర్వత్ర' అనునవి యనుకరణము లేకయే ప్రయుక్తములగుచున్నవి.

ఇది తత్సమమున హలంతపరిచ్ఛేదము.

---

# ఆచ్ఛికపరిచ్ఛేదము.

ఆచ్ఛికపదములంగూర్చి యైన గ్రంథభాగముగాన నాచ్ఛికపరిచ్ఛేదము నాఁ బడును.

**సంస్కృతసమేతరంబయిన యీభాష యచ్ఛ యనంబడు. ౧.**

స్పష్టము.

టీ. 'సంస్కృతసమము; ప్రాకృతసమము; సంస్కృతభవము; ప్రాకృతభవము; దేశ్యము;' అను నైదుజాతులపదములు తెలుఁగునఁ గలవని సంజ్ఞాపరిచ్ఛేదమునందలి 19-20-21 సూత్రములచే విశదీకృతము. ఇందు సంస్కృతసమములు దప్పఁ దక్కిన ప్రాకృతసమ, సంస్కృతభవ, ప్రాకృతభవ, దేశ్యము లచ్ఛయనుసంజ్ఞ నందునని భావము. అచ్ఛశబ్దమునుండి 'అచ్చ' అను పదము పుట్టెను. కాన నీభాష నచ్చతెలుఁగని వ్యవహరింతురు. సంస్కృతసమములు చేరని భాష యచ్చతెలుఁగని యర్థము. అచ్చతెలుఁగు కావ్యములుగా నెన్నికకెక్కిన యయాతిచరిత్రము నీలాసుందరీపరిణయము మున్నగువానియందలి భాషనుబట్టి యీ యచ్చతెలుఁగను సంజ్ఞ లాక్షణికమయ్యెఁ గాని సంస్కృత ప్రాకృత సంపర్కములేని శుద్ధాంధ్రదేశ్యము ననుసరించి గాదని యెఱుంగవలయును. అవిజ్ఞాత ప్రకృతికమగుట నిట్లు వ్యవహరించిరేమో యని యందమన్నఁ గొంతవఱకుఁ బ్రాకృతసమభవాదివిభాగము నెఱింగించుటం బట్టి యట్లన నవకాశమగపడదు. కాన నిట్లనుట కచ్చతెలుఁగుఁగబ్బములభాషయే శరణ్యమనక తీరదు. ఏభాషలోనేని జనవ్యవహారమునకుఁ జాలినన్నిపదము లుండక తీరదు. కాని యాభాషను వ్యవహరించువారిదేశమునఁ గనరానివానికి మాత్రము సంజ్ఞ లరుదగుట సహజము. అట్టియెడల వా రావశ్యకమగునపు డితరభాషాపదముల నెరవు గైకొనుటయుఁ దస్కాలమున నన్యభాషాపదము లాభాషలోఁ దోఁచుటయుఁ గుదురును. నిజముగ నరయునపుడు తెలుఁగున దేశీయములగు కొన్నిటికి సమభవములే సంజ్ఞలు తోఁచెడిఁగాని శుద్ధదేశ్యములు గనరావు. మఱియు మనుష్యావయవములకును, ప్రకృతిని గోచరించు కొన్ని పదార్థములకును, దేశీయ శాకాద్యాహారవస్తువులకును, వివిధ బంధువులకును, నాభరణాదులకును సంస్కృత ప్రాకృత సమభవములే సంజ్ఞలుగఁ జూపట్టెడి. ఇట్లగుటకుఁ దెలుఁగుభాష కేవలము సంస్కృతప్రాకృతజాత మగుటయా? గాక సంస్కృతప్రాకృతములు దీని నడఁగఁద్రొక్కుటయా? కారణమని యరయఁ

దగును. కొందఱు తెనుఁగుభాష కేవలము సంస్కృత ప్రాకృత జన్యమనియు నవిజ్ఞాతప్రకృతులు దేశ్యము లాయా ప్రాకృతదేశ్యములనుండి కలిగియుండుటచే నప్రాకృతదేశ్యజ్ఞానులగువారి కది తోఁపమి శుద్ధదేశ్యమందురనియు, జన్యజనకభావము లేని యేభాషకును నిట్టిసంబంధ మన్యముతోడఁ గలుగదనియుఁ నందురు. భాషాశాస్త్రదృష్టిని శోధించిన సుప్తిఙ్ప్రత్యయములయు సర్వనామములయుఁ బహుపత్న్యాదివాచకములయుఁ బంధువాచకములయుఁ దేశీయవస్తువాచకములయు, మనుష్యావయవవాచకములయు, సంబంధము సంస్కృత ప్రాకృతములతో నగపడమిని ద్రమిళ గర్ణాటకాది భాషలతో నెంతయు నగపడుటను దెలుఁగు ద్రావిడభాషా సహోదరిగాని యన్యము గాదనియుఁ, సంస్కృత ప్రాకృతభాషలు దాని పోషక భాషలనియుఁ నందురు. ఆంధ్రశాతవాహను లుత్తరమున నున్నవారు దక్షిణవాసులగుటంజేసి కాలక్రమమున వారిగృహభాషయగు ప్రాకృతమును దక్షిణదేశీయానాగరకభాషయుఁ బెరసి యిట్టి యొక క్రొత్తభాష గుదిరెననియు దాన ధాతురూపాదులయుఁ విభక్తులయుఁ సంబంధము మున్నగునవి తెలుఁగు ద్రావిడములకు సదృశమై యొప్పుట గన్పట్టుననియుఁ గొందఱందురు. తెనుఁగుపదములస్థానములో సమభవములు నెక్కొనుటయు శుద్ధదేశీయము లున్నను నోట నవి రాకుండుటయుఁ దనవ్యవహారమును బట్టి తనకుఁ దోఁపక పోవచ్చునుగాని యొరునివ్యవహారమునుబట్టి యొరునకు విశదము గాకపోదు. మఱియు గ్రామ్యజన వ్యవహారమునను శుద్ధాంధ్రపదస్థానమును సమభవములాక్రమించుటను గమనింపదగును. గ్రంథములందును నిదేయవస్థ దృశ్యమగును. పైయంశముల గమనించిన సంస్కృత ప్రాకృతములు తొల్లి విజృంభించి ప్రాచీనశుద్ధాంధ్రము నడఁగఁద్రొక్కుటయుఁ గేవల సంస్కృతాభిమానులగు పండితకవులయభిరుచింజేసి గ్రాంథికభాష సమభవసాంద్రమగుటయుఁ, బ్రాకృతభాషాసమములయు భవములయుఁ జాడ సంస్కృత సమదృష్టులకు సమగ్రముగ వర్ణలోపాదులంజేసి యగోచరమగుటయుఁ, గాలక్రమమున శుద్ధాంధ్రపదములు లుప్తములగుట గత్యంతరములేమి వర్ణలోపాదులనంది సంస్కృతసమములకు దూరములైనవానిని శుద్ధాంధ్రములుగ భావించుటయుఁ, దన్మూలమున సమేతరముల కచ్ఛవ్యవహారము లాక్షణికలోకమొనర్చుటయుఁ, గుదిరియుండునని యనుమానింపక తీరదు. సంస్కృత ప్రాకృతపద సమూహము శుద్ధాంధ్రపదస్థానము నాక్రమింపఁ గల్గెను గాని ప్రత్యయాదుల సహజరూపమును మాత్రము మార్పఁజాలదయ్యెను. వానినిబట్టియే యిది యార్యభాషా కుటుంబమునకుఁ జేరినది గాదన నేఁటి భాషాతత్త్వశాస్త్రజ్ఞుల కవకాశము గల్గినది.

**ఆచ్ఛికశబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీసమంబులుం గ్లీబసమంబు లయియుండు. ౨.**

స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచన లోపాదికంబును గ్లీబసమత్వాతిదేశంబుచే మువర్ణకంబు నగునని యెఱుంగునది. అన్న-మిన్న-అద్ద-గద్ద-జాణ-గాణ-ఓడ - గోడ - ఇత్యాదులు స్త్రీసమంబులు. బియ్యము-నెయ్యము-అల్లము-మొల్లము-సున్నము-సన్నము - ఇత్యాదులు క్లీబసమంబులు. తఱుచుగ ననుటచేఁ బుంలింగతుల్యంబులుం గొండొక కలవని తాత్పర్యము. కొమరుఁడు-చందురుఁడు-జముఁడు-కందుఁడు-ఇత్యాదులు.

టీ. 'వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమా స్త్రీసమాశ్చ నాన్యే స్యుః క్లీబసమా అమహద్వత్; స్త్రీవత్ స్యుః స్త్రీసమాః' అనునది మూలము. పైని నిరూపించిన యచ్చతెలుఁగుశబ్దములు తఱచుగ స్త్రీలింగశబ్దతుల్యములును నపుంసకలింగ శబ్దసదృశములును నైయుండును. తఱచుగ ననుటంజేసి పుంలింగశబ్దములం బోలు నవియుఁ గొన్ని గలవని సంభావించునది. తెలుఁగున లింగము లేదు. కాన లింగము ననుసరించి సంస్కృతసమములకువలె డు-ము-వు మున్నగువానిని ప్రతిపాదింప నవకాశములేమి నిమ్మార్గ మాదృతమయ్యెను. మఱియు సంస్కృతలింగము ననుసరించి తదర్థకపదములకుఁ బ్రత్యయాదుల నెఱింగించుట గుదురమి నిమ్మార్గమె శరణ్యమయ్యె. ఇంతియగాక తత్సమపరిచ్ఛేదమునఁ గొన్ని తావులందువలె మహతీమహదమహద్వాచకత్వముల ననుసరించి ప్రత్యయాదుల విధింతమన్న నట్లును సరిపడమి నిమ్మార్గమె గతియయ్యె. తెలుఁగునఁ దండ్రిశబ్దము స్త్రీసమము. తల్లి స్త్రీసమము. చెట్టు స్త్రీసమము. ఇట్లగుట శబ్దలక్షణముంబట్టి, ప్రత్యయాదివిధాన మొనర్ప నవకాశములేదు. తత్సమపరిచ్ఛేదమున సామాన్యముగఁ బుంలింగము లుత్వ డుజంతము లగుటయుఁ స్త్రీలింగములు ప్రథమైకవచన ప్రత్యయలోపము నందుటయు నపుంసకములు మువర్ణకాంతము లగుటయు లక్షణముగఁ గన్పట్టును. ఆపద్ధతి ననుసరించి డుమంతము లైనవి పుంసమములనియుం, మువర్ణకాంతములగునవి నపుంసకసమము లనియుఁ బ్రథమైకవచన లోపము నందునవి స్త్రీసమము లనియుం సూరి వ్యవహరించెను. వీనిలో స్త్రీసమములు లెక్కకెక్కుడుగను, గొంతగ మువర్ణకాంతములును, నత్యల్పముగ డుమంతములును దెలుఁగునఁ దోఁచుటంజేసి బాహుళ్యము ననుసరించి స్త్రీసమములు నపుంసకములుం దఱచుగ నగునని లక్షణకర్త శాసించి కొన్ని పుంసమములం

గూడఁ జూపి వానిం దఱచు శబ్దమునకు శరణ్యముగఁ జేసెను. స్త్రీసమ-నపుంసకసమ-పుంసమములకు యథాక్రమముగ స్త్రీలింగ - నపుంసకలింగ-పుంలింగ శబ్దసదృశములని యర్థము గాని స్త్రీవాచకాదులని మాత్ర మర్థముగాదు. ఈతౌల్యమును బ్రత్యయములంబట్టియేగాని యన్యము ననుసరించి గాదని స్త్రీసమత్వాతిదేశముచే నను సూరి వివరణమే విశదీకరించెడి. కాఁగా నీసూత్రమునకుఁ బుంసమముల కుత్వ డుజాదులను, స్త్రీసమములకుఁ బ్రథమైకవచన లోపాదులను, నపుంసకములకు మువర్ణకాదులను గూర్చుట ఫలముగా నెన్నవలయును. దీనఁ బ్రకృతులను బ్రత్యయములను వేఱుచేసి చూపుట నాచ్ఛికముల విషయమునను శక్యమ యనునాశయము సూరి కలిగియుండె నసుట తెల్లము. బాలబోధకై లక్షణకర్త యిమ్మార్గ మాదరించెఁగాని తెలుఁగునఁ గొన్ని యెడల నిట్లు చూపుట పొసఁగకుండుటయుఁ బొసఁగినను నాపద్ధతియంతగ నర్థవంతముగ నుండకుండుటయుఁ దోఁచెడి. మఱియుఁ దెనుఁగునఁ బ్రథమైకవచనమే ప్రాతిపదికమగుటం గమనించినను నిమ్మార్గము కృతకమే యయ్యెడి. అన్న మొదలగు నెనిమిదియుఁ బ్రథమైకవచనలోపము నందఁదగునవగుటం జేసి వీనికి స్త్రీసమత్వాతిదేశమును దన్మూలమునఁ దత్సమము 27 చేఁ బ్రథమైకవచనలోపప్రాప్తియుఁ గుదిరెనని గ్రహించునది. ఆచ్ఛికములలో నేదానిం జెప్పవానికైనను బ్రథమైకవచనలోపము నందఁదగినవాని కీవిధిచే స్త్రీసమత్వాతిదేశమును గమనించునది. బియ్యము మొదలగు నాఱుదాహరణములును నపుంసకత్వాతిదేశముచే నమహన్నపుంసక సూత్రముచే మువర్ణకాంతము లయ్యెనని యెఱుంగునది. పైని వివరించినట్లే మువర్ణకాంతములు గాఁదగువాని నెల్ల నపుంసకసమత్వాతిదేశ మొనర్చు నీవిధికి గుఱిగఁ జేసి మువర్ణకముం గూర్చునది. కొమరుఁడు మున్నగునాల్గును బుంలింగతుల్యతాతిదేశము నంది 21-22 చే నుత్వడుజ్జుల నందినవాని కుదాహరణములు. పైవానియట్లె యుత్వడుజ్జుల నందఁదగిన మహత్తులకెల్ల నీవిధిచేఁ బుంలింగతుల్యత నతిదేశించి యుత్వడుజాదులం గూర్చికొనునది. అతిదేశమనఁగాఁ గలుగరాని కార్యమును గలుగునని గట్టఁబెట్టుట. తెలుఁగున లింగములేమిఁ బ్రథమైకవచనలోప మువర్ణకోత్వడుజాదులు తెలుఁగుశబ్దములకుఁ గలుగ నవకాశము లేకున్నను సంభవింపరానిలింగమును సంభవింపఁజేసి తన్మూలమునఁ బైకార్యములఁ గూర్చుటంజేసి యియ్యదతిదేశవిధి యయ్యెనని యెఱుంగునది. సామాన్యముగ స్త్రీసమములవిషయమున నియమము గానరాదు గాని మువర్ణకాంతము లమహత్తులే యగుననియుం డుమంతములు మహద్వాచకములే యగుననియు నిర్ణయము తెలుఁగుపదముల విషయమునను గాననగును. (కైరాదులు తప్ప) మూలమును దద్వివరణములును గేవలము సంస్కృతసమసాధనపరములే యగుటం జేసి సాధారణముగ నీపరిచ్ఛేదమునందలి విధులెల్ల నీసూత్రమునకు మూలముగాఁ

జూపఁబడిన చింతామణిసూత్రమునకు విపులముగ వ్యాఖ్యవ్రాయు నహోబలపండితుని వ్యాఖ్య నే యనుసరించి కల్గెనని గ్రహించునది. (చూ. అహోబల పం.) పుటలు. 351-54.

## బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు. 3.

మహత్త్వంబున వీనికుత్వడుజాదులు నమహత్త్వంబున ముపర్ణకాదులును స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ సమాసంబునుంగలుగునని యెఱుంగునది. బల్లిదుఁడు - బల్లిదము - బల్లిదురాలు. బల్లిద-అక్కజ-కావల-బెట్టిద-బెడిద-మిసిమింత-మొక్కల-ఇత్యాదులు బల్లిదాదులు.

టీ. బల్లిదమొదలగు తెలుఁగుపదములు సంస్కృతపదములకు సరియైనవగునని యర్థము. సంస్కృతతుల్యత్వాతిదేశముచే వీనికిఁబుం స్త్రీనపుంసకలింగాదులగుననిభావము. ఇయ్యవి సంస్కృతశబ్దములవంటివి గాకున్న వివరణమునఁ జెప్పఁకున్న మూఁడుకార్యములును సంభవింపఁజాలవుగాన నీవిధి యావశ్యకము. మఱియు 2 విధిచే నేదో యొకలింగమే యతిదిష్టమగుంగాని రెండుమూఁడు సంభవింపమింజేసి యిది యారబ్ధము. కాఁగా సంస్కృతవిశేష్యనిఘ్నములవలె నివి స్త్రీపున్నపుంసకరూపములనంద నర్హములగుటంజేసి సమత్వాతిదేశము చేయక సంస్కృతతుల్యతాతిదేశ మొనర్చెనని గ్రహించునది. సంస్కృతతుల్యము లగుటంజేసి మహద్వాచకము లైనపుడు తత్సమ 21-22 లచే నుత్వడుజ్జులను నిగాగమాది మహత్కార్యములను; స్త్రీవాచకములైనపుడు సంధి 31 చే నాలుశబ్దసమాసమున నుత్వరుగాగమంబులను; నమహద్వాచకములైనపు డమహన్నపుంసకసూత్రముచే ముపర్ణకాదులను బొందునని సంభావింపవలెను. బల్లిద:—దీనిచే సంస్కృతతుల్యమై మహత్వమునఁ దత్సమ 21-22 చే నుత్వడుజ్జులనంది 'బల్లిదుఁ'డనియు మహతీత్వమున సంధి 31 చే నాలుశబ్దసమాసమున నుత్వరుగాగమములనంది "బల్లిదురా" లనియు నమహాత్వమున నమహన్నపుంసకవిధిచే ముపర్ణకమునంది బల్లిదమగుననియుం గ్రహించునది. ఇట్లే తక్కినవానికిని రూపత్రయమూహ్యము. తక్కినవిభక్తులందును వచనములందును యథార్హముగ డుమంతము లైనపుడు డుమంతకార్యములను స్త్రీవాచకములైనపుడు స్త్రీలింగకార్యములను ముపర్ణకాంతములగునపుడు ముగాగమాద్యమహత్కార్యములను గ్రహించి రూపనిష్పాదనక్రమ మూహించికొనునది.

## మహత్తులగుమగాదులకుం గయిరాదులకును డుజ్జగు నుత్వంబు గాదు. ౪.

మగఁడు-మనుమఁడు. కయిరఁడు - కత్తళఁడు. మగ - మనుమ-రాయ-పాప-ప్రే-జే - ఈకాప్రత్యయాంతంబులు - ఇత్యాదులు మగాదులు. కయిర-కత్తళ-జన్న-నీల-ఇత్యాదులు కయిరాదులు.

టీ. మహద్వాచకములగు మగ మొదలగువానికిని దనితరములగు కైర మున్నగు వానికిని బ్రథమైకవచనమున డుజ్ప్రత్యయము గలుగునుగాని యుత్వము మాత్రము గలుగదు. ఉత్వనిషేధ మదంతములకే యనియు డుజ్విధానము సర్వసాధారణమనియు గ్రహించునది. మగాదులు కైరాదులను రెండుగణములలో మగాదులు మహద్వాచకము లగుటంజేసి యుత్వడుజ్జులు రెండును గలుగవలసియుండ వానివిషయమున నుత్వము మాత్రము గలుగదని చెప్పవలసివచ్చెననియుఁ గైరాదు లమహద్వాచకము లగుటంజేసి యుత్వడుజ్జులు రెండును సంప్రాప్తములుగామి డుజ్విధాన మొనర్చి యుత్వమును నిషేధింపవలసివచ్చెననియు మగాదిగణమున నదంతములుగాని మహద్వాచకములు, వ్రే-జే-అనునవియుఁ 'ఈ-కా' అను ప్రత్యయములు తుదిని జేరిన శబ్దములును నమర్చి యుండుటంజేసి వాని కుత్వప్రాప్తి తత్సమము 21 చే లేమి డుజ్విధానమె చేయవలసి వచ్చెననియు గ్రహించునది. మగ:—ఈసూత్రముచే డుమంతమయ్యెడి. ప్రకృతితుది యత్వమున కుత్వమురాదు. మగ + ఁడు=మగఁడు. డుమంతము లగువీనికిఁ దత్సమము 24 చే నేకత్వమున నిగాగమము నిత్యముగ నగుననియు, దాన 'మగనిన్ - మగనిచేత' మున్నగురూపములేగాని 'మగను-మగచేత' మొదలగునపరూపములు గలుగవనియు గ్రహించునది. 'వ్రే + ఁడు=వ్రేఁడు.' 'జే + ఁడు = జేఁడు.' ఈకా ప్రత్యయాంత ములు:—ఈయనునట్టియుఁ గాయనునట్టియు ప్రత్యయములు తుదిని జేరిన తెలుఁగు ప్రకృతులు. ఈరెండును దద్ధిత ప్రత్యయములు. తద్ధిత 15 చే నీ ప్రత్యయమును, దద్ధిత 11 చేఁ గా ప్రత్యయమును గలుగును. ఇట్లే కైరాదిశబ్దములరూపము లూహ్యములు. కైరాదులెల్ల సామాన్యముగ నశ్వవాచకములుగఁ గన్పట్టెడి. పరికింప నిందున్న శబ్దములెల్ల 1 సూత్రముచేఁ బుంసమములే గాఁదగుటను; వ్రే-జే; ఈ-కా-ప్రత్య యాంతములకంటె నన్యములకు నుత్వనిషేధముమాత్ర మొనర్చినఁ జాలును. కాని 1 సూత్రము స్త్రీపున్నపుంసకలింగకార్యములను దత్సమప్రకరణోక్తములనుజ్ఞప్తికిఁ దెచ్చి యతిదేశించుముఖమున నాచ్ఛికశబ్ద సామాన్యస్వరూపప్రకాశనపరమేగాని శబ్దసాధన విషయప్రధానము గామిని యాచ్ఛిక శబ్దసాధనమునకయి యిట్టి విశేషశాస్త్రము లీ పరిచ్ఛేదమునఁ బ్రసక్తము లయ్యెనని తలంపఁదగును. డుజ్నిగాగమాదులు తత్సమపరి చ్ఛేదమునందలి యాయావిధులచే నగుటను స్మరించికొనునది.

పగతాదుల బహువచనలకారంబునకు రేఫంబగు. ౫.

పగతురు-అల్లురు-నెయ్యురు-బలియురు-మార్తురు.

టీ. పగత మున్నగు నదంతమహద్వాచకాచ్ఛికప్రకృతులకు బహుత్వమున నగు లువర్ణకమునకును లడాగమలకారమునకును రేఫ మాదేశ మగును. బహువచనలకారమని

సామాన్యముగ ననుటంజేసి లు ల లకు రెండింటికిని నగుననియు లకారమనుటంజేసి హల్మాత్రమునకే యనియు గ్రహించునది. పగత:—1 చేఁ బుంలింగతుల్యమై యుత్వడుజ్ఞుల నంది పగతుఁడగును. పగతు+లు:—దీనిచే లువర్ణలకారమాత్రమునకు రేఫాదేశము గలుగ 'పగతు+ర్+ఉ=పగతురు' అని రూపమగును. పగతు+ల+ను:—లకారమాత్రమునకు రేఫాదేశము రా 'పగతు+ర్+అను=పగతురను' అని యగును. ఇట్లే తక్కినరూపముల ప్రక్రియం గమనించునది. ఇది నిత్యవిధి యగుటచే రేఫాదేశము పగతాదులకు నిత్యమని యెఱుంగవలెను. తత్స 38 చేఁ గలుగ నవకాశము లేమి నీవిధి యారబ్ధము.

## కొన్ని డుమంతంబుల బహువచనలకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణబిందుపూర్వక డకారంబు నగు. ౬.

గండండ్రు-మిండండ్రు-ఇత్యాదులు.

టీ. డుమంతములైన కొన్నియాచ్ఛికశబ్దములకు సంబంధించిన బహువచన ప్రత్యయమగు లువర్ణకమునకును లడాగమలకారమునకును రేఫ మాదేశమగుటయేగాక యయ్యాదేశరేఫమునకుఁ బూర్వమున నిండుసున్న ముందిడికొన్నడకారమును గలుగును. (ండ్) పైసూత్రమునవలెనే లకారహల్మాత్రమునకు రేఫాదేశమనియుఁ బూర్ణబిందుపూర్వకడకారము పొల్లురూపముగ నగుననియుం గ్రహింపవలెను. గండ:—ఇది మగాది గణమునఁ జేరెడి. కాన దీని కుత్వముగాక డుజ్మాత్రమే సిద్ధించెడి. గండ+లు:—దీనిచే బహువచనలకారమాత్రమునకు రేఫాదేశము రా 'గండ+ర్-ఉ' అనియుం నాదేశముగనైన రేఫకు ముం దీవిధిచేతనే 'ండ్' అనునది గలుగ 'గండ+ండ్+ర్+ఉ=గండండ్రు' అని రూపమగును. ఇట్లే తక్కినదియు నూహ్యము. 'గండని' అని నిగాగమము నిత్యముగ నగుటను 'గండండ్రచేత' అని రేఫపూర్ణబిందుపూర్వకడకారములు నిత్యముగఁ గలుగుటను నేకత్వబహుత్వముల గమనించునది. సూత్రవిహితములు రేఫాదేశపూర్ణబిందు పూర్వక డకారములు సన్నియోగశిష్టములగుట నొకటిగల్గి యొకటి గలుగకుండుట సంభవింపదని గ్రహింపవలెను. లువర్ణకాదులను దత్సమపరిచ్ఛేదమునందలి యాయావిధులచేఁ గూర్చికొనునది.

## కాప్రత్యయంబుమీఁది బహువచనలకారంబునకు లఘ్వలఘురేఫంబులును, లఘురేఫంబునకు ముందు బిందుపూర్వక డకారంబునగు. ౭.

విలుకాండ్రు - విలుకాఱు - వేఁటకాండ్రు - వేఁటకాఱు - వేడుకకాండ్రు - వేడుకకాఱు.

టీ. కా ప్రత్యయముతుదిం జేరిన ప్రాతిపదికములకు సంబంధించిన బహువచన ప్రత్యయమగు లువర్ణకమునకును లడాగమలకారమునకును రేఫ మొకమాఱును శకట రేఫ మొకమాఱును నగును. రేఫము గల్గినపక్షమున నద్దానికి ముందు బిందుపూర్వక డకారము నిత్యముగనగును. శకటరేఫము గల్గినయెడల బిందుపూర్వకడకారము దానికి ముందు గలుగదు. విలుకా:—ఇది తద్ధిత 11 చే సిద్ధించిన కా ప్రత్యయాంతము. ఏకత్వ మున డుజ్జురా విలుకాఁడగును. బహుత్వమున 'విలుకా+లు' అని యుండ నీవిధిచే బహువచనలకారమాత్రమునకు రేఫమును దానికిముందు బిందుపూర్వకడకారమును గలుగ 'విలుకా+ర్-ఉ; విలుకా+ండ్+ర్+ఉ=విలుకాండ్రు' అని రూపమేర్ప డును. ఇట్లే 'విలుకా+ల+ను; విలుకా+ర్+అ+ను; విలుకా+ండ్+ర్+అ+ను= విలుకాండ్రను' అని ద్వితీయాబహువచనమున రూపము గలుగును. ఈరీతిగనే యేకత్వ మున విలుకానిచేత నిత్యాదులను బహుత్వమున విలుకాండ్రచేత నిత్యాదులను రూప ములను గమనించునది. శకటరేఫము గల్గునెడల 'విలుకా+లు; విలుకా+ఱ్-ఉ= విలుకాఱు' అని రూపమగును. ఇట్లే ద్వితీయాదిబహువచనములందు 'విలుకాఱను; విలుకాఱచేత' మున్నగురూపములును, నేకత్వమున 'విలుకానిన్; విలుకానిచేత' మొద లగురూపములును గల్గుటను గుర్తించునది. ఈరీతిగనే తక్కినయుదాహరణ మూహ్యము. శకటరేఫ మాదేశమగునపుడు బిందుపూర్వకడకారము దానిముందు గలుగదనుట మఱువ రాదు.

## ఱే ప్రభృతుల బహువచనమునకు ముందు డుజ్జగు. ౮.
## ఱేఁడులు - ఱేండ్లు.

టీ. ఱే మొదలగు ప్రకృతుల బహుత్వబోధకలులకుఁ బూర్వమున డుజ్జనున దగును. బిందుపూర్వక డువర్ణవిధానముచే నొక్కపూర్ణబిందురూపమే గాని యర్ధబిందు రూపము గుదురమి డుజ్విధాన మావశ్యకమయ్యెను. బహుత్వమున డుద్వర్ణకము గలుగ వీలులేమి డుజ్జని సామాన్యముగ విధించెను. నిజ మరయ నేకత్వబోధక ప్రత్యయమగు డుద్వర్ణకముమీఁద బహుత్వబోధక ప్రత్యయము నిలిచెననియుం నట్లు నిలుచుట ఱేఁడను నదియె ప్రకృతిగఁ దలంచుటంజేసి గుదిరెననియుం లాక్షణికు లేకత్వబోధక ప్రత్యయము మీఁద బహుత్వబోధక ప్రత్యయమగుట నంగీకరింపనివారగుట లాక్షణికమార్గమును బట్టి సూరి యిట్లు డుజ్విధాన మొనర్చెననియు గ్రహించునది. 'ఱే+లు':—దీనిచే డుజ్జు గలుగును. డుజ్జు జిత్తుగాన తత్సమము 19 చే బిందుపూర్వమై యగును. సంజ్ఞ 15 చే దీర్ఘముమీఁదిదగుట నీడువర్ణ మర్ధబిందువును ముందిడికొనియే గలుగునుగాన 'ఱే+ఁడు+ లు=ఱేఁడులు' అని రూపమగును. బహుత్వమున 12 చే డువర్ణము నుత్వమునకు లోపం

బును, 15 సూత్రముచే బహువచనశ్లిష్టమగుటంజేసి నిత్యముగఁ బూర్ణబిందువును సిద్ధింపఁ బక్షమున ఱేండ్లగును. ఉత్వలోపమగునపుడు నిందుసున్న నిత్యముగాన ఱేండ్లను; 'ఱేండ్లచేత' అనియే రూపములగును. డువర్ణమునుత్వమునకు లోపము 12 విధిపాక్షిక మగుటంజేసి గలుగనియెడల నరసున్నయే గలిగి 'ఱేఁడులు; ఱేఁడులను; ఱేఁడులచేత' మొదలగురూపములు సిద్ధించును. ప్రభృతిశబ్దముచే నిట్లు దీర్ఘముమీఁద బహుత్వమున డుజ్వర్ణమునందఁదగినవాని నిందుఁ జేర్చి ప్రక్రియను బైరీతిని గ్రహించునది. సూత్రమున బహువచనమునకని సామాన్యముగ ననుటంజేసి యెల్లవిభక్తుల బహువచనములందును నీకార్యము గలుగుటను గమనించునది. 1 సూత్రముచేఁ బుంలింగతుల్యతయుం 4 చే డుమంతమగుటను గమనించునది. ఇది నిత్యవిధి.

## కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు. ౯.

కూఁతురు - కూఁతులు. కూఁతురులు - కూఁతుళ్లు. కూఁతురినిత్యాదిరూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది.

టీ. 'కూఁతుశబ్దమునకగు ప్రథమైకవచనమునకు మాత్రము రువర్ణమాదేశమగును. ప్రథమైకవచనమునకె యనుటంజేసి ప్రథమాబహువచనమునకును, నితరవిభక్తుల యేకవచనబహువచనములకును నీవిధి గలుగదని గ్రహించునది. ఇది నిత్యవిధానము. కూఁతురు:—ప్రథమైకవచనరూపము. ప్రథమాబహువచనమునఁ గూఁతులని యగును. ఇట్లే యాయా యితరవిభక్తులం దేకత్వమునఁ 'గూఁతును; గూఁతుచేత;' మున్నగురూపములును, బహుత్వమునఁ 'గూతులను; గూతులచేత;' మొదలగురూపములును గలుగునని గ్రహించునది. ప్రథమైకవచనమునకు మాత్రమే రువర్ణవిధాన మొనర్చుటంజేసి 'కూఁతురులు' అను బహుత్వమున రువర్ణ మాగమముగఁ గలిగినరూప మలాక్షణికమయ్యె. బహుత్వమున రువర్ణవిధానము చేయమింజేసియు, నది యాగమముగఁ బ్రకృతికగుట యసంభవమగుటంజేసియు, సంభవింపని రేఫమును సంభవింపఁజేసి యట్లె సంభవింప నవకాశము లేని యలఘుళకారముపై నున్నయుఁత్వమునకు లేక యుత్వలోపమునందిన రేఫమున కలఘుళకారాదేశమును గూర్చి; సిద్ధింపఁజేసినదగుటంజేసియుఁ గూఁతుళ్లనురూప మగ్రాహ్యమయ్యె. రువర్ణము ద్వితీయైకవచనమున రామిని, నువర్ణకమును రువర్ణమును నిత్వమునందఁ బ్రమాణమగపడమిని, 'కూఁతురిని' ననురూప మసాధువయ్యె. ఇట్లే 'కూఁతుళ్లచేత; కూఁతురికొఱకు' మున్నగురూపములు గ్రామ్యములని గ్రహించునది. శాస్త్రపద్ధతికి లొంగనివగుటఁ గూఁతురులిత్యాదులు గ్రామ్యములని సూరి యాక్రింది వివరణమున కభిప్రాయము. కాని 'కూఁతు' అనునదే ప్రాతిపదిక మనుకొని కొందఱును,

'కూఁతురు' అనునదే ప్రకృతి యనుకొని కొందఱును నౌపవిభక్తికమనుకొని కొందఱును, నసౌపవిభక్తికమని యెంచి కొందఱును వివిధముగ నీశబ్దమునకు రూపముల నూహించి గ్రంథస్థములఁ జేసియున్నారు. నన్నయ మొదలగుకవులప్రాచీనకావ్యముల నిది యసౌపవిభక్తికమును "కూఁతు"అనునదే ప్రాతిపదికమును నగుటంజేసి 'కూఁతునకు, కూఁతురవు' మున్నగురూపములు గానవచ్చెడి. పిదప నిది యౌపవిభక్తికముగ సంభావితమగుటంజేసియుం 'కూఁతురు' అనునదే ప్రాతిపదికముగఁ దలంపఁబడుటంజేసియు నౌపవిభక్తికత్వము రాను రాననియతమగుటంజేసియుం 'కూఁతురను, కూఁతురిని, కూతుండ్రు, కూతుళ్లు' మొదలగు వింతరూపములను గవులు ప్రయోగించియున్నారు. అహోబలపతియుఁ వీనిలోఁ గొన్నిటికి సాధుత్వమొసంగుటేగాక తానును 'కూఁతురి మోవి' యని ప్రయోగించినాఁడు. (చూ. అహోబలప. పుట. 308) కవిరాజబిరుదాదులనందిన మేటి తెనుఁగుకవులు గూడ నీశబ్దము నిచ్చవచ్చినగతిఁ బ్రయోగించిరి. (చూ. బాలకవిశరణ్యము. గి. వెం. రా. పం॥ డి.) ఇట్టిప్రయోగములు ప్రాచీనకావ్యములం దత్యల్పముగఁ దోఁచుటంజేసి నవ్యములని యెంచి కావలయుఁ ద్రిలింగలక్షణశేషకర్తయు బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికాకర్తయుం బాలవ్యాకరణమార్గమునే యివ్విషయమున సమ్మతించి మిన్నకుండిరి.

## చెయువు బహువచనలకారంబున కలఘురేఫంబు విభాషనగు. ౧౦.

చెయువుఱు - చెయువులు - చెయువుఱను - చెయువులను.

టీ. 'చెయుంవు' అను నాచ్ఛికశబ్దమునకైన బహుత్వబోధకములగు లులలకు శకటరేఫము వికల్పముగఁ గలుగును. చెయుంవు + లు:—దీనిచే లువర్ణకమున కలఘురేఫము గలుగ 'చెయువు + ఱ్ + ఉ=చెయువుఱు' అని రూపమగు. శకటరేఫము రాకున్నఁ 'జెయువు'లని యగును. ఇట్లే ద్వితీయాదిబహువచనముల శకటరేఫము సంభవించినపక్షమునఁ 'జెయుంవుఱను; జెయువుఱచేత' ననుమున్నగురూపములును, నది రానిపక్షమునఁ 'జెయువులను; జెయువులచేత' ననుమొదలగురూపములును గలుగును. ప్రథమైకవచనము 'చెయుంవు' అని 1 సూత్రముచే స్త్రీసమమై తత్సమ 54 చేఁ బ్రథమైకవచనలోపము నంది సిద్ధించును. శకటరేఫము లకారహల్మాత్రమున కగునని సంభావించునది.

## ఆల్వాదుల బహువచనలకారంబునకు రేఫంబును ముందఱి లువర్ణంబునకు బిందుపూర్వకడకారంబు నగు. ౧౧.

ఆండ్రు-ఆండ్రను. ఆలు-చెలియలు-చెల్లెలు-కోడలు-మఱఁదలు - ఇవి యాల్వాదులు.

టీ. 'ఆలు మొదలగు సాచ్ఛికశబ్దముల బహుత్వబోధకములగు లులలకు రేఫమాదేశముగను నవ్వానికిఁ బూర్వముననున్న ప్రకృత్యంతమున నుండెడి లువర్ణమునకు నిందుసున్న ముందుగల డకార మాదేశముగను నిత్యముగ నగును. ఈరెండుకార్యములును సన్నియోగశిష్టము లగుటంజేసి యొకటి గల్గి యొకటి గలుగకుండుట పొసఁగదనియు రేఫాదేశమైనవెంటనే పూర్ణబిందుపూర్వకడకారమును నాదేశముగ నగుననియు గ్రహించునది. ఆలు+లు:—దీనిచే రేఫాదేశము రా 'అలు+ర్+ఉ' అనియుఁ, బిదప నిందుసున్న ముందిడికొన్నడకారము గలుగ 'అ+ండ్+ర్+ఉ=అండ్రు' అని రూపమగును. పదముతుది లువర్ణకమునకు బహుత్వమున బిందుపూర్వకడకార మాదేశించుటంజేసి యాల్వాదులు లువర్ణాంతములనుట స్పష్టము. ద్వితీయాదిబహువచనములందిట్లే 'అండ్రను; అండ్రచేత;' అనుమున్నగురూపము లేర్పడుటను గమనించునది. ఏకత్వమునఁ బ్రథమాదివిభక్తులందు 'ఆలు; ఆలిని - ఆలిచేత-ఆలికొఱకు;' అను మున్నగురూపము లేర్పడెడి. ద్వితీయాదులం దేకత్వమునఁ బ్రకృతికంత్యావయవముగ నౌపవిభక్తికేకార మగుటను గమనించునది. ఇట్లే తక్కినవానికిని నేకత్వబహుత్వముల రూపము లూహ్యములు. 'నిత్యం దారాదేశ్చ స్యాల్లోర్లులయోరురౌ చ తత్ర స్తః' అనునది మూలము.

**బహువచనము పరంబగునపుడు - డ-ల-ట-ర-ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు. ౧౨.**

గుండ్లు - గుండులు. గిండ్లు-గిండులు. కాళ్లు-కాలులు. మొసళ్లు - మొసలులు. గొంట్లు-గొంటులు. తుంట్లు - తుంటులు. గోర్లు - గోరులు. సీవిర్లు-సీవిరులు. బహుళగ్రహణముచే విల్లులు-పిల్లులు - పులు లిత్యాదులందు లోపంబు లేదు. తత్సమంబులం గోటి పిప్పలిశబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు. కోట్లు - కోటులు - పిప్పళ్లు - పిప్పలులు.

టీ. "డలటాముదితాంతస్య చ వా లుక్" అనునది మూలము. ఎట్లే నుకారాంతములైన, 'డ-ల-ట-ర' అనువర్ణములు తుదినిగలశబ్దములకు బహువచనము పరమగునపు డా 'డ-ల-ట-ర' అనువర్ణములయుత్వమునకు లోపము బహుళముగఁ గలుగును. ఉత్వలోపము గలిగి బహువచనశ్లిష్టములైన డ-ల లంతమందుఁగలశబ్దములకు మాత్రము
14 చే నిత్యముగ నలఘుళకారమగుటను గమనించునది. గుండు+లు:—ఇది యుత్వవిశిష్టడకారాంతశబ్దము. లువర్ణకము పరముగాఁ బ్రకృతితుదినున్నడకారము నుత్వము లోపింప 'గుండ్+లు = గుండ్లు' అని రూపమగును. తెనుఁగున బిందుపూర్వకస్థిరము

లేమింజేసి యనఁగా సంజ్ఞ 16 సూత్రమునకు విరోధము సంభవించుటంజేసి యుత్వ
లోపవికల్పపక్షమునఁ గాని యుత్వలోపము గల్గినపక్షమునఁగాని 13-14 విధులచే
నలఘుళకారము గలుగదని గ్రహించునది. ఉత్వలోపము గలుగకున్న 'గుండులు'
అనియే యుండును. ఇది డకారము నుత్వమువికల్పముగ లోపించుట కుదాహరణము.
బహువచనము పరమగునపుడని సామాన్యముగ ననుటంజేసి లడాగమలకారము పరమగు
నపు డెల్లవిభక్తులందును బహుత్వమున నీయుత్వలోపము గలుగుననియు దాన 'గుండ్లను-
గుండ్లచేత' మున్నగురూపములును, నుత్వలోపము బహుళమగుట 'గుండులను, గుండుల
చేత' మొదలగురూపములును గలుగునని గ్రహించునది. ఇట్లే కృత్రిమోకారాంత
డవర్ణకము నుత్వము లోపించుట కిచ్చిన తక్కినయుదాహరణ మూహ్యము.
కాలు+లు:—ఇది లకారమునుత్వము లోపించుట కుదాహరణము. ఈవిధిచే నుత్వము
లోపింప 'కాల్+లు=కాల్లు' అని యుండ 14 చే నిత్యముగ నలఘుళకారము గలుగ
'కాళ్+లు=కాళ్లు' అని రూపమగును. ఈవిధిచే నుత్వలోపము పాక్షికమగుట
రానపుడు 13 చేఁ బదము తుదిలకారమున కలఘుళకారము గలుగ 'కాలు+లు;
కాళ్+ఉ+లు=కాళులు' అని రూపమగును. ఉత్వలోపము గల్గి బహువచనశ్లిష్టము
లైన శబ్దాంతావయవములగు డలలకే యలఘుళకారాదేశమును 14 సూత్రము విధిం
చునదగుటంజేసి 'కాళ్లు' అని యాదేశళకారముక్రింది బహువచనప్రత్యయ లువర్ణ
మును లఘురూపముగనే సంయోగించి వ్రాయవలెననియే యీలాక్షణికుఁడు తలంచెననుట
స్పష్టము. ఇట్లే బహుత్వమున లులలకుఁ బ్రత్యయాగమాత్మకముల కలఘుళకారవిధా
నము లేమింజేసి యుత్వలోపము నాధారముగఁ గొని డలలకు, 14 విధిచేఁ గలిగెడు
నలఘుళకారముక్రింది లులలను లఘుసంయోగములుగనే వ్రాయవలెనని గ్రహించునది.
బాలవ్యాకరణప్రతులం దెల్ల సామాన్యముగ లఘులకారసంయోగమె యలఘువున కిట్టి
తావులందుఁ గూర్చియున్న ట్లగపడుచుండ గుప్తార్థప్రకాశిక యిట్టిచోటుల 'ళ్ళ' అని
రెంటిని నలఘువులుగ నిరూపింప నాధారమగపడకున్నది. మూల మొక్క రేఫమునకే గాని
తక్కినవాని కలఘులకారమును విధింపమి నుత్వలోపము గల్గినయెడల నుచ్చారణము
ననుసరించి శబ్దావయవలకారమున కెట్లో యట్లే ప్రత్యయలకారమునకును నలఘుత్వము
ననుమానింపఁదగుంగాని యీవ్యాకరణము కంఠోక్తముగ శబ్దావయవడలవర్ణములకే
యనుచుండఁ బ్రత్యయాగమలకారముల కద్దానింగూర్చుట దుర్ఘటమగుటంజేసి యట్టి
వ్రాఁత యీలక్షణము ననుసరించి యలాక్షణికమయ్యెడి. ఇట్లే మూలము డకారమున
కలఘుళకారము నాదేశింపమిని; లకారమునకే యీద్వివిధత్వ మమరియుండుటను; లకా
రముననే యట్లుచ్చరింప నవకాశమయ్యెడిగాని డకారము నట్లు పలుకుట కవకాశము
లేదు. కాన మూలము ననుసరించి 'త్రాడ్లు త్రాడులు' అనియే యుత్వలోపతదభావ

ములరూపములు సిద్ధించెడి. 'గుండు' అనునది సహజోకారాంతడవర్ణము నుత్వలోపమునకును గిండి యనున (గిండి+లు = గిండులు) ది కారాంతమైనను బహుత్వమునఁ దత్సమము 45 చే నుదంతమయ్యెఁగాన నద్దానిని కృత్రిమోదంతడవర్ణము నుత్వలోపమునకును నుదాహరించినట్లే 'కాళ్లు' అను దానిని సహజోదంతలవర్ణము నుత్వలోపమునకును 'మొసళ్లు'అనుదానిఁ (మొసలి+లు = మొసలులు = మొసల్+లు = మొసళ్లు) కృత్రిమోదంతలవర్ణము నుత్వలోపమునకును నుదాహరించెనని గ్రహించునది. ఇట్లే సహజకృత్రిమోదంతటవర్ణాంతశబ్దముల యుత్వలోపమునకుఁ గ్రమముగ నిచ్చిన నాల్గుదాహరణముల ప్రక్రియను గమనించునది. స్త్రీవిషయకప్రత్యయమైన ఇకారము తుదిని గల గొంటిశబ్దమొండు తద్ధిత 18 చే నయ్యెడిఁగాని యిందలి యుదాహరణముల క్రమము ననుసరించి మొదటిది సహజోదంతమునకును, రెండవది కృత్రిమోదంతమునకును నుదాహృతు లనవలసి యుండుటంజేసి టవర్ణము నుత్వలోపమునకు మొదట నిచ్చిన యీయుదాహృతి 'గొంటు'అని యుదంతమే యనక తీరదు. ఇట్లని 'గొంటి' అనుదానికి బహుత్వమున నుత్వలోపము '(గొంటి+లు తత్సమ 45 చే గొంటులు)' గలుగదని మాత్రము గ్రహింపరాదు. 'విల్లు' అనునది సహజోదంతలాంతశబ్దము. 'పిల్లి' ఇది యిదంతమైనను బహుత్వమునఁ దత్సమము 45 చే నుదంతమయ్యెడిఁగాన బహుత్వమునఁ గృత్రిమోదంతలాంతశబ్దమగును. 'పులి' ఇదియు నిదంతమే గాని బహుత్వమునఁ బిల్లిశబ్దమువలెనే కృత్రిమోదంతలాంతమయ్యెడి. సూత్రమున లకారమునుత్వమునకని సామాన్యముగ ననుటంజేసి సద్ధిత్వాద్విత్వలకారాంతలకారములయుత్వమునకు లోపము సంప్రాప్తమై పిదప 14 చే నలఘుళకారము గూడ నిత్యముగఁ గల్గి 'విళ్లు-పిళ్లు-పుళ్లు'మున్నగు ననిష్టరూపములు గలుగవలసియుండ నట్టియపరూపముల వారింప బహుళగ్రహణము చేయఁబడెననియు, నట్లు బహుళపదమును సూత్రమున నిల్పుటంజేసి యది యట్టిస్థలముల నుత్వలోపము బహుత్వమునఁ గలుగకుండ నడ్డుననియు, దాన నుత్వలోపము నాధారముగఁ గొని 14 చే నగు నలఘుళకారము గలుగమింజేసి యట్టి యపరూపను లేర్పడుట కవకాశమే లేదనియు, బహుగ్రహణముచే నను నీక్రింది సూరివివరణమున కభిప్రాయమని గ్రహించునది. సాధారణముగ సద్వితోద్విదంతలాంత శబ్దములవిషయమున నీవిధి ప్రవర్తింపదనియే యెన్నవచ్చును. ఇఁక నుదంతలాంతముల విషయమున; యథాసంభవముగ వర్తించుటను గమనింపవలెను. ఇది కేవల మాచ్ఛికశబ్దములకు సంబంధించిన సూత్రమగుటను నీపరిచ్ఛేదమును నాచ్ఛికశబ్దవిషయమగుటను తత్సమశబ్దములవిషయమున నీవిధి వర్తింపదని యనుమానించి సూరి సంస్కృతసమములైన 'కోటి-పిప్పలి' అనురెండుశబ్దములకును బహుత్వమున నుత్వలోపము (కోటి+లు= కోటు+లు=కోట్లు; పిప్పలి+లు=పిప్పలు+లు = పిప్పల్ +లు=పిప్పళ్ +లు = పిప్పళ్లు)

ప్రయోగసిద్ధమై యగపడుచున్నదని వివరింపవలసివచ్చెను. ఇవి యుకారాంతములు గాన బహుత్వమునఁ దత్సమము 45 చే నుదంతములై యుత్వలోపమునకు విషయములుగా నర్హములగు.

13 చే నలఘుళకారము సిద్ధించినపిదప 12 సూత్రమునందలి లకారముచే లకారలఘ్వలఘురూపముల రెంటిని గ్రహించి యలఘుళకారము నుత్వమునకు లోపముం గూర్చిన 'కాళ్లు; త్రాళ్లు;' మొదలగురూపములు గలుగునుగాని 12 సూత్రము వికల్పవిధి యగుటంజేసి పక్షమున 'కాల్లు; త్రాడ్లు' అనుమొదలగు ననిష్టరూపములును నీవ్యాకృతివిద్ధతింబట్టి సంభవింపవలసి యుండుటంబట్టియుఁ; గాల్లు; త్రాడ్లు మొదలగు ననిష్టరూపముల వారించుటకే 14 నిత్యవిధి యారబ్ధమగుటంబట్టియు; 12 విధియందలి లకార మలఘుళకారమునకు గ్రాహకము గాఁజాలదనియే సూరి తలంచెననక తప్పదు. పైరీతిని 12 విధియందలి లకారముచే నలఘుళకారమును గ్రహింప నవకాశము లేమింజేసియు; 14 విధి డలలకే నిత్యముగ నలఘుళకారమును విధించునదగుటంజేసియు; నుదంతరేఫాంతశబ్దములకు బహుత్వమున 12 చే నుత్వలోపము గలిగినవాని కలఘుళకారప్రాప్తియే లేదుగాన నీళ్లు; నీళ్లచేత మొదలగురూపములు బాలవ్యాకరణసమ్మతములు గావనక తప్పదు. 13 చే నలఘుళకారముగల్గినదాని నొక్కరూపము నేని 12 సూత్రమునఁ జేర్చి యుత్వలోపముం జూపమియు నిందులకుఁ బ్రమాణంబె. కాఁగా శబ్దసహజ డలటరల యుత్వమునకు లోపమును విధించుసూత్ర మిదియనియు మీఁదివిధి యుత్వలోప మీవిధిచేఁ గలుగనపుడు వర్తించునదనియు 14 విధి యీవిధిచే నుత్వలోపమునందిన డలలకు మాత్ర మలఘుళకారమును విధించునదనియు ఫలితమును గ్రహించునది.

**బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబు లయిన డ-ల-ర-ల కలఘులకారంబు బహుళంబుగానగు. ౧౩.**

త్రాళులు-త్రాడులు. గుమ్మళులు-గుమ్మడులు. మొగిళులు-మొగిలులు. పిడికిళులు-పిడికిలులు. ఊళులు-ఊరులు. పందిళులు - పందిరులు.

టీ. పూర్వసూత్రముచే నగునుత్వలోపమునకు విషయములు గాక యుదంతములైన డలరలాంతశబ్దముల డలరలకు బహుత్వమున బహుళముగ నలఘుళకారము గలుగును. బహువచనమున నను సామాన్యోక్తింజేసి యివ్విధిచే నగు నలఘుళకారము నిఖిలవిభక్తులందును బహుత్వమున సిద్ధించెడి. త్రాడు+లు:—దీనిచే డకారమాత్రమున నలఘుళకారము గలుగ 'త్రాళ్+ఉ+లు=త్రాళులు' అని రూపమగును. ఇది సహజోదంత డవర్ణాంతశబ్దమునకు బహువచనమున నలఘుళకారము గల్గుట కుదాహరణము.

అలఘుళకారము సిద్ధింపనిపక్షమునఁ ద్రాడులని యుండును. ఇట్లే త్రాళులను; త్రాళులచేత మున్నగురూపములు గలుగుటను బహుత్వమున గమనించునది. గుమ్మడి:—ఇది యికారాంతమైనను బహుత్వమున నుదంతముగ మాఱెడిఁగాన నలఘుళకారము గల్గిన గుమ్మళులనియుఁ గలఁగకున్న గుమ్మడులనియు నిట్లే నితరవిభక్తులందు బహుత్వమున గుమ్మళులను గుమ్మళులచేత మున్నగురూపములు గలుగుననియు గ్రహించునది. ఈరీతిగనే మొగిలు-ఊరు మొదలగుసహజోదంతములయు; పిడికిలి-పందిరి మొదలగుతత్సమము 45 చే బహుత్వమున నుదంతములైనవానియు, రూపములప్రక్రియను గమనించునది. 12-13 నం దుదాహృతములైనశబ్దములలోఁ గొన్ని యౌపవిభక్తికము లగుటంజేసి ద్వితీయాద్యేకవచనములందు కాలిని-కాలిచేత - త్రాటిని-త్రాటిచేత-త్రాటన్-ఊరిని - ఊరన్; గోరిచేత - గోరన్; పిడికిటిని - పిడికిటన్ మున్నగురూపములు 29-30-31 మొదలగుసూత్రములచే సిద్ధించుటను యథాసంభవముగ గమనించునది.

## బహువచనశ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు. ౧౪.

త్రాళ్లు - గుమ్మళ్లు - మొగిళ్లు - మొసళ్లు - విళ్లు - సిళ్లు.

టీ. పంద్రెండవవిధిచే నుత్వలోపమునంది బహువచనముతోడఁ గూడినట్టియు సహజముగ జడ్డక్కరము తుదిఁగల్గినది గానట్టియునగు డకారలకారాంతప్రకృతుల తుదినున్నడకారలకారముల కలఘుళకారము నిత్యముగ నగును. త్రాడు+లు:—12 చే నుత్వలోపము గాఁగ 'త్రాడ్లు' అని యగును. ఈవిధిచే డకారమున కలఘుళకారము నిత్యముగ సిద్ధింప 'త్రాళ్ +ఉ+లు=త్రాళ్లు' అని రూపమగును. ఇది డకారమున కలఘుళకారము నిత్యముగ నగుట కుదాహరణము. మొగిలి+లు:—తత్సమము 45 చేఁ బ్రకృతితుదియిత్వ ముత్వమగును. మొగిలు +లు:—12 చే నుత్వలోపము 'మొగిల్లు' ఇపు డివ్విధిచే నిత్యముగ లకారమున కలఘుళకారముగాఁగ 'మొగిళ్లు'అని రూపమగును. ఇట్లే బహుత్వమున నుదంతములై యుత్వలోపమునందిన డలల కలఘులకారము నిత్యముగ నగుటను గమనించునది. విడి=ఎఱ్ఱనికాంతి. విడులు-విడ్లు-విళ్లు. లేక విల్లు శబ్దక్షత్తరూపము విలు. ఇది ద్విత్వరహితముగాన బహుత్వమున 'విలు +లు-విల్లు-విళ్లు' అని రూపమందఁడగును. ఇట్లే సిడి+లు=సిడులు=సిడ్లు=సిళ్లు' అనురూపము ప్రక్రియం గమనించునది. డలలకే నిత్యముగ బహుత్వమున నలఘుళకారము విధించుటంజేసి యుత్వలోపము నందిన టరేఫాంతశబ్దములకు తుంట్లు-నీర్లు మున్నగురూపములే గలిగెడి. నీళ్లు గోళ్లు మున్నగు రేఫాంతములకును బహువచనసంయోగమున నిట్లలఘుళకారము బహుళప్రాచీన

కవి ప్రయోగదృష్టమయ్యెడిఁగాని యీలక్షణకర్త యట్టివి ప్రాచీన ప్రయోగదృష్టములు గావని తలంచి కావలయు నంగీకరింపఁడయ్యెను. 12 విధియందలి లకారముచే నలఘు ళకారమును గూడ గ్రహించి 13 చే నలఘుళకారము సిద్ధించిన వానియుత్వమునకు లోపముచేయుందమన్న 12 వికల్పవిధియగుటఁ బక్షమున కాల్లు మున్నగుననిష్టరూపములు గలుగుటంబట్టియు నిత్యవిధానమునకు సార్థక్యము చెడుటంబట్టియు నట్లొనర్ప నవకాశము లేదని 12 నందె నిరూపితము. డలలకు నిత్యముగ ళకారము విధించుటంజేసి యుత్వ లోపపక్షమున 'త్రాళ్లు-కాళ్లు' అనియే గాని 'త్రాడ్లు-కాల్లు' అనుననిష్టరూపములు గలుగ వని గ్రహించునది. బహువచనశ్లిష్టములను సామాన్యోక్తింజేసి బహుత్వమున విధించిన లకార సంయోగము సంభవించినపుడెల్ల నీవిధి గల్గుననియు దానఁ 'త్రాళ్లను, త్రాళ్లచేత, త్రాళ్లకొఱకు' 'కాళ్లను-గాళ్లచేత' అను మొదలగురూపములు సిద్ధించుననియు గ్రహింప వలెను. ఆద్విరుక్తంబులనుటంజేసి 'గడ్డి - తల్లి - పిల్లి' మొదలగు ద్విరుక్తాంతముల కీకార్యము బహుత్వమునఁ గలుగదనుట స్పష్టము. 'విల్లు' మొదలగు వానికి బిందుపూర్వక డకారంబగుటను గమనించునది.

## సమానపదంబునందు సంయోగంబు పరంబగునప్పుడెల్లచో ఖండబిందునకుం బూర్ణంబగు. ౧౫.

అనఁటులు-అనంట్లు. పనఁటులు - పనంట్లు. గోఁటులు - గోంట్లు. తేఁటులు-తేంట్లు. ఏఁడులు-ఏండ్లు కాఁడులు - కాండ్లు. ఏండ్లు - కాండ్లిత్యాదులందు డాకు ళాదేశంబు కొందఱు వక్కాణించిరి; తెనుఁగున బిందుపూర్వకస్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు.

టీ. ఏకపదమునం దనఁగా సమాసవశమునసైన నేకపదంబునంగాక యొకే ప్రకృతియందు 12 విధిచే నుత్వలోపము సంభవించెనేని దీర్ఘహ్రస్వములలో నెద్దానిమీఁదిదైనను నర్ధానుస్వారము పూర్ణానుస్వారమగును. ఉత్వలోపమునందఁదగిన డ-ల-ట-ర-లలో రేఫలకారములకు ముందర్ధబిందువు సంజ్ఞ 16 చే సంభవింపదుగాని డకార టవర్ణములకుఁ బూర్వముండిన నుండఁదగుంగాన నట్లు టడవర్ణాంతశబ్దములలో ట-డ-లకు ముందర్ధబిందువు తోఁచెడిస్థలములందలి యర్ధబిందువును నిత్యముగఁ బూర్ణముగ మార్ప నీసూత్రమారబ్ధమయ్యెనని గ్రహించునది. సంజ్ఞ 14 వికల్పవిధి యగుటంజేసి పక్షమున నర్ధబిందురూపమే నిల్చిపోవలసివచ్చుటంబట్టియు 15 విధి దీర్ఘముమీఁద నిత్యముగ ఖండమునే నిల్పునదగుటంబట్టియు బహువచనసంయోగమున హ్రస్వదీర్ఘములపై నర్ధమునకుఁ బూర్ణము నిత్యముగ విధింపఁబడెనని ప్రయోజనము నెన్నునది.

సంజ్ఞ 16 విధి బిందుమాత్రముండఁదగినతావుల సూచించెడి. 'అనఁటి+లు':—తత్సమము 45 చేఁ బ్రకృతితుదియికారమున కుకారమగును. 'అనఁటు+లు:—12 చే నుత్వలోపము రా 'అనఁట్లు' అని రూపమును గావలసియుండ నిత్యముగఁ బూర్ణబిందువు దీనిచేఁ గూర్చి 'అనంట్లు' అని రూపమును సిద్ధింపఁజేసెను. అనఁటి యనునది యఖండపదము. ఏకపదమని యర్థము. ఇది సిద్ధఖండము పూర్ణమగుట కుదాహరణము. ఇట్లే పనంట్లనుదాని ప్రక్రియం గమనించునది. 'పనఁటి' ఇది యికారాంతము. గోఁటు:—ఇది యుదంతము. గోఁటు+లు:—12 చే నుత్వలోపము రా 'గోఁట్లు' అని గావలసియుండఁగ నిందలి యొల్లచో ననుదళమునంజేసి దీర్ఘముమీఁదఁగూడ సంజ్ఞ 15 సూత్రమును బాధించి పూర్ణబిందువయ్యెడిఁగాన 'గోంట్లు' అని రూపమగును. ఇది దీర్ఘముమీఁది సిద్ధఖండము నిత్యముగఁ బూర్ణమగుట కుదాహరణము. ఇట్లే తేఁటి అనుదానికిఁ దేంట్లగునని గ్రహించునది. ఏండ్లనునది యట్లే యేఁడను ప్రకృతినుండి గల్గినదిగ సంభావించునది. సమానపదమనుటంజేసి యివ్విధి హ్రస్వదీర్ఘములమీఁది సిద్ధఖండమునే నిండుసున్నగ మార్చునదిగాని సాధ్యఖండమును గాదని సామాన్యముగ నెఱుంగవలెను. మఱియు సమానపదములందలి వ్యాకరణప్రాప్తార్థము పూర్ణముగాకుండుటయు నిందులకు దృష్టాంతము. బహువచనశ్లిష్టములైన డలలలో లకారమున కలఘుళకారము గల్గుట నిర్వివాదము. లకారము స్థిరవర్ణమగుట నద్దానికిముందు బిందువు చూపట్టదుగాన (సంజ్ఞ 16 విధి) ళకారము గల్గినచో; బిందువుండెనేని యది చెడునేమో యని యనుమానమేని పడనక్కఱలేదు. డకారమునకు ముందె బిందువుండిన నుండఁదగును. (సంజ్ఞ 16 విధిననుసరించి) 12 చే నుత్వలోపము డకారాంతములకెల్ల బహుత్వమున సిద్ధించిన పక్షమున 14 చే నిత్యముగ నలఘుళకారము గలుగక తప్పదు. మఱియు 13 చే నుత్వలోపముగలుగనిపక్షమునను నలఘుళకారము డకారాంతములకు బహువచనమునఁ గలుగవలసియున్నది. ముందుబిందువుగల డకారముల కలఘుళకారము గల్గినచో సంజ్ఞ 16 విధి ననుసరించి బిందువు తొలఁగక తీరదు. కాన బిందువు ముందులేని డకారములకే 13-14 చే నగు నలఘుళకారము గలిగెడిఁగాని బిందువు సహజముగ ముంపిడికొన్న డకారముల కలఘుళకారము గలుగదని గ్రహింపవలసియున్నది. ఈరీతి ననుసరించి 'ఏఁడు; కాఁడు;' మొదలగు సిద్ధబిందుపూర్వకడవర్ణముల కలఘుళకారము 13-14 చే నయ్యెనేని డవర్ణము ముందుండుబిందువు లోపింపవలసివచ్చునుగాన నిట్లు సిద్ధబిందువు ముందు తోఁచెడిడకారముల కలఘుళకారము 13-14 చే సిద్ధింపదనియు, 12 చే నుత్వలోపముం జెందిన పక్షమున 15 చే నిత్యముగ నర్ధము పూర్ణమై 'యేండ్ల'నియు నుత్వలోపాభావమున 'నేఁడు'లనియుం, నిట్లే 'కాఁడులు-కాండ్ల'నియు నగునుగాని 'ఏళ్లు-

కాళ్లఁను రూపములు గలుగవనియు, దాన నలఘుళకారము నిట్టిబిందుపూర్వకడకార ముల కాదేశించువారిమతము (సంజ్ఞ 16 విధి) లక్షణవిరుద్ధమగుటంజేసి యనాదర ణీయమనియు నేండ్లు-కాండ్లను నీక్రిందిసూరివివరణమున కభిప్రాయము. కాఁగా నలఘు ళకారాదేశము (13-14 లచే నయ్యెడిది) నిర్బిందుకములకే గాని సబిందుకములకుఁ గలుగదని ఫలితమును గ్రహింపవలెను. సామాన్యముగ నలఘుళకారము డ-ల-రలకే శాస్త్రముచే నగుటఁ గాననగును. అందు రలలు స్థిరములగుటంజేసి యవి బిందుపూర్వక ములు గాఁజాలవు. ఇఁక నొకడవర్ణమే బిందుపూర్వకము గాఁజాలినదగుటంజేసి నిర్బిం దువులకే గాని సబిందుకములకు డకారముల కిక్కార్యము గలుగదని సూరి వివరించుట యావశ్యకమయ్యెను. దీర్ఘముమీఁది సబిందుకడకారములనే యుదాహరించినను హ్రస్వముమీఁదఁ గూడ నెందేని డవర్ణమునకు ముందు బిందువు తోఁచిన నట్టివానికిని నలఘుళకారము గలుగదనియే గ్రహింపవలెను.

## ఔపవిభక్తికంబుల లివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగా నగు. ౧౬.

కొడవలి-కొడవండులు. ఉల్లోపంబు-కొడవండ్లు-పక్షంబునం దల ఘులకారంబు-కొడవళులు-కొడవళ్లు-కొడవలులు. రోఁకలిప్రభృతుల కిట్లు రూపంబు లెఱుంగునది. ఇల్లు-ఇండులు-ఇండ్లు-ఇల్లులు. ఇట్లు-కల్లు- పల్లు-ముల్లు-విల్లు-శబ్దంబులకు రూపంబులు తెలియునది. మద్యనిమ్నార్థ కంబులయిన కల్లు-పల్లు శబ్దంబులును తెల్లు ప్రభృతిశబ్దంబులు ననౌప విభక్తికంబు లగుటంజేసి వాని కీకార్యంబు లేదు.

టీ. 'ఔపవిభక్తికలీనామిల్లుక్బహుళం తథైవ డుశ్చ స్యాత్; సలలోర్బిందు యుతోడుర్వా'అనునవి మూలములు. ల్లు-లివర్ణములు తుదినిగల యౌపవిభక్తికశబ్దముల తుది లి-లువర్ణములకు బహుత్వమున బహుళముగ బిందువు ముందిడికొన్న డువర్ణ మాదేశ మగును. బహువచనమున నను సామాన్యోక్తి ననుసరించి యెల్లవిభక్తులందును బహు వచనములందగునని యెఱుంగునది. 28 చే నగునవి యౌపవిభక్తికములు. ద్వితీయాద్యేక వచనప్రత్యయములకు ముందుండునవి గాన వీని కౌపవిభక్తికములను సంజ్ఞ గల్గెనని తోఁచెడి. మఱియు 'ఇ-టి-తి' అనునవి ప్రకృతులకగుఁ బ్రత్యయములకుముందు చేరు నవిగాన నుపవిభక్తులను పేరు గల్గియుండును. ఉపవిభక్తులే యౌపవిభక్తికము లనం

బడును. వీనినిగూర్చి విస్తృతి 28 సూత్రపుటీకలో నరయునది. కొడవలి+లు:—కొడవలిశబ్ద మాపవిభక్తికము. దీనితుది లివర్ణమునకు బిందుపూర్వకడువర్ణము బహువచనము పరముగా నీసూత్రముచేఁ గలుగ 'కొడవ+ండు+లు=కొడవండులు' అని రూపమగును. 12 చే డువర్ణమునుత్వమునకు లోపము పాక్షికముగఁ గలుగ 'కొడవండ్లు' అని రూపమేర్పడును. ఈవిధిచే బిందుపూర్వకడువర్ణము రానిపక్షమున 'కొడవలి+లు' అని యుండ తత్సమము 45 చే లివర్ణమునిత్వమున కుత్వము గలిగి 'కొడవలులు' అని యగును. పిదప 13 చే నుదంతమైనలువర్ణమున కలఘుళకారము గలుగ 'కొడవళులు' అని రూపమేర్పడును. అలఘుళకారము 13 చేఁ గలుగని పక్షమున 12 చే బహుత్వమునఁ బ్రకృతితుదినున్న లువర్ణమునుత్వమునకు 12 చే లోపమును 14 చే నిత్యముగ నలఘుళకారమును గలుగుంగాన 'కొడవళ్లు'అని రూపము సిద్ధించును. కాఁగా బహువచనమున 'కొడవండులు-కొడవండ్లు-కొడవళులు-కొడవళ్లు-కొడవలులు' అని యైదురూపములు గల్గుననియు, నిట్లే బహుత్వమునం దెల్ల నిక్కార్యములు చూపట్టుననియు, దాన 'కొండవండులను-కొడవండులచేత-కొడవండ్లను-కొడవండ్లచేత- కొడవళులను-కొడవళులచేత-కొడవళ్లను-కొడవళ్లచేత - కొడవలులను - కొడవలులచేత' నను మొదలగురూపములేర్పడుననియు గ్రహించునది. ఇట్లే యాపవిభక్తికమగు రోఁకలిశబ్దమునకు 'రోఁకండులు-రోఁకండ్లు-రోఁకళులు-రోఁకళ్లు-రోఁకలులు'అనురూపము లాయావిధులచేఁ గలుగుటను గమనించికొనునది. ఈరీతిగనే యెల్ల లివర్ణాంతాపవిభక్తికముల ప్రక్రియను గమనించునది. సలలువర్ణము=లకారముతోఁగూడినలువర్ణము.'ల్లు' అనువర్ణమని తాత్పర్యము. ఇల్లు:—ఇది సలలువర్ణాపవిభక్తికశబ్దము. ఇల్లు+లు:—బహువచనము పరమగునపుడు 'ల్లు' అను ప్రకృతితుదిభాగమున కంతకును బూర్ణబిందుపూర్వక డువర్ణ మాదేశముగాఁగ 'ఇండులు' అని రూపమగును. ఇట్లే యితరవిభక్తుల బహువచనములందు 'ఇండులచేత' నను మొదలగు రూపము లగుటను గమనించునది. 12 చే బిందుపూర్వకడువర్ణమునుత్వమునకు లోపము గల్గినపక్షమున 'ఇండ్లు' అని రూపమగును. ఇట్లే యుత్వలోపపక్షమున 'ఇండ్లను-ఇండ్లచేత' అను మున్నగురూపము లేర్పడుటను దెలిసికొనునది. తెనుఁగున బిందుపూర్వకస్థిరము లేమింజేసియుఁ; సంయుక్తాంతమగుటంజేసియుఁ ; బిందుపూర్వకడకారమునకు ళాదేశము 13-14 చేఁ గలుగదని గ్రహించునది. 'ఇల్లులు' అనియే, బిందుపూర్వకడవర్ణము గలుగని పక్షమున రూపము సిద్ధించెడి. 13-14 సూత్రములందుఁ గ్రమముగ 'అసంయుక్తంబులై; అద్విరుక్తంబులైన' అనుదళములు గూర్పఁబడి యుండుటచే నిట్టిసంయుక్తాంతముల కుత్వలోపముగాని తన్మూలమునను నలఘుళకారాదేశముగాని సంభవింపవుగాన 'ఇళ్లు' అనురూప మీవిధిచే బిందుపూర్వకడువర్ణము రానిపక్షమునను సిద్ధింపదని ఫలితమును గ్రహింపవలెను. మద్యముంజెప్పని

కల్లుశబ్దమునకును, బల్లమును బోధించని పల్లుశబ్దమునకును, గంటకమును దెలిపెడు ముల్లుశబ్దమునకును, ధనురర్థకమగు విల్లుశబ్దమునకును, నౌపవిభక్తికము లగుటం జేసి యీవిధిచేఁ బూర్ణబిందుపూర్వక డువర్ణము బహుళముగఁ గలిగి క్రమముగ 'కండులు - పండులు - ముండులు - విండులు' అనురూపములు సంభవించుననియు, 12 చే నుత్వలోపము గలిగి 'కండ్లు - పండ్లు - ముండ్లు - విండ్లు-' అని రూపములు సిద్ధించుననియుఁ దెలియవలయును. పైని వివరించిన ప్రకారము ద్విరుక్తాంతము లగుటకతన వీని కలఘుళకారము సిద్ధింపదు. కల్లును జెప్పెడు కల్లుశబ్దమును బల్లమును బోధించెడి పల్లుశబ్దమును జెల్లు మొదలగుశబ్దములును నౌపవిభక్తికములు గామింజేసి యవ్వాని కీవిధిచే బిందుపూర్వకడువర్ణము సంభవింపదనియు, దాన వానికి 'కల్లులు-పల్లులు-జెల్లులు' అనియే రూపము లేర్పడుననియు, ద్విరుక్తాంతము లగుటం జేసి యుత్వలోపాలఘుళకారములును గలుగవనియు, మద్యనిమ్నార్థకములను నీక్రిందిసూత్రవివరణమున కభిప్రాయము. మద్యనిమ్నార్థకములు గాని కల్లుపల్లు మొదలగువానికి ద్వితీయాద్యేకవచనములందు 'కంటిని-పంటిని-ముంటిని-వింటిని-' అనుమున్నగు 'ంటి' అనునౌపవిభక్తికప్రత్యయము గలిగెడిఁ గాన నయ్యవి యౌపవిభక్తికములని యెఱుంగవలయును. మద్యనిమ్నార్థకములకుఁ గల్లు పల్లుశబ్దములకుఁ 'గల్లును-బల్లును' ననియే ద్వితీయాద్యేకవచనములందు రూపములు గుదిరెడిఁ గాన నవి యనౌపవిభక్తికము లయ్యెను. కల్లు=కన్ను:—ఈయర్థమునను గండులను ప్రయోగము క్వాచిత్కము. ఇల్లు మొదలగులకారసంయోగాంతములకు ప్రకీర్ణ 8 చే జడ్డకు లోపము గల్గినపక్షమున (ఇలు+లు) 12 చే నుత్వలోపము గలిగి 14 చే నిత్యముగ నలఘుళకారము సిద్ధించి బహుత్వమున 'ఇళ్లు-ఇళ్లను' మున్నగు రూపములును బక్షమునఁ గలుగుట కవకాశమగపడెడి. సామాన్యముగ బిందువన్న బిందుద్వయము గలుగవలయునుగానఁ బూర్ణబిందుపూర్వక డువర్ణమని యనవలసివచ్చెనని గ్రహించునది. బహువచనముపరమగునపుడె యీవిధియగుటచేతను, నికారాంతములును బహుత్వమునఁ దత్సమము 45 చే నుదంతములు గాఁదగుటచేతను, 'ండీ' అని మాత్రమాదేశించినఁ జాలునని తోఁచెడి.

### ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యంబయి బహువచనంబు నెనయు. ౧౭

కోడవండ్లులు-కోడవండ్లులను-కోడవళ్లులు-కోడవళ్లులను
ఇట్లు ప్రయోగదృష్టంబులు గ్రహించునది.

టీ. అపి సంయుక్తసమాప్తౌ భూయోఽంతే లుః ప్రదృశ్యతే నామ్నామ్' అనునది మూలము. కొలఁదిచోటులందు ప్రాతిపదికము తుదియక్షరము బహువచనముతోడఁ

గలిసికొనియు మరల బహువచనప్రత్యయమును బొందుటయుఁ గలదు. అనఁగా బహువచనముతోఁడఁ గూడికొనినదే నామమై బహువచనప్రత్యయమును బొందునని భావము బహుత్వమునందె యిట్లగుట యని గ్రహించునది. బహువచనముతోఁడఁ బ్రకృతితుది యక్షరము సంయోగించుటంజేసి మరల బహువచనప్రత్యయము వ్యవహారమునఁ గుదిరె ననఁ దగును. బహుత్వబోధకప్రత్యయముపై మఱల నట్టిదె యగుట వ్యాకరణమార్గ విరుద్ధవిషయమగుటచే బహుత్వమున బహువచనశ్లిష్టము నె నామముగా నిరూపించి బహువచనప్రత్యయము నద్దానికి విధించుట లాక్షణికసంప్రదాయ మయ్యెనని గ్రహించునది. 'కొడవండ్లు':—ఇది 16 చేఁ బూర్ణబిందుపూర్వకడువర్ణము నంది 12 చే నుత్వలోపమునంది సంశ్లిష్టబహువచనాంతమైనశబ్దము. దీనిపై మరల బహువచన ప్రత్యయ మీవిధిచేఁ గలుఁగ 'కొడవండ్లులు' అనురూపము సిద్ధించెడి. ఇట్లే ద్వితీయాది విభక్తులందును బహుత్వమునఁ దత్తద్విభక్తులును లడాగమమును సిద్ధింప 'కొడవండ్లులను' మున్నగురూపములు గలుగును. కొడవళ్లు:—ఇది 12 చే నుత్వలోపమును 14 చే నిత్యముగ నలఘుళకారమును బొందిన సంశ్లిష్టబహువచనాంతము. దీని కీవిధిచే మరల బహువచనప్రత్యయాదులు చేర 'కొడవళ్లులు- కొడవళ్లులను' అనురూపములు సిద్ధించును. ఇట్లే యితరవిభక్తులందు బహుత్వమున సంశ్లిష్టబహువచనాంతము మీఁద బహువచనప్రత్యయాదులు గలుగుటను గమనించునది. ఇట్లు బహుత్వమున సంశ్లిష్టబహువచనతుల్యములు గాఁదగువానికెల్ల మరల బహువచనప్రత్యయమును సంభవింపఁజేయక మహాకవిప్రయుక్తములై యగపడువానికి మాత్రమే యివ్విధిచే బహువచనమును సంశ్లిష్ట బహువచనాంతముమీఁద గూర్చి సాధుత్వమును సంపాదింపవలెనని 'ఇట్లు ప్రయోగ దృష్టంబుల గ్రహించునది' అను నీక్రింది సూరివివరణమున కభిప్రాయము. 'కోడండ్రురు-అండ్రురు- వీండ్రురు-' అని సంశ్లిష్టబహువచనాంతములమీఁద మరల బహువచనప్రత్యయము గల్గినప్రయోగములు భారతాదులందును గన్పట్టెడి. సంశ్లిష్టబహువచనాంతము మీఁదనే గాక సహజబహువచనాంతముమీఁదఁగూడ 'చూపఱులు, వేడుకకాఱులు' అని మరల బహువచనప్రత్యయము గ్రంథములఁ గానంబడియెడి.

## కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు; బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు. ౧౮

కలఁకు - కలను - కలఁకులు. కలను-కెలను-కొఱను-కొలను - గవను - నెఱను - మ్రాను-వరను - వలను ఇవి కలన్వాదులు.

టీ. న్వంతానాన్నామ్నః కుజ్ఞోన్వేర్బహువచనే' అనునది మూలము. కలను మొదలగు నువర్ణముతుదినిగలశబ్దములతుదినువర్ణమున కేకవచనము పరముగా వికల్పముగను,

బహువచనము పరముగా నిత్యముగను 'కుజ్' అనునదాదేశమగును. 'కుజ్':— ఇందు జకారము లోపించెడిఁగాన నది జిత్తగును. 'జిత్తు బిందుపూర్వంబగు'నను విధానముచే నది బిందువు ముందిడికొని కలుగును (ఁకు; ంకు) హ్రస్వముమీఁద నైన రెండుబిందువులును దీర్ఘములపై నైన యర్ధబిందువును గలుగుననుట పునరుక్తము. కలను:— దీనితుదినువర్ణమున కేకత్వమున 'కుజ్' అనున దీవిధిచే సిద్ధించినపక్షమున 'కలఁకు; కలంకు' అనియు, 'కుజ్' అనునది గలుగనిపక్షమునను, స్త్రీసమముగానఁ బ్రథమైకవచనలోపము గలిగి 'కలను' అనియుం రూపములేర్పడును. ఇట్లే హ్రస్వముమీఁద నువర్ణమునకు 'కుజ్' అనునది వికల్పముగ నాదేశమైనరూపముల ప్రక్రియ నేకత్వమున నెల్లవిభక్తులందును గమనించునది. కలను + లు:— బహుత్వమున నీవిధిచే కుజ్జు నిత్యముగ నగుంగాన 'కలఁకులు; కలంకులు' అనురూపములే సిద్ధించును గాని కలనులను మున్నగుననిష్టరూపములు గలుగవని గ్రహించునది. ఇట్లే బహుత్వమున నెల్లవిభక్తులందును కలంకులను; కలఁకులను; కలఁకులచేత; కలంకులచేత మున్నగురూపములందు కుజ్జు నిత్యముగనగుటను గమనించునది. మ్రాను:— ఇందుఁ దుదినున్న నువర్ణము దీర్ఘముమీఁదిదిగాన 'మ్రాఁకు'అని కువర్ణమునకు ముందర్ధబిందువే గలుగుటను గమనించునది. 'మ్రాను-మ్రాఁకు' అని యేకత్వమున నిట్లు వికల్పముగను, 'మ్రాఁకులు; మ్రాఁకులను' అని బహుత్వమున నిత్యముగను, కుజ్జు గల్గుటను గ్రహించునది. 'ముసలిమ్రానుల్'అని వసుచరిత్రకర్త తురుష్క జీర్ణవృక్షముల బోధించువాఁడై మ్రాఁకులంజెప్పుపక్షమున (బహుత్వమున) నిత్యముగఁ గాఁదగు కుజాదేశమును గణింపక ప్రయోగించిన ప్రయోగమొం డగపడెడి. ఇవి కలన్వాదులనుటంజేసి యిది యాకృతిగణము గాదనియు వీనికే గాని యితరముల కిక్కార్యమును గూర్పరాదనియు గ్రహించునది.

## అట్లు రేను గోను శబ్దంబుల నువర్ణంబు గుజ్జగు. ౧౯.

రేఁగు - రేను - రేఁగులు. గోఁగు - గోను - గోఁగులు.

టీ. కలన్వాదులనువర్ణమునకు కుజాదేశ మేకత్వమున వికల్పముగను బహుత్వమున నిత్యముగను నగునట్లే రేను గోను శబ్దములతుదినువర్ణమునకు గుజాదేశమగును. 'గుజ్'అనునది జిత్తుగాన బిందుపూర్వకమై యగును. రేనుగోనులనువర్ణము దీర్ఘముమీఁదిదిగాన దానికగుగుజాదేశ మర్ధబిందుపూర్వకమైయే యగును. రేను:— దీనిచే నేకత్వమున గుజాదేశమైనచో 'రేఁగు' అని రూపమగును. గుజాదేశముగానిపక్షమున 'రేను' అనియే యుండును. ఇట్లే గోనుశబ్దమున నేకత్వమున 'గోఁగు-గోను' అనియు, బహుత్వమున గోఁగులనియు రూపము లేర్పడెడి. 'కుజ్; గుజ్' అని తెలుఁగులాక్షణికులాదేశించినవానిని భాషాతత్త్వవిమర్శకులు 'కళ్, గళ్' అనుబహువచనప్రత్యయముల

యాదిమభాగములనియుఁ, గావుననే బహుత్వమున నివి నిత్యముగఁ జూపట్టుననియు, నేకత్వమునఁ బై బహువచనప్రత్యయములందలి కగలనుభాగములంగూడ శబ్దసహజములుగ గ్రహించుటంజేసి (అనుచితవిభాగమునంజేసి) రేఁగు, కలఁకు మొదలగురూపములు పక్షమునఁ గుదిరెననియు, రే-గో అనునవే ప్రకృతులనియు, నడుమనువర్ణము సంబంధార్థప్రకాశకమనియు నందురు. సామాన్యముగ శుద్ధాంధ్రమునఁ బ్రథమారూపమే ప్రాతిపదికముగాని ప్రత్యయయోగముచేఁ బ్రథమారూపమేర్పడుట సహజముగామిఁ బైవిమర్శకులయభ్యూహ సయుక్తికమన నొప్పెడి. 'కేషాంచి న్వంతశబ్దానాం కుస్సాన్త్యద్రుత్వార్ధబిందుకః' అను నాథర్వణము నూఁతగఁగొని యీసూత్రమును సూరి రచించెను. కుక్-గుగా దేశములు సమాసములందును గలిగెడి.

**బహువచనంబు పరంబగునపుడు చేను పేను మీనుశబ్దంబుల నువర్ణంబు లోపించు. ౨౦.**

చేను-చేలు. పేను-పేలు. మీను-మీలు.

టీ. 'క్వచిన్నులోపశ్చ' అనునది మూలము. బహుత్వమున చేను-పేను-మీను శబ్దములతుది నువర్ణమునకు నిత్యముగ లోపము గలుగును. చేను+లు:—దీనిచే నువర్ణము లోపింప 'చేలు' అని రూపమగును. ఇట్లే 'పేను+లు=పేలు; మీను+లు=మీలు' అని రూపములు సిద్ధించెడి. ఈరీతిగనే చేలను-చేలచేత-పేలను-పేలచేత-మీలను-మీలచేత మున్నగు బహువచనరూపముల సాధించికొనునది. ఏకత్వమున చేను-మున్నగురూపములగునని గ్రహించునది. 'చేనులను' అను మొదలగురూపము లలాక్షణికములని ఫలితమునెన్నునది. ఇవ్విధి సమాసములందుఁ గలుగదు.

**బహువచనంబు పరంబగునపుడు రేయిప్రభృతులతుదియక్షరంబు లోపించు. ౨౧.**

రేయి-రేలు. ఱాయి-ఱాలు. వేయి-వేలు. వ్రాయి-వ్రాలు. ఇత్యాదులు. ఈలోపంబు సమాసంబులందుం జూపట్టెడు. రేరాజు-మగఱాపతకము-వేవెలుఁగు.

టీ. 'కేషాంచిద్యంతశబ్దానాం...వర్ణస్యాంత్యస్య లోపస్స్యాల్లులయోః ప్రాయశః క్వచిత్.' అనునాథర్వణము మూలము. బహుత్వమున రేయిమొదలగు శబ్దములతుది వ్రాయి నిత్యముగ లోపించును. రేయి+లు:—దీనిచే 'యి'అను తుదియక్షరము లోపింప 'రేలు' అని రూపమేర్పడును. ఇట్లే యిందలి యాదాహృతులతుదినున్న యివర్ణములకు

బహుత్వమున నీవిధిచే నిత్యముగ లోపము గలుగ 'తాయి+లు=తాలు; వేయి+లు=వేలు; వ్రాయి+లు=వ్రాలు' అనురూపములు సిద్ధించెడి. ఇట్లంత్యవర్ణలోపము నందఁదగు వానినెల్ల నిందుఁ జేర్చి సాధింపవలెను. ఇట్లు తుదియక్షరలోపము వ్యస్తమున నేగాక సమాసాంతర్గతములైన యాయాశబ్దములందును గలుగుట ప్రయోగానుసారముగ గమనించునది. రేయి+రాజు:—ఇందు మొదట నున్న రేయిశబ్దముతుదియక్షరము లోపించి 'రేరాజు' అనురూప మయ్యెను. మగతాయి+పతకము:—ఇందు తాయిశబ్దముతుది ప్రాయి లోపించి 'మగతాపతకము' అనురూపము సిద్ధించెను. వేయి+వెలుఁగు:—ఇందుఁ దుదివ్రాయి లోపించి 'వేవెలుఁగు' అనురూపము గలిగెను. క్రమముగ నిమ్మూఁడును దత్పురుషకర్మధారయబహువ్రీహులగుటంజేసి సమాసములందునను మూలమునందలి బహువచనమునకు సారస్యము సంభవించెడి. ఇవియెల్లను 'యి' అనునదంతమందుఁ గలశబ్దములే గాన రేయిప్రభృతులనుపదమునందలి ప్రభృతిశబ్దముచే యివర్ణాంతములే బోధ్యములయ్యెడి. 'తాయి+లు' అనునపు డంతిమాక్షరలోపము నిత్యమగుటంజేసియు, నింకొక లకారము సంభవింప నవకాశము లేమింజేసియు,తాళ్లను వ్యవహార మలాక్షణికమయ్యెడి. సంశ్లిష్ట బహువచనాంతముమీఁదనే గాని మరల బహువచనప్రత్యయము చూపట్టమింజేసియు తాళ్లనున దపరూపమే యయ్యెడి.

## బహువచనంబు పరంబగునపు డావుప్రభృతుల తుదియక్షరంబునకు లోపంబు విభాషనగు. ౨౨.

ఆవు-ఆలు-ఆవులు. జాము-జాలు-జాములు. చుట్టము - చుట్టలు-చుట్టములు. మీసము-మీసలు-మీసములు.

టీ. బహువచనము పరముగాఁగ 'ఆవు' అను మొదలగుశబ్దముల తుదివర్ణమునకు లోపము వికల్పముగ నగును. ఇందుఁ బ్రభృతిశబ్ద మావుశబ్దమునుబట్టి వువర్ణాంతములనే బోధించునదిగ గ్రహింపక యంతిమాక్షరలోపమును బహుత్వమున వికల్పముగ నందఁదగు వివిధవర్ణములు తుదినిగలశబ్దములనెల్ల దీనికి గుఱిగఁ జేయఁదగునని యిందలి యుదాహరణములంబట్టి గ్రహింపవలెను. ఆవు+లు:—దీనిచే బహువచనము పరముగా వులోపము గాఁగ 'ఆలు' అనురూపమగును. వులోపము గలుగనిపక్షమున 'ఆవులు' అని యగును. ఇట్లే 'జాలు-జాములు' అనురూపముల ప్రక్రియను జాముశబ్దమునుండి యూహించి కొనునది. ఈరీతిగనే బహుత్వమున మిగిలినవిభక్తులందు ఆలను-ఆవులను మొదలగురూపములసిద్ధిని గమనించునది. చుట్టము+లు:—ఇది నపుంసకసమముగాన మువర్ణకాంతమైయుండును. బహుత్వమున ములోపము గలుగ

'చుట్టలు' అనియు, ములోపము గలుగనిపక్షమున 'చుట్టములు' అనియు వలసినఁ దత్సమము 43 చే 'చుట్టాలు'అనియు రూపములు గలిగెడి. ఇట్లే 'మీసలు-మీసములు-మీసాలు'అను రూపములు సిద్ధించెడి. 'మీసాలపై తేనియల్'అని మనుచరిత్ర ప్రయోగము. వృత్తియందుఁ బూర్వపదమగునపుడును నావుశబ్దము తుదివ్రాయి లోపించుటయు నద్దానికిఁ బరుషములు పరములగునపుడు నుమాగమమగుటయుఁ, బరుషములు సరళములగుటయు నర్ధబిందువు ద్రుతమునకుఁ గలుగుటయును, సరళస్థిరములు పరములగునపు డంత్యవర్ణలోపము మాత్రమగుటయుఁ బాక్షికమని గ్రహించునది. 'ఆఁబెయ్య-ఆఁదోఁక-ఆదూడ-ఆలగాపరి' అని ప్రయోగము లగపడెడి.

## ఇయకుమాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగానగు.౨౩.

కన్నియ-కన్నె. జన్నియ-జన్నె. వన్నియ-వన్నె. కొంచియము-కొంచెము. కొండియము-కొండెము. బహుళగ్రహణముచే సందియము కాఁటియ మొదలగుశబ్దంబులం దెత్వము లేదు. ఇయశబ్దంబునం దికార లోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యాది ప్రయోగంబులందు మృగ్యంబు. ముత్తియశబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి. ముత్తియము-ముత్తెము-ముత్యము.

టీ. 'ఏదంతతా చ నామ్నామన్యతరస్యామియాంతానామ్' అను చింతామణి సూత్రమును, దానిని వివరించు 'ఇయాంతత్వే క్వచిత్స్యాదెత్వం యశ్చాపి తద్భవే, లఘుస్స్యోఽపి చ సంయుక్త ఇతి కేషాంచిదీరణా.' అను నాథర్వణమును మూలములు. ఆచ్ఛికశబ్దములందలి 'ఇయ'అనుభాగమునకు 'ఎ'అనునది బహుళముగ నాదేశమగును. కన్నియ:—ఇందుఁ దుదిభాగమగు 'ఇయ' అనుదాని కెకార మాదేశముగాఁగ 'కన్న్-ఎ=కన్నె' అని రూపమగును. ఇట్లే తక్కినయుదాహరణముల ప్రక్రియను గమనించునది. ఏకత్వమునను బహుత్వమునను నీయెత్వము బహుళముగఁ గల్గునని గ్రహించునది. సూత్రమున బహుళపదముం గూర్చుటంజేసి 'సందియ-కాఁటియ' అను మొదలగు శబ్దముల తుదినున్న యియ కెత్వము సిద్ధింపదని 'బహుళగ్రహణముచే' నను క్రింది సూరి వివరణమున కభిప్రాయము. నిత్యముగఁ బ్రవర్తింపకుండుట యనుబహుళప్రయోజనమని గ్రహించునది. కొందఱు లాక్షణికు లియాంతశబ్దములందలి యికారమునకును బక్షమున లోపము గల్గనగునని యనిరనియుఁ (కన్నియ:—కన్న్+య=కన్న్య:—జడ్డకు లోపము; కన్య) గాని యట్టిరూపములు ప్రాచీనకవిప్రయుక్తములై బహుళముగ నగపడమింజేసి యికారలోపమును జెప్పెడి లాక్షణికుల యమ్మాట యనాదరణీయమనియు నయ్యాది యనుసూరి యీక్రింది వివరణమున కభిప్రాయము. (మృగ్యము=వెదుకఁదగినది-శూన్యమనుట) ఒక్కముత్తియ శబ్దమునకు మాత్ర మిత్వలోపము ప్రయోగసిద్ధమై ముత్యమని

యగపడుచుండుటచేఁ బైలాక్షణికోక్తి యిద్దానివిషయమున మాత్రమే యంగీకరింప నగు నని 'ముత్తియశబ్దమునందు మాత్ర'మను నీక్రిందివివరణమున కభిప్రాయము. ఇత్వలోపము గలిగినపిదప-ముత్తియ శబ్దమునందలి జడ్డకుఁ బ్రకీర్ణము 8 చే లోపము గలుగుటను గమనించునది. ప్రౌఢవ్యాకర్త 'ముత్తియశబ్దేతరంబులకును దఱచుగ నిత్వలోపము గానంబడియెడి' నని 'దివ్వియ+ఆయువు=దివ్వాయువు-కల్లియము = కళ్ళ్యాల-పల్లియము=పళ్ళ్యము-పీడియము=పీడ్యము'అను మొదలగువాని నుదాహరించి ముత్తియశబ్దంబునందు మాత్రమను సూరి వాక్యమును సవరించినాఁడు. ఇట్లిత్వలోపముగలిగిన చోటులందు జడ్డ తోఁచెనేని పూర్వము తెల్పిన ప్రకారము ప్రకీర్ణము 8 చే జడ్డలోపము గల్గునను టను స్మరించికొనునది. కాని యిట్టి యిత్వలోపము గల్గిన ప్రయోగములు భారతాదిప్రాచీనకావ్యసిద్ధములు గామింజేసి సూరి యుపేక్షించెనని తోఁచెడి. కాఁగాఁ బ్రయోగానుసారముగ నెత్వము గలుగుటను నిత్వలోప మగుటను గమనింపవలెనుగాని యియాంతశబ్దములందెల్ల నీవిధులం గూర్పరాదని గ్రహించునది. ఇత్వలోపమునకు 'నెయ్యపుఁగన్యకలననవాలుఁదూపుల' అనురాఘవపాండవీయ ప్రయోగము గన్పట్టెడి. భారతార్థమున 'నెయ్యపుఁగన్యకల' అని విఱుఁగవలెనుగాన రామాయణార్థమునఁ గూడ నద్దానిని గన్యయనుశబ్దముగనే భావింపక తీరదు. ఆపక్షమున నది కన్నియశబ్దమున కిత్వలోపముచేఁ గల్గినదిగ నంగీకరింపక తప్పదు. ఆచ్ఛికశబ్దములందలి యియయనుదాని కెత్వమాదేశమగునను సామాన్యోక్తింజేసి తుదినున్నదానికే గాక నడుమనున్నదానికిని నీయాదేశము గలుగనగుననియు దాన బరియాచకమునకుఁ బరేచకమనియు నిత్వలోపము గల్గిన బర్యాచక మనియుఁ రూపాంతరములు గలుగవచ్చుననియు లాక్షణికులయాశయము. మూలమును నీసూత్రమును బ్రాతిపదికములకే యివ్విధానమని తెలిపెడి. కాని యాచ్ఛికక్రియలందును నిక్కార్యము గల్గుట ప్రయోగదృష్టమని వ్యాఖ్యాతలయాశయము. (కదియంబడె=కదెంబడె.)

## సర్వనామప్రకరణము.

వాక్యమున నామవాచకమునకు బదులుగా వాడఁబడునది సర్వనామము. ఏదేనొకపదార్థమునుగాని పదార్థములను గాని తెల్పునది నామవాచకము. ఒకదానికిఁ బేరైనశబ్దమని భావము. ఒకవాక్యమున నామవాచకము నావృత్తము చేయవలసివచ్చిన యెడల మరల నద్దానినే పునరుక్తముగ నావృత్తి చేయనక్కఱ లేకుండ దానికి బదులుగ వాడఁబడునది సర్వనామము. విశేష్యపునరుక్తిదోషమును దలఁగింప సర్వనామము ప్రయోగింపఁబడునని తాత్పర్యము. 'సర్వనామము=ఎల్లనామములకు బదులుగనగు నామము. ఎల్లనామములకు బదులుగ వాడఁబడునది సర్వనామము గావుననే సర్వనామముపసర్జనమగుటయుఁ నొకదానికి సంజ్ఞయగుటయు సంభవింపవు.

## అన్నిప్రభృతులు సర్వనామంబులు. ౨౪.

అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు-పలు-ఆ-ఈ-ఏ-నీ-నా-మన-తా-సంఖ్యావాచకంబులు-అన్నిప్రభృతులు. వీనికిం బ్రథమాంతరూపంబులుదాహరించెద. వీనిలో డుమంతంబులకెల్ల న్యాగమంబు పూర్వోక్తంబు స్మరించునది. బహువచనలకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమాబహువచనంబునకుం బోలె నెఱుంగునది. విశేషాకారంబులు గలిగెనేనిఁ గొండొకచో ద్వితీయవఱకును గొండొకచోఁ దృతీయయం దొక్కరూపంబు వఱకును రూపభేదంబులు వక్కాణించెద. శేషంబూహించునది. అన్ని మొదలగుశబ్దంబు లాఱును ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు-అమహదర్థంబు లేకవచనాంతంబులగు. ఇందు నీ మొదలగునాలుగుశబ్దంబులు సర్వార్థంబులందుల్యరూపంబు లయియుండు.

మ-అనునది మహదర్థమనుటకు, అ-అనునది యమహదర్థమనుటకు, ప్ర-మొదలయినవి ప్రథమాదివిభక్తులకును సంకేతములుగా నిందు గ్రహించునది.

మ. అ.

సర్వతావదర్థకము.

ప్ర. { అందఱు / అందొఱు } ...అన్ని.

ఇయదర్థకము.

ప్ర. ఇందఱు ...ఇన్ని.

కియద్యావదర్థకము.

ప్ర. ఎందఱు ...ఎన్ని

కతిపయార్థకము.

ప్ర. కొందఱు ...కొన్ని

బహ్వర్థకము.

ప్ర. { పెక్కండ్రు / పెక్కురు } పెక్కు. దీనికి బహువచనముం గలదు పెక్కులు

ఈశబ్దంబు లౌపవిభక్తికంబులగుటం జేసి - అన్నిటి - అన్నింటి - ఇన్నిటి - ఇన్నింటి - ఎన్నిటి - ఎన్నింటి - కొన్నిటి - కొన్నింటి - పెక్కిటి - పెక్కింటి - యనురూపంబులు ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపు డమహత్త్వంబునం దగునని తెలియునది.

బహ్వర్థకము.

ప్ర. { పలుగురు / పలుగుండ్రు } అమహత్త్వంబున దీనికి వ్యస్తప్రయోగంబు లేదు.

మ.

తదర్థకము.

ప్ర. వాఁడు... { వారు / వారలు / వాండ్రు.

ద్వి. వానిని... { వారిని / వారలను / వాండ్రను

అ.

ప్ర { అది ...అవి. / అద్ది ...అవ్వి. / ఆయది ...ఆయవి. / అయ్యది...అయ్యవి.

ద్వి. { దానిని / ఆదానిని / అద్దానిని } ...వానిని

మ.

ఇదమర్థకము.

ప్ర. వీఁడు ... { వీరు / వీరలు / వీండ్రు.

ద్వి. వీనిని ... { వీరిని / వీరలను / వీండ్రను.

అ

ప్ర. { ఇది ... ఇవి. / ఇద్ది ... ఇవ్వి. / ఈయది ... ఈయవి. / ఇయ్యది ... ఇయ్యవి.

ద్వి. { దీనిని / ఈదానిని / ఇద్దానిని } ...వీనిని.

మ.

యత్కిమర్థకము.

ప్ర. { ఏఁడు... ఏరు. / ఏవాఁడు... { ఏవారు. / ఏవారలు / ఏవాండ్రు / ఎవ్వాఁడు... { ఎవ్వారు / ఎవ్వారలు / ఎవ్వాండ్రు / ఎవ్వఁడు... { ఎవ్వరు / ఎవ్వండ్రు / ఎవడు { ఎవరు / ఎవండ్రు

ఏనిని ఏరిని.

ద్వి. { ఏవానిని { ఏవారిని / ఏవారలను / ఏవాండ్రను / ఎవ్వానిని { ఎవ్వారిని / ఎవ్వారలను / ఎవ్వాండ్రను / ఎవ్వనిని... { ఎవ్వరిని / ఎవ్వండ్రను. / ఎవనిని { ఎవరిని / ఎవండ్రను.

అ.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్ర. | ఎది ... ఎవి. | | ద్వి. | దేనిని ... | వేనిని |
| | ఏది ... ఏవి. | | | ఏదానిని ... | ఏవానిని |
| | ఎద్ది ... ఎవ్వి. | | | ఎద్దానిని ... | ఎవ్వానిని |
| | ఏమది ... ఏయవి. | | | | |
| | ఎయ్యది... ఎయ్యవి. | | | | |

మహతి వాచ్యంబగునే నేకత్వంబున యత్కిమర్థకశబ్దంబు-ఎవ్వరిత-ఎవ్వర్త-ఎవ్వత-ఎవరిత-ఎవర్త-ఎవత-ఎవ్వరితి - ఎవ్వర్తి-ఎవ్వతి-ఎవరితి.ఎవర్తి-ఎవతి-ఎవ్వరితె ఎవ్వర్తె-ఎవ్వతె-ఎవరితె-ఎవర్తె-ఎవతె - ఎవ్వర్తుక-ఎవ్వతుక-ఎవర్తుక-ఎవతుక-అనియిరువది రెండురూపంబులువడయు.

తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజ వివక్షించునపుడు-అతఁడు-ఆతఁడు; ఇతఁడు - ఈతఁడు; ఎతఁడు-ఏతఁడు-అనురూపంబులు వడయు. మహతీవాచకంబులు. ఆమె - ఆపె - ఆకె; ఈమె-ఈపె-ఈకె; ఏమె-ఏపె-ఏకె-అనురూపంబులు వడయు.

యుష్మదర్థకము.

ప్ర. { నీవు. / ఈవు } ... { మీరు. / మీరలు. / ఈరు. / ఈరలు.

ద్వి నిన్నును... మిమ్మును.
తృ నీచేతను... మీచేతను

అస్మదర్థకము.

ప్ర. { నేను / ఏను } ... { మేము / నేము / ఏము

ద్వి. నన్నును ...మమ్మును
తృ. నాచేతను ...మాచేతను

ఉభయార్థకము.

నిత్యబహువచనాంతము.

ప్ర. మనము.
ద్వి. మనలను.
తృ. మనచేతను-మనలచేతను.

ఆత్మార్థకము.

ప్ర. తాను.... { తాము. / తారు. / తమరు.

ద్వి. తన్నును ...తమ్మును.
తృ తనచేతను ...తమచేతను.

ఇంక సంఖ్యావాచకంబులు వక్కాణించెద.

మ.

ఏకార్థకశబ్దము.

ప్ర.

ఒకఁడు ... { ఒకరు. / ఒకండ్రు

ఒకోఁడు ... { ఒకోరు / ఒకోండ్రు

ఒక్కఁడు ... { ఒక్కరు / ఒక్కొండ్రు

ఒక్కొఁడు ... { ఒక్కొరు / ఒక్కొండ్రు

ఒకరుఁడు ... { ఒకరులు. / ఒకళులు. / ఒకళ్లు.

ఒకోరుఁడు ... { ఒకోరులు. / ఒకోళులు / ఒకోళ్లు.

ఒక్కరుఁడు ... { ఒక్కరులు / ఒక్కళులు / ఒక్కళ్లు

ఒక్కొరుఁడు ... { ఒక్కొరులు / ఒక్కొళులు / ఒక్కొళ్లు.

ఒకరువుఁడు ... ఒకరువులు.
ఒకోరువుఁడు ... ఒకోరువులు.
ఒక్కరువుఁడు ... ఒక్కరువులు
ఒక్కొరువుఁడు... ఒక్కొరువులు
ఒరుఁడు ... ఒరులు.
ఒరువుఁడు ... ఒరువులు.

ఒండు ... { ఒండులు. / ఒండ్లు.

ఒడ్డు ... { ఒడ్డులు. / ఒడ్లు.

ద్వితీయాది విభక్తిరూపంబు లూహించుకొనునది.

అ.

ప్రథమైకవచనాంతములు.

ఒకటి - ఒకోటి - ఒక్కటి - ఒక్కొటి - ఎక్కటి - ఒకఁడు - ఒకోఁడు - ఒక్కఁడు-ఒక్కొఁడు - ఒండు. ఈశబ్దంబునకుసంఖ్యావాచకంబునకు బహువచనంబు లేదు.

దీనికి మహాతి వాచ్యంబగునపు డేకత్వంబున వక్ష్యమాణరూపంబు లెఱుంగునది.

మహాత్యర్థకము.

ఒకరిత - ఒకర్త - ఒకర్తు - ఒకర్తుక -ఒకత-ఒకతుక - ఒకోరిత - ఒకోర్త-ఒకోర్తు-ఒకోర్తుక-ఒకోత-ఒకోతుక -ఒక్కరిత - ఒక్కర్త - ఒక్కర్తు-ఒక్కర్తుక-ఒక్కత-ఒక్కతుక-ఒక్కొరిత-ఒక్కొర్త - ఒక్కొర్తు-ఒక్కొర్తుక-ఒక్కొత - ఒక్కొతుక-ఒకరితి-ఒకర్తి-ఒకతి-ఒకోరితి-ఒకోర్తి-ఒకోతి-ఒక్కరితి-ఒక్కర్తి-ఒక్కతి-ఒక్కొరితి-ఒక్కొర్తి-ఒక్కొతి - ఒకరితె - ఒకర్తె-ఒకతె-ఒకోరితె - ఒకోర్తె-ఒకోతె-ఒక్కరితె-ఒక్కర్తె

ఒక్కతె - ఒక్కొరితె - ఒక్కొర్తె - ఒక్కొతె - ఒర్త - ఒర్తి - ఒర్తు - ఒర్తుక.

ఇంక ద్విప్రభృతి సంఖ్యావాచకంబులు ప్రథమాంతరూపంబులు వక్కాణించెద.

| మ. | అ. |
|---|---|
| ప్ర. | |
| ఇద్దఱు, ఇరుగురు | ...రెండు |
| మూగురు, ముగ్గురు, ముగురు | ...మూఁడు |
| నలుగురు | ...నాలుగు. |
| అయిదుగురు | ...అయిదు. |
| ఏగురు | ...ఏను. |
| ఆఱుగురు | ...ఆఱు. |
| ఏడుగురు | ...ఏడు. |
| ఎనమండ్రు | ...ఎనిమిది. |
| తొమ్మండ్రు | ...తొమ్మిది. |
| పదుగురు, పదురు, పదుగుండ్రు, పదుండ్రు | ...పది. |
| పదునొకరు | ...పదునొకటి. |

ఇచ్చట నేకశబ్దార్థరూపంబు లెల్ల నర్థానురూపంబుగం గూర్చుకొనునది.

| | |
|---|---|
| పదునొకరు | ... పదునొకటి. |

ఇత్యాదులు.

| | |
|---|---|
| పన్నిద్దఱు, పన్నిరుగురు | పండ్రెండు. |
| పదుమూగురు, పదుముగ్గురు, పదుముగురు | పదుమూఁడు |
| పదునలుగురు | ...పదునాలుగు. |
| పదునయిదుగురు | ...పదునయిదు. |
| పదునేగురు | ...పదునేను |
| పదునాఱుగురు | ...పదునాఱు. |
| పదునేడుగురు | ...పదునేడు. |
| పదునెనమండ్రు | ...పదునెనిమిది. |
| పందొమ్మండ్రు | ...పందొమ్మిది. |
| ఇరువండ్రు | ...ఇరువది. |
| ఇరువదియొకరు | ...ఇరువదియొకటి |

ఇత్యాదు లూహ్యంబులు.

| | |
|---|---|
| ముప్పండ్రు | ...ముప్పది. |
| నలువండ్రు | ...నలువది. |
| ఏఁబండ్రు | ...ఏఁబది. |
| అఱువండ్రు | ...అఱువది. |
| డెబ్బండ్రు | ...డెబ్బది. |
| ఎనుబండ్రు | ...ఎనుబది. |
| తొంబండ్రు | ...తొంబది. |
| నూఱుగురు | ...నూఱు. |
| వేగురు | ...వేయి. |
| పదివేగురు | ...పదివేలు. |

రెండు మొదలగునవి యాపవిభక్తిక శబ్దంబు లగుటం జేసి ద్వితీయాది విభక్తులు పరంబు లగునపుడు టింటు లగునని యెఱుంగునది. రెండిటిని- రెండింటిని- రెంటిని. మూఁడిటిని - మూఁడింటిని-మూఁటిని- ఇత్యాదులు. ఏకశబ్దమునకు-ఒంటి - ఒకానొకఁడు-ఒకానొకటి - ఒకానొకరిత-ఒరిమ - ఒండొకరు-ఓరట్టు - అనురూపంబులును-ద్విశబ్దార్థంబునకు-ఇనుమడి-ఈరాఱు-అనురూపంబులు నర్థవిశేషంబులం జూపట్టెడు.

టీ. 'అన్ని మొదలగుపదుమూఁడుశబ్దములును రెండుమొదలగుసంఖ్యను జెప్పెడు శబ్దములును' అన్నిప్రభృతు లనుపదముచే బోధింపఁబడెడి. ప్రభృతులు=మొదలైనవి. ఇందు ప్రక్రియాప్రదర్శనముఖమునఁ గాక నిపాతవిధి నాశ్రయించి సర్వనామముల సిద్ధరూపములు మాత్రమే చూపఁబడును. కాన నన్ని మొదలగుసర్వనామములలో మహద్వాచకములై డుజ్ప్రత్యయమును బొందఁదగినవానికెల్లను దత్సమము 23-24 లచే నిగాగమము గలుగుటను జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలెను. ని+అగమము = న్యాగమము. పూర్వోక్తంబు=ముందుఁ జెప్పఁబడినది. ప్రథమాబహువచనప్రత్యయమగు లువర్ణకమునకును, దక్కినవిభక్తులందు బహుత్వముననగు నాగమలకారమునకును రేఫ మాదేశముగ నగుటను, నాయాదేశరేఫమునకు ముందు బిందుపూర్వక డకారము మొదలగునవి యాగమముగ సిద్ధించుటను బ్రథమాబహువచనమందువలెనే ద్వితీయాదివిభక్తులబహువచనములందును నూహించికొనవలెను. పూర్వాగమము=రేఫాదేశమునం దెడు లకారమునకు ముందుఁ గలుగునాగమములు. చెప్పినలక్షణములకు వ్యతిరేకముగ నెచ్చోనేని రూపములు గలఁగుట కల్గెనేని కొన్నిస్థలములందు ద్వితీయావిభక్తివఱకును గొన్నిస్థలములందుఁ దృతీయావిభక్తియం దొక్కరూపము వఱకును రూపములు చూపఁబడెడి. తక్కినవాని నాయాస్థలములందు యథాసంభవముగ గమనించికొనవలెను. విశేషాకారము = చెప్పినదానికంటె విలక్షణమగు నాకారము నందియుండుట. మహత్తును బోధించునవియేని 'అన్ని - ఇన్ని-ఎన్ని - కొన్ని - పెక్కు-పలు.' అనునీయాఱును రెండు మొదలగు సంఖ్యావాచకములును బహువచనాంతములే యగును. అనఁగా మహద్వాచకము లైనపుడు వీని కేకవచనాంతముగఁ బ్రయోగము లేదని భావము. అమహత్తును జెప్పునవియేని పైశబ్దము లేకవచనాంతములే యయ్యెడి. అనఁగా నమహద్వాచకము లగునపుడు పైశబ్దములు బహువచనాంతములుగఁ బ్రయోగింపఁబడవని తాత్పర్యము. ఇమ్మాటలు సామాన్యముగ శబ్దలక్షణమునుబట్టి వ్యాకరణపాఠకుల సుబోధమునకై యైనవనుట స్పష్టము. (పెక్కు-తప్ప) పైని నిరూపించిన సర్వనామములలో 'నీ-నా-తా-మన' అనునీనాల్గును మహద్వాచకము లైనను నమహద్వాచకము లైనను, మహతీవాచకము

లైనను రూపభేదములను బొందవు. అనఁగా నెద్దానింజెప్పునవి యైనను వీనికిఁ దుల్యరూపములే యగును గాని యర్థభేదముంబట్టి రూపభేదము గలుగదని భావము. సర్వార్థంబులన్=ఎల్లయర్థములందు, తుల్యరూపంబులు=ఒక్కరీతియైనరూపములనే గలిగియుండునవి. సర్వనామముల సిద్ధరూపములఁ బ్రదర్శించు నీక్రిందిపట్టికయందు 'మ' అనునది మహదర్థమున కనఁగా మహద్వాచకమనుటకును, 'అ' అనునది యమహదర్థమున కనఁగా నమహద్వాచకమనుటకును, 'ప్ర' అనునది ప్రథమావిభక్తికిని, 'ద్వి' అనునది ద్వితీయావిభక్తికిని 'తృ' అనునది తృతీయావిభక్తిని 'మహత్యర్థకము' అనునది స్త్రీవాచకమనుటకును గుర్తులని గ్రహించుచు సిద్ధరూపముల గుర్తించికొనవలెను.

సర్వతావదర్థకము=అందఱును లేక అన్నింటిని బోధించునది. ఇది మహత్సాకల్యార్థక మగునేని 'అందఱు - అందోఱు' అనియు నమహత్తులఁ జెప్పునదియేని 'అన్ని' అనియుఁ బ్రథమను రూపముల నందెడి.

ఇయదర్థకము=ఇంతమంది లేక ఇన్ని యనునర్థమును బోధించునది. ఇది మహదర్థక మగునేని 'ఇందఱు' అనియు నమహత్తులఁ జెప్పునదియేని 'ఇన్ని' అనియుఁ బ్రథమయందు రూపముల నందెడి.

కియద్యావదర్థకము=ఎంతమంది లేక యెన్నియను నర్థమును బోధించునది. ఇది మహత్తులఁ జెప్పిన 'ఎందఱు' అనియు నమహత్తులఁ దెల్పిన 'ఎన్ని' అనియుఁ బ్రథమను రూపంబులఁ బొందెడి.

కతిపయార్థకము=కొంతమంది లేక కొన్ని యనునర్థమును జెప్పునది. ఇది మహద్వాచక మగునేని 'కొందఱు' అనియు నమహద్బోధకమగునేని 'కొన్ని' అనియుఁ బ్రథమను రూపంబులఁ బడయును.

బహ్వర్థకము=పెక్కుమందిని లేక పెక్కింటిని బోధించునది. మహద్వాచకమగునపుడు 'పెక్కండ్రు - పెక్కురు' అని దీనికిఁ బ్రథమను రూపము లేర్పడెడి. అమహద్వాచక మగునేని 'పెక్కు' అని రూపమును బొందును. 'అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని' అను నమహద్బోధకములకు వలెఁ గాక దీనికి 'పెక్కులు' అనియు బహువచనముతోడి రూపము గన్పట్టెడి. దీనికి బహువచనముం గలదని 'పెక్కులు' అని యుదాహరించుటంజేసి యన్నిత్యాదిరూపములు నాల్గును నేకవచనము లనియుం వానికి 'అన్నులిత్యాది రూపములు గలుగవనియుఁ బెక్కునకు మాత్రమే 'పెక్కులు' అని వానికంటె విలక్షణముగ బహువచనరూపము గలుగనగుననియు, సూరి యభిప్రాయపడెననుట స్పష్టము. కాని యన్నిత్యాదులు నాల్గును దత్సమము 11 క్రింది వివరణము ననుసరించి యేకత్వ

సంఖ్యను బోధించు ప్రత్యయ మంతమందుఁ గలవు. మఱియు బహుపదార్థబోధకము లగుటంజేసి వాని నేకవచనములుగ నెంచుట విచారదూరము. ఇకారాంతములకు వలెఁ బ్రథమైకవచనము లోపించెనందమన్న బహుపదార్థబోధకమగు వీని కేకత్వమును నేకవచనమును గలుగుననుటకే యుక్తి యగపడకున్నది. కాన నన్నిత్యాదులకు వలెఁ గాక పెక్కునుదానికి బహుత్వబోధకలుఙర్థకము చేరుటయన్విశేషము ప్రయోగదృష్ట మని తెల్పుటయే యుచితమనితోఁచెడి. కాని యాపవిభక్తిక ప్రత్యయములు టి-ంటులు ద్వితీయాద్యేకవచనములందే గలుగునవి యగుటంజేసియుఁ నన్నిత్యాదులతోఁబాటుగఁ బెక్కునుదియు నమహద్వాచక మగునపుడు టి - ంటుల నందఁదగిన దగుటంజేసియు సూరి వీని ననేకవచనములుగ సంభావించి యుండనోపును. ఇంతకంటె నమహద్వాచకము లియ్యవి యాపవిభక్తికాంతములును, మహద్వాచకము లియ్యవి యనాపవిభక్తికాంత ములును నగునని స్పష్టపఱచి వీనిని నిత్యబహువచనములుగనే యెంచుట సరసమని తోఁచెడి. త్రిలింగలక్షణశేషకర్తయు వీని నేకవచనములుగనే తెల్పెను. (చూ. సర్వనా. ప్ర. 52) బహువచనప్రత్యయాభావమున వీనిని వ్యాకర్త లేకవచనములనిరనుట స్పష్టము. మహద్వాచకములైన అన్నిత్యాదులకు నాల్గింటికి ద్వితీయాదివిభక్తులందు బహుత్వమునసైన నాగమలకారమునకె శకటరేఫాదేశమని యనుమానింపఁదగుటంజేసి 'అందఱను-అందఱచేతను, ఇందఱను-ఇందఱచేతను, ఎందఱను-ఎందఱచేతను, కొందఱను-కొందఱచేతను.' అని యత్వవిశిష్టశకటరేఫముతోడి రూపములే గలుగుంగాని 'అందఱి చేత' అనుమున్నగు నిత్వవిష్టములు సిద్ధింపవని గ్రహింపవలసియున్నది. ఔపవిభక్తిక ప్రత్యయములలో ఇకారమును జేరియుండుటంజేసి మహద్వాచకము లగునపు డౌప విభక్తిక ప్రత్యయ మికారము గలుగుననియు దాన నిత్వవిశిష్టశకటరేఫముతోడిరూపము లును సాధువులే యనియుఁ ననవచ్చునుగాని బహువచనములం దౌపవిభక్తిక ప్రత్యయము గలుగుటయు, నిట్లౌపవిభక్తిక ప్రత్యయము మహద్వాచకములగువీనికి సిద్ధించుటయుఁ గ్రమముగ నలాక్షణికమును బ్రాచీనప్రయోగవిరుద్ధమును నగుటంజేసి యట్లన నవకాశము లేదు. కాన నిత్వవిశిష్ట శకటరేఫములుతోడిరూపము లర్వాచీనకవి ప్రయుక్తములైనను నలాక్షణికము లనియు నత్వవిశిష్ట శకటరేఫరూపములు లాక్షణికములనియు నీవ్యా కృతిపద్ధతింబట్టి సమ్మతింపక తీరదు. ఇఁక మిగిలిన పెక్కుపలుశబ్దములలో పలుశబ్ద మున కమహద్వాచకమునకు వేఱుగఁ బ్రయోగములేమియుం బెక్కుశబ్ద మమహత్త్వమున బహువచనాంతమును నగుటయు మహత్త్వమున నీరెండిటికి బహువచనలకారమునకు రేఫ మొకమాఱును బిందుపూర్వకడకార మారేఫమునకు ముందుగలుగుట యొకమాఱును గల్గుట సోదాహరణముగ సూచితము. సామాన్యముగ సర్వనామములు నామములకు బదులుగ వాడఁబడునవగుటంజేసి యొకరీతిగ విశేషణములును నామములకుఁ దరువాత

నున్నవియుఁ గాఁదగినవి యగును. కాన ముందు నామముండినచోటుల నన్ఁగా నామ వాచకమునకుఁ దరువాతఁ బ్రయుక్తములైనవి వ్యస్తముగఁ బ్రయోగింపఁబడినట్లు గణ్యములగును, అట్లు గాక నామమున కవ్యవహితపూర్వముగ సర్వనామ ముండుట సంభవించినచోటులందు సమాసత భాసింపక తప్పదు. ఇందు నామముతోడి వ్యవహితపరత్వమమహత్త్వమునఁ బలుశబ్దమునకు సంభవింపదని యమహత్త్వంబున నను సూరివివరణమున కభిప్రాయము. సంఖ్యావాచకములకు వలె మహత్త్వమునఁ బ్రకృతికిఁ దుదిని బలుశబ్దమునకు గువర్ణముగలుగుట యన్నిత్యాదులకంటె విశేషమైయున్నది. ఇట్లాదేశాదులను నాగమాదులనుజూపుట గ్రంథవిస్తృతికిని దన్మూలముననగు విషయదురవబోధమునకును గతమగుంగానఁ గుదురుపడుగతి నాయావిధులచే నగుకార్యముల ననుమానించికొనునది. అందఱచేత మున్నగువానివలెనే రేఫాదేశమును దానికి ముందగు బిందుపూర్వకడకారమును లడాగమలకారమునకే గల్గునవగుటంజేసి 'పెక్కండ్రను-పెక్కురను, పెక్కండ్రచేత-పెక్కురచేత, పలుగురను-పలుగుండ్రను, పలుగురచేత-పలుగుండ్రచేత' అను మున్నగునత్వవిశిష్టరూపములే బహుత్వమున సిద్ధించునని గ్రహించికొనునది.

తదర్థకము—'అది లేక వాఁడు' అనునర్థ మిచ్చునది. 'ఆ' అనునది తెలుఁగునఁ దదర్థకము. మహత్త్వముననంతట దీనికి 'వ' అనునదియు, నమహత్త్వమున ద్వితీయాద్యేకవచనముల 'ద' అనునదియు బహువచనముల 'వ' అనునదియుఁ బూర్వాగమములగుటను, బ్రథమైకవచన బహువచనముల హ్రస్వమైన అకారమునకుఁ బిదపఁ గ్రమముగ 'డి-వి' అనునవగుటను, (చూ. ప్రౌ. శ. ప.) నాయారూపములు గలిగెడి. మహత్త్వమున నేకత్వమున డుజ్ఞును డువుంతముమీఁది నిగాగమాదులును గల్గుట యరయునది. బహుత్వమున బహువచనలకారమునకు రేఫ మాదేశమగుటయును నది యత్వవిశిష్టరూపమునందుటయు బహువచనముమీఁద మరల బహువచనముగలుగుటయు, నాదేశరేఫమునకుముందు బిందుపూర్వకడకారము సిద్ధించుటయు మొదలగు పూర్వోక్తములగు కార్యముల యథాసంభవముగ గమనించుచు సిద్ధరూపముల ననుమానించికొనవలెను. అట్లే మహత్త్వమునఁ దృతీయాదిబహువచనముల నాగమలకారమునకైన రేఫ మిత్వవిశిష్టరూపమునందుటయు, (ఇరువురనిత్యాదులందుఁదప్ప. చూ. ప్రౌ. శబ్దప. 90) రేఫమునకుఁ బూర్వమున బిందువు ముందిడికొన్న డకారమగుట నాదేశరేఫముమీఁద నాగమముగ లకారము మరల నగుటయుఁ బర్యాయముగ గ్రహించుచు వారిచేత-వాండ్రచేత-వారలచేత మున్నగురూపముల సిద్ధిని గమనించునది. అమహత్త్వమునఁ బ్రథమనేకవచనబహువచనముల దివులంతాగమము లగుటయు ద్వితీయాద్యేకవచనబహువచనములఁ గ్రమముగ 'ద వ' అనునవాద్యవయవము లగుటయు గమనించుచు రూపముల

సిద్ధి నరసికొనవలెను. అమహత్త్వమునను 'దా-వా' అనువానిపై విభక్తులకుముందు నిగాగమము నిత్యముగ నగుటను గమనించునది. సిద్ధరూపముల ననుసరించియే యీప్రక్రియ సుబోధకమై చూపఁబడెనుగాని తదర్థకరూపము సహజముగఁ దెలుఁగున 'ఆ' అనునదియే యగుటంజేసి దానికిఁ బ్రథమనంతాగమములగు 'ది-వి' అనునవే, ద్వితీయాద్యేకవచన బహువచనముల నాద్యవయవములుగ నైనవనియుఁ బ్రథమైకవచనబహువచనముల నంతాగమములుగఁ గల్గిన దివులకుఁ బ్రథమను ద్విత్వమును, ద్విత్వము సిద్ధించినపిదపఁ దదర్థకమునకు హ్రస్వమును, గలిగెననియు శాబ్దికసరణిని గ్రహింపఁదగు. అమహత్త్వమునఁ బ్రథమైకవచనబహువచనముల నేర్పడెడు 'ఆయది-అయ్యది. ఆయవి-అయ్యవి' అనురూపములు తదర్థకాకారముపైఁ దదర్థకములగు నమహద్రూపములను అది అవి అనువానిని నిల్పి యడాగమ త్రికద్విత్వహ్రస్వవిధులంగూర్ప నేర్పడినవిగాని శుద్ధతదర్థకములు గావని గ్రహింపవలెను. ఇట్లే ద్వితీయాద్యేకవచనములం దమహత్త్వమున నగు 'ఆదానిని - అద్దానిని-ఆదానిచేత-అద్దానిచేత' అను మొదలగునవి త్రికము మీఁది హల్లునకు ద్విత్వమును త్రికంబునకు హ్రస్వమును గలుగుటచే నేర్పడినవిగాని శుద్ధతదర్థకములు గావని యెఱుంగునది.

ఇదమర్థకము=ఇది లేక వీఁడను నర్థమును బోధించునది. తెలుఁగున 'ఈ' అనునది యిదమర్థకము.

కిమర్థకము=ఏది లేక యెవఁడను నర్థమును జెప్పునది. 'ఏ' అనునది తెలుఁగునఁ గిమర్థకము. ఇదమర్థకమగు నీయనుదానికి మహత్త్వమున నేకత్వబహుత్వములందు వకార మాద్యవయవముగ నిత్యమై యగుట సర్వవిభక్తులందును సామాన్యము. ప్రథమైకవచనమున డుజ్ఞును బహువచనమున లువర్ణకమునకు రేఫాదేశమును బిందుపూర్వకడకారము దానికిముం దాగమముగ నగుటను మొదలగువానిని దదర్థకమునకు వలెనే గూర్చుచు సిద్ధరూపముల నూహించికొనునది. ద్వితీయాద్యేకవచనములందును బహువచనములందును నిగాగమ రేఫాదేశాదులను దదర్థకమునకు వలెనే గూర్చుచు రూపముల నెఱుంగవలయును. అమహత్త్వమునఁ దదర్థకమునకువలెనే దివులు చేరిన ప్రకృతికి హ్రస్వము గలుగుట గమనించునది. మఱియు హ్రస్వద్విత్వములు గలిగిన 'అద్ది-అవ్వి యనునవియుఁ దదర్థకమునకు వలెనే యగుటను స్మరించునది. ఆయవి - అయ్యవి మొదలగు తదర్థకరూపములవలెనే 'ఈ+అది-ఈ+అవి' అను నిదమర్థకమగు నీకారముమీఁది 'అది-అవి' అను వానికి యడాగమద్విత్వహ్రస్వములను ద్రికశాస్త్రములచే (సమా 14-15) సంపాదించుచు సిద్ధరూపముల గమనించికొనునది. ఇట్లే యిదమర్థకమగునీకారముమీఁద ననుప్రయుక్తములై త్రికద్విత్వహ్రస్వములనందినట్టివియు నందని

యట్టివియు నగు రూపములుగ 'ఇద్దానిని-ఇద్దానిచేత-ఈదానిని ఈదానిచేత' అను మొదలగురూపములను సంభావింపఁదగు. బహుత్వమున ద్వితీయాదులం దిదమర్థకమగు నీకారమునకు వకారము పూర్వాగమమగుట నిగాగమమగుట స్మరించికొనుచు వీనిని-వీనిచేత మొదలగురూపముల ప్రక్రియం గమనించునది. 'ఇది-ఇద్ది, ఇని-ఇవ్వి' అనునవియుం వీనిని వీనిచేత మొదలగు ద్వితీయాదిబహువచనరూపములును దప్ప నన్యము లెల్ల నిదమర్థకమగు నీకారముపైఁ దదర్థకరూపములఁ జేర్చుటచేతనే సిద్ధించినవి యనుట స్పష్టము. ఇది యిదమర్థకరూప మనిపింప నాదినైన యీకారముచేర్పే సమర్థమయ్యెననుట తెల్లము.

యత్కిమర్థకము=ఏది ఎవఁడనునర్థమును బోధించునది. తెలుఁగున 'ఏ' అనునది యత్కిమర్థకము. యత్కింశబ్దములకు రెండింటికిని 'ఏ' అనునది యొకటే తెలుఁగునఁ బ్రకృతియని గ్రహింపవలెను. 'ఏ' అనుదానిపైఁ దదర్థకమహాదమహద్రూపములఁ జేర్చుటచేత సాధారణముగ రూపములు గల్గుటను గమనింపవలెను. త్రికశాస్త్రములచే హ్రస్వద్విత్వాదులు గల్గుట తదిదమర్థకములకు వలెనే యని యెఱుంగవలయును. 'ఎవఁడు-ఎవ్వఁడు, ఎవరు-ఎవ్వరు, ఎవ్వండ్రు-ఎవండ్రు, ఎవరిని-ఎవ్వరిని, ఎవండ్రను-ఎవ్వండ్రను' అను మొదలగు మహద్వాచకైకవచనబహువచనరూపములందును, 'దేనిని-వేనిని, దేనిచేత-వేనిచేత' అను మున్నగు నమహదేకవచనబహువచనరూపములందును గ్రమముగఁ దదర్థకమునకు హ్రస్వమును, 'ద-వ' అనునవి యాద్యవయవములుగ నగుటయును విశేషములు. తదిదమర్థకములకును, యత్కిమర్థకమునకును, నమహత్త్వమునఁ దృతీయాసప్తమ్యేకవచనములందుఁ గ్రమముగ 'దాన-దీన-దేన' అనురూపములును, బహుత్వమున వాన-వీన-వేన' అనురూపములును గల్గునని సూరి నిరూపింపమింజేసి త్రిలింగలక్షణశేషకర్త వానిని (శబ్దపరి. 62 చే) నిషలించి సప్రయోగముగఁ జూపించెను. కాని నన్నయాది ప్రాచీనకావ్యములలం దట్టిరూపములు గనరామింజేసియు, నందును 'దేనన్ - వేనన్' అనువానికిఁ బ్రయోగములు మృగ్యములని త్రిలింగలక్షణశేషకర్తయే కంఠోక్తముగఁ జెప్పుచుండుటంజేసియుఁ బ్రాచీనప్రయోగసాధనమాత్రప్రవణుండగు సూరి వానిని నిరూపింపఁడయ్యెననుట యుచితము. ప్రాచీనవాఙ్మయప్రపంచము సూరిదృష్టికి సంబంధించినది. ప్రాచీనార్వాచీన వాఙ్మయప్రపంచము త్రిలింగలక్షణశేషకర్తృదృష్టిలో నున్నది. కాన నిట్టిభేద మీరెండువ్యాకరణములందును సర్వసాధారణముగఁ గన్పట్టక మానదు. స్త్రీని జెప్పునదియేని యత్కిమర్థకమగు నేయనుప్రకృతినుండి యేకత్వమున మూలమునఁ బట్టికలోఁ జూపినరీతి నిరువదిరెండురూపము లేర్పడును. 'ఏ' అనుదానిమీఁది 'వాకారమునకు స్వార్థక

మగు తవర్ణము స్వార్థమునఁ గ ప్రత్యయమును జేరఁగా నీరూపము లిరువది రెండును నుచ్చారణమూలకమైన మార్పు ననుసరించి యేర్పడినవనుట స్పష్టము. పూజ్యత వివక్షితమగునపుడు మహత్వమున నేకత్వమునఁ దదర్థకమునకు 'అతఁడు - ఆతఁడు. అతని-ఆతని. అతనిచేత-ఆతనిచేత' అను మొదలగురూపములును నిదమర్థకమునకు 'ఇతఁడు-ఈతఁడు. ఇతని-ఈతని. ఇతనిచేత-ఈతనిచేత' అను మొదలగు రూపములును, యత్కిమర్థకమునకు 'ఎతఁడు-ఏతఁడు. ఎతనిని-ఏతనిని. ఎతనిచేత - ఏతనిచేత' అనుమున్నగురూపములును గలుగును. ఇట్లే స్త్రీవాచకములై పూజ్యార్థకములైన తదిదమ్ యత్కిమర్థకములలోఁ దదర్థకమున నేకత్వమున 'ఆమె - ఆపె-ఆకె' 'ఆమెను-ఆపెను-ఆకెను. ఆమెచేత - ఆపెచేత-ఆకెచేత' అనుమున్నగునవియు నిదమర్థకమునకు 'ఈమె-ఈపె-ఈకె. ఈమెను-ఈపెను-ఈకెను' అను మొదలగునవియు, యత్కిమర్థకమునకు 'ఏమె-ఏపె-ఏకె. ఏమెను-ఏపెను-ఏకెను' అనుమున్నగురూపములును గలుగునని భావము. ఈరూపములెల్ల తదిదమ్ యత్కిమర్థకములగు 'ఆ - ఈ - ఏ' అనువానిపై స్త్ర్యర్థకములగు 'అక - అప - అమ' అనునవి చేరఁగా నెత్వముతుదిం గలిగి యేర్పడిన రూపములనుట స్పష్టము. పైసర్వనామముల సిద్ధరూపములను గమనించినచోఁ దదర్థకరూపములే స్వతంత్రములుగ నేర్పడినవనియుఁ, దక్కుంగలవానిరూపములు తదర్థకరూపసమ్మేళనమునం జేసియుం, స్త్ర్యర్థకశబ్దసంధానమునం జేసియు గలుగుటంజేసి కృత్రిమములనియుం, దీన 'ఈ-ఏ' అనువానికి స్వతంత్రరూపములు భాషలో సాధారణముగ లేవనియుఁ జెప్పుట యనుచితము గాఁజాలదు. ఇట్లు వీనిప్రక్రియ సాధారణముగ రెండుశబ్దములఁ గూర్పునంజేసి గలిగినదగుటచు, దక్కినవానిప్రక్రియయుం నొకకట్టుఁబాటునకు లొంగనిదగుటను, గొంతవఱకు కాథర్వణమును జింతామణివ్యాఖ్యాతలును బ్రక్రియను దెల్పుచున్ననునది సమగ్రముగాని దనఁదగుటను, సూరి సర్వనామరూపములఁ బ్రక్రియాప్రదర్శనముఖమున సాధింపక నిపతించి సిద్ధరూపములఁ జూపెనని గ్రహించునది. త్రిలింగలక్షణశేషకర్త చింతామణివ్యాఖ్యాతల ననుసరించి యెట్లో ప్రక్రియాప్రదర్శనపూర్వకముగ శబ్దపరిచ్ఛేదమునందలి సర్వనామప్రకరణమున సర్వనామరూపములఁ జాలవఱకు సాధించి త్రిలింగలక్షణశేషకర్తృత్వమును సార్థకము సేసికొన్నవాఁడు. సిద్ధరూపజిజ్ఞాసువులకు బాలవ్యాకరణమార్గము రమణీయము. సర్వనామవ్యుత్పత్తితత్వవిచారణమొనర్చు భాషాతత్వశాస్త్రవిమర్శకులకుఁ గొంతగఁ బ్రౌఢవ్యాకరణపుఁద్రోవ హృదయంగమమని మాత్ర మనకతీరదు. కాన సర్వనామరూపనిష్పత్తివ్యుత్పత్తిప్రకారము లరయఁగోరువారు ప్రౌఢవ్యాకరణమునందలి సర్వనామప్రకరణమును బరికింతురు గాక.

యుష్మదర్థకము=తెలుఁగునీయనునది యుష్మదర్థకము. ప్రథమైకవచనమున వువర్ణమగును. బహువచనమున మకారము పూర్వాగమముగనగును. ప్రథమైకవచనమున 'నీ' అనుదానియందలి నకారమును, బహువచనమున 'మీ' అనుదానియందలి మకారమును వికల్పముగ లోపించును. బహువచన లకారమునకు రేఫ మాదేశమగుటయు నా రేఫముమీఁద మరల లువర్ణకము గలుగ నది యదంతరేఫ మగుటయుం గమనించునది. (మీరలు) ద్వితీయ నేకవచన బహువచనములందుఁ గ్రమముగ 'న్ను-మ్ము' అనునవి నువర్ణకమునకు ముందగుటయు, నా ద్విత్వవర్ణములు పరములుగాఁ బ్రకృతులకు (నీ-మీ) హ్రస్వము గలుఁగుటయు గమనించుచు, ''నిన్నును-మిమ్మును'' అనురూపముల నిష్పత్తి నూహించికొనునది. తృతీయాదులం దేకత్వబహుత్వముల 'నీ-మీ' అనువానిమీఁదనే విభక్తిప్రత్యయములు గలిగెడిఁగాన 'నీచేత-మీచేత' మొదలగు రూపము లేర్పడును.

అస్మదర్థకము='నా' అనునది యస్మదర్థకము. ప్రథమైకవచనమునకు నువర్ణమును బహువచనమునకు మువర్ణమును 'నా' అనుదానియందలి యాకారమున కేత్వమును గలుగును. (నేను-నేము) మఱియుఁ బ్రథమాబహువచనమున 'నే' అనుదానియందలి నకారమాత్రమునకు మకారము వికల్పముగ నాదేశమగును. (మేము) యుష్మదర్థకమందలి నకారమకారములవలెనే ప్రథమను నిందును నమలు వికల్పముగ లోపించును. (ఏను-ఏము) ద్వితీయను సద్విత్వరూపములు యుష్మదర్థమునకువలెనే గలుగుటను గమనించునది. (నన్నును-మమ్మును) తృతీయాదులం దేకవచనబహువచనముల 'నా మా' అనువానిమీఁదనే విభక్తిప్రత్యయములు గలిగి 'నాచేత-మాచేత' నను మొదలగురూపములు సిద్ధించెడి.

ఉభయార్థకము='మన' అనునది తెలుఁగున నుభయార్థకము. ఎదుటనున్న వానిని దన్నును గూడ బోధించునదిగాన నిది యుభయార్థకమును నిత్యబహువచనాంతమును నయ్యెనని యెఱుంగునది. ప్రథమాబహువచనమునకు మువర్ణమును ద్వితీయాది బహువచనముల లడాగమమును గల్గుట నరయుచు 'మనము-మనలను-మనలచేత-మనచేత' నను మున్నగురూపముల ననుమానించికొనునది. తృతీయాదులందు దీనికి లడాగమము పాక్షికమని యెంచునది. చింతామణి 'తస్యాజసోము - శసోలః' అని మనశబ్ద ద్వితీయాబహువచనమునకు మాత్రమే లకారమును విధించుటంబట్టి మనలచేత మొదలగువానియందలి లకారమును, మిమ్ములను-మమ్ములను-తమ్ములను మొదలగు సభ్యవ్యవహార పదములందలిలకారమును, బ్రాచీనలక్షణసమ్మతము గానిదని సమ్మతింపక తీరదు.

ఆత్మార్థకము='తా' అనునది తెలుఁగున నాత్మార్థకము. ప్రథమైకవచనమున నువర్ణమును బహువచనమున మురువర్ణములు పర్యాయముగను నగుటను గమనించునది.

బహువచనమునఁ దమ యని తాశబ్దము పక్షమున మార్పునందుటను గూడ నరయునది. (తాను-తారు-తాము-తమరు) ద్వితీయైకవచన బహువచనములందు యుష్మదస్మదర్థకములకు వలెనే సద్విత్వరూపము లేర్పడుటను నరయునది. తృతీయాద్యేకవచనబహువచనములందుఁ దాశబ్దము క్రమముగఁ దనతమరూపములుగ మాఱుటను గమనించుచు సిద్ధరూపముల నూహింపవలెను. నీమొదలగు నాలుగుశబ్దములును సర్వార్థములం దుల్యరూపంబు లయియుండు ననుటంజేసి యుష్మదస్మదుభయార్థకములకు నాల్గిటికి మహన్మహత్యమహత్వముల రూపభేదము లేర్పడవనియుఁ గావుననే యమహత్వమున మహతీత్వమున యత్కి-మర్థకాదులకువలె రూపభేదములు గలుగుటను జూపలేదనియు నెఱుంగునది. మహతీవాచకము లైనపు డాయావాని కేకవచనములందే రూపభేదములు గలుగుటఁ జూపఁబడుటంజేసి వానివానికి బహుత్వమున నెట్టిరూపములు గలిగెడి ననుశంక యింతకుఁ గలుగనగును. 26 సూత్రముచే మహద్వాచకసర్వనామముల బహువచనరూపములే మహతీవాచకబహువచనరూపములు గాఁదగుటను జెప్పియుండుటంజేసి యట్టిశంక కవకాశమే గలుగదని గ్రహించునది. ఇఁకమీఁద లెక్కను జెప్పునట్టి యాయాశబ్దములకు మహదమహన్మహతీత్వముల నేర్పడురూపభేదములు నిపతితములై చూపఁబడును.

ఏకార్థకము='ఒక' అనునది యేకార్థకము. మహత్వమున డుజ్జు మొదలగునవి యేకవచనమందును రేఫాదేశ బిందుపూర్వక డకారాలఘుళకారాదేశాదులు బహుత్వమునందును, ద్విత్వోత్వవర్ణవ్యత్యయాదు లేకత్వబహుత్వములందును నగుటను బ్రథమయందు యథాసంభవముగ గమనించికొనునది. ఇందు వర్ణములమార్పొకరీతిఁ గామిఁ బట్టిక ననుసరించి సిద్ధరూపముల గమనించుటయే యుచితము. ద్వితీయాదులం దేకవచనబహువచనములఁ గ్రమముగ నిగాగమము మీఁదను, లడాగమాదంతలకారము మీఁదను, నాయావిభక్తిప్రత్యయముల నిల్పుచు యథాసంభవముగ సిద్ధరూపముల గమనింపవలెను. ఇందుఁ గొన్ని ప్రయోగదృష్టములుగఁ దోఁపమిని, బ్రకృత మర్థవంతములుగఁ దోఁపమిని ననుభవదూరము లైనవీనిని లక్షణము ననుసరించి యిట్లుండునని గ్రహించుటయే యుచితము. కావుననే సూరియు ద్వితీయాదివిభక్తులందు రూపంబులూహించికొనునది యని నిపుణముగ వ్రాయుచు, నితరవిభక్తులందుఁ గొన్నింట సందేహమునందుట కవకాశ మగపడుచున్నను గొంతపఱకైనఁ దేటపఱుపక విడిచినాఁడనుట సాహసము గాఁజాలదు.

అమహదర్థక ప్రథమైకవచనాంతములు:— రెండు మొదలగు సంఖ్యావాచకములె యమహదర్థము లేకవచనాంతములు గునని మొదట నిర్వచించుటంజేసి

యాశబ్దమునకు సంఖ్యావాచకమునకు బహువచనము లేదనియు మహతి వాచ్యంబగునపు డేకత్వంబున వక్ష్యమాణరూపంబు లెఱుంగునది యనియు వివరణమును వ్రాయుటయు, నేకవచనాంతములనే యుదాహరించుటయు జరిగెనని గ్రహించునది. మహతి= స్త్రీ = ఆఁడుది. వాచ్యము = చెప్పఁబడునది. శబ్దముచే నాఁడుది చెప్పఁబడినపుడనుట. వక్ష్యమాణ=చెప్పఁబోవు. ఇంకమీఁదఁ బట్టికలో నిరూపించెదు.

రెండుమొదలగు సంఖ్యావాచకరూపములలో మహద్వాచకరూపములు బహువచనాంతము లనియు నమహద్రూపము లేకవచనాంతములనియు ద్విప్రభృతిసంఖ్యావాచకములను నీప్రకరణము మొదటఁజేసినవివరణమునుబట్టి గ్రహించునది. ఇందు 'ఇద్దఱు' మున్నగురూపములవరుసను మహద్వాచకబహువచనరూపములనియు రెండు మొదలగువానివరుసను నమహదేకవచనరూపములనియు గ్రహించునది. త్రిప్రభృతి మహత్సంఖ్యావాచకముల కంతాగమముగ విభక్తిప్రత్యయమునకుముందు గువర్ణము సాధారణముగ నగుటను గమనించునది. మహదర్థక ద్విప్రభృతిసంఖ్యావాచకబహువచనరూపములు ప్రథమాంతములు, ద్వితీయాదిబహువచనములం దదంతములై యాయావిభక్తిప్రత్యయముల నంది ఇద్దఱచేత-తొమ్మండ్రను-మొదలగు రూపములుగ మాఱుటయు, నమహదేకవచనాంతములు టింటు లంతమందుఁ జెందినవై ద్వితీయాది విభక్తులందుఁ దత్తదేకవచనప్రత్యయముల నంది రెంటిచేత - రెండిటిచేత-రెండిటిని-రెంటిని మొదలగురూపములఁ బడయుటయును గుర్తించికొనునది. ఔపవిభక్తిక ప్రత్యయములు 29 చే ద్వితీయాదివిభక్తులయేకవచనములందే గలుగునవగుటం జేసియు, ద్విప్రభృతిసంఖ్యావాచకామహద్రూపములు టింటుల నందఁదగినవగుటం జేసియు ద్విప్రభృతిసంఖ్యావాచకామహద్రూపము లేకవచనాంతము లనవలసివచ్చెనని ముందె వ్రాయఁబడినది. ఈయర్థమునె సూరి 'రెండుమొదలగునవి' అనువివరణముచే నెఱిఁగించెనని గ్రహించునది. 'రెండు+ను=రెండు+టి+ను=రెండు+టి-ని=రెండిటిని.' అని రూపము రెండుశబ్దమున కౌపవిభక్తికమునకు సిద్ధించును. శబ్దము నుత్వ మిత్వరూపమునందుట 36-37 సూత్రములచే నయ్యెడి. నువర్ణకము నివర్ణకమగుట తత్సమము 26 చే నని యెఱుంగునది. రెంటినిమూటినిత్యాదులు 31 చే శబ్దముతుదివ్రాయికాదేశమై టింటులు గలుగుటచే నేర్పడినవని గ్రహించునది. ఇట్లే యౌపవిభక్తికాంతములగు నితరసంఖ్యావాచకములరూపముల ప్రక్రియను గమనింపవలెను. ఏకశబ్దార్థకమైన తెలుఁగునందలిఒకశబ్దమున నేకాకిత్వమను నర్థవిశేషమున నొంటి యనియు, మహదనిర్దిష్టార్థమున నొకానొకఁడనియు, నమహదనిర్దిష్టార్థమున నొకానొకటి యనియు, మహత్యనిర్దిష్టార్థమున నొకానొకతె యనియు, నన్యార్థమున నొరిమ యనియు,

నొకరితరువాత నొకరు లేక పరస్పరమను నర్థమున నొండొకరనియు, నేకత్వమున నొర్టట్ట యనియుం రూపాంతరము లేర్పడెడి. ద్విశబ్దార్థంబున కనఁగా రెండనుదానికి రెండురెట్లనునర్థమున నినుమడి యనియుం రెండాఱు లనునర్థమున నీరాఱనియుం రూపములు గలిగెడి. 'ఒకాణ్' అన నదిపూర్వాగమమగుటంగూర్చి ప్రౌఢవ్యాకృతిశబ్దపరిచ్ఛేదమునందలి 85 సూత్రము నరయునది. సర్వనామరూపముల ప్రక్రియను దెలియఁగోరువా రాథర్వణమున నజంతపరిచ్ఛేదమునందలి తుదిభాగమును; చింతామణ్యాజంతపరిచ్ఛేదాంతిమభాగపు నహోబలునివ్యాఖ్యయును, ప్రౌఢవ్యాకరణశబ్దపరిచ్ఛేదాంతర్గతమగు సర్వనామప్రకరణము నరయునది. ఒరిమకుమాత్రము విశేషార్థము ప్రయోగప్రమాణాదృష్టము. అర్థవిశేషములం జూపట్టెడు నేకశబ్దరూపములలో మహద్వాచకములకు నిగాగమాదులను దక్కుంగలవానికి యథార్థ్యముగను నితరవిభక్తులం దేకత్వముననె రూపముల నూహించికొనునది. వృత్తియందు హల్లు పరమగునపుడు రెండుశబ్దమునకు 'ఇను-ఇరు' అనియుం, నచ్చు పరమగునపుడు 'ఈరు' అనియు నాదేశము లగుంగాన 'ఇరు - ఇను - ఈరు' అనువానికి వ్యస్తముగఁ బ్రయోగము లేదని గ్రహించునది. మఱియుఁ దెలుఁగున సామాన్యముగ విశేషణము లవిభక్తికములుగాన వీనికితరవిభక్తివచనముల రూపములు గలుగవని యెన్నునది. సంస్కృతానుశాసనానుకరణమున సర్వనామసంజ్ఞకృతము. సంఖ్యావాచకములు సర్వనామములలోఁ జేరఁజాలనివేగాని సామాన్యపుఁజెల్లుబడింబట్టి చేర్పఁబడినవని గ్రహింపఁదగు. సంస్కృతానుశాసనమున సర్వశబ్దమువలెనే యిందుఁ దత్పర్యాయమగు 'అన్ని' అనుశబ్దమాదియందుండుటచేఁగూడ సర్వనామసంజ్ఞ సార్థకమగునని గ్రహింపఁదగు.

## సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమంబగు. ౨౫.

రెండవవాఁడు - రెండవది - మూఁడవవాఁడు - మూఁడవది.

టీ. పూరణమనఁ బూర్తిచేయుట. సంఖ్యకన సంఖ్యావాచకమునకు. సంఖ్యావాచకశబ్దమునకుఁ బూర్తిచేయుట యనునర్థమున 'అవక్' అనునాగమము గలుగును. కర్తృబహుత్వమునఁ గ్రమము ననుసరించి యందొకకర్తను లేక కొన్నింటిని బ్రధానముగ సంఖ్యావాచకముచే బోధింపవలసివచ్చినపు డాసంఖ్యావాచకముచే బోధ్యమగునది ద్విత్వాదిసంఖ్యలను బూర్తిచేయున దయ్యెడిఁగాన నట్టిసంఖ్యావాచకమున కవగాగమమగును. 'రామలక్ష్మణభరతశత్రుఘ్నులలో రెండవవాఁ డింద్రజితుని సంహరించెను' ఈవాక్యమున రామాదులు నల్వురును కర్తలె. అందు లక్ష్మణుని బ్రధానముగ సంఖ్యావాచకముచే బోధింపవలసివచ్చెను. లక్ష్మణుఁడు ద్విత్వసంఖ్యను బూర్తిచేయువాఁడు.

కాన నాతఁడు పూరణార్థంబును వానిని జెప్పుసంఖ్యావాచకము 'రెండనునది పూరణా ర్థకమును నగుటంజేసి యవగాగమంబు నందెడి. ఇట్లే పైవాక్యము ననుసరించి మూఁడవ వాఁడు భరతుఁడు చిత్రకూటమున రాముని దర్శించె ననువాక్యమున భరతుఁడు త్రిత్వ సంఖ్యను బూరించువాఁ డగుటంజేసి తద్వాచకమగు మూఁడుశబ్ద మవగాగమాంత మయ్యెడినని గ్రహించునది. 'ఈవృక్షపంక్తిలో నైదవది చూతమై యున్నది.' అనువాక్య మున వృక్షపంక్తి యంతయుఁ గర్తృత్వము నందుచున్నను బ్రధానముగఁ జూతము సంఖ్యావాచకముచేఁ జెప్పవలసివచ్చుటను, నది యాపంక్తియందుఁ బంచత్వసంఖ్యను బూర్తిచేయునదగుటను దద్వాచకమగు నైదను సంఖ్యావాచక మవగాగమాంతంబయ్యె నని యెఱుంగునది. 'రాముఁడును సోముఁడును గాముఁడును వనములోఁ దిరుగుచుండ మూఁడవవానితో రెండవవాఁడు గూడి రాముని బాధించెను.' ఈవాక్యమున రామ సోమగాములు ముగురును గర్తలయ్యుఁ గామసోములు తృతీయద్వితీయులు త్రిత్వ ద్విత్వసంఖ్యలం బూర్తిచేయువా రగుటంజేసి తద్బోధకములగు 'మూఁడు; రెండు' అను సంఖ్యావాచకముల కవగాగమంబు సిద్ధించెను. ఇట్లే 'ఈగ్రంథమున నాల్గవభాగము రమణీయము.' అనువాక్యమున నాలవభాగమునుండి నాలవసంఖ్యను బూరించు నాల్గు సంఖ్య యవగాగమయోగ్యంబగుటను గమనించునది. పూరణప్రత్యయాంతమైన సంఖ్యా వాచకమొకదానికి విశేషణమగుట సహజముగానఁ దద్వాచ్యమగుమహత్వామహత్వ ముల ననుసరించి యద్దానికి 'వాఁడు; అది' అనునవి తుదినితగిలియే యుండును. రెండు+ అవ=రెండవ, మూఁడు+అవ=మూఁడవ' ఉత్వసంధికేని యపదాదిస్వరసంధికేని ప్రవృ త్తిని గల్పించునది. ఇట్లే యితరసంఖ్యావాచకములమీఁదను నవగాగమంబగునపుడు రూప ములం దెలిసికొనునది. 'అవక్' ఇది కకారము లోపించెడి ప్రత్యయముగానఁ బ్రకృ తికిఁ దుదియవయవముగ నగుటను స్మరించునది. ఆచ్ఛికపరిచ్ఛేదమునందలిదిగాన నివ్విధి తెలుఁగుసంఖ్యావాచకములకు సంబంధించినదని గుర్తించునది. మఱియు నేకద్విత్రీ త్యాదులకుఁ దెలుఁగున వ్యస్తముగఁ బ్రయోగము లేమింజేసియు వానికిఁ బూరణ ప్రత్యయాంతరూపము లాద్యభాషయందుఁ బ్రసిద్ధము లైయుండుటంజేసియు వానిపై నవగాగమము గలుగదని గ్రహించునది. వలసిన 'ద్వితీయుఁడు-ద్వితీయ-ద్వితీయము. తృతీయుఁడు - తృతీయ - తృతీయము.' అనుమున్నగురూపము లవగాగమాంతములైన 'రెండవవాఁడు-రెండవది. మూఁడవవాఁడు - మూఁడవది' అనుమున్నగువానిస్థానమునఁ బ్రయోగింపఁదగును. పైద్వితీయాది సాంస్కృతికరూపములు పూరణప్రత్యయాంతము లగుటంజేసి మఱల నయ్యవి పూరణప్రత్యయావగాగమాంతంబులు తెలుఁగున గాఁజాల వని తెలియఁదగును. నిపుణముగఁ బరికింప నగుధాతువే చేర్పఁబడి గకారము వకార

మగునెడల నుత్వ మత్వంబై యవరూప మేర్పడెనని తోఁచెడి. నన్నయాదిప్రాచీన కావ్యముల నగురూపములే యగపడెడి. 'సమాసేఽవస్తు సర్వదా' అని యాథర్వణ మవయనుచున్నది. 'పదార్వన్నెపసిండి మేడలకు-పదార్వన్ని యపట్టుపుట్టము' అనునవగాగమముగాని ప్రయోగములు క్వాచిత్కములు. ఇట్టియెడల నవకగురూపమే గాననగునను త్రిలింగలక్షణోదాహృతు లిందులకుఁ బ్రమాణములు గానోపును. దీన మహాద మహన్మహతీవాచకాంధ్రసంఖ్యావాచకము మహద్రూపమునందక యీసందర్భమున 'నవ' లేక, 'యగు' అనువాని నంది విశేషణమై వాఁడుక నందుననుట తెల్లము.

## సర్వనామ క్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుంబోలె మహతికగు. ౨౬.

వారిద్దఱు రుక్మిణీసత్యభామలు - వీరుముగ్వురు శ్రీభూనీళలు.

టీ. మహద్వాచకములైన సర్వనామములయు క్రియాపదములయు బహువచనరూపములె స్త్రీవాచకమునకును బహువచన రూపము లగునని సూత్రార్థము. తత్సమము 17 విధి ననుసరించి స్త్రీలమహత్తులుగాఁదగుటచే 'అవి రుక్మిణీ సత్యభామలు రెండు వెళ్లుచున్నవి' అని రుక్మిణీసత్యభామలను బోధించెదు. 'అవి-రెండు' అను సర్వనామములును వెళ్లుచున్నవను క్రియయు నమహద్రూపములనే యందవలసి రాఁగాఁ దద్వారణార్థము మహద్వాచకసర్వనామముల బహువచనరూపములే మహతీవాచకబహువచనరూపము లగునని శాసింపవలసివచ్చెనని యెఱుంగవలయును. దీనిచే నవిరెండను సర్వనామములకు మహద్బహువచనరూపములై 'వారు-ఇద్దఱు-ఇర్వురు-ఇరువురు' అనురూపములే మహతికిని బహువచనరూపము లగుననియు 'వెళ్లుచున్నారు' అను మహత్కర్తృకబహువచనరూపమే మహతికిని నగుననియుఁ దెలియనయ్యెఁగాన 'రుక్మిణీసత్యభామ లిద్దఱును వెళ్లుచున్నారు' అనియే యుండవలెనని స్పష్టమయ్యెడి. మహతీవాచక సర్వనామములకును గ్రియలకును నేకత్వముననె గాని బహుత్వమున స్వతంత్రరూపములు లేవనియు మహత్సర్వనామబహువచనరూపములను మహత్కర్తృకక్రియలబహువచనరూపములను స్త్రీవాచకములకు బహుత్వమున బహువచనరూపములుగ నంగీకరింపవలెననియుఁ దాత్పర్యము. బహువచనంబను సామాన్యోక్తింజేసి సర్వనామముల సర్వవిభక్తులందలి బహువచనరూపములును గ్రియల మూఁడుపురుషములందలి బహువచనరూపములును నాయావిభక్తులందును బురుషములందును స్త్రీవాచకములకుఁ దగునని తెలియవలయు. ఏకత్వముననే మహతీవాచకసర్వనామక్రియలకమహద్రూపము గాని బహుత్వమున మహద్రూపమే యగునని ఫలితము.

దీనిచేఁ సర్వనామప్రకరణమున 'అ' అనుగుర్తుక్రింద నుదాహరింపఁబడిన నమహద్వచనరూపములును వానికితరవిభక్తులం జేర్పఁడు రూపములును నేకవచనాంతములుగ శాసింపఁబడిన ద్విప్రభృతిసంఖ్యావాచకామహదర్థకరూపములును, మహతీతరములగు నమహత్తుల కయ్యెడివే గాని మహతీవాచకములకుఁ గావని భావము తేలినది. తత్సమము 87 విధి ననుసరించి సంస్కృతహలంతసర్వనామములకుఁ దెలుఁగునఁ బ్రవేశము లేమిం జేసి యివ్విధి తెలుఁగుసర్వనామములకనుట స్పష్టము. ఏకద్విత్రీత్యాదులైన సంస్కృతసంఖ్యావాచకసర్వనామములకు స్వతంత్రప్రవేశను లేకుండుట ముందె నిరూపితము. క్రియారూపవిషయము సంస్కృతసమాసమసాధారణము. 'వారిద్దఱు రుక్మిణీసత్యభామలు. వీరుముప్వురు శ్రీభూనీళలు.' అను నుదాహరణములందు 'వారు-ఇద్దఱు. వీరు-ముప్వురు.' అనుతదిదమర్థకసర్వనామములయు 'ఇద్దఱు-ముప్వురు.' అను సంఖ్యావాచకసర్వనామములయు మహద్రూపములు మహతీల కగుటను గమనించునది. ఇచ్చో 'అవిరెండు రుక్మిణీసత్యభామలు; ఇవి మూఁడు శ్రీభూనీళలు' అను ననిష్టరూపములు గలుగవని ముఖ్యముగ గ్రహింపవలెను. క్రియాపదంబున కుదాహృతి స్పష్టమగుట నుదాహృతము గాలేదు.

అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు. ౨౭.

పలుగురు-పలువురు - ఇరుగురు - ఇరువురు - వేగురు - వేవురు. తోఁగ - తోఁవ - పగలు - పవలు.

టీ. పదాదిని లేనట్టియు మఱియొకహల్లును గూడనట్టియుం గకారమునకు వికల్పముగ వకారమాదేశమగును. 'క్వచిద్గకారో వః' అనునది మూలము. పదాద్యంబు=పదము మొదటనున్నది. అపదాద్యంబు=పదము మొదట నుండనిది. ఈక్రిందియైదుదాహరణము లందును గకారమునకు వికల్పముగ వకారమగుటను వకారాదేశము గలుగనిపక్షమున గకారమే నిల్చియుండుటను గమనించునది. మూలమున గకారమును వకారమును బ్రథమానిర్దిష్టములే యగుటంజేసి గకారము వకారమగునా వకారము గకారమగునా యనుసందియము తోఁచి యేది మొదటిరూపమో తెలియదయ్యెను. మఱియుం గకారము లెల్ల నెచ్చోటనున్నవైనను వకారములు గావలెనా యని సందియము జనించెడి. అథర్వణము 'ఆద్యగస్య గకారస్య వకారస్తు న దృశ్యతే' అని గకారమును స్థానిగాను వకారము నాదేశముగను బేర్కొనుచుఁ బలుకు మొదటిగకారమునకుమాత్రము గాదని మూలమును సవరించి యట్టి సందియమును దొలఁగించె. మూలవివరణముల ఫలితమే

యీసూత్రమనుట పునరుక్తి. అర్ధబిందుపూర్వకగకారముల కీయాదేశము గల్గునెడల బిందుపూర్వకస్థిరంబు తెనుఁగున లేమింజేసి బిందువు లోపించునని గ్రహింపవలెనుగాని బిందులోపము వాదేశపక్షమునఁ గలిగెడిఁగాన వాదేశము గలుగదని మాత్రము గ్రహింపరాదు. ఇదంతయు నర్ధబిందుపూర్వక గకారవిషయము. అపదాద్యగకారమున కనుటంజేసి యీవిధి యఖండ పదములందలి గకారములకు సంబంధించినదగుటయు, నాదేశబిందువులకుఁ బరమందున్న గకారములకు సంబంధించినది గాకుండుటయు స్పష్టములు. రెండుపదములు గలిసి యొకానొకవిలక్షణమగునర్థము నొసంగుచు నఖండపదము నాఁగ భాసించెడువానియం దీవాదేశము చూపట్టదు. అఖండపదమధ్యగతగకారమునకుఁ దఱచుగ నీయాదేశమగును. పదమధ్యగతములైనను వకారముపరమందుఁ గలగకారముల కీయాదేశము సామాన్యముగఁ గన్పట్టదు. దీర్ఘముమీఁదిగకారములకుఁ గ్వాచిత్కముగ నగును. బిందుపూర్వకసంయుక్తగకారములకుఁ గలుగనే గలుగదు. అసంయుక్తమున కనుటంజేసి ద్విత్వగకారమునకును నట్టిదే యనందగుపూర్ణబిందుపూర్వక గకారములకును నీవాదేశము గలుగమి సహజము. ఖండబిందుపూర్వకములగు దీర్ఘముమీఁది గకారములకును నీవాదేశము తఱచుగఁ జూపట్టదు. ఏకపదమధ్యమందును గొన్నితావుల (తగవు-తగదు-పగరు)నీవాదేశము చూపట్టదు. దీర్ఘముమీఁది తుదిగకారములకును నీయాదేశము సార్వత్రికముగాదు. తఱచుగ డు-ము-వులముందటివానికి నీయాదేశము గలుగదు. కావుననే యీవాదేశము క్వాచిత్కమని మూలము పేర్కొనెను. మూలము గకారమునకని నిర్దేశించుటంజేసి యసంయుక్తాద్విత్వగకారములకే యని స్పష్టపడెడి. ఇట్టి యాశయము నద్దానినుండి యుద్ధరించియే సూరి ప్రయోగదృష్టితో యసంయుక్తదశ మును నిల్పెనని తోఁచెడి. పైవిషయముల ననుసరించి గకారమునకు వకారమగుట సార్వత్రికము గాదనియు శ్రుతికింపుగఁ దోఁచినపుడును బ్రయోగదృష్టమగునెడలను నీసూత్రము నుపయోగించికొనవలెననియు గ్రహింపవలెను. వేసఁగి=వేసవి. తీఁగ=తీవ. మొదలగుపదములను నగుధాతురూపముల ప్రక్రియను ననుసరించి యర్ధబిందువుతోడి గకారరూపమె (గకారమె) మొదటిదనియు వకారము గకారమున కాదేశమైనపిదప నర్ధబిందువు తొలఁగెననియు దాన గకారమునకు వకారమగుటయే మూలాశయ మనియుఁ దెల్లము. తొల్లి యర్ధబిందు వేర్పడనికాలమునఁ బూర్ణమే బిందుస్థానమునందు వేళను నద్దానిపరమందున్నగకారము ద్విత్వాక్షరమువంటిదే యైయుండుటచే వకారాదేశ మట్టివానికిఁ గలుగమి నేఁడును సాధారణముగఁ బూర్ణార్ధబిందుపరములగు గకారములకు వకారాదేశము గన్పట్టకున్నదనియు నర్ధబిందుపరములగు గకారములకు వకారము క్వాచిత్కముగఁ గన్పట్టుట యుచ్చారణము లేమి నర్ధబిందు వచ్చో లేదనుభ్రమకు లోనైన తరువాతివారిచే నైనదనియు ననుమానింపఁదగును.

## ఔపవిభక్తికప్రకరణము.

విభక్తులవలె నేయేపదఖండములో పోల్పరానివియు ద్వితీయాద్యేకవచనముల శబ్దములకు విభక్తులకు ముందగునవియు గాన వీని కుపవిభక్తులను వ్యవహారము గల్గెనని ముందె నిరూపితము. పదమునకుఁ బదాంతరముతోడి యన్వయరూపసంబంధము నీవర్ణములు దెల్పునని తెల్పుచు భాషాతత్త్వవిమర్శకులును నుపవిభక్తిసంజ్ఞను సార్థకముగ సంభావించిరి. విభక్తులకు సమీపమున నగునవి యని యర్థము. ఉపవిభక్తివర్ణములే యౌపవిభక్తికము లనంబరగును. ఔపవిభక్తికములు చేరఁదగుశబ్దములును నౌపవిభక్తికశబ్దములు నాఁబడును. ప్రకరణము = గ్రంథభాగము. ఇందౌపవిభక్తికవర్ణములాయాశబ్దముల కాగమాదేశాదులచే నయ్యెడి రీతులు విశదీకరింపఁబడుంగాన నీప్రకరణము నౌపవిభక్తికప్రకరణమని వ్యవహరించెను. ప్రాచీనాంధ్రమున శబ్దముల కుపవిభక్తులగుట నిత్యము. అనఁగా నేశబ్దము లుపవిభక్తులు చేరఁదగినవియో నియమముగ నవియెల్లయెడలను నౌపవిభక్తికవర్ణములం గూడియే యుండుట తొల్లిటి యాంధ్రమునఁ గన్పట్టెడిఁగాని యొకేశబ్ద మౌపవిభక్తికానౌపవిభక్తికత్వములఁ జెందుట చూపట్టదని తాత్పర్యము. మఱియుఁ దొల్లిటి తెలుఁగుపొత్తముల నౌపవిభక్తికశబ్దములగునవి రానురా ననౌపవిభక్తికములును దొల్లి యౌపవిభక్తికశబ్దములైనవి రానురా వికల్పముగ ననౌపవిభక్తికములును నగుట నేఁటి యాంధ్రమునఁ గలిగె. జీవద్భాషకు మార్పు లనంతములగుఁ గదా! ‘ఔపవిభక్తికవర్ణాష్టింట్యాదయో భవంతీహ, రుల్వాదేర్న్నిమ్నాం స్యుస్తే హి విభక్తౌ సమాసే చ’ అని చింతామణి యౌపవిభక్తికము లాయాశబ్దములకుఁ గలుగుట నిత్యమనెడి. తద్వివరణ మాథర్వము ‘బహవోఽత్రాంధ్రభాషాయాం వర్ణా ఔపవిభక్తికాః, ప్రవృత్తిశ్చాప్రవృత్తిశ్చ వికల్పశ్చ క్వచిద్భవేత్, తద్వివేకః ప్రయోగైకశరణం స్యాద్ధి శబ్దతః. విభాషయా భవంత్యత్ర భవంత్యుపవిభక్తయః, భవంతి కుత్రచిన్నైవ నిదానం తత్ర సద్వచః.” అని నిత్యవైకల్పికప్రవృత్తులను నిత్యాప్రవృత్తిని దెల్పెడి. పైవిషయమును బరిశీలించినఁ దొల్లి నిత్యముగ శబ్దములకయ్యెడి యివ్వానికిఁ గాలక్రమమున వికల్పప్రవృత్తియు నప్రవృత్తియుఁ గుదిరెననుట స్పష్టము. ఇట్లే యనుకరణవిధి నుత్తరాంధ్రమున ననౌపవిభక్తికశబ్దము లౌపవిభక్తికము లగుటయు నౌపవిభక్తికము లనౌపవిభక్తికము లగుటయు సంభవించెనని గ్రహించునది. ఈయౌపవిభక్తికశబ్దములు స్వతంత్రములై ప్రయుక్తములగునపుడేగాక సమాసగతము లగునపుడును నీయౌపవిభక్తికవర్ణములనందెడి. బ్రహువ్రీహిసమసాంతములం దీచెప్పఁబడిన ఋటిటివర్ణములేగాక కొన్ని క్రొత్తవర్ణములును (అలరువిల్తుఁడు-తు) కొన్నివర్ణములకు

వికారాదులును (నలువాయి=నలువ) గలుగుట చూపఁబడెడి. వీనిని సమాసాంతకార్యము లనుట వ్యాకరణసంప్రదాయము. (చూ. సమాసప. 22) మఱియు సమాసమున వవర్ణ మగుట గన్పట్టెడి. (పాఁపఱేఁడు.) పైని వివరించిన సమాసాంతములనగువర్ణము లేయే యర్థముల బోధించెడి స్వతంత్రపదములయవశిష్టభాగములోఁ దెలియఁజేయ నవకాశము లేమింజేసియు సామాన్యముగ సమాసాంతములందు విభక్తులకు ముందఁగనవగుటం జేసియు నట్లు సమాసాంతములందుఁ గలుగు నవ్వానిని సమాసాంతవర్ణములని ప్రాచీనార్వాచీనలాక్షణికులు వ్యవహరించిరి. సమాసాంతములనగునవి యౌపవిభక్తికవర్ణముల వలె ద్వితీయాద్యేకవచనములందె గాక యేకత్వబహుత్వముల విభక్తులకు ముందెల్ల యెడల శబ్దముల కగునను విశేషమును గమనించి 'కార్యా ఔపవిభక్తివదంతవిధయశ్చ' అను మూలము ననుసరించి సమాసాంతకార్యములుగాఁ జేర్కొని యవ్వర్ణములను సమాసాంతవర్ణములని సూరి వ్యవహరించెను.

## ఇ-టి-తివర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు. ౨౮.

విభక్తినిమిత్తకంబులయి యాదేశాగమాత్మకంబులయిన ఇ-టి-తి-అను వర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు.

టీ. 'ఔపవిభక్తికవర్ణాస్త్వింట్యాదయో భవంతీహ' అనునది మూలము. వక్ష్యమాణంబులు=చెప్పఁబోవునవి. ఆయాసూత్రములచే నామశబ్దములకు మీఁద విధింపఁబోవునట్టి 'ఇ-టి-తి' అను మూఁడువర్ణములకు నౌపవిభక్తికములని సంజ్ఞ. ద్వితీయాద్యేకవచనములు కారణములుగ శబ్దములతుది నాదేశాగమరూపముల నీయిటితివర్ణము లయ్యెడినని సూరి యౌపవిభక్తికమను విభక్తులసమీపమున నగునవనువ్యుత్పత్తిని సూచింపనే, 'విభక్తినిమిత్తకంబులయి' అని వివరించెనని గ్రహించునది.

## ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు. ౨౯.

కాలు - కాలిని - కాలిచే. నాఁగలి - నాఁగటిని - నాఁగటిచే. నేయి-నేతిని-నేతిచే. ద్వితీయైకవచనంబు పరంబగునపు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి - అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధంబగుటం జేసి యనాదరణీయంబు.

టీ. 'హల్వాదేర్నామ్నాం స్యుస్తే హి విభక్తౌ' అనునది మూలము. పైని పేర్కొన్న యిటితివర్ణములు కొన్ని ప్రాతిపదికములకు ద్వితీయావిభక్తి మొదలుగా

నెల్లవిభక్తులందు నేకవచనంబులు పరములగునపుడు తఱచుగ నగు. మూలము 'రు-లు' అనునవి తుదిని గలశబ్దముల కనుచున్నను డు-ము-మొదలగున వంతమందు గలవానికిని గొన్ని సంఖ్యావాచకములకును గావలసియుండుటచేత నంతిమవర్ణప్రధానముగ శబ్దములఁ బేర్కొనక నామంబులకుఁ గొన్నింటికని సామాన్యముగ ననెనని గ్రహించునది. మఱియుఁ 'టి-ంటి' అనువానినే ముఖ్యముగ నౌపవిభక్తికవర్ణముల క్రింద భావించుట చేతను నవి ప్రధానముగ. రుల్వాదినామముల కగునవగుటచేతను మూలము రుల్వాదిశబ్దముల కనెను. సూరి మూలమునందలి టింట్యాను లనుదళమునందలి యాదిశబ్దముచే ఇ-తి-వర్ణములను గ్రహించినవాఁడును, టివర్ణమునకు ముందు గొన్నియెడలఁ బూర్ణబిందువును విధించి 'ంటి' అనుదానిని గుదిర్చికొనినవాఁడును నగుటచేతను (చూ 32-33) మూలముగూడ రుల్వాదులకని యాదిశబ్దముచే మఱికొన్నిటిని గూడ సంగ్రహించు తలంపు గల్గియుండుటచేతను, నామంబులకుఁ గొన్నింటికని సామాన్యనిర్దేశము చేయుటయుఁ ంటి-వర్ణమును బ్రత్యేకముగ నౌపవిభక్తికవర్ణముగ నంగీకరింపకుండుటయుఁ సంభవించెనని యెన్నునది. ద్వితీయైకవచనమున నౌపవిభక్తికవర్ణము లాయాశబ్దములకుఁ గలుగుట వాఙ్మయమునఁ బ్రసిద్ధముగ నగపడుచుండుటచేతను లక్షణకర్తలెల్లరును సామాన్యముగ ద్వితీయైకవచనమునను నౌపవిభక్తికవర్ణముల సంభవమును వాఙ్మయము ననుసరించి శాసించుచుండుటచేతను ద్వితీయైకవచనమున నౌపవిభక్తికవర్ణములు గలుగవని కొందఱు చెప్పుమాట లక్ష్యలక్షణవిరుద్ధమైనదనియుఁ దాన నది యాదరింపరానిదనియుఁ 'ద్వితీయైకవచనం'బను మున్నగు సూరివివరణవాక్యమున కభిప్రాయము.

కాలు:—దీనికి ద్వితీయైకవచనప్రత్యయము నువర్ణకము పరముగా 'కాలు+ను' అని యుండును. ఈవిధిచే నౌపవిభక్తికవర్ణమగు ఇకారమాగమముగ రా 'కాలు+ఇ+ను' అని యగును. పిదప నుత్వసంధిగాని యపదాది స్వరసంధిగాని యైన కాలి+ను' అని యేర్పడును. తరువాతఁ దత్సమము 26 చే నువర్ణకము నివర్ణముగా 'కాలిని' అని రూపము సిద్ధించెడి. ఇట్లే యితరవిభక్తుల యేకవచనములందు 'కాలిచేత-కాలికొఱకు-కాలియందు' మొదలగురూపము లేర్పడుటను గమనించునది. కాలిక్రింద మొదలగు సమాసములందును బూర్వపదమగు నౌపవిభక్తికశబ్ద మౌపవిభక్తికవర్ణము నందుటను జూచికొనునది. నాఁగలి+ను:—ఇచ్చో 'టి' అను నౌపవిభక్తికవర్ణము నాగలిశబ్దము తుదినున్న లివర్ణమున కాదేశమగుటచే 'నాఁగటిని' అనురూప మేర్పడెను. ఇట్లే 'నాఁగటిచేత' మున్నగు నేకవచనరూపములును, 'నాఁగటిచాలు' మున్నగు సమాసరూపములను గమనించికొనునది. నేయి+ను:—ఇచ్చో తివర్ణము నేయిశబ్దముతుది వ్రాయి యగు యివర్ణమున కాదేశమయ్యెనుగాన 'నేతి+ను' అని యై పిదప నికారంబు మీఁది యనుశాస్త్రముచే నువర్ణకము నివర్ణమై 'నేతిని' అనురూపము సిద్ధించెను, ఇట్లే

'నేతి చేత' మున్నగు నేకవచనరూపములయుం, 'నేతికుండ' మొదలగు సామాసికరూపములయుం బ్రక్రియం గమనించునది.

### ఊరు మొదలగువాని కిత్వంబగు. ౩౦.

ఊరు - ఊరిని - కాలు - కాలిని - మ్రాను - మ్రానిని - నోరు - నోరిని - చోటు - చోటిని.

టీ. ఇ-టి-తి-వర్ణములలో నేది యేని యే యే శబ్దములకు సామాన్యముగఁ గల్గునో యిది మొదలుకొని వివరింపఁబడును. ఊరు మొదలగుశబ్దములకు హ్రస్వేకారమగును. ఆదినున్న ఊరుశబ్దమునుబట్టి రేఫాంతశబ్దముల కిత్వమని సంభావింపరాదనువిషయము నుదాహరణములే స్పష్టపఱుపఁ జాలియున్నవి. ఊరు మొదలగువాని కనుటంజేసి యంత్యమున కీయిువర్ణ మగునని యెంచునది. ఇకారము ప్రాతిపదికముతుదిం జేరినపిదప నంతటను దత్సమము 26 చే నువర్ణకము నివర్ణమగుటను స్మరించికొనునది. 'ఊరు + ఇ + ను = ఊరిని. కాలు + ఇ + ను = కాలిని. మ్రాను + ఇ + ను = మ్రానిని. నోరు:—నోరిని. చోటు:—చోటిని. ఇతరవిభక్తులయేకవచనములందును దత్పురుషాదులందును యివర్ణమగుటను గమనించునది.

### టివర్ణంబు గొన్నింటియంత్యాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంత్యాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగనగు. ౩౧.

ఆదేశము:—త్రాడు - త్రాటిని; కాఁడు - కాటిని; నోరు - నోటిని; ఏఱు - ఏటిని; ఆగమము:—అన్ని - అన్నిటిని; ఎనిమిది - ఎనిమిదిటిని; వేయి వేయిటిని. ఉభయము:—ఏమి - ఏటిని - ఏమిటిని; పగలు - పగటిని - పగలిటిని; మొదలు - మొదటిని - మొదలిటిని; రెండు - రెంటిని - రెండిటిని; మూఁడు - మూఁటిని - మూఁడిటిని; నూఱు - నూటిని - నూఱిటిని.

టీ. పైని పేర్కొన్న యోపవిభక్తికవర్ణములలో టి-వర్ణము కొన్నిశబ్దముల యంత్యమాక్షరమున కాదేశముగను గొన్నిశబ్దములతుది నాగమముగను గొన్నిశబ్దముల కొకమా ఱాదేశముగను నొకమా ఱాగమముగను (ఉభయము) దఱచుగ నగును. త్రాడు + ను. దీనిచేఁ దుదివర్ణమగు 'డు' అనుదానిస్థానమున టి-వర్ణ మాదేశమై పిదప నువర్ణక మికారముమీఁది కనువృత్తియౌవిభక్తులను శాస్త్రముచే నివర్ణకముగా 'త్రాటిని' అనురూపము గలుగును. ఇట్లే 'కాఁడు + ను = కాటి + ను = కాటిని; నోరు + ను =

నోటి +ను=నోటిని; ఏఱు+ను=ఏటి+ను=ఏటిని' అనురూపములందు శబ్దాంతిమవర్ణముల కాదేశముగ టి-వర్ణ మగుటను గమనించునది. ఈరీతిగనే నితరవిభక్తులం దేకవచనము లందును సమాసములను టి-వర్ణ మీశబ్దములతుదివర్ణముల కాదేశమగుటను గమనించుచుఁ 'డ్రాటిచేత-కాటిచేత - నోటిచేత - ఏటికొఱకు-త్రాటియల్లిక-కాటికాపరి-నోటిమాట - ఏటిసీరు' మొదలగురూపముల నూహించికొనునది. అన్ని + ను:—సర్వనామము లమహదర్థము లేకవచనాంతములుగాన ద్వితీయైకవచనమున దీనిచే టి-వర్ణ మంతాగమ ముగ దీనికి సిద్ధింప 'అన్ని + టి + ను=అన్నిటిని' అనురూప మేర్పడును. ఇట్లే 'ఏనిమిది+ టి+ను=ఎనిమిదిటిని: వేయి + టి + ను=వేయిటిని' అను మొదలగువానియందు టివర్ణ మంతాగమముగ నగుటను గమనించునది. ఏమి + ను:—దీనికి దీనిచే టి-వర్ణ మంతి మాక్షరమున కాదేశముగఁ గలిగినపక్షమున 'ఏమి+టి + ను=ఏటి+ను=ఏటిని; అనియు, నంతాగమముగఁ గల్గిన 'ఏమి+టి+ను=ఏమిటిని' అనియు రూపము లగును. ఈరీతిగనె పగలుశబ్దమున నంతిమాక్షరమైన లువర్ణమునకు టి-వర్ణ మాదేశమైనపక్షమునఁ 'బగటిని'ననియు నంతాగమమైనపక్షమునఁ 'బగలిటిని' ననియు, మొదలుశబ్దమున కాదేశముగ నైనపక్షమున 'మొదటిని' ననియు నాగమముగ నైనయెడల 'మొదలిటిని' ననియు, రెండుశబ్దమున కాదేశపక్షమున 'రెంటి'ననియు నాగమపక్షమున 'రెండిటి'ననియు, మూఁడుశబ్దముతుదివర్ణముం డ్రోసి యైనయెడల 'మూఁటిని' ననియు, నంత్యమున కధిక ముగ నైనచో 'మూఁడిటిని' ననియు, నూఱుశబ్దమున కాదేశముగనైన 'నూటిని' ననియు, నాగమముగ నైన 'నూఱిటి'ననియు రూపములేర్పడెడి. పగలు మున్నగువానికి టివర్ణమాగమముగ నైనపక్షమున 36 చే లువర్ణము నుత్వమున కిత్వము గల్గునని గ్రహించునది. అనంతరవిధింబట్టి హ్రస్వముమీఁది టివర్ణమునకుముందు బిందువగుటను గమనించునది. మూఁడుశబ్దమున డువర్ణమునకు ముందున్న బిందువు టివర్ణము డువర్ణ మున కాదేశమైనపుడును సంజ్ఞ 16 విధి ననుసరించి పోదని యూహించునది. ఇట్లు ప్రయోగములంబట్టి యెచ్చోట నాగమమో యెచ్చోట నాదేశమో యెచ్చోట నుభయమో యెఱుంగునది.

## హ్రస్వముమీఁది టివర్ణంబునకుముందు పూర్ణబిందువు బహుళముగానగు. 3౨

అన్నింటిని - ఎనిమిదింటిని - పగంటిని - పగలింటిని - రెండిం టిని-మూఁడింటిని.

టీ. హ్రస్వాంతమైన శబ్దమునకుఁ దరువాతనున్న యాపవిభక్తికవర్ణమగు టివర్ణమునకు ముందు పూర్ణబిందువు బహుళముగ నగును. అన్ని+టి+ని 'అన్ని' అను

దానియందుఁ దుదినిగల న్ని యనునది హ్రస్వము. దానికిఁ బరమున నున్న టియను నౌపవిభక్తికవర్ణమునకు ముందు నిండుసున్న దీనిచేఁ గలుఁగ 'అన్ని + ం + టి + ని = అన్నింటిని' అని రూపము సిద్ధించెడి. నిండుసున్న రానపుడు 'అన్నిటిని' అనియే యుండును. ఇట్లే యితరవిభక్తులం దేకవచనముల టి-వర్ణమునకు ముందు బిందువగుటయుఁ గాకుండుటయు గమనించునది. ఎనిమిది:—ఇందు ది యనునది హ్రస్వము. దానికిఁ దరువాతఁ గల్గిన టి-వర్ణమునకు ముందు నిండుసున్నరా 'ఎనిమిదింటిని' అనియుఁ జెలఁ సున్న రాకున్న 'ఎనిమిదిటిని' అనియుం రూపములేర్పడును. ఇచ్చోట టి-వర్ణ మాగమముగ నయ్యెననుట స్పష్టము. పగంటిని:—పగలను ప్రాతిపదికమున గ-వర్ణము హ్రస్వము. దానికిఁ దరువాత నైన టి-వర్ణమునకు ముందు పెద్దబిందువు గలుఁగ 'పగంటిని' అను రూపము సిద్ధించెను. ఇచ్చోట 'పగలు' అను శబ్దముతుదివ్రాయి కాదేశముగ టి-వర్ణ మగుట తెల్లము. పగలింటిని:—ఇందుఁ బగలుశబ్దమున కాగమముగ టి-వర్ణము గలు గుటయు దానికిముందు బిందు పీవిధిచే సిద్ధించుటయు 36 చే లువర్ణము నుత్వమున కిత్వము గలుగుటయుం గ్రాహ్యములు. రెండుమూఁడుశబ్దములందుఁ దుదినున్న డు-వర్ణ ములు హ్రస్వములు. వీని కాగమముగ నైన టి-వర్ణమునకుముందు గట్టిబిందువగుటచే 'రెండింటిని; మూఁడింటిని' అని రూపములు గలిగెను. 36 చే డువర్ణమునుత్వమున కిత్వము సిద్ధించెడి. పూర్ణబిందువు రానిపక్షమున 'పగటిని-పగలిటిని-రెండిటిని-మూఁటిని' అనురూప ములగునని గ్రహించునది. హ్రస్వముమీఁది టి-వర్ణమున కనుటంజేసి త్రాటిని మొదలగు దీర్ఘముమీఁది టివర్ణములకు నిండుసున్న రాదనుట స్పష్టము. వికల్పమనక బహుళ మనుటంజేసి 'నెత్తుటికి, ఏమిటిని; మొదటిని;' మొదలగుస్థలములందు హ్రస్వముమీఁది టి-వర్ణమునకును ముందు నిండుసున్న గలుఁగకుండుట ఫలమని సంభావించునది. మూలమున 'ంటి' అనునదియు నౌపవిభక్తికవర్ణమె యగుటంజేసి టివర్ణమునకు ముందు నిండుసున్న విధించెడుసూత్రములందుఁ జూపట్టవు. ఇందు బిందువని సామాన్యముగనన్న ఖండపూర్ణ ములు రెండును గలుగవలసివచ్చు ననుతలంపునఁ బూర్ణబిందువనెనని గ్రహించునది.

## పదాద్యంబగు హ్రస్వంబుమీఁఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువగు. 33

కన్ను-కంటిని; మిన్ను-మింటిని; ఇల్లు - ఇంటిని; పల్లు - పంటిని.

టీ. పదముతొలిహ్రస్వమునకుఁ దరువాత నున్న టి-వర్ణమునకు ముందు నిండు సున్న నిత్యముగ నగును. కంటిని:—ఇచ్చోఁ గన్నుశబ్దమునందలి 'న్ను' అనుదాని కాదేశముగ టి-వర్ణమయ్యెఁ గాన 'క + టి + ను'. అని యుండును. పిదప దీనిచే టి-వర్ణ

మునకు ముందు నిండుసున్న నిత్యముగఁ గలుగ 'క+ం+టి+ను' అని యగును. తత్సమము 26 చే నువర్ణకము నుత్వమున కిత్వము గలుఁగ 'కంటిని' అని రూపము సిద్ధించును. ఇట్లే 'మిన్ను+ను=మి+టి+ను = మి+ం+టి+ను=మి+ం+టి+ని=మింటిని; ఇల్లు+ను = ఇ+టి+ను = ఇ+ం+టి+ను = ఇ+ంటి+ని = ఇంటిని; పల్లు+ను= ప+టి+ను=ప+ం+టి+ను=ప+ం+టి+ని=పంటిని' అనురూపముల ప్రక్రియం గను గొనునది. ఇతరవిభక్తులం దేకత్వమున నిట్లే టివర్ణమునకు ముందు నిండుసున్న యగుటను గమనించునది. సంధి 22విధి ననుసరించి నుడితొలిహ్రస్వమువీఁద ఖండబిందువును నిల్వ నవకాశములేమి నీసూత్రమున బిందువని సామాన్యముగ ననినంజాలును. టివర్ణమునకుముందు నిండుసున్న విధించెడిసందర్భమగుట స్పష్టార్థము పూర్ణమనెనని యెన్నునది.

## అఱ్ఱు మొదలగు శబ్దముల కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు. 38.

అఱ్ఱు - అఱితిని. అఱ్ఱు - కఱ్ఱు - కొఱ్ఱు - గోఱ్ఱు - మిఱ్ఱు - వఱ్ఱు-ఇవి యఱ్ఱు మొదలయినవి.

టీ. 'అఱ్ఱు' అనుమున్నగుశబ్దములకుఁ దుది నాగమముగ (అంతావయవముగ) తి-వర్ణమును, తి-వర్ణము గలుగుడు నాశబ్దముల తుదినున్న ద్విత్వరేఫములో నొకదానికి లోపమును నిత్యముగఁ గలుగును. తి-వర్ణమును నది పరమగుడుఁ గలుగు రేఫలోపంబును నిత్యముగనే యగును. గణాదినున్న అఱ్ఱుశబ్దము ననుసరించియుం రేఫలోపవిధానము ననుసరించియు నీగణమునందలిశబ్దములును నిందుఁ జేరఁదగినవియుం, 'ఱ్ఱు' అనునదంతమందుఁ గలశబ్దములే యని సంభావింపవలయును. 36 చే ఉవర్ణము నుత్వమున కిత్వముగల్గి సిద్ధించిన 'అఱితిని' అను మున్నగురూపముల ననుసరించి ద్విత్వరేఫమునఁ గ్రిందిహల్మాత్రమే లోపించునని గ్రహింపవలసియున్నది. 'అఱ్ఱు+ను:—దీనిచే తి-వర్ణమును రేఫమున కొక్కటికి లోపమును గలుగ 'అఱు+తి+ను' అని యుండును. పిదప 36 చే శకటరేఫము నుత్వమున కిత్వమును దత్సమము 26 చే నువర్ణకము నుత్వమున కిత్వమును గలుగ 'అఱితిని' అని రూపము సిద్ధించును. ఇట్లే 'కఱితిని - కొఱితిని- గోఱితిని-మిఱితిని-వఱితిని' అను మొదలగు రూపముల ప్రక్రియం గమనించునది. తృతీయాద్యేకవచనముల నిట్లే 'అఱితిచేత' మొదలగురూపములగుట నూహించికొనవలెను. తివర్ణముగా నీరెండుకార్యములగుట నిత్యము. ద్విత్వరేఫము శకటమే యగుంగాన రేఫమని సామాన్యముగనన్నను బాధలేదు.

విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతులతుదియక్షరంబు
తి-వర్ణంబగు. 34.

గోయి - గోతులు - గోతిని - గోతులను. గోయి - చేయి - దాయి - నూయి - నేయి - వాయి - రోయి - ఇత్యాదులు.

టీ. విభక్తి పరమగునపుడు గోయి మొదలగుశబ్దముల తుదియివర్ణమునకు తి-వర్ణము నిత్యముగ నాదేశమగును. గోయియను తొలిపదమునసుసరించి యిందలిశబ్దములును నిందుఁ జేరఁదగునవియు యి-వర్ణాంతశబ్దములేయని సంభావింపవలయును. మఱియునవి దీర్ఘపూర్వ యి-వర్ణాంతద్వ్యక్షరశబ్దములనియు ననుమానింపఁదగును. ఔపవిభక్తికవర్ణములన్నియు, నాయాశబ్దముల నాయాద్వితీయాది విభక్తులందే యేకవచనములకు ముందె గాని బహువచనములఁ గలుగుట గన్పట్టదు. ఈయివర్ణాంతదీర్ఘపూర్వద్వ్యక్షర శబ్దములకు మాత్రము ప్రథమాబహువచనము మొదలుకొని ద్వితీయాదివిభక్తులయేకవచన బహువచనములందును తి-వర్ణకము వానికిముందగుట గన్పట్టెడి. కావుననే సూరి నిపుణముగ విభక్తి పరంబగునపుడని సామాన్యముగ ననెనని యెన్నునది. ఈయివర్ణాంతశబ్దముల ప్రథమైకవచనము తత్సమము 41చే నిత్యముగ లోపించెడిఁగానఁ బ్రథమైకవచనమున విభక్తి పరమగుటకవకాశమె లేమింజేసి యందితివర్ణ మాదేశమగునని యనుమానింపరాదు. గోయి+లు:—ఇచ్చోట లువర్ణకము ప్రథమాబహువచనము పరముగాఁ దుదియివర్ణమున కీవిధిచే నాదేశముగఁ ది-వర్ణమును, బిదపఁ దత్సమము 45చే తి-వర్ణమునిత్వమున కుత్వమును గలిగి 'గోతులు' అని రూపము సిద్ధించెను. గోయి+ను:—ద్వితీయైకవచనము పరముగాఁ ది-వర్ణమును నువర్ణకమునుత్వమున కిత్వమును గలిగి 'గోతిని' అనురూపమయ్యెను. గోయి+ల+ను:—ఇచ్చోట ద్వితీయాబహువచన ప్రత్యయమగు నువర్ణమును దత్పూర్వమునైన లడాగమలకారమును బరముగా 'యి' అను వర్ణమునకుఁ దివర్ణమును దత్సమము 45చే దానియిత్వమున కుత్వమును గలిగి 'గోతులను' అనురూపము గలిగెను. ఇట్లే తక్కినవానికినిఁ బ్రథమాబహువచనము మొదలుకొని తక్కినవిభక్తుల యేకవచన బహువచనములందును నీవిధిచేఁ దివర్ణమగుటను బహువచనములందుఁ దత్సమము 45చేఁ దివర్ణము నిత్వమున కుత్వమగుటను గమనించుచు సిద్ధరూపములం దెలిసికొనునది. ద్వితీయాదివిభక్తులందు బహుత్వమున విభక్తుల కాద్యవయవముగఁ దత్సమము 31చే లడాగమము విధింపఁబడుటంబట్టి నువర్ణకాదిబహువచనములు లడాగమవ్యవహితములైనను దివర్ణమునకు విభక్తిపరత్వము చెడలేదనియే యనుమానింపఁదగును. మఱియు ద్వితీయాదివిభక్తులు పరముగాఁ దివర్ణాదేశము గలిగినపిమ్మటనే లడాగమము విభక్తి ప్రత్యయములకుఁ గలిగెనన్నను బాధలేదని గ్రహింపనగును.

టి-తి-వర్ణంబులు పరంబులగునపు డుత్వంబున కిత్వంబగు. 3౬

రెండిటికి - మూఁడిటికి - నాలుగిటికి - పగలిటికి - మొదలిటికి- పెక్కిటికి. కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు. నెత్తుటికి.

టీ. 'టి-తి' అనునాపవిభక్తికవర్ణములు పరములగునపు డావర్ణములకుముందున్న హ్రస్వోకారమునకు హ్రస్వేకారము నిత్యముగ నగును. రెండు+టి+కి:—ఇందు రెండుశబ్దముడువర్ణమునుత్వమునకు టి-వర్ణమునకు ముందున్న దాని కిత్వమీవిధిచే సిద్ధించి 'రెండిటికి' అనురూపమయ్యెను. ఇట్లే మూఁడు-నాలుగు-పగలు-మొదలు-పెక్కు-శబ్దముల తుదియుత్వమునకు టి-వర్ణము పరముగా నిత్వము గలిగి 'మూఁడిటికి - నాలుగిటికి-పగలిటికి-మొదలిటికి-పెక్కిటికి' అనురూపములు సిద్ధించెను. షష్ఠ్యేకవచనములు స్పష్టార్థముదాహరింపఁబడినవిగాన ద్వితీయాది విభక్తులందన్నిటియందును నేకవచనముల టివర్ణముగునపు డిట్లే శబ్దాంత్యమగునుత్వమున కిత్వము గలుగునని గ్రహింపవలెను. తి-వర్ణము పరంబగునపు డుత్వమున కిత్వముగలుగుటకు 34 సూత్రముక్రింది వుదాహరణములుగ గ్రహింపనగును. నెత్తురు:—ఈ శబ్దముతుది నున్న రువర్ణమున కాదేశముగ టి-వర్ణము ద్వితీయాద్యేకవచనములందగునపు డాటివర్ణమునకు ముందున్న 'త్తు' అనువర్ణమునుత్వమున కిత్వము గలుగుట ప్రయోగసిద్ధము గామింజేసి యీసూత్ర మద్దాని విషయమునను నట్టివానివిషయమునను వర్తింపదని కొండొకచో నను సూరివివరణమున కభిప్రాయమని గ్రహించునది.

టి-వర్ణంబు పరంబగునపుడు క్రిందు మీఁదు ముందు పు-వర్ణంబుల కత్వంబగు. 32.

క్రిందు-క్రిందటిని; మీఁదు - మీఁదటిని; ముందు - ముందటిని; మాపు-మాపటిని; అప్పుడు-అప్పటిని.

టీ. టి-వర్ణము పరముగా 'క్రిందు-మీఁదు-ముందు' అనుశబ్దముల తుదియుత్వమునకును, పు-వర్ణాంతశబ్దముల తుదియుత్వమునకును, నత్వమాదేశము నిత్యముగ నగును. పూర్వసూత్రముచేఁ గలుగు నిత్వమున కీసూత్రముచేనగు నత్వము బాధకమగుటంజేసి టి-వర్ణము పరమగునపు డుత్వమున కత్వమని సామాన్యముగ ననక క్రిందు-మీఁదు-ముందు పు-వర్ణములకని విశేషించి చెప్పఁబడె నని గ్రహించునది. దీన నిందుఁ జెప్పఁబడ్డస్థలములందప్పఁ దక్కినచోటులందు 36సూత్రమే వర్తించునని సంభావింపవలయును. క్రిందు+ను:—టి-వర్ణ మాగమముగఁ గలుగ 'క్రిందు+టి+ను.' అని యగును. పిదప నీవిధిచే క్రిందుశబ్దము తుదియుత్వమున కత్వమును దత్సమము 26చే నువర్ణకమునుత్వమున కిత్వమును సిద్ధింప 'క్రిందటిని' అనురూపమగును. ఇట్లే తక్కినవానితుది

యత్వమునకు టి-వర్ణము పరమగునపుడెల్ల నత్వముగలుగుటను గమనించునది. అప్పుడు:— ఈశబ్దము డువర్ణమునకు ద్వితీయైకవచనమునువర్ణము పరముగా టివర్ణ మాదేశమయ్యెను. పిదప 'అప్పు + టి + ను' అని యుండ నీసూత్రముచే టి-వర్ణమునకు ముందున్న 'ప్పు' అనుదానియుత్వమున కత్వమును నువర్ణకము నుత్వమునకు దత్సమము 26 చే నిత్వమును గలిగి 'అప్పటిని' అని రూపమయ్యె. ఈరీతిగానే 'ఇప్పటిని-ఎప్పటిని' అనురూపముల ప్రక్రియను గమనింపవలెను. ఇట్లే 'అప్పటికిని' ఇత్యాదులందు టి-వర్ణమును నది పరముగా దానిముందటియుత్వ మత్వమగుటయు గమనించునది. అప్పుడిప్పుడెప్పుడనునవి నిత్యైక వచనములుగా సంధి 13 సూత్రమున నుదాహరించి వాగనుశాసనునాశయ మిదియేయని సూరి సమర్థించికొన యత్నించినవాఁడగుట నిచ్చోఁగూడ నప్పటిని నని ద్వితీయైక వచనముగా నిర్దేశించెనని గ్రహించునది. వాఙ్మయప్రయోగస్థితి యటుండనిచ్చి వ్యవహారమును బ్రమాణీకరించినను 'అప్పటికంటె-అప్పటిలో - అప్పటికి-ఇప్పటికంటె-ఇప్పటిలో - ఇప్పటికి - ఎప్పటికంటె-ఎప్పటిలో-ఎప్పటికి' అనురూపములు దప్ప నితరము లేకత్వమున ద్వితీయాదివిభక్తులం దీశబ్దములకు రూపములు గానరామి నప్పటిని నని యుదాహరించుటయు, నేకత్వమున సామాన్యముగ నెల్లవిభక్తులందును నౌపవిభక్తిక వర్ణముల నందఁదగు శబ్దములలోఁ జేర్చి దీనిని జేర్కొనుటయు, నట్లెల్లవిభక్తులం దేకత్వమున నౌపవిభక్తికవర్ణములం గూడియుండని వాని నేరి యారీతిగ నివి యావిభక్తులందె యిట్లే యౌపవిభక్తికవర్ణములం జెందియుండునని దెలుపకుండుటయు విచార్యవిషయము లనక తీరదు. 'అప్పటినుండి-ఇప్పటినుండి-ఎప్పటినుండి' అని వినంబడెడి రూప మప్పటివలననుండి మొదలగు రూపములనుండి గల్గినదిగ బాలవ్యాకరణ కారకము 11 సూత్రము ననుసరించి నిర్ణయింపవలసియుండుటచేత నప్పటిని నను మొదలగు రూపములు ద్వితీయైకవచనములని యూహింపవలసియున్నది. ఇందలి 'యప్పుడు-క్రిందు-ముందు-మీఁదు' శబ్దములు కలిచిన్విభక్త్యేకవచనప్రయుక్తములగు నవ్యయములని ఫలిత మనుమానింపఁ దగును. 29-32-33-36-37 సూత్రములందలి యుదాహరణముల కుప విభక్తులప్రాప్తి నాయావర్ణముల విధించెడి సూత్రములచే నగునని యెఱుంగునది.

ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగానగు. 38.

గోరను గీఱెను. ఊరనున్నాఁడు. గొడ్డట నఱికెను. ఇంట లేఁడు. వఱుతఁ గలిసె. కఱుత దూఁటె. పక్షంబునందు గోరిచేత-నూరియం దిత్యాదులు.

ఇది యాచ్ఛికపరిచ్ఛేదము.

టీ. 'ఔపవిభక్తికనామ్నామత్వం స్యాత్సప్తమీతృతీయార్థే' అనునది మూలము. ద్వితీయాద్యేకవచనములందే యౌపవిభక్తికవర్ణములు గలుగునవగుటచేత నౌపవిభక్తిక శబ్దముల తృతీయాసప్తముల కనుపదమున కౌపవిభక్తికశబ్దములకు సంబంధించినతృతీయా సప్తమ్యేకవచనప్రత్యయములకని యర్థమును గ్రహింపవలెను. ఉపవిభక్తులం జెందెడు శబ్దముల తృతీయాసప్తమ్యేకవచనప్రత్యయములకు సర్వాదేశముగ హ్రస్వాకారము బహుళముగ నగునని సూత్రార్థము. ఇట్లనుటంజేసి విభక్తులకుది నాగమముగఁ జేరిన నుగా గమమునకు మాత్ర మత్వమాదేశముగాదని గ్రహింపవలెను. గోరు+చేతను, గోరు+ అందును, ఈచోటులఁ దృతీయాసప్తమ్యేకవచనములు పరములుగా గోరుశబ్దమునకు 30 సూత్రముచే నౌపవిభక్తికప్రత్యయమగు ఇ-వర్ణము గలిగి 'గోరిచేత - గోరియందు' అను రూపములు గలిగె. పిదప నీవిధిచే 'చేత-అందు-' అను తృతీయాసప్తమ్యేకవచన ముల కత్వము సర్వాదేశముగాఁగ 'గోరు + అను' అని యేర్పడెను. పిదప సంధి 11 చే నిత్యముగ సంధి జరుగ 'గోరను' అని తృతీయాసప్తమ్యేకవచనములం దొక్క- రూపుగల రూపమే సిద్ధించెడి. ఇట్లే 'ఊరు + చేతను; ఊరు+అందును; ఊరి + చేతను; ఊరి+అందును; ఊరు+అను=ఊరను' అనురూప మేర్పడును. అత్వమాదేశము గాని పక్షమున 'ఊరిచేత; ఊరియందు' అని రూపములొప్పును. గొడ్డలి + చేతను; గొడ్డలి+ అందను:—గొడ్డలిశబ్దమునకు 31చే నంతిమాక్షరమున కాదేశముగ టి-వర్ణమగును. పిదపఁ దృతీయాసప్తమ్యేకవచనముల కత్వము నపదాదిస్వరసంధియుఁ గ్రమముగఁ గలుగ గొడ్డటి+చేతను, గొడ్డటి+అందును = గొడ్డటను' అని రూపమగును. అత్వము బహుళమగుటఁ గలుగనిపక్షమున 'గొడ్డటిచేత-గొడ్డటియందు' అని రూపములగును. ఇల్లు + చేతను; ఇల్లు +అందును; దీనికి 31చే 'ల్లు' అనుదాని కాదేశముగ టి-వర్ణమును 33చే నిత్యముగ టి-వర్ణమునకు ముందు పూర్ణబిందువును నీవిధిచే నత్వమును నపదాది స్వరసంధియుఁ గలుగ 'ఇ + టి + చేతను; ఇ+ం+టి + చేతను; ఇ+ం+టి+అను = ఇంటను' అనురూపము సిద్ధించెడి. ఇట్లే సప్తమి యందును 'ఇంటను' అగుట యూహ్యము. పక్షమున నింటిచేత నింటియందగును. వఱ్ఱు:—దీనికి 34చే తి-వర్ణమును రేఫమున కొక్క-దానికి లోపమును నీవిధిచే నత్వమును, నపదాదిస్వరసంధియుఁగాఁగ 'వఱ్ఱు+చేతను; అందును; వఱు + తి-అను = వఱుతను' అనురూప మేర్పడును. అత్వము గలుగనిచో వఱితిచేత వఱితియందని రూపములు 39చే ఉవర్ణము నుత్వమునకిత్వము గలిగియగును. 'వఱుతను' అనునపుడు తృతీయాసప్తముల కాదేశమైన యత్వముతోఁ దివర్ణము నికారము సంధించుటంజేసి యచ్చోఁ దివర్ణము పరముగాక తవర్ణమె పరమగుటంజేసి 36 విధిచే ఉతవర్ణము నుత్వమున కిత్వము రాలేదనిగాని కొండొకచోఁ జూపట్టదను 36 సూత్రముక్రింది వివరణము సాధారణముగఁగొని యిత్వము రాలేదనిగాని చెప్పవలసి

యున్నది. ఇట్లే 'కట్టు' అని దానినుండి 'కఱు+తి+అను=కఱుకను' అనురూపము గల్గుట నరయునది. ఔపవిభక్తికశబ్దములలో నికారము నందెడువానికి గోరుశబ్దమునకు వలెను, టి-వర్ణమునందెడువానికి గొడ్డలిశబ్దమునకు వలెను తి-వర్ణము నందెడువానికి వట్టు కట్టుశబ్దములకువలెను నత్వము గల్గునపుడు రూపము లేర్పడునని గ్రహించునది.

ఉపవిభక్తింజేసి నవర్ణకాధారమగు నుదంతత చెడుంగాన నవర్ణకమును నిమిత్తముగఁ గొని యుదంతమున కుపవిభక్తులు గలుగుటకాని నవర్ణకము పరమగునపు డుదంతముపవిభక్తులనంది యౌపవిభక్తికమగుటగాని సంభవింపదుగాన నవర్ణకార్థకప్రత్యయములనె నిమిత్తముగఁ గొని యుదంతమున కుపవిభక్తులు గలుగుననియు నవర్ణకార్థకప్రత్యయములు పరములగునపుడె యుదంత మౌపవిభక్తిక మగుననియు ననక తీరదు. కాన నవర్ణకార్థకప్రత్యయములె యుదంతమున కుపవిభక్తులం గూర్చి యౌపవిభక్తికసంజ్ఞను గల్గించి యౌపవిభక్తికాత్వమునకు గుఱియగునవిగాని నవర్ణకము గాదని గ్రహింపక తప్పదు. నవర్ణకమును నుదంతమున కుపవిభక్తిం గూర్చి యౌపవిభక్తికసంజ్ఞను గూర్చునదియేని యిందత్వము బాహుళిక మగుటంజేసి నవర్ణకార్థకములు పరమగునపు డుదంత మత్వాభావమున 'ఊరిచేత-ఊరియందు' అనునట్టి రూపములనందునట్లే 'ఊరిన-నోటిన' అనునట్టిరూపములను నందవలసివచ్చును.

ఇతరవిభక్తులందలి రూపములంబట్టి శబ్దము నౌపవిభక్తికముగ నంగీకరించి తృతీయాసప్తముల నేకత్వము వివక్షింపఁబడినతోడనే ప్రత్యయములు గలుగకముందె ప్రత్యయస్థానమున నత్వమాదేశించి ప్రత్యయస్థానమునఁ గల్గినదగుట నయ్యత్వమునే ప్రత్యయముగ నెంచి ప్రకృతి కుపవిభక్తులంగూర్చి యత్వరూపముల సంపాదింపవచ్చుననిగాని యుదంతమునకైన నవర్ణకమున కత్వము ప్రకృతి కుపవిభక్తి గలుగకముందె యాదేశించి, నవర్ణకస్థానమునసైన యాయత్వమునే నవర్ణకముగ నెంచి ప్రకృతి కుపవిభక్తులం గూర్చి యత్వరూపముల సంపాదింపవచ్చుననిగాని వాదింపనగును. కాని మూలమునందువలె నిత్యముగాక యిందత్వము బాహుళిక మగుటంజేసి యత్వాభావపక్షమున నేర్పడవలసిన 'నోరిన-త్రాటిన' అనునట్టిరూపములను నుదంతౌపవిభక్తికమునకు నవర్ణకము గలుగదని వాచ్యముగఁ దెలుపఁజాలని పైవాదద్వయము వారింప వలఁతిగామి నిందుపకరింపదనియు నవర్ణక ముదంతమున కర్హ్వాతలేమిఁ గలుగదనువాదమే యీసందర్భమున శరణ్యమనియు ననక తప్పదు. మఱియు నిపుణముగఁ బరీక్షింపఁ బై వాదద్వయ ముదంతౌపవిభక్తికమునకుఁ బరమున నవర్ణకమును గనుపడకుండఁ జేయుటకే పుట్టినదగుటంజేసి యుదంతౌపవిభక్తికములకు నవర్ణకము గలుగకుండుట సూచితమగుచున్నదిగాన నుదంతౌపవిభక్తికములకు నవర్ణకముగలుగదనువాదమునకు మిాదుమిక్కిలి పోషకమే యనియు నంగీకరింపఁదగు. కానఁ గారకము 18-23

సూత్రములచే నగునవర్ణక మనౌపవిభక్తికములగు నుదంతములకే గాని యుపవిభక్తుల నందు నుదంతములకుఁ గాదనియు దాన నౌపవిభక్తికోదంతముల కత్వాభావమున నవర్ణకార్థకములు పరముగా 'నోరిచేత-నోరియందు - త్రాటియందు' అనునట్టిరూపములే యుపవిభక్తులతోడ నేర్పడుంగాని 'నోరిన-త్రాటిన' అనునట్టిరూపము లేర్పడవనియు ఫలితమును గ్రహింపవలయును. సూరి యత్వాభావమున నూరిచేత నూరియందనియే యుదాహరించుటంబట్టి యౌపవిభక్తికోదంతములకుఁ గారకము 18-23లచే నవర్ణకము సిద్ధింపదను నభిప్రాయముతోడనే యీసందర్భమునఁ బ్రక్రియను నడిపెనని సంభావింపనగును. మఱియుఁ బహుళముగ నత్వముం గూర్చు సూరి కత్వాభావమున నూరిన నోటిన ననునట్టిరూపములు దుర్వారము లగుంగాన నుదంతౌపవిభక్తికములకు నవర్ణకము సిద్ధింపదనుపద్ధతియె సిద్ధాంతముగ సంభావింపవలసివచ్చెనని విశ్వసించునది.

"కేషాంచిదుదంతానాం నేతివిభక్తావునో లుక్స్యాత్; ఔపవిభక్తికనామ్నామత్వం స్యాత్సప్తమీతృతీయార్థే" అని రెండుసూత్రములు చింతామణిలో నత్వరూపముల సంఘటించునవగపడును. బాలసరస్వత్యాదివ్యాఖ్య లిందు మొదటియున్లుగ్విధిని సప్తమ్యేకవచనమునందె కొన్నియుదంతములకె యత్వరూపముల సంపాదించునదిగను రెండవయత్వవిధి టితివర్ణములనందు నెల్లయౌపవిభక్తికములకును సప్తమీతృతీయైకవచనములం దత్వరూపములఁ గూర్చునదిగను నెన్నినవి. సప్తమియందు మాత్రమే యున్లుగ్విధింజేసి యత్వరూపమునందు నుదంతములు న్లుగ్విధానమునంజేసియే యనౌపవిభక్తికము లగుచున్నవనియుఁ, నవర్ణకము తృతీయాప్రత్యయముగ నిర్ణయింప నందు సరియగు ప్రమాణము లేమింజేసి యట్టియుదంతములకు సప్తమ్యేకత్వమున మాత్రమే యున్లుక్కాలమున నత్వరూపములు గలుగుననియుఁ దక్కిన యౌపవిభక్తికములకెల్లఁ దృతీయాసప్తమ్యేకత్వములరెంటను నత్వరూపములు గలుగుననియు బాలసరస్వత్యాదులు విశ్వసించి పైరెండు చింతామణిసూత్రములకు భిన్నస్థలవర్తిత్వమును బాఠకులకుఁ దెల్పుచు వ్యాఖ్య వ్రాసిరనుట స్పష్టము. అహోబలపండితుఁడు బాలసరస్వత్యాదుల వలెనే పైరెండుసూత్రములకు భిన్నస్థలవర్తిత్వమును బ్రకాశితమొనర్చి సార్థక్యమును సమర్థించుతలంపుతోడ నత్వశాస్త్రమునందలి యుదంతటితివర్ణాంతౌపవిభక్తికముల నున్లుగ్విధింజేర్చి యున్లుగ్విధియందలి నేతియనుదానిని దృతీయాప్రత్యయముగను సమర్థించుచు వ్రాసిన చర్చావాక్యముల స్థూలదృష్టిని గమనించియొ కాలక్రమమున టితివర్ణాంతౌపవిభక్తికములకునవలెనే యూరు చోటు మేన్వాదులకును నత్వరూపములును నౌపవిభక్తిత్వమును వాఙ్మయమున నేర్పడుటం గమనించియొ బహుళగ్రహణమునంజేసి తృతీయయం దూర్వాదుల కత్వరూపములు వారింపఁబడుటేగాక యహోబలపతి

ప్రపూర్వసూత్రమునుండి బహుళపదము ననువర్తించి యుఙ్లుగ్విధిం జేర్చి సాధించిన పేరున చోటున నడుమున ననునట్టివియుం సాధువులగుననియు సూరి యుఙ్లుగ్విధిని బరిత్యజించి యద్దానిలక్ష్యముల నత్వశాస్త్రమునఁ జేర్చి యత్వశాస్త్రమునే యాదరించెను.

''ఊరు చోటు మేన్వాదులఙ్లుగ్విషయంబు''లని సూత్రించి, ''యూరు లోనగు వానికిఁ దృతీయయం దత్వము సంప్రాప్తింపదు గాన, 'ఔపవిభక్తికనామ్నామత్వం స్యాత్సప్తమీతృతీయార్థే' అనుసూత్రమున కవి విషయములు గాక 'కేషాంచిదుదంతానాం నేతివిభక్తావునో లుక్స్యాత్' అనుసూత్రమున కవి విషయము లగుచున్నవని యెఱుంగునది.'' అని వివరణమును వ్రాయు త్రిలింగలక్షణశేషకర్తృభ్రాంతిం బరికించిన సీతఁడును బాలసరస్వత్యాదులయభిప్రాయమునే కలిగియుండె ననుట స్పష్టము. కాని యనౌపవిభక్తికములు గాననని హేతూపన్యాస మొనర్పక తృతీయయం దత్వము సంప్రాప్తింపదు గాననని హేతూపన్యాసము చేయుటంబట్టి సూరివలెనే త్రిలింగలక్షణశేషకర్తయు, నుఙ్లుగ్విధివిషయములగు నుదంతముల నౌపవిభక్తికములుగ నెంచిన వాఁడగుటఁ దృతీయయం దత్వరూపాభావభేదమునే గాని పైరెండుసూత్రములకు భిన్నస్థలవర్తిత్వమును బ్రకాశితము సేయుచుండె నని శంక గలుగకపోదు. ఉపవిభక్తిం జేసి నవర్ణకము పరమగునపుడుదంతములందు 'ఉన్' అనుభాగ మగపడుటయే గుదురమింజేసి, నవర్ణకమును బరముగ నిల్పి యున్లోపమును విధించు నుఙ్లుగ్విధి యనౌపవిభక్తికముల కత్వరూపముల సంపాదించునదనువిషయము స్పష్టపడుచుండుటచేత ననౌపవిభక్తికములుగాన నని హేతూపన్యాసముచేయక, నవర్ణకమును దృతీయాప్రత్యయముగను నెంచి తృతీయయందును నత్వరూపముల ఘటించి యుఙ్లుగ్విధికి వైయర్థ్యమును గూర్చునారి త్రోవ నవశ్యము నిరోధించి యత్వశాస్త్రమున నుఙ్లుగుదాహరణములు చేరవనునంశమును స్పష్టపఱచి సూత్రద్వయభిన్నస్థలవర్తిత్వమును బ్రకాశనము చేయ సమర్థమగు తృతీయయం దత్వము సంప్రాప్తింపదుగాన నను హేతూపన్యాసమే చేయఁబడెనని గ్రహించిన నిప్పట్టున సీతఁడును బాలసరస్వత్యాదులనే యనుసరించువాఁడయ్యెడి.

మూలమతమునేగాక సర్వమతములను విరోధింపకుండ సరిపెట్టుట కీసందర్భమునందలి బహుళప్రాయశ్శబ్దములు సమర్థములై యుండుటచేత నియ్యుపవిభక్తిప్రకరణమును విశేషించి యియ్యత్వశాస్త్రమును సార్థకము గానోపునని గ్రంథవిస్తరభీతి నీచర్చ ముగింతును.

ఇది యాచ్ఛికపరిచ్ఛేదము.

# కారకపరిచ్ఛేదము.

కారకములను గూర్చినదైన గ్రంథభాగము గాన దీని కీపేరు గలిగెను. క్రియతో నన్వయమును బొందునది లేక క్రియతో నన్వయమును గలిగించునది కారకము. కారకమన విభక్తియని ఫలితము. కర్తృకర్మాద్యర్థముల నాయా కారకములు గలుగుట మీఁద నిరూపితము. కర్తృకర్మాద్యర్థములం దాయా విభక్తులను బొందినపదములు కర్తృకర్మాదిరూపముల నాయా క్రియలతో నన్వయించెడిఁ గానఁ గ్రియాన్వయము నందునది కారకమనుట యన్వర్థము. కర్తృకర్మాద్యర్థములందాయా విభక్తులు ప్రకృతులకుఁ జేరి క్రియావాచ్యవ్యాపారమున వానికిఁ గర్తృకర్మత్వాదులం గూర్చి క్రియాన్వయము నుద్బోధించెడిఁ గానఁ గ్రియాన్వయమును గలిగించునది కారకమనుటయు సార్థకమే. ఈవిషయము కారకపరిచ్ఛేదాదిని త్రిలింగలక్షణశేషకర్తచే వివరింపఁబడినది. కర్తృ-కర్మ-కరణ-సంప్రదానా-పాదానా-ధికరణములు కారకము లని శాస్త్రకర్త లందురు. అన్వయము=సంబంధము. ఆయాయర్థములం దాయా విభక్తులు శబ్దముల కగుట యిందు నిరూపితము.

## ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమయగు ౧.

ప్రాతిపదికార్థమునందు:—రాముఁడు-రావణుఁడు. నియతోపస్థితికము ప్రాతిపదికార్థము. సంబోధనమునందు:—ఓ రాముఁడ-ఓ రావణుఁడ. ఉక్తార్థమందు:—రాముఁడు రావణుని సంహరించెను. ఉక్తమనఁగాఁ జెప్పఁబడినది. ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినది గావునఁ దద్వాచకమగు రామశబ్దమునకుఁ బ్రథమయయ్యె. రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె. ఈవాక్యమం దాఖ్యాతము కర్మమును జెప్పినదిగావునఁ దద్వాచకంబగు రావణశబ్దంబునకుం బ్రథమయయ్యె నని యెఱుంగునది

టీ. 'సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా' అను మూలము నాధారముగఁ గొని సంస్కృతవ్యాకరణానుసారియై సూరి యాయావిభక్తుల నిందు విధించెను. అర్థపదము సమాసగతపూర్వపదముల కెల్లవానికి సంబంధించెడి. కానఁ బ్రాతిపదికార్థమునందును

సంబోధనార్థమునందును నుక్తార్థమునందును బ్రథమ యగునని సూత్రార్థము లభించును. శబ్దమును బల్కినతోడనే యేయర్థమునకు నిత్యముగఁ బ్రకాశము గలుగునో యా యర్థమే ప్రాతిపదికార్థమగును. నియతోపస్థితికము=నియమమైన స్ఫురణము గలది, లేక యన్యముం ద్రొక్కి తానే యై తోఁచునది. నియత=నియమమైన లేక నిత్యమైన, ఉపస్థితికము=తోఁచుట కలది లేక ఉనికి గలది. రాముఁడు; రావణుఁడు:—క్రమముగ 'దశరథుని పెద్దకొడుకు, పులస్త్యుని పెద్దకొడుకు' అనునర్థములు నియమముగఁ దోఁచునవి ప్రాతిపదికార్థములు గాన నాయర్థముల నీరెండు ప్రకృతులకుఁ బ్రథమయుం మీఁద డుజ్వర్ణకమును సిద్ధించెను. ఇట్లే ''ఓరాముఁడ! ఓరావణుఁడ!'' అను స్థలములందు, దశరథపులస్త్యజ్యేష్ఠాపత్యవాచకరామరావణప్రకృతులకు సంబోధనార్థమునఁ బ్రథమయుఁ బురుషవ్యక్తివాచకములగుటఁ బిదప వానిమీఁద డుజాదిసంబుద్ధికార్యములును సిద్ధించెను. సంబోధనమనఁగా నెదుట వానిని దనకభిముఖునిగాఁ జేసికొన నాహ్వానించుట. 'రాముఁడు రావణుని సంహరించెను:—'ఇందు భూతార్థకమును గర్త్రర్థకమును నగు 'సంహరించెను' అను క్రియ సంహారవ్యాపారకర్తను రాముని జెప్పుచున్నదిగాన రామవాచకశబ్దార్థ ముక్తార్థమగుటంజేసి రామవాచకప్రకృతికి బ్రథమ సిద్ధించెను. ఇట్లే 'రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె'నను వాక్యమున సంహరింపఁబడియెనను కర్మార్థక లిడంతము సంహారమునందిన రావణుని జెప్పుచున్నదిగాన రావణవాచకమునకుఁ గర్మమున ద్వితీయ గలుగక ప్రథమయే గలిగెను. ఆఖ్యాతము = క్రియ. ఈసూత్రమునకుఁ గర్మాద్యర్థముల ద్వితీయాదులను విధించు మీఁదిసూత్రములెల్ల బాధకములని తెలిసికొనునది.

మిత్రుఁడు - మిత్రము - బ్రహ్మము - బ్రహ్మ - మొదలగు రూపములందు డు ము వులును వానిలోపమును లింగములను స్ఫురింపఁజేయునవి గాన నవి యనియతలింగములగుటంజేసి వానిలింగము నియతోపస్థితికము గామి 'నియతోపస్థితికము ప్రాతిపదికార్థ'మను వివరణము ననుసరించి యట్టి యనియతలింగములకుఁ బ్రాతిపదికార్థమునఁ బ్రథమ గలుగ నవకాశము లేకపోవుచున్నదనియు, జాతివ్యక్తిలింగసంఖ్యాకారకములేనును బ్రాతిపదికార్థములే యగుటంజేసి 'ప్రాతిపదికార్థమునఁ బ్రథమ యగు' అను సామాన్యోక్తిం జేసియే లింగాధిక్యమునను నట్టివానికిఁ బ్రథమ సిద్ధించెడిఁగాన నీవివరణమనిష్టముం గూర్చునది యగుటఁ బరిత్యాజ్యమనియు సుప్తార్థప్రకాశిక తెల్పుచున్నది. ఈపక్షమున నీప్రకరణమున 'అనుక్తే' అనుపదము లేదుగాన నుక్తార్థమున ననుమాట యుండనగుంగాని సంబోధనార్థమున ననుమాటయు సూత్రమున నుండ నక్కఱలేదు. లింగాధిక్యమున నెట్లు బ్రథమ కలుగుచున్నదో సంబోధనాధిక్యమునను నట్లే ప్రథమ

సిద్ధించుట నిర్వివాదము గదా. మఱియు రూపాంతరసంధానమునకై చేసిన పున్నపుంసక స్త్రీతుల్యత్వములను బున్నపుంసక స్త్రీలింగములుగ భావింపరాదను నభిప్రాయముతోడ సూరి యిట్లు వివరించెననియుఁ దోఁచెడి. శాస్త్రీయలింగమునుబట్టియే యాయావాని కాయాప్రత్యయములు నియమముగ మొట్టమొదటఁ గంఠోక్తముగ లింగమున కని విధించు నాయావిధులచే సిద్ధించుననియుఁ దుల్యత్వాతిదేశము రూపాంతరసంధానము నకై యేర్పడిన దగుట దాని ననుసరించి రజ్జుసర్పభ్రాంతిని దల్లింగములుగ వాని నెంచి యనియతలింగములుగ భావింపరాదనియుఁ, గాన నవియు నియతలింగములే యగుటం జేసి 'నియతోపస్థితికము ప్రాతిపదికార్థ'మను నిర్వచన మనిష్టముం గూర్చునది గాదనియు విశ్వసించుట యుచితమని తోఁచెడి. తెనుఁగున లింగము లేమియు మహదమహన్మహ తీత్వముల ననుసరించియే సంస్కృతసమములకును గొన్నింటి కాయాప్రత్యయములు సిద్ధించుటయుఁ బరికించిన లింగసమత్వాతిదేశమును లింగముగ నెన్నుట సూరి యెంచిన మార్గము గాదనియే తోఁచెడి. చింతామణి 'సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా' అని సూత్రించి సంస్కృతము ననుసరించియే యెల్లవిభక్తుల యునికిని గమనించుకొనవలెనని శాసించినదిగాన సూరి తదనుసారియై కారకప్రకరణమునకుఁ బాణినీయమునే యాధారముగఁ గొనెనని యెఱుంగవలయును. "ప్రాతిపదికార్థలింగవచనపరిమాణమాత్రే ప్రథమా; అనుక్తే" అను సిద్ధాంతకౌముదీసరణి నూతగఁగొని మాత్రపదమును విడుచుటంజేసి యేర్పడెడు ఫలితమును సుబోధముగ నీరీతిని సూత్రించెనని తెలిసికొనునది.

## కర్మంబున ద్వితీయయగు. ౨.

ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు. దేవదత్తుఁడు వంటకమును వండెను. ఇట వండె ననుమాటకు వంటచేసెనని యర్థము. వంట ఫలము-చేయుట వ్యాపారము - వంట యనఁగాఁ బాకము - పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మంబయ్యెనని యెఱుంగునది.

టీ. కర్మార్థమున ద్వితీయావిభక్తి సిద్ధించును. ధాత్వర్థఫలమున కాశ్రయమగు నది కర్మ మనంబడును. 'దేవదత్తుఁడు వంటకమును వండెను. వండెననఁగా వంటచేసెనని యర్థము. వంటచేయుట వ్యాపారము. వంటచేయుటకుఁ బదార్థ మొడికి వంటకము తయారగుటయే ఫలము. కాన వంటచేయువ్యాపారమునకు వంటయే ఫలమును వంట యనుఫలమున కాశ్రయమగుటంజేసి వంటకమే ఫలాశ్రయమును నగును. కాఁబట్టి యుడుకుటయను ఫలమునందిన వంటకమునకుఁ గర్మసంజ్ఞయుఁ దద్వాచకమునకు ద్వితీయయు సిద్ధించెనని తెలియవలయును. పాకము=బాగుగ నుడుకుట నందినది. ఆశ్ర

యము=ఆధారమైనది. స్థానమైనది. వంటకము=వండఁబడినది. మెత్తన యనుఫలమున కాధారమగుటంజేసి వంటకము కర్మమయ్యెనని భావము. 'కర్మణి ద్వితీయా' అనునది మూలము.

"ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱించియు ననుప్రయుక్తంబగు. సముచ్చయ గ్రహణము కూర్చి జ్ఞాపనార్థము; అయ్యాది వ్యవహితంబును నగు" అని త్రిలింగలక్షణ శేషకర్త యర్థవిశేషమునఁ గర్మమునఁ గూర్చి గుఱిచు లనుప్రయుక్తము లగునని తెల్పి పైబాలవ్యాకరణ ప్రకరణమును బూరించినాఁడు. అర్థవిశేషప్రకాశకములగు శబ్దము లగుట నివ్వానిమాట సూరి తలంపక విడుచుట యుచితము. గుఱిచియే కాలక్రమమున గుఱించి యయ్యె. గుఱి=లక్ష్యము 'గుఱి=ఉంచి' అనునదియే కాలక్రమమునఁ గుఱించి గుఱిచులుగ నేర్పడెనని తోఁచెడి. కూర్చుధాతు క్త్వార్థకరూపము కూర్చి యగుట స్పష్టము. కూర్చిని మాత్రము మూలము 'కర్మప్రవచనీయకే కూర్చిః' అని కర్మమును నొక్కిచూపునవసరమునఁ గర్మార్థకమునకుఁ జేర్పఁదగునని యన్నది. గుఱిచి నన్నయభారత ప్రయుక్తమయ్యును బ్రత్యయముగ సంభావింపదయ్యె. ఈవిధముం బరికింప సంస్కృత వ్యాకృతిపద్ధతింబట్టి వారు ప్రత్యయములుగ నాయాయర్థములందుఁ జేర్కొన్నవానికి సరియగు తెనుఁగుపదములు ప్రత్యయలక్షణలక్షితములు గాకున్నను తదర్థబోధకములగుటఁ బ్రత్యయములుగనే ప్రాచీనులును దదనుయాయులును నంగీకరించిరని గ్రహింపఁదగును.

## చేతవర్ణకంబు కర్తకగు. 3.

ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు. దేవదత్తునిచేత వంటకము వండఁబడియె - వండఁబడియెననఁగా వంటచేయఁబడియెనని యర్థము-చేయుటకాశ్రయుఁడగుటంజేసి దేవదత్తుండు కర్తయయ్యె.

టీ. 'కర్తరి తృతీయా' అనునది మూలము. కర్తృవాచకమునకుఁ జేత యను ప్రత్యయము గలుగును. ధాత్వర్థమగు వ్యాపారమున కాధారమగునది కర్తృసంజ్ఞ నందును. దేవదత్తునిచేత వంటకము వండఁబడియెను. ఇట దేవదత్తుఁడు, పాకముచేయుట యను వ్యాపారమున కాశ్రయుఁడుగాన దేవదత్తశబ్దమునకుఁ జేతవర్ణకము సిద్ధించెనని గ్రహించునది. వంటచేసినవాఁడు దేవదత్తుఁడుగాన వంటచేయువ్యాపారమునకు దేవదత్తుఁడే యాశ్రయుఁడగుట స్పష్టము. వండఁబడియె ననుదానిచే వండఁబడినవంటకమే చెప్పఁబడుచున్నదిగానఁ బూర్వసూత్రముచే దానికిఁ బ్రథమయే గలిగెననియు, దేవదత్తుఁడాఖ్యాతముచేఁ జెప్పఁబడమిని దద్వాచకమునకుఁ దృతీయ గలిగెననియుఁ గ్రహించునది, ఇట్లే క్రియచేతఁ జెప్పఁబడనపుడే యాయావానికి ద్వితీయాదివిభక్తు

లగునని యెఱుంగునది. చేయిశబ్దపునొపవిభక్తికతృతీయాసప్తమ్యేకవచనరూప మిది యనియు సంస్కృతవ్యాకృత్యనుసారముగ నైన ప్రత్యయార్థబోధంజేసి ప్రత్యయముగ సంభావ్యమయ్యెననియుఁ దలంపఁదగు.

## చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజంబగు పంచమికిని బహుళంబుగానగు. ౮.

ఫలసాధనయోగ్యం బగుపదార్థంబు హేతువు. క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. హేతువునకు:—ధనముచేత సౌఖ్యంబు గలుగు; విద్యచేత యశంబుగలుగు. పక్షంబున వలనవర్ణకంబగు. కరణంబునకు:—ఖడ్గంబుచేత ఖండించె; కోలచేతఁ గూలనేసె; పక్షంబునం దోడవర్ణకంబగు. గ్రహ్యాదియోగంబునందు:—జరాసంధుఁడు రాజుల చేతఁ గప్పంబుగొనియె. మైత్రుండు చైత్రునిచేత ఋణంబుఁ గొనియె. ఈయర్థంబును నీచేత నెఱింగితి. ఈవృత్తాంతంబు వానిచేత వింటి - పక్షంబున వలనవర్ణకంబగు. ఇత్యాదికంబు లెఱుంగునది.

టీ. తృతీయాప్రత్యయములలో నేవేవేయే యర్థములందగునో యిటనుండి తెలుపఁబడుచున్నది. ఇట్లే యాయా కారకములను నిర్దేశించునపు డాయాప్రత్యయము లర్థవిశేషములందుఁ గల్గుట ప్రత్యేకసూత్రములచే నిరూపితము. సంస్కృతమున విభక్తిప్రత్యయము లొక్కొకవిభక్తి కనేకములుగ నుండమి నర్థవిశేషములనే పేర్కొనుచు విభక్తి విధించుట యగపడును. తెనుఁగున నొక విభక్తికిసంబంధించిన శబ్దరూపప్రత్యయములు రెండుమూఁడు నాలుగు నుండుట గన్పట్టెడిఁగాన నాయాయర్థముల నాయా ప్రత్యయములు గలుగునని యాయాకారకములసందర్భమున నిరూపింపవలసి వచ్చెనని తెలియవలయును.

హేతుకరణములకును, గ్రహించుట, గ్రహించుట యర్థముగాఁగల పదముల తోడ సంబంధమునఁ బంచమీవిభక్తినందినపదముల పంచమికిని జేత యనుప్రత్యయము బహుళముగా నగును. ఫలమును సాధింప నర్హమగుపదార్థము హేతువు. పనిని సిద్ధి నొందింప మిగుల నుపకరించునది కరణము. 'ధనముచేత సౌఖ్యంబు గలుగు':—సౌఖ్యమనుఫలమును సంపాదింప యోగ్యమగుపదార్థము ధనముగాన నది హేతువు నాఁబడెడిఁగానఁ దద్వాచకధనశబ్దమునకుఁ జేతవర్ణక మీవిధిచే సిద్ధించెను. హేతువునాఁ గారణము. ధనరూపకారణముచే సౌఖ్యరూపకార్యము సిద్ధించెను. ఇట్లే 'విద్యచేత యశంబు

గలుగు' అనునుదాహరణమున యశోరూపఫలమును సాధింప విద్య యర్థాపదార్థముగాన విద్య యనుదానికిఁ జేతవర్ణకము సిద్ధించెనని యెఱుంగునది. ఈరెండుదాహృతులం దీవిధిచే హేతుకరణములకుఁ జేతప్రత్యయము సిద్ధింపని పక్షమున 9 విధిచే భవనార్థమునఁ బంచమియు వలన ప్రత్యయమును నగునుగాన ధనమువలన సౌఖ్యము గలుగును. విద్యవలన యశము గలుగు ననురూపము లేర్పడెడి. 'ఖడ్గంబుచేత ఖండించె; కోలచేతఁ గూలనేసె';-అనునుదాహృతులందుఁ గ్రమముగ ఖండనరూపవ్యాపారమును గూల నేయుట రూపమగు వ్యాపారమును సాధించుటలో నన్నిసాధనములకంటె మిక్కిలి యుపకరించినవి ఖడ్గమును గోలయునుగాన నవి కరణము లయ్యెననియుఁ దద్వాచకములకుఁ జేత యనుప్రత్యయము సిద్ధించెననియు గ్రహించునది. 'జరాసంధుఁడు రాజుల వలనఁ గప్పంబుఁగొనియె:—'9 విధిచేఁ గప్పమును గ్రహించుట రాజులనుండి యయ్యెఁగాన రాజుశబ్దమునకు వలనవర్ణకము సిద్ధించెను. ఈవిధిచే గ్రహ్యాదియోగజంబగు పంచమికిని జేతవర్ణకము సిద్ధించెడిఁగాన రాజుశబ్దమునకంటె 9 చే నైన వలనవర్ణకస్థానమునఁ జేతవర్ణకము నిలుపఁ బక్షమున జరాసంధుఁడు రాజులచేతఁ గప్పముగొనియె ననురూపము సిద్ధించెను. 'కొనియె' అనునది గ్రహణార్థకము. యోగజము = సంబంధము వలన సిద్ధించినది. యోగమనఁగ నన్వయము. ఇట్లే 'మైత్రుఁడు చైత్రునిచేత ఋణంబుఁ గొనియె' అనునుదాహరణమున 9 విధిచే గ్రహణార్థమునఁ జైత్రపదమునకు సిద్ధించిన వలనవర్ణకము స్థానమున నీవిధిచేఁ జేతవర్ణకము గలిగెనని గ్రహించునది. 'ఈయర్థము నీచేత నెఱింగితి; ఈవృత్తాంతము వానిచేత వింటి' అనునుదాహరణములందు 9 చే గ్రహణార్థమున 'నీ-వా' అనువానికి సిద్ధించిన వలనవర్ణకము స్థానమున నీవిధిచే గ్రహించుట యర్థముగాఁగల యెఱింగితి, వింటి ననుపదముల యోగమునఁ జేతవర్ణకము సిద్ధింపఁ బక్షమున నేర్పడిన రూపములని గ్రహించునది. ఇట్లే పుచ్చుకొనియె - తెలిసికొనియెను - గ్రహించెను - మొదలగునవి గ్రహణార్థకములనియుఁ దద్యోగమునఁ బంచమీ వలనవర్ణకస్థానమునఁ జేతవర్ణకము సిద్ధించుననియుఁ దెలిసికొనునది.

హేతుకరణములకు భేదమును సుబోధము చేయుటకయి 'ఫలసాధన యోగ్యము-క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకము' అనులక్షణములను సంస్కృతానుసారియై సూరి నిరూపించెను. 'సౌఖ్యము-యశము-' అనునవి ఫలములుగాని వ్యాపారములు గావు. కావున వానిని వ్యాపారములుగ నెన్ని ధనవిద్యలను వ్యాపారకరణములుగ నిరూపింప నవకాశము లేదు. మఱియు సౌఖ్యయశములంగూర్ప సాధనాంతరములు విద్యాధనములే గాక యితరము లనేకములు లోకమునఁ గన్పట్టెడిఁగాన నవి మిగుల నుపకరించుసాధనములు గాఁజాలవు. 'ఖండించుట కూలనేయుట' అనునవి

వ్యాపారములు. అట్టివ్యాపారములను సిద్ధింపఁజేయుటకు ఖడ్గము కోలయునే మిక్కిలి యుపయోగించునవి యనునంశ మవి లేకున్న నావ్యాపారము సిద్ధింపకుండుటయే నిదర్శనము కాన ధనవిద్యలు హేతువులే ఖడ్గముం గోలయుఁ గరణములే యగుచున్నవని భేదమును గుర్తించునది. ఇందు ధనవిద్యలను సౌఖ్యయశము లనుఫలములకే హేతువులుగఁ జూపఁబడెను. గుణఫలములకు సంస్కృతవ్యాకర్తలు హేతువులుగ నుదాహరించిన 'పుణ్యముచేత హరి దృష్టుఁడయ్యె. అధ్యయనముచే నివసించె' అనునట్టి యుదాహరణము లిందుఁ జూపఁబడవయ్యె. చేతవర్ణకము చేవర్ణకమునకును నుపలక్షణమని గ్రహించునది.

త్రిలింగలక్షణశేషకర్త "కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణకంబులకును, వలనవర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తంబగును. తఱచుగ ననుటచే నొకానొకచో నేకవచనంబున నుకారంబుమీఁదిద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థకమయ్యెడునని తెలియవలయును. ఈయర్థమునకు 'ఇతరత్ర చ ద్వితీయా' అనుస్థాననియమశూన్యవిధియు నవకాశమిచ్చుచున్నది. అయ్యది యొక్కచోఁ బెక్కుచోట్లకొక్కటియ చాలెడి" అనుసూత్రవివరణముల మూలమున నీవిధిని బూరించెను. ఇట్లేయిందు సూరి స్వతంత్రశబ్దములను భావనంజేసి గావలయుఁ బ్రాచీనగ్రంథములందుఁ దఱచుగఁ గన్పట్టు 'మై-మెయి-మయి-' అనుతృతీయార్థకముల మాట తలంపరేదు. 'నీచేత నెఱింగితి-వానిచేత వింటి' అనునిట్టివి సంస్కృతము ననుసరించి నిర్దిష్టములు గాని తెనుఁగు సహజమగు వాడుకకు మాత్రము విరుద్ధముగఁ దోఁచెడి. వలనవర్ణకరూగమే సహజముగఁ దోఁచెడి.

**కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుంధోడవర్ణకంబగు. ౫.**

కరణంబునందు:—కోలతోడఁ గూలనేసె. సహార్థంబునందు:—రాజు సేనలతోడ వచ్చె-సేనాసహితుండయి వచ్చెనని యర్థము. తుల్యార్థయోగంబునందు:—చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు - తృతీయకనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియు నగు.

టీ. కరణార్థమునను, సహార్థమునను, దుల్యార్థయోగమునను నగు తృతీయకుఁ దోడవర్ణకము గలుగును. అనఁగా కరణార్థకమగు శబ్దమునకును సహార్థకమగుశబ్దమునకును దుల్యార్థకములతోడ నన్వయించెడి శబ్దములకును దోడ ననుప్రత్యయము సిద్ధించునని భావము. కరణమనఁ గ్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకమనియుక్తము. సహా

ర్థకమనఁ గలయుట, కూడియుండుట యనునర్థమిచ్చునది. తుల్యార్థకమన సమము సాటి సరి యనునర్థమిచ్చునది. కోలతోడఁ గూలనేసె:—కూలనేయుటకుఁ గోల ప్రకృష్టోపకరణముగానఁ గోల కరణమయ్యెననియుఁ దద్వాచకముకంటెఁ దోడవర్ణకము సిద్ధించెననియు నెఱుంగునది. రాజు సేనలతోడ వచ్చె రాజునకుఁ బాసటయై వచ్చినవి సేనలుగాన సేనలనునది సహార్థకమై తోడవర్ణకము నీవిధిచే బొందెనని గ్రహించునది. సేనలు సహార్థకమని యొఱిఁగింప సేనాసహితుండయియనువివరణమును సూరి వ్రాసెనని గమనించునది. చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు:—ఇందుఁ దుల్యపదము చైత్రపదముతో నన్వయించెడిఁ గాన చైత్రశబ్దము తుల్యశబ్దయోగమునఁ దోడప్రత్యయము నందెనని గ్రహించునది. ఇట్లే సరి-సాటి-సముఁడు మొదలగు తుల్యార్థకములతోడి యోగమునను, దోడవర్ణకమగుట యూహ్యము. తోడవర్ణక మగునని సామాన్యముగ ననక తృతీయకనుటంజేసి తృతీయ వివక్షించునపుడే తుల్యార్థయోగమునఁ దోడ వర్ణకమగుననియు లేకున్న కుషష్ఠియే యగుననియుఁ దానఁ జైత్రునకు మైత్రుండు తుల్యుండను మొదలగునవియు సాధువులే యనియుఁ దృతీయకనుటంజేసి యను సూరి వివరణమున కభిప్రాయము. అనఁగా నీతృతీయ, కుషష్ఠికైనదే యనియు సహజకారకము తుల్యార్థయోగమున షష్ఠియే యనియు భావము. కర్తృకర్మాదులందప్పు నెల్లయర్థముల నీతుల్యార్థమందేగాక సామాన్యముగఁ దెలుఁగున కుషష్ఠియే ప్రాచీనకావ్యములందును సహజమై చూపట్టెడి. (చూ. ప్రౌఢ. కా. ప. 13.) సంస్కృతవ్యాకరణకారకప్రకరణము ననుసరించి కారకముల విధించుటేగాని తెనుఁగున కవి యసహజములై పొసఁగమి నిందెన్నోయంశములు నిరర్థకములనుట యనుచితముగాదు.

త్రిలింగలక్షణశేషకర్త "ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేకప్రయోగంబును జూపట్టెడి. కొన్నియెడల నుశబ్దప్రయోగంబునం దోడకు లోపంబును వ్యవహితత్వంబును బహుత్వంబునం గానంబడియెడి. ఒకానొకచోఁ దోడకుఁ దోడుత నని రూపాంతరంబును గలదు, అయినను దానికివలె దీని కితరకార్యంబు గలుగదు." (ఇతరకార్యము=7 సూత్రవిహితకార్యము మొదలగునది) అని యీ బాలవ్యాకరణ తోడ విధానమును బూరించెను. దీనింబట్టి తోడుతనుండి 'తోడ-తో' అనునవి యేర్పడినవనియుఁ దొలుతటి రూపముతోడుత యనియు నిట్లే యర్థవంతములగు శబ్దభాగములయక్షరములు లుప్తములగుట నానాఁటికిఁ బ్రత్యయములయుత్పత్తి గలిగెననియుఁ బాఠకులకు సుబోధమె గదా. 'సాహాయ్యము=తోడు-వెంట' అనునర్థములందుఁ దోడనిప్రయోగము లగపడుచుండుట విదితము గదా! దీనఁ దోడుశబ్దపు నన్నంతరూపమిదియనుటఁ బునరుక్తము. కవివ్యవహారమునను, నిది నేఁడు, తోటిగా మాఱుట గాననగును.

## వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడకువర్ణకంబులు ప్రాయికంబుగానగు. ౬.

మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె - మైత్రుండు చైత్రున కిట్లనియె ప్రాయికం బనుటచే నొకానొకచో ద్వితీయయునగు

టీ. వచ్ ధాతువునకు భాషణమర్థము. వచించు-పలుకు-అను చెప్పు-మొదలగునవి వచ్ ధాత్వర్థకములు. ఇట్టివచ్యర్థకధాతుప్రయోగమున వానియముఖ్యకర్మమునకుఁ దోడ వర్ణకముగాని కువర్ణకముగాని ప్రాయికముగ నగును. ప్రాయికమనుటచే ద్వితీయయుఁ గొన్నిచోటులందుఁ గావచ్చును. అనఁగాఁ దోడకువర్ణకంబులు తఱుచుగను ద్వితీయ క్వాచిత్కముగను బ్రయోగములందుఁ జూపట్టెడినని భావము. అను-పలుకు మొదలగు వచ్ ధాత్వర్థకములు ప్రయోగింపఁబడిన వాక్యమున ముఖ్యాముఖ్యకర్మములు రెండు నుండుట సహజము. అట్టివాక్యమున నేశబ్దము ద్వితీయనేగాని యితరవిభక్తిని బొందఁదగదో యది ముఖ్యకర్మమనియు, నేశబ్దము ద్వితీయను దృతీయాషష్ఠులను సందర్భానుసారముగఁ బొందఁదగునో యది యముఖ్యకర్మ మనియుం నెఱుంగవలెను. అముఖ్యమునకు గౌణమని వ్యవహారము గలదుగాన నముఖ్యకర్మమును గౌణకర్మమని వ్యవహరింపఁదగును. 'మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె' ఈవాక్యమున 'అనియె' అనునది వచ్యర్థకము. 'అనియె' అనుదానికి మాటాడెననియుం నర్థము. కాన నిది సామాన్యముగ నంతర్గతకర్మార్థక మయ్యెడి. అనినమాట తీరును తెల్పునదిగాన 'ఇట్లు=ఇట్టిమాటను' అనునది ముఖ్యకర్మము. అనినది చైత్రునిగూర్చిగానఁ జైత్రపదముముఖ్యకర్మము. ఇట్లు=ఇట్టిమాటను అనెనను వచ్యర్థమున కముఖ్యకర్మమైన చైత్రశబ్దమునకుఁ దోడ కువర్ణకము లీవిధిచే సిద్ధింప 'చైత్రునితోడ నిట్లనియె-చైత్రున కిట్లనియె' అని రూపద్వయము గలుగును. ద్వితీయ యైనఁజైత్రుని నిట్లనియెనని రూపమేర్పడును. తోడవర్ణకయోగమే యాంధ్రభాషాసహజముగఁ దోఁచెడి.

## ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు. ౭.

నియమపూర్వకవిద్యాస్వీకారం బుపయోగం బనంబడు. రామకృష్ణులుసాందీపునితోడ వేదంబులం జదివిరి-సాందీపునివలన నని యర్థము.

టీ. నియమముంగొని విద్యను గ్రహించుట యుపయోగశబ్దమున కర్థము. ఆఖ్యాత=చెప్పువాఁడు-విద్యను జెప్పు గురువని భావము. నియమమనఁగా విద్యనభ్యసించునపు డుండవలసిన కట్టుఁబాటులని భావము. నియమపూర్వకవిద్యాగ్రహణమర్థముగాఁ

గలవాక్యమున విద్య గఱపుగురువును జెప్పెడిపదమునకుఁ దోడప్రత్యయము గలుగునని సూత్రార్థము. 'రామకృష్ణులు సాందీపునితోడ వేదంబులం జదివిరి':—ఈవాక్యమున రామకృష్ణులచేఁ జేయఁబడు నియమపూర్వకవిద్యాస్వీకారము ప్రకాశమగుచున్నది గాన వారలవిద్యాగురువగు సాందీపునిఁ జెప్పు సాందీపశబ్దమునకుఁ దోడవర్ణకము సిద్ధించెనని యెఱుంగునది. సాందీపునితోఁ గలిసి చదివిరను ననిష్టార్థము తోడప్రత్యయము చేరికచేఁ గలుగునేమో యని యనుమానించి సూరి సాందీపునివలనని యర్థమని వివరించెనని యెఱుంగునది. ఇట్టిచోటుల గ్రహణార్థమున నాఖ్యాతకు వలనవర్ణకము గలుగుటయే తెలుఁగు వాడుకకు సహజముగాని తోడవర్ణకము సహజము గాదు. మఱియు నొద్ద వద్ద యనుపదముల చేర్పుతోడనే యిట్టియర్థమున నాఖ్యాత యొప్పుట సహజమై గన్పట్టును. ఇట్లనుటకుఁ బై సూరివివరణమును, వ్యవహారమును, సంస్కృతమునందును సంస్కృతలక్షణానుసారులగు లాక్షణికప్రయోగములందును దప్ప, నిట్లాఖ్యాతకుఁ దోడవర్ణకమైన ప్రయోగములు క్వాచిత్కము లగుటయును, బ్రమాణములు. కానఁ గేవలము తెలుఁగువాడుకకు విరుద్ధవిషయ మిది యన సందియము లేదు.

## సంప్రదానంబునకుం జతుర్థి యగు. ౮.

త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు జనకుండు రామునికొఱకుఁ గన్య నిచ్చెను. కొన్నియెడల నుద్దేశ్యమాత్రంబున కగు. పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు. చతుర్థికి మాఱుగా షష్ఠియె తఱచుగాఁ బ్రయోగంబులం గానంబడియెడి. జనకుండు రామునకుం గన్యనిచ్చెను - పురుషార్థంబునకు యత్నింపవలయు.

టీ. త్యాగమన దానము. దాన మేవాని కీయఁ దలంతుమో యవ్వాఁడు సంప్రదానము నాఁబడును. దానము చేయఁదలంచి యెవని నర్థినిగా నక్కార్యమున నిర్ణయింతుమో యవ్వాడె సంప్రదాన మనంబడునని సూరి వివరణమున కభిప్రాయము. సంప్రదానము నాఁబడువానిం జెప్పుపదమునకుఁ జతుర్థీవిభక్తి యగును. 'జనకుండు రామునికొఱకుఁ గన్య నిచ్చెను':—ఈయుదాహరణమునఁ గన్యాదానవిషయమున రాముఁ డుద్దేశ్యుఁ డయ్యెగాన రాముఁడు సంప్రదానంబును దద్వాచకమునకుఁ జతుర్థియుఁ గొఱకువర్ణకమును నీవిధిచేఁ గలిగెను. కొన్నిచోటులఁ ద్యాగము లేకున్నను దలంపఁబడినదానికే సంప్రదానసంజ్ఞయుఁ జతుర్థియుఁ గలిగెడి. 'పురుషార్థముకొఱకు యత్నింపవలెను':—ఇందు యత్నించుటలోఁ బురుషార్థ ముద్దేశ్యముగాన నుద్దేశ్యమాత్రముననే పురుషార్థశబ్దమునకుఁ జతుర్థి సిద్ధించెను. దానవిషయకోద్దేశ్యమునను

నుద్దేశ్యమాత్రమునను జతుర్థి కలుగనగునని ఫలితము. ఇట్టిస్థలముల నుద్దేశ్యమునకు శాస్త్రము చతుర్థియందుఁ గొఱకువర్ణకము విధించుచున్నను షష్ఠియే తఱచుగ ప్రయోగదృష్టమగుటంజేసి సూరి 'చతుర్థికి మాఱుగా షష్ఠియే తఱచుగాఁ బ్రయోగంబులం గానంబడియెడి'నని వివరింపవలసి వచ్చెనని గ్రహించునది. దీనినిబట్టి తెలుఁగునఁ గుషష్ఠి కితరకారకములకంటెఁ గలబలము పాఠకులకు సుబోధమయ్యెడి. 'రామునకు - పురుషార్థమునకు' అనునీరెండును గ్రమముగఁ దాదర్థ్యోద్దేశ్యోద్దేశ్యమాత్రములకుఁ గుషష్ఠి యగుట కుదాహరణములు.

నిమిత్తార్థకప్రయోగవిషయమునను గొఱకువర్ణకము ప్రయోగదృష్టము. కొఱకనుదానికిఁ బ్రయోజన మర్థముగాన ఫలార్థకమగు నిమిత్తాదులస్థానము నది యందుట యుచితమె. కొఱమాలీత్యాదులందుఁ బ్రయోజనార్థకమై కొఱ ప్రత్యేకముగ గనపడుట తెల్లము. మఱియుఁ జతుర్థికిఁ బొంటెవర్ణకము ప్రాచీనప్రయోగదృష్ట మగుటం జేసి త్రిలింగలక్షణశేషకర్త 'చతుర్థికిం బొంటెవర్ణకంబు నగు' అని యీసూత్రమును బూరించినాఁడు. 'కై-కయి-' అనునవి కుషష్ఠిపై 'ఐ-అయి' చేర్చుటచే నైనవిగాన వానిని చతుర్థీ స్వతంత్రప్రత్యయములుగ లెక్కింప నక్కఱలేదు గాని యీలక్షణకర్త దానినిగూడఁ జతుర్థీప్రత్యయముగా నెన్నుటంజేసి కొఱకు వర్ణకస్థానమునఁ బక్షమున నవియుం నిల్వవచ్చునని గ్రహించునది.

**అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవనత్రాణవిరామాంతర్ధి వారణంబు లెద్దానననగు దానికి వలనవర్ణకం బగు. ౯.**

అపాయము - విశ్లేషము. భయము - వెఱపు. జుగుప్స - ఏవ పరాజయము - ఓడయ్యుట. ప్రమాదము - పరాకు. గ్రహణము-కొనుట-ఎఱుంగుట - వినుట-ఇత్యాది. భవనము - పుట్టుట. త్రాణము-కాచుట. విరామము - విరమించుట. అంతర్ధి - మఱుఁగుట. వారణము - వారించుట. అపాయంబునకు:—మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుం డయ్యె. భయంబునకు:—చోరునివలన భయపడియె. జుగుప్సకు:—పాపంబు వలన నేవగించె. పరాజయమునకు:—అధ్యయనమువలన డస్సె. ప్రమాదంబునకు:—పాడివలనం బరాకుపడియె. గ్రహణంబునకు:—మైత్రుని వలన ధనంబుగొనియె. భవనంబునకు:—మనువువలనం బ్రజలుపుట్టిరి. త్రాణంబునకు:—చోరునివలనం గాచె. విరామంబునకు:—భోగంబుల వలన విరమించె. అంతర్ధికి:—కృష్ణుండు తల్లివలన దాఁగె. వారణంబు

నకు:—శోకంబువలన వారించె. ఈపంచమికి షష్ఠియుం గొండొకయెడల నగు. చోరునకు వెఱచె-పాపంబున కేవగించె-అధ్యయనంబునకు డస్సె-పాడికిం బరాకుపడియె - మనువునకు నిక్ష్వాకుండు పుట్టె ఇత్యాదులూహించునది.

టీ. విశ్లేషభయాదుల నేది గలిగించు నద్దానిం జెప్పుపదముమీఁద వలనవర్ణకము గలుగును. అపాయమన విశ్లేషము. విశ్లేషమనఁగా నెడఁబాటు-విడివడుట యని భావము. భయమనఁగా వెఱపు. భీతి యని యర్థము. జుగుప్స యన నేవగింపు. పరాజయమన నలయుట. ప్రమాదమనఁ బరాకు-ఏమఱుట. గ్రహణమన గ్రహించుట. వినుట-కొనుట-తెలియుట-ఎఱుంగుట మొదలగునవి గ్రహణార్థకములు. భవనము - పుట్టుక - ఉత్పత్తి యని యర్థము. త్రాణము=రక్షణము. విరామమన నుడుగుట మానుట యని భావము. అంతర్ధియన మఱుఁగుట-దాఁగుట యని యర్థము. వారణము - వారించుట - మరలించుట యని యర్థము. పైని పేర్కొన్నవి దేనిమూలముగఁ బుట్టునో దానిం జెప్పుపదముకంటె వలనప్రత్యయము గలుగునని సూత్రార్థము. 'మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె' మైత్రునకును రాజ్యమునకును నెడఁబాటు గలిగె. ఈవిశ్లేషము రాజ్యావధిగాన రాజ్యశబ్దముమీఁద నీవిధిచే వలనవర్ణకము గలిగెనని గ్రహించునది. 'చోరునివలన భయపడియె' భయము గలుగుటకుఁ జోరుఁడు మూలముగానఁ దద్వాచకముమీఁద వలనవర్ణక మీవిధిచే సిద్ధించెను. 'పాపంబువలన నేవగించె' ఏవగింపు గలుగుటకుఁ బాపము గారణముగానఁ బాపశబ్దమునకంటె వలనప్రత్యయము గలిగెను. 'అధ్యయనమువలన డస్సె' బడలికనందుట కధ్యయనము మూలముగాన నధ్యయనశబ్దముమీఁద వలనవర్ణకము సిద్ధించెను. 'పాడివలనం బరాకువడియె' పరాకునకు పాడి యవధిగానఁ బాడిశబ్దమునకంటె వలనవర్ణకము గలిగె. ధర్మ మేమఱెనని భావము. 'మైత్రునివలన ధనంబు గొనియె.' ధనగ్రహణమునకు మైత్రుఁ డవధిభూతుఁడుగాన మైత్రవాచకమునకు వలనవర్ణకము గలిగెను. 'ఈయర్థంబు వానివలన వినియె' నిత్యాదులు గ్రహణార్థకములకుదాహృతులు. 'మనువువలనం బ్రజలు పుట్టిరి' ప్రజలయుత్పత్తికి మను వవధిభూతుఁడుగానఁ దద్వాచకమనుశబ్దముమీఁద వలనవర్ణకము గలిగె. 'చోరునివలనం గాచె' ఇట రక్షణము చోరమూలకముగానఁ జోరపదముమీఁద వలనప్రత్యయము సిద్ధించెను. 'భోగంబులవలన విరమించెను' ఇట విరామమున కవధి భోగముగానఁ దద్వాచకభోగశబ్దమునకు వలనవర్ణకము గలిగె. 'కృష్ణుండు తల్లివలన దాఁగె' ఇట దాఁగుటకుఁ దల్లి యవధిగానఁ దల్లిశబ్దము వలనవర్ణకము నందెను. 'శోకంబువలన వారించె' ఇట దుఃఖవంతునకు దుఃఖమునుండి వారణము జరిగెఁగాన దుఃఖవాచకమగు శోకశబ్దమునకు మీఁద వలన

వర్ణకము సిద్ధించె. ఈసూత్రముచే నగుపంచమికి బదులుగఁ గొన్ని యుదాహరణము లందుఁ గుషష్ఠియుఁ బ్రయోగములం దగపడునని యీపంచమి కను సూరివివరణమున కభిప్రాయము. 'చోరునకు వెఱచె':—ఇచ్చో వలనవర్ణకమునకుఁ గుషష్ఠి కలిగెను. ఇట్లే తక్కిన యుదాహరణములందు వలనకుఁ గువర్ణకమగుట యూహ్యము. తెలుఁగునఁ గుషష్ఠి తక్కిన కారకములకంటెె బలమనుట కీసందర్భ మొక నిదర్శనము. వలను శబ్దము నన్నంతరూప మిదియనుట స్పష్టము. కాలక్రమమున నిది 'వల్ల' అనురూప మందె. 'చలిమలవల్లనుల్లసిలు; దక్షిణాంసమూచుకనయనప్రకంపగుణసూచన లేమియు వల్లఁగావు' అను మనుచరిత్ర పారిజాతాపహరణప్రయోగములలో మొదటిది ప్రత్యయమగుటను, రెండవది రూపాంతరపరిణామమందిన విశేషణశబ్దమగుటను విశదపఱచెడి. ఇట్లే వలంకులను రూపమునుండి వంక యేర్పడి పంచమీప్రత్యయార్థాభిదాయకమయ్యె ననుట యుచితము. (15 A. D.) శతాబ్దికిఁబూర్వ మిట్టివి గ్రాంథికభాషను దోఁపమినో; రూపాంతరములను గూడఁ బేర్కొనుట గ్రంథవిస్తృతికారణమును, తనమార్గమునకు సరిపడనిదియును నగుటనో; యిట్టివానిని బ్రత్యయములుగ సూరి లెక్కింపఁడయ్యె. ఇట్లనుటకు 'కుండ' (ఇదే కూడ యైనది) అనుదానిని బ్రత్యయముగ గణింపకుండుటయు నొక ప్రమాణము.

ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తంబగు. ౧౦.

హిమగిరివలననుండి గంగవొడమె - నాకంబువలననుండి నారదుండు వచ్చె.

టీ. 'ఉండి' ఇది యుండుధాతు క్త్వార్థకరూపము. పూర్వసూత్రముచే సిద్ధించిన వలనవర్ణమునకుమీఁద 'ఉండి' అనుపదము గలుగును. అనుప్రయుక్తము=వెంటఁ గలుగునది. వలనవర్ణకమున కవ్యవహితపరముగ నుండి యగునని తాత్పర్యము. ఇది వలనవర్ణకము వెంటనుండి పంచమ్యర్థమును బాగుగఁ దెలిపెడి. 'హిమగిరివలననుండి గంగపొడమె' ఇట భవనార్థమున నవధిభూతమగు హిమగిరికిఁ బూర్వసూత్రముచే వలనవర్ణకమును నీసూత్రముచే దానిమీఁద నుండిపదంబును గలిగెఁగాన 'హిమగిరివలన నుండి' యనురూప మేర్పడెను. 'నాకంబువలననుండి నారదుండు వచ్చె' ఇట నారదునకును నాకమునకును విశ్లేషము గలిగెఁగాన విశ్లేషావధియగు నాకమునకుఁ బూర్వసూత్రముచే వలనవర్ణకమును నీవిధిచే వలనమీఁద నుండిపదంబును సిద్ధించి 'నాకంబువలన నుండి' యనుప్రయోగము గలిగెను. ఈయుండిపదమవధిని స్పష్టపఱచునదిగానఁ దన్మూలమున వలనవర్ణకమును సార్థకమయ్యెడి.

**ఉండిశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు. ౧౧**

వనమునుండివచ్చె - వనమందుండివచ్చె - ఊరినుండివచ్చె ఊరనుండివచ్చె. వనమునుంచి ధనమునుంచి యని యుంచిశబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరుగాని యది సాధుకవిప్రయోగారూఢంబుగాదని యెఱుంగునది.

టీ. వలన కనుప్రయుక్తమైన యుండిపదము పరముగ నిల్చి యుండ వలనవర్ణకమునకు ద్వితీయగాని సప్తమిగాని తఱచుగఁ గలుగును. ఉండిని దరువాత నుంచికొనిన వలనకేగాని యుండిలేని వలనవర్ణకమున కీవిధి గలుగదని గ్రహించునది. ఉండి పంచమ్యర్థప్రకాశకమగుట నది నిల్చియున్న ద్వితీయాసప్తములలో నేది వలనవర్ణకమునకైనను బంచమ్యర్థస్ఫురణమునకు భంగము గలుగదుగాన నుండివెంబడించి యున్న వలనకే ద్వితీయాసప్తములు గలుగుట సంభవించె. సామాన్యముగ ద్వితీయాసప్తములన్నను 'ను-న-అందు' అనునవియే గలుగునని గ్రహించునది. 22 చే సప్తమికి ద్వితీయ యగుంగాన ద్వితీయ సప్తమ్యర్థబోధకమగుట స్పష్టము. అవధిభూత మధికరణార్థక మగుటయు స్పష్టమె. కాన నవధిభూతపదార్థవాచకములకు వలనవర్ణకమే గాక సప్తమియు సప్తమ్యర్థకద్వితీయయు సంభవించుట సహజమె. కాని యుండిపద మున్నపుడె యవధిభూతములయధికరణత్వము స్పష్టపడియెడిఁగాన నాస్థితియందె వలనకు ద్వితీయాసప్తములు గలిగెడి. ఉండి యనుదానికి వసించి యని గదా యర్థము. వాసస్థాన మధికరణమగుట కడ్డంకి లేమి స్పష్టము.

'వనమునుండి వచ్చె-వనమందుండి వచ్చె' ఇట వచ్చినవానికిని వనమునకును విశ్లేషమయ్యెఁగాన విశ్లేషావధియగు వనమునకు 9 చే వలనవర్ణకమును, నావలనకు 10 చే నుండియుఁ గలిగి 'వనమువలననుండి' అని యైనపిదప నీవిధిచేనైన ద్వితీయాసప్తములలో ద్వితీయ గల్గినపక్షమున 'వనమునుండి వచ్చెన'నియు, సప్తమి యైనపక్షమున 'వనమందుండి వచ్చె'ననియు రూపము లేర్పడును. ఇట్లే వలనకు ద్వితీయ గల్గినపక్షమున 'ఊరినుండి వచ్చె'ననియు, సప్తమి సిద్ధించినయెడల 'ఊరియందుండి వచ్చె'ననియు రూపములగుటను గమనించునది. ప్రాయిక మనుటంజేసి సాధారణముగ నుండిపదము పరమగునపుడు ద్వితీయాసప్తములే వలనస్థానమునఁ జూపట్టుననియు, వలననుండి యని యుండుట క్వాచిత్కమనియు సూచితము. ఆధునికులు కొంద ఱుండిపదమునకు బదులుగా నుంచిని వలనమీఁదఁ జేర్చి వలన కది పరముగా ద్వితీయగూర్చి "వనమునుంచి వచ్చె,

ధనమునుంచి కలిగె'ననురీతిని వ్యవహరింతురుగాని యీరీతి ప్రాచీనకవిప్రయోగారూఢము గామి నగ్రాహ్యమని సూరి వ్రాసిన 'వనమునుంచి ధనమునుంచి' యనువివరణమున కభిప్రాయము. సాధుకవిప్రయోగారూఢము=మంచికవియని ప్రసిద్ధికెక్కినకవియొక్క గ్రంథములఁ బ్రసిద్ధము. తత్త్వమరయ వనమునుంచి వచ్చె నిత్యాదులందు "వనము నట నునిచి యిటకు వచ్చె"నను నర్థమును దెల్పుచుఁ బ్రధానముగ నుంచుధాతు క్త్వార్థకరూపము వనమునకునువచ్చినవానికిని నైన విశ్లేషమును నుండిపదమువలెనే ప్రకటింపఁ జాలియున్నది గాన నిట్టివ్యవహారమును సరసమే యని యంగీకరించుట యసముచితము గాఁజాలదు. లాక్షణికులు వ్యవహారమునుగాక సాధుకవివ్యవహారము నాధారముగఁ గొనువారగుటఁ దదారూఢము గానిదాని నగ్రాహ్యమని తలంతురుగాన లాక్షణికుఁడగు సూరి లాక్షణిక మార్గమునే యనుసరించి యీవివరణమును వ్రాసెనని గ్రహించునది. అందును నాంధ్ర వాఙ్మయమునఁ బ్రాచీనపుఁ గావ్యభాషనే సాధువుగ నెన్ను సూరి యిట్లు వ్రాయుట వింత గాదు. సూరి వలనకు సప్తమి యగుట కుదాహరణము నందువర్ణకము చేర్చియేగాని నవర్ణకమును గూర్చి యుదాహరింపకుండుటచేతను, ద్వితీయమీఁది యుండికిని నంద్వితర సప్తమ్యర్థకములమీఁది యుండికిని లోపము కవిప్రయోగదృష్ట మగుటచేతను, త్రిలింగ లక్షణశేషకర్త 'ఉండిపదము పరమగుచో వలన కందువర్ణకమట్ల నవర్ణకంబునగు'అనియు, 'వలన కాదేశంబగు ద్వితీయాసప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగానగు' అనియు సూత్రించి, "బహుళగ్రహణముచే నందుమీఁది యుండికి లోపము గలుగదు. ఈ సూత్రము నిట్లు చెప్పుటకు నంద్వితరసప్తమ్యర్థకవర్ణకములమీఁదియుండికి లోపము వచ్చుట ప్రయోజనంబు" అని వివరించి సూరి యీసందర్భమును బూరించినవాఁడు. ద్వితీయాసప్తములను సామాన్యవిధానమునం జేసియే యందువర్ణక మెట్లట్ల నవర్ణకమును సూరికి సిద్ధించుచుండుటం జేసియు, ద్వితీయమీఁదనున్న యుండికిని సప్తమ్యర్థకముల మీఁద నున్నయుండికిని లోపము ప్రాచీనప్రయోగములం దగపడమిం జేసియు, సూరి త్రిలింగలక్షణశేషమార్గము నాదరింపఁడయ్యెను. నిజమరసినను విశ్లేషావధి లేక యధికరణార్థమును స్పష్టపఱుపఁజాలెడు నుండిని లోపింపఁజేసి ప్రయోగించుట యర్థపుష్టికిఁ గొఱంత యనక తీరదు. కావుననే యిట్టియుండి లోపించిన ప్రయోగములు దొలుతటి తెలుఁగుఁ గబ్బముల మృగ్యములయ్యె. నన్నయప్రయోగముల నుండి పరముగా సప్తమియె దృష్టము. సప్తమీస్థానమున ద్వితీయ రానురాఁ గలుగ ద్వితీయయుఁ దోఁచి యుండనగును. తృతీయార్థకమగు 'చేసి' అనుదానివలె "ఉండి-ఉంచి" మొదలగునవి విభక్తులమీఁద ననుప్రయుక్తములగునవి గావునను, వీనిపై విభక్త్యర్థములుగాని విభక్తులు గాని చేరవుగావునను, విభక్త్యర్థములను స్పష్టపఱచునవి గావునను, నిట్లు విభక్త్యర్థ

ములం జెప్పునవి విరివిగ నగపడును గావునను, వీని నప్రయుక్తశబ్దములుగనే, సూరి సంభావించెననితోఁచెడి. వాక్యమునందలి పదములకుఁగల సంబంధమును దెల్పునవి ప్రత్యయములగుననుసామాన్యలక్షణము గ్రహించి యానంతరలాక్షణికు లిట్టివానిని గూడ విభక్త్యర్థములుగ భావించియుందురనియుఁ, బ్రాచీనమతానుసారియై సూరి యట్లు సేయఁడయ్యెననియుఁ దోఁచెడి.

## కంటెవర్ణకం బన్యార్థాదియోగజం బగు పంచమి కగు. ౧౨.

రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు - లోభంబు కంటె నితరంబు దోషంబు లేదు. ఇచట షష్ఠియు నగు. రామున కన్యుండు ధానుష్కుండు లేఁడు. అన్యము - ఇతరము - పూర్వము - పరము - ఉత్తరము ఇత్యాదు లన్యాదులు.

టీ. అన్య మొదలగుపదములతోడి యన్వయమున నగు పంచమికిఁ గంటెప్రత్యయము గలుగును. ఒకదానియందైన యతిశయమును బోధింపవలసివచ్చినపు డితరమును జూపవలసివచ్చును గాన నట్టియెడల నన్యార్థకములు ప్రయుక్తము లగుటయు వానితోడ నతిశయవంతమగుపదార్థమును జెప్పుపదము కంటె వర్ణకమును బొంది యన్వయించుటయుం సహజములు. ఈసూత్రము క్రింద నిచ్చిన యేనును నట్టి సంస్కృతపదములును గాక యింక నట్టివానికి సమానార్థకములుగాఁదగు సంస్కృతాచ్ఛికములును నన్యార్థములై యాదిపదగ్రాహ్యము లగును. 'వెఱ-వేఱొక' మొదలగునవి యాచ్ఛికాన్యార్థములు. 'రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు' ధనుర్విద్యాపాటవమున రాముని మించినవాఁడు లేఁడను విషయమును వ్యక్తీకరింప నేర్పడిన యీవాక్యమున ధనుర్విద్యాతిశయము గల రాముని జెప్పెడు రామశబ్దమునకుఁ బంచమిని గంటెవర్ణకమన్యశబ్దాన్వయమున నీవిధిచే సిద్ధించెను. 'లోభంబుకంటె నితరంబు దోషంబు లేదు' ఎల్లదోషములలో లోభమనునది పెద్ద దోషమను విషయమును విశదీకరింప నేర్పడిన యీవాక్యమున లోభముయొక్క యతిశయదోషత్వమును దెలుపునదై పంచమిని గంటెవర్ణకంబన్యార్థకమగు నితరశబ్దయోగమున లోభశబ్దమునకుఁ గలిగెను. ఇట్టిచోటులం గంటెవర్ణకస్థానమునఁ గుషష్ఠియు నయ్యెడి. కాన 'రాముస కన్యుండు ధానుష్కుండు లేఁడు' అను మొదలగు ప్రయోగములు సిద్ధించెడి. కవిప్రయోగారూఢమైనను గువర్ణకమిట్టిచోటుల నర్థపుష్టిని గలిగింపనియట్లు తోఁచెడి. 'కంటె' అనునది నిజముగ 'కు + అంటేన్' అనువానియోగమున వ్యవహారమునఁ గల్గినను భూతకాలికమధ్యమైకవచనమగునను ధాతురూపము (అంటివి) మీఁద 'ఏని' అనుదానింగూర్చి వకారలోపమొనర్చి

యేని శబ్దైకారమును లోపింపఁజేసి 'అంటేన' అనునంతవఱకే వ్యాకృతింబట్టి సాధింప వలనుపడుచుండుటచేతను, 'అంటే' అనుదానిలోని 'టే' మీఁది యేనిశబ్దపు నేకారమునకు హ్రస్వము సాధింప నవకాశము లేకుండుటచేతను, నెదుటనున్నవానినిగూర్చియే గాక సామాన్యముగ నెల్లవానివిషయమును నిది తెల్పవలసి ప్రయుక్తమగుచుండుటచేతను లాక్షణికు లాచిక్కులలోఁ బడక ప్రత్యయమనిరి. కన్న:—(కు + అన్న) అని సాధింప నగుంగాన దీనిని బ్రత్యయమనరైరి." అని సామాన్యదృష్టికి వీనివిషయమునన్నైన లాక్షణికాశయము తోఁచెడి.

## కంటెవర్ణకంబు నిర్ధారణపంచమి కగు. ౧౩.

ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబు కలిగియుండు నచటం బంచమియగు-ఆ పంచమికిం గంటె వర్ణకంబగునని యర్థము. జానపదులకంటె నాగరులు వివేకులు. మానహానికంటె మరణము మేలు.

టీ. నిర్ధారణమన నిశ్చయము. వేఱుచేయుట. నిర్ధారణము జాతిగుణక్రియల కగును. వేర్వేఱుజాతులలో నొకజాతికిఁ గాని వేర్వేఱుగుణములలో నొకగుణమునకుఁ గాని వేర్వేఱు వ్యాపారములలో నొకవ్యాపారమునకుఁగాని నిర్ధారణము చేయవలసి వచ్చినపు డట్టినిర్ధారణమున కవధిభూతమగుదానిని బోధించుపదముమీఁదఁ గంటె వర్ణకము గలుగునని భావము. దీనింబట్టి పంచమీనిర్ధారణమున నిర్ధారితమగునది స్వజాతిలోఁ గాని స్వగుణములోఁగాని స్వవ్యాపారములోఁ గాని యుండినది గాకుండునని తేలినది. నిర్ధార్యమాణము=నిశ్చయింపఁబడునది. ఈపంచమీనిర్ధారణమున నిశ్చితమగు నది జాతిగుణక్రియలచే భేదము నే గలిగియుండునని యాక్రింది సూరివివరణమున కభిప్రాయము. ఇందు నిర్ధార్యము తనజాతిగుణక్రియలకంటె భేదించి యుండునని తాత్పర్యము. 'జానపదులకంటె నాగరులు వివేకులు.' ఇట నాగరులు నిర్ధార్యులు. ఇట్టి నిర్ధారణమున కవధిభూతులు జానపదులుగానఁ దద్వాచకమునకుఁ గంటెవర్ణకము సిద్ధించెనని గ్రహించునది. ఇందు నిర్ధార్యమాణులు నాగరులు జానపదులకంటె భిన్నులు గాన నిర్ధార్యము జాతిచే భేదంబె గలిగియున్నదనుట స్పష్టము. 'జానపదులు వేఱు. 'నాగరులు వేఱు.' అనునంశము తెల్లము. 'మానహానికంటె మరణము మేలు.' ఇట మరణము నిర్ధార్యము. ఇట నిర్ధారణమున కవధి మానహానిగానఁ దద్వాచకము మీఁదఁ గంటెవర్ణక మీవిధిచే సిద్ధించెను. మానహాని మరణములు క్రియలు. మానహాని వేఱు. మరణక్రియ వేఱు. కాన నిట నిర్ధార్యమాణమగు మానహానిక్రియ మరణక్రియకంటె

భిన్నము గానఁ గ్రియచే భిన్నమే యనుట స్పష్టము. ఒకేజాతికిని గుణమునకును గ్రియకును సంబంధించినవానిలో నానాజాతిగుణక్రియలయందే సామాన్యవిశేషధర్మవివక్షచే నొకదానిని వేఱుచేయుట జరుగునెడల నట్టిచోటుల నవధిభూతమగుదానికి 16 చే లోపలవర్ణక మగుట నరయునది. అవధి యనఁగా హద్దు. మేర. దేనిదృష్టితో వేఱుచేయుట యయ్యెనో యది యని తాత్పర్యము. దీని విస్తృతి 16 సూత్రమున నరయునది.

## పట్టివర్ణకంబు హేతువులగుగుణక్రియల కగు. ౧౮.

జ్ఞానముఁబట్టి ముక్తుఁడగు - నీవువచ్చుటంబట్టి ధన్యుఁడ నయితి. ఇచట వలనవర్ణకంబు నగు - జ్ఞానమువలన ముక్తుండగు.

టీ. 'పట్టీతి తు పంచమీ గుణే హేతౌ' అనునది మూలము. హేతువనఁ గారణము. హేతువులైన గుణక్రియావాచకములగు శబ్దములమీఁదఁ బట్టివర్ణక మగును. 'జ్ఞానముంబట్టి ముక్తుఁడగును.' ఇట ముక్తుఁడగుటకు హేతువు జ్ఞానము. ఇది గుణము. కాన ముక్తత్వమున హేతువగు జ్ఞానమునుబోధించు జ్ఞానశబ్దమునకుఁ బట్టిప్రత్యయ మీవిధిచే సిద్ధించెను. 'నీవు వచ్చుటంబట్టి ధన్యుఁడ నయితి' ఇట ధన్యత్వమున వచ్చుట యనువ్యాపారము హేతువుగాన వ్యాపారవాచకమగు వచ్చుట యనుదానికిఁ బట్టిప్రత్యయ మీవిధానముచేఁ గలిగె. పట్టి పరమగునపు డిట్టిచోటులందు వలనవర్ణకమును బ్రయోగదృష్టముగాన జ్ఞానమువలన మొదలగు రూపములును గలుగును. పట్టి పరమగునపుడు నుమాగమవిధానము చేయకపోవుటంబట్టి 'జ్ఞానముంబట్టి-వచ్చుటంబట్టి' అనునట్టిరూపములు బాలవ్యాకరణమునుబట్టి సిద్ధింప కున్నవి. 'అందు పట్టికూర్చి విభక్తిషు' అని యాథర్వణము నుమాగమము విధించెడిఁగాన దాని నిట నెరవు తెచ్చుకొనవలెను. 'అనుక్తమన్యతో గ్రాహ్యమ్' అనునభియుక్తోక్తి గలదు గదా! పట్టుధాతుక్త్వార్థకము పట్టియన్న నది సకర్మకమగును గాన దానితో నన్వయించునది సువర్ణకాంతమై యుండుటసహజంబు. క్త్వార్థకము త్రిలింగలక్షణశేషకర్తయన్నట్లు హేత్వర్థకమగుటయు నైజమె. కాని సువర్ణకాంత ద్వితీయారూపముమీఁదనే, యవ్యవహితపరముగనే, యుండుటంబట్టి పట్టికిఁ బ్రత్యయత్వమును, దానిముందటిది నుగాగమమగుటయును గలిగె ననఁదగును. సూరి నామవాచకములమీఁదనే పట్టివర్ణకమగుటను జూపుటంబట్టి త్రిలింగలక్షణశేషకర్త ''కొన్నియెడల హేతువునం దన్నంతక్రియలమీఁదను బట్టివర్ణకము విభాషనగు'' అని నుజ్యంతములమీఁదఁ గూడఁ బట్టివర్ణకమగుటను వలయ్యాదియోగజముంబోలి నుజ్యంతము భావార్థకమగుటను దెల్పుచు నీసూత్రమును బూరించినాఁడు. 'మందేహులం బ్రసన్నులఁజేయన్ మృదునఘఁబని' అను పాండురంగమాహాత్మ్యాది కః

ప్రయోగములందు నుఙ్యంతము భావార్థకమగుట ప్రసిద్ధము. కాన నామవాచకమగు నిద్దానిపైఁబట్టివర్ణకము పొసఁగుట యుచితంబె. జీత్తు పరంబగునపు డుత్వమునకగు నత్వము నాదిగఁగొని యనుటంజేసి నుఙ్యంతమున కన్నంతమనువ్యవహారము గుదిరె. ముక్తత్వధన్యత్వములు జ్ఞానాగమన మూలకములగుట జ్ఞానమును వచ్చుటయును హేతువులయ్యెనని గ్రహించునది.

## శేషషష్ఠికి యొక్కయు నగు. ౧౫.

ఇచట శేషంబనఁగా సంబంధంబు - రామునియొక్కగుణములు- నాయొక్కమిత్త్రుఁడు - వానియొక్క తమ్ముఁడు. కువర్ణకంబును గొన్ని యెడల సంబంధంబునం దగు. నాకుం దమ్ముఁడు-మీకు నెచ్చెలి.

టీ. 'యొక్క చ శేషేషష్ఠీ' అనునది మూలము. కర్మకరణ సంప్రదానాద్యర్థములందు ద్వితీయాదులు విధింపఁబడినవి. ఇఁక మిగిలినది సంబంధార్థము. కాన మిగిలిన సంబందార్థమున యొక్క యనుప్రత్యయము గూడ నగును. యొక్కయు ననుటంజేసి కువర్ణకమును గొన్నియెడల సంబంధార్థమునఁ గలుగవచ్చును. ఒక్క యనునదే సుఖోచ్చారణమూలకమగు యకారము చేర్పునంజేసి యొక్కయై లాక్షణికానుచిత విభాగమున యొక్కయై ప్రత్యయ మయ్యెనని తోఁచెడినని ముందె యుక్తము. స్వస్వామి భావము. (సేవ్య సేవకభావము) గుణగుణిభావము మొదలైనవి సంబంధములు. 'రామునియొక్కగుణములు' ఇట రామునకును గుణములకును గుణగుణి భావరూప సంబంధముగలదు. రాముఁడు గుణములు గలవాఁడు. రాముని నాశ్రయించి యున్నవి గుణములు. కాఁబట్టి గుణములకును రామునకును గల నిత్యసంబంధమును దెల్పునదై యొక్క ప్రత్యయము గుణివాచకమునకుఁ గల్గెఁగాన 'రామునియొక్క' యని రూపమేర్పడెనని గ్రహించునది. ఇట్లే 'నాయొక్కమిత్త్రుఁడు-వానియొక్కతమ్ముఁడు' మొదలగునుదాహరణములందు సంబంధమాత్రమున సంబంధివాచకముమీఁద యొక్క వర్ణకమగుటను గమనించునది. సంబంధార్థమున యొక్కయేగాక కువర్ణకమును రాఁదగుటంజేసి 'నాకుందమ్ముఁడు; మీకు నెచ్చెలి' యను మున్నగు ప్రయోగములు సురక్షితములయ్యెడి. దీనినిబట్టి కువర్ణకము కారకషష్ఠియందేగాక సంబంధార్థప్రకాశకమగు శేషషష్ఠియందును గలుగవచ్చునని తేలుచున్నది.

చింతామణి 'దిస్యాత్సంబధార్థే' అని సంబంధార్థమున దివర్ణమును విధించుట నరయ యొక్కప్రత్యయమున కాంధ్రవాఙ్మయమున నదృశ్యతయే గలుగునను నాశయముతో నున్నదనుట స్పష్టము. వాక్యమున యొక్క యగపడదని భావము. సంబం

ర్థప్రకాశక మగు యొక్కకు నిత్యముగ లోపముసిద్ధించునని ఫలితము. సంబంధార్థప్రకాశకమై యొక్కప్రత్యయము పూర్వాపరపదముల మేళవించునదిగాన సమాసత యవశ్యసిద్ధ మగుటంజేసియు సామాసికప్రత్యయలోపవిధానమునంజేసి యొక్కవర్ణకము లుప్తముగాక తీరదు. ఇఁక వ్యస్తమున 'అదినాయొక్క-అదిరాజుయొక్క' అను ప్రయోగములను నిర్మూలింపఁ జైచింతామణిసూత్ర మారబ్ధమగుటంజేసి వ్యస్తమునను యొక్కవర్ణక మగపడదనియే సిద్ధాంతింపనగును. ఇందుల కనుగుణముగ నాంధ్రవాఙ్మయమున మొన్నటివఱకును యొక్కప్రత్యయమున కదృశ్యతయే చూపట్టును. నవ్యులు మాత్రము 'నాయొక్కపని' యనురీతిని వాక్యవిన్యాసము సేయుచున్నారు. ఇట్టిస్థితిలో సూరి యొక్కప్రత్యయముతోడ వాక్యములఁ జూపుట యాంధ్రవాక్యసహజస్థితికి విరుద్ధమైనవిషయమని యనకతీరదు. కాని విభక్తిలోపము సమాసమున నెట్లును నిత్యముగ నగుంగాన సుబోధకై యిట్లు వాక్యవిన్యాసము చేసెననుట యుచితమని తోఁచెడి. త్రిలింగలక్షణశేషకర్త కొంతవఱకు యొక్కప్రత్యయ మాంధ్రవాక్యములఁ గన్పట్టదని గ్రహించినవాఁడనుటకు "యొక్కకు లోపంబు బహుళంబు" అని దీనిని బూరించు సూత్రమును రచించుటంజేసి విశదమయ్యెడి. సామాసికవిభక్తిలోపశాస్త్రముచే యొక్క పోవుననుతలంపే ప్రౌఢవ్యాకర్త గల్గియున్నవాఁడన్నయెడలఁ బైసూత్రము వ్యర్థమగుంగాన సంబంధార్థప్రకాశకమగు యొక్క సంబంధార్థప్రకాశకమగుచు లోపమునందక నిల్చిపోవునను బాలవ్యాకరణపాఠకులకుఁ గలుగు భ్రాంతిని నివారించుటకే యీసూత్ర మాతఁ డారంభించెనని యనక తప్పదు. కాని త్రిలింగలక్షణశేషకర్తయు, "బహుళగ్రహణమునంజేసి ధాతుజవిశేషణ భావార్థకముల ముందటికర్తృపదంబుల యొక్కప్రత్యయమునకు నిత్యముగ లోపముగలుగు" నని బహుళఫలము నభివర్ణించుటంజేసి యాంధ్రవాఙ్మయమున యొక్క కంతటను నదృశ్యత కలుగుటయే ప్రాచీనకవ్యాశయ మనునాశయము పూర్తిగ గ్రహింపలేదనుట స్పష్టము. కాని తానుదాహరించిన పద్యభాగములం దెచటను యొక్కవర్ణకము నిల్పియగపడుపమిని బద్యవాఙ్మయమున నిత్యముగ యొక్కవర్ణకమునకు లోపమేయగునని తలంచెననుట తెల్లము. గద్యనుమాత్ర ముండిన నుండనగునని తలంచెనేమో? భారతాదిగ్రంథములందు గద్యలందును యొక్క యగపడదు. మఱియు సూరి యొక్కప్రత్యయాంతముతో నన్వయించుపద మవ్యవహితపరముగ నుండుననియే యభిప్రాయపడిన ట్లాతని పైయుదాహరణములు విశదపఱచుచుండుటంబట్టి త్రిలింగలక్షణశేషకర్త "ధాతుజవిశేషణ భావార్థకపూర్వవ్యవహితావ్యవహితకర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్కషష్ఠి యగు" అని సూత్రించి వ్యవహితత్వముతోఁబాటుగఁ గర్తృపదప్రథమకును యొక్క షష్ఠి యగునను విశేషముంగూడ బాల

వ్యాకరణమునకంటె విశేషముగ సూచించి కృతార్థుఁ డయ్యెను. ఇట్లే కువర్ణకము తృతీయాదులం దగుటను శేషషష్ఠి కగుటను సూరి యాయాసందర్భములందు సూచింపఁ ద్రిలింగలక్షణశేషకర్త "షష్ఠీస్థానికంబగు కువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి" అని సూత్రించి పైబాలవ్యాకరణవిషయమును విపులీకరించి కృతార్థుఁడయ్యెను. ఇంతియగాక "వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకమగు" అని శాసించి యితరస్థలములందును గువర్ణకమగుటను దేటపఱచినాఁడు. సూరి యిట్టి యాంతరంగికవిషయములకుఁ బోక రాజమార్గమునే బట్టి యీసందర్భమును నడపెనని గ్రహించునది. తెనుఁగులోని 'అగు' అను రూపమునకు సమమై ద్రావిడమునం దగపడు 'అకు' అనునదే తెనుఁగున కువర్ణకమయ్యెననియు నుకారాంతములపై మాత్రమిది 'ఉక్' అను సంబంధార్థకమును ముందిడికొని యగుననియుఁ దదితరాంతములపై నందలి అకారము పలుకుబడితోఁ బోవుననియుం భాషాతత్త్వవిమర్శకుల యూహ. కువర్ణకము ప్రథమేతరవిభక్తులం దగపడుట చూడ నీయూహ సరసమని తోఁచెడి.

## నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకంబగు. ౧౬.

జాతి గుణ క్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశం బునకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు. ఎద్దానివలన నిర్ధారణం బగు నచ్చటిషష్ఠికి లోపలవర్ణకం బగునని యర్థము. మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు-గోవులలోపలఁ గపిల బహుక్షీర-అధ్వగుల లోపలం బాఱువాఁడు శీఘ్రగామి - ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు. ఇట సప్తమియుంగలదు-మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు. ఇత్యాదు లెఱుంగునది.

టీ. 'లోపలనిర్ధారణోద్భవా షష్ఠీ' అనునది మూలము. ఒకానొకజాతి యందలి గుంపునుండి యొకదానిని నొకానొక గుణసమూహమునుండి యొక గుణమును నొకానొక వ్యాపారములగుమినుండి యొక వ్యాపారమును నొకానొకసంజ్ఞాసమూహమునుండి యొకసంజ్ఞను వేఱుచేయుట నిర్ధారణము నాఁబడును. ఈసూత్రముచే నిర్ధారితమగునది నిర్ధారితసముదాయమునకే చెందిన దైయుండును. ఏసమూహమునుండి వేఱుచేయఁబడునది యాసమూహమునం దున్నదే యగునో యచ్చో నిర్ధార్యావధివాచకమునకు లోపలవర్ణక మగును. ఏసమూహమునుండి వేఱు చేయఁబడునది యాసమూహమునకుఁ జెందినదిగాక వేఱుదానికి సంబంధించున దగునో

యచ్చో నిర్ధార్యావధివాచకమునకుఁ గంటెవర్ణకమగును. ఇదియె లోపలకంటెవర్ణకములనిర్ధారణముల కయిన భేదము. ఒకజాతికి సంబంధించినవానిలో నొకదానిని నొకగుణమునే గల్గినవానిలో నొకదానిని నొకేవ్యాపారము గలవానిలో నొకదానిని నొకే సంజ్ఞను గలగుంపులో నొకదానిని వేఱుచేయవలసి వచ్చినపు డట్లు వేఱుపఱచుట దేని దృష్టితో జరుగునో యద్దానిం జెప్పుపదము మీఁద లోపలవర్ణక మీవిధి చే సిద్ధించునని తాత్పర్యము. సముదాయము = సమూహము-మొత్తము-గుంపు. ఏకదేశము = ఒకటి (ఆసమూహమునం దున్నయొకటి) 'మనుష్యులలోపల క్షత్త్రియుండు శూరుండు' ఇట మనుష్యజాతినుండి మనుష్యులలో నేకదేశభూతుఁడగు క్షత్త్రియుఁడు వేఱుచేయఁబడుచున్నవాఁడు. అట్లు వేఱుచేయుట మనుష్యావధికముగాన మనుష్యశబ్దముమీఁద లోపలవర్ణక మీవిధిచేఁ గలిగెనని యెన్నునది. క్షత్త్రియత్వము మనుష్యత్వసామాన్యధర్మమున నేకదేశముగాన మనుష్యత్వసామాన్యధర్మము ననుసరించి క్షత్త్రియత్వ విశేషధర్మము వేఱుచేయఁబడెననుట స్పష్టము. ఇది జాతిని వేఱుచేయుట కుదాహరణము. 'గోవుల లోపలఁ గపిల బహుక్షీర' ఇచట గోత్వజాతినుండి కపిల గుణవిశిష్ట ధేనువు వేఱుచేయఁబడుచున్నది. ఈవేఱుచేయుట గోత్వజాతిమూలకముగాన గోత్వాధారగోశబ్దముమీఁద లోపలవర్ణకము గలిగె. ఇటఁ గపిలగుణవిశిష్టమగుగోవు వేఱుచేయఁబడెనుగాన నిది గుణపృథక్కరణమున కుదాహరణము. కపిలయు గోత్వజాతిలో నేకదేశమనుట స్పష్టము. 'అధ్వగులలోపలఁ బాఱువాఁడు శీఘ్రగామి' ఇచట దారిఁబోవువారలలోఁ బఱుగెత్తువాఁడు వేఱు చేయఁబడుచున్నాఁడు. పఱుగెత్తుట వ్యాపారము. (క్రియ) ఇచటఁ బాఱువానిని వేఱుచేయుట యధ్వగదృష్టితో నైనదిగాన నధ్వగపదముమీఁద లోపలవర్ణకము సిద్ధించెను. అధ్వగజాతినుండి పఱుగెత్తుక్రియగలవానిని వేఱుచేయుట జరిగెఁగాన నిది క్రియను వేఱుచేయుట కుదాహరణము. దారినడచువారిలోఁ బాఱువాఁడును నొకఁడగుట తెల్లము గదా! 'ఛాత్త్రులలోపల మైత్త్రుండు సమర్థుండు.' ఇట శిష్యుల గుంపునుండి మైత్త్రుఁడనుపేరుగల యొకఁడు వేఱుచేయఁబడుచున్నవాఁడు. ఈవేఱుచేయుట కవధిభూతులు ఛాత్త్రులుగాన ఛాత్త్రవాచక ఛాత్త్రశబ్దముమీఁద లోపలవర్ణకము సిద్ధించెను. మైత్త్రుఁడనునది సంజ్ఞగాననిది సంజ్ఞాపృథక్కరణమున కుదాహరణము. మైత్త్రుఁడును ఛాత్త్రులలోనివాఁడే యగుట స్పష్టము. ఇట్లు మనుష్యత్వాదివిశిష్టధర్మములనుండి తదేకదేశములగు క్షత్త్రియత్వాదులను విశేషధర్మములను వేఱుపఱచుటయు విశిష్టధర్మవాచకములకు లోపలవర్ణకమగుటయు నంతటను గమనించునది. 13 సూత్త్రమున విశిష్టమునుండి విశేషమునకుఁ బృథక్కరణంబు తోఁపమింజేసి యట్టిచోటులందు నిర్ధార్యమునకుఁ గంటెవర్ణకమేయగునని తెలియవలయును. లోపలవర్ణకమగుస్థలములందు

సప్తమియు నుండనోపునుగాన 'మనుష్యులందు క్షత్రియుఁడు శూరుఁ' డిత్యాదిరూపము గను వాక్యములు గలుగనగును. నిర్ధార్యము లాజాతి గుణక్రియాసంజ్ఞలందలివేగాన నవధివాచకములకు సప్తమియగుట యవిరుద్ధంబ. ఈసందర్భమున సిద్ధాంతకౌముదిని గల యుదాహరణములనెల్ల మక్కికిమక్కిగా నాంధ్రీకరించిన సూరి 'నృణాం నృషు వా బ్రాహ్మణః శ్రేష్ఠః' అను నుదాహరణమును మాత్ర మట్లుచేయక మనుష్యులలోపల క్షత్రియుఁడు శూరుఁడు' అని క్రొత్తదానిని సృజించుటంజేసి యీతఁడు బ్రాహ్మణద్వేషి యగుట స్పష్టమని యంద్రు. అందుల వారనునట్టి ప్రాచీనరూపములందువలెనే లోపు శబ్దముపై 'ఉల' చేరి పలుకుబడిలో నుకార ముకారమై వికృతినంది; ప్రత్యయత్వము నందిన శబ్దమిదియని తోఁచెడి.

## అధికరణంబునకు సప్తమి యగు. ౧౭.

అధికరణంబు నా నాధారంబు. ఔపశ్లేషికంబు వైషయికం బభివ్యాపకం బని యాధారంబు త్రివిధంబు. ఘటమందు జలమున్నది - మోక్షమం దిచ్ఛగలదు-అన్నింటియం దీశ్వరుండు గలండు.

టీ. అధికరణమన నాధారము. ఆధారమన నెద్దానికైన నుండుట కర్హ్మమగునది. ఔపశ్లేషికము:—శ్లేషమనఁగా సంబంధము- (ఆలింగనము) ఉపకు సమీపమర్థము. ఉపశ్లేషము=సమీపసంబంధము. ఉపశ్లేషకృతమే=సామీప్యసంబంధముచే నైనదే యౌపశ్లేషికము నాఁబడును. దగ్గఱ కూడిక గల్గియున్నదని భావము. వైషయికము:—విషయములనఁ బదార్థములు. పదార్థములందుండునవి విషయులు. కాన విషయులు విషయములందు విషయతాసంబంధమున నుండుట సహజము. విషయసంబంధము గలది వైషయికము నాఁబడును. అభివ్యాపకము=వ్యాపించియుండుటకుఁ దావైనది. ఒకవస్తువునకు పదార్థమెల్ల నాధారమగునెడల నట్టియాధారము నభివ్యాపకమంద్రు. 'ఘటమందు జలమున్నది.' కుండయందు నీరు కుండనంటియున్నది.నీరట్లు కుండను బట్టుకొని యుండుటకుఁ గుండ యాధారముగాన ఘట మౌపశ్లేషికాధారము నాఁబడుటయుఁ దద్వాచకమునకు సప్తమియు సిద్ధించెను. మోక్షమం దిచ్ఛ గలదు. ఇచ్ఛ విషయము. విషయమైన యిచ్ఛ విషయతా సంబంధమున మోక్షమున నిల్చియున్నదిగాన మోక్షము వైషయికాధారమగుటయుఁ దద్వాచకము సప్తమీవిధిచేఁ బొందుటయుఁ గలిగెను. 'అన్నింటియందీశ్వరుఁడుగలఁడు. ఎల్లవానియందును నీశ్వరుఁడు నిల్చియుండుటంజేసి యీశ్వరసర్వవ్యాపిత్వమునకెల్ల యవియం నాధారములగుటయు నెల్లవస్తువులు నభివ్యాపకాధారము లగుటయు స్పష్టము. కాన సర్వపదార్థవాచకమగు నన్నిశబ్దముమీఁద సప్తమి సిద్ధించెను. ఇం దుదా

హరణము లందువర్ణకమునుగూర్చియే యీయఁబడినను యోగ్యతగల్గినచో నవర్ణకమును నాధారమునఁ గలుగనగుననియు 'ఘటమున జలమున్నది' అను మొదలగు నవర్ణకముతోడి ప్రయోగములును సాధువులే యనియుఁ దలంచునది. (చూ 18 సూ.) ఔపశ్లేషికాధారమున నాధేయము నాధారమునంతను నుపశ్లేషించి యుండనక్కఱ లేదనియు ఘటమున నల్పజలమున్నను ఘటమునకగు నౌపశ్లేషికాధారతకు భంగము లేదనియు గ్రహించునది. ఇట్లే తక్కినచోటు లూహ్యములు. తొల్లి 'అందు' అనునిది యధికరణార్థకస్వతంత్రశబ్దమై యుండెడిదనుటకు "అధ్వరమునందుఁ జొచ్చిరి; పరుణాధనేశ్వరులందిట్టిసభఁ జూచి యెఱుంగను." అను నన్నయప్రయోగములె ప్రమాణములు.

## ఉకారాంత జడంబునకు నవర్ణకం బగు. ౧౮.

ఘటంబున జలంబున్నది - దేవదత్తునకు మోక్షమున నిచ్ఛగలదు.

టీ. ఆధార ముకారాంతజడవాచకమయ్యెనేని దానికి సప్తమిని నవర్ణకమును గలుగునని తాత్పర్యము. నవర్ణక ముకారాంతజడవాచకమునకు సప్తమ్యేకవచనమున సిద్ధించుననుట కిది సూచకము. ఉకారాంతత ముకారము మూలముననేని సహజముగ నేని యైనది గావచ్చును. 'ఘటము - మోక్షము' అనునవి ముకారముచే నుదంతము లైనవియు జడవాచకము లైనవియుఁ గావున వీనికి సప్తమిని నవర్ణకము సిద్ధించెను. చెట్టున - పట్టున మొదలగునవి సహజోకారాంతముల కుదాహరణములు. జడము లనఁగా నచేతనములని మున్దె నిరూపితము. (చూ 17 తత్సమప.) జడమునకు - ఆధారమునకు - మొదలగు స్థలములందు 'జడవాచకమునకు - ఆధారవాచకమునకు' అని లక్షణచే నర్థమును గమనించుచు నాయాప్రత్యయములను గూర్చునది. ఉదంతములపై 'నందు' అను రూపము నందియున్న, నందను దానినుండి, యందును వేఱుచేయఁగా, నరూపమునందిన ప్రత్యయమిది యని తోఁచెడి. 'కేషాంచి దుదంతానాం నేతివిభక్తౌ' అను మూలము నుండి యుద్ధరించిన యర్థమే యీసూత్రరూపమును ధరించెననుట స్పష్టము.

## విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తి వచనంబులగు. ౧౯

నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు - దేవకీపుత్త్రు హరిని నుతింతు నెపుడు - శుభవిధాయుల రామకృష్ణుల భజింతు - భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు.

టీ. విశేష్యమన నామవాచకము. విశేష్యమున కేరీతినాయావిధులచే నాయా లింగవిభక్తివచనములు మూఁడును సిద్ధించు నట్లే యాయావిశేష్యముల విశేషణములకును

నావిధుల చేత నే యాయాలింగవిభక్తివచనములు గలుగును. క్రియాన్వయమును బుట్టించునది లేక క్రియతో నన్వయించునది కారకమని ముందె నిరూపితము. విశేష్య మేరీతిని గారకమును బొంది క్రియాన్వయమునందునో యారీతినె విశేష్యవిశేషణమును విభక్తినంది క్రియతో నన్వయించునని యీసూత్రమున కభిప్రాయమును గ్రహించునది. విశేష్య మేలింగవిభక్తివచనములు గలదగునో విశేషణమును నాలింగవిభక్తివచనములే గలదగునని భావము. నామవాచకమునకే తత్సమప్రకరణమున లింగవిభక్తివచనాదులు విహితములు, విశేషణములు విశేష్యమునందలి విశేషమును జెప్పునవగుట నామవాచకము లన నవకాశము లేమి లింగవిభక్తివచనములు వానికి సిద్ధింపవను నపోహమును నిర్మూలింప నీసూత్ర మారబ్ధమయ్యెనని యెన్నునది. 'నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు:—ఇందు కృష్ణుండను విశేష్యమునకు విశేషణమైన నందతనయశబ్దమునకుఁ గృష్ణశబ్దమునకు వలెనే పుంలింగమును బ్రథమయు నేకవచనమును నయ్యెను. కృష్ణునియందలి నందతనయత్వమనువిశేషమును విశదీకరించునదిగాన నందతనయశబ్దము విశేషణమగుట స్పష్టము. 'దేవకీపుత్త్రు, హరిని నుతింతు నెపుడు.' ఇచట హరియందలి దేవకీపుత్త్రత్వమను విశేషమునుబోధించు దేవకీపుత్త్రశబ్దము విశేషణమగుట స్పష్టమగుటంజేసి విశేష్యమునకు వలెనే దానికిఁ బుంస్త్వమును ద్వితీయయు నేకత్వమును గలిగెననియెన్నునది. 'శుభవిధాయుల రామకృష్ణుల భజింతు' ఇట రామకృష్ణులందలి శుభవిధాయితను దెల్పునట్టి శుభవిధాయివిశేషణమునకు విశేష్యమునకువలెనే పుంలింగమును ద్వితీయయు బహువచనమును నీవిధిచే సిద్ధించెను. 'భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు' ఇచట రుక్మిణియందలి భువనవంద్యత్వమను విశేషమును బోధించు భువనవంద్యయనువిశేషణమునకుఁ దద్విశేష్యమునకు వలెనే స్త్రీలింగమును ద్వితీయయు నేకవచనమును గలిగెనని గ్రహించునది. ఇట్లే విశేష్యము ననుసరించి తద్విశేషణములకుఁ దత్తల్లింగవిభక్తివచనములగుట యూహ్యము. ఇందు విశేషణమున కవ్యవహితపరముననె విశేష్యముం గూర్చి చూపఁబడినను సందర్భయోగ్యపదములచే విశేషణవిశేష్యములు వేర్పడుటయుఁ గొండొకచోఁ గన్పట్టెడి. అర్థస్ఫూర్తి కంతరాయమునుగూర్పని వ్యవధానముండిన నుండవచ్చును గాని సంస్కృతమునందు వలె నిచ్చవచ్చినన్ని పదములను విశేషణవిశేష్యములకు నడుమఁ గూర్చుట మాత్ర మాంధ్రవాక్యపద్ధతికి సహజముగాదు. తెలుఁగున లింగమే లేమిని నందును దెనుఁగువిశేషణములు సామాన్యముగ నవిభక్తికములే యగుటను నీసూత్రము సంస్కృతసమవిశేషణములకే చెందినదనియు సంస్కృతమార్గముంబట్టి గల్గినదనియు స్పష్టపడుచున్నది.

**స్త్రీసమంబులగు విశేషణంబులయు మువర్ణకాంతవిశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగానగు. ౨౦.**

మాటలు పెక్కేల-మాటలు పెక్కులేల-కులిశధారల్కుంఠితం బయ్యె - కులిశధారల్కుంఠితంబు లయ్యె - ఇష్టమగు పదార్థములు - ఇష్టములగు పదార్థములు.

టీ. 'ఏకత్వం భేదకగతబహువచనానాం చ దృశ్యతే వికృతౌ' అనునదిమూలము. స్త్రీసమమనఁగాఁ బ్రథమైకవచనలోపమునందిన యాచ్ఛికశబ్దమని ముందె యుక్తము. విశేషణమన విశేష్యమందున్న విశేషమును దెలుపునది. విశేష్యమనఁగ విశేషించి చెప్పఁబడినదనఁగాఁ బ్రధానముగఁ బేర్కొన్నది. కర్త్రాదికము. విశేషముగలవస్తువాచకశబ్దమని ఫలితము. ఏకవచనబహువచనములలో నుండఁదగు స్త్రీసమములకే యిందు గ్రహణము. సాధారణముగ మువర్ణకాంతసంస్కృతసమములె మువర్ణకాంత విశేషణగ్రాహ్యములగుట నుదాహృతులు దెల్పెడి. స్త్రీసమములగు విశేషణములబహువచనమునకును మువర్ణకాంతములగు విశేషణములబహువచనమునకును నేకవచనము వికల్పముగ నగును. 'మాటలు పెక్కేల':—ఇటఁ బూర్వసూత్రముచే మాటలనుదానికి విశేషణమైన 'పెక్కు'అను స్త్రీసమశబ్దమునకుఁ బెక్కులనిరూపము ప్రాప్తించుచుండ నీవిధిచే నేకవచనమును సిద్ధించుటం జేసి పెక్కేల యని రూపమేర్పడెను. 'పెక్కు' అనునది ప్రథమైకవచనలోపమును నిత్యముగనందిన తెలుఁగుశబ్దమగుట నిది స్త్రీసమమగుట స్పష్టము. కాన నీయుదాహృతి స్త్రీసమవిశేషణబహువచనమున కేకవచనమగుట కీయఁబడెనని గ్రహించునది. ఏకత్వము గలుగనిపక్షమునఁ బూర్వసూత్రముచే బహువచనము గలుగ 'మాటలు పెక్కులేల' యను రూప మేర్పడును. 'కులిశధారల్కుంఠితంబయ్యె':—కులిశధారలను బహువచనాంత స్త్రీలింగశబ్దమునకు విశేషణమైన కుంఠితశబ్దమునకుఁ బూర్వసూత్రముచే స్త్రీలింగమును బ్రథమయు బహువచనమును రావలసియుండఁ దత్సమము 86 చే వికల్పముగఁ గ్లీబత్వ మద్దానికి సిద్ధించుటంజేసి మువర్ణకాంతవిశేషణమును నయ్యెఁ గాన నాపక్షమున దీనిచే నేకవచనమును గలిగి పైప్రయోగ మేర్పడెనని యెఱుంగునది. ఏకవచనముఁ రాని పక్షమునఁ బూర్వవిధిచే బహువచనమును దత్సమము 86 చే నైన గ్లీబత్వమునం జేసి మువర్ణకాంతమై 'కులిశధార ల్కుంఠితంబు లయ్యె' అని యుండును. తత్సమము 86 చేఁ గ్లీబత్వము రానిపక్షమునఁ బూర్వసూత్రముచే విశేష్యలింగవిభక్తివచనములే గలుగ 'కులిశధారల్కుంఠితలయ్యె' అనియుఁ నుండఁదగును. ఇది లక్షణసిద్ధ మువర్ణకాంతవిశేషణ బహువచనమున కేకవచన మగుట కుదాహరణము. 'ఇష్టమగుపదార్థములు':—పదార్థము

లనుదానికి విశేషణమైన యిష్టశబ్దమునకుఁ బూర్వసూత్రముచేఁ దల్లింగవిభక్తివచనములే గలుగవలసి యున్నదిగాని యది ముపర్ణకాంతవిశేషణ మగుటంజేసి దాని బహువచనము నకు మాత్ర మేకవచన మీవిధిచే సిద్ధింపఁ బైప్రయోగము గలిగెనని గ్రహించునది. ఏకవచనము గలుగనిపక్షమునఁ బూర్వసూత్రముచే బహువచనమే సిద్ధింప నిష్టములగు పదార్థములని కారక మేర్పడును. ముపర్ణకాంతశబ్దముల బహువచనరూపములందు ముగాగమ ముపర్ణమేగాని ముపర్ణక ముండుట పొసఁగమింజేసి సూత్రస్థమగు ముపర్ణక పదమునకు ముపర్ణకార్హ్యముల కనిగాని తత్సమము 41 సూత్రవివరణములంబట్టి ముపర్ణ కము ముగాగమమున కుపలక్షణముగ నెంచి ముగాగమాంతముల కనిగాని యర్థమును గ్రహించుట యావశ్యకము. ఇది సహజ ముపర్ణకాంతబహువచనమున కేకవచన మగుట కుదాహరణము. సామాన్యముగ నిట్టిస్థలములందు 10 చే విశేషణములకు విశేష్య ముల లింగవిభక్తివచనములే గలుగుటను బిదపఁ దత్సమమునందలి యాయావిధులచే నాయాప్రత్యయాదులు సిద్ధించుటను స్మరించుకొనవలయును.

ఇందలి యుదాహరణములంబట్టి యప్రాణివాచకముల స్త్రీసమముపర్ణకాంత విశేషణములకే యేకవచన మగుంగాని ప్రాణివాచకముల యట్టివిశేషణములకు గాదని విశదమగుచున్నది. మూలము వికృతియందె యీవిధి యనుచున్నదిగాని విశేషణవిశేష్య ములస్వరూప మిట్టిదని వివరింపదయ్యెను. 'క్వచిదేకత్వమిష్టం స్యాదప్రాణిస్త్రీవిశేషణే' సిద్ధమ్వంతస్త్రీసమయో స్తద్విశేష్యకయోరపి' అని యథర్వణుఁడు ప్రాణివాచకముల స్త్రీసమముపర్ణకాంతములకే యీవిధి యని వివరించెనుగాని సంస్కృతసమవిశేషణపరము గను నీవిధిని భావించినట్లు 'స్త్రీవిశేషణే' యనుపదము సూచించుచుండుటంజేసి మూలస్థ మగు వికృతిపదము నితఁడు సంస్కృతసమాసమపరముగ నెంచెననవలసియున్నది. బాల సరస్వతి ''యింపైనజవరాండ్రు-నీకీర్తులువిఖ్యాతమాయె-విప్రైనకన్నుల''అని యుదాహ రించి మూలమునకు వ్యాఖ్య వ్రాయుటంజేసి సంస్కృతసమాసమపరముగనే వికృతిపదము నెంచెనుట స్పష్టపడెడిఁగాని యథర్వణునివలెఁ గేవల మప్రాణివాచకవిశేషణపరముగ నీవిధిని భావింపలేదని మొదటి యుదాహరణము తెలిపెడి. సర్వలక్షణసారకవిసంశయ విచ్ఛేదములు సంస్కృతసమాసమ జడవాచకవిశేషణముల బహువచనమునకే యేకవచన మగుననుచున్నవి. మూలస్థమగు వికృతిపదము సంస్కృతసమతదితరబోధకముగా నాంధ్రశబ్దచింతామణి యెంచెననుట కాధారము లుండుట చేతను,'భేదకగతబహువచనా నామ్' అను బహువచనమునంజేసి యోగ్యత గలచో వివిధవిశేషణములబహువచనముల కేకవచనముం గూర్పవచ్చునని యెంచెననుట కవకాశముండుటచేతను, గావలయు సూరి యప్రాణివాచక విశేషణములకని విశేషించి యనక సామాన్యముగ స్త్రీసమ ముపర్ణ

కాంతవిశేషణములకని యని సంస్కృతసమాసమవిశేషణపరముగ నీవిధిని గల్పించెను. ప్రాణివిశేషణముల కేకవచనమగుట చూపమి నీవిధి యప్రాణివిశేషణములకే యని యనుమానింపఁదగుంగాని స్త్రీసమమువర్ణకాంతములను సామాన్యోక్తింజేసి ప్రాణివిశేషణ ములకును నీవిధి గలుగ నవకాశముండుటచే బాలసరస్వతి సాధించిన 'ఇంపైనజవ రాండ్రు' అనుమొదలైనవియు బాలవ్యాకరణసమ్మతములే గావచ్చును. కాని మహ ద్వాచకేతర స్త్రీసమాచ్ఛికవిశేషణములకే యేకత్వము గలుగుట ప్రసిద్ధమగుట విశేషణ విశేష్యములరూపమును నిరూపించుట యావశ్యకమని తోఁచెడి.

స్త్రీసమసంజ్ఞ సంస్కృతసమేతరములకే యని యాచ్ఛికము 2 చే విదితము. అమహద్బహుత్వబోధకసర్వనామములలోఁ బెక్కుశబ్దమునకే యేకవచనము పోఁగి యుండుట సర్వనామప్రకరణమునుబట్టి తెల్లము. సాధారణముగ నాచ్ఛికవిశేషణము లవిభక్తికములగుట ప్రసిద్ధము. ఆచ్ఛిక స్త్రీసమవిశేషణములను దాదృశసర్వనామములును విశేష్యమునకు ముందున్నచో సమాసతయే భాసించుట సహజము. మఱియు నాచ్ఛిక స్త్రీసమములు విశేష్యవిశేషణము లుభయము లగుట సైజముగాన విశేష్యమునకు ముం దున్నపుడే వానివిశేషణత గోచరించెడి. తెనుఁగున మువర్ణకాంతములకుఁ గాని స్త్రీసమ ములకుఁగాని యగుధాతురూపములంగూర్చి విశేష్యములకుముందు ప్రయోగించునపుడే వానివిశేషణత స్పష్టపడుట సహజము. కావుననే యగుధాతురూపములంజేర్చియే విశే ష్యమునకుముందు స్త్రీసమ మువర్ణకాంతవిశేషణముల నిల్పుటయు నగుధాతురూపములం గూడి విశేషణము లైనవానికే యేకవచనమగుటయుఁ జూపట్టెడి. అందును ప్రథమేతర విభక్తి బహువచనముల నందియున్న విశేష్యములకు సంబంధించిన విశేషణము లగుధాతు రూపములఁ గూడియున్నపుడే యేకవచనము బొందుట గన్పట్టెడి. అవస్థాభేదమును బట్టి యగుధాతురూపముతోఁ గూడక విశేషణ ముండుటయుఁ గలదు. ప్రాణివిశేషణ ములలో నాచ్ఛిక స్త్రీసమములకే యేకవచనమగు ననఁదగును. కానఁ బైవిషయముల గమనించుచుఁ బ్రయోగముల ననుసరించి యథార్థముగ నీవిధిని వర్తింపఁజేసికొనుట యావశ్యకము. నిజమరయ నాచ్ఛికవిశేణము లవిభక్తికము లగుటంజేసి సామాన్యముగ విశేష్యములకు ముందున్న యవ్వాని కేకత్వమే యగునని చింతామణి శాసింపఁ దరు వాతివా రీవిధిని సంస్కృతసమాసమవిశేషణపరముగ భావించుటంజేసి సంస్కృతసమ తదితరపరమగుటయు నప్రాణివాచకవిశేషణపరమగుటయు నందును మతభేదములు గలుగుటయుఁ బొసఁగెనని తోఁచెడి. సామాన్యముగ నీవిధి వాఙ్మయమునుబట్టి జడ వాచకవిశేషణములకు సంబంధించినదనియే సంభావింపనగును. ఇది వ్యస్తవిశేషణవిష యము.

ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తియునగు. ౨౧.

మైత్రుండు గృహమును వెడలెను. గృహమునుండి యని యర్థము. వాఁడు వాహనమును దిగెను—వాహనమునుండి యని యర్థము. వారు సుఖమున్నారు—సుఖముతో నని యర్థము. ఇత్యాదు లెఱుంగునది.

టీ. 'అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా' అనునది మూలము. కొన్నిచోటులందు శాస్త్రముచే నొకవిభక్తి గావలసియుండ నద్దానికి బదులుగ మఱియొకవిభక్తి యగుటయుఁ గన్పట్టునని భావము. ఆయాయర్థములను వివక్షించునపుడే యాయాకారకములు గలుగుటయు నవ్వానికి వివక్ష లేకున్న నవి గలుగకపోవుటయుఁ బ్రసిద్ధము. ఈ క్రిందియుదాహృతులం దాయాయర్థములు వివక్షితములు గామి నాయావిభక్తులు గలుగలేదనియు నాయాయర్థములే వివక్షితము లగుటంజేసి యాయావిభక్తులే గలిగెననియు భావింపనగును. 'వివక్షాతః కారకాణి భవంతి' అనునుక్తి పైవిషయమునకుఁ బ్రమాణము. 'మైత్రుండు గృహమును వెడలెను. ఇచట మైత్రునకైన వియోగమునకు గృహ మవధిగాన 9 చే వలనవర్ణకమును 10-11 చే నితరవిధులును గలుగవలసియున్నవి. కాని వలనకు బదులుగ ద్వితీయ యయ్యెఁగాన 'గృహమును' అని కారక మేర్పడెను. ఇట్లే వానికిని వాహనమునకును నైనవియోగమునకు వాహనమవధిగానఁ దద్వాచకమునకుఁ బంచమిని వలనవర్ణకాదులు గలుగవలెను. కాని ద్వితీయయే పంచమికి బదులుగ నగుటంజేసి 'వాహనము'నని కారకము పొసఁగెను. 11 చే సిద్ధించిన ద్వితీయా సప్తములమీఁది యుండికి లోపము సూరిసమ్మతము గామి నీరెండుదాహరణములును బంచమికి ద్వితీయ యగుటకుఁ బాలయ్యెను. ప్రౌఢవ్యాకర్తృమతమున నివి వలనకాదేశమైన ద్వితీయమీఁదియుండి లోపించుట కుదాహరణముల య్యెడి. చూ. ప్రౌఢ, కారకము 11. 'వారు సుఖమున్నారు' సుఖముతోఁ గూడియను సహార్థమును వివక్షించిన 5 చే తోడవర్ణకముగాని, హేతుత్వమును బరిగణించిన 4 చేఁ జేతవర్ణకముగాని, గావలయుంగాన నద్దానికి బదులుగఁ బ్రథమ గలిగెనని గ్రహించునది. సుఖముతో ననియర్థమని వివరించుటనుబట్టి సూరి యిట సహార్థమునే వివక్షించి దానికిఁ బ్రథమ శాసించెనని యెన్నఁదగు. క్రియావిధేయవిశేషణములమీఁది యగుధాతువున కన్నంతమునకు లోపంబు విభాషనగునను త్రిలింగలక్షణశేషసూత్రమునంజేసి 'సుఖముగన్' అను మొదటిరూపమునందలి 'కన్' అనుభాగము పోఁగా శేషించినదానినిగఁ జెప్ప నొప్పుననియుఁ దోఁచెడి. సూరి 'సుఖేన వసతి' అనుమొదలగు సంస్కృతభాషయందలి ప్రయోగముల ననుసరించి దీని నిందుఁ జొనిపెనని యనుమానింపనగును. కావునసే

'అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా' అను మూలసూత్రము స్పష్టముగ సప్తమి యుండ వలసినచోటులఁ బ్రథమను బ్రతిపాదించునదిగ విశ్వసించి త్రిలింగలక్షణశేషకర్త సమన్వయమును జూపుట సార్థకమయ్యెడి. చూ. ప్రౌఢ. కారక. 20 తుదినున్నవ్రాఁత. మూలము 'సర్వవిభక్తిః సంస్కృతతుల్యా' అని యెల్లవిభక్తులాద్యవ్యాకరణమార్గము ననుసరించి యగుటనే సూచించునదిగానఁ దెలుఁగున నాద్యవ్యాకరణమార్గమునకు భిన్నముగ నగువిభక్తుల నెల్లను సాధింప 'అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా' అనుసూత్రమునుగూడ నిల్పుకొనెను. 'అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా' అనువిధి కుదాహరణములగు వానిలోఁ గొన్నిటిని మార్గాంతరములచేఁ బ్రౌఢవ్యాకర్త సాధించియుండుటంజేసి మార్గాంతరములచే సాధింపరాని శేషించినప్రయోగములే దానికి విషయములుగ నెన్నినాఁడు. సూరి కేవలము మూలమార్గమునే యనుసరించినవాఁడు గాన నాద్యవ్యాకరణమార్గమునకు లొంగని తెలుఁగుకారకముల నెల్ల నాసూత్రమునకే విషయములుగఁ జేసెను. కాన నీసూత్ర మిచ్చువచ్చినరీతి నొకవిభక్తికి మఱియొకవిభక్తిని గూర్పవచ్చునని బోధించునదిగాక సంస్కృతసంప్రదాయమునకు విరుద్ధముగఁ దెనుఁగునఁ దోఁచు విభక్తుల సాధించునది యనియే సంభావింపవలెను.

జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగానగు. ౨౨.

రాముఁడు వాలినొక్కకోలంగూలనేసె-కోలతో నని యర్థము. లంకం గలకలంబు పుట్టె - లంకయందని యర్థము. బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు. అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె—బాణములచే నని యర్థము. మీనంబు జలంబులనుండు-జలంబులందని యర్థము.

టీ. 'ఇతరత్ర చ ద్వితీయా' అనునది మూలము గానోపును. జడవాచకములకగు తృతీయాసప్తములకు బహుళముగ ద్వితీయ యగును. జడవాచకములలో నుదంతంబులగు శబ్దములకు ద్వితీయాతృతీయాసప్తమీబహువచనాంతములకే గాని యేకవచనాంతములకుఁ గాదని గ్రహించునది. అనఁగా నుదంతజడవాచకముల ద్వితీయాబహువచనరూపములే తృతీయాసప్తమ్యర్థముల బోధింపఁగలవుగాని వానిద్వితీయైకవచనరూపము లట్లు గాఁజాలవని భావము. ఉదంతేతరజడవాచకముల ద్వితీయైకవచనబహువచనములు రెండును దృతీయాసప్తమ్యర్థబోధకములు గావచ్చునని ఫలితము. తృతీయాసప్తములలో నేవచనమునకగుద్వితీయ యావచనమునకు సంబంధించినదే యైయుండునని గ్రహించునది. తృతీయైకవచనమునకు ద్వితీయయైన ద్వితీయైకవచనమును దృతీయాబహువచన

మునకైన ద్వితీయాబహువచనమును నీరీతినే సప్తమ్యేకవచనమున ద్వితీయైకవచనమును బహువచనమున ద్వితీయాబహువచనమునునగునని భావము. 'రాముఁడు వాలి నొక్క కోలం గూలనేసె.' వాలిని గూలనేయఁ గోల ప్రకృష్టోపకరణముగానఁ గోలశబ్దమునకు 4-5లచే 'చేత తోడ' వర్ణకములు గలిగెడి. ఆతృతీయకు దీనిచే ద్వితీయగలిగిన 'కోలను' అని యగును. ఈవిధి గలుగనిపక్షమునఁ గోలచేఁ గోలతోడ నని యుండును. 'లంకం గలంకంబుపుట్టె' కలంకమున కధికరణంబగుట లంకాశబ్దమునకు సప్తమినందువర్ణకము 17 చే సిద్ధింప నద్దాని కీవిధిచే ద్వితీయ గలుగ 'లంకను' అని యగును. ద్వితీయ రానిపక్షమున లంకయందని యగును. 'అర్జునుఁడు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె' ఇచట శత్రుసేనల రూపుమాపుటలో ప్రకృష్టోపకారకమైన బాణంబుల బోధించు బాణశబ్దమునకు 4-5 లచేఁ దృతీయ గలుగఁగా నద్దాని కీవిధిచే ద్వితీయ సిద్ధింప 'బాణంబులను 'అని యయ్యెను. 'బాణము' అనునది యుదంతజడ వాచకమగుట ద్వితీయ యిట్టిశబ్దములకు బహువచనాంతములకే గాని యేకవచనాంతములకు బహుళగ్రహణమునంజేసి సిద్ధింపదు గాన 'అర్జునుఁడు శత్రుసేనలను, బాణంబును రూపుమాపె'నని ప్రయోగము చేయరాదని భావము. ఇట్లే 'మీనంబు జలంబుల నుండు' అనునపుడు మీనముల కధికరణమైన జలంబులను దానికి 17చే సప్తమి సిద్ధింప నద్దాని కీవిధిచే ద్వితీయ రా 'జలంబులను' అని యయ్యెననియుం 'జలంబు'అను నది యుదంతజడవాచకమగుట నిందలి బహుళపదముశక్తింజేసి బహుత్వమందె ద్వితీయ సిద్ధించెడిఁగాన 'జలంబులను' అనియే యుండును గాని మీనంబులు జలంబును నుండువని యుండదని గ్రహించునది. ఉదంతజడములకుఁ దృతీయాసప్తములం దేకత్వమున ద్వితీయ సిద్ధింపమికిఁ దృతీయయందుఁ గర్త్రార్థకముతోఁబాటుగఁ గరణార్థకమును గర్త్రార్థకమైనట్లు గోచరించుటయు, సప్తమియందుఁ గర్త్రర్థకముతోఁబాటుగ నధికరణార్థకమును గర్త్రర్థకముగఁ దోఁచుటయుఁ గారణములని తలంపనగును. త్రిలింగలక్షణ శేషకర్త 'కొన్నియెడల నజడంబుతృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి' నని సూత్రించి 'స్తనచక్రవాకములన్; ఒంటెలఁ బెఱికి రాఁగ-మనుజులవిప్రుండు' అని యుదాహరించి యీసందర్భమును బూరించినాఁడు. స్తనములందుఁ జక్రవాకత్వ మారోపిత మగుటంజేసి చక్రవాకనిష్ఠమగు నజడత్వమున కిటఁ బ్రసక్తి యంతగ లేమి స్తనధర్మము ననుసరించి చక్రవాకములనుగూడ జడములుగఁ దలంపనగుంగాన నిది యంతగ నీవిధికుదాహరణము గాఁజాలదేమోయని తోఁచెడి. 'పెఱికి-రాఁగ' అనుక్రియల కొంటెలు కర్తలైనట్లు స్పష్టపడుచున్నదిగాన నిట నొంటె లనునది సప్తమ్యర్థకద్వితీయ గాక ప్రథమాబహువచనాంతమని యనవలెనుగాన నిదియుఁ నీవిధికి సరియైన యుదాహృతి

గాఁజాలదనియే తోఁచెడి. శబ్దరత్నాకరమున నొంటెలనునది కర్త్రర్థకముగనే యందాహృతమయ్యెను. (చూడు. శ. ర. వెఱుకుశబ్దము 516 పుట.) ఇఁక మిగిలినది మనుజుల విప్రుండననదే. ప్రౌఢవ్యాకర్త, కారకము 4 సూత్రముక్రింద, నొకానొకచో నేక వచనంబున నుకారంబుమీది ద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థకమయ్యెడినని 'ఇతరత్రచ ద్వితీయా' అను మూలసూత్రము నాధారముగఁగొని యందంతజడ ద్వితీయా బహువచన రూపమేగాని యేకవచనరూపము తృతీయార్థకము గాఁజాలదను పైసూరియుక్తిని నిగూఢముగ సవరించుచుఁ దాఁజెప్పినదాని కనుకూలించుగతిని బ్రసంగించుట నరయఁదగు. నిజమరయఁజేసి యాశబ్దముమీఁదనున్నపుడే యట్టియర్థము గోచరించుటను, మూలసూత్రమది తృతీయకు ద్వితీయ విధించునదేయని స్పష్టపఱుపనవకాశము లేకుండుటను, ప్రౌఢవ్యాకర్తపై ప్రసంగము తనసిద్ధాంతమును సరిపెట్టికొనుటకై నదేగాని సహజమైనది గాదని సంభావింపఁదగును.

## ఉదంతజడంబు తృతీయకు నవర్ణకంబగు. ౨౩.

రాముఁ డొక్కబాణంబున వాలిం గూలనేసె - బాణముచే నని యర్థము.

టీ. హ్రస్వోకారాంతమైన జడవాచకశబ్దమునకుఁ దృతీయైకవచనమున నవర్ణకమగును. పూర్వసూత్రముచే నుదంతజడమునకు బహుత్వమందె తృతీయకు ద్వితీయ విధింపఁబడినది. ఏకత్వమునఁ దృతీయయందుదంతజడమునకు ద్వితీయ సిద్ధింపమి నీవిధిచే నవర్ణకము గలిగెడిఁ గాన 'రాముఁ డొక్కబాణంబున వాలిం గూలనేసె' అనుచో నుదంతజడవాచకమైన బాణశబ్దమునకుఁ బూర్వసూత్రముచే ద్వితీయ గలుగక యీ విధిచేఁ దృతీయకు నవర్ణకమే గలిగి బాణంబున నను ప్రయోగ మేర్పడెనని గ్రహించునది. నవర్ణకము రానిపక్షమునఁ గరణార్థకమగు దీనికి 4-5 లచేఁ జేతతోడ వర్ణకములగుటను స్మరించునది. ఒక్కొకచో నుదంతంబగునజడంబు తృతీయకును నవర్ణకము చూపట్టెడినని సూత్రించి త్రిలింగలక్షణశేషకర్త 'వినఁగున నేనుఁగు వైచుచు' అని యుదాహరించి యీసందర్భమును బూరించినాఁడు. 'కేషాంచిదుదంతానాం నేతి విభక్తావునో లఁక్స్యాత్' అను మూలసూత్రముచే సప్తమి నేకత్వమున నుదంతములకు సూచితమగు నవర్ణకమే 'అన్యస్యాః క్వచిద్భవేచ్ఛాన్యా' అను విధిచేఁ దృతీయైకవచనమునను నగునను నహోబలపతియాశయముంబట్టి 'అన్యస్యాః క్వచిద్భవేచ్ఛాన్యా' అనునదే దీనికి, మూలమనవలెను.

జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగానగు. ౨౫.

వాఁడు పూవులు దెచ్చె - వాఁడు పూవులను దెచ్చె. ఆకె సొమ్ములు దాల్చె-ఆకె సొమ్ములను దాల్చె. వాఁడిల్లువెడలె-వాఁడింటిని వెడలె. బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించినద్వితీయకుం బ్రథమరాదు.

టీ. 'తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్' అనునది మూలము గానోపును. జడవాచకముల ద్వితీయకు ప్రథమ బహుళముగ నగును. 'వాఁడు పూవులు దెచ్చె' ఇచటఁ బూవులను గర్మార్థకమునకు జడవాచకమునకైన ద్వితీయకుఁ బ్రథమ యీవిధిచేఁ గలుగ 'పూవులు' అని కారక మేర్పడెను. ఇట్లే సొమ్ములను కర్మార్థకమున కైన ద్వితీయకుఁ బ్రథమ గలుగ 'సొమ్ములు' అనురూప మేర్పడెనని గ్రహించునది. 'వాఁడిల్లు వెడలెను' వానికిని యింటికిని నైన వియోగము గృహావధికముగానఁ దద్వాచకమగు నిల్లు శబ్దమునకు 9 చే వలనవర్ణకమును 10 చే నుండియు 11 చే ద్వితీయాసప్తములును గలుగ 'ఇంటినుండి-ఇంటియందుండి' అను ప్రయోగము లేర్పడుననియు, నిందు 21 చే ఇంటినుండి యనుదానికైన యింటినను,ద్వితీయ కీవిధిచేఁ బ్రథమ గలుగ 'ఇల్లువెడలెను' అను ప్రయోగము సిద్ధించెననియు నెఱుంగునది. కాని యీపక్షముననుండియుఁ బోయిన దనవలెను. దీన నిదియుండి లోపింప మిగిలిన ద్వితీయకుఁ బ్రథమగల్గిన రూపమనుటయే సరసమని తోఁచెడి. ప్రౌఢవ్యాకర్తృమతమున నిదియుండి లోపింప మిగిలినద్వితీయకుఁ బ్రథమయగుట కుదాహరణమగును. ద్వితీయకను సామాన్యోక్తిం జేసి జడవాచకముల ద్వితీయైకత్వబహుత్వముల రెంటను బ్రథమ యగునని భావించునది. ఇందు బహుళ పదమును గూర్చుటం జేసి 22 చేఁ దృతీయాసప్తములకు విధించిన ద్వితీయకు మాత్ర మీవిధిచేఁ బ్రథమ గలుఁగదని గ్రహింపవలెను. 'రాముఁడు శత్రుసేనలను బాణంబులు రూపుమాపె, వాలి నొక్కకోల కూలనేసె' అనుమొదలగు ప్రయోగములు గలుగవని తాత్పర్యము. ఈవిధిచేఁ బ్రథమ యట్టివానికి సిద్ధించినవానికరణాద్యర్థకత చెడుంగాన నట్లు 22 చే సిద్ధించిన ద్వితీయకుఁ బ్రథమగలుగదని నిర్వచించెనని సంభావించునది. మొత్తముమీఁద నరయ నీవిధి కర్మార్థక జడవాచకముల కైన ద్వితీయకు సంబంధించినదని సామాన్యముగ సంభావింపనగును. ఈవిధి బహుళ మగుటచేతఁ బక్షమున ద్వితీయయు నుండనగును. 'కొన్నియెడల నజడంబు ద్వితీయకును బ్రథమ గానం బడియెడి నని ప్రౌఢవ్యాకర్త యీసందర్భమును బూరించుట నరయునది. మఱియు 'ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయగునని దీనిని సవరించుటను గమనించునది.

దీనఁ దృతీయాసప్తములకుఁ గల్గిన ద్వితీయలలో సప్తమికిఁ గల్గిన ద్వితీయ ప్రథమాంతమై సప్తమ్యర్థకము గావచ్చుననుట తెల్లము.

కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు. ౨౫.

వాఁడు నిన్నవచ్చె - వీఁడు నేఁడువోయె - మాపు నిలువుము - రేపు పొమ్ము-వారు క్రోశము నడచిరి-వీరామడ వోయిరి.

టీ. కాలవాచకములకును నధ్వవాచకములకుఁ దఱచుగఁ బ్రథమ యగును. అధ్వమన మార్గము. 'వాఁడు నిన్న వచ్చె' ఇచటి నిన్నటిదినమందను సప్తమికిఁ బ్రథమ యీవిధిచే నయ్యెఁగాన నిన్న యను ప్రయోగ మేర్పడెను. ఇట్లే తరువాతి యుదాహరణములలో నిన్నశబ్దమునకువలెనే కాలవాచకములై సప్తమ్యంతములైన వాని కీవిధిచేఁ బ్రథమ సిద్ధించుటచే నేఁడు-మాపు రేపను ప్రయోగములు సిద్ధించెనని యెఱుంగునది. ఇట్లే మార్గవాచకములైన క్రోశశబ్దము సప్తమికిని, ఆమడశబ్దము సప్తమికిని, బ్రథమ యీసూత్రముచే నగుటచే 'క్రోశము-ఆమడ' అను ప్రయోగములు సాధువులయ్యెనని యెఱుంగునది. ఆయావాక్యములందు నిరూపితములైన వ్యాపారము లాయాసమయము లందును నాయాయధ్వమునందును నైనవిగాన నాయాకాలవాచకములును నధ్వవాచకములును సప్తమ్యంతములయ్యెనని గ్రహించుచు వాని కీవిధిచేఁ బ్రథమ గలిగెనని యెంచునది. ప్రాయోగ్రహణమునంజేసి యీవిధి సాధారణముగ నిత్యమని సంభావింపఁ దగును. 'కాలాధ్వనోరత్యంతసంయోగే' అనుదాని ననుసరించి యీసూత్రము గలిగెనని యనుమానింపనగును. ప్రాయిక మనుటంజేసి క్వాచిత్కముగ 'నిన్న మధ్యాహ్నమున వచ్చె' 'నేఁటి ప్రాతఃకాలమునం దేగె' అనుమున్నగునవియు సాధువులయ్యెడి. కాల పరిమితియందు నామములకు కువర్ణకమగునని ప్రౌఢవ్యాకర్త 'ఆఱునెలలకు' అను మొదలగు నుదాహృతుల నిచ్చియుండుటను గమనించునది.

సర్వనామసంఖ్యాభిధానతద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దానిద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు. ౨౬.

అన్నిగుఱ్ఱములకు - అన్నింటికిగుఱ్ఱములకు - గుఱ్ఱములన్నింటికి- గుఱ్ఱముల కన్నింటికి - సాహిణులుముప్వురు. రెండు గుఱ్ఱములకు - రెండింటికి గుఱ్ఱములకు - గుఱ్ఱములు రెండింటికి - గుఱ్ఱములకు రెండింటికి- సాహిణులు నలుగురు. లక్షగుఱ్ఱములకు-లక్షకుగుఱ్ఱములకు-గుఱ్ఱములు లక్షకు-గుఱ్ఱములకులక్షకు-రవుతులులక్ష. ఇత్యాదు లెఱుంగునది.

టీ. 'సర్వనామవిశేష్యములలోను సంఖ్యావాచకవిశేష్యములలోను నేదానికిఁ బూర్వప్రయోగమగునో యద్దానికి బహుళముగఁ బ్రథమ యగును. విశేష్యమునుబట్టి విశేషణ మేవిభక్తిని జెందవలసియున్నను, నర్థసందర్భము ననుసరించి విశేష్య మేవిభక్తిని జెందవలసియున్నను, మొట్టమొదట విశేషణవిశేష్యములలో నేది ప్రయోగింపఁబడు నద్దానికిఁ బ్రథమయే సిద్ధించుననియుఁ దరువాతిదానికి యథార్హమగు విభక్తి యగుననియుఁ దాత్పర్యము. 'అన్నిగుఱ్ఱములకు' ఇందన్నియను సర్వనామము ముందు ప్రయోగింపఁబడెనుగాన విశేష్యమునుబట్టి దానికిఁ గలిగిన షష్ఠికిఁ బ్రథమ యీవిధిచే సిద్ధించెనని గ్రహించునది. ఈవిధి బహుళముగ నగునదగుటఁ బ్రథమ రానిపక్షమున 19 చే 'అన్నింటికి గుఱ్ఱములకు' అని యగును. అన్నిత్యాదు లాపవిభక్తికములగుటచే ద్వితీయాద్యేకవచనములు పరములగునపు డమహత్త్వమున టింటులగునను నాచ్ఛికపరిచ్ఛేదమునందలి వ్రాతను విశేష్యము ననుసరించి విశేషణమునకు ద్వితీయాదివిభక్తులు చేర్చునపుడు స్మరించుకొనునది. 'గుఱ్ఱములన్నింటికి' ఇందు గుఱ్ఱములను విశేష్యము ముందుఁ బ్రయుక్తముగాన దానిషష్ఠికిఁ బ్రథమ యయ్యె. ఈవిధిచేఁ బ్రథమ గలుగకున్న 19 చే 'గుఱ్ఱములకన్నింటికి' అని యుండును. 'రెండుగుఱ్ఱములకు' ఇందు రెండను సంఖ్యావాచకము ముందు ప్రయోగింపఁబడెఁగాన దానిషష్ఠికిఁ బ్రథమ యయ్యె. ప్రథమ రానిపక్షమున 19 చే 'రెండింటికి గుఱ్ఱములకు' అని యుండును. రెండుమొదలైనవి యాపవిభక్తికము లగుటంజేసి ద్వితీయాదివిభక్తులు పరమగునపు డమహత్త్వమున టింటులగునను నాచ్ఛికపరిచ్ఛేదమునందలి వివరణమును, నమహత్సంఖ్యావాచకములకు విశేష్యమునుబట్టి విశేషణమునకు 19 చే ద్వితీయాదివిభక్తులను గూర్చునపుడు స్మరించికొనవలెను. 'గుఱ్ఱములు రెండింటికి' ఇచట గుఱ్ఱములను విశేష్యము ముందు ప్రయుక్తమయ్యెఁగాన దానిషష్ఠికిఁ బ్రథమయయ్యె. ప్రథమరానిపక్షమున 'గుఱ్ఱములకు రెండింటికి' అని 19 చే నగును. ఇట్లే 'లక్షగుఱ్ఱములకు' అనునుదాహరణమునఁ దొలుతఁ బ్రయోగింపఁబడిన దానికిఁ బ్రథమ యగుటను బ్రథమ రానిపక్షమున షష్ఠి 19 చే నగుటను నూహించికొనునది. తొలుతఁ బ్రయుక్తమైనదానికిఁ బ్రథమ గల్గునెడలఁ దరువాతిదాని కర్హమగు విభక్తి యగునని గ్రహించునది. ఈయుదాహరణములెల్ల షష్ఠికిఁ బ్రథమ యగుటనే సూచించుచున్నను విశేష్యము ద్వితీయాద్యంతమై యున్నపుడు నీవిధి గలుగవచ్చును. ఇందులకు 'దానిద్వితీయాదులకుఁ బ్రథమయగు' అను విధానమే నిదర్శనము. ఇందమహద్విశేష్యములకును, వానిసర్వనామసంఖ్యాభిధానములకును బ్రథమ యగుటయే సూచింపఁబడినను నీవిధి ప్రాక్ప్రయుక్తవిశేష్యములకెల్లను వానిసర్వనామసంఖ్యాభిధానములకెల్లను గావచ్చునని గ్రహింపనగును. 'మనుజులందఱ కిది తగు-అందఱకు మను

జులకు. మూవురు పురుషులకు-పురుషులు మూవురకు. ఇద్దఱు స్త్రీలకు-స్త్రీల కిద్దఱకు' అను ప్రయోగములును దీనికి గుఱియయ్యెడి. సంఖ్యాభిధానమన సంఖ్యకుఁ బేరైనది. సంఖ్యా వాచకమని తాత్పర్యము. సర్వనామసంఖ్యాభిధానతద్విశేష్యములయందు:—తుదివిశేష్య శబ్దమునకు సర్వనామసంఖ్యాభిధానపదములతో రెండింటితోను నన్వయము కాన 'సర్వ నామము దాని విశేష్యము, సంఖ్యావాచకము దానివిశేష్యము' అని యర్థము సిద్ధించెడి. 'సర్వనామతద్విశేష్యములు, సంఖ్యాభిధానతద్విశేష్యములు' అని రెండుజంటలని తాత్పర్యము ఫలించు. సర్వనామసంఖ్యావాచకములు సహజముగ విశేషణములు గాన వానివిశేష్యములనె నని యెన్నునది. 20 వలెనే యీవిధియు వ్యస్తమున నె యని యెఱుంగునది. 1. 'సంఖ్యాప్రయుక్త విశేషణ మేకాంతంబై యమహద్విశేష్యకమై సమస్తమగుచో విశేష్య ముత్తరపదమును నేకవచనాంతమును నగును. 2. సంఖ్యా ప్రయుక్త విశేషణ మేకాంతంబై యమహద్విశేష్యకమై వ్యస్తమగుచో విశేష్యము పూర్వపదమును బహువచనాంతంబును నగును. 3. సంఖ్యాప్రయుక్తవిశేషణము తదంశాంతంబై మహద్విశేష్యకమై సమస్తమగుచో విశేష్య ముత్తరపదమును నేకవచనాంతమును నగును. 4. సంఖ్యాప్రయుక్త విశేషణము తదంశాంతంబై మహద్విశేష్యకమై వ్యస్తమగుచో విశేష్యము పూర్వపదమును బహువచనాంతమును నగు. 5. సంఖ్యా ప్రయుక్తవిశేషణము తదంశాంతంబై యమహద్విశేష్యకమై సమస్తమగుచో విశేష్య ముత్తరపదమును నేకవచనాంతమును నగును. 6. సంఖ్యాప్రయుక్తవిశేషణము తదంశాంతంబై యమహద్విశేష్యకమై వ్యస్తమగుచో విశేష్యము పూర్వపదంబును బహువచనాంతంబును నగు.' అనునాఱుసూత్రముల నేకసూత్రము గావించియు 'అయ్యాది యేకాంతము మహద్విశేష్యకము సమస్తముగాదు. వ్యస్తంబగుచో బహువచనాంతంబ యగు' అని సూత్రించియు సూరి యీసందర్భమును ద్విలింగలక్షణశేషకర్త సవరించుట నరయునది. ద్వితీయాదులకుఁ బ్రథమయగుట తరువాతి సూత్రమునకంటె నిందలి వైలక్షణ్యమనియు నందును ముందున్నదానికె యగుటయనియు గ్రహించునది.

ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషనగు. ౨౭.

సుగుణాభిరాముఁడు రామునకు జోహారువొనర్చెద - సుగుణాభిరామునకు రామునకు జోహారువొనర్చెద.

టీ. 'షష్ఠీవిశేషణానాం ప్రథమా స్యాత్' అనునది మూలము. షష్ఠ్యంతవిశేష్యములకు విశేషణములైన పదముల షష్ఠీవిభక్తికిఁ బ్రథమ వికల్పముగ నగును. విశేష్యము షష్ఠ్యంత మైయున్నను దద్విశేషణము ప్రథమాంతమై యుండ నగునని భావము. ప్రథమ రానిపక్షమున 19 చే షష్ఠియే గలుగునని గ్రహించునది. విశేష్య మేవచన

మును గల్గియుండునో దానివిశేషణమును ప్రథమయగునపుడును సావచనమునే గల్గి యుండును. 'సుగుణాభిరాముఁడు రామునకు' ఇచట రామునకునను షష్ఠీవిశేష్యమునకు విశేషణమైన సుగుణాభిరామ పదమునకు 19 చే షష్ఠియయ్యెననియు నాషష్ఠికి దీనిచేఁ బ్రథమ యయ్యెననియుం నెఱుంగునది. ప్రథమ రానిపక్షమున 19 చే షష్ఠియే యగుం గాన 'సుగుణాభిరామునకు రామునకు' అని యుండును. సూరి షష్ఠ్యంతవ్యస్తవిశేషణమునకే ప్రథమ యగునని తలంచినటుల నాతఁ డిచ్చిన పైయుదాహరణము విశద పఱచుచున్నదిగానఁ ద్రిలింగలక్షణశేషకర్త 'యొక్కొ-కచోఁసమాసాంతర్గతవిశేష్యంబుల కగువిశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపట్టెడి'నని సూత్రించి సమాసమునందలి షష్ఠ్యంత విశేష్యమునకు సంబంధించిన వ్యస్తవిశేషణమునకును నీప్రథమగావచ్చునని 'పార్థివ ప్రాగ్రసరుండు ధర్మసుతుపన్పు' అను మొదలగు నుదాహరణములఁ జూపి సూరి యీ సందర్భమును బూరించినాఁడు. మఱియుఁ 'గ్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామిసంబంధము గలచోఁ సంబంధిపదంబు (స్వామివాచకమునకు)షష్ఠికి ద్వితీయ యగు' నని సూత్రించి 'నన్ననతఁడు చెట్టపట్టినన్' అను మొదలగువాని నుదాహరించి 'నా యొక్క- చెట్ట'అను మొదలగు నర్థములందు స్వస్వామిత్వము ననుసరించి స్వామివాచకమునకు ద్వితీయ యగుటను విశదపఱచి యీసందర్భమును బూరించినాఁడు. ఇది 'యితరత్ర చ ద్వితీయ' యనుమూలము నాధారముగఁ గొనినదైన యిందలి 22 సూత్రమునకును బూరకగ్రంథము గావచ్చును. ఇంతియగాక కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకును బ్రథమచూపట్టెడి నని సూత్రించి 'అహీనబలసారఘనుల్ మధుకైటభాది దైత్యపతులనెల్ల' అను మొదలగునవి యుదాహరించి 'షష్ఠీవిశేషణానామ్' అనుమూల సూత్రమునందలి బహువచనమునకు సారస్యమును గూడ వివరించినాఁడు. 'షష్ఠీవిశేషణానామ్' అనువిధి షష్ఠీవిశేషణములకుఁ బ్రథమ విధించునదగుటంజేసి షష్ఠీవిశేషణముల వివిధత్వమును నిరూపించి వానివానికెల్లను బ్రథమ ప్రయోగసిద్ధమని చూపి యీబహువచనమునకు సారస్యము చూపిన నది మూలాశయమని విశ్వసింపనగునుగాని విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ యగుటకు 'షష్ఠీవిశేషణానామ్' అనుబహువచనమును బ్రమాణముగఁ జెప్పుట మాత్ర మంతగ మూలాశయ మైనట్లు తోఁచకున్నది. మూలము 'వ్యస్తషష్ఠీవిశేషణములు. సమాసాంతర్గతషష్ఠీవిశేష్యములవిశేషణములు. అగుధాతురూపములతోఁ గూడిన షష్ఠీవిశేషణములు' అని షష్ఠీవిశేషణములు త్రివిధములగుటను గమనించి వానివానికెల్లను బ్రథమను విధింప 'షష్ఠీవిశేషణానామ్' అను బహువచనమును నిల్పెననియుఁ దరువాతివారు విశేష్యములకంటె భిన్నముగ విశేషణములకుఁ బ్రథమయగుచోటుల నెల్ల 'విశేషణానామ్' అనుబహువచనము సూచకఁగాఁ

గొని సాధువులుగాఁ జేసిరనియుఁ దత్త్వము విశదమయ్యెడి. కాన సమాసాంతర్గతవిశేష్యం బుల షష్ఠీవిశేషణములకును బ్రథమ 'షష్ఠీవిశేషణానామ్' అను బహువచనమునం జేసి యే సిద్ధించునని విశ్వసింపనగును గాని విశేషణంబుల ద్వితీయాదులకుఁ బ్రథమ మాత్రము దానిచేఁ గలుగదని తలంపనగును. మఱియు నిందులకు నన్నయభారతమున నట్టిప్రయోగములు లేమియే గారణమనవచ్చును.

ఇందలి యుదాహరణములను బట్టి మహద్వాచకముల షష్ఠ్యంతవిశేషణములకే ప్రథమ యగునని తోఁపవచ్చును గాని షష్ఠ్యంతవిశేషణములలో నేదానికైనను బ్రథమ గలుగుట ప్రచురప్రయోగసిద్ధము గానఁ బ్రయోగసరణికిని నర్థస్ఫూర్తికిని భంగము గలుగనిగతి నేకత్వబహుత్వముల రెంటను నెల్ల షష్ఠీవిశేషణములకుఁ బ్రథమగూర్పవచ్చునని గ్రహించునది. కాని యొకానొకచో ననుటచే నీవిధి సార్వత్రికము గాదని యెఱుంగనగు. పూర్వ - పూర్వసూత్రములయుం వానిక్రింది ప్రయోగములయు నుత్తరసూత్రలక్ష్యములయుంసరణి, ననుసరించి తెనుఁగున సంస్కృతమునందువలె విశేషణవిశేష్యములు నియతలింగవిభక్తివచనములై యుండుట గానరాదనియుం సంస్కృతము ననుసరించి లక్షణకర్తలుచెప్పిన కారకములు తెనుఁగునకు సాధారణముగ సరిపడునవి గావనియుఁ దెల్లమయ్యె. సమాసము 1 టవ సూత్రము దానివివరణమును ననుసరించి వేర్వేఱుగా నున్నపదార్థములు గలిసి యొక యఖండపదార్థముగ భాసించుట లేక వేర్వేఱుపదార్థములను బోధించుపదములు మొత్తమై యొకపదార్థమునే తెల్పుట సమాసలక్షణమని విశదమగుటచే దారములెల్లఁ గలిసి వస్త్రముగా నేర్పడినపిదప నావస్త్రమునందలి యొకదారముతో వెలుపలనున్న వేఱొకదారమునకును, వెండ్రుకలెల్లఁ గూడి జడగానైనపిదప నాజడయందలి యొక వెండ్రుకతో వెలినున్న వేఱొకవెండ్రుకకును, బూవులెల్లఁ గలిసి దండగానైనపిదప నాదండయందలి యొకపూవుతో వెలుపలనున్న వేఱొకపూవునకును నిటుకలెల్లఁగూడి గోడగానైనపిదప నాగోడయందలి యొకయిటుకతో వెలినున్న వేఱొకయిటుకకును సంబంధమును గూర్ప నవకాశములేని యట్లఖండపదార్థముగ భాసించిన దానిలో నొకపదార్థమును విడఁదీసి వెలినున్న మఱియొకపదార్థముతో దానికి సంబంధమును గూర్చుటగాని యఖండపదార్థబోధకములగు పదములలో నుండి యొకపదార్థమును బోధించునొకపదమును విడఁదీసి వేఱొకపదార్థమును జెప్పెడు వేఱొకపదముతో దాని కన్వయసంబంధమును సమకూర్చుటగాని దుష్కరమని స్పష్టపడెడిఁ గాన సమాసాంతర్గతషష్ఠీవిశేష్యములకు వ్యస్తముగ విశేషణముల నిడుట నంగీకరించు నీసందర్భ మేకదేశాన్వయదోషదూషితమని సంస్కృతలక్షణములమార్గము ననుసరించి యనవలసియున్నది. అఖండపదార్థములో నెట్లేని యొకపదార్థమునకు వెలినున్న

వేఱొకపదార్థముతో సంబంధము కష్టపడి గట్టినను నది సహజమైనట్లత్తక యొనవేసినట్లు స్పష్టముగఁ దోఁచుచు నఖండపదార్థమునకు వికారమునే గూర్చురీతిని సమాసైకదేశమునకుఁ గట్టిన విశేషణమన్వయసంబంధమును సమాసైకదేశముతోఁ గనఁజాలమిని వక్తవ్యార్థస్ఫురణమునకు భంగమును గలిగించెడిఁగాన నిట్టిదానిని దోషముగా సంస్కృతలాక్షణికు లెన్నియుందురని తోఁచెడి. సంస్కృతమున విశేష్యవిశేషణములకు విభక్తివ్యత్యాసమే గలుగదన షష్ఠీవిశేషణములమాట వేఱుగఁజెప్పనేల? సమాసాంతర్గతషష్ఠీవిశేష్యమునకు వ్యస్తవిశేషణమే గలుగదనఁ దద్విశేషణమునకుఁ బ్రథమ యసంభవమని వ్రాయనేల? తెనుఁగున షష్ఠీతత్పురుషాంతర్గత లుప్తషష్ఠ్యంతపూర్వపదమునకే యిట్లు వ్యస్తవిశేషణము నిడుట గన్పట్టునుగాని యేయితర సమాసములందలి యేయేకదేశమునకు వ్యస్తవిశేషణమును వేయుంట ప్రసిద్ధమైగానరాదు. అందును కేవలసంస్కృతసమములకుఁ గాని సంస్కృతసమాచ్ఛికములకుఁ గాని సాధ్యసమాసము (ఆంధ్రవిభక్తి చిహ్నాంతములైన పిదప నగుసమాసము) సంభవించినపుడే యందలి లుప్తషష్ఠ్యంతపూర్వపదమునకు వ్యస్తవిశేషణము నిడుపద్ధతి చూపట్టెడిఁ గాని సిద్ధషష్ఠీసమాసమునందలి (కేవలము సంస్కృతవ్యాకరణసిద్ధమైన షష్ఠీతత్పురుషమునందలి) షష్ఠ్యంతమున కిట్లు వ్యస్తవిశేషము నిడుపద్ధతి గానరాదు. సమాసమున విభక్తిలోపశాస్త్రము ననుసరించి యాయావిభక్తులు లోపించిన వానివానియాయాయర్థముల స్ఫూర్తి పూర్ణముగాఁ బోవుననియును యొక్కప్రత్యయము వ్యస్తమునను సమాసమునను నిత్యముగ లోపించెడిది గాన నది విభక్తిలోపశాస్త్రముచేఁ దొలఁగినను దత్సంబంధార్థద్యోతకత్వమునకు నాశము సమాసమునను గలుగదనియును నెంచుటచేఁగావలయుఁ దెలుఁగుకవులు యొక్క లోపించినపదములకు వ్యస్తవిశేషణమును వ్యస్తవిశేష్యమునకువలెనే నిల్పుట యదుష్టమని యనుకొనుటయు లాక్షణికు లిమ్మార్గమును సూత్రించి యదుష్టముగాఁ జేయుటయుఁ గుదిరెనని తోఁచెడి. 'సంస్కృతలాక్షణికులు' కిమోదనం శాలీనామ్ సక్తూవ్వథకమాపణీయానామ్;' అనువాక్యములలో సమాసగతములుగాని 'శాలీనామ్; ఆపణీయానామ్;' అనుషష్ఠ్యంతములకు సమాసైకదేశములగు 'కిమ్; సక్తు;' అనుపదములతోడ నన్వయము నంగీకరించు మార్గము నాధారముగఁ గొని గావలయుఁ దెచుఁగుకవులు సమాసగతషష్ఠ్యంతమునకును నితరవ్యస్తవిశేషణముతోడ నన్వయము నంగీకరించి యీయేకదేశాన్వయమార్గము నభివృద్ధినొందించిరని తోఁచెడి. సంస్కృతమునను లాక్షణికులయుదాహరణములే యట్టివి చూపట్టెడిఁ గాని ప్రసిద్ధములైనకవిప్రయోగములు మాత్రము బహుళముగఁ దోఁపకున్నవి. మొత్తముమీఁద నేకదేశాన్వయవిషయమున నాద్యాంధ్రభాషాపద్ధతులు విభిన్నములని చెప్పక తప్పదు. అభిప్రాయము వెల్లడియైనఁ జాలునని సులభాపేక్షను వ్యవహృతమగు జీవద్భాష తెలుఁగు తీర్చిదిద్దిన వ్యవహారభ్రష్టయగుభాష

సంస్కృతము. కాననట్టియున్కి వానికిసహజంబె.'ఒక్కొకచో సమాసగత పూర్వపదంబు వ్యవహితోత్తరపదంబొంటితోడను వాని పెక్కింటితోడను నన్వయించెడి. కొన్నియెడల సిద్ధసమాసమధ్యగతపదములతోఁ దద్భిన్నపదముల కన్వయము చూపట్టెడి. 'ఒకానొకచో గుణవాచకధాతుజవిశేషణంబు లవయవవిశేష్యపూర్వకములయి యవయవితో సమసించెడి' అను త్రిలింగలక్షణశేషసూత్రములను బరిశీలించిన నేకదేశాన్వయ మిప్పట్టుననే గాక మఱి కొన్నిచోట్లులందును దెలుఁగునఁ దోఁచెడిననియు నీవిషయమున సంస్కృతాంధ్రముల కేమాత్రము సంబంధము లేదనియు స్పష్టపడక మానదు. కాని యర్థస్ఫూర్తి కేకదేశాన్వయము మిగుల భంగము గలిగించునదిగాన నిట్టిప్రయోగములు కొలఁదిగనే వాఙ్మయమునఁ దోఁచుట గలిగెననియుఁ, సాధ్యమగునంతవఱకు బ్రసన్నార్థస్ఫురణకై యత్నించుకవు లీమార్గము నంటకుండ నొత్తిలిపోవుటయే యుచితమనియుఁ దెల్పుట యనుచితము గాఁజాలదని యీవిషయము నింతతో ముగింతు. విశేషణములు సాధారణముగ భవత్యర్థకములతోఁ గూడినపుడు ప్రథమావిభక్తినందుట సహజముగాన నావిధానము ననుసరించి భవత్యర్థకముతోఁ గూడుకొనకున్నను విశేషణములకుఁ బ్రథమ కాలక్రమమునఁ గల్గెననియుఁ బ్రౌఢవ్యాకరణోదాహరణముల ననుసరించి షష్ఠీవిశేష్యముల విశేషణములకే గాక ద్వితీయాద్యంతవిశేష్యముల విశేషణములకును బ్రథమ సిద్ధించుటను గమనించినఁ బ్రథమయే యగుట కదియే కారణము గానోపుననియుఁ దెల్లమయ్యెడిఁ గదా! మూలసూత్రము నిత్యముగఁ దోఁచుచున్నను జింతామణి శేషమగునాథర్వణయము 'విభాషయా సుసంతం స్యాదత్ర షష్ఠీవిశేషణమ్' అని యనుటను సూరివిభాషనగునని సూత్రించెనని నమ్మఁదగు.

భవత్యర్థవ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు. ౨౮.

అగు మొదలగునవి భవత్యర్థములు విద్యాశాలియగు పురుషుని సకలజనులు సన్మానింతురు. భూతదయాళు రగుమహాత్ములకు శ్రేయంబు గలుగును. అతిమానుష మత్యద్భుత మతిదుష్కర మయిన కేళివార్జున కృతిన్.

టీ. 'భావ్యద్యర్థవ్యవధానేతు భేద్యస్య నిఖిలం భవేత్' అనునాథర్వణము మూలమనఁదగు. విశేషణవిశేష్యములకు నడుమనుండి వానిని వేఱుపఱచుచుఁ బ్రధానముగ విశేషణము తుదనంటి విశేషణమునకుఁ దనద్వారముననేగాని సాక్షాత్తుగ విశేష్యముతో నన్వయమును నడ్డుచు నగుధాత్వర్థకము లుండునపుడు విశేష్య మేవిభక్తి నందియున్నను విశేషణము ప్రథమాంతమే యగునని భావము. విశేష్యమునందు సిద్ధమైయున్న విశేష

మునే విశేషణము తెలిపెడిఁ గాన సాధారణముగ సుబంతవిశేషణములకుఁదుదిని భూతార్థకములు గాఁజాలు నగుధాతురూపములం జేర్చియే ప్రయోగించుట చూపట్టెడి. అగు-జౌ-అయిన-ఐన మొదలగునవియే పైవిషయమునుబట్టి విశేషణములతుదిని జేరు భవత్యర్థములని యననొప్పెడి. 'విద్యాశాలి యగుపురుషుని' ఇచట నగు ననునది భవత్యర్థము. అగు ననుదానిచే వ్యవహిత మగువిశేషణము విద్యాశాలి. పురుషుని నునువిశేష్యము ద్వితీయైకవచనాంతముగానఁ దద్విశేషణ మగునిదియు 19చే ద్వితీయైకవచనాంతము గావలెను కాని యిది భవత్యర్థముచే వేఱుచేయఁబడినవిశేషణము గాన నీవిధిచేఁ బ్రథమ సిద్ధించి విద్యాశాలి యని కారకమేర్పడెను. ఇది విశేషణంబుద్వేయకు భవత్యర్థ వ్యవధానమునఁ బ్రథమ యగుట కుదాహరణము. 'భూతదయాళురగు మహాత్ములకు' ఇచట నగునను దానిచే వ్యవహితమైన భూతదయాళుశబ్దమునకుఁ బ్రథమ యీవిధిచే నయ్యెఁ గాన భూతదయాళురని కారకము సిద్ధించెను. భవత్యర్థవ్యవహితముగాని యపుడు 'విద్యాశాలిని బురుషుని; భూతదయాళురకు మహాత్ములకు; భూతదయాళురు మహాత్ములకు' అనురూపములు గలుగుటను స్మరించునది. విశేషణత్వమును విశదపఱచునది భవత్యర్థకము. ప్రథమాంతపూర్వపద విశేషణత్వమునే యది ప్రకాశిత మొనర్చెడిఁ గాని యితరవిభక్త్యంతములైన విశేషణముల విశేషణత్వమునది యన్వయసంబంధాభావమునఁ దెలుపఁజాలదు. కాన భవత్యర్థవ్యవహితవిశేషణమునకుఁ బ్రథమయే శరణ్యమయ్యె. 'అతిమానుషమత్యద్భుతమతిదుష్కరమయిన కేశవార్జునకృతి' విశేషణములు వరుసగాఁ బెక్కులై తోఁచునపుడు ప్రతివిశేషణమును దవిలి భవత్యర్థకముండి విశేషణవిశేష్యముల వేఱుపఱుపనక్కఱలేదనియుఁ దుదివిశేషణము భవత్యర్థసహిత మైయున్నచో నెల్లవిశేషణములను భవత్యర్థవ్యవహితములుగనే భావించి ప్రథమ గూర్పవచ్చుననియుఁ దెలుపనీయుదాహరణమును సూరి యిచ్చెనని యెఱుంగునది. ఇచట కేశవార్జునకృతికి ద్వితీయాంతమునకు విశేషణములైన 'అతిమానుష-అత్యద్భుత-అతిదుష్కర' అనుపదములను తుదివిశేషణమునకుఁ దగిలి యున్న యయిన యనుభవత్యర్థమునుబట్టి భవత్యర్థవ్యవహితములుగనే యెంచి వాని ద్వితీయకుఁ బ్రథమ గూర్చెనని గ్రహించునది. ఇది నన్నయభారతోద్ధృతము. (చూ. క. మ. టీ.)

భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబునకును దానిముందు
విశేషణంబుల కయిపదంబును బహుళంబుగా
ననుప్రయుక్తంబగు ౨౯.

అతులుఁ డయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు,

టీ. విశేషణము లనేకము లగునపుడు విశేష్యమునకు సమీపమున (పూర్వమున) నున్నదానికి భవత్యర్థకమును దక్కినవానికి 'అయి' అనుపదమును బహుళముగ నెన్నంటి ప్రయోగింపఁబడును. అనఁగా విశేషణములు పెక్కులై వరుసగఁ బ్రయోగింపఁబడి వానితరువాత విశేష్యము ప్రయుక్త మై యున్నపుడు విశేష్యమునకుఁ బూర్వమున నున్న విశేషణమునకు అగు ఔ మొదలగు భవత్యర్థములలో నేదేనియుం, భవత్యర్థము చేరినవిశేషణములకు ముందున్నవిశేషణములకు అయిపదమును, జేరునని భావము. ఏది చేరినను భవత్యర్థవ్యవహితములే విశేషణములగుంగాన 28 చేఁ బ్రథమ విశేషణముల కగు. 'అతులుఁడై యప్రమేయుఁ డౌహరిని':—ఇచట హరినను విశేష్యమునకు సమీపమునఁ బూర్వమున నున్న యప్రమేయ విశేషణమునకు భవత్యర్థమగు 'ఔ' అనునదియు దానికి ముందున్నదాని కయిపదంబును నీవిధిచే ననుప్రయుక్తము లయ్యె. పూర్వసూత్రముచే భవత్యర్థవ్యవధానమున విశేషణములకుఁ బ్రథమ సిద్ధించె. విశేషణత్వమును వెల్లడింప భవత్యర్థము లన్వయసరసోపస్థితి ననుసరించి కవులు ప్రయోగించు పద్ధతి వివిధమును నంశము సూచితము.

**అయిపదానుప్రయోగంబు లేనిచోఁ దుదివిశేషణంబునకేని విశేషణంబు లన్నింటికేని మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపంబడు. 30.**

ఆద్యుఁ డప్రమేయుఁడు నగుహరినిగొలుతు. ఆద్యుఁడు నమేయగుణుఁడు నౌహరిని గొలుతు. ఆద్యుఁ డప్రమేయుండగు హరిని గొలుతు.

టీ. పూర్వసూత్రముచే భవత్యర్థకముతోఁ గూడి విశేష్యమునకు ముందున్న విశేషణమునకుఁ బూర్వమున నుండిన విశేషణముల కయిపదము చేరనిపక్షమున భవత్యర్థకముతోఁ గూడినవిశేణషమున నొక్కదానికిఁ గాని లేక విశేషణము లన్నంటికిఁ గాని సముచ్చయార్థకనువర్ణము చేరునని భావము. పెక్కువిశేషణము లగునెడ సముచ్చయార్థక నువర్ణము చేరుట సహజమె. నువర్ణక మొక్కచో నున్నను సముచ్చయార్థస్ఫురణ కడ్డంకి లేమి నొక్కవిశేషణంబునకేని యనుట పొసఁగెడి. 'ఆద్యుఁడప్రమేయుఁడు నగుహరిని గొలుతు':—ఈవాక్యమున హరిననుదానికి విశేషణములైన 'ఆద్యుఁడు, అప్రమేయుఁడు' అనువానిలోఁ దుదివిశేషణమగు 'అప్రమేయుఁ'డనుదానికి మాత్రమే యయిపద మనుప్రయుక్తము గాలేదుగాన సముచ్చయార్థకమగునువర్ణమే చేరెను. ఇట్లే 'ఆద్యుఁడు నమేయగుణుఁడు నౌహరిని గొలుతు' ననువాక్యమున భవత్యర్థకముతోఁ గూడినదానికిని దానిముందుదానికిని గూడ సముచ్చయార్థక

నువర్ణము మీఁదఁ జేరెను. విశేషణము లన్నింటికి మీఁద సముచ్చయార్థకము చేరుట కిది యుదాహరణము. పూర్వసూత్రముచేనైన అయి పదానుప్రయోగమున సముచ్చయార్థము విశేషణములకుఁ జేరుట యాంధ్రవాక్యపద్ధతికి సహజమైనట్లు తోఁచదు. ఆద్యుఁడునయి నప్రమేయుఁడునై నిత్యుఁడు నౌయీశుని ననురీతిని శ్లిష్టార్థకమగుట వాక్యము గలుగదని తోఁచెడి. ఈవిధి వైకల్పికమగుటంజేసి సముచ్చయార్థమును, బూర్వవిధియు బాహుళిక మగుటంజేసి యయిపదమును, గాకున్న 28 చేఁ బ్రథమ గలుగ 'ఆద్యుఁడప్రమేయుఁడగుహరి' నని వాక్య మేర్పడెడి. భవత్యర్థ వ్యవహితమగు విశేషణములకె 28-29-30-31 సూత్రములు సంబంధించినవని గ్రహించునది. కాన భవత్యర్థవ్యవహితములు గానివానికి 19 చే విశేష్యలింగవిభక్తివచనము లగుననుట మఱువరాదు.

ధాతుజవిశేషణవ్యవధానంబున విశేషణంబులన్నింటి కయిపదం బనుప్రయుక్తంబగు. ౩౧.

ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడు దేవుని నభినుతింతు ఇచట మఱియుం బ్రయోగవైచిత్ర్యంబు గలదది ప్రయోగంబుల నెఱుంగునది.

టీ. విశేషణములను విశేష్యమును వేఱుచేయుచు వానినడుమ ధాతుజవిశేషణమున్నచో విశేషణములెల్ల నయిపదమును బొందెడినని భావము. ధాతుజవిశేషణము లనఁగాఁ గ్రియలనుండి పుట్టిన విశేషణములని భావము. ఇవియేడు. చూ. క్రియ44-45-46-47 సూత్రములు. 'ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడు దేవుని':—ఇచట నొసంగెడను ధాతుజవిశేషణముచే విశేషణములెల్ల వ్యవహితములగుచున్నవి గాన నీవిధిచే నెల్లవిశేషణముల కయిపదము చేరెనని గ్రహించునది. అయిఐరూపమును బొందియుఁ విశేషణములమీఁద నుండదగును. విశేష్యమందలి విశేషములను గ్రమముగ స్పష్టపఱుప నీభవత్యర్థకాయిపదానుప్రయోగము విశేషణముల కగునని గ్రహించునది. ఇట్లీసూత్రమునఁ జెప్పినరీతిని గాక కొన్నివిశేషణములు మాత్రమే యయిపదానుప్రయుక్తము లగుటయుఁ గొన్ని యట్లు గాకుండుటయు మొదలగు విశేషములు బ్రయోగములందుఁ దోఁచెడిననియు, నట్టివిశేషములఁ గవివ్యవహారము ననుసరించి గ్రహింపవలెను గాని యనంతములగు నవ్విశేషములను మార్గప్రదర్శన మాత్రపరమగునిందుఁ బ్రదర్శింప నవకాశము లేదనియు, 'ఇచట మఱియుఁ బ్రయోగ వైచిత్ర్యముగలదది ప్రయోగంబుల నెఱుంగునదని సూరివ్రాసినవివరణమున కభిప్రాయము.

'ఆద్యుఁడప్రమేయుఁడఖిలసేవ్యుఁడునై యెసంగెడు దేవదేవుఁడు విష్ణువు ప్రోచుఁగాక; మాధవుం డుదితసంరంభియై లక్ష్మీయుతుండై పాదచారియై గజేంద్రరక్షణబద్ధకంకణుండై లక్ష్మీసమేతుండై యేతెంచె; ఆద్యుఁడప్రమేయుఁడునునై యఖిలజనసేవ్యుఁడైన హరిని గొల్తు' అనునిట్టివియు: పై వివరణమునకు గుఱి గానోపును. పరిశీలింప విశేషణముల కెల్ల వానికిఁ దుదిని విశేష్య మున్నపుడు విశేషణము లయిపదమునందియు భవత్యర్థధాతుజ విశేషణవ్యవహితములు గాకుండుటయు ముందు విశేష్యముండి విశేషణములనంతరమున నున్నపుడు విశేషణము లయిపదముతోఁ గూడియు ధాతుజవిశేషణవ్యవహితములు గాఁజాలమియు సముచ్చయనువర్ణముతోఁ బాటుగ నయిపదమును సన్నిహితవిశేషణమే యంది తక్కినవి యేదాని నందక లేక యెల్లవిశేషణములును సముచ్చయనువర్ణమునంది ధాతుజవిశేషణవ్యవధానమునను నొప్పుటయు నను మొదలగు ప్రయోగవైచిత్ర్యములు పలురకముల నగపడుంగాన వానిని గవిప్రయోగములంబట్టియే యెఱుంగుట యావశ్యక మనుట యనుచితము గాఁజాలదు. అనఁగా నీవిధి ధాతుజవిశేషణావ్యవధానమునను గలుగుట ప్రయోగసిద్ధమని భావము.

## భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు. ౩౭.

రాముఁడు వచ్చుట - రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె - రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు - రాముఁడు పట్టిన ప్రతిన వారింపం దరంబుగాదు.

టీ. భావార్థకము మొదలగుపదములతోడి యన్వయమునఁ గర్తృపదమగునట్టి దానికిఁ బ్రథమ యగును. భావార్థకాదులకుఁ గర్తయై వానితో నన్వయించెడుదానికిఁ బ్రథమావిభక్తి యగునని యర్థము. ఈవిధి నిత్యము. భావంబనఁగా ధాత్వర్థమనియు ధాత్వర్థమాత్రమున నగు ప్రత్యయములను గూడినవి భావార్థకములనియు గ్రహింప వలెను. తద్ధిత 1 సూత్రవివరణము లిచట గ్రాహ్యములు గావు. క్రియ 35 సూత్ర వివరణము లీవిషయమున గ్రాహ్యములు. భావార్థకపదముతరువాతియాదిపదముచే ధాతువులకు భావంబున నగునితరరూపములును ధాతువుల కాయాయర్థముల సిద్ధించెడు నసమాపకరూపములును గ్రాహ్యములు. వరుసగఁ గ్రియ 35-36-37-38-39-40-41-42-43-44-45-46-47-సూత్రములచే సిద్ధించెడు రూపములకుఁ గర్తలగువానికిఁ బ్రథమ సిద్ధించునని తాత్పర్యము. ట. (వండుట) క. (వండకమునుపు) మి (వండమి) ఇ. (వండి) క. (వండక) ను (వండను) న. (వండినన్) డు. (వండుడున్) ఎడి (వండెడి) ఎడు (వండెడు) వానిలోపము. (వండు) ఉన్న (వండుచున్న) కల (వండఁగల)

న. (వండిన) ని (వండని). అనునివి భావార్థకములు. ఆదిపదముచే నసమాపకములు నిందు గ్రాహ్యములు. 'రాముఁడు వచ్చుట' ఇచట వచ్చుటనుదానికి రాముఁడు గర్తయైన వాఁడుగానఁ దద్వాచకమునకు దానితోడి యన్వయసంబంధము స్పష్టమగుటఁ బ్రథమ యీవిధిచేనయ్యె. 'రాముఁడు రాఁగా' ఇచట రాఁగానను నుజ్యంతమునకు రాముఁడను నది గర్తయై యన్వయించుటచే దానికిఁ బ్రథమ సిద్ధించె. 'రాముఁడు పట్టిన ప్రతిన' ఇచటను బట్టిన యను భూతకాలిక క్రియారూపముచేఁ దెలుపఁబడు వ్యాపారమునకు రాముఁడు కర్తయగుటంజేసి రామపదము దానితో నన్వయించునదనియుఁ బ్రథమ యీవిధిచే సిద్ధించెననియు నెఱుంగునది. వాక్యనిర్దిష్టములైన ప్రధాన సమాపకములకుఁ గర్తలైన వానికెట్లు బ్రథమ కారక 1 సూత్రముచే నుక్తార్థమున సిద్ధించునో యట్లే వాక్యాంతర్గతభావార్థకాసమాపక్రియలకుఁ గర్తలైనవానికిని బ్రథమ గలుగునని యీసూత్రమునకభిప్రాయము. ఇట్లే యాయాభావార్థకములయుఁ నసమాపకములయుఁ యోగమునఁ గర్తలగువానికిఁ బ్రథమ యగుట నూహించుకొనునది.

## ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వు-ను-లును బహుత్వంబున రు-ము-లు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు. 33.

టీ. 'అస్మద్యుష్మద్వాచ్యాదేకత్వఇతోనివీ; పరేషాం తు ధర్మోత్తమమధ్యమవత్; బహుషు న మధ్యమవత్' అనునది మూలము. తెలుఁగున నీ-నాయనునవి యుష్మదస్మచ్ఛబ్దములు. (చూ- సర్వనామప్ర) ప్రథమాంతములైన యుష్మదేకవచనముల విశేషణములకు 'వు' అనునదియుఁ నస్మదేకవచనవిశేషణములకు 'ను' అనునదియు యుష్మద్బహువచనవిశేషములకు 'రు' అనునదియుఁ నస్మద్బహువచనవిశేషణములకు 'ము' అనునదియుఁ టుదిని జేరునని సూత్రార్థము. ప్రథమాంతములగువానికే యీవిధి యనుట మఱువరాదు.

## ఈయాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు. 34.

నీవు ధన్యుఁడవు-నేను ధన్యుఁడను-మీరు ధన్యులరు-మేము ధన్యులము. ఇకారంబుమీఁది కు-ను-వు-క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు ననుసూత్రముచేత వునుల కిత్వంబగు. నీవు సుకృతివి-నేను సుకృతిని - ఆర్తిహరుఁడ వౌనిన్నుఁ గొల్తు నంబుజాక్ష. గర్వ

గరిష్ఠుండగు నన్ను-మీరలు పెద్దలు-ఇత్యాదులు ప్రాయికగ్రహణ ముచే రక్షితంబులయ్యె.

టీ. 'ఉతోచ్చ సర్వేషు' అనునది మూలము. 'వు-ను; రు-ము;' అను పూర్వ సూత్రోక్తములగు నాగమములు పరములగుచుండఁ బూర్వమున నున్న హ్రస్వో కారము హ్రస్వాకారమగు. 'నీవు ధన్యుఁడవు':—ఇచట నీవను యుష్మచ్ఛబ్దప్రథమైక వచనమునకు విశేషణమైన ధన్యుఁడను దానికిఁ బూర్వసూత్రముచే వువర్ణమంతాగమ ముగనయ్యెననియు నీవిధిచే నావువర్ణము పరముగా 'ధన్యుఁడు' అను దానియందలి డుజ్వర్ణకము నుత్వమున కత్వము గల్గెననియుం గ్రహించునది. 'నేను ధన్యుఁడను' ఇచట నేనను నస్మచ్ఛబ్దప్రథమైకవచనమునకు విశేషణమైన ధన్యుఁడను దానికిఁ బూర్వసూత్ర ముచే నువర్ణమును నది పరముగా నీవిధిచే డుజ్వర్ణకము నుత్వమున కత్వమును సిద్ధించె. ఇట్లే తక్కిన రెండుదాహరణములందును క్రమమున మీరను యుష్మచ్ఛబ్ద ప్రథమా బహువచనమునకును మేమను నస్మచ్ఛబ్దప్రథమాబహువచనమునకును విశేషణమైన ధన్యులను దానికి రు-మువర్ణము లంతాగమములుగఁ బూర్వసూత్రముచే నగుటను నీ విధిచే రు-ములకు ముందున్న 'ధన్యులు' అనుదానియం దున్న లువర్ణకము నుత్వమున కత్వమగుటను నూహించికొనునది. ప్రథమాంతయుష్మదస్మద్విశేషణములకేగాని యితర విభక్త్యంతయుష్మదస్మద్విశేషణముల కికార్యములు గలుగవని గ్రహించునది. ప్రథమేతర యుష్మదస్మద్విశేషణములకు ముందుచెప్పిన విశేషణములకగు కార్యములే యాయాసూత్రములచే యథాసంభవముగ నగుట నూహించికొనునది. 'నీవు-మీరు-నేను-మేము' అను వాని యాద్యక్షరములు పలుకుబడిలోఁ జాఱిపోఁగా మిగిలినవర్ణములే పూర్వసూత్రములచేత నంతాగమములుగ సిద్ధించినవనియు నుత్వవిశిష్టముల రెండింటిని బలుకుట కష్టముగాన నుచ్చారణసౌకర్యము నపేక్షించి యందు మొదటియుత్వ మత్వ మగుటనే యీసూత్రము స్పష్టపఱచెడిననియుఁ బాఠకులకుఁ దెల్లంబ. దీనినిబట్టి యాది కాలమునఁ బండితుఁడు నేను మొదలగురీతినే విశేషణము తరువాతఁ దద్విశేష్యము నిడి విశేషణ విశేష్యభావమును దెలిపెడివారనియుఁ గాలక్రమమున నుచ్చారణ సౌకర్యాపేక్షచేఁ దుదిప్రకృతుల యాదిమభాగములు లుప్తములై యచ్చులమార్పు గలుగుట నిట్టిరూపము లేర్పడెననియు నిట్లు ప్రకృతుల యాద్యక్షరములు తెగుటకుఁ బలుకుబడిలో యొత్తిపలుకఁబడి లేమియే కారణమనియుఁ దత్త్వజ్ఞులకుఁ దెల్లంబ. ప్రథ మేతరవిభక్త్యేకవచనబహువచనములందున్న యుష్మదస్మచ్ఛబ్దముల విశేషణములకు భవ త్యర్థకాదియోగమునఁ బ్రథమసంభవించెనేని యవి ప్రథమాంతయుష్మదస్మద్విశేషణములు గానోపెడిఁగాన నపుడును నీవిధిచేతను బూర్వసూత్రముచేతను నగు కార్యములు గలుగు

నని యెఱుంగవలెను. పండితుఁడనగు నన్ను - బుద్ధిమంతులరగు మీకు-పుణ్యాత్ముఁడవగు నీవలన-అదృష్టవంతులమగు మాచే-మొదలగునవియు సాధువులగును. ఇందులకు 'ఆర్తిహరుఁడ వౌనిను గొల్తు' అను నుదాహరణమే ప్రమాణము. ఇచ్చో 'నిను' అనుద్వితీయైకవచనాంతయుష్మచ్ఛబ్దమునకు విశేషణమైన 'ఆర్తిహర' అను పదము 'ఔ' అను భవత్యర్థవ్యవధానమునం జేసి ప్రథమాంతమయ్యెననియుఁ బ్రథమైకవచనాంతయుష్మ ద్విశేషణ మగుటచేఁ బూర్వసూత్రముచే వువర్ణమును దీసిచే దానిముందున్న యత్వమున కుత్వమును సిద్ధించెనను విషయము స్పష్టము. ఈయాగమము లికారాంతైకవచనములమీఁదనైనచోఁ దత్సమము 26 చే నుదంతములైన యావర్ణము లిదంతములగునని యికారంబుమీది యను సూరి యీ క్రిందివివరణమున కభిప్రాయము. 'నీవు సుకృతివి-నేను సుకృతిని' అను నుదాహరణములందుఁ బూర్వసూత్రముచే సిద్ధించిన వునుల యుత్వమునకుఁ దత్సమము 26 చే నిత్వము గలుగుటను గమనించునది. వునులును రుములును బ్రాయికముగ నగునని సూత్రమునఁ బ్రాయశ్శబ్దమును బ్రయోగించి చెప్పుటం జేసి సాధారణముగఁ బ్రథమాంతయుష్మదస్మద్విశేషణములమీఁద నాయాగములు గలుగుననియుఁ గ్వాచిత్కముగఁ గొండొకచోఁ గలుగకున్నఁ గలుగకపోవచ్చుననియు నర్థము లభించెడిఁ గాన 'గర్వగరిష్ఠుండగు నన్ను' అను నుదాహరణమున నస్మచ్ఛబ్దవిశేషణమై భవత్యర్థవ్యవధానమునఁ బ్రథమైకవచనాంతమైన గర్వగరిష్ఠుఁడను దానికి నువర్ణము చేరకుండుటయుఁ దదాధారమగు నత్వకార్యము సంభవింపకుండుటయు; 'మీరలు పెద్దలు' అను నుదాహరణమున 'మీరలు' అను ప్రథమా బహువచనాంతమైన యుష్మచ్ఛబ్దమునకు విశేషణమగు 'పెద్దలు' అనుదానికి రువర్ణము పూర్వసూత్రముచే రాకుండుటయు నత్వ మీవిధిచేఁ గలుగకుండుటయు; సాధువు లయ్యెనని గర్వగరిష్ఠుం డగు నన్ను నను సూరివివరణమున కభిప్రాయమని యెఱుంగునది. త్రిలింగలక్షణశేషకర్త 'తచ్ఛబ్దాంతములగు ధాతుజవిశేషణములమీఁద నరు చూపట్టదని సూత్రించి మీరేయే గిరుల్మెట్టినారు.' అను మొదలగు ప్రయోగముల నుదాహరించి యీసందర్భమును బూరించినాఁడు. సూరి ప్రథమాంత యుష్మదస్మద్విశేషణముల పరముగనే 33-34 విధుల నెంచెనని యుదాహృతులంబట్టి స్పష్టపడుచుండుటంబట్టియు సూత్రము యుష్మదస్మద్విశేషణములందెల్లను వ్యాపించునదగుటంబట్టియు సూరిప్రాయశ్శబ్దమును నిల్పినను ద్రిలింగలక్షణశేషకర్త యాదారిపట్టెనని తెలియవలెను. 'పాండుభూవరునకుఁ గోడలైతి' అను మున్నగు ప్రయోగములు 33 విధికి వ్యతిరేకములైనవి గలవు. కాని యట్టివానిని సూరి 33 నందలి ప్రాయోగ్రహణముచే రక్షించెను. అహోబలాదులు 33 నకు వ్యతిరేకములైనవాని నసాధువులని నిరాకరించిరి. యుష్మదస్మద్విశేషణము

లేమార్గముచేఁ బ్రథమాంతము లైనను వు ను రు ము లంతాగమములగు ననవలసి యున్నదిగాని షష్ఠ్యంతయుష్మదస్మద్విశేషణములకు 27 సిద్ధించెడు ప్రథమారూపములకు మాత్ర మీయాగమములు గలుగవని గ్రహించునది. 19-27-28 సూత్రములచే యుష్మదస్మద్విశేషణములు ప్రథమాంతములై గన్పట్టెడి. 27 చే నగు ప్రథమాంతవిశేషణములకు మాత్ర మీకార్యము గలుగదని భావము. ఇదంతములమీఁది యుత్వవిశిష్టము లీయాగమవర్ణములఁ బల్కుట దుష్కరమగుటచే నుచ్చారణసుఖము నపేక్షించి యవి యికారాంతములు పలుకఁబడిలో నయ్యెనని యెఱుంగునది. మహద్వాచకప్రథమాంత యుష్మదస్మద్విశేషణములకే 33-34 సూత్రములచే నగు నాగమములును నత్వమును నగునని యెఱుంగునది. మహతీవాచక యుష్మదస్మద్బోధకముల కేకత్వమున మీఁదివిధిచే దానాదేశమును, బహుత్వమునఁ దద్బోధకములు మహద్రూపములనే (వారు) పొంది యుండెడిఁగాన నీవిధిచేతనే వానికి రు-ములును నత్వమును నగునని యెఱుంగునది.

## అదిశబ్దంబునకు వు ను లు పరంబు లగునపుడును సంబోధనంబునందును దాన యనునాదేశం బగు. 35.

నీవు చిన్నదానవు- నేను జిన్నదానను-ఓ చిన్నదాన.

టీ. 33 చే వునులను నందునపుడును సంబోధనమునను నది శబ్దమునకు 'దాన' అనునది యాదేశమగును. మహతీవాచక యుష్మదస్మద్బోధకమై లేక మహతీవాచక యుష్మదస్మత్కర్తృకమై ప్రథమైకవచనమైన యది శబ్దమే యీయాదేశమునందుట కర్హము. మహతీ బహుత్వవాచక యుష్మదస్మద్బోధకము లేక మహతీ బహుత్వవాచక యుష్మదస్మత్కర్తృకము ప్రథమాంత మదిశబ్దము (అచ్ఛిక 26 చే) మహత్సర్వనామ మై (వారు) యెప్పెడిఁ గాన నపుడు దానాదేశమునకుఁ బ్రసక్తి లేకుండుటయే గాక 33 చేతనే రుములు గలుగునని గ్రహించునది. ఆమహద్వాచకయుష్మదస్మద్బోధక ప్రథమాంత తచ్ఛబ్ద రూపములకును వివక్షించేసి యేకత్వమునను సంబుద్ధిని దానాదేశమును; బహుత్వమున రుములును; నయ్యెడి. (ఓవృక్షమా! నీవు చిన్నదానవు. ఓ వృక్షములారా! మీరు ధన్యులరు) నీవు చిన్నదానవు:—ఇట 'చిన్న+అది' అని యుండ నిందదిశబ్దమునకు 33 చే వువర్ణకమును, నది పరముగా నీవిధిచే 'దాన' అనున దాదేశమును, నై 'చిన్నదానవు' అని రూపమేర్పడె. ప్రథమాంత యుష్మత్కర్తృకమని బోధింప వాక్యమున నీవనునది యుంచి చూపఁబడియెను. ఇట్లే నేను జిన్నదానను వాక్యమున 'చిన్న+అది' అని యుండ 33 చే నువర్ణమును నది పరముగా నీ సూత్రముచే దానాదేశమును సిద్ధించి పైరూపమేర్పడెను. నేనని చూపుట యస్మ

తత్కర్తృకత్వ సూచనార్థము. 'ఓచిన్న+అది' అని యుండ సంబుద్ధి నీవిధిచే నది శబ్దమునకు దానాదేశము రా 'ఓ చిన్నదానా!' అను రూపమయ్యె. తత్సమము 33 చే వికల్పముగఁ దుదియచ్చు దీర్ఘమగుటను స్మరించికొనునది. ఆది-వర్ణవ్యత్యయముచే 'దా' అగుటయుఁ ద్వితీయయాద్యేకవచనముల 'దాని' అనురూపముల నందుటయుఁ బ్రసిద్ధము. ఆరూపమే వునులు పరమగునపుడును సంబుద్ధిని బ్రత్యక్షమయ్యెనని యూహింపనగు.

## అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు 36.

వారును మీరును ధన్యులరు. మీరును మేమును ధన్యులము.

టీ. 'ఒకవాక్యమున నన్యమును నీవును నేనును గర్తలగునపుడు తద్విశేషణములు గాని ముఖ్యముగఁ బత్క్రియలుగాని దేనికి సంబంధించి యుండవలెను? ఏదో యొక్కదానికేగాని కొన్నింటికి సంబంధించినట్లు గాని యన్నింటికి సంబంధించునట్లుగాని యుంచుట కవకాశము లేదు గదా?' అను ప్రశ్న 33 సూత్రమునుబట్టి కలుగ నవకాశముండుటం జేసి యద్దాని కీసూత్ర ముత్తరముగఁ గల్పించెను. ప్రథమమధ్యమోత్తమపురుషకార్యముల కొక్కచోట సమావేశము గల్గినచోఁ బ్రథమపురుషకార్యమునకంటె మధ్యమపురుషకార్యమును మధ్యమపురుషకార్యమునకంటె నుత్తరపురుషకార్యమును బ్రబలములగునని సూత్రార్థము. ఏకవాక్యమునందుఁ బ్రథమమధ్యమోత్తమపురుషంబులకు మూఁటికి సమావేశంబు సంభవించిన నందుత్తమపురుషమునకును, బ్రథమమధ్యమపురుషంబులకు సమావేశము గల్గిన నందు మధ్యమపురుషంబునకును, బ్రథమోత్తమములకు సమావేశమైననం దుత్తమమునకును, మధ్యమోత్తమములకైన నుత్తమమునకును, నొక్క ప్రథమపురుషమునకే యైన నద్దాని కొక్కటికిని, సంబంధించురీతిని విశేషణక్రియలమరియుండవలెనని తాత్పర్యము. ఈసూత్రముచే మధ్యమోత్తమ పురుషకార్యముల నంది శేషించిన యాయారూపములే లోపించిన యాప్రథమమధ్యమపురుషరూపములకు సూచకములగునని గ్రహించునది. 'త్యదాదీనాం మిథస్సవోక్తౌ యత్పరం తచ్ఛిష్యతే' అను సంస్కృతవైయాకరణులసంప్రదాయమును బోలునదిగ దీని భావింపనగును. 'వారును మీరును ధన్యులరు' ఇట ధన్యులైనవారు వారును మీరును నగుటం జేసి వారు మీరనునవి రెండును ధన్యపదాశ్రయములే. కాన ధన్యపదము వారనుదాని ననుసరించి ప్రథమపురుషకార్యము నందవలెనా లేక మీరనుదానింబట్టి మధ్యమపురుషకార్యమును బొందవలెనా యని సందియము గలుగ నీవిధిచే నన్యకార్యమునకన్న యుష్మత్కార్యము ప్రబలమగుట సిద్ధించి దానికనుగుణముగ 33చే ధన్యపదమునకంటె

రువర్ణ మంతాగమముగ నగుటయుం నది పరముగా 34 చే నత్వము గలుగుటయు నై పైకారక మేర్పడెనని యెఱుంగునది. 'మీరును మేమును ధన్యులము' ఇచటం బూర్వము వ్రాసినరీతినే మీరు మేమనురెండుపదములును ధన్యపదాశ్రయములు. ఈవిధిచే యుష్మత్కార్యమునకంటె నస్మత్కార్యము ప్రబలమగుటంజేసి యీవాక్యమున ధన్యపదము 33 చే ముపర్ణమును, 34 చే నత్వమును బొంది పైయాకృతిని ధరించెనని గ్రహించునది. మనము గర్తయగునేని మనమనునది వానిని నెదుటివానిని దన్నునుగూడ బోధించునదిగాన నందు మూఁడుపురుషములయర్థములు నిమిడియున్నట్లు గ్రహించి యీవిధిచే నుత్తమకార్యమునకే ప్రాబల్య మూహించి క్రియ నుత్తమబహుత్వకార్యయుక్తముగఁ జేయవలెనని తోఁచెడి. (మనము ధన్యులము) బహుత్వబోధకప్రత్యయసంఘటనము ప్రథమ మధ్య మో త్తమపురుషసమావేశసూచనార్థము. సూరి యిచ్చిన యుదాహరణములలో ధన్యపదము విధేయవిశేషణము. సముచ్చయము సహార్థక మగుచోఁ గ్రియ యేకవచనాంతమయ్యు నుండఁదగునని త్రిలింగలక్షణశేషకర్త 'ఒకానొకచో సహార్థమున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాషనగు' అని సూత్రించి సోదాహరణముగ వివరించుట నరయునది. 'విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీనిషాదియున్.'

ఏకవాక్యంబునం దొకానొక్కండు తక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంజను. 32.

పూర్వమిది పరమిది యను నియమ మపేక్షింపక వాక్యమం దెల్లపదంబులు వలచినట్లు ప్రయోగింపందగును- ఏనిప్రభృతిశబ్దములు కొన్ని నియమసాపేక్షంబు లయియుండు-గాలి చల్లగా వీచెను-వీచెను జల్లగా గాలి-చల్లగా గాలివీచెను - వీచెను గాలి చల్లగా-గాలి వీచెను జల్లగా-చల్లగా వీచెను గాలి.

ఇది కారకపరిచ్ఛేదము.

---

టీ. 'వ్యవహితాశ్చ సర్వే స్యుః' అనునది మూలము గానోపును. కర్తృకర్మక్రియలతోఁగూడిన యఖండవాక్యమున నేదో యొకపదము తప్పఁ దక్కినపదములెల్ల నిచ్చవచ్చినరీతి నిది ముం దిదివెనుక యని తలంపక ప్రయోగింపనగును. కర్తృకర్మక్రియ లన్వయక్రమము ననుసరించి, యేదాని కేది యవ్యవహితపరముగ నుండ

వలెనో, కర్తృకర్మక్రియావిశేషణము లట్లే కర్తృకర్మక్రియల కవ్యవహితపూర్వవర్తులై యుండవలెనో యను విషయముల గమనింపక యిచ్చవచ్చినరీతిని బదప్రయోగము చేయనగునని భావము. కాని తెనుఁగువాక్యమున సంస్కృతవాక్యమునందువలె నిచ్చవచ్చినరీతిని విశేషణవిశేష్యముల నతిదూరముగఁ బ్రయోగించుట గన్పట్టదు. మఱియు కర్తృకర్మాద్యర్థోపస్థితికి దూరముగానిరీతినే క్రమమనపేక్షించి పదప్రయోగమొనర్చుట తెలుఁగు వాక్యమునఁ గన్పట్టెడిఁగాని యెందేని కర్తృకర్మాద్యర్థకములను, వాక్యమున నుంచితిమి గదా యని పదప్రయోగము చేయుట మాత్రము చూపట్టదు. సంస్కృతభాషావాసనావాసితులై తెలుఁగువారు తోఁచినరీతిని బదములఁ బ్రయోగింపరాదని తెల్పుటకుఁ గావలయు నథర్వణుఁడు 'వ్యవధానం చ సాధు స్యాత్ప్రకృతార్థప్రకాశకమ్' అని ప్రకృతార్థప్రకాశనమునకు భంగమును గలిగింపని వ్యవధానమే కర్తృకర్మక్రియాదుల కుండవలెనుగాని మఱియొకరీతి నుండరాదని పల్కుటను బరికింప నీవిషయమున సంస్కృతాంధ్రములకు సాదృశ్యము లేదనియే స్పష్టపడెడి. కాన నీసూత్ర మాంధ్రభాషావాక్య సహజస్థితి ప్రకాశము గాఁజాలనిదయ్యెడి. ఏనియనుపద మేదానితోడ నన్వయించునో యాపదము నేగూడి యది యుండును గాని వేఱొకపదముతో నది గలిసి యుండఁజాలదు గాన దానిని విడఁదీసి వేఱొకపదముతోఁ గూర్ప నవకాశము లేమి నట్టిపదములను నియమముగ వాని వానికి సంబంధించిన పదములతోడనే గూర్చి ప్రయోగింపవలెనని 'యేనిప్రభృతి'యను సూరివివరణమున కభిప్రాయము. అగు-వలెను మొదలగు నుపమావాచకములు-ఉత్ప్రేక్షావాచకములు మొదలగునవి యేనిప్రభృతిపదమునందలి ప్రభృతిశబ్దముచే గ్రాహ్యములు. నియమసాపేక్షములు = ఉపమానోత్ప్రేక్షావాచకముల వెనుకనే యుండుట యను నియమముయొక్క యపేక్షతోఁ గూడినవి. కర్తృకర్మాద్యర్థకములవలెఁ గ్రమము నపేక్షింపక ప్రయోగింపఁదగనివగుట నేనిమొదలగునవి నియమసాపేక్షము లయ్యెనని గ్రహించునది. 'గాలి చల్లగా వీచెను':—ఇందు వీచెనను క్రియకుఁ గర్తయైన గాలి యనునది వీచెననుదానికిఁ బూర్వమున నుండవలసియున్నదిగాని యీవిధిచేఁ బదంబులు క్రమనిరపేక్షములై యుండఁదగుటంజేసి చల్లగా నను క్రియావిశేషణము కర్తృక్రియలకు మధ్య ప్రయోగింపఁబడుట సాధువయ్యెనని గ్రహించునది. 'వీచెను జల్లగా గాలి':—ఇందుఁ గ్రియ మొదట నుండుటయుఁ దత్కర్త తుది నుండుటయు వానిమధ్యఁ జల్లగా నను క్రియావిశేషణ మమరి వానిని వేఱుచేయుటయు నీవిధిచే నవిరుద్ధములయ్యెను. 'చల్లగా గాలి వీచెను'.—ఇందుఁ గ్రియావిశేషణమగు చల్లగా ననునది క్రియాసమీపముననుండక మొదట నుండుట యీసూత్రముచే సాధువయ్యె. 'వీచెను గాలి

చల్లగా':—ఇందుఁ గ్రియ మొదటఁ బ్రయుక్తమగుటయుం దానికి సంబంధించిన విశేషణము తుదిని బ్రయోగింపఁబడుటయుం నీవిధిచేఁ బొసఁగె. 'గాలి వీచెను జల్లగా':— ఇందుఁ జల్లగా నను క్రియావిశేషణము క్రియకు ముందుండుటకు బదులుగా వెనుక నుండుటయుం నీవిధిచే నవిరుద్ధంబయ్యె. 'చల్లగా వీచెను గాలి':—ఇందు గాలియనుకర్తృపదము వాక్యాది నుండవలసినది వాక్యము తుదినుండుట యీసూత్రముచే సాధువయ్యె. కాని 'క్రియాయాస్తు ప్రయోగస్స్యాత్కారకాద్యంతభాగయోః, మధ్యభాగే తత్ప్రయోగో న సాధు హృదయంగమః' అను నధర్వణోక్తి ననుసరించి యిందలి యైదాఱుదాహరణము లసాధువులగుచున్నవి. ప్రౌఢవ్యాకర్త చెప్పినట్లు యోగ్యతాకాంక్షాసత్తులకు భంగము గలుగనిరీతిని వాక్యమును రచించుట యావశ్యకమగుట నిట్లు నియమము నపేక్షింపక వలచినయట్లు వాక్యమునఁ బదములఁ బ్రయోగింపవచ్చునను నీ విధి నెల్లయెడల నాదరించి పదములఁ బ్రయోగింపక యేవేని యట్లు వాక్యమున నియమానపేక్షములగునెడల వానిని మాత్రము సాధువులుగాఁజేయ నీవిధి నాధారముగఁ గైకొనఁదగునని యీవిధికి ఫలమును గ్రహింపవలెను. క్రియావిశేషణమే గాని సాధారణ సుబంతవిశేషణ మిందుఁ జూపమిని సుబంతవిశేషణములకు సామాన్యముగ నిట్లు క్రమానపేక్ష సంభవింపదని యెన్ననగు. కర్తృకర్మక్రియలకును దద్విశేషణాదులకును నెంతటి వ్యవధానము తగునో యను విషయమును గూర్చి త్రిలింగలక్షణశేషమునందలి వాక్యపరిచ్ఛేదమును సమాసపరిచ్ఛేదమునందలి 18-26 సూత్రములను గారకపరిచ్ఛేదమునందలి 15 సూత్రమును నాంధ్రభాషావాక్యశైలిని గమనించుచు వక్తవ్యార్థ ప్రకాశనఫలకములగువాక్యముల తెలుఁగున రచింపఁదగు. మఱియుం సులభాపేక్ష నెదుటివాని కర్థమైనఁజాలునని మాట్లాడు నేజనుల వ్యావహారికభాషనైన నిట్లు కారకములయుం, విశేషణవిశేష్యవిభక్తులయుం, వ్యత్యాసము తోఁచుట సహజము. సంస్కృతమర్యాదానుసారియగు నెంతటిపండితుని కవితయందైనను, జాతీయాంధ్ర సహజధర్మములు తత్తత్కాలిక వ్యవహారవాసనను జెప్పకయే చొచ్చుట జరుగుంగాన నీకారకములయుం, విశేష్యవిశేషణ విభక్తులయుం వ్యత్యాసమును నాంధ్రభాషాప్రత్యేకతకుఁ బ్రధానలక్షణముగఁ బరిగ్రహింపఁదగును.

ఇది కారకపరిచ్ఛేదము.

---

# సమాసపరిచ్ఛేదము.

సమాసమన సంక్షేపము. పదములను గలుపునపుడు నడుమఁగల విభక్త్యాదులు విడువఁబడునుగాన సంగ్రహమేర్పడును. మూఁడుకన్నులు గలవాఁడని చెప్పుటకు మాఱుగ ముక్కంటి యనుట సంక్షేపము. ఇట్టి సమాసములస్వరూపాదు లిందుఁ బ్రదర్శితము లగుంగాన నీగ్రంథభాగమునకు సమాసపరిచ్ఛేద మనుపేరు గలిగె. 'సమాస మనఁగా సంయోగదశయందుఁ గలిగెడు విభక్తిలోపాత్మకపదస్వరూపసంగ్రహము· (ఇది లుక్సమాసవిషయము)' అను త్రిలింగలక్షణశేషవివరణము నరయునది.

## సమర్థంబులగుపదంబు లేకపదంబగుట సమాసంబు. ౧.

పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు-
పృథక్ప్రసిద్ధార్థంబులగుపదంబుల కేకార్థంబునందు వృత్తిసామర్థ్యము.

టీ. ఏకార్థంబు లగుపదము లఖండపదముగ నగుట సమాసమని సూత్రార్థము. పృథగ్భూతంబులు = వేర్వేఱుగాఁ నున్నవి. కలయిక లేక యేదానికది వేఱుగా నున్న యర్థములు గలిసి యేకార్థమగుట సామర్థ్యము నాఁబడును. వివిధపదార్థములను బోధించుచు స్వతంత్రములై వెలయుశబ్దములు గలిసి యేకపదార్థబోధకము లగుట సామర్థ్యము. ప్రథమలక్షణము కేవల మార్థికదృష్టితోడను రెండవలక్షణము శబ్దార్థదృష్టితోడను బేర్కొనఁబడినవి. ఇట్టిసామర్థ్యము గలపదము లనేకములు గలిసి యేకపదమగుట సమాసము. 'వ్యపేక్షాసామర్థ్యము-ఏకార్థీభావసామర్థ్యము' అని సామర్థ్యము ద్వివిధము. తమతమ యర్థముల బోధించుచు స్వతంత్రములై వెలయుపదముల కాకాంక్షచేనైన యన్యోన్యసంబంధమును వ్యపేక్షాసామర్థ్యమనియుఁ బ్రక్రియాదశ యందు వేర్వేఱుగ వెలయు పదములను విశేషణవిశేష్యభావముచేఁ గలిపి యేకపదార్థబోధకముగఁ జేయుదాని నేకార్థీభావసామర్థ్యమనియుం సంస్కృతవైయాకరణు లభివర్ణించిరి. 'యజ్ఞదత్తునిశిష్యుఁడు' ఇచట వేర్వేఱుగఁ దమతమయర్థములం దెలుపుచున్న యజ్ఞదత్త శిష్యపదము లేకార్థీభావసామర్థ్యమున నేకార్థబోధకములగుటను గమనించునది. ఇట్లే 'చెట్టువలన నాకు జాఱె' అను మున్నగుచోటుల స్వతంత్రములై తత్తదర్థముల బోధించు పదములకు వ్యపేక్షాసామర్థ్యమున నన్యోన్యసంబం

థము గలుగుటను గమనింపవలెను. ఇట్లేకార్థీభావసామర్థ్యమున నేకపదార్థబోధకమైన పదసమూహామునుండి యొకదానిని విడఁదీయ నవకాశ మిసుమంతయు లేమింజేసియే విశిష్టమునకే విశేషణము నిడుట శాస్త్రసమ్మతమును సయుక్తికమును నయ్యెఁగాని యేకదేశమునకు విశేషణమిడుట యట్లు గాదయ్యెనని గ్రహించునది. కావుననే షష్ఠీసమాసాంతర్గత విశేష్యముల విశేషణములకుఁ బ్రథమ నిడుట యసంగతి గాదని తెలుఁగు లక్షణములకు శాసించుట ప్రసక్తమయ్యె. సమ+అర్థ=సమర్థ=ఏకపదము - అఖండపదమని యర్థము. పాణినీయశకంధ్వాదిసూత్రముచే సమర్థరూపము సాధ్యము.

## సాంస్కృతికాచ్ఛికమిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు. ౨.

సాంస్కృతికంబని యాచ్ఛికంబని మిశ్రంబని సమాసంబు త్రివిధంబు అందు సాంస్కృతికంబు సిద్ధంబని సాధ్యంబని ద్వివిధంబు. కేవల సంస్కృతశబ్దంబులసమాసంబు సిద్ధంబు నాఁబడు రాజాజ్ఞ - తటాకోదకము - లక్ష్మీవల్లభుఁడు సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబు నాఁబడు. రాజునాజ్ఞ - తటాకంబునుదకము - లక్ష్మీవల్లభుఁడు. తక్కిన తెనుఁగుల సమాసం బాచ్ఛికం బనంబడు. తెనియానతి- చెఱువునీరు - సిరిచెలువుఁడు. ఉభయంబులు గూడినది మిశ్రంబనంబడు. రాజుముదల- చెఱువునుదకము-సిరివల్లభుఁడు.

టీ. 'సాంస్కృతికము-ఆచ్ఛికము-మిశ్రము' అని సమాసము మూఁడు తెఱఁగులగును. సాంస్కృతికము = సంస్కృతపదములకు సంబంధించినది. ఆచ్ఛికము = అచ్చతెలుఁగుపదములకు సంబంధించినది. మిశ్రము=సంస్కృతపదములకును, నచ్చతెలుఁగు పదములకును సంబంధించినది. ఇందు మొదటిదైన సాంస్కృతికము సిద్ధమనియు సాధ్యమనియు రెండువిధములగు. సిద్ధమనఁగా సంస్కృతవ్యాకృతిచే సిద్ధించినది. అనఁగాఁ దెలుఁగువిభక్తి చేరని సంస్కృతపదములకు సంస్కృతవ్యాకృతిచేతనే సిద్ధించిన సమాసము సిద్ధమని భావము. మూలమునందలి రాజాజ్ఞేత్యాద్యుదాహరణత్రయము సంస్కృతవ్యాకరణసిద్ధముగాన నవి సిద్ధమున కుదాహృతులయ్యె. రాజునాజ్ఞ మొదలగు మూఁడుదాహరణములు తెలుఁగువిభక్తిచేరిన సంస్కృతపదములకుఁ దెలుఁగు వ్యాకరణముచే సమాసమును నాయాయివిభక్తిలోపాదికార్యములును సిద్ధించెఁగాన నవి సాధ్యము లయ్యెను. తెనియానతి మొదలగు మూఁడుదాహరణములు సంస్కృతసమేతరఘటితములగుటను నవ్వానికి సమాసము తెలుఁగులక్షణముచే సిద్ధమగుటను నవి యాచ్ఛికమున కుదాహృతులయ్యె. రాజుముదల మొదలగు మూఁడును సంస్కృత

సమములయు నాచ్ఛికములయుఁ గలయికచే నేర్పడినవిగాన మిశ్రము లయ్యెను. మిశ్రమున సంస్కృతాచ్ఛికములలో నిదే ముందుండవలెనను నియమములేదు. మీఁది లక్షణముల ననుసరించి తెలుఁగువ్యాకృతిచే సిద్ధించెడు సాధ్యముగాని మిశ్రముగాని తత్పురుషకర్మధారయములే యయ్యెడిఁ గాని యితరములు గాఁజాలవు. (చూ. సమాస ప. 5-6-7 మొదలైనవిధులు) 'రాజుముదల':—ఇందుఁ దత్సమము 78 చే సంస్కృత సమంబైన రాజు శబ్దమునకు యొక్క—షష్ఠ్యంతమునకు ముదల యనుతెలుఁగు శబ్దముతోఁ గర్మధారయము సిద్ధించెఁ గాన నిందు మొదట నున్నది తత్సమంబు. తక్కిన రెండుదాహ రణములందుఁ దరువాతనున్న యుండకవల్లభపదములు సంస్కృతసమములు. ప్రతిసమాస మునకు మూఁడుదాహరణముల నొసంగుట తద్విషయమును దృఢపఱచుటకని గ్రహిం చునది. సాధ్యాచ్ఛికమిశ్రముల విభక్తిలోపాదులును సంధ్యాదికార్యములును నాయా విధులచే నగుటను గమనించికొనునది.

## తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు. 3.

తత్పురుష బహువ్రీహి ద్వంద్వంబులని సమాసంబు లెల్లం ద్రివిధంబులయియుండు. అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయపదార్థ ప్రధానంబు లయియుండు. అందుఁ దత్పురుషంబు వ్యధికరణంబని సమానాధికరణంబని ద్వివిధంబు. ద్వితీయాదులకు మీఁదిపదంబుతోడ సమాసంబు వ్యధికరణంబునాఁబడు. నెలతాల్పు - నెలతక్కువవాఁడు- దేవరమేలు-దొంగభయము - రామునిబాణము - మాటనేర్పరి. విశేష ణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు. ఇదియె కర్మధారయంబు నాఁబడు. సరసపువచనము - తెల్లగుఱ్ఱము - మంచిరాజు ; ఇది సంఖ్యాపూర్వంబు ద్విగువునాఁబడు. ముజ్జగములు - ముల్లోకములు. బహువ్రీహి-ముక్కంటి-చలివెలుఁగు. ద్వంద్వము - తల్లిదండ్రులు-అన్నదమ్ములు. ప్రాయికంబుగా ననుటచే సంస్కృత లక్షణంబుఁ దొడరని సమాసంబుం గలదని సూచింపంబడియె. దానం జేసి చిగురుఁగేలు-జుంటిమోవి యిత్యాదులయిన యుపమానపూర్వ పదకర్మధారయంబులు గ్రాహ్యంబులు. ముఖపద్మము - చరణకమల

ములు - ఇట్టి యుపమానోత్తరపదంబులు గలవుగాని విపరీతంబులు సిద్ధంబులు లేవని యెఱుంగునది. సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు - రాజపురుషుఁడు-నీలోత్పలము - పీతాంబరుఁడు - రామలక్ష్మణులు. కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు. దానంజేసి యనేక మాఱు లల్పదండిత్యాదులు దుష్టములని తెలియునది.

టీ. తత్పురుష మొదలగు సమాసములకుఁ దఱచుగ లక్షణము సంస్కృత వ్యాకరణమునఁ జెప్పఁబడినయట్లే యగునని సూత్రార్థము. 'తత్పురుషము-బహువ్రీహి-ద్వంద్వము' అని సమాసములు మూఁడువిధము లయియుండును. అందుఁ దత్పురుష ముత్తరపదార్థప్రధానమును బహువ్రీహి యన్యపదార్థప్రధానమును ద్వంద్వ ముభయ పదార్థప్రధానమును దఱచుగ నయి యుండును. దొంగభయము-దేవరయానతి-మొదలగు తత్పురుష సమాసములందుఁ బ్రధానముగ భాసిలునది యుత్తరపదార్థమే గానఁ దత్పురుష ముత్తరపదార్థప్రధాన మయ్యెడి. తమ్మికంటి-మొదలగు బహువ్రీహి సమాసములందు సమాసమునందలి పదములు తమకు నియతమైన యర్థములను గాక సమాసమునఁ గూర్పఁబడని పదము నర్థమును జెప్పెడిఁగాన బహువ్రీహి యన్యపదార్థప్రధాన మగుచున్నది. ద్వంద్వమునందలి పదార్థముల కెల్లను నన్వయమునఁ బ్రాధాన్యము చూపట్టెడిఁగాన ద్వంద్వ ముభయపదార్థప్రధానం బగుచున్నది. ప్రాధాన్య మన్వయసంబంధమును బట్టిచూచిన విశదమయ్యెడి. మఱియు సమాసములకు నిడువిశేషణములరీతిని వాని యన్వయాదిసంబంధమును బరిశీలించినను, బైప్రాధాన్యము తేటతెల్లమగు. 'దొంగభయము' మున్నగు తత్పురుషముల భయము మొదలగు నుత్తరపదములచే బోధ్యములగు పదార్థములకే ప్రధానముగ నన్వయసంబంధము పూర్వపదబోధ్య పదార్థముల కుత్తర పదార్థముతోడి సంబంధమేగాని ప్రధానముగ నన్వయసంబంధము లేకుండుటను నరసిన నుత్తరపదార్థప్రధానము తత్పురుషమనుమాట సార్థకమయ్యెడి. ఇట్లే సుందరుఁడు దొంగ భయమని విశేషణము నిడక దారుణమైన దొంగభయమని విశేషణమును వేయురీతిని గమనించిన నుత్తరపదార్థప్రధానము తత్పురుషమనుట స్పష్టపడియెడి. అట్లే తమ్మికంటి మొదలగు బహువ్రీహి సమాసముల తమ్మి-కన్ను పదములు సమాసఘటకముగాని పదము నర్థమును బోధించుటను-మేఘశ్యాముఁడు తమ్మికంటి యనియేగాని యరుణములు తమ్మికంటి యను రీతినిగాని విశాలములు తమ్మికంటి యనుగతిని గాని విశేషణములను వేయ వీలులేకుండుటను బరికించిన బహువ్రీహి యన్యపదార్థప్రధానమగుట విశదమయ్యెడి. ఈరీతినే ద్వంద్వఘటకపదార్థములకు రెండింటి కన్వయసంబంధము తుల్యముగ నొప్పు

టను బరీక్షించిన నుభయపదప్రాధాన్యము సుబోధమగు. సుందరులు రామకృష్ణులను రీతిని ద్వంద్వఘటకపదార్థములకెల్లను సంబంధించెడురీతినే విశేషణమును వేయుట యును శ్వేతుఁడు రామకృష్ణులనిగాని నీలుఁడు రామకృష్ణులని గాని విశేషణము వేయ వీలులేకుండుటయును గమనించిన నుభయపదప్రాధాన్యము సుగమమయ్యెడి- పైని పేర్కొన్న త్రివిధములగు సమాసములలోఁ దత్పురుషము వ్యధికరణసమానాధికరణముల ద్వివిధమగును. ద్వితీయాది విభక్త్యంతములకుఁ దరువాతి పదములతోడి సమాసము వ్యధికరణమనియు విశేషణమునకుఁ దరువాతి విశేష్యముతోడి సమాసమునకు సమానాధికరణ మనియుఁ శాస్త్రకర్తలసంప్రదాయము. వ్యధికరణము=వి+అధికరణము. భిన్నమైన స్థానముగలది యని యర్థము. రాజుకొడుకు మొదలగు ద్వితీయాదులకు మీఁది పదములతో నైన సమాసములందు రాజత్వపుత్త్రత్వము లొకేవస్తువున నిల్చునవి గాక రాజత్వము రాజునందే పుత్త్రత్వము పుత్త్రునందే నిల్చునవిగాన నిట్టిచోటులందు వ్యధికరణత్వమే తోఁచెడి. నల్లకలువ మున్నగుచోటులందు నీలత్వమునకును కుముదత్వమునకును గలువయే తావుగాన నిట్టిచోటులందు సమానాధికరణత్వమే తోఁచెడి. సమానాధికరణము=సమానమనఁగా నేకము. ఏకము=ఒకటి. అధికరణము=తావు 'రెండు ధర్మములకొకటియే తావు' అనియర్థము. నెలతాల్పు మొదలగు నాఱుదాహరణములును గ్రమముగ ద్వితీయాదిసప్తమ్యంతములగు నాఱువిభక్తులపదముకు మీఁదిపదముతో నైన వ్యధికరణ సమాసముల కుదాహరణములు. విశేషణము=విశేష్యనిష్ఠమగు విశేషమును విశదీకరించునది. కావుననే విశేష్యనిష్ఠమగు విశేషమును విశదీకరించు విశేషణము ముందును నద్దానికి వెనుక విశేషణమును నుండుటయే సమాసమున సహజమయ్యెడి. ధర్మధర్ము లవినాభావ సంబంధము గలవి యనుట తెల్లము. ధర్మధర్ములకగు సమాసములు గావుననే యట్టి వానియం దేకాధికరణత్వ మనివార్యముగఁ గన్పట్టెడి. ధర్మము ధర్మినిష్ఠముగాన ధర్మవాచకము విశేషణమగుటయుఁ ధర్మివాచకము విశేష్యమగుటయు సహజమయ్యెడి. కావుననే 'విశేషణమునకు మీఁదిపదముతోడి సమాసము సమానాధికరణము' అని వివరించుటయు సార్థకమయ్యెడి. సమానాధికరణములగు విశేషణవిశేష్యముల కగుసమాసములనే కర్మధారయము లండ్రు. తత్పురుషమే సమానాధికరణమునంజేసి లేక విశేషణ విశేష్యభావమునంజేసి కర్మధారయసంజ్ఞ నందునని తాత్పర్యము. తత్పురుషమున సామానాధికరణ్యము లేక విశేషణ విశేష్యభావము తోఁపదు. కర్మధారయమున సామానాధికరణ్యము స్పష్టముగ నగపడెడి. ఇదియే తత్పురుష కర్మధారయములకుఁ గలభేదము. సరసపువచనము మొదలగు మూఁడుదాహరణములు సమానాధికరణమునకు లేక కర్మధారయమున కుదాహరణములు. విశేషణ విశేష్యభావము తోఁచెడి

కర్మధారయంబులందును విశేషణము సంఖ్యావాచకమైనచో ననఁగా ధర్మము సంఖ్యావాచక బోధ్యమగుచో నట్టిసమాసములు ద్విగువులని పిలువంబడును. అనఁగాఁ గర్మధారయమే సంఖ్యాపూర్వమగునెడల ద్విగువనిపించికొనునని ఫలితము. 'ముజ్జగములు-ముల్లోకములు' అను రెండుదాహరణములును విశేషణ విశేష్యములకైన సమాసములగుటను, నందును సంఖ్యాపూర్వము లగుటను ద్విగుసంజ్ఞనందెడి. త్రిత్వము లోకత్వమును లోకమునందే తోఁచెడిఁగాన నిందేకాధికరణత తోఁచుట స్పష్టంబు. 'ముక్కంటి-చలివెలుఁగు' అను రెండును బహువ్రీహి కుదాహరణములు. 'మూఁడు+కన్నులు-చలి+వెలుఁగు' ఇందుఁ గల యాయాపదార్థములను బోధించుపదము లన్నియుఁ జేరి యన్యపదార్థమునే చెప్పుచున్నవి గాన నివి బహువ్రీహి సమాసము లయ్యెను. 'త్రిత్వవిశిష్టమైనకన్నులు-శీతత్వ విశిష్టమైన వెలుంగులు' అని విశేషణ విశేష్యభావము గోచరించుచున్నను జేరి యవి త్రిత్వవిశిష్టమైన నేత్రములుగల శివుని శీతత్వవిశిష్టమైన వెలుఁగులు గల చంద్రుని నన్యపదార్థములఁ దెల్పుచున్నవి గాన బహువ్రీహిసమాసములు నాఁబడెను. 6 సూత్రమునుబట్టి తెలుఁగున నాచ్ఛిక స్త్రీసమములకే బహువ్రీహి యగునను నియమమునంజేసి యివి సిద్ధించెడి. ఇట్లే పైకర్మధారయోదాహరణములలో 5 సూత్రము ననుసరించి మొదటిది ముగంతవిశేషణ పూర్వకమగుటకును, దక్కిన రెండును స్త్రీసమవిశేషణ పూర్వకమగుటకును నుదాహరణము లగునని యెంచవలెను. 7 సూత్రమునుబట్టి స్త్రీసమములకే తెలుఁగున ద్వంద్వము గలిగెడిఁగానఁ దల్లిదండ్రు లన్నదమ్ములను రెండును ద్వంద్వమున కుదాహరణములు. సూత్రమునందలి ప్రాయశ్శబ్దమునంజేసి సంస్కృతవ్యాకృతియందు నిరూపితములైన సమాసలక్షణములకు వ్యతిరేకములైన సమాసములును దెలుఁగున నగపడుట యవిరుద్ధమయ్యెడి. సంస్కృతలక్షణమునకు లక్ష్యములుగాని సమాసములు తెలుఁగునఁ బొసఁగుటను సూచింప సూత్రమునఁ బ్రాయశ్శబ్దము నిల్పఁబడెనని భావము. (సంస్కృతలక్షణమును=సంస్కృతవ్యాకరణోక్తసమాసలక్షణమును, తొడరని = అనుసరింపని.) అక్కారణమునఁ జిగురుఁగేలు - జుంటిమోవి మొదలగు సంస్కృతలక్షణానుసారులుగాని యుపమానపూర్వపదకర్మధారయములు సాధువు లగుచున్నవి. కేలునకు సాటియైనది చిగురుగానఁ జిగురుపమానము. మోవికి సాటియైనది జున్ను గాన జున్నుపమానము. ఉపమానవాచకము లిందు ముందును, వెనుక నుపమేయములును నిల్చియున్నవిగాన నివి యుపమానపూర్వపదకర్మధారయము లగుచున్నవి. 'ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యా ప్రయోగే' అను విధినిబట్టి సామాన్యధర్మవాచకము ప్రయోగింపఁబడనపుడుపమానవాచకము పరమందును నుపమేయము పూర్వమందును నుండవలెనుగాన

నట్టినియమము జుంటిమోపీత్యాదులం దనాదృతమగుట నవి సంస్కృతలక్షణము ననుసరింపని సమాసములయ్యెను. దేనిని సాటిచేయుదుమో యది యుంపమానము. ఒకదానితోఁ బోల్పఁబడునది యుపమేయము. పోల్పఁదగిన చంద్రాదు లుపమానము లనియుఁ, బోలికకు విషయములగు ముఖాదు లుపమేయములనియు భావము- 'మేఘ శ్యాముఁడు, తటిద్గౌరి' అను మొదలగువానియందు శ్యామత్వగౌరత్వవిశిష్ట ధర్మి వాచక శ్యామతటిత్పదములే ప్రయుక్తములయ్యెఁగాన నట్టివి యవిరుద్ధము లగుచున్నని. తెనుఁగున నట్టిస్థితి యగపడకున్నను మోముఁదమ్మి- మైతీవ మొదలగు నుపమానపూర్వ పదకర్మధారయములును సాధువులే యయ్యెడి. సామాన్యధర్మవాచకాప్రయోగమునను నుపమానపూర్వపదకర్మధారయము తెనుఁగున నుండుట సంస్కృతమునకంటెను విశేష విషయమని ఫలితము. సంస్కృతమున సామాన్యధర్మివాచకప్రయోగము లేనపు డుప మానపూర్వపదకర్మధారయము గలుగదనియుఁ నుపమానోత్తరపదకర్మధారయమే యగు ననియుఁ గాన సిద్ధమున ముఖపద్మము-చరణకమలములనురీతి నుపమానోత్తరపదములే యమరుఁగాని 'కమలచరణములు-పద్మముఖము' అనురీతి నుపమానపూర్వపదము లమర వనియుఁ నిట్టియుపమానోత్తరపదములను మూలస్థమగువివరణమున కభిప్రాయము- సం స్కృతవ్యాకృతిచే సిద్ధించెడు సమాసములెల్ల గ్రామ్యములె యగు. తెలుఁగున నవ్వాని నెల్ల నాదరించి ప్రయోగింప నగునని భావము- సమాసత సిద్ధించినపిదప నేకపదత్వము సిద్ధింప నవ్వానికిఁ దత్సమప్రక్రియంబట్టి తెలుఁగువిభక్తులంజేర్చి ప్రయోగింపనగుట తెల్లంబె. 'రాజపురుష-నీలోత్పల-పీతాంబర-రామలక్ష్మణ' అనుసిద్ధములకుఁ దత్తద్దుచి తములగు తెలుఁగుప్రత్యయములంజేర్చి వ్యవహరించుట నరయునది. క్రమముగఁ బైనాల్గును దత్పురుషకర్మధారయబహువ్రీహిద్వంద్వముల కుదాహరణంబులు. ఆంధ్ర విభక్తిచిహ్నితముగాని సంస్కృతపదమునకుఁ దెనుఁగుపదముతోడ సమాసము గలుగ నవకాశములేదు. ఈవిషయ మాయాతత్పురుషబహువ్రీహిద్వంద్వ సమాసవిధాయక సూత్రములంబట్టియే స్పష్టము. కావున ననేకాల్పశబ్దములు తెలుఁగువిభక్తినందని తమకుఁ బరముననున్న మాఱుదండుపదములతో వికృతులతో సమసించుట దుష్టంబని గణింపనయ్యె. దుష్టము లీరెండును గర్మధారయములు. 5 సూత్రము ననుసరించి ముగంతములై వీనిపూర్వపదములు 'అనేకము అల్పము' అని ముపర్ణకము నందియుండ వలెను. సంధి 32 ననుసరించి పుంపులు గలుగ 'అనేకపుమాఱులు-అల్పపుదండు' అని రూపములు గలుగనోపు. ప్రథమోదాహరణమునందలిది ముపర్ణకము గాక ముంగాగమ మైనను దత్సమము 41 విధిచేఁ. బుంపులు గలుగును. వికృతియనుట ప్రాకృతసమ సంస్కృతభవప్రాకృతభవదేశ్యరూపమగు తెలుఁగుతో సమసింపకుండుటను సూచించుట

కని గ్రహించునది. అకారేకారోకారాంత సంస్కృతపదములమీఁదఁ దత్పురుషమున విభక్తి లోపించుటంజేసి యాంధ్రవిభక్తి చిహ్నితముగాని సంస్కృతపదములకు వికృతి పదములతోడ సమాసము గలిగినట్లు స్థూలదృష్టికిఁ దోఁచెడిఁ గాని యాస్థలములందు జనించిన తెలుఁగువిభక్తి సమాసమున లోపించుటంజేసి యట్లనుకొనుట భ్రాంతిమూలక మని గ్రహించునది. ('హంసనడలు, హరిదీవెన శంభుకొడుకు' మొ.) ఇట్లు సంస్కృతానుసారి ప్రాచీనలాక్షణికమార్గమువట్టి సూరి సమాసములయందదవాంతర భేదము లయు స్థితిని దెనుఁగునను దోఁపఁజేసినను దత్పురుషములలో విభక్తిలోపముంగూర్చిన నొక్కషష్ఠీతత్పురుషమే భాసింపఁదగియుండుటచేతను, జేతతోడవలనాదుల వర్ణకములకు నిత్యాలిగామములంగూర్చి లోపింపకుండఁజేయు ప్రయత్నమును యొక్క షష్ఠీతత్పురుషమే తెనుఁగునకు సహజమైనదని విశదపఱుపఁగలిగి యుండుటచేతను, షష్ఠీసమాసముదక్క నన్యములు కృత్రిమములనుట తగును. ఇట్లే విశేషణమునకు మీఁది విశేష్యముతోడి విశేషణసమాసమే తెనుఁగున సహజమనియుఁ దక్కినవి కాల్పనికములనియు ననఁదగు. ద్వంద్వబహువ్రీహులు కేవలము తెలుఁగు లక్షణమునే యందినవై యవాంతరభేదములంగానక యేకరూపముగ నుండుట గాననగు. ఏకశేషాదులు తెలుఁగునఁ దోఁపవు. కాన నీసమాసావాంతరభేదవిస్తృతివర్ణనము తెలుఁగున కసహజమైనదని తోఁచెడి.

## ఆ ఈ ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు. ౪.

టీ. 'ఆ-ఈ-ఏ' అనునవి సర్వనామములు. వీనికి మూఁడిటికిఁ ద్రికమని సంజ్ఞ. 'ఆ' అనునది తచ్ఛబ్దమునకైన తెలుఁగురూపము. 'ఈ' అనునది ఇదమదశ్శబ్దముల తెలుఁగురూపము. 'ఏ' అనునది. ఏతద్యచ్ఛబ్దముల తెలుఁగురూపము. 'ద్వికము-త్రికము-చతుష్కము-పంచకము-షట్కము' అను మొదలగువానియందలి కవర్ణము సమూహార్థమునఁ గలిగినది. కానఁ ద్రికమన మూఁడింటిమొత్తమని యర్థము తేలెడి. నాన్= అనన్; నాఁబడును=అనఁబడును. 'ఇదమదసేతద్యత్తచ్ఛబ్దాః' అను చింతామణినిబట్టి యచ్చులక్రమము ననుసరించి 'ఆ-ఈ-ఏ' అనువానిని బేర్కొని వ్యాకృతిమర్యాదఙ్ఞుఁడై త్రికమను సంగ్రహనామము నిడియుండ గుప్తార్థప్రకాశిక యిప్పట్టున సూరికై హరికారికాచార్యము నారోపించుట విచార్యము. పాణినీయపారీణహరికారికాకర్తయే బాలవ్యాకరణసంస్కృతీకరణమున 'ఆ-ఈ-ఏ' అనువానికి మొదట గుణమును బిదప నయాదేశముం గూర్చి 'అయే' అని తమపాణినీయపాండిత్యప్రకర్షను బ్రకటించుచ మూల మిదియని భ్రమింపఁజేయ నిట్లనువదించి యుండురనుట సాహసము గాఁజాలదు 'ఆ-ఇ-ఉ' అను వీనిని 'అయవః' అనుచింతామణియే శాస్త్రిగారి నీసందర్భమున 'ఆ-ఈ-ఏ'అనువానిని 'అయే' అని పేర్కొనినట్లు చేసియుండును.

కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండు. ౫.

ఆచందము-ఈచిందము - ఏబృందము-వాఁడిమాట-పోఁడిపాట-బెడిదపుటడిదము - మడిసెడుదడములు. ఈనియమముచే బల్లిదుఁడు మల్లుఁడు - కావలుఁడు రావణుఁడు - ఇత్యాదుల సమాసంబు లేదు.

టీ. 'ఆ-ఈ-ఏ' అనుమూఁటికిఁ ద్రికమని పేరని ముందె యుక్తము. ప్రథమైకవచనలోపమునందిన యాచ్ఛికశబ్దము స్త్రీసమమని యాచ్ఛికపరిచ్ఛేదాదిని నిరూపితము. తత్సమము 40 చే ముగాగమము నందునవి ముగంతములు. క్రియ 44-45 46 చే సిద్ధించెడునవి ధాతుజవిశేషములు. ఎడిప్రభృతివర్ణకాంతములేదును ధాతుజవిశేషణములని ప్రాచీనులు వ్యవహరింతురనువివరణమును గాంచునది. కర్మధారయమన విశేషణమునకు విశేష్యముతోనైన సమాసమని ముందె నిరూపితము. కాఁగాఁ గర్మధారయసమాసమున విశేషణభూతమైన పూర్వపదము త్రికరూపమునఁగాని స్త్రీసమరూపమునఁగాని ముగంతరూపమునఁగాని ధాతుజవిశేషణరూపమునఁగాని నిల్చియుండి తరువాతివిశేష్యముతో సమసించెడినని సూత్రార్థము లభించెడి. 'ఆచందము మొదలుకొని యున్న మూఁడుదాహరణములు త్రికపూర్వపదమున కుదాహరణము. 'వాఁడిమాట-పోఁడిమాట' అనురెండును స్త్రీసమపూర్వపదమున కుదాహృతులు. 'బెడిదము+అడిదము=బెడిదపుటడిదము.' ఇది ముగంతపూర్వపదమున కుదాహృతము. సంధి 32-28 చేఁ బుంపులు టుగాగమమునునగుటను స్మరించునది. 'మడిసెడు దడములు':—ఇది ధాతుజవిశేషణ పూర్వపదమున కుదాహరణము. మడియం=ఎడు+మడిసెడు. క్రియ 44 చే నెడు వర్ణకమును 54 చే యకారమునకు సకారమును నగుటను గమనించునది. కర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణపూర్వపదంబయియుండునేగాని తద్భిన్నపూర్వపదంబయి యుండదని సూత్రమునుబట్టి స్పష్టమగుచుండుటంజేసి బల్లిదుఁడు మున్నగువానివంటి డుమంతములతోఁ గర్మధారయము గలుగదనుట స్పష్టమని యీ నియమముచే నను సూరియాక్రిందివివరణమున కభిప్రాయము. డుమంతము విశేషణమయ్యుఁ బూర్వపదంబు గాదనియు వ్యస్తముగనే ప్రయుక్తమగుననియు భావము. సూత్రమున నుత్తరపదస్వరూపనియమము చేయమిని, ముగంతత తత్సమాచ్ఛికసాధారణమగుటను, ధాతుజవిశేషణమని సామాన్యముగ ననుటను, మిశ్రసమాసఘటన కర్మధారయమున నె గల్గెడినని విశదమగుచున్నది. తత్పురుషకర్మధారయద్విగువులు విశేషధర్మగతిని, భేదించునవిగాని సామాన్యముగ నేకరూపములే యగుట నీమూఁడింటను మిశ్రసమాసము గలుగనగునని గ్రహించునది. సంధి 32 చేఁ గర్మధారయము మువర్ణకపూర్వపదంబై

యుండనగుట స్పష్టపడుటంజేసియు, 41 తత్సమము సూత్రవివరణములంబట్టి కార్య ప్రాప్తినందువిషయమున మువర్ణకము గాగమముల కంతగ భేదము లేమింజేసియు, ముగంతపూర్వపదంబయియుండునని స్పష్టపఱచెనేగాని మువర్ణకపూర్వపదంబయియుండ దని మాత్రము గ్రహింపరాదు. అనఁగా ముగంతమనుమాట మువర్ణకమునకును నుప లక్షణమని గ్రహింపవలెనని భావము. కాని కారకము 20 చే మువర్ణకాంతవిశేషణ ములబహుత్వమున కేకత్వము గల్గనగుట మువర్ణకాంతమనుటర్థ్వాము. ధాతుజవిశేషణ ములు స్త్రీసమతుల్యములె కాని విశేషణత భాసింపఁజేయునాయా ప్రత్యయములు సంస్కృతసమాచ్ఛికధాతు సాధారణములగుటను నా ప్రత్యయముల చేర్పునంజేసియే స్త్రీసమతౌల్య మాయావానికి సిద్ధించుటను, స్త్రీసమమునకంటె భిన్నముగ ధాతుజవిశేషణ ములు లెక్కింపఁబడెనని గ్రహింపవలెను. విశేషణవిశేష్యములకే కర్మధారయ మమరెడి ననియుఁ ద్రికస్త్రీసమ ముగంతధాతుజవిశేషణరూపవిశేషణములే తరువాతివిశేష్య ముతో సమసించెడిఁగాని యితరములు గావనియు ఫలితము. వైలక్షణము ననుసరించి డుమంత (ఉత్తరపదము) స్త్రీసమరూప (పూర్వోత్తరపదములు) సర్వనామములకుఁ గర్మధారయమునఁ బ్రవేశముగలుగుట ప్రసక్తమగుటంజేసి త్రిలింగలక్షణశేషము తఱ చుగ సర్వనామముతోఁడఁ గర్మధారయము చూపట్టదని శాసించుట ప్రసక్తమయ్యెననఁ దగు. విశేషణముల విభజించి విశేషించి వానిరూపు నీరీతిని సూరి చూపి. సుబోధము చేసెనే గాని మూలము విశేషణరూపమును గ్రహించుభార మర్థవిచారణచేఁ బాఠకులే గ్రహింతురని వదలి 'సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం కర్మధారయో భవతి' అని సూత్రించి కర్మధారయసామాన్యముల నేకరువువేయక చిత్రమగుకర్మధారయభేదమును మాత్రము విశేషించి సుబోధము చేసినది.

వ్యాఖ్యాతలు 'ఆంధ్రషడ్వర్ణపర్యంతం పదం స్యాత్కర్మధారయే' లేదా 'ఆంధ్రః షడ్వర్ణపర్యంతం సంస్కృతేన సమస్యతే' అను పరంపరాయాతమగు నొక కారిక నాథర్వణమున దూర్పఁబడినదానిని నథర్వణకారికాస్థమై మూలస్థపరిమితశబ్ద మును వివరించుదానినిగ భ్రమించి 'వాడిమయూఖములు; వేడిపయోధారలు' మొదలగు కర్మధారయముల సాధించునదిగ మూలమున కర్థము చేసిరి. కాని 'కటికిచీఁకటితిండికర ములు; వలపులయెకిమీనిసలి; ఓర్వఁజాలనివాఁడిమయూఖములు' అను మొదలగు ప్రయోగ ములు షడ్వర్ణపరిమితములు గామిని బై వ్యాఖ్యాతలయాశయ మసంగతమయ్యెడి. కొంద ఱాఱువర్ణము లనుదానికి ఖండాంధ్రపదమాఱువర్ణములకు మించనిదై యుండవలెనని యర్థము గాని సమాసమునందలి పదముల నెల్లఁ గలిపి వర్ణాధిక్యమును శంకించి యసాధు త్వమును గల్పింపరాదనియుఁ 'గటికి-చీఁకటి-తిండి.' యఘనవి మూఁడుపదములనియు

వానిమొత్త మాఱింటికి మించెనుగాన నిందు దోషము లేదనియుం నొకేపదమాఱువర్ణములకు మించినది యట్లు సమసింపరాదనియుం నంద్రు కాని యొకే తెలుఁగుపదమాఱు వర్ణములకు మించియున్నవి సాధారణముగ మృగ్యమగుటఁ బైవిషయము నిరాధారమని యనక తీరదు. కాఁగా నెట్టికర్మధారయమును బోధింప మూలము పైరీతిని యత్నించెనో కనుఁగొనవలసియున్నది. 'ద్వ్యక్షరాది చతుర్వర్ణపర్యంతజననామసు, లోపస్స్యాత్ డ్వాది వర్ణానాం శబ్దే రాజాదికే పరే, క్వచిదత్వం క్వచిచ్చాత్వం క్వచిదిత్వం క్వచిత్స్వతా, క్వచిన్మత్వం యథాయోగమన్యచ్చ వ్యవహారతః.' అని యాథర్వణము మూలస్థమగు పరిమితశబ్దమును వివరించుటంబట్టి రామరాజు-కృష్ణరాయఁడు మొదలగు కర్మధారయముల సాధింప మూలసూత్ర మారబ్ధమయ్యెనని గ్రహింపవలసియున్నది. మఱియుం నిది సామాన్యకర్మధారయసమాసపరముగ భ్రమించుచు 'ఆంధ్రః' అనుకారికనాథర్వణస్థముగ నెన్నుచు సరస్వత్యాదులు మూలమున కర్థము వ్రాయుట యసంగతమనక తప్పదు. చింతామణి యాంధ్రవిభక్తిచిహ్నితములగు నాయావాని కొయాసమాసములు గల్గుటను సూచనామాత్రసారముగ నిరూపించియు 'సంస్కృతపదేన పరిమితమ్' అనుకారిక రచించుటకు విభక్తిలోపాదికార్యవిశేషములు చూపట్టు నిట్టి కర్మధారయవిశేషమును బోధించుటే ఫలమనుట యొప్పెడి. (చూ. మదాంధ్రగురువరుల చింతామణివిషయపరిశోధనము. పేరా 56) కాని నిపుణముగఁ బరిశీలింప నన్నయ తాఁ బ్రయోగించిన 'కపిలకన్నులు-కపిలజడలు-కపిలగడ్డను.' అను మొదలగు నాంధ్రవిభక్తిచిహ్నితములుగాని శుద్ధసంస్కృతపదములకుఁ దెలుఁగుపదములతోనైన కర్మధారయసమాసములను సంగ్రహించి సాధుత్వమొసంగ నీసూత్రము ప్రత్యేకించి యారంభించెనేమో యని యనుమానము గలిగెడి. 'స్వస్వవిభక్తివికారైః' అని తెలుఁగువిభక్త్యాదుల నందినవానికే సమాసయోగ్యత సామాన్యముగ శాసించుచు 'సంస్కృతవైకృతశబ్దైః' అనుదానిచే మిశ్రసమాసస్వరూపమును 'కేవలవికృతిపదైః' అనుదానిచే నాచ్ఛికసమాసస్వరూపమును విశదీకరించి తెలుఁగునఁ బొలిచెడు సమాసములఁ దెలిపి కృతార్థుఁడై యితరముల సమాసములఁ జోలికిఁ బోనివాఁడయ్యు నొక్క-కర్మధారయరూపము నెఱింగింప నేల పాటుపడెనో యని యరయుపక్షమున నాంధ్రవిభక్తిచిహ్నితము గాకయుం సంస్కృతశబ్దము తెలుఁగుపదముతో విశేషణసమాసము నందఁదగుననువిశేషమును బోధింపనే యనియుఁ గపిలకన్నులిత్యాదిరూపత్రయమునకుఁ దనచేఁ బ్రయోగింపఁబడినవానికిఁ దత్కాలశిష్టవ్యవహృతములై సార్థకములై యొప్పు మఱికొన్నియట్టివానికి సాధుత్వమును సంపాదింపనే యనియు విశ్వసింపకతీరదు. (చూ. నారచించిన కఱకంఠాదిశబ్దగ్రామ్యతావిచారము త్రిలింగ. పుట 15 సం. శ్రీముఖాషాఢము. 3. సో—11. మం.) రామరాజువంటి

కర్మధారయములనన్నియు యెచటనువాడకుండుటయు నిందులకుఁ బ్రమాణము కావున నేగతిని జూచినను నీజిన్నయసూరిసూత్రమునకును మూలసూత్రమునకును గర్మధారయ సామస్థితి తౌల్యమేగాని విషయైక్యము లేదనుట యయుక్తికము గాఁజాలదు. ఇట్లుండ బాలసరస్వత్యాదులవలెఁ గాక సుప్తార్థప్రకాశిక, మూలవివరణములఁ గర్మధారయ పరముగ గ్రహించుటయును; కటికిచీఁకటితిండికరములనుదాని షష్ఠీతత్పురుషముగ నెన్నుటయు మూలవ్యాఖ్యాతృవిరుద్ధవిషయములనుట సాహసోక్తి గాఁజాలదు.

## స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు. ౬.

ముక్కంటి - వేగంటి - చలివెలుఁగు - వేవెలుఁగు - మోటబరి - ఇత్యాదులు వ్యవహారసిద్ధంబులు గ్రాహ్యంబులు.

టీ. స్త్రీసమములతోఁ గూర్పఁబడియే యొకానొక బహువ్రీహి యగపడెడి. ప్రథమైకవచనము లోపింప మిగిలిన యాచ్ఛికపదములకే బహువ్రీహి నను ప్రవేశము గలిగెడుఁగాని ప్రథమైకవచనముతో నున్న యితరముల కిందుఁ బ్రవేశము లేదని తాత్పర్యము. బహువ్రీహి స్త్రీసమములకే యను సామాన్యోక్తిం జేసి పూర్వపరపదములు రెండును స్త్రీసమములే గావలెననుట స్పష్టము. ముక్కంటి = త్రిలోచనుఁడు-శివుఁడు. మూఁడు+కన్ను:—ఇందుఁ గల రెండుపదములును స్త్రీసమము లగుట తెల్లము. 17 విధిచే మూఁడుశబ్దమునందలి డువర్ణమునకు లోపమును కన్నుసుదానియందలి కకార మునకు ద్విత్వమును 22 చే సమాసాంతకార్యము కన్నుశబ్దమునందలి 'న్ను' అనుదాని కిని గలుగ ముక్కంటిరూపము సిద్ధించెడి. వేయి+కన్ను=వేగంటి-సహస్రాక్షుఁడు-ఇంద్రుఁడు. సమాసమున వేయిశబ్దము తుదివర్ణము లోపించుటయు 22 చే 'న్ను' అనుదానికి సమాసాంతకార్యము 'ంటి' వర్ణము గలుగుటయు గమనించికొనునది. వేయిశబ్దము వేరూపము నందునని సూరి చెప్పకున్నను నాచ్ఛికసమాసములలో వర్ణలోపవర్ణాగమవర్ణ వ్యత్యయాదివికృతులు ప్రయోగదృష్టమగుటను గ్రాహ్యము. త్రిలింగలక్షణశేషకర్త నిరూపించెను. (చూ. సమా. 36 సూ.) ఇందు 'వేయి-కన్ను' అను రెండును స్త్రీసమము లగుటయు నీరెండును నన్యపదార్థమును సహస్రాక్షుని బోధించుటచే బహువ్రీహియగుటయు స్పష్టములు. 'చలివెలుఁగు=శీతకిరణుఁడు-చంద్రుఁడు. చలి+వెలుఁగు. ఇవి రెండును స్త్రీసమములె. చల్లనికిరణములు గలవాఁడని యర్థము. వేవెలుఁగు=సహస్రకిరణుఁడు-సూర్యుఁడు. వేయి+వెలుఁగు. ఇందు రెండును స్త్రీసమములె. వేయికిరణములు గలవాఁడని యర్థము. వేయిశబ్దముతుది యివర్ణము సమాసమున లోపించె. మోటబరి=బరువు మోసెడియెద్దు-మోటగుబరువుగలది యనుట. 'మోటు-బరువు' బరువుశబ్దమునందలి

వుపర్ణకము లుప్తమై స్త్రీసమంబై బహువ్రీహిని బ్రవేశమునందె. కాన నీరెండును స్త్రీ
సమములె. సమాసాంతకార్య మిపర్ణముతుదిని గలిగి మోటబరి యయ్యె. మోటుశబ్దము
నందలి టువర్ణము సమాసమున టిపర్ణమయ్యెను. లేదా మోట యను వ్యవహారసిద్ధశబ్ద
మనియేని యనఁదగును. ఈ మొదలగు కవివ్యవహారప్రసిద్ధములైన యాచ్ఛికబహువ్రీహు
లను, వానికి సమాసమునఁ గలుగు సమాసాంతకార్యవర్ణలోపవర్ణవ్యత్యయవర్ణాధిక్యాదు
లను గవిప్రయోగానుసారముగ నెఱుంగుచు గ్రంథముల సంగ్రహింపవలయునని యిత్యా
దులను నీక్రింది సూరివివరణమున కభిప్రాయము. స్త్రీసమఘటితంబయనుటంజేసి సాం
స్కృతిక సాధ్యమిశ్రసమాసఘటన యిందుఁ గలుగదనియు స్త్రీసమాచ్ఛికములకే బహు
వ్రీహి తెలుఁగునఁ గలుగుననియుఁ నీనియమము చేతనే కఱకంఠుఁడనునది గ్రామ్య
మయ్యెననియుఁ నెఱుంగునది.

ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు. ౭

అన్నదమ్ములు - తల్లిదండ్రులు - ఊరువల్లెలు - ఆలుమగలు. మగ
డును బిడ్డలును - పల్లమును గళ్లెమును-ఇత్యాదులు సమసింపవని యీ
నియమంబున నెఱుంగునది.

టీ. తఱచుగ స్త్రీసమంబుతోఁ గూడి యాచ్ఛికశబ్దము ద్వంద్వసమాసం బగున
స్త్రీసమము తొలుతను బిదప నాచ్ఛికశబ్దమును నిల్చియుండునని భావము. ఇంక
మొత్తముమీఁద నన్నియుఁ నాచ్ఛికశబ్దములే యైయుండునుగాని బహువ్రీహివలె నింద
బూర్వపరపదములు రెండును స్త్రీసమములు గానక్కఱలేదనియుఁ బూర్వపదవ
మాత్రమే స్త్రీసమమై విధిగనుండి పరపదమాచ్ఛికశబ్దము మాత్రమైయున్నఁ జాఁ
ననియుఁ గ్రహింపవలెను. దీన నిందును సాంస్కృతికసాధ్యమిశ్రఘటన పొసఁగదను
స్పష్టము. కేవలాచ్ఛికములకే ద్వంద్వమని ఫలితము. ఆచ్ఛికోత్తరపదము డుమ్వాద్యం
మైయుండిన నుండనగుట బహువ్రీహికంటె నిందు విశేషమని గ్రహించునది. 'అన
దమ్ములు'—ఇందన్నయను స్త్రీసమముతోడఁ దమ్ముఁడను నాచ్ఛికశబ్దము ద్వంద్వమయె
తల్లిదండ్రులు:—ఇందుఁ దల్లియను స్త్రీసమముతోడఁ దండ్రియను నాచ్ఛికశబ్ద
ద్వంద్వంబయ్యె. రెండును స్త్రీసమములు గారాదనునియమము ద్వంద్వమున లేమిం
సాధువయ్యె. ఇట్లే 'ఊరు+పల్లె; ఆలు+మగఁడు' అనునవి ద్వంద్వములగుటను గ
నించునది. రెండుపదార్థములను బోధించు రెండుపదము లేకపదమైనవిగానఁ దు
బహువచనప్రత్యయము గల్గెనని గ్రహించునది. ఆచ్ఛికశబ్దంబుతోడనని ద్వంద్వ
నందలి తొలిపదము స్త్రీసమంబై యుండవలెనని శాసించుటంజేసి స్త్రీసమములుగ

మగఁడు-బిడ్డఁడు-బిడ్డలు-పల్లము-గ్లైము-మొదలగుశబ్దములు ద్వంద్వమునఁ బూర్వపదంబులై సమసింపవని మగఁడిత్యాది సూరివివరణమున కభిప్రాయము. ఇట్టివి యుత్తరపదంబులుగఁ జేసి ద్వంద్వము గూర్చిన గూర్పనగుంగాని వీనిని మొదట నిడి ద్వంద్వసమాసఘటనచేయరాదని భావము. ఇట్టివానిని ద్వంద్వసమాసార్థము వచ్చునట్లు కూర్పవలసివచ్చిన సముచ్చయ ఉుశబ్దముంజేర్చి వ్యవహరింపవలసినదేయని గ్రహించునది. ఇట్లే స్త్రీసమములయ్యును రెంటికి మించునపుడు సముచ్చయ ఉుశబ్దముంజేర్చి వ్యస్తముగ వ్యవహరింపవలసినదే గాని బహుపదద్వంద్వము గూర్ప వలనుపడదని ప్రయోగసరణినిబట్టియుఁ దెలుఁగుబాసస్వభావమునుబట్టియుఁ దోఁచెడి. స్త్రీసమవ్యవహార మీద్వంద్వసందర్భమున నామవాచకములకేగాక కృదంతభావార్థకక్త్వార్థకాద్యాచ్ఛికములకును జెల్లునని గ్రహింపవలసియున్నది. లేనిచో ప్రౌఢవ్యాకర్త చెప్పినభావద్వంద్వాదులపట్టుల నీలక్షణము పట్టకపోవలసివచ్చును. (కూడుగుడ్డ. ఔగాములు మొ, చూ. ప్రౌఢవ్యా. సమాస 30-31 సూ. లు.) మఱియుఁ ద్రిలింగలక్షణశేషకర్త 'ఒకానొకచో ద్వంద్వమునందుఁ బూర్వపదంబు క్లీబసమంబగును. అగుచో నామువర్ణకమునకు లోపంబగు. అందచందములు. వెచ్చసచ్చములు. ఒకానొకచో ద్వంద్వము మిశ్రంబును నందలి పూర్వపదంబు క్లీబసమంబును గానంబడియెడి. అవసరమక్కఱలు.' అని యీ బాలవ్యాకరణద్వంద్వలక్షణమును సోదాహరణముగ సవరించుచు ద్వంద్వమున మువర్ణకాంతమును బూర్వపదమగుటను మిశ్రమగుటను శాసించుట నరయునది. ఒక్క 'అవసర మక్కఱలు' అనుప్రయోగము దప్ప, మిశ్రమగుట కొండుప్రయోగము గనవ్పట్టదు-అందచందము లిత్యాదులందుఁ బూర్వపదము మువర్ణకాంతమెగాని సమాసమున నది లుప్తమగుటంజేసి ప్రథమైకవచనలోపమునందినపదము పూర్వపదమగునను ద్వంద్వలక్షణమున కందవ్యాప్తి లేదనవచ్చును. ఏవిధిచేని పూర్వపదప్రథమైకవచనలోపము నిత్యముగ నగునెడల నది ద్వంద్వమునఁ దొలిపదము గావచ్చునని ప్రౌఢవ్యాకర్త చెప్పినదానింబట్టి గ్రహింపనగును.

**సర్వశబ్దంబులు సంబంధంబునందుం దచ్ఛబ్దంబుతోడ సమసించు. ౮.**

నావాఁడు - నాయది - ఇంటివాఁడు - ఇంటిది - రామునివాఁడు - రామునిది.

టీ. 'ది స్యాత్సంబంధార్థే సర్వస్మాత్' అనునది మూలము. 'సంస్కృతప్రాకృతసమములు భవములు దేశ్యములు' అనువివక్ష లేక యెల్లతెలుఁగుశబ్దములకును సంబంధార్థమును వివక్షించునపుడు తచ్ఛబ్దముతోడ సమాసము గలుగును. సంబంధించెడు

తచ్ఛబ్దవాచ్యము మహత్తగునెడల 'వాఁడు-వారు'అనియు, నమహత్తగునెడల 'అది-అవి'అనియుఁ బ్రయోగింపఁబడి వానితోఁ బూర్వపదము సమసించునని గ్రహింపవలెను. ఈసూత్రముచే సమసించిన యదియవులయత్తులకే సంధి 45 సూత్రము బహుళముగ లోపమును విధించెడి. సంబంధార్థవివక్ష నామవాచకములకే సొసఁగెడిఁగాన వాని మీఁదనే తచ్ఛబ్దము తోఁచెడి. దీనితరువాతిసూత్రము ననుసరించి 'వచ్చునది-వచ్చెడిది' మొదలగువిశేషణములమీఁదనైన తచ్ఛబ్దముతోడిరూపములు గాని సంబంధార్థమునఁ గల్గినతచ్ఛబ్దముతోడిరూపములు గావు. కావుననే వానికి సూరి సంధి 45 విధిచేఁ గాక యందలి బహుళగ్రహణమునంజేసి లోపతదభావములఁ గూర్చుట జరిగెనని గ్రహించునది. నావాఁడు:—నాయొక్క+వాఁడు: సంబంధార్థకముయొక్క యని కారకము 15 సూత్రవివరణములంబట్టి స్పష్టము. ఇచట నాయొక్క యను సంబంధార్థమున నా యనునది వాఁడను తచ్ఛబ్దమహదేకవచనముతోడ సమసించెను. 25 చే సమాసమగుట యొక్కకు లోపంబు. నాయది:—నాయొక్క+అది. ఇచట సంబంధమున నాయనునదదియను నమహత్తచ్ఛబ్దైకవచనముతోడ నీవిధిచే సమసించెననియు, 25 చే యొక్కకు లోపము గల్గెననియు, సంధిలేమి యడాగమము గల్గెననియు గ్రహించునది. సంధి 45 చే సంధి గలిగినచో నాది యనియుం రూపాంతర మేర్పడును. అదియను తచ్ఛబ్దము సమసించెనని స్పష్టపఱుప సంధిరానిరూపమె యిం దుదాహృతము. ఇట్లే 'ఇంటియొక్క+వాఁడు-ఇంటియొక్క+అది'అనునవి 'ఇంటివాఁడు-ఇంటిది'యని యగుటను గమనించునది. ఇకారముమీఁది యదియవులయత్తులు వృత్తిని లోపించుటయే శ్రావ్యమనునంశము సూచింప నింటిదని యుదాహృతము. 'రామునియొక్క వాఁడు-రామునియొక్కయది' అనుపట్టుల నిట్లే 'రామునివాఁడు-రామునిది' యగుటను గమనించునది. నామవాచకములెల్ల సంబంధమునఁ దచ్ఛబ్దముతో సమసించునని సూచింపను, సమాసమున యొక్కకే గాని నిగాగమమునకు లోపము గలుగదని తెలుపను బైరూపములుదాహృతము లయ్యెనని యెన్నునది. రామునిదనునపు డకారలోపము సంధి 45 చేఁ గల్గుటను స్మరించునది. నిత్యముగ సంబంధార్థమున నిట్టెల్లవానికిఁ దచ్ఛబ్దముతోడి సమాసమును సూత్రింపకున్న వ్యస్తమున 'వాఁడు నాయొక్క-అది నాయొక్క-అది యింటియొక్క-వాఁడు రామునియొక్క'అను మొదలగు ప్రయోగములు దుర్వారములు గావలసివచ్చును. మఱియుఁ 'నాయొక్క వాఁడు-నాయొక్కయది-ఇంటియొక్కయది'మొదలగు యొక్కతోడి ప్రయోగములును సంభవించెడి. కాన వ్యస్తమున యొక్కకుఁ బ్రయోగమును సర్వథా నిర్మూలింప నీసూత్రము ముఖ్యముగ నారబ్ధమయ్యెనని గ్రహింపఁదగును.

మూలము 'ది స్యాత్సంబంధార్థే' అని 'రాజుది-బంటుది' అనునట్టిరూపములను మాత్రము సాధించి కృతార్థమయ్యె. మఱియు 'శబ్దాత్తచ్ఛబ్దాతః' అను సంధిసూత్రముచే నొకశబ్దమునకంటెఁ దచ్ఛబ్దము పరమగుననియు నాతచ్ఛబ్ద మకారాదియైనచో (అది-అవి)నాయకారమునకు లోపము గలుగుననియుం శాసించుటను గమనింప 'సంబంధార్థమునఁదప్పఁ దచ్ఛబ్దము పరమగుట నేశబ్దమునకును గుదురమింజేసి సంబంధమునఁ దచ్ఛబ్దముతోడి సమాసము శబ్దముల కంగీకృతమనియే తలంపవచ్చును. కాఁగా 'ది స్యాత్సంబంధార్థే' అనుసూత్రమేల యని శంక కలుగనగును. కాని దిస్యాత్తనుసూత్రము 'అది రాజుయొక్క-లేక, బంటుయొక్కయది' యని వ్యస్తముగఁ బ్రయోగించుటను వారింపను, 'శబ్దాత్తచ్ఛబ్దాతః' అనునది సమాసవిషయమని సూచింపను; నారబ్ధమయ్యెనని యంగీకరించుచు వ్యస్తమునను సమాసమునను యొక్క ప్రత్యయప్రయోగమును నిర్మూలించెనని గ్రహింపఁదగును. కాని 'అవి నావి-లేక, అవి నాయొక్క' మొదలగురూపములందు వివర్ణమును మూలము శాసింపకపోవుటంబట్టి యాస్థలములను మూలమననుసరించి లుప్తాకారతచ్ఛబ్ద మనుప్రయుక్తమైనవాని క్రిందనే సాధింపవలసి యుండుటంబట్టి యొకచో నొకరీతిగను వేఱొకచో వేఱొకరీతిగను రూపముల సాధించుటకంటె నెల్లస్థలములందును సంబంధమునఁ దచ్ఛబ్దముతోడి సమాస మంగీకరించినచోఁ బ్రక్రియ యేకరీతిగ నుండునని తలంచి కావలయు సూరి 'దిస్యా'త్తను సూత్రము ననుసరించి ది-విధానము చేయక యంతటను సంబంధమునఁ దచ్ఛబ్దముతోడి సమాసమునే శాసించెనని తోఁచెడిని. లేదా 'కథ్యం తేఽదిస్యాత్సంబంధార్థే' అని పూర్వసూత్రాంత్యమున నకారము సంధిచే మఱుఁగుపడినట్లు భావించి సంబంధార్థమున నది యగునని యంగీకరించి యది యనునది తచ్ఛబ్దరూపము గాన నయ్యది తచ్ఛబ్దమున కుపలక్షణముగ నెంచి సంబంధమునఁ దచ్ఛబ్దముతోడిసమాసమును సూత్రించెనో యనియు నూహింపనగు. దీన 'ఏకత్వే చ బహుత్వే చ సంబంధే దివివర్ణకౌ తయోరమాదౌ సేమాత్ర ఉదతోః ప్రాయశోఽత్ర ఇత్' అని యథర్వణుఁడు వివర్ణకమును బహుత్వమున విధించి మూలమును బూరించు ప్రక్రియను సూరి గమనింపలేదని నిశ్శంకముగఁ జెప్పనొప్పును.

## ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దంబను ప్రయుక్తంబగు. ౫.

వచ్చినవాఁడు - వచ్చినది - రానివాఁడు - రానియది.

టీ. క్రియ 44-45-46-47 సూత్రములచే ధాతుజవిశేషణరూపములు గలుగునని ముందె నిరూపితము. వానిమీఁదఁ బ్రథమాద్యంతతచ్ఛబ్దరూపములు విశేష్యాను

రూపముగఁ జేరుట ప్రయోగదృష్టము. సాధారణముగఁ దెలుఁగున విశేషణము లవిభక్తికములయ్యు సంస్కృతభాషాపద్ధతి ననుసరించి విశేష్యలింగవిభక్తివచనంబులు విశేషణమున కగుట యేర్పడెను. ఇట్లగుట సుబంతవిశేషణములకే గాని ధాతుజవిశేషణములకుఁ గానరాదు. అయినను వానికిఁగూడ సుబంతవిశేషణములకు వలె సుబ్విభక్తులను జేర్పఁదలంచినయెడల సుబంతవిశేషణములకువలె సాక్షాత్తుగాఁ గాక ధాతుజవిశేషణముల మీఁదఁ దచ్ఛబ్దరూపముం జేర్చి విశేష్యానురూపముగ దానికి విభక్తులం గూర్చి వ్యవహరింపవలెనని సూత్రాభిప్రాయము. (వచ్చినవాఁడు-రానివాఁడు. వచ్చినవానిని-రానివానిని మొ.) వచ్చినవాఁడు:—క్రియ 46 చే నవర్ణకము గలిగి సిద్ధించిన ధాతుజవిశేషణము. దీనికి విభక్తి వివక్షింపఁ దచ్ఛబ్ద మహ దేకవచన మనుప్రయుక్తమయ్యె. 'వచ్చినవాఁడు ఫల్గునుఁ'డని కవిప్రయోగము. విశేష్యానుసారముగ విశేషణమునకుఁ దచ్ఛబ్దరూపము లనుప్రయుక్తమగుటను గమనించునది. విశేష్యము మహదమహ దేకవచన బహువచనాంతమైనఁ దచ్ఛబ్దమును నట్లైయె విశేషణమున కనుప్రయుక్తమగుననిభావము. వచ్చినది:—ఇచట వచ్చినయను క్రియాజన్యవిశేషణమున కదియను నమహత్తచ్ఛబ్దైకవచనరూప మనుప్రయుక్తమయ్యె. రానివాఁడు:—క్రియ 48 చే నిషేవర్ణకము గలిగినట్టియుఁ క్రియ 91 చే రాదేశము నందినట్టియుం రూపము. దానికి వాఁడనున దీసూత్రముచే ననుప్రయుక్తమయ్యె. రానిదియనున దమహత్తచ్ఛబ్దైకవచన మనుప్రయుక్తమైనరూపము. విభక్తి వివక్షింపనిపక్షమున 'వచ్చినఫల్గుణుఁడు - రానిరాముఁడు-అగుకార్యము-కానికార్యము' అనురీతి నుండునని గ్రహించునది. 4 సూత్రము ననుసరించి కర్మధారయము ధాతుజవిశేషణపూర్వంబయి యుండనగునని స్పష్టపడుటంజేసి సూరియీ సూత్రోదాహరణములను దచ్ఛబ్దముతోడి కర్మధారయములుగ నెన్నక యనుప్రయుక్త తచ్ఛబ్దముతోడి రూపములుగ శాసించుటకు యుక్తి యగపడకున్నది. వచ్చిన యనిన నేమర్థమో వచ్చినవాఁడనిన నదేయర్థ మగుటంజేసియు, వచ్చినవానిచేత రఘుపర్యునిచేత నను మున్నగు వాని ననుసరించి ధాతుజవిశేషణముల మీఁదనైన తచ్ఛబ్దరూపములు విశేష్యానురూపముగ సుబ్విభక్తుల నందుటంజేసియుఁ గావలయు నిట్లు శాసించెనని తోఁచెడి. ధాతుజవిశేషణము=క్రియవలనఁ గలిగిన విశేషణరూపము.

ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టి యనుపదంబు
విభాష ననుప్రయుక్తంబగు. ౧౦.

వచ్చినట్టిరాముఁడు - వచ్చినరాముఁడు - వచ్చునట్టివాఁడు వచ్చువాఁడు.

టీ. ఎల్లచోటుల క్రియాజన్యవిశేషణములమీఁద వికల్పముగ అట్టి యనుపద మనుప్రయుక్తమగు. అనుప్రయుక్తమన ననుసరించి ప్రయోగింపఁబడుట. వెంబడిని దవిలించుట. అట్టి యన నటువంటి యని యర్థము. 'అట్టి-ఇట్టి-ఎట్టి' అనువానికిఁ బ్రయోగము ప్రసిద్ధమగుటఁ బదవ్యవహారమొనర్చె. ఇవియుం విశేషణార్థకములే యగుట విశేష్యములకు ముందె ప్రయుక్తములగును. వీనిలో నట్టి యనునది మాత్రమే విశేషణములమీఁద ననుప్రయుక్తమగు. ఇది విశేషణముమీఁద ననుప్రయుక్తమై విశేషణత్వమును వెల్లడించును. వచ్చినట్టిరాముఁడు:—వచ్చిన యనునది క్రియాజన్యవిశేషణము. దాని కట్టిపద మనుప్రయుక్తమగుటచేఁ బైప్రయోగ మేర్పడెను. అత్తునకు సంధి బహుళము. సంధి రానిపక్షమున 'వచ్చినయట్టి' యనియు నుండనోపును. మహత్తు నను విశేషణమైనను నట్టి యనుప్రయుక్తమగునపుడు క్రియాజన్యవిశేషణమునకు మార్పుగలుగదని సూచింప వచ్చినట్టి రాముఁడని యుదాహృతము. అట్టి యనుప్రయుక్తము గానియెడల వచ్చినరాముఁడనియే యుండును. పక్షమున 9చేఁ దచ్ఛబ్దము వలసినఁ గలుగనగును. విశేషణత్వమును బాగుగ వెల్లడించుటే వీనిప్రయోజనమగుటను నివి యనుప్రయుక్తములు గాకున్నను విశేషణతకు భంగము లేకుండుటను నివి వికల్పాను ప్రయుక్తము లయ్యెనని గ్రహించునది. వచ్చునట్టివాఁడు:—క్రియ 45 చే సిద్ధమైన 'వచ్చు' అను తద్ధర్మార్థకవిశేషణమున కట్టిపద మీవిధిచే ననుప్రయుక్తమై పైరూప మేర్పడెను. పూర్వవిధిచే నట్టిమీఁద వాఁడు గలిగె. వచ్చు+అట్టి=వచ్చునట్టి. సంధి 33 చే నుమాగమ మగుటను స్మరించునది. అట్టి యనుప్రయుక్తము గాకున్నను 9 చేఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తము గానగునుగాన వచ్చువాఁడగును. అదియుఁగాకున్న వచ్చు రాముఁడనురీతి నుండఁదగును. వచ్చునది - వచ్చునట్టిది వచ్చునట్టివి మొదలగు రూపములు గ్రాహ్యములు. అట్టిమీఁదనుగూడఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తమగుట వచ్చునట్టి వాఁడను నుదాహరణముచే సూచితమయ్యెనని గ్రహించునది. అనఁగా నట్టిచేరినను ధాతుజవిశేషణత చెడక బలపడుటంజేసి యట్టిమీఁదఁ గూడఁ బూర్వవిధిచేఁ దచ్ఛబ్దము గలుగవచ్చునని తాత్పర్యము. ఇది మిగిలిన ఇట్టి-ఎట్టి-యనువానిమీఁదఁ దచ్ఛబ్దము గలుగనగుట కుపలక్షణము. 'అట్టి-ఇట్టి-యెట్టి' యనువానికంటెఁ బరమునఁ దచ్ఛబ్ద వాకారము దోఁచుచో దానికి లోపముగల్గి 'అట్టివాఁడు=అట్టిఁడు-ఎట్టివాఁడు=ఎట్టిఁడు-ఇట్టివాఁడు = ఇట్టిఁడు' అనురూపములు గలుగునని త్రిలింగలక్షణశేషకర్త యీసందర్భమును బూరించుటను గమనించునది. ఈవిశేషణత్రయముమీఁద సమాసవశమున వాఁడు శబ్దములోఁచెనని యేని యాముఁడును విశేషణములగుట వానికిఁ బరమున వాఁడు శబ్దము విశేష్యరూపమున నిల్చెనని యేని భావింపనగు. సామాన్యవిశేషణములమీఁద

దచ్ఛబ్దముగాని యట్టిగాని యనుప్రయుక్తమగుట బాలవ్యాకర్త చెప్పకున్నను నాంధ్రభాషలో సామాన్యముగ విశేషణములమీఁదఁగూడ ధాతుజవిశేషణరూపములు చేరి విశేషణత్వమును బలపఱచుటయే సహజమగుటంజేసియు విశేషణముమీఁదఁ దచ్ఛబ్ద విశేష్యరూపములు చేరుట సాధారణమగుటంజేసియు విశేషణమాత్రము మీఁదఁ దచ్ఛబ్ద సంగతి యవిరుద్ధమని గ్రహింపవలసి యుండుటచేఁ ద్రిలింగలక్షణశేషకర్త తచ్ఛబ్దాను ప్రయోగమును సిద్ధముగనే విశ్వసించి పైరీతిని బూరించెనని గ్రహించునది. త్రిలింగ లక్షణశేషకర్త స్వతంత్రములగు నట్టిత్రయముమీఁదనే వాకారలోపమును సూత్రించి యుదాహరించుటంజేసి యనుప్రయుక్తమగు నట్టిమీఁద వాకారలోప మశాస్త్రీయ మయ్యెడిఁ గాన వచ్చునట్టిఁడు-వచ్చునెట్టిఁడు-రానట్టిఁడు మొదలగునవి గలుగవని తోఁచెడి. మఱియు ధాతుజవిశేషణములు తథార్థకావ్యయముతోడఁ గర్మధారయ మగునను విశేషముంగూడఁ ద్రిలింగలక్షణశేషము ననుసరించి గ్రహించునది. (చదువునట్లు) అట్లునదాగలియని విశేష్యార్థకత గలిగి యుండుటచే నట్లు చెప్పుట యవిరుద్ధంబు. ఈపక్షమున వ్యస్తమున్నను క్షతి యగపడదు. 9-10 సూత్రములు వ్యస్తవిషయకము లగుట స్పష్టము. కాని ప్రౌఢవ్యాకర్తచే సంస్కృతవ్యాకర్తృమతము ననుసరించి యట్లును మొదలగు నివార్థకముల కాయానామములతో సమాసమంగీకృతమగుటయె సమాసవ్యవహారమునకుఁ గతమనఁదగు. చూ. ప్రౌ. సమా. సూ. 38-43.

## యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునప్పుడు దుగాగమంబు విభాషనగు. ౧౧.

నీదుకరుణ - నీకరుణ. నాదునేరిమి - నానేరిమి. తనదురూపు - తనరూపు.

టీ. యుష్మదర్థకము=నీ. అస్మదర్థకము=నా. ఆత్మార్థకము=తన. ఈమూఁటికిఁ బరమున నేదేనొకపదమున్న 'దుక్' అనునాగమము గలుగును. 'నీ - నా - తన' అను నాకారములతో నుండుట షష్ఠీసమాసముననె సంభవించెడిఁగాన నుత్తరపదము విశేష్యమగుట స్పష్టము. కావున షష్ఠీసమాసమున యుష్మదస్మదాత్మార్థకములకు దుగాగమము వికల్పముగ నగునని సూత్రార్థము తేలెడి. ఉత్తర పూర్వపద వివక్షంజేసి యీ విధి సమాసవిషయమని స్పష్టమయ్యెడి. నీదుకరుణ:—ఇట యుష్మదర్థకమగు నీయనుదానికిఁ గరుణయను నుత్తరపదము పరముగాఁగ దుగాగమము గల్గి పై ప్రయోగ మేర్పడెను. దుగాగమము రానిపక్షమున నీకరుణయని యుండును. సమాసమున విభక్తి లోపము. ఇట్లే తక్కిన రెండుదాహరణములును దుగాగమము గలుగుటను గలుగమిని

నేర్పడుట నూహించికొనునది. ఇది షష్ఠీసమాసముననే సంభవించున దగుటంజేసి ‘నీనా’ అనువానితోఁబాటుగఁ దానను రూపము నిల్వదనియు దుగాగమప్రాప్తియోగ్యమగునది తన యనునదే యనియు గ్రహించునది. ‘యుష్మదస్మదాత్మభ్యః ద్వితివర్ణకః’ అను చింతామణి సూత్రము మూలము. ‘నావి-నీవి-తనవి’ అను రూపములు 8 విధిచే నైనఁ దచ్ఛబ్దముతోడి సమాసములుగను సంధి 45 చే అకారలోపమును బొందినవిగను సూరి శాసించుట నరయునది. కాన నీవిగుఱ్ఱములు-నావి యేనుఁగులు-తనవి రథములను మున్నగు రూపములును సూరిమతమున సాధువులేయని గ్రహించునది. 8 విధిని సంధి 45 విధిని ననుసరించి తచ్ఛబ్దేతరమగు శబ్దము పరమగునపుడే యీ దుగాగమంబని గ్రహింపవలెను. అందు నజాదిశబ్దము పరమైన సాధారణముగ సమాసవిభక్తికి లోపము గలిగి నీయాజ్ఞ యనురీతిని, గ్వాచిత్కముగ షష్ఠీసమాసమున దుగాగమోకారముమీఁద నుగాగమము గల్గి నీదునాజ్ఞ యను రీతిని, గొలఁదిగ 8 విధి ననుసరించియు సంధి 45 ననుసరించియు నీయదియాజ్ఞ నీదియాజ్ఞ యనురీతిని, ప్రయోగములగుటను గమనించికొనునది. చింతామణి సమాసగతషష్ఠ్యంతమునకు ద్వితీయాతుల్యమును ‘షష్ఠీ భవేద్ద్వితీయాతుల్యా’ అనువిధిచే శాసించెడి. యుష్మదస్మదాత్మార్థకములకు ద్వితీయాతుల్యముగలిగెనేని నీదుకరుణేత్యాదిరూపములు గలుగ నవకాశము లేమింజేసియుఁ దక్కినవానికి ద్వితీయాతుల్యము గలిగెనేని సామాసిక ద్రుతలోపవిధిచే ద్వితీయాంత ద్రుతము లోపించి రామునికరుణేత్యాదులు సిద్ధింప నవకాశముండుటం జేసియుం ద్వితీయాతుల్యము యుష్మదస్మదాత్మార్థములకు షష్ఠీసమాసమున వారింప యుష్మదస్మదాత్మార్థములకు దుగాగమమును బ్రత్యేకించి విధించెనని గ్రహించుట యుచితమని తోఁచెడి. మూలమును మూలము ననుసరించి బాలవ్యాకర్తయు యుష్మదస్మదాత్మార్థకములకని సామాన్యముగ ననుటంజేసి వానికేకత్వ బహుత్వముల రెంటను దుగాగమ మీ విధిచేఁ గలుగనగుననియుం దాన నేకత్వమున-‘నీదుకరుణ-నాదుకరుణ-తనదుకరుణ’ అను ప్రయోగములు గలిగినట్లే ‘మీదుకరుణ-మాదుకరుణ-తమదుకరుణ’ అను రీతి రూపములును గలుగుననియుఁ బ్రయోగదృష్టిని గ్రహించుట యుచితము. ‘దుక్’ అనునది కిత్తుగానఁ బ్రకృతి కంతాగమముగ నగునని గ్రహించునది. యుష్మదస్మదాత్మార్థకములు=యుష్మదస్మదాత్మన్ శబ్దముల యర్థముగలవి.

## గుణవచనంబులగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు. ౧౨.

నల్లనిగుఱ్ఱము-నల్లగుఱ్ఱము. నల్ల-తెల్ల-పచ్చ-ఎఱ్ఱ-చామ-తియ్య-కమ్మ-పుల్ల-విన్న-తిన్న-అల్ల-ఇత్యాదులు నల్లాదులు.

టీ. గుణవాచకములగు నల్ల మొదలగుశబ్దములకుఁ గర్మధారయసమాసమున బహుళముగ నిగాగమమగును. సూరి నిర్వచింపకున్నను నుదాహరణసమూహమునుబట్టి యదంతగుణవాచకములకని గ్రహింపవలసియున్నది. నల్లనిగుఱ్ఱము:—నలుపు గుణము గాన నల్లనునది గుణవాచకము. నల్లనైన యని యర్థముగాన విశేషణమును స్త్రీసమమును నగుటఁ గర్మధారయంబయ్యెడి. ఇది గుఱ్ఱమను నుత్తరపదముతో సమసించుచున్నదిగాన నిగాగమ మీవిధిచేఁ గలుగ నల్లనిగుఱ్ఱమని యగును. 'నిక్' అనునది కిత్తుగాన గుణవాచకమున కది యంతాగమముగ నగును. నిగాగమము గలుగకున్న నల్లగుఱ్ఱమని యగును. ఇట్లే నిగాగమ తదభావముల రూపద్వయ మూహించుకొనుచుఁ దక్కినయుదాహరణముల గమనించునది. పూర్వప్రపూర్వసూత్రములందువలె విభాష ననక యిందు బహుళమనుటంజేసి యీనిగాగమము చిక్క-చక్కమున్నగు గుణవాచకములకంటె నిత్యముగ నగుటయుఁ, జిన్న-పెద్ద-దొడ్డ మొదలగువానికంటెఁ బ్రాప్తింపకుండుటయుఁ, గొన్ని యుదంతగుణవాచకములమీఁద నిగాగమముతోఁబాటుగఁ బ్రకృతితుదియుత్వమున కత్వము సిద్ధించుటయు ఫలములని ప్రయోగదృష్టిని గ్రహింపఁదగును. 'నివర్ణకస్స్యాద్బహుళమదంతాద్గుణవాచకాత్' అని యథర్వణుఁ డీనిగాగమమదంతగుణవాచకములకే యగుటను శాసించినాఁడు. సూరి యయ్యథర్వణోక్తినే గ్రహించి యిట్లు సూత్రించి యుదాహరించి యుండనోపును. దీన వెలిదమ్మి వెలిదామరేత్యాదులందు నిగాగమాభావము సాధువయ్యెడి. నిగాగమమునందెడు గుణవాచకముల కగుసమాసములు కర్మధారయములుగాక కర్మధారయాభాసములని 'స్యాత్కర్మధారయాభాసః కర్తృత్వే కారకాశ్రితః' అని యథర్వణుఁడు పేర్కొనుటను గమనించునది. విశేషణవిశేష్యభావము తోఁచుటంజేసి సూరి కేవలము కర్మధారయములనియే వీనిని వ్యవహరించెను. 'గుణవాచకంబుల కొన్నింటి నిగాగమమునకుం బరుషంబులు పరంబులగునపుడు బిందువగు' అని త్రిలింగలక్షణశేషకర్త బిందువును నివర్ణకమునకు విధించి 'చక్కంబెట్టు' కమ్మందేనె మొదలగురూపముల సాధించి యీసూత్రమును బూరించుట నరయునది. ఉత్వవిశిష్టముగాని ద్రుతలక్షణ మిందుఁ బట్టమి నిట్లు చెప్పవలసివచ్చెనని ముందె ద్రుతలక్షణ టీకాసందర్భమున నుక్తము. ఇట్లు నివర్ణమునకుఁ బిందువగుటఁ గ్వాచిత్కము నవ్యము ననక తీరదు. మఱియుం జింతామణి ననుసరించి నకారమాత్రము ద్రుతమగుంగాన బిందువు నివర్ణమున కగుటయు నవిరుద్ధంబ. మఱియుం ధ్వన్యనుకరణశబ్దములు కొన్నింటికిఁ గర్మధారయమున నిగాగమ మగునని త్రిలింగలక్షణశేషకర్త శాసించి 'తళతళనితరణిమెఱుఁగులు-గనగనని నిప్పులు-నిగనిగనికుందనపుందగడు' అను మొదలగు ప్రయోగములఁజూపి యీసందర్భమును బూరించుట నరయుం

నది ఇంతియగాక 'గుణవాచకంబు క్రియావిశేషణం బగుచో నొక్కఁడ నవర్ణకంబునకు బిందువు గానంబడియెడి' అని చక్కఁగనని యుదాహరించి విశేషముం జూపుటను గమనించునది. గుణవచనంబులగు నల్లాదులకు నవర్ణకము తద్ధిత 6 చే నగు.

## ద్విరుక్తంబగుహల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. ౧౩.

టీ. ద్విరుక్తమన రెండుమాఱులు పలుకఁబడునది. ఒకహల్లును రెండుమాఱులు పలుకుట యట్టిదానినె మఱియొక హల్లును గ్రిందఁ గూర్చుటచే జరుగునదిగాన ద్విరుక్త శబ్ద మేహల్లున కాహల్లుతోఁడి కలయికనే బోధించునదై సార్థకమయ్యెడి. హ్రస్వదీర్ఘ ప్లుతభేద మచ్చునకె యగుటచే స్వతంత్రాచ్చునకును గాములయందలి యచ్చునకును నీవిధి యగునని యెంచునది. ఇది సమాసపరిచ్ఛేదమునందలిదిగాన సమాసవిషయముగ నెంచి యితరమగుచోటుల వర్తింపదని శంకింపనగుంగాని ప్రకీర్ణము 6 సూత్రమునందలి యుదాహృతులవిషయమునను దీనిని వర్తింపఁజేయవలసియున్నదిగాన సమాసమన నఖండ పదమగుట నీవిధిని సమాసాసమాసాఖండపదవిషయముగ నెంచుటయే యర్హమని తోఁచెడి. క్రియ 61 చే నగు హ్రస్వవిధానము మధ్యమబహువచనప్రత్యయమగు డుజ్వర్ణకము పరముగా సార్థకమగుటను, నచ్చో ద్విరుక్తము పరముగామి నీవిధి వర్తింప మిని మాముడి మువర్ణకమున కగునపుడును డుజ్వర్ణకముతోఁ బాటుగ నొక్కసంజ్ఞకు సంబంధించిన విషయమగుట హ్రస్వము విధింపఁబడియెనన నవకాశముండుటను, నందు హ్రస్వము తొలుతను బిదప మాముడి యగుటను, నది కేవలక్రియారూపమగు నఖండ పదములకు సంబంధించినదే యనవలసి యుండుటను దీనిచే నది గతార్థము గాఁజాలదని యెఱుంగునది. కాఁగా నీవిధి సమాసములందును గ్రియేతరాఖండపదములందును ద్విరుక్త మున కవ్యవహితపూర్వమున నున్నదానికి హ్రస్వమును విధించునదని ఫలితము గ్రహింప నగును. ద్విరుక్తమున కనుటంజేసి యేహల్లున కాహల్లుతోఁడి కలయిక చూపట్టుచోటు లందలి యాచ్ఛికదీర్ఘములకే యీహ్రస్వము గలుగుననుటయుఁ బదాది నిట్లు సహజ ముగ ద్విరుక్తమగుహల్లు గలుగుటఁ బొసఁగమి నీవిధానమునకు వ్యాకృతిచేనగు ద్విరుక్త ములకుఁ బూర్వముననున్న దీర్ఘములే విషయములుగాని సహజసంయోగపూర్వములు గావనుటయుం స్పష్టము.

## త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు. ౧౪.

అక్కన్య - ఆకన్య. ఇక్కాలము - ఈ కాలము. ఎల్లోకము-

ఏలోకము. అయ్యశ్వము-ఆయశ్వము. బాహుళకముచే సూక్ష్మరేఫంబులకు ద్విత్వంబు గలుగదు. ఆరూపము-ఈశబ్దము - ఏషండము-ఆసుకృతి-ఆహాయము.

టీ. 'ఆ-ఈ-ఏ' అను మూఁడును త్రికము నాఁబడునని ముందె యుక్తము. సంయుక్తమన నొకహల్లు దానికంటె నితరమగుహల్లుతోఁ గూడుట. పూర్వసూత్రమున ద్విరుక్తము నెంచి హ్రస్వవిధాన మొనర్చుటంజేసి యిట నసంయుక్తదళమునకు హాలంతరయోగము లేని హల్లే యర్థమగుటయు దీన సంయుక్తద్విరుక్తపదము లన్వర్థములనుటయుఁ దెల్లంబె. సజాతీయవిజాతీయములతోఁ గలియని స్వతంత్రహల్లునకని భావము. ద్విత్వమను సామాన్యోక్తింజేసి యేహల్లున కాహల్లుతోడి ద్విత్వమే యగును. ఆహల్లునకు ద్విత్వమగుటన నది రెండగునని భావము. కాఁగా 'ఆ-ఈ-ఏ' అనువానికంటెఁ బరమున నున్న ద్విత్వరహితమైన హల్లునకే ద్విత్వము బహుళముగ నగునని సూత్రార్థము తేలెడి. అక్కన్య:—ఆ + కన్య: త్రికపూర్వపదంబగుటఁ గర్మధారయము. ఈసూత్రముచే నాకారమునకంటెఁ బరమైన యసంయుక్తహల్లునకుఁ గకారమునకు ద్విత్వము. ఆ+క్కన్య, పూర్వసూత్రముచే ద్విరుక్తమగు హల్లు 'క్క' అనునది పరమగుచుండ నాచ్ఛికదీర్ఘమున కాకారమునకు హ్రస్వము. అక్కన్య. ఈవిధిచే ద్విత్వము గలుగకున్నఁ బూర్వసూత్రముచే హ్రస్వమును గలుగ నవకాశము లేమి ద్విత్వము రానిపక్షమున 'ఆకన్య' అనియే యుండును. ద్విత్వ మీవిధిచేఁ గల్గినపక్షమున మాత్రము హ్రస్వమాచ్ఛికదీర్ఘమునకు నిత్యమనుట మఱువరాదు. ఇట్లే 'ఈ+కాలము-ఈ+క్కాలము-ఇక్కాలము-ఈకాలము; ఏ+లోకము-ఏ+ల్లోకము-ఎల్లోకము-ఏలోకము.' అను వాని ప్రక్రియను గమనించునది. ఆ+అశ్వము. సంధి 3 చే యడాగమము. ఆ+యశ్వము. ఇపుడు త్రికమునకంటెఁ బరమున నసంయుక్తహల్లగపడెను గాన నీవిధిచే ద్విత్వమును బూర్వసూత్రముచే హ్రస్వమును గలుగ నయ్యశ్వమని యగును. ద్విత్వము గలుగకున్న నాయశ్వమనియే యుండును. త్రికముమీఁది యజాదిపదమునచ్చునకైన యడాగమమునకును నీద్విత్వవిధిగలుగనగుట గమనించునది. సంధివశముననైన యడాగమయకారమునకే యిట్లు ద్విత్వమగునని యహోబలుఁడనుట విచార్యము. 'ఇదమదసేతద్వ్యత్తచ్ఛబ్దాశ్చబ్దాంతరాన్వయే బహుళం, హ్రస్వం ప్రపద్య దీర్ఘాద్ద్విత్వముపర్యక్షరస్య జనయంతి' అను నాంధ్రశబ్దచింతామణి సందర్భము ననుసరించి పూర్వసూత్రమును నీసూత్రమును విరచితములయ్యె. మూలమునందువలెఁ గాక యిందు బహుళపదమును నిల్పుటకు సూత్రము సామాన్యముగఁ ద్రికముమీఁది యెల్లహల్లులకు ద్విత్వము విధించు

చున్నను 'శషసహర'అను నేనువర్ణములకు మాత్రము ద్విత్వము గలుగకుండుటయే ప్రయోజనమనియు దాన నేషండమిత్యాద్యుదాహరణత్రయమునఁ ద్రికముమీఁది 'ష-స-హ' అనువర్ణములకు ద్విత్వము గలుగలేదనియు ద్విత్వమే గలుగనపుడు హ్రస్వము తలంపనే యవకాశములేదనియు 'బాహుళకముచే' నను సూరియాక్రిందివివరణమున కభిప్రాయము. 'శషసహ' అను నేనువర్ణము లూష్మ లనంబడును. తాపము గల్గునపుడుస్సురని యనురీతి నియ్యవి యుచ్చరింపఁబడుటంజేసి యూష్మము లయ్యెనని గ్రహించునది. 'ఊష్మ రేఫాన్వినా ద్విత్వమయుక్తస్య హలో మతం, ఋకారంచ విముచ్య స్యాత్ప్రాణానాం ద్విత్వసంగతిః.' అని మూలమును బూరించు నాథర్వణమును గమనించియే సూరి బాహుళకముచే ననునీవివరణమును సూత్రమున నసంయుక్తదళమును నెలకొల్పెననుట స్పష్టము. అ + ప్రమద=అప్ప్రమద; అ+క్షత్రకులసితప్రకాశున్=అక్షత్రకులసితప్రకాశున్; ఈ + ప్రభావము = ఇప్ప్రభావము మొదలగు ద్వ్యర్థికావ్యప్రయోగములందు సంయుక్తము తొలిదానికిని ద్విత్వము త్రికముమీఁద నగపడెడి. సామాన్యముగ నూష్మరేఫములకు ద్విత్వము గలుగదని బహుళగ్రహణఫలము నభివర్ణించెనుగాని వర్గద్వితీయములకును జతుర్థములకును సాధారణముగ ద్విత్వరాహిత్యమే శ్రావ్యమై గనుపట్టుటంజేసి వలసినయెడల నదియుం బహుళఫలముక్రిందనే యాదరించుట తగును. 'అ + కడ; ఈ + కడ; ఏ+కడ' అనువానికి ద్విత్వహ్రస్వములచే 'అక్కడ-ఇక్కడ-ఎక్కడ' అను రూపములు గలిగెడి. కాని 'అడ-ఈడ-ఏడ' అను ప్రయోగదృష్టము లగునవిగూడ నిక్కడేత్యాదులనుండియే సమాసమున నైన కవర్ణలోపమున నేర్పడినవిగ నెంచుట యస్వరసముగాదు. వర్ణలోపమునకు (చూడుడు ప్రౌఢసమాస 36.)

## కృతహ్రస్వంబగు త్రికంబుమీఁది చోటుశబ్దంబునోత్వంబున కత్వహ్రస్వంబులు విభాషనగు. ౧౫.

అచ్చోటు-అచ్చటు-అచ్చొటు. ఇచ్చోటు-ఇచ్చటు-ఇచ్చొటు. ఎచ్చోటు-ఎచ్చటు-ఎచ్చొటు. వీని ద్విత్వంబునకు వక్ష్యమాణవిధిచేఁ బాక్షికంబుగ లోపంబగు. అచటు-అచోటు-ఇచటు-ఇచోటు-ఎచటు-ఎచోటు. ముచ్చోటులు - ముచ్చటులు-ముచ్చొటులు-అనురూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి.

టీ. మీఁది హల్లునకు ద్విత్వమునుగూర్చి కృతహ్రస్వములైన 'అ-ఈ-ఏ' అను వానికిఁ బరముననున్న చోటుశబ్దము సంబంధమైన యోకారమున కత్వమును హ్రస్వ

మును బర్యాయమున వికల్పముగ నగునని సూత్రార్థము. హ్రస్వము ప్రపూర్వవిధిచే నగును. ద్విత్వము పూర్వవిధిప్రాప్తము. అచ్చోటు:—ఆ+చోటు:—14 చేఁ జోటు శబ్దాది చకారమునకు ద్విత్వము. 13 చే నాకారమునకు హ్రస్వము. అచ్చోటు. పిదపఁ గృతహ్రస్వమైన త్రికసంజ్ఞకాకారముమీఁద నున్నట్టి చోటుశబ్దము సంబంధమైన యోకారమున కత్వ మీవిధిచేఁ గలుగ 'అచ్చటు' అనియుఁ బక్షమున హ్రస్వముగలుగ 'అచ్చొటు' అనియుఁ రూపము లేర్పడును. అత్వ హ్రస్వములు రెండును గలుగకున్న 'అచ్చోటు' అని ద్విత్వహ్రస్వములచే రూపమేర్పడును. ద్విత్వహ్రస్వములును గలుగకున్న 'ఆచోటు' అనియే యుండును. ఇట్లే కృతహ్రస్వములగు ఈ-ఏ అనువానిమీఁది చోటుశబ్దమునకును గార్యముల గమనించి రూపముల నూహించికొనునది. వక్ష్యమాణ విధియనఁ బ్రకీర్ణపరిచ్ఛేదమునందలి 8 దవ సూత్రము. పాక్షికమన వికల్పము. 'అక్కటాదులజడ్డకు లోపంబు విభాష'ననువిధిచే సద్విత్వములైన చకారములలో నొక దానికనఁ గ్రిందుదానికి లోపము గలుగునుగానఁ ద్రికంబుమీఁది సద్విత్వములును గృతాత్వహ్రస్వములును నగు చోటుశబ్దరూపములే యేకచకారములగునని గ్రహించునది. అత్వహ్రస్వములంజెందిన చోటుశబ్దముక్రింది చకారమునకే యీపాక్షికలోపము గలుగుంగాని 'యచ్చోటు-ఇచ్చోటు-ఎచ్చోటు' మొదలగువానికి అచోటిత్యాదులు గలుగవని భావము. కాన వీనిద్విత్వంబునకన నీవిధిచే నత్వహ్రస్వములంజెందినవాని ద్విత్వంబునకే యని యర్థమని గ్రహించునది. చోటుశబ్దము నోకారము వికృతినంది నపుడే జడ్డకు లోపంబగుననియు నద్దానికి వికృతి లేకున్నను జోటుశబ్దము టకారము 16 చే లుప్తమైనను జడ్డకు లోపము లేదనియుం దెలియంగునది. త్రికముమీఁదఁ జోటు శబ్దము వికృతినందక జడ్డను గోల్పోయిన, ద్విత్వము పరముగా హ్రస్వమును విధించు సూత్రమునకు సార్థక్యము చెడును. త్రికముమీఁది చోటుశబ్దమునకే గాక మూఁడు శబ్దముతోడఁ గర్మధారయసమాసము నందినట్టియు 17 విధిచే డువర్ణలోపద్విత్వములు గల్గినట్టియుం ముచ్చోటులనురూపమునందలి చోటుశబ్దమునకును నీవిధిచే నత్వహ్రస్వములుగలుగుట ప్రయోగములం దగపడునని ముచ్చోటులను నీక్రింది సూరివివరణమున కభిప్రాయము. ఓత్వమున కత్వమాదేశమైన ముచ్చటు లనియు హ్రస్వమైన ముచ్చొటు లనియుం రూపము లేర్పడునని తాత్పర్యము. 'ముచ్చటులు-ముచ్చొటులు' ప్రయోగంబులఁ గానంబడు ననుటంజేసి త్రికముమీఁదను మూఁడుశబ్దము పిదపనే యత్వహ్రస్వములు సంభవించుననియు నందును ముచ్చోటులనురూపమున నత్వహ్రస్వములే గాని జడ్డలోపము ప్రయోగదృష్టము గాదనియు సూరియభిప్రాయమైనట్లు గ్రహించునది. మఱియుం మూఁడుశబ్దముమీఁది చోటుశబ్దమునకు ద్విత్వము గల్గుటకును మూఁడునందలి

డువర్ణకలోపము గలుగుటకును 17 విధియుండుటంజేసి యత్వహ్రస్వములు గలుగుటకు మాత్రము ప్రయోగములే శరణ్యములని భావమని యెఱుంగునది.

## ఉత్తరపదంబగు చోటశబ్దముటాక్షరమునకు లోపంబు విభాషనగు. ౧౬

చోటుశబ్దం బౌపవిభక్తికంబు గావున దానియంతిమాక్షరంబు సప్తమ్యాదేశమయిన యకారంబుతోడం బాక్షికంబుగ లోపించునని యర్థము అచ్చోనున్నాఁడు-అచ్చోటనున్నాఁడు. ఒకచోనుండె-ఒకచోటనుండె.

టీ. చోటుశబ్ద ముత్తరపదముగాఁగల సమాసములందు సప్తమినైన యౌపవిభక్తికాత్వాదేశమున నదంతమైన తుదిటకారములు వికల్పముగ లోపించునని సూత్రార్థము. చోటుశబ్దమునందు 'టు' వర్ణముగలదుగాని టవర్ణముగలదాయని పాఠకులు సందేహింతురేమోయని యెంచి గ్రంథకర్త చోటుశబ్ద మౌపవిభక్తికమగుట సప్తమిని ఆచ్ఛికము, 38 చే నాదేశమైన యత్వముచే నదంతమగుననియు దాన టాక్షరమని చెప్పవలసివచ్చెననియు నట్లు చెప్పక టకారమునకని సామాన్యముగ నన్న నౌపవిభక్తికాత్వమును విడిచి కేవల హల్మాత్రమునకేని లేక యౌపవిభక్తికాత్వమును జేయక ముందె టవర్ణమునకేని లోపమును జేయుట కవకాశము తోఁచెడిఁ గాన నట్టియవకాశమును గలుగఁజేయకుండుట కిట్లు చెప్పవలసివచ్చెననియు నిట్లు చెప్పుటంజేసి యౌపవిభక్తికాత్వము గల్గినపిదపనే యయ్యత్వముతోడి టవర్ణమునకె లోపము గల్గుననియు సుబోధముసేయఁ జోటుశబ్దమను నీక్రిందివివరణము వ్రాసెనని గ్రహింపఁదగును. ఔపవిభక్తికములకత్వము 38 ఆచ్ఛికముచే నొక్కసప్తమియందేగాక తృతీయయందును గలుగుచుండ సప్తమ్యాదేశమైన యకారంబుతోడ నని యొక్కసప్తమినే యెత్తి వ్రాయుటకును, తృతీయయందత్వముతోడి టకారలోపముమాట తలంపకుండుటకును గతమేమై యుండునో యని యరసినచో స్థూలదృష్టికిఁ దృతీయయం దత్వముతోడి టవర్ణలోపమనభిమతమగుట నట్లనక సప్తమినే యెత్తి వ్రాసెనని సమాధానము తోఁపవచ్చును. కాని సూక్ష్మదృష్టినరసిన నిట్టి యుదంతములకుఁ గొన్నింటికి సప్తమిని మాత్రమే యత్వముగల్గుట ప్రయోగసిద్ధమగుటను దృతీయయం దప్రసిద్ధమగుటను నిట్లు సప్తమిననియె గ్రంథకర్త వ్రాయవలసివచ్చెననియు, 'అచ్చోటన్-లేక అచ్చోన్' 'ఒకచోన్' అను తృతీయార్థక ప్రయోగము లదృష్టములగుట నట్లు తృతీయాసప్తమ్యాదేశమని వ్రాయలేకపోయెననియు, నుదంతానుదంత సామాన్యముగ నౌపవిభక్తికములకెల్ల వైకల్పికముగ నత్వము నాదేశించినవాఁడగుటంజేసి తృతీయాత్వయుత టవర్ణముమాట యిటఁ దలంపకుండుట

విచార్యమనియుఁ దోఁపకపోదు. (చూ అచ్ఛికము. 38 టీక మూలమతము) అచ్చో్చటన్ :—అ+చోటు+అందు 14-15 లచే ద్విత్వహ్రస్వములు. అచ్చోటునందు. అచ్ఛిక 38 చే నత్వము. 'అచ్చోటు+అన్=అచ్చోటన్.' దీనిచే టవర్ణలోపము, అచ్చోన్. ఇట్లే చోటుశబ్ద ముత్తరపదముగాఁగల సమాసములందును దక్కినయుదాహరణము లందును టవర్ణలోపము నూహించికొనునది. ఉత్తరపదంబగు చోటుశబ్దము టాక్షర మనుటంజేసి సమాసమునసేగాని వ్యస్తమున నీవిధి గలుగదని గ్రహింపవలసియున్నది.

## సమానాధికరణం బగునుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డువర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబునగు. ౧౭.

మూఁడుజగములు-ముజ్జగములు-మూఁడులోకములు-ముల్లోకములు.

టీ. ఏకాధికరణంబగు నుత్తరపదము పరమగునపుడు మూఁడుశబ్దసంబంధమైన డువర్ణమునకు లోపంబును మిగిలిన మూకారముమీఁది హల్లునకు ద్విత్వమును నగును. సమానాధికరణంబన నేకాశ్రయంబు విశేషణవిశేష్యభావమని 3 సూత్రవ్యాఖ్యలో నుక్తము. 'మూఁడుజగములు' అను నుదాహరణమున మూఁడుశబ్దవాచ్యమగు త్రిత్వమునకును జగద్ధర్మమగు జగత్త్వమునకును జగములే యాశ్రయములుగాన నిట సమానాధికరణంబు గలదని యెఱుంగునది. సమానాధికరణం బనుటంజేసి విశేషణమైన మూఁడు శబ్దముతోఁడి కర్మధారయములందే యీవిధి యనియు నితరనామములతోఁడ నైనసమాసముల నీవిధి గలుగదనియు గ్రహించునది. సమానాధికరణంబనక యుత్తరపదంబనిన కర్మధారయేతరములందును నీవిధి గలుగునని సూరి యనుమానించి యుండునని భావము. మూఁడు+జగములు:—ఇట సమానాధికరణంబగు నుత్తరపదము జగములనునది. ఇది పరముగా మూఁడుశబ్దము సంబంధమైన డువర్ణము లోపించె. మూ+జగములు. పిదప లుప్తశేషమగు 'మూ' అనుదానికిఁ బరముననున్న జకారమునకు ద్విత్వము. మూ+జ్జగములు. తరువాత 13 చే ద్విరుక్తంబగు హల్లు 'జ్జ' అనునది పరముగా నాంచ్ఛికశబ్దదీర్ఘమునకు మూవర్ణముమీఁది యూకారమునకు హ్రస్వము. ముజ్జగములు. డువర్ణము ముందున్న యనునాసికోచ్చారమునకు గుర్తైన యర్ధబిందు వాశ్రయము లేమినిగాని, తనకు నిలువ నవకాశ మొసంగు పరుషసరళములయభావమునఁగాని, లోపించెనని గ్రహింపవల యును. సద్విత్వమగు 'జ్జ' అనునది సరళమైనను నది సంస్కృతసమశబ్దసంబంధి యగుటం జేసియుం సద్విత్వపరుషసరళములకుముందు బిందువు తెనుఁగునఁ దోఁపమిని నిలువఁజాల

దని యెంచునది. ఇట్లే 'మూఁడు+లోకములు; మూ+లోకములు; మూ+ల్లోకములు; ముల్లోకములు;' అనుదాని ప్రక్రియను గమనించునది.

కొన్నియెడల నవర్ణంబు పరంబగునపుడు పూర్వపదాంత్య డకారమునకు నకారంబగునను త్రిలింగలక్షణశేషముచేఁ గొన్నిస్థలముల మూఁడుశబ్ద డకారము నకారమై మూన్నాళ్లు మొదలగురూపము లేర్పడుటయును ముయ్యేడిత్యాదులందు హ్రస్వద్విత్వములు నిత్యముగ నగుటయును నరయునది. కొన్ని బాలవ్యాకరణప్రతులలో డుజ్వర్ణమునకని పాఠముగపడెడి. కాని త్రిలింగలక్షణశేషము ముందుచెప్పినరీతిని డకారమునకని యనుటను, మూఁటినను ముమ్మగు డువర్ణమున కొపవిభక్తికాదేశమైన, టివర్ణముతోడిరూపము లగపడుటను, దీనిని డుజ్వర్ణమని ప్రథమైకవచనప్రత్యయమువలె జెత్తుగా వ్యవహరింప నాధారములు లేమిని, నిని స్త్రీసమశబ్దముగాన నది శబ్దసహజ డువర్ణమని స్పష్టమగుచుండుటను, సూరి దీనిని నిపతించియే సాధించుటను, నాశ్రయములేమి నరసున్న లుప్తమయ్యెననుట కవకాశముండుటను, డువర్ణమనుటయే యుచితమనియు నరసున్న లోపింపదని భ్రమించిగాని డువర్ణము ముందున్న యర్ధబిందువును గాంచిగాని డుజ్వర్ణమని సానునాసికముగ నేరో దిద్దియుందురనియుఁ జెప్పనొప్పును. హరికారికాకర్త యిట్టి బాలవ్యాకరణస్థమను డుజ్వర్ణమగు నపపాఠముంబట్టియే భ్రమించి 'ఉత్తరస్మిన్సమానాధికరణేతు పరేడుజ్ః, మూఁడుశబ్దస్యలోపస్స్యాద్ధలో ద్విత్వం తథోపరి' అని సూత్రించుట జరిగె ననుట పునరుక్తము. డవర్ణమనక డువర్ణమనుటచే నుకారముతోడి డువర్ణలోప మభిప్రేతమనియుఁ లేకున్న నుకారము శేషించి యపరూపము గలుగనగుననియుఁ గ్రహించునది.

## ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగానగు మిశ్రంబునకుఁ గాదు. ౧౮.

ముచ్చిచ్చు - ముక్కారు - ముప్పాతిక - ముత్రోవ - ముప్పిధములు.

టీ. సంఖ్యాపూర్వమగు కర్మధారయమే ద్విగువు నాఁబడునని ముందె నిరూపితము, రెండుమొదలగుసంఖ్యలు బహుత్వబోధకములగుటంజేసి వానితోడ సమసించిననామవాచకములు బహుత్వబోధకములును దాన బహువచనము నందినవియుఁగావలెను. కానఁ దఱచుగ ద్విగుసమాసమున నుత్తరపద మేకవచనాంతమే యగునని శాసించుట ప్రసక్తమయ్యె. 'త్రిలోకీ' అను మొదలగు సంస్కృతద్విగువుల ననుసరించి యీరూపు తెలుఁగు ద్విగువులకును గలిగె ననవచ్చును. కర్మధారయలక్షణమునఁ బూర్వపద మిట్టిదై యుండవలెనను నియమము గానవచ్చునుగాని యుత్తరపదనియమము గానరామి నుత్తరపదము సంస్కృతసమమై మిశ్రసమాసము గలుగనగునని స్పష్టపడుటచే నట్టి మిశ్రద్విగువులందు

మాత్ర ముత్తరపదమున నేకత్వము గలుగదని శాసించుట యావశ్యకమయ్యె. దీననే మహాదర్థమును నుత్తరపదముగా నుండఁదగుటచేతనే త్రిలింగలక్షణశేషము ద్విగువు మహాదర్థఘటిత మదృష్టమని శాసించుట ప్రసక్తమయ్యె. మూఁడు + చిచ్చులు:—17 చే డువర్ణలోపము, మీఁదిహల్లునకు ద్విత్వమును నగు. 13 చే 'మూ' అనుదానికి హ్రస్వము. 'మూ + చిచ్చు:—మూ + చ్చిచ్చులు; ముచ్చిచ్చులు.' ఈవిధిచే నేకవచనాదేశము. ముచ్చిచ్చు. చిచ్చను నాచ్ఛికశబ్ద ముదంతస్త్రీసమముగానఁ బ్రథమైకవచనలోపము. ఇట్లే 'మూఁడు + కారులు; మూ + కారులు: మూ + క్కారులు; ము + క్కారులు; ముక్కారు. మూఁడు + పాతికలు; మూ + పాతికలు; మూ + ప్పాతికలు; ము + ప్పాతికలు; ముప్పాతిక. మూఁడు + త్రోవలు; మూ + త్రోవలు; మూ + త్త్రోవలు; ము + త్త్రోవలు; ముత్త్రోవ' అనువాని ప్రక్రియ నెఱుంగునది. మూఁడు + విధములు:—ఇందు విధమనునది సంస్కృతసమముగాన నిది మిశ్రద్విగువు. కావున దీని నేకవచనము గాదు. అట్లగుట డువర్ణలోపమును మీఁదిహల్లునకు ద్విత్వమును హ్రస్వమును మాత్రము గలిగి ముల్విధములని బహువచనమునే గల్గియుండు. త్రిలింగలక్షణశేషకర్త యొక్కొకచో ద్విగువు మిశ్రంబేకవచనాంతంబును నగునని శాసించి 'నల్దిక్కు: ముల్లోకము; ముమ్మహార్థము' అని లక్ష్యములఁ జూపి యీబాలవ్యాకరణసూత్రమును సవరించుట నరయునది. 'ద్విగోరమిశ్రతాయాం తు ప్రాయ ఏకత్వమిష్యతే, మిశ్రతాయాం బహుత్వం స్యాదన్యత్రాపి క్వచిద్భవేత్.' అను నాథర్వణము పైబాలవ్యాకృతిసందర్భమునకు మూలమనుట స్పష్టము.

## కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల మువర్ణంబులు పజ్వవర్ణంబులగు. ౧౯.

నాఁపచేను-పాఁపఱేఁడు. కనుపపులు జనుపనార. నాము పాము ప్రేము-వేము-అమ్ము-ఎమ్ము - ఇవి నామ్వాదులు. కనుము - ఇనుము ఉడుము-ఎనుము-జనుము-మినుము-ఇత్యాదులు కనుమ్వాదులు.

టీ. ఒకానొకచో సమాసములందు మువర్ణాంతములగు నాము మొదలగు శబ్దములయుఁ గనుము మొదలగుశబ్దములయు మువర్ణములకుఁ గ్రమముగఁ బజ్వర్ణమును పవర్ణమును నాదేశమగునని సూత్రార్థము. నాము మొదలగువాని మువర్ణము పజ్వర్ణముగను గనుము మున్నగువాని మువర్ణము పవర్ణముగను మాఱునని భావము. కొండొకచో ననుటంజేసి మువర్ణాంతముల కెల్లఁగాని; నీక్రిందివానికిఁగాని; సమాసములం దీవిధి నియతముగాదనియు సమాసములం దనుటంజేసి తత్పురుషకర్మధారయములు సాధారణము గ్రాహ్యము లనియు గ్రహింపఁ దగును. ప్రయోగదృష్టి నీవిధికిఁ బ్రసక్తి నూహింపవలెను.

నంశమును దెలుప 'కొండొక-సమాసములందు' అనుపదములు ప్రయుక్తములనుట యుచితము. 'నాఁపచేను:—నాము+చేను.' ఇందుఁ దొలిపదముతుదిమువర్ణమునకుఁ బజ్వర్ణమీవిధిచేనగు. తత్సమము 19 చే నది బిందుపూర్వమగు. దీర్ఘముమీఁదగాన నాపవర్ణమర్ధబిందుపూర్వమగు. 'నాఁప+చేను=నాఁపచేను. పాపజేఁడు:—పాము+జేఁడు.' ఈ సూత్రముచేఁ దొలిపదము తుదిమువర్ణము పజ్వర్ణమగును. నాము+చేను=నాఁప+చేను=నాఁపచేను; పాము+జేఁడు='పాఁప+జేఁడు=పాఁపజేఁడు.' ఇట్లే 'కనుము+పులు; జనుము+నార' అను నుదాహరణములందుఁ దొలిపదము మువర్ణములు పవర్ణములగుటచే 'కనుపపులు; జనుపనార' అనురూపము లగుట నూహించికొనునది. నామ్వాదుల మువర్ణమునకు పజ్వర్ణమును, గనుమ్వాదుల మువర్ణమునకు పవర్ణమును నగుననియుం, పజ్వర్ణమునందలి జత్వము బింద్వర్థమనియుం ఫలితమును గ్రహించునది. మువర్ణము లనుటచే నుత్వవిశిష్టమవర్ణముల కత్వవిశిష్టపజ్వవర్ణము లాదేశములగునని గ్రహించునది. ఈరీతినే నామ్వాదులలోని 'స్రేఁపకట్టు-వేఁపచెట్టు-అంపశయ్య; ఎంపకైదువు;' అనుశబ్దములకు సమాసములనగు రూపముల నూహించునది. ఈగతినే కనుమ్వాదులందలి 'ఇనుపగుండు; ఉడుపతోలు; ఎనుపగొడ్డు; మినుపచేను;' అనుశబ్దములకు సమాసముల నేర్పడురూపముల గమనించికొనునది. అంపశయ్యేత్యాదులందలి మువర్ణము ప్రథమహ్రస్వముమీఁది దగుటను నద్దాని కగుపజ్వర్ణమునకు ముందు పూర్ణబిందువేయగునని గ్రహించునది. (చూ సంధి 22 సూ.) 'అమ్ము-ఎమ్ము' అనునట్టి పజ్వర్ణార్హాములకు వానితుదినున్న 'మ్ము' అనుదానియందలి మాముడి ప్రకీర్ణ 8 చే లోపించుననియుఁ బిదప మిగిలిన ముకారమునకు పజ్వర్ణమగుననియుం గ్రహింపఁదగు. లేదా మువర్ణము 'మ్ము' అనుదానికిని నుపలక్షణమనియేని గ్రహింపవలెను. ప్రాతిపదికములను మువర్ణాంతములు గానివానినిగఁ జూపుట పొసఁగమిని నివి సహజ మువర్ణము లగుటను మువర్ణకమున కనక మువర్ణమున కని వ్యవహరించెనని తోఁచెడి.

## నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. ౨౦.

### నిక్కల - కవ్వడి - పువ్విలుకాఁడు. ఇత్యాదులు.

టీ. నిక్కల మొదలగు సమాసములందగు వర్ణలోపవర్ణద్విత్వాదులు ప్రయోగముల ననుసరించియే గ్రహింపవలెనుగాని యొక నియమముచేఁ దెలుప నలవిగాదని సూత్రార్థము. 'నిక్కము+కల=నిక్కల; కవ+వడి=కవ్వడి; పువ్వు+విల్లు+కాఁడు=పువ్విలుకాఁడు.' ప్రథమోదాహరణము కర్మధారయము. ఇందుఁ దొలిపద మాద్యక్షరశేషమై తరువాతిపదము నాదిమహల్లునకు ద్విత్వము గల్గుట చూపట్టు. లేదా తొలిపదమునందలి మువర్ణము సమాసమున లోపింపఁ బూర్వపరములఁ దుల్య

హల్స్థితి యగుటంజేసియు, మొదటిపదము తుదిననఁగా నుత్తరపదాద్యక్షరమునకుఁ బూర్వమున సద్విత్వవర్ణము తొలిపదము నాద్యక్షరమునకు గురుత్వముఁ గూర్చుచు నుండియుండుటంజేసియుఁ నుత్తరపదాద్యక్షరము వ్యవహితోచ్చారణమున లుప్తమయ్యె ననియేని సంభావింపనగును. కవ్వడి. బహువ్రీహి. జంట (చేతుల) వడిగలవాఁడు. ఇచటఁగూడఁ దుదిని దద్ధిత 11 సూ. చేఁ గాప్రత్యయమై సమాసమున లుప్తమయ్యె నండ్రు. కాని యాచ్ఛికబహువ్రీహిగ నెంచి పూర్వోదాహరణమందువలెనే సమాన హల్లుల పూర్వపరస్థితి యగుటంజేసి యవ్యవహితోచ్చారణమునఁ బూర్వపదాంత్య వకారముమీఁది యచ్చు లోపించి ద్విత్వవకారరూప మేర్పడెననుట సయుక్తికమని తోఁచెడి. 'పువ్విలుకాఁడు; పువ్వు+విల్లు=కర్మధారయము.' పిదపఁ దద్ధిత 11 సూ. చేఁ గాప్రత్యయము. ప్రకీర్ణము 7 చే విల్లు 'విలు' అని యగు. ఇటఁగూడఁ దొలిపద మాద్యక్షరశేషమై పరహల్లునకు ద్విత్వము గలుగుటఁ బైరూపమేర్పడెనని తలంతురుగాని తుల్యహల్స్థితిపూర్వపరములఁ గలుగుటంజేసియుఁ, దొలిపదము తుదిహల్లు సద్విత్వమై తనకుఁ బూర్వమున నున్నదానికి గురుత్వముం గూర్చుచుండుటంజేసియుఁ, దరువాతిపదము వివర్ణమై యవ్యవహితోచ్చారణమునఁ బూర్వవర్ణముతోఁ గలిసెననియు, మూఁడువకారము లేర్పడ నందొకటి యుచ్చారణసాదృశ్యమునఁ దొలఁగెననియు గ్రహింపఁదగును. సంధి ప్రాంతాదిశాస్త్రము కేవలకర్మధారయపరమగుటను నందును దుల్యహల్లుల పూర్వపరస్థితి దోఁపమిని బరుషములు పరములగునపుడు నిక్కలేత్యాదులందు నుమాగమ మనివార్య మనఁదగుటను, నీయుదాహృతులు ప్రాంతాదిశాస్త్రముచే సాధ్యములు గాఁ జాలవని సూరి యెంచెనని తోఁచెడి. పరిచ్ఛేదమున నొకొక్కసూత్ర మిట్టిది పరిచ్ఛేదవిషయము నెల్లను శుద్ధముగఁ జేయుటకై నిల్పుట దృష్టంబు. ఇంతవఱకు సూరి సంస్కృత లక్షణము ననుసరించి సమాసముల నెఱింగించెనేగాని తెలుఁగునఁ దోఁచు నాయాసమాసములందలి విశేషముల నెఱింగించి తన్మూలమునఁ దెనుఁగుబాస కీవిషయమున సంస్కృతమునకంటెఁ గలభిన్నత నెఱింగింపఁ దలంపలేదు. కావుననే త్రిలింగలక్షణశేషకర్తను, 'షష్ఠీతత్పురుషములందు నగాగమంబగు;' 'ఎలజవ్వనంబునవిలసనంబు; యోగక్షేమంబున తెఱఁగు; 'కొన్నియెడల సప్తమీతత్పురుషంబునందు నవర్ణకంబునగు; కువలయంబునవారు' అను సూత్రోదాహరణములచేతను నివార్థకముల కగు సమాసముల నెఱింగించు విధ్యుదాహరణములచేతను, (చూ. ప్రౌఢ. సమాసము 38-39-40-41-42-43) సూరి తత్పురుషసందర్భమును బూరించుట యావశ్యకమయ్యెననియు నిట్లే విరుదాద్యుత్తరపదకర్మధారయములయు (సమాస 2-3-4-5-6) మిశ్రకర్మధారయములయుం (సమాస 7) దదార్థకావ్యయముతోడి కర్మధారయములయు (సమాస 8) నవయువవిశేష్యపూర్వకమై

యవయవితో సమసించు గుణవాచక ధాతుజవిశేషణములతోడి కర్మధారయములయుం దమ్ముఁగుఱ్ఱలు చిలుకముకరిత్యాది విశేష్యపూర్వపదకర్మధారయములయుం నాయీ త్యాది ఘటితవిశేషణోభయ పదకర్మధారయములయు సందర్భయోగ్యపదవ్యవహిత త్రిక క్రియాజన్యవిశేషణఘటితవిశేషణోభయపదకర్మధారయంబులయుఁ గలరూపు నెఱిం గించుచు సూరి కర్మధారయసందర్భమును బూరించుట ప్రసక్తమయ్యెననియుం నీరీతినే మహన్మహతీవాచకఘటితద్వంద్వమునఁ బూర్వపదాంత్యస్వరమునకు దీర్ఘము గలుగు ననియు, ద్వంద్వమునఁ బూర్వపదము క్లీబసమంబగుచో నామువర్ణకము లోపించు ననియుం నప్రాణివాచకకృదంతశబ్దఘటితద్వంద్వ మేకవచనాంతమగుననియు; భావ ద్వంద్వమునఁ దొలి టవర్ణకము లోపించుననియు ద్వంద్వమునఁ బూర్వపదాంత్యావయ వంబునకు లోపంబగుననియు ద్వంద్వంబొకానొకచో మిశ్రమును నందలి పూర్వపదము క్లీబసమంబును గానంబడియెడిననియుం శాసించి యుదాహరించి సూరి ద్వంద్వసందర్భ మును సవరించుట యావశ్యకమయ్యెననియు నెఱుంగునది. మిగిలిన కొన్నింటికిఁ గల యావశ్యకత నాయాబాలవ్యాకరణసూత్రములతోడఁ గూర్చి వ్యాఖ్యలోఁ దెలుపుటం జేసి యిచ్చోఁ బరిత్యక్తము.

ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబున కయి యాయి యనుశబ్దంబులు విభాషనగు. ౨౧.

వక్ష్యమాణవిధిచేత నయి యనుదాని కైకారాదేశంబునగు.
ఆయయికాలము - ఆయాయికాలము - అయ్యాయికాలము - అయ్యా యికాలము - ఆయైకాలము - అయ్యైకాలము - ఆయాకాలము - ఆ యక్కాలము - అయ్యాకాలము - అయ్యక్కాలము

టీ. తచ్ఛబ్దార్థక మగునట్టియు నామ్రేడితసంజ్ఞక మగునట్టియు నాకారమునకు 'అయి-ఆయి' అనుశబ్దములు వికల్పముగ నగును. తచ్ఛబ్దమునర్థముగలది తెలుఁగున ఆకారమని సమాస 4 లో నిరూపితము. ద్విరుక్తమున రెండవరూప మామ్రేడితము నాఁ బడునని సంధి 10 లో నుక్తము. కాన నామ్రేడితమనుటంజేసి ముందొక యాకార మీ సందర్భమున నుండుననియు దాన నిది కర్మధారయసమాసవిషయమనియు స్పష్టము. రెండాకారములును బిదప నామవాచకమును నిందుండుననియు నందు రెండవయాకార మునకయియాయిశబ్దములు వికల్పముగ నగుననియుం ఫలితము. ఆ+ఆ+కాలము:— ఇందు రెండవయాకార మామ్రేడితసంజ్ఞకము. తదర్థకము. దాని కీవిధిచే 'అయి' శబ్ద మైనచో 'ఆ-అయి+కాలము. సంధి 3 చే నయిశబ్దము తొలియకారమునకు యడా

గమము కాఁగా 'అయయికాలము' అనురూప మేర్పడెను. అకారమునకు 'అయి' శబ్దమైనచో యడాగమము గలిగి 'అయాయికాలము' అనురూపమగు. రెండవయాకారమున కయియాయిశబ్దము లైనపిదప యడాగమము గలిగిన తరువాత 14 చే ద్విత్వము సంభవింప 'అయ్యయికాలము-అయ్యాయికాలము' అనురూపము లేర్పడును. క్రియ 103 చే 'అయి' అనుదాని కైకారము గల్గినపక్షమున యడాగమముచే 'అయైకాలము' అనురూపము గలుగును. 'అయి' అనునదైనపక్షమునను 14 చే ద్విత్వము గలుగనగుంగాన నయ్యైకాలమనురూపము సంభవించును. 'అయి-అయి' అనురెండును రానిపక్షమున యడాగమముచే 'అయాఁకాలము' అనియే రూపమగును. ఈపక్షము రెండవయాకారముమీఁది హల్లునకు ద్విత్వహ్రస్వములు 14-15 లచే నైనయెడల 'అయక్కాలము' అనురూప మేర్పడును. రెండవయాకారమునకైన యడాగమమునకు 14 చే ద్విత్వము గల్గిన 'అయ్యాకాలము' అని రూపము గలుగును. రెండవయాకారముమీఁది కకారమునకు మొదటను, బిదప హ్రస్వమైన రెండవయకారమునకును, ద్విత్వహ్రస్వములు 13-14 చే నైనయెడల 'అయ్యక్కాలము' అనురూపమేర్పడును. యోగ్యతలేమినయియాయిశబ్దములమీఁదికకారమునకును నైకారరూపమునందినయయి మీఁదిదానికిని ద్విత్వము గలుగదు. ఇట్లే హ్రస్వద్విత్వ ప్రాప్తిచేతను నయియాయిశబ్దము లగునపు డీసందర్భమున నెల్లరూపముల ప్రక్రియను గమనించునది. 'తత్తత్కాలము' అనుదానికి సరియగు నదగుట నాకారము తదర్థకమనుట స్పష్టము. తదర్థకమనుటంజేసి యితరశబ్దాదిమాకారమైనయెడల నీశబ్దములు గలుగవని గ్రహించునది. మొదట నొక తదర్థకముతోఁ గర్మధారయముచేసి పిదప మరల మఱియొక తదర్థకముతోఁ గర్మధారయమును జేసికొనుచు నీప్రక్రియను బ్రవర్తింపఁ జేసికొనవలెను.

బహువ్రీహిని సమాసాంతకార్యంబులుం గానంబడియెడి. ౨౨.

ముక్కంటి - కడలిరాచూలి - నలువ - గట్టువిలుతుఁడు.

టీ. 'కార్యాణ్యౌపవిభక్తిపదంతవిధయశ్చ' అనునదిమూలము. బహువ్రీహిసమాసములతుదిని వర్ణాదేశాదిరూపములగు, కొన్నికార్యములు గలుగుట ప్రయోగదృష్టమని సూత్రార్థము. 'ముక్కంటి:—మూఁడు+కన్నులు: మూఁడుకన్నులుగలవాఁడని యర్థము. 'టి' అనువర్ణము కన్ను శబ్దమునందలి 'న్ను' అను తుదిభాగమున కాదేశమగుట సమాసాంతకార్యము. ఆచ్ఛిక 33 చే నాటివర్ణమునకుముందు నిత్యముగ నిండుసున్నయగును. (ముక్కంటి) మఱియు సమాసమున మూఁడుశబ్దముకంటెఁ బరమైనకన్నుశబ్దమునాది మకారమునకు ద్విత్వము గలిగె. కడలిరాచూలి:—కడలి+రాజు+చూలు:' కడలిరాజు డపములకుఁ దొలుతఁ గర్మధారయము. పిదప చూలుశబ్దముతో దానికి బహువ్రీహి. కడ

లియన సముద్రుఁడు. సముద్రుఁడనురాజుయొక్క గర్భము గలది యని యర్థము (లక్ష్మి) ఇట బహువ్రీహి సమాసాంతమున నున్న చూలుశబ్దమునందలి లువర్ణము మీఁదనున్న యుఁకారమున కికారము సమాసాంతకార్యము గలిగెఁగానఁ గడలిరాచూలియని యయ్యె. సమాసమున రాజుశబ్దము తుదిజువర్ణము లోపించెను. 'నలువ:—నాలుగు+వాయిలు:' నాలుగునోళ్లుగలవాఁడని బహువ్రీహి. సమాసమున నాలుగునకు నలును వాయిశబ్దముతుది యివర్ణమునకు లోపమును గలిగె. పిదప సమాసాంతకార్యమగు వాశబ్దముమీఁది యాకారమునకు హ్రస్వాకారముగా 'నలువ' యనియయ్యె. గట్టువిలుతుఁడు:—గట్టనఁగాఁ గొండ. కొండవిల్లుగాఁ గలవాఁడని బహువ్రీహి. 'గట్టు+విలు' ఇచట సమాసాంతముననున్న విలుశబ్దమునందలి లువర్ణమునకు మీఁద తవర్ణ మాగమముగ నగుట సమాసాంతకార్యము. పిదప నదంతమహద్వాచకమగుట నుత్వడుజ్ఞులు గలిగి 'గట్టువిలుతుఁడు' అని రూపము గల్గెను. ఇందికారము సమాసాంతకార్యముగా నయ్యె ననుట కుదాహరించిన 'కడలిరాచూలి' అనునుదాహరణమునందలి 'చూలి' అనుదానికి బిడ్డయని యర్థము చెప్పుటకు శబ్దరత్నాకరాదు లవకాశమిచ్చుచుండుటంజేసి యిది కర్మధారయమే గాని బహువ్రీహి గాదనియుఁ సమాసాంతకార్య మికారము చూలుశబ్దమునకుఁ గలుగ లేదనియుఁ సమర్థింపనగును. తద్ధిత 18 సూత్రముచే మతుబర్థమున ఇవర్ణకమైన రూపముగ నాపక్షమునఁ జూలి యనుదాని నూహింపనగును. ఔపవిభక్తికములట్లుగాక యికార్యములు సమాసాంతములందే యగునవగుటచేతను, నౌపవిభక్తికములన్న నలువేత్యాదులందలి వాహ్రస్వము గట్టువిలుతుఁ డిత్యాదులందలి తవర్ణము గుదురకుండుటచేతను సమసించిన పదములందుఁ దోఁపని క్రొత్తవర్ణములగుట సమాసాంతములందే తోఁచుటచేతను, వీనిని సమాసాంతకార్యములని చింతామణి వ్యాఖ్యాతలెల్లరు వ్యవహరించియుందురు. కాని యహోబలపతి 'క్వచిదంతిమవర్ణస్య సమాసాంతత్వమిష్యతే' అనునథర్వణోక్తి నాధారముగఁగొని 'కఱకంఠుఁడు' అనుచో ఠవర్ణమును సమాసాంతకార్య ప్రాప్తముగ బాలసరస్వతి ననుసరించి గణించి సాధువుగాఁ జేయుట యుక్తిదూరప్రసంగము. శబ్దమునఁ దోఁపనివర్ణమును నందును నచ్చతెలుఁగువర్ణమును సమాసాంతకార్యప్రాప్తవర్ణముగ గణించుట లక్ష్యదృష్టికి సరిపడుంగాని శబ్దగతమగుదాని నసాంధ్రవర్ణమును సమాసాంతకార్యప్రాప్తవర్ణముగ నెన్నుట సరిపడదనియు నది యగతికప్రసంగమనియు ముంచె సిద్ధాంతితము (చూ. సంజ్ఞ 23 టీక.)

బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబుమీఁఁది మేనునకుఁ బోఁడియగు. ౨౩.

అలరుఁబోఁడి - ననఁబోఁడి - పూఁబోఁడి - విరిఁబోఁడి.

టీ. స్త్రీసమములకె బహువ్రీహియని నిరూపితము. స్త్రీ వాచ్యమగుచో ననఁగా నాసమాసముచే స్త్రీ బోధ్యమగునపుడని భావము. సమాసపదమున కాఁడుదే యర్థము గావలెనని ఫలితము. ఉపమానమనఁగా నొకదానికి సాటియగునది. ముఖాదులతోఁ జంద్రాదులు సాటియగుంగానఁ జంద్రాదు లుపమానములు. విశిష్టముచే స్త్రీని జెప్పునట్టి బహువ్రీహి నుత్తరపదంబై నిల్చినదియు నుపమాన వాచకమునకంటెఁ బరమైనదియునగు మేనుశబ్దమునకుఁ బోఁడి యనున దాదేశముగ నగునని సూత్రార్థము. విశిష్టముచే వనితను బోధించు మేనుశబ్దఘటితబహువ్రీహిలం దుపమానవాచకమునకంటెఁ బరమగు మేను శబ్దమునకుఁ బోఁడి యాదేశమగునని భావము. బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుప మానంబుమీఁది మేనునకనుటంజేసి మేనుఁదీవలు మొదలగు కర్మధారయములం దీసూత్ర మెల్లభంగుల సంక్రమింప నవకాశములేమి నట్టివి దీనికి లక్ష్యములు గాఁజాలవని గ్రహించునది. 'అలరుఁబోఁడి:—అలరు+మేను;' పూవువంటిశరీరముగలదియని బహు వ్రీహి. ఇందుఁ బూర్వోత్తరపదములు రెండును స్త్రీసమములెగాన నిది యాచ్ఛికబహు వ్రీహి. పూవువంటిశరీరముగల వనిత దీనికర్థముగాన స్త్రీయే దీనిచేఁ జెప్పఁబడుచున్నది. మేనునకు సాటియైనదలరుగాన నలరుశబ్ద ముపమానవాచకము కాన మేనుశబ్దముప మానంబుమీఁదిదే యగుచున్నది. అట్లగుట నీవిధిచే నట్టి మేనుశబ్దమునకు 'పోఁడి' అను నది యాదేశమయ్యెడి. 'అలరు+పోఁడి' సంధి 25 చే నుదంత స్త్రీసమమగు నలరు శబ్దముమీఁద నుమాగమమగు. పిదప పోఁడిశబ్దగత పకారమునకు సరళాదేశము. ద్రుత కార్యములు. 'అలరుఁబోఁడి; అలరుంబోఁడి.' ఇట్లే 'నన+మేను=నన+పోఁడి=ననఁబోఁడి; పూ+మేను=పూ+పోఁడి=పూఁబోఁడి; విరి+మేను=విరి+పోఁడి=విరిఁబోఁడి' అనురూప ముల ప్రక్రియను గమనించునది. ఉదంతేతరపదములమీఁద నుమాగమవిధాన మీవ్యా కరణమునఁ గానరాకున్నను గారకము 14 సూత్రమునందుఁ దానే యుదాహరించిన జ్ఞానముఁబట్టి; నీవువచ్చుటంబట్టి, అనునుదాహరణములందుఁ బట్టివర్ణకము పరముగా నుమాగమమును విధించుట మఱచినట్లే పోఁడిపరమగునపుడును నుమాగమముం జెప్పుట సూరి మఱచెనని యెంచి నుమాగమమును జేసికొనునది. సమాసములందు వివిధములగు సమాసాంత కార్యములుగాని వర్ణాగమవర్ణలోపాదులుగాని చూపట్టెడిఁగాని సమాసచర మావయవంబగుశబ్దమునకు మఱియొకశబ్ద మాదేశమగుట యీ మేనుశబ్దోత్తరపదాచ్ఛిక బహువ్రీహియందే చిన్నయసూరిమతమున నేగాని మఱియెచటను గానము. పైసందర్భ మును బరిశీలించియే కాపలయుఁ ద్రిలింగలక్షణశేషకర్త 'అలరుఁబోఁడీత్యాదు లుప మానపూర్వపదకర్మధారయము'లని శాసించి, 'అలరు+పోఁడి' పూవువలె మనోజ్ఞమైన దని వివరణము వ్రాసి బాలవ్యాకరణమునందలి యీసందర్భమును సవరించెను. పోఁడి

శబ్దమునకు మనోజ్ఞమైనదని ధర్మిపరముగా నర్థము చెప్పనగుంగానఁ బోఁడి శబ్దోత్తర పదములగు నిట్టివానిని గర్మధారయములుగనే యంగీకరింపఁ దగుననియు బహువ్రీహులుగ నెంచఁ బని లేదనియుఁ గాన మేనుశబ్దమునకుఁ బోఁడి నాదేశించు నసంగతమగు మార్గము పరిత్యాజ్యమనియుఁ ద్రిలింగలక్షణశేషకర్త తలంపైయుండును. ఈవిషయమున బాలసరస్వతి 'మెఱుఁగుఁబోఁడి; పాణిపల్లవము' ఇవి యుపమానసమాసముల (చూ. బాలస. వావిళ్లవారిప్రతి. పుట 246) నియు నహోబలపతి 'మెఱుఁగుఁబోఁడి; తమ్మికంటి ఇత్యాద్యా ఉపమానగర్భబహువ్రీహయః' అనియు (చూ. అహో. ప. పుట 436) వ్రాసియున్నారు. ఇం దహోబలపతిమతమును సూరియు సరస్వతిమతమును సీతారామాచార్యులును ననుసరించిరనుట తెల్లము. కాఁగా సూరి యేల యిందు పోఁడి శబ్దము నాదేశించుమార్గము నే రమణీయముగ నెంచెనని యించుక పరిశీలింతము. మేను శబ్దమును సమాసగతముగాఁ జేసి దానికిఁ బోఁడి నాదేశము సేయకున్న లతవంటిశరీరముగలది యనునర్థము స్ఫురింపఁజాలదనియు ననఁగా లతాదు లేవాని కుపమానములో యనునంశము స్పష్టపడదనియు మేనుశబ్దమునకుఁ బోఁడి నాదేశించిన మేనుశబ్దస్థానీయంబగు పోఁడిశబ్దము మేనుశబ్దార్థమును దెల్పుచు నుపమానోపమేయత్వమును సరిగఁ బ్రకాశితము సేయఁజాలుననియు నింతియగాక సంస్కృతవాఙ్మయప్రసిద్ధములగు 'లతాంగి-సుమగాత్రి' అను మొదలగురూపములకు శబ్దార్థముల రెంటను సరియగు రూపము లివియనునంశ మిమ్మార్గమే సుబోధము సేయఁగలుగుననియుఁ సూరి పోఁడి నాదేశించుమార్గము నే సరసముగఁ దలంచెననుట యుచితము. త్రిలింగలక్షణశేషము ననుసరించి చూచిన నలరుఁబోఁడీత్యాది సమాసములందుఁ దొలినున్న 'అలరు-తీవ-నన-విరి' మొదలగు పదములచే బోధ్యములగు పదార్థములు వేని కుపమానములో శబ్దార్థావగతివలన స్పష్టము గాఁజాలదు. పైరూపములు స్త్రీవాచకములుగనే ప్రయుక్తములయ్యెడిఁగాన స్త్రీనిష్ఠములగు నేయేయవయవములకు లతాదు లుపమానములు గాఁదగునో యనుమానించి సరిపెట్టుకొనవలసి యుండును. 'కౌముదీ విశదా-లతా తన్వీ' మొదలగు సిద్ధములందుత్తరపదములు శ్వేతత్వతనుతావిశిష్టధర్మివాచకము లగుటంజేసి 'కౌముదీ-లతా.' మొదలగునవి శ్వేతత్వతనుత్వవిషయముననే యుపమానములగుచుండుట స్పష్టపడియెడి. పోఁడిశబ్దఘటితములం దట్లనుమానించుట కించుకేని యవకాశము చాలదు గదా! ఇట్టిచిక్కులను గమనించియే సూరి యివ్వానిని బహువ్రీహులుగ నెంచుటయు మేనునకుఁ బోఁడి నాదేశించుటయు నొనర్చెనని తోఁచెడి.

ఇది యిట్లుండ నొకకాలపుబాలవ్యాకరణముద్రణము ననుసరించి మేను శబ్దమున కాదేశమగునది 'భోఁడి' అనునదిగాని 'పోఁఢి' అనునది గాదను నొకవివాద

విషయమును వెడలియున్నది. అద్దాని యుక్తాయుక్తతలఁ బరిశీలించుట యిట నప్రసక్తము గాఁజాలదు.

నిక్కముగఁ బరిశీలింప బాలవ్యాకరణమున నుదంతేతరముపై నుమాగమవిధానము చూపట్టమి నెల్లరూపములను నిరాఘాటముగఁ జక్కఁబెట్టుకొన నిమ్మార్గము నేరో కల్పించి యుందురనుటకు సందియములేదు. ఏరో యన నేల? ఇట్టియాశయముగల్గిన ముద్రణాలయములందలి సంస్కర్తలే 'మేనునకుఁ బోఁడి' అనునపుడు 'కు' వర్ణమునకుఁ దరువాతి యర్ధబిందువును దొలఁగించి తమయుద్దేశము ననాయాసముగఁ జక్కఁజేసికొని యుందురనుట కడ్డంకిలేదు.

వాఙ్మయమున నెల్లయెడల నిట్టిసమాసముల బకారమున కిరువంకల నర్ధబిందువు తోఁచుటయుఁ, 'జిగురుఁబోఁడిమితోఁదరాత్త' అను మొదలగు ద్వ్యర్థికావ్యప్రయోగములు పోఁడి యనునదే యీసమాసములం దుత్తరపదమని స్పష్టపఱచుచుండుటయుఁ, త్రిలింగ లక్షణశేషముగూడ నిట్టిసమాసములం దుత్తరపదము పోఁడి యనియే సాక్ష్యమిచ్చు చుండుటయుఁ బ్రకీర్ణపరిచ్ఛేదము 13 లో 'పోఁడి' అనుదాని గ్రంథకర్త స్పష్టముగాఁ జేర్చుటయు, 'పోఁడి' అనునదే యాదేశమగునన్న విరిఁబోఁణీత్యాదిణకారఘటితరూపములును బాలవ్యాకరణసమ్మతములగుటయు, 'పోఁడి' అనునదాదేశము గాదన్న నడంగ్వాదులలోఁ బోఁడిశబ్దము లేమి ణకారఘటితరూపములు సిద్ధింపకుండుటే గాక ముండితమను నశ్రావ్యానర్థకమగుపదము నాదేశించెననువాదము తటస్థించుటయు బకారమున కిరుప్రక్కల వాఙ్మయమున నెల్లయెడల నగపడునట్టి యర్ధబిందువు లసంగతము లగుటయు, నడంగ్వాదిసిద్ధమైన పోణియనుదానికి వ్యస్తమునఁ బ్రయోగము చూపుట దుర్ఘటమగుటయుఁ; భట్టివర్ణకము కంటెవర్ణకము పరమగునపుడు క్రమముగ నుమాగమనగాగమముల విధించుట మఱచినట్లే పోఁడి పరమగునపుడును గ్రంథకర్త నువ్విధాన మొనర్చుట మఱచెనని చెప్పుట సయుక్తికమగుటయు ననుమొదలగు విషయములఁ బరిశీలింప మహాకవిప్రయోగారూఢమైనట్టియు నడంగ్వాదిశాస్త్రమున 'పోఁడి' అనుదానిం జేర్చు గ్రంథకర్తమార్గమును సార్థకముగాఁ జేయునట్టియు ద్వ్యర్థికావ్యాదివాఙ్మయసమ్మతమగునట్టియు, మేనుశబ్దమునకు 'పోఁడి' అనుదాని నాదేశించుమార్గమే గ్రంథకర్తృ మహాకవ్యభిప్రేతమును రమణీయమును సార్థకమును నని చెప్పక తప్పదని తోఁచెడి. మఱియుఁ బోఁడి యనుదానికిఁ బోఁడిమిగలది యని యర్థము చెప్పికొని యుపమానపూర్వపదకర్మధారయముగ నెంచుటకంటె బహువ్రీహ్యర్థము జ్ఞప్తికిఁదెచ్చి, నొక్కి నిరూపింపఁ జాలు మేనుశబ్దమునకుఁ బోఁడినాదేశించు సూరిమార్గమునే యనుసరించి బహువ్రీహిగనే యెంచుట యత్యంతరమణీయమని తోఁచెడి.

## ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాషనగు. ౨౮.

మాత్రపితలు - మాతాపితలు - ఇత్యాదులు.

టీ. 'ఉర్ద్వంద్వే రః' అనునది మూలము. ఋకార మనాంధ్రవర్ణ మగుటచేతను ఋకారాంతసంస్కృతసమములు తెలుఁగున వ్యస్తమున నత్వస్త్రీవద్భావములనందున వగుటచేతను దెలుఁగున ద్వంద్వ మాచ్ఛికశబ్దముతోడ స్త్రీసమమునకే యగునదగుట చేతను ఋవర్ణమునకు రేఫమును విధించునీవిధి సిద్ధద్వంద్వములందుఁ దోఁచు ఋకార మునకు సంబంధించినదే యనుట స్పష్టము. ద్వంద్వమునందు ఋకారమునకను సామా న్యోక్తిం జేసి సంస్కృతవ్యాకృతిచే సిద్ధించు నానజాదేశము నడ్డియు నిది గలుగనగు ననుట సూచితము. అట్లు గాకున్న ఋకారమున కానజాదేశము సిద్ధించినమీఁద ఋకారమగపడుటే యసంభవముగాన ఋకారమునకు రేఫంబగుననువిధానమునకే వైయర్థ్యము సంభవించెడి. కాన సిద్ధద్వంద్వమునం దానజాదేశమున కవకాశము తోఁచెడిస్థలములందలి ఋకారమునకు రేఫము వికల్పముగ నగునని సూత్రార్థము తేలెడి. మాత్రపితలు:—'మాతృ+పితృ' ఇందుఁ దొలినున్న మాతృశబ్దము తుదిఋకార మున కీవిధిచే రేఫము గల్గెను. 'మాత్ర+పితృ' పిదప ఋకారాంతమగు నిది సమాస మగుట నేకపదముగా గ్రహించి తత్సమము 52 చే నత్వస్త్రీవద్భావములును ద్వంద్వ మగుట బహువచనమును గూర్ప 'మాత్రపిత'లని రూపమేర్పడును. రేఫము వైకల్పిక మగుటఁ గలుగకున్న సంస్కృతవ్యాకృతిచే నానజాదేశము గలిగి మాతాపిత లనురూపము గలుగును. ఉత్తరపదంబు పరముగా ఋకారాంతపూర్వపదమునకే యీవిధానమని యుదాహరణముంబట్టి స్పష్టము. ఇట్లే బహుపదద్వంద్వమునను బూర్వపూర్వములగు ఋకారములకే రేఫం బగునుగాని సమాసచరమావయవంబగు పదమునకు సంబంధించిన ఋకారమునకు మాత్రము గలుగదని గ్రహింపవలెను. 'ఇందు లక్షి క్రమముగ "ఋకారాంతద్వంద్వే పూర్వపదసంబంధియఋకారస్తస్య స్థానే రస్స్యాత్'' 'మాత్రపితృబుద్ధివై దేహపుత్రి దలఁతు' ఇత్యాది; క్వచిద్గ్రహణస్య ఉభయ త్రాప్యన్వయే 'మాతాపితృబుద్ధి సీత మదిలో నెంతున్' ఇత్యాదిరూపాంతరం సిధ్యతి. 'ఆనజ్స్యాదృతో ద్వంద్వే రేఫశ్చారికవేర్మతే' ఇతి పదద్పిరథర్వణాచార్యైరప్యైక మత్యం చ సిధ్యతీతి జ్ఞేయమ్ 'ఆనజ్ఋతోద్వంద్వే' ఇతి సూత్రే ఉత్తరపదేన పూర్వ పదం నాక్షిప్యత ఇతి మధ్యమపదస్యాప్యానజ్, తేన హోతాపోతానేష్టోద్గాతార ఇతి భాష్యకయ్యటాదౌ సిద్ధమ్, తత్రాపి రేఫప్రయోగే. 'హోత్రపోత్రనేష్ట్రోద్గాతలితి రూపం జ్ఞేయమ్......పితాపుత్రావిత్యత్రాపి రేఫే 'పిత్రపిత్రులు' ఇత్యపి రూపం సమం జసమేవ' అను నహోబలపతివ్యాఖ్య ప్రమాణము. (చూ. అహోబల షం, పుట 324)

ఇది యిట్లుండ గుప్తార్థప్రకాశిక హ్రస్వముతరువాత వచ్చు ఋకారమున కీసూత్రముచే రేఫాదేశము గలుగదు. అందు 'పితాపిత్రులు' అన్నయానజాదేశయుక్త రూపంబే సాధువగునుగాని 'పితృపుత్రులు' అని రేఫాదేశయుక్తరూపంబు శాస్త్రీయంబు గాదు' అనుమొదలగు వ్రాఁతలను వ్రాయుట కాకరము గానరాకున్నది. మఱియుఁ బైసందర్భముంబట్టి గడపటిపదమునకు ముందున్న ఋకారాంతసంబంధమైన ఋకారమునకే యీరేఫాదేశమనియు, దీర్ఘాకారాంతములుగా నుదాహరించిన ప్రయోగములెల్ల రేఫాదేశాభావపక్షమున సంస్కృతవ్యాకృతి సిద్ధమగు నానజాదేశముచే నైనవనియు, నిరూపింప శక్యమగుచుండ నట్లు వ్రాయుటయుం నిరాధారవిషయమే యయ్యెడి. అహోబలు ననుసరించి తామన్నట్లే యీరేఫాదేశము 'ఆనఙ్ ఋతో ద్వంద్వే'అనుసూత్రముచేఁ గలుగు నానజాదేశము వచ్చుచోటులందె సంభవించునదగునపుడు, విద్యాయోనిసంబంధము బోధ్యమగు ఋకారాంతద్వంద్వములందే గలుగునదగునప్పు డట్టిచోటులం దొకచోఁగల్గుటయుం నొకచోఁ గలుగ కుండుటయుం నుండునా? మఱియుం నీరేఫాదేశమునకుఁ బ్రయోగానుసారముగఁ బ్రసక్తిని గల్పింపవలెననుటకు మూలమునందలి క్వచిత్పదమును నాంధ్రీకరణమునందలి విభాషాపదమును బ్రమాణములు గాఁదగియుండ నంత ప్రయాసపడ నెందులకో యూహింపఁజాలను. యుక్తిదూర మాలేఖన మనుట యొప్పు.

పైసందర్భము ననుసరించి విద్యాయోనిసంబంధముగల ద్వంద్వమునందైన ఋకారాంతపూర్వపదమునందలి ఋకారమునకే యీసూత్రముచే రేఫాదేశము విభాష నగు నని విశదమగుటంబట్టి యప్పకవి సంయుతాసంయుతప్రాసమున కుదాహరించిన 'క్షత్రియవంశ్యులై......మాం, ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాఁచిరె యేయుగంబునన్' అనుపద్యమునందలి మాంధాతృరఘుక్షితీశులను ద్వంద్వమున మాంధాతకును రఘుక్షితీశునకును విద్యాసంబంధముగాని యోనిసంబంధముగాని 'మాతాపితలు,' హోతృపోతృ నేష్టృద్గాతలు,' అనువానియందువలె గోచరింపమిని మాంధాతృపదమునందలి ఋకారమునకు రేఫాదేశము గలుగ నవకాశము లేమి నడిదము సూరకవి మాంధాతృశబ్దమునందలి ఋకారమునకు రేఫాదేశము చేసి చూపుట ప్రామాదికమనియుం నప్పకవి చెప్పినచొప్పున సంయుతాసంయుతప్రాసమె గానోపుననియుఁ దీర్మానించుటయె సయుక్తికము. 'క్రిందజడ్డలును బిరుదబిందువులును నూఁది ప్రాసములకు నుండెనేని హ్రస్వ మొకటి నిడుదయక్కరంబొక్కటి నిలుపఁదగును' అను నప్పకవి చెప్పిన ప్రాసపూర్వాక్షరసామాన్యస్వరూపవిధిని విశేషవిధిగ ననఁ గ్రిందజడ్డలును బిరుద బిందువులును నూఁది ప్రాసములకు నుండునపుడే ప్రాసపూర్వాక్షర మొకచో హ్రస్వముగను నొకచో

దీర్ఘముగను నుండఁదగుంగాని యట్లు గానపుడుండదాదని గ్రహించి గుప్తార్థప్రకాశికా కారులు హలంతరసంయోగమున ద్విత్వావృత్త్యనావశ్యకతారూపమగు తమ సిద్ధాంత మును సార్థకముచేసికొనఁ బ్రకృతపద్యమునందును మాంధాతృపదమునందలి ఋకారము నకును రేఫము గలిగింప యత్నించుటయుఁ బ్రామాదికంబె. 'క్షత్రియవంశంబున మాం ధాతృఁడురాజ్యంబు నీతిఁ దగఁ బాలించెన్' అను నంది సింగయ బలరామవిజయములోని పద్యమునఁ గ్రింద జడ్డయుఁ బిరుంద బిందువును లేని వ్యస్తమాంధాతృశబ్దమునందలి తృవర్ణమే క్షత్రియశబ్దమునందలి త్రివర్ణముతోఁ బ్రాసమైత్రి నందుటంజేసియు ద్వంద్వ ముగామి నచ్చో రేఫాదేశమునకుఁ బ్రసక్తియే లేమింజేసియుఁ బైవిషయము ఛందో లక్షణవిరుద్ధ మనక తప్పదు. ఋకారము రేఫధ్వని గలదగుటను నందును హల్లుపైనున్న దీనికి రేఫోచ్చారణమె శ్రుతివిషయమగుటను శ్రుతిననుసరించి ప్రాసముల రేఫతోఁ గూర్చుటయుఁ దదనుగుణముగ లక్షణము లుదయించుటయుఁ గలిగెననుట పరమార్థ మగు విషయము.

## సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు. ౨౫.

రాముని బాణములు - సరసపువచనములు - వేవెలుఁగు - గుణ ములప్రోక.

టీ. ''లోపశ్చ విభక్త్యాదేశ్మద్దేషు స్యాత్సమాసకాంగేషు'' అనునది మూలము. సమాసములందలి పూర్వోత్తరపదములసంబంధమైన విభక్తులకు లోపము నిత్యముగ నగు ననియు విభక్త్యవయవముగఁ దత్సమము 31 చే విధింపఁబడిన లట్టునకు మాత్ర మీ లోపము గలుగదనియు సూత్రార్థము. ప్రక్రియ నడపుదశలోఁ బూర్వోత్తరపదముల విభక్తులు లోపించి పిదప సమాసత సిద్ధించుడు విశిష్టము మీఁదఁ బ్రథమాది ప్రత్యయ ములుగలుగునని గ్రహించునది. 'రాముని బాణములు' రామునియొక్క బాణములను షష్ఠీ తత్పురుషమునఁ బూర్వపదసంబంధియగు యొక్క ప్రత్యయమునకును నుత్తరపదసంబంధ మైన ప్రథమాప్రత్యయమునకును లోప మీవిధిచేఁ గలిగెననియుఁ బిదప విశిష్టము మీఁదఁ బ్రత్యయ ముప్పతిల్లుటంజేసి పైరూప మేర్పడెననియు గ్రహించునది. 'సరసపు వచనములు:—ఇచట 'సరసములు + వచనములు' అనుకర్మధారయమునఁ బూర్వోత్తరపద ముల సంబంధమైన లువర్ణక మీవిధిచే లోపించెననియుఁ బిదప విశిష్టముపైఁ బ్రథమా బహువచనమును దత్సమము 41 చే మువర్ణకకార్యము ముగాగమమునకును గలుగఁ దగునదగుటచే సంధి 32 చే ముగాగమము వర్ణమునకుఁ బుంపులును గలుగ సరసంపువచ నములను రూపమయ్యెననియుఁ దెంచునది. కారకము 20 చేఁ దొలినున్నదాని కేకత్వ

మును గలుగనగునని యూహించినపక్షమున తుదిపదములువర్ణమే యీలోపమునకు విషయమయ్యెననియుఁ బుంబులవిధానమునంజేసి తొలిపదను మువర్ణము లోపింపని దయ్యెననియు గ్రహింపఁదగును. 'వే+వెలుఁగులు' అను బహువ్రీహిని; 'గుణముల యొక్క ప్రోక' అను తత్పురుషమునఁ గ్రమముగఁ బ్రథమాప్రత్యయమఃలును యొక్కయుఁ లోపించుటచేఁ బైరూపములు నిష్పన్నము లయ్యెననునంశమును గమనిం చునది. వేయిశబ్దము కృత్తరూపము వేయని గ్రహించునది. లట్టును టిత్తుగాఁజేసి విభక్తి కాద్యవయవముగాఁ జేయుటంజేసి.యవయవికి లోపము సంప్రాప్తముగా నాలోప మవయ విద్వారమున నవయవమునకును గలుగవలసివచ్చుటచే లట్టునకుఁ గాదని చెప్పవలసివచ్చె ననిగ్రహించునది. ముగాగమము ప్రత్యయమునకుఁగాక ప్రకృతికి విధింపఁబడిన దగుటం జేసి ప్రత్యయలోపప్రాప్తిమూలమునఁ గలుగు లోప మద్దానికిఁ గలుగ నేరదని యెఱుం గునది. ఇట్లే నిగాగమము ధుమంతమున కంతావయవముగ విధింపఁబడినదగుట నద్దా నికిఁ బ్రత్యయలోపమూలకమగు లోపము గలుగఁజాలదనుట తెల్లము. (చూ. క్రమ ముగఁ దత్సమము. 31. 41. 21) లట్టు విభక్త్యవయవ మగుటచే నిషేధము చేయఁబడె ననియు ముగాగమ నిగాగమములు ప్రకృత్యవయవములగుట విభక్త్యవయవములు గా మిని వానిని నిషేధవిషయములుగఁ జేయ లేదనియు భావము. 'సరసము+వచనము' అను కర్మధారయమున మువర్ణమునకుఁ బుంపులగుననువిధానమునంజేసి పూర్వపదసంబంధి మువర్ణకమునకు లోప మీవిధిచేఁ గలుగదనియుఁ బుంపులే నిత్యముగ నగుననియు నెంచు నది. సమాసమను సామాన్యోక్తింజేసి తద్ధితవృత్తియందును నీవిధిచే విభక్తిలోపముగలుగు ననియు దాన రామునితనము ఒజ్జతనము చదువరి మొదలగురూపములు నిష్పన్నము లగుననియుఁ దెలిసికొనునది.

## కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడం బోలె వానితోడ సమసించు. ౨౬.

రాముఁడు రక్షించినభృత్యుఁడు-రాముఁడు వాలినేసిన బాణము- రాముఁడు గోవునిచ్చినవిప్రుఁడు-రాముఁడు వెడలినవనంబు-రాముఁడు వసించిన పర్ణగృహము - రాముఁడు వసించినచోటు.

ఇది సమాసపరిచ్ఛేదము.

---

టీ. 'కర్మాదేః కర్తృత్వం ప్రథమాచ నవర్ణకశ్చ తద్వత్స్యాత్' అనునది మూలము. తెలుఁగున ధాతుజవిశేషణములకుఁ గర్తతోడ సంబంధమే ప్రధానముగఁ జూపట్టెడిఁగాని కర్మాదివాచకములతోడ సంబంధము చూపట్టదు. కాని కర్మాదివాచక

ములకును గర్తకుఁ బలెఁ బ్రాధాన్యము వివక్షించినపుడు కర్తృవాచకమెట్లట్లె కర్మాదివాచకములును ధాతుజవిశేషణముతోడ సంబంధమునంది సమసించుట తోఁచెడి. ధాతుజవిశేషణమునకు సంబంధించిన కర్తృవాచకమెట్లు ధాతుజవిశేషణముతోడి నిరంతరాన్వయసంబంధముచే సమసించునో యట్లే ధాతుజవిశేషణముతోఁ గర్మాదిరూపమున సంబంధించునవియుఁ దమకుఁ గర్తవంటి ప్రాధాన్య మీయఁబడినపుడు ధాతుజవిశేషణముతోడ నత్యంతసంబంధమునంది సమసించునని సూత్రార్థము. 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు':— ఇచట భృత్యుని రక్షించినరాముఁ డనునది సహజవాక్యము. రక్షించినవాఁడు రాముఁడును రక్షణము నందినవాఁడు భృత్యుఁడును నగుటచే రక్షించిన యను ధాతుజవిశేషణమునకుఁ గర్త రాముఁడును రక్షణఫలమునందిన భృత్యుఁడు కర్మమును నగుట సహజస్థితి. ప్రకృతము భృత్యుని నను కర్మమునకుఁ గర్తకుంబలెఁ బ్రాధాన్యమనఁగాఁ గర్తృత్వము వివక్షితమయ్యెఁగానఁ గర్తయగు రాముఁడను దానితో నెట్లట్లె భృత్యుఁడను గర్మముతోడను రక్షించినయను ధాతుజవిశేషణ మీవిధిచే సమసించుచున్నదిగానఁ బైరూపము గలిగెనని గ్రహించునది. ప్రాధాన్యవివక్షంజేసి కర్తవంటి ప్రాధాన్యము సిద్ధించెడిఁగానఁ గర్మాదులు ప్రథమాంతములగుట చూపట్టెడి. ప్రథమమూలముననే ప్రాధాన్యవివక్షయును గర్తవంటి దగుటయును స్పష్టపడియెడిఁ గానఁ బ్రథమయగుట నిర్బాధము. కర్తృవ్యాపారము కర్మాదులం దారోపించుటయే కర్మాదులకైన ప్రాధాన్యవివక్షయని గ్రహింపవలెను. పైయుదాహరణము కర్మమునకుఁ బ్రాధాన్యవివక్షచేయుట కొసంగిన దనుట స్పష్టము. ఆదిపదముచేఁ గరణాదులు గ్రాహ్యములు. 'రాముఁడు వాలి నేసిన బాణము':—రాముఁడు బాణముచే నేసిన వాలి యనునది సహజవాక్యము. ఇట బాణముచే నను గరణమునకుఁ బ్రాధాన్యము వివక్షితమయ్యెఁ గాన బాణము ప్రథమాంతమై యేసిన యను ధాతుజవిశేషణముతో సమసించుటంజేసి పైప్రయోగము గలిగెనని గ్రహించునది. 'రాముఁడు గోవునిచ్చిన విప్రుఁడు':—విప్రునికొఱకు గోవునిచ్చిన రాముఁ డనునది సహజ వాక్యము. ఇందు విప్రునికొఱకను సంప్రదానమునకుఁ గర్తృవ్యాపారము నారోపించురూపమైన ప్రాధాన్యమును వివక్షించుటంజేసి కర్తతోవలె సంప్రదానముతోడ ధాతుజవిశేషణము సమసించుటచేఁ బైప్రయోగ మేర్పడెనని యెంచునది. 'రాముఁడు వెడలినవనంబు':—వనమునుండి వెడలిన రాముఁడనునది సహజవాక్యము. ఇట వనమునుండి యను నపాదానమునకుఁ గర్తృత్వరూప ప్రాధాన్యమును వివక్షించుటంజేసి ధాతుజవిశేషణము దానితో సమసించుటచేఁ బైప్రయోగము గలిగె. 'రాముఁడు వసించిన పర్ణగృహము':—పర్ణగృహమందు వసించిన రాముఁడనునది సహజవాక్యము. ఇందుఁ బర్ణగృహ

మందను నధికరణమునకుఁ బ్రాధాన్యవివక్షంజేసి పైప్రయోగము సంభవించెను. ఇట్లే 'రాముఁడు వసించినచో' టనునది చోటునందు వసించిన రాముఁడను సహజవాక్యము నందలి చోటునం దను నధికరణమునందుఁ గర్తృవ్యాపార మారోపించి ప్రాధాన్యమును వివక్షించుటంజేసి ధాతుజవిశేషణము కర్తతోడవలె దానితోను సమసించుట జరిగి పై ప్రయోగము గలిగెనని యెంచునది. కర్మత్వాదులను గారకప్రకరణమునందలి యాయావిధులనుబట్టి గమనించికొనునది. ఇట్లే 'రాముఁ డన్నముతిన్న విస్తరి' మొదలగు ప్రయోగములందు విస్తరియందను నధికరణాదులకుఁ బ్రాధాన్యమారోపిత మగుటంజేసి ధాతుజవిశేషణము వానితో సమసించుట నూహించుకొనునది. విస్తరియం దన్నముతిన్న రాముఁడనునవి సహజవాక్యము చమత్కారాపేక్షను వక్తక్రియావాచ్య వ్యాపార మునఁ గర్త కెట్టిప్రాధాన్యమిడునో యట్టిప్రాముఖ్యము కర్మాదులకును దద్విషయమున నున్నట్లు వివక్షించుటయే ప్రాధాన్యమనఁదగు. సంస్కృతమునఁ గర్మాదులకుఁ బ్రాధాన్య మొసంగి 'అసి నఱకుచున్నది. బాణము చంపుచున్నది' అను మొదలగు వాక్యముల రచించుటగలదుగాని తెలుఁగునందువలెఁ బ్రాధాన్యవివక్షనందినదానితోడను, గర్తతోడను గూడనేకక్రియ యన్వయించుట గానము. కాన నీసూత్రప్రోక్తమగు మార్గ మెల్లభంగుల సంస్కృతవిలక్షణమనియు నిది కేవలము తెలుఁగుభాషకు సహజమగు వాక్యరచనమే యనియుఁ జెప్ప సంశయములేదు. సంస్కృతవిలక్షణము లైనను, గర్మాదికారకముల యర్థ మిద్దానిమూలమున మఱుఁగుపడుచున్నను నిట్టివాక్యము లాంధ్రభాషాశైలింజేసి యతి మనోహరములును, సహజములును వక్తవ్యమునకు మెఱుఁగుదెచ్చునవియును నైయుండుటను గమనించునది. మూలమునందలి 'నపర్ణకశ్చ' అను దళము నాధార ముగఁ గొని సూరి ధాతుజవిశేషణమను దానిం గూర్చెననుట తెల్లము. "భూతార్థే ప్రతిషేధార్థే నశ్చ నిశ్చ భవేత్క్రమాత్, కర్మాది కర్తృతాయాం చ తౌ క్రియాజ విశేషణమ్" అను నాథర్వణము పై సూరి ధాతుజవిశేషణపదమునకు బీజమయ్యెడి.

ఇది సమాసపరిచ్ఛేదము.

# తద్ధితపరిచ్ఛేదము.

భావార్థమత్వర్థాదులందు విభక్త్యంతములగు శబ్దములపైని విధింపఁబడునవి తద్ధితప్రత్యయములు నాఁబడును. క్రింది త్వార్థలక్షణము ననుసరించి విశేషించి యొక్క- షష్ఠ్యంతమగు పదముమీఁదనే త్వార్థక ప్రత్యయములు గలుగ నవకాశము చూపట్టెడి. తద్ధితప్రత్యయములను విధించు గ్రంథభాగముగాన నిది తద్ధితపరిచ్ఛేద మను సంజ్ఞ నందెను.

## తనవర్ణకంబు త్వార్థంబునందగు. ౧.

త్వార్థంబనఁగా భావంబు - ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు. రామునితనము - రాముతనము - మనుమనితనము - సీతతనము - గొప్పతనము - కొంటెతనము - నల్లఁదనము - పుల్లఁదనము

టీ. త్వార్థమనఁగా నేమో క్రింద నిరూపితమగును. త్వప్రత్యయార్థమున 'తన' అను ప్రత్యయము శబ్దముల కగునని సూత్రార్థము. 'త్వార్థే తనశ్చ వికృతౌ స్యాత్' అనునది మూలము. సాధారణముగ నిందు నిరూపితములగు ప్రత్యయములెల్ల నాథర్వణమునుండియే సంగ్రహింపఁబడినట్లు తోఁచెడి. త్వార్థమనఁగా భావము. ప్రకృతియనఁ బ్రాతిపదికము. ప్రకృతిజన్యబోధము నాఁ బ్రాతిపదికచే బోధ్యమగు పదార్థమని భావము. దానిధర్మము ప్రకారము నాఁ జనును. కాఁగాఁ బ్రాతిపదికార్థంబగు పదార్థముయొక్క- ధర్మము భావమని ఫలితమును గ్రహింపఁదగును. 'రామత్వం, మనుష్యత్వం, మున్నగు వానియందుఁ ద్వప్రత్యయ మేయర్థమునఁ గలుగునో యాయర్థమునఁ దెలుఁగునఁ ద్వప్రత్యయస్థానమునఁ దనవర్ణక మగును. ఇందునిరూపితమగు భావశబ్దమునకుఁ బదార్థ ధర్మ మర్థమును క్రియ 35 నందలి భావశబ్దమునకు ధాత్వర్థ మర్థమును నగుట నీ రెండింటికి భేదముగలదని గ్రహించునది. ఒకదానికిఁ బదార్థధర్మమును నొకదానికిఁ బదార్థమాత్రమును నర్థమగుట స్పష్టము. పదార్థధర్మము పదార్థమున స్వస్వామి సంబంధమున నిల్చునదగుటంజేసి పదార్థవాచకము యొక్క-షష్ఠ్యంతమై ధర్మవాచకతన ప్రత్యయమునందుట సహజము. సంబంధవాచకము యొక్క-షష్ఠ్యంతముమీఁద ధర్మవాచక తనప్రత్యయము గల్గెడినని ఫలితము. ప్రకృతియనఁ బ్రత్యయమునకుఁ ముందు భాగమనియు దానివలనఁ గల్గిన యర్థబోధమున విశేషణరూపముగఁ దోఁచునది భావ

మనియు శాస్త్రవాదము. రామునితనము:—రామునియొక్క' ఇట యొక్క ప్రత్యయ మునకు ముందున్న రామశబ్దము ప్రకృతి. దానికి రాముఁ డర్థముగాన రాముఁ డనునది ప్రకృతిజన్యబోధ. వానియందు విశేషణరూపమునఁ దోఁచునది రామత్వమనఁగా రాముని ధర్మముగాన నదియె ప్రకారము. ఆప్రకారమే భావమునాఁబడును. బోధ మనఁగా జ్ఞానము ప్రాదిపదికార్థావగతిచే జ్ఞానవిషయమగు పదార్థముయొక్క ధర్మమని ఫలితము. రాముఁడనఁగా రామత్వముగలపురుషుఁడని యర్థముగాన రామత్వము రాముని యందు విశేషణరూపమున నున్నదనుట తెల్లము. కాఁగా రామత్వ మను నర్థమున యొక్క షష్ఠ్యంతరామశబ్దముమీఁదఁ దనప్రత్యయమీవిధిచేఁ గల్గెననియుం సమాస 25 చేఁ దద్ధితవృత్తియందు యొక్కకు లోపముగల్గెననియుం దాన రామునితనమను రూప మేర్పడెననియుఁ బ్రక్రియను గమనించునది. తత్సమము 23 చే నిగాగమము పాక్షిక ముగ నగుంగాన నిగాగమాభావమున రాముతనమనియు రూపము గానోపును. మనుమని తనము, మగనితనము మొదలగు రూపములందు మాత్రము తత్సమము 24 చే నను దంతమగు తెనుఁగు డుమంతములగు మగ-మనుమ మొదలగువానికి నిగాగమము నిత్యముగ సంప్రాప్తమగుటంజేసి నిగాగమము లేకుండట చూపట్టదనియుఁ గాన మగతనము మనుమ తనము మున్నగు రూపములు గలుగవనియు నిట స్మరించుకొనవలెను. మగనిధర్మ మను నర్థమున మగతనమను రూపము గలుగదుగాని మగవాఁడనునర్థముగల మగశబ్దముమీఁదఁ దనప్రత్యయము గల్గుటచే మాత్రము మగతనమను రూపము సిద్ధింపనగునని గ్రహించు నది. ఇట్లె యథాసంభవముగఁ దక్కినదానికిఁ దనప్రత్యయము గలుగునపుడగు రూప ముల నూహించికొనునది. నల్లఁదనము; పుల్లఁదనము-అను వానియందుఁ దనప్రత్యయము పరమగుచుండ సంధి 35 చే నుగాగమ మగుటను స్మరించికొనునది. ఇట్లె విశేష్య విశేషణ ములమీఁద దన ప్రత్యయము గల్గునపుడు ప్రక్రియను గమనించికొనునది. గొప్పతన మిత్యాద్యుదాహరణములంబట్టి తన పర్ణక మాచ్ఛికానాచ్ఛికనామసాధారణమని సూచితము. యొక్క లోపించినట్టి డుమంతేతరాచ్ఛిక రూపములు ప్రథమైకతుల్య ములై యుండును. గాన నీప్రకరణముననెల్ల రూపములు ప్రథమైకవచనములుగనే నిర్దిష్టములగును.

ఇట విశేషంబుత్సర్గంబునకు విభాషను బాధకంబగు ౨

స్పష్టము.

టీ. విశేషమనఁగాఁ గ్రిందనిరూపితమగు సూత్రసమితి. అపవాదశాస్త్రములని భావము. ఉత్సర్గమనఁగా ముందు తనవర్ణకము విధించెడిసూత్రము. సామాన్యశాస్త్రమని భావము. ఈక్రిందఁ జెప్పఁబోవు విశేషసూత్రములు ముందు తనవర్ణకమును విధించెడి

సామాన్యశాస్త్రమును వికల్పముగ బాధించునని సూత్రార్థము. అనఁగా నీక్రిందివిధులచే నాయావిశేష ప్రత్యయములు గలుగనిపక్షమునఁ దనవర్ణకముగూడ నగునని భావము. స్పష్టమనఁగా సూత్రార్థము తేటతెల్లమని యర్థము. సూరిలక్షణము కేవలము నామవాచకములకె త్వార్థముననె యని తెల్పునని యనుమానించి కావలయుఁ ద్రిలింగలక్షణశేషకర్త తద్ధితములనఁగా విశేష్యవిశేషణములగుశబ్దములమీఁద భావాద్యర్థములందురాఁదగిన ప్రత్యయవిశేషములని యర్థమని విశేషించిచెప్పి దీనిని సవరించె. మఱియుఁ 'దనవర్ణకము పరమగునపుడు తచ్ఛబ్దార్థంబునకు లోపంబు విభాషనగు. ఆకొన్నతనము = ఆకొన్నవానితనము.' అని శాసించి వివరించి యీసందర్భమును సవరించుట నరయునది.

## చిన్నాదులకు ఱికవర్ణకంబగు. 3.

చిన్న ఱికము - కన్నె ఱికము. చిన్న - కన్నె - చుట్టము - దొంగ - పేద - మిండ - లంజె - ఇత్యాదులు చిన్నాదులు.

టీ. చిన్న మొదలగుశబ్దములకుఁ ద్వార్థంబున 'ఱిక' అను ప్రత్యయ మగును. చిన్నయొక్క ధర్మము చిన్నఱికము. తద్ధితవృత్తిని విభక్తిలోపము. కన్నెయొక్క ధర్మము కన్నెఱికము. ఇట్లే తక్కినవూహ్యములు. ఆదిశబ్దముచే నిది యాకృతిగణ మనియు ఱికప్రత్యయార్హములనెల్ల నిందుఁ జేర్పఁదగుననియుఁ దెలియునది. ప్రత్యయములనునవొకపు డర్థవంతములగుపదములే యనియుం నాపదము లుచ్చారణమునందలి స్థితిమొదలగుకారణముల ననుసరించి యుట్టిదశనంపి యవిజ్ఞాతప్రకృతులై ప్రత్యయములయ్యెననియుం ననుట నిజమెగాని యిది యీపదమని మాత్ర మనుమానించి నిరూపించుట సంస్కృతవ్యాకర్తలమార్గమునే పట్టిన తెనుఁగువ్యాకర్తలకు సమ్మతముగామినో యాపని కష్టసాధ్యమగుటనో సందిగ్ధాంశముల శాస్త్రముల వ్రాయరాదని యెంచియో యిచ్చవచ్చినరీతి ననఁగాఁ దమయనుభవము ననుసరించి ప్రాతిపదికప్రత్యయవిభాగమునే ప్రదర్శించుట యాచారమయ్యెను. 2 సూత్రము ననుసరించి ఱికవర్ణకము గలుగనిపక్షమునఁ దనవర్ణకము గలుగనగుంగాన చిన్నతన మిత్యాదులును సంభవించెడి. కాని చుట్ట ఱికమనుదానికిఁ జుట్టముతన మనురూప మప్రసిద్ధముగానఁ బ్రయోగానుసారముగఁ బ్రత్యయముల నాయావానికిఁ గూర్చి రూపముల గ్రహించునది. ప్రయోగములు గల్గునెడలఁ బుంపులకుఁ దనవర్ణకము పరమగునపుడు సుమాగమమును విధించుసంధి 35 సూత్రవిషయము ననుసరించి తనవర్ణకము పరమగునపు డద్దానికి ముందున్న మువర్ణకమునకుఁ బుంపులే యగుఁగాని మువర్ణకలోపము గాదని యనుమానించి చుట్టము శబ్దము తుదివర్ణకమునకుఁ బుంపులను బిదప సుమాగమమును గూర్చి చుట్టపుఁదన మిత్యాదిరూపములను సాధించికొనఁదగును. ప్రకృతవ్యవహారమున-'చిన్న-దొంగ-'అను

వానికి ఱికప్రత్యయము గాక తనప్రత్యయమే యర్థవంతమై తోఁచెడి. ఇట్లే తక్కిన పూహ్యములు. సూరి 'ఱిక'అని శకటరేఫాదిగా నీప్రత్యయమును నిర్దేశించెంగాని నానాఁటి కిది రేఫములతోఁ గలియుటంజేసి కావలయుఁ గొన్నిశబ్దములవలె నిదియు నుభయరేఫముగ శబ్దరత్నాకరమునం దుదాహృతమయ్యె. 'అరయఁగఁ దల్లికక్కసెలి యంద్రుఁ దక్కును గల్గినట్టిచు, ట్టరికమువారికిన్'(ప్ర భా 3 ఆ.) అని రేఫమగుటకుఁ బ్రయోగము. శకటరేఫమగుటకు బహూదాహృతులు చూపట్టుట ననిరూపితము.

ఉత్వంబున కత్వంబు ఱికము పరంబగునపుడగు. ౮.

తొత్తఱికము - వెడ్డఱికము - వెజ్జఱికము.

టీ. పూర్వసూత్రముచేనగు ఱికవర్ణకము పరముగా దానిముందున్న హ్రస్వో కారము హ్రస్వాకారము నిత్యముగ నగునని సూత్రార్థము. 'తొత్తు-వెడ్డు-వెజ్జు' ఇవి యు దంతములు. వీనికి ఱికవర్ణకము పరముగా వీనితుదియుత్వమున కత్వమాదేశమయ్యెఁగాన 'తొత్తు+ఱికము=తొత్త+ఱికము=తొత్తఱికము' అను మొదలగురూపము లయ్యెను. వెడ్డు=కపటము లేక వంచన. వెజ్జు=వైద్యుఁడు.

పేర్వాదుల కిమివర్ణకంబగు. ౯.

పేరిమి - కడిమి. పేరు - కడు - మ్రుచ్చు - మేలు - చెలి - పోఁడి - వాఁడి - వేఁడి - ఇత్యాదులు పేర్వాదులు.

టీ. పేరుమొదలగుశబ్దములకు 'ఇమి' అనువర్ణకము ద్వార్థమున నగును. 'పేరు+ఇమి=పేరిమి. సంధిచే సంధి నిత్యముగ నగుటను స్మరించుకొనునది. ఇట్లే కడిమి-చెలిమి, మేలిమిాత్యాదిరూపములప్రక్రియ నూహించికొనునది.

నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు. ౧౦.

నల్లన - తెల్లన. నల్ల - తెల్ల - పచ్చ - ఎఱ్ఱ - చామ - తియ్య - కమ్మ - పుల్ల - చప్ప - విన్న - తిన్న - అల్ల - ఒయ్య - తిమ్మ - చక్క - వ్రేఁక - ఇత్యాదులు నల్లాదులు.

టీ. వచనమనఁగా జెప్పుట. గుణవాచకములగు నల్లమొదలగుశబ్దములకు నవర్ణకమగును. నల్ల+న=నల్లన. ఇట్లే తక్కినవానికి నవర్ణకముగా రూపము లూహ్యములు. నవర్ణకము వీనికిఁ గలుగనిపక్షమున సూత్రముచేఁ దనవర్ణకము గలుగుననియు నపుడు సంధి 35 చే నదంతగుణవాచకములగు వీనిమిాఁద నుమాగమము దనవర్ణకము పరంబుగా నగుననియు దాన నల్లఁదన మిత్యాదిరూపములు గలుగుననియు గ్రహించునది. ఇందన్నియు నదంతములే గాన నట్టివే యిందుఁ బ్రవేశముంగనెడి.

## ఇకవర్ణకంబగ్గలాదులకగు. ౭.

అగ్గలిక - ఒమ్మిక. అగ్గలము - ఒమ్ము.

టీ. 'అగ్గల' మొదలగుశబ్దములకు 'ఇమి' ప్రత్యయము త్వార్థమునందగును. అగ్గలము+ఇక: తద్ధితవృత్తిని. 25 చే 'ము' అనుదానికి లోపమగు. లేదా త్రిలింగలక్షణ శేషకర్తృలక్షణము ననుసరించి (ప్రౌఢవ్యా. సూ) యేనిముపర్ణలోపమును జేసికొనునది. పిదప నపదాదిస్వరసంధిని నిత్యముగఁ గూర్ప 'అగ్గలిక' అనురూప మేర్పడెడి. ఇట్లే తక్కినవూహ్యములు. ఒమ్ము+ఇక=ఒమ్మిక. ఇమిడిక యనియర్థము. ఇందుఁ దుదిముప ర్ణము ప్రకృతిసహజముగాన విభక్తిగామి లోపింపదు.

## మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. ౮.

మగఁటిమి - మగతనము - పేదఱిమి - ఒజ్జనము - కోటరము - కోడంట్రము - కోడంట్రికము - కోడఱికము - కోమలికము - చెలికారము - తెలుపు - ఎఱుపు - పసుపు - నలుపు. ఱికాదులు రానిపక్షమందుఁ దనప్రత్యయం బన్నింటికగు. చిన్నతనము - మ్రుచ్చుఁదనము - నల్లఁదనము - అగ్గలంపుఁదనము - ఒజ్జతనము.

టీ. మగఁటిమి మొదలగుశబ్దములకుఁ గల్గెడి తద్ధిత ప్రత్యయము లోకనియమముచేఁ దెలుపఁబడఁజాలవు గాన వానిని బ్రయోగముల ననుసరించి గ్రహింపవలసి యుండునని సూత్రార్థము. ప్రకృతి నెఱింగి ప్రయోగానుసారముగఁ బ్రత్యయవిభాగము సేసికొని యిది ప్రత్యయ మిది ప్రకృతి యని తెలిసికొనవలసినదేగాని యొక్కొకదానికే వివిధములగు తద్ధితప్రత్యయములతోడి ప్రయోగము ప్రయోగదృష్టమగుట నొకనియమముచే ననుశాసింప నవకాశములేదనిభావము. మగఁటిమి:—ఇందు మగశబ్దముమీఁద 'టిమిజ్' అను ప్రత్యయము గల్గినట్లును దత్సమము 19 చే బిందువు గల్గినట్లును నూహింపఁ దగును. ఇది గలుగనిపక్షమున 1 చేఁ దనవర్ణకము గలిగి మగతనమను రూపమగును. పేదఱిమి:—పేదశబ్దముమీఁదఁ ద్వార్థమున ఱిమివర్ణకము గల్గుటచే నీరూపమేర్పడెనని వ్యాకృతిమర్యాద ననుసరించి యూహింపనగును. ఱిమి రానిపక్షమున 3 చే ఱికవర్ణకమైనఁ బేదఱికమగును. అదియుఁ గలుగకున్న 1 చేఁ దనప్రత్యయమైన పేదతనమని యగును. 'పేదర్' అనుదానిపై నిమివర్ణకమై, రేఫము శకటముగ మారుటఁ బేదఱిమియను నదిగల్గె ననఁదగును. ఒజ్జశబ్దముమీఁద నవర్ణకమును బిదప ముపర్ణమును నగుటఁ బైరూప మేర్పడెననఁదగును. పక్షమునఁ దనప్రత్యయము దీనికిఁ గలుగనగును. కోడలుశబ్దముమీఁద

టర ప్రత్యయమును నది పరముగా వృత్తినాశబ్దమాద్యక్షరశేషమగుటయుం (కో + టరము =కోటరము) ననుమానించునది. ఇట్లే కోడలుశబ్దము మీఁద 'ంట్ర' అనునది త్వార్థమున నగుటంజేసియుం నది పరముగా లువర్ణము లోపించుటంజేసియుఁ గోడంట్రమనురూప మేర్పడెనని యూహింపదగు. అట్లే కోడలుశబ్దముమీఁదఁ ద్వార్థమున 'ంట్రిక' అను ప్రత్యయమును వృత్తి నంత్యవర్ణలోపమును గలుగఁ గోడంట్రిక మనురూపమయ్యెనని లక్షణాశయము. ఈరీతినే ఆికప్రత్యము గలుగుటచేతను వృత్తి నంత్యవర్ణము లోపించుటచేతను గోడలుశబ్దమునకుఁ గోడఆికమను రూప మేర్పడెను. కోడలుశబ్దమునకుఁ గోటరికమనియుం రూపంబు ప్రయోగదృష్టమగు. కోమలిశబ్దముపైఁ గప్రత్యయము లేదా కోమలశబ్దముపై ఇక ప్రత్యయము గలుగఁ గోమలికమనురూపమయ్యెనని యనుమానింపవలసియున్నది. చెలిశబ్దముమీఁదఁ గారప్రత్యయము గలుగుటచేఁ జెలికారమని యూహించునది. పక్షమున 5 చే ఇమిప్రత్యయమైనఁ జెలిమియని యగుటను స్మరించునది. 'తెల్ల-ఎఱ్ఱ-పచ్చ-నల్ల' అను నదంతగుణవాచకములమీఁదఁ బువర్ణము గలుగుటయును బ్రకృతులతుదిద్విత్వములలో నొకవర్ణకమునకు యుత్వమాదేశమగుటయుఁ బచ్చశబ్దమునందలి చ్చకారమునందున్నజడ్డ అక్కటాదుల జడ్డకు లోపమును విధించు శాస్త్రముచే లోపించి శేషించిన చకారము సకారమగుటయు మొదలగు విషయముల సిద్ధరూపముల ననుసరించి యూహించికొనునది. పైని నిరూపించిన ఆిక-ఇమి-మొదలగునవి గలుగకున్న (2 సూత్రమునుబట్టి) 1 చేఁ దనవర్ణక మన్నింటికిఁ గలుగనగుంగాన చిన్నతన మిత్యాదిరూపాంతరములు పూర్వసూత్రోదాహృతులకుఁ గలుగనగునని ఆికాదులను సూరివివరణమున కభిప్రాయము. అగ్గలపుందన మిత్యాదులందుఁ దనప్రత్యయము పరముగా నుమాగమమును బుంబులమీఁద విధించు ప్రణాళిక ననుసరించి మువర్ణక లోపము గలుగదనియుం బుంపులె యగుననియు ముందె నిరూపితము. ముచ్చఁదనము నల్లఁదన మిత్యాదులందు 35 సంధిచే నుమాగమంబగు. గుణవాచకేతరాదంతశబ్దముల మీఁద నుమాగమవిధానము లేమిఁ జిన్నతనము. ఒజ్జతనము మొదలగువానియందు నుమాగమంబు గలుగదు. పక్షమునఁ దెలుపు మున్నగువానికి 6 చేఁ దెల్లన మొదలగు రూపాంతరము లగుటను స్మరించికొనునది. ఇట్లాకేశబ్దము త్వార్థమున వివిధములగు ప్రత్యయముల నంది వివిధములగురూపంబులఁ దాల్చుటకతన లక్షణకర్తకు వీనిని యథాప్రయోగగ్రాహ్యములని శాసించుటయె కర్తవ్యంబయ్యెనని గ్రహించునది. ఈ ప్రకరణమునఁ గొంతగ భాషాతత్వమును గమనించి ప్రకృతిప్రత్యయవిభాగాదు లూహించి నిరూపింపనగుంగాని శాస్త్రజ్ఞులకాసరణి మనోహరముగామిని సాకల్యముగా నట్లు చూపనవకాశము చాలమిని గేవలము శాస్త్రమార్గప్రదర్శనముఖమున నే టీక లిఖితమని యెంచునది.

## అరమరాదులకు స్వార్థంబున నికవర్ణకంబగు. ౯.

అరమరిక - ఆమిక. అరమర-ఆము - అల్లిబిల్లి - గండి - నడపడి- నాడు - నివ్వాళి - పొత్తి - మూన - మెలి - వాలు - ఇత్యాదు లరమరాదులు.

టీ. అరమర మొదలగుశబ్దములకుఁ బ్రాతిపదికార్థమున నికవర్ణకమగును (ఇక). స్వార్థమనఁ దనకు నియతమైనయర్థము. ప్రాతిపదికార్థమనిభావము. అరమర + ఇక:— అపదాదిస్వరసంధినిత్యము 'అరమరిక' ఇట్లే తక్కిన వూహ్యములు. అరమరకరమర మనియుం రూపాంతరము ప్రయోగదృష్టము.

## ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునందగు. ౧౦.

చిఱుతుక-నాతుక. చిఱుత-నాతి-నెలఁత-మెలఁత-పడఁతి-మడఁతి- పొలఁతి-వెలఁది-నిప్పు-ఎమ్ము-ఇత్యాదులు చిఱుతాదులు.

టీ. చిఱుత మొదలగు శబ్దములకుఁ బ్రాతిపదికార్థమున 'ఉక' అను ప్రత్యయమగును. అపదాదిస్వరసంధి నిత్యముగ నగు. చిఱుత + ఉక=చిఱుతుక. ఇట్లే తక్కిన వూహ్యములు. మూలము 'నామ్నః కవర్ణకస్స్యాత్స్వార్థేఽదుత్వమపి పరే తస్మిన్' అని స్వార్థమునఁ గవర్ణకమును విధించి యది పరముగాఁ బ్రాతిపదికము తుదియచ్చున కుత్వమాదేశించుటంజేసి మూలమతమునఁ బ్రత్యయము కవర్ణముగాని యుక గాదు. స్వార్థమునందుఁ గప్రత్యయము రా ఎవ్వతుక యని త్రిలింగలక్షణశేషకర్త వ్రాయుంటను గమనించునది. స్త్ర్యర్థకతవర్ణవిధానము మాత్రమే చేసి యుత్వవిధాన మొనర్పక మూలముంబట్టి స్వార్థమునసైన కప్రత్యయమును నది పరముగానగు నుత్వమును గలుగుటను, ఎవ్వతుకేత్యాదిరూపములు సిద్ధములైనట్లు ప్రక్రియంజూపుచు ఉకప్రత్యయమను సూరిపద్ధతిని మూలాశయముగాదని సవరించు నీత్రిలింగలక్షణశేషసందర్భమును జక్కఁగ నరసినచో, నరసున్న నచ్చుతప్పుగ భావించి యీత్రిలింగలక్షణశేషసందర్భమునకును, ఉకప్రత్యయమని కొంద అర్థముచేసి చెప్పుట, కేవల బాలవ్యాకరణభ్రమమూలమున సైనదనియుఁ ద్రిలింగలక్షణశేషమార్గమును గుర్తింపనికతన సైనదనియు స్పష్టంబు. (చూ. శబ్ద ప. 70) కాని కవర్ణమువలెనే యుకారమును నర్థవంతము గామినో యరమరాదులం దికవర్ణక మనక కవర్ణకమన్న నిత్వము విధించుటయుఁ బ్రసక్తమగునని యెంచియె సూరి యుకప్రత్యయమనుటయె యుచితముగ నెంచెను. కప్రత్యయముఁ జేర్చి యుచ్చరించుటలోఁ బ్రాతిపదికము తుది యచ్చులకుఁ బరిణా

మము కటస్థించేఁగానఁ బ్రాతిపదికము తుది యచ్చు మార్పును సూచించు మూలమార్గమే రమణీయమని తోఁచెడి. "వేఱున కడవర్ణకము స్వార్థమునందగు. వేఱడము. వెల్లకడి వర్ణకము+స్వార్థంబునందగు. వెల్లడి-తెలివి-విరివి-వినికి-లేమి-రాపులకు స్వార్థంబునందిడి వర్ణకమగు. తెలివిడి. మొ. ఇతవర్ణకం బింపుబిగుపోరులకు స్వార్థంబునందగు ఇంపితము-బిగితము. పోరితము. మొ. ఇదవర్ణక మొప్పుతప్పు పెల్లులకు స్వార్థమునందగు. ఒప్పిదము. మొ. స్వార్థమునం దిరివర్ణకము వాపునకగు, వాపిరి. అర వర్ణకము నాయక శబ్దమునకు భావంబునందగు. నాయఁకరము. కారవర్ణకము చెలినయములకు భావము నందును నుడికోలతలకు స్వార్థమునందును నగు. ఈకకారమునకుఁ గొన్నియెడల గకారంబగు. చెలిగారము నయగారము నుడికారము. కోలగారము. చలికి మిరివర్ణకము స్వార్థమునందగు. చలిమిరి. టివర్ణంబొండునంత్యవర్ణంబునకు భావంబునందగు. ఒంటి." అని త్రిలింగలక్షణశేష మీసూరి స్వార్థముననగు తద్ధితప్రత్యయసందర్భమును సవరించుట నరయునది. ఇవియెల్ల సూరి 28 తద్ధితసూత్రమునకు వివరణములు గాఁదగును.

## కాకత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదులకగు. ౧౧.

కా ప్రత్యయాంతంబునకు మగాదిగణగణనంబునం జేసి డుజ్జగు- ఆటకాఁడు-ఆటకత్తియ. ఆట-అడపము - ఎమ్మె - ఓయారము-కటారి - కొల్ల-చెలిమి-చేరువ-చౌరవ - జట్టి-జాజర - జూదము-తిండి - తేర-దొడ్డ- నీటు - నేస్తము - బేరము -వగ-విలు - వెచ్చము - సొగసు - ఇత్యాదు లాటాదులు.

టీ. ఆట మొదలగు శబ్దములకుఁ బురుషుఁ డర్థమైన 'కా' అను ప్రత్యయమును స్త్రీయర్థమైన 'కత్తియ' అను ప్రత్యయమును మతుబర్థమున నగును. పుంస్త్వమనఁగా పురుషత్వము. పుంస్త్వమని భావము. స్త్రీత్వమనఁగా స్త్రీయొక్క-ధర్మము. స్త్రీత్వమని తాత్పర్యము. మతుబర్థమనఁగాఁ గలవాఁడు లేక కలది యనునర్థమున నని యర్థము. మతుబంతమగు శబ్దము పురుషవాచకమైనఁ గలవాఁడనియుం 'స్త్రీవాచకమేని కలది యనియుం నర్థము గలిగెడిఁ గానఁ గలవాఁడు గలది యనునర్థమున నని యర్థము వ్రాయఁబడెను. అచ్చతెలుఁగుశబ్దములకు లింగము లేమి నాటాదులచేఁ బురుషుఁడు బోధ్యుఁడైన కావర్ణకమును స్త్రీ బోధ్యురాలైన కత్తియ ప్రత్యయమును గలవాఁడు కలది యనునర్థమున నగునని ఫలితము. కా ప్రత్యయము మగాదిగణపఠితమగుటం జేసి

యాచ్ఛికము 4 చే నేతదంతమునకు డుజ్జగుసు. కాన నిది పిదప డుమంతకార్యముల నందెడినని కాప్రత్యయంబను నీక్రింది సూరివివరణమున కభిప్రాయము. ఆట:—దీని కాటకలవాఁ డనునర్థమున నీవిధిచే గాప్రత్యయమును ఆచ్ఛికము 4 చే డుజ్జును గలిగి యాటకాఁడను రూపమేర్పడెడి. ఆట:—దీని కాటగలది యనునర్థమున 'కత్తియ' అను ప్రత్యయము గలుఁగ 'ఆటకత్తియ' అనియు నియకుమాఱుగా నామాంతమున కెత్వమైన 'ఆటకత్తె' అనియు రూపము లేర్పడును. ఇందు ముపర్ణకాంతములగు వాని ముపర్ణకము తద్ధితవృత్తిని లోపించుటయు జూదమను నుదాహృతికి ప్రకీర్ణము 21 చే జూజగాఁడను రూపాంతర మేర్పడుటయు గమనించునది. ఇట్లే తక్కిన వుదాహృతములు.

కాకత్తియల కకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి. ౧౨.

అందగాఁడు - అందగత్తియ - కొండెగాఁడు - కొండెగత్తియ. బేరగాఁడు-బేరగత్తియ-ఇత్యాదులు.

టీ. మతుబర్థమునఁ బుంస్త్వస్త్రీత్వముల విధింపఁబడిన కాకత్తియవర్ణకముల కకారమునకు గకారాదేశము కొన్నిచోటులం దనఁగాఁ బ్రయోగములం దల్పముగఁ గానఁబడుచున్నదని సూత్రార్థము. కాకత్తియల కకారములకు గకారాదేశము సార్వత్రికము గామిని మీఁదుమిక్కిలి కకారరూపమే బహుళముగఁ బ్రయోగదృష్టమగుటను దీనిని గసడదవాదేశముగఁ దెలుప నవకాశములేక సూత్రాంతరముచే శాసించుట ప్రసక్తమయ్యెనని గ్రహించునది. అందము+కాఁడు=అందగాఁడు. క్రిందియుదాహరణముల ననుసరించి ముపర్ణకలోపము తద్ధితవృత్తిని దోఁచెడి పదములమీఁది కకారములకే గకారాదేశము చూపట్టునని చెప్పఁదగును. ఇట్లె తక్కుంగల వుదాహృతములు. 'కాఁడు ర్జాడుర్భవేదీఁడుః' అని యాథర్వణము గాఁడనుదానిని బైవిషయము ననుసరించియే కాఁడనుదానికన్న భిన్నముగాఁ బేర్కొనె.

కాకత్తియలు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు. ౧౩.

చెలికాఁడు-చెలికత్తియ. హెగ్గడికాఁడు-హెగ్గడికత్తియ.

టీ. ప్రపూర్వసూత్రోక్తప్రకారము కాకత్తియవర్ణకములు రెండును మతుబర్థమందే గాక ప్రాతిపదికార్థమందును గొన్ని శబ్దములకుఁ గలుగుట ప్రయోగములం దగపడునని సూత్రార్థము. చెలికాఁడు (చెలి+కాఁడు). చెలి+కత్తియ=చెలికత్తె. ఇటు

జెలికాఁడనుదానికిఁ జెలిమిగలవాఁడని యర్థముగాక మిత్త్రుఁడనియే యర్థమగుటను నిట్లె చెలికత్తె యనుదానికిఁ జెలిమికలది యని యర్థముగాక సఖియే యర్థమగుటను గాక త్తియవర్ణకములు స్వార్థముననే యయ్యెనని తెలియుచున్నది. 'హెగ్గడి':—ఈశబ్దమునకు 15 చే నీ ప్రత్యయము గలుగ హెగ్గడీఁడనియు రూపాంతర మేర్పడును. ఆచ్ఛికము 4 చే డుజ్వర్ణకమగుటను స్మరించునది.

## కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి. ౧౮.

ఇబ్బందిగాఁడు - ఒంటిగాఁడు - కొమ్ముకాఁడు - పరికాఁడు. ఇత్యాదులు మృగవిశేషవాచకంబులు.

టీ. ముందు పేర్కొనినప్రకారము కా ప్రత్యయము పుంస్త్వమునందేగాక తిర్యగ్వాచకములకును నగుట ప్రయోగదృష్టమని సూత్త్రార్థము. పురుషవాచకములకే గాక పశువాచకములకును కావర్ణకము గలుగుట కవిప్రయోగములంబట్టి సాధువగునని తాత్పర్యము. ఇబ్బంది గాఁడు. ఇబ్బంది శబ్దమునీఁద నీవిధిచేఁ గా ప్రత్యయమును 12 చే గకారమును నయ్యె. (చిఱుతపులికిని బెద్దపులికిని బుట్టినది)ఒంటిగాఁడు=పంది. ఒంటిశబ్దము మీఁదఁ గాఁడు ప్రత్యయము 12 చేఁ గకారమును నయ్యె. ఒంటికాఁడనియు 12 చే గకారము గలుగని ప్రయోగము గానంబడియెడి. కొమ్ముకాఁడు=అడవిపంది. పరికాఁడు=తెగకుఁ బ్రధానమగు నేనుఁగు. (గుంపునకు మొదటనుండి గుంపును నడపునది) ఇట్లె మిగిలినవానిని గ్రహించునది. మతుబర్థముననే తిర్యక్కులకీకా ప్రత్యయమని పదవ్యుత్పత్తి ననుసరించిన విశదమయ్యెడి. కావర్ణకమేగాని కత్తియవర్ణకము తిర్యక్కులకుఁ గాదనుట పరిశేషన్యాయమున స్పష్టము. ఆచ్ఛిక 4 చే డుజ్వర్ణకము.

## అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు ౧౯.

ఈ ప్రత్యయాంతంబు మగాదిగణంబు. అటమటీఁడు - కమ్మతీఁడు. అటమటము - కమ్మతము - కన్నడము - కొండెము - బొనసము - బూటకము - మందడి - మన్నెము - సుంకము. ఉక్కివంబునకు వలోపంబు నగు. ఉక్కీఁడు - ఇత్యాదులు.

టీ. మతుబర్థమనఁ గలవాఁడను నర్థమని ముందె నిరూపితము. పుంస్త్వమనఁ బురుషత్వముననది యుక్తము. అటమట మొదలగుపదములచేఁ బురుషుఁడు వాచ్యుఁ

డైన 'ఈ' అను ప్రత్యయము కలవాఁడను నర్థమున నగు. ఈప్రత్యయము మగాది గణ పఠితమగుటచే నాచ్ఛికము 4 చే నేతదంతమునకు డుజ్వర్ణకమగును. అటమటము. దీని కీవిధిచే నీప్రత్యయమును నది పరముగా సమాసము 25 చే ములోపంబును నాచ్ఛికము 4 చే డుజ్వర్ణకమును నగుంగాన 'అటమటీఁడు' అని రూపమేర్పడును. అటమట మన మోసముగాన మోసముగలవాఁడని యటమటీఁ డనుదాని కర్థము చెప్పవలెను. ఇట్లె మువర్ణకాంతములగు నీగణమునందలి శబ్దములకెల్ల నీప్రత్యయము పరముగా మువర్ణలోపంబును దద్ధితాంతంబగుట నీప్రత్యయాంతమునకుఁ బ్రాతిపదికసంజ్ఞయుఁ బిదప నాచ్ఛికము 4 చే డుజ్వర్ణకమును నగుట నూహించికొనునది. ఉక్కివము + ఈ:- ఈశబ్దమునకు వృత్తిని ములోపమేగాక వలోపమును గలిగెడి. అట్లు గానిచో నుక్కి వీఁడని రూపము గావలసివచ్చును. కాన నీక్రింది చిన్నయసూరి వివరణవాక్యముంబట్టి వృత్తిని లోపంబును జేయ 'ఉక్కివము + ఈ = ఉక్కి + ఈ:—అపదాది స్వరసంధి చేయ 'ఉక్కీ' ఆచ్ఛికము 4 చే డుజ్వర్ణకముగా 'ఉక్కీఁడు.' డుమంతములకు న్వాగమాదులును ముగంతములకు ముగాగమాదులును స్త్రీసమములకు విభక్తిలోపాదులును గార్యములు విభక్తిప్రకరణము ననుసరించి యూహ్యములు.

## ఈప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునందగు. ౧౬.

మొక్కలీఁడు - కల్లరీఁడు.

టీ. ముందు చెప్పినరీతిని 'ఈ' అను ప్రత్యయము పుంస్త్వమున మతుబర్థమునందే గాక ప్రాతిపదికార్థమునందును గాఁదగునని సూత్రార్థము. మొక్కలి:— దీని కీవిధిచే స్వార్థమున నీప్రత్యయము. 'మొక్కలి+ఈ' అపదాదిస్వరసంధి. మొక్కలీ. తద్ధితాంతమగుటఁ బ్రాతిపదికసంజ్ఞయు నాచ్ఛికము 4 చే డుజ్వర్ణకమును నగు. 'మొక్కలీఁడు.' మొక్కలి యన శూరుఁడని యర్థము. మొక్కలీఁడు నన శూరుఁడనియే యర్థముగాన నిట నీప్రత్యయము స్వార్థమునందె యయ్యెనని యెంచునది. ఇట్లె 'కల్లరి-ఈ=కల్లరీ-కల్లరీఁడు' అనుదాని ప్రక్రియ నెఱుంగునది. క్వాప్రత్యయమైనఁ గల్లరి కాఁడని రూపము గానోపును. ఇట్లు ప్రయోగదృష్టంబులు సాధ్యంబులు.

## అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదులకగు. ౧౭.

జాలరి - ఒఱపరి. జాల - ఒఱపు - కల్ల - చదువు - జూదము-టక్కు - తగవు - తీరుపు - తెంపు - తెరవు - నేరుపు - మతకము-వెరవు-వేఁట - సిగ్గు - సుంకము - ఇత్యాద్యులు.

టీ. జాలమొదలగు శబ్దములకుఁ గలవాఁడు గలది యను నర్థమున 'అరి' అను ప్రత్యయమగును. ముపర్ణకాంతముల ముపర్ణకము వృత్తిని లోపించుననియు నపదాదిస్వరసంధిజేసి ప్రకృతి ప్రత్యయాద్యచ్చులకు సంధి నిత్యముగఁ జేయవలెననియుం ముందె యుక్తము. 'జాల + అరి'=జాలరి. ఇట్లె తక్కినవాని ప్రక్రియను గమనించికొనునది. వలగలవాఁడని యర్థము గాన నరిప్రత్యయము మతుబర్థమున నయ్యె ననుట స్పష్టము. శబ్దరత్నాకరమున నిది శకటరేఫాంతముగ నుదాహృతము. మఱియు శకటరేఫాంతమగు గద్దఱిశబ్దముమీఁదఁ గాప్రత్యయము చేయఁబడిన గద్దఱికాఁడను రూపమును నుదాహృతము. అఱి ప్రత్యయముమీఁద స్వార్థమున కాప్రత్యయము గల్గిన రూపమని గ్రహించునది. ఇట్లే తక్కుంగలవాని ప్రక్రియను గమనించునది. 'మతుబర్థమునందరివర్ణకము పరమగునపుడు పూజనసౌన్నముల కడయచ్చునకు వైకల్పికముగాను నిత్యముగాను దీర్ఘంబగు'నని త్రిలింగలక్షణశేషము,'పూజారి-పూజరి-సౌన్నారి-సౌన్నరి' అని దీనిని బూరించుట నరయునది.

## ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునందగు. ౧౮.

ఓయారి - అక్కసి. ఓయారము-అక్కసము - కడలు-చాగము-జోగము-తమకము-తుటారము-బండారము - బిత్తరము - బిటారము-బేహారము - మచ్చరము - మిటారము - విన్నాణము - వెక్కసము - ఇత్యాదులు.

టీ. ఓయార మొదలగు శబ్దములకు ఇవర్ణకము మతుబర్థమున నగును. ఓయార+ఇ= ఒయారి. ఒయారముగలవాఁడు ఒయారముగలది యని యర్థము. అపదాదిస్వరసంధి నిత్యము. స్త్రీసమంబగుట బ్రథమైకవచనలోపము. ముపర్ణకాంతముల ముపర్ణకములకు సమాసము 25 చే ముపర్ణలోపం బగుటను మఱువరాదు. ఇట్లు ప్రక్రియ నెల్లవానికి నూహించికొనునది. ఇందును బూర్వసూత్రముననను స్త్రీత్వపురుషత్వవివక్ష చేయమిని, కేవలము మతుబర్థమున ననియే యనుటచేతను, యథాప్రయోగంబుగ నర్థము గ్రాహ్యము.

## తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యంబగునపుడు మతుబర్థంబునందగు. ౧౯.

కోఅవత - చాకిత. కోఅవ . చాకి - బోయ - వానె . వ్రే - సాలె - ఇత్యాదులు కులవాచకంబులు.

టీ. స్త్రీబోధ్యురాలగునపుడు మతుబర్థమునఁ గులమును బోధించు శబ్దమునకంటె 'త'అను ప్రత్యయము గలుగునని సూత్రార్థము. చాకి:—దీనికిఁ జాకలికులముగల యాఁడు దనునర్థమున 'త' అను ప్రత్యయము గలుగ 'చాకిత' అనురూప మేర్పడును. ఇట్లే కోమటి-మాల-వ్రే-సాలె మొదలగువానికి 'త' ప్రత్యయముచే కోమటిత-మాలత-వ్రేత-సాలెత మొదలగురూపము లగుట నూహించికొనునది. కోమటి యనఁ దక్కువగానఁ దక్కువజాతి యాఁడుదని కోమటితశబ్దమున కర్థము. క్రిందివిధిచే 'మాలత' యనుదానికి 'మాలెత' యనియుం రూపాంతరమగుటను గమనించునది.

తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు ౨౦.

చెంచెత - మాలెత.

టీ. పూర్వసూత్రముచే నైన తవర్ణకము పరమగుచోఁ బ్రకృతితుదియచ్చునకు 'ఎ'అనునచ్చాదేశమగుట యగపడును. మాల+త=మాల+ఎ+త. అపదాదిస్వరసంధిచే 'మాలెత' యని యగును. ఇట్లే 'చెంచుత=చెంచు+ఎ+త=చెంచెత' అనుదాని ప్రక్రియం గమనించునది. మతుబర్థమునందుఁ జెంచునకుఁ దవర్ణకము పరంబగుచో నిత్వంబగునని శాసించి త్రిలింగలక్షణశేషము చెంచిత యని యుదాహరించి గ్రామ్యజనులపాటలందుఁ 'జెంచీత' యని యీకారదీర్ఘంబు వినంబడియెడినని వివరించి ప్రమాణముం జూపుటం గాంచునది.

యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదురు. ౨౧.

స్పష్టము.

టీ. సంస్కృతమునందలి యువతి యనుశబ్దమునకు సమానముగఁ దెలుఁగున గుబ్బెతయనియు విటీశబ్దమునకు సమానముగ మిండత యనియు రజస్వలాశబ్దమునకుఁ దుల్యముగ ముట్టుత యనియుఁ దెలుగున రూపంబులు సంభవించునని సూత్రార్థము. తవర్ణకము కులవాచకములకే మతుబర్థమున విహితమగుటంజేసి గుబ్బ-మిండ-ముట్టుశబ్దములు కులవాచకములు గామి నియమమునకు సాధ్యముగామిని నీశబ్దములు నిపతితములయ్యె. గుబ్బెత యన యౌవనవతి యనియు, మిండత యన విటురాలనియు, ముట్టుత యన రజస్వలాస్త్రీ యనియు నర్థములని భావము. నిజముగ నాలోచింప గుబ్బలుగలది గుబ్బెతయనియు, మిండఁడు గలది మిండత యనియు, ముట్టుగలది ముట్టుత యనియు నర్థము విశదమయ్యెడిఁ గాన మతుబర్థమునఁ గులవాచకములకే గాక యితరములకును తవర్ణకమగుననుట లెస్స.

**వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యం బగునపుడు మత్వర్థంబునం దాఁడివర్ణకంబగు. ౨౨.**

వగలాఁడి. వగ - చిన్నె - కులుకు - వన్నె - దొమ్మి - ఎమ్మె - ఇత్యాదులు వగాదులు.

టీ. ప్రథమాబహువచనాంతములగు వగ మొదలగు శబ్దములకంటెఁ గలది యను నర్థమున స్త్రీ బోధింపఁబడునపుడు 'ఆఁడి' అనునర్ధబిందువు నడుమను గల ప్రత్యయ మగును. వగలు+ఆఁడి=వగలాఁడి. చిన్నెలు+ఆఁడి=చిన్నెలాఁడి. కులుకులు+ఆఁడి=కులుకు లాఁడి. అపదాదిస్వరసంధి నిత్యము. ఇట్లె తక్కినవూహ్యములు. బహువచనాంతముల కనుటం జేసి యేకవచనాంతములకుఁ గాదనియుం వృత్తిని బహువచనప్రత్యయమునకు లోపంబును గాదనియుం గ్రహించునది. స్త్రీ వాచ్యంబగునపు డనుటం జేసి మత్వర్థము గల్గినను నాఁడుది యర్థము గాకున్న నీయాఁడి ప్రత్యయము గలుగదని సంభావించునది. వగాదులచేఁ బురుషుఁడు బోధ్యుఁడయ్యె నేని మత్వర్థమునఁ దరువాతిసూత్రముచే నాకారంబగుటను గమనించునది.

**వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారంబగు. ౨౩.**

ఆ ప్రత్యయాంతంబు మగాదిగణంబు. వగలాఁడు-చిన్నెలాఁడు.

టీ. బహువచనాంతములగు వగాదిశబ్దములకు మత్వర్థమునఁ బురుషవాచకము లకు 'ఆ'అనునదంతమున కాదేశముగ నగునని సూత్రార్థము. ఆ ప్రత్యయము మగాదిగణ పఠిత మగుటచే నేతదంతమునకు డుజ్వర్ణక మాచ్ఛికము ౹౪ చే నగుంగాన 'వగలు+ఆ= వగలా=వగలాఁడు. చిన్నెలు+ఆ=చిన్నెలా=చిన్నెలాఁడు.' అనురూపము లేర్పడును. ఆ ప్రత్యయమును బహువచనాంతములకేగాని యేకవచనాంతములకు గాదనుట స్పష్టము.

**ముక్కులో నగువానికిం దదభావద్యోతకంబయి మతుబర్థంబునం డిఁడివర్ణకంబగు. ౨౪.**

ముక్కిఁడి - ముక్కు లేనివాఁడనియర్థము ముక్కు - వాలు - వెరవు - సిగ్గు-ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది.

టీ. ముక్కు మొదలగుశబ్దములకంటె మతుబర్థమున 'ముక్కు మొదలగువాని లేమిని దెలుపుచు 'ఇఁడి' అను ప్రత్యయమగును. ముక్కు+ఇడి=ముక్కిడి. అపదాది

స్వరసంధి. స్త్రీసమంబగుటఁ బ్రథమైకవచనలోపము. ముక్కులేనివాఁడని యర్థము. ముక్కుగలవాఁడను దానికి వ్యతిరేకమగు నర్థమును బోధించుచున్నదిగాన మత్వర్థమునఁ దదభావద్యోతకం బీ యిఁడిప్రత్యయమని యెఱుంగునది. ఇట్లే 'వాలు+ఇఁడి=వాలిఁడి. వెరవు+ఇఁడి=వెరవిఁడి. సిగ్గు+ఇఁడి=సిగ్గిఁడి' అనువాని ప్రక్రియను గమనించునది. 'ఒకానొకచో మతుబర్థమున నవర్ణకము గానంబడియెడి' అని త్రిలింగలక్షణశేషము 'దివ్యతేజంబునవాఁడు = దివ్యతేజముగలవాఁడు' అని యుదాహరించి యీమత్వర్థక ప్రత్యయసందర్భమును బూరించుట నరయునది. మఱియు 'చెడుగు-దుడుకు-పిడుపులకుఁ బుంస్త్వమున మతుబర్థం బకారంబగు. చెడుగఁడు, దుడుకఁడు-నిడుపఁడు' అనియు, 'ఇదవర్ణకము క్రొవ్వుబెట్టులకు మతుబర్థమందగు. క్రొవ్విదము - బెట్టిదము' అనియుం శాసించి యుదాహరించి సూరి యీమతుబర్థసందర్భమును సవరించుట నరయునది. ఇవియెల్ల 28 తద్ధితసూత్రమునకు వివరణములు గాఁదగును.

మానార్థంబున కేకత్వంబునం దేఁడువర్ణకంబగు. ౨౯.

తూమెఁడు - ముంతెఁడు - ఎత్తెఁడు - వీసెఁడు - జేనెఁడు - మూరెఁడు - కుండెఁడు - గంపెఁడు.

టీ. 'మానార్థాన్నిత్యమేకత్వ ఏడు స్యాత్పరిమాణకే' అనునది మూలము. పరిమాణార్థమునం దేకవచనాంతముపై 'ఏఁడు' అను ప్రత్యయమగునని సూత్రార్థము. పరిమాణ మర్థముగాఁగల శబ్దమునకంటె నేకవచనముమీఁద నెఁడుప్రత్యయము గలుగునని భావము. పరిమాణమన కొలఁత తూము: ఇది పరిమాణార్థకము. దీనికేకత్వమున నెఁడు ప్రత్యయ మీవిధిచేఁ గలుగ 'తూమెఁడు' అని రూప మేర్పడును. ఒక్కతూముపరిమాణమని యేకత్వమనుటం జేసి యర్థము గలిగెడి. ఇట్లే తక్కినవవ్యూహ్యములు. మానార్థకశబ్దములు విశేషణములుగాన నిత్యబహువచనాంతములగు ధాన్యాదివాచకములకు విశేషణములగునపు డెఁడుప్రత్యయము బహువచనాంతములగు మానార్థకశబ్దములకుఁ గలుగునా? లేక యవి యెప్పుడును నేకత్వముననే యెఁడుప్రత్యయము నందునా? విశేష్యవిభక్తి వీని కగునాగాదా? యను సందేహము చిన్నయసూరి సందర్భమునుబట్టి గలుగునని తలంచి కావలయుఁ ద్రిలింగ లక్షణశేషము 'పరిమాణార్థమునం బ్రథమైకవచనమునంద యెడు వర్ణకంబగు; విశేష్యము భిన్నవచనవిభక్తికంబయ్యు మానార్థకశబ్దములమీఁదఁ బరిమాణార్థమునఁ బ్రథమైకవచనమునందే యెడువర్ణకము వచ్చునని యర్థము. మూరెఁడు తోఁక, తూమెఁడు బియ్యము, పుట్టెఁడు తవిదలు, పుట్టెఁడుతవిదలకు రెండుపుట్లగింజలు' అనిశాసించి యుదాహరించి యీసందర్భమును సవరించెను. ఏకత్వమున ననుటంబట్టియుఁ నుదాహరణములంబట్టియుం నీయర్థము సూరి యీసందర్భమును బట్టియే యుగ్గడింపనగునని తోఁచెడిఁగానఁ బై త్రిలింగలక్షణశేషోక్తి స్పష్టార్థమనఁదగును.

ఎడువర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబు లోపించు. ౨౬.

కమికేడు-కోడిదేడు-దోసెడు-పిడికెడు-పుడిసెడు-సందెడు.

టీ. పూర్వసూత్రముచే నగు నెడువర్ణకము పరముగాఁ బదములతుది నున్న లివర్ణము లోపించును. కమికిలి + ఎడు = కమికెడు. అపదాదిస్వరసంధి నిత్యముగ నగును. ఇవ్విధికి విషయములు లివర్ణాంతమానార్థకములనుట స్పష్టము. 'ప్రసృత్యాదేర్లి వర్ణస్య లోపశ్చ పరిదృశ్యతే' అనునది మూలము.

దఘ్నార్థంబున బంటికోలఁదులగు. ౨౭.

మోఁకాలిబంటి - మోఁకాలికోలఁది. ఱొమ్ముబంటి - ఱొమ్ము కోలఁది.

టీ. సంస్కృతవ్యాకరణమున 'దఘ్నచ్' అను ప్రత్యయము పరిమాణార్థమున విధింపఁబడినది. 'దఘ్నచ్' అనుదానియందలి తుది చకారవ్యంజనము లోపించుటచే 'దఘ్న' అనునది యేర్పడెను. కాఁగా దఘ్నచ్ ప్రత్యయార్థమునఁ దెలుఁగుశబ్దములకు 'బంటి - కోలఁది' అనునవి యగునని సూత్రార్థము. మోఁకాలు:— దీనికిఁ బరిమాణార్థమున బంటి యీవిధిచేఁ గలుగ తద్ధితవృత్తియం దికార ముపవిభక్తి ప్రాతిపదికమునకుఁ గా 'మోఁకాలిబంటి' యనియు, కోలఁదిగా 'మోఁకాలికోలఁది' యనియు రూపము లేర్పడును. ఇట్లే ఱొమ్మునకు బంటికోలఁదులచే 'ఱొమ్ముబంటి, ఱొమ్ము కోలఁదు'లనురూపము లగుట నూహించికొనునది. 'సంస్కృతపదములమీఁద 'దఘ్నచ్-ద్వయసచ్' మొదలగునవి పరిమాణార్థమునఁ గావలసియుండఁ దెలుగువిభక్తిచిహ్నితము లైన తత్సమములమీఁదఁగూడ నీబంటియే యగుపడుటంజేసియు సూరి యాచ్ఛికముల నే యుదాహరించుటంజేసియుఁ ద్రిలింగలక్షణశేషము, 'దఘ్నార్థంబునం దెనుఁగుపదములమీఁదను బంటి గానంబడియెడి. కటిబంటి' అని శాసించి యుదాహరించి సవరించె. కాని త్రిలింగలక్షణశేషము కోలఁదిమాట తలంపమికిఁ దత్సమములకు దఘ్నార్థమునఁ బంటియే గాని కోలఁది గలుగదని యనుమానించెనో లేక కొలది యర్థవచ్ఛబ్దమగుటఁ దత్సమాసమసాధారణమని యెంచెనో కారణము తెలియకున్నది. మఱియుఁ బ్రాచుర్యమనఁగా విస్తృత్యర్థమున సంస్కృతపదములమీఁద వికారార్థమున నయ్యెడి మయట్ప్రత్యయము తెనుఁగుపదములమీఁదను గల్గుటను సూచింప 'ప్రాచుర్యార్థమునఁ దెనుఁగు పదములమీఁదను మయట్ప్రత్యయము చూపట్టెడు. తనమయము - తపమయము - ప్రోవులమయము' అని శాసించి యుదాహరించి యీసందర్భమును బూరించుట నరయునది. 'మాత్రోదఘ్నే తు బంట్యాదిస్తతః పూర్వత్ర నః క్వచిత్' అను నాథ

ర్వణము నూఁతగఁ గొని యీసూత్రమును ప్రౌఢవ్యాకర్త రచించెననుట స్పష్టము. మాత్రపదము సాంస్కృతికమని విడిచెననితోఁచెడి. అయినను నవర్ణకమును విధించుట మాని ముఖ్ఖన బంటి మొదలగువానిని సాధింపకుండుట విచార్యము.

## అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది ౨౮.

మంటమారి - తిండిపోతు - తాచ్ఛీల్యంబున మారి పోతువర్ణకంబులు. అడప-తాంబూలకరండవాహి-మతుబర్థంబునంద ప్రత్యయంబు. పెండ్లము-ఊఢ-పెండ్లిశబ్దంబునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు, ఇత్యాదు లూహ్యంబులు.

ఇది తద్ధితపరిచ్ఛేదము.

---

టీ. అర్థవిశేషంబులందగు శేషించిన యాయా ప్రత్యయము లనంతములగుట మహాకవిప్రయోగముల ననుసరించి వానిని దెలిసికొనవలెనని సూత్రార్థము. గ్రంథబాహుళ్యము సూత్రబాహుళ్యముచే సంభవించెడి. ఇంతియగాక యొక్కగుమి యొక ప్రత్యయమునందక యొక్కకశబ్ద మొక్కొక ప్రత్యయమును బడయుటను నట్టివి యనంతములగుటను దెనుఁగు వ్యవహారస్థమగుటను నట్టివి కాలక్రమమున ననంతములై కావ్యములఁ దోఁచుటను వానిని మహాకవిప్రయోగములంబట్టి యెఱుంగవలెనని సూరి శాసించె. ఎల్లవానిం జక్కఁబెట్టి సాధుత్వమొసంగు సూత్ర మొక్కొకటి వ్యవహారస్థమగు భాషయందు వెలయు గ్రంథముల భాషకు సంబంధించిన వ్యాకరణములలోఁ బ్రతిపరిచ్ఛేదమున నుండుట యసంగతము గాఁజాలదు. మంటమారి:—ఇట మంటశబ్దమునకు మండునట్టి స్వభావముగలది యను నర్థమున మారిప్రత్యయ మయ్యెననియుఁ దిండితినునట్టి స్వభావముగలది యను నర్థమునఁ దిండిశబ్దమునకుఁ బోతు ప్రత్యయ మయ్యెననియుం దాన మంటమారి - తిండిపోతనురూపములు గలిగెననియుం నభిప్రాయము. తచ్ఛీలధర్మము తాచ్ఛీల్యము. అదియే దానికి సహజస్వభావమని భావము. అడపమనఁ దాంబూలపుఁబెట్టె. తాంబూలపుఁబెట్టె గలది లేక కలవాఁడు అడప శబ్దవాచ్యులు. అడపము + అ:—మతుబర్థమున 'అ' అను ప్రత్యయము. తద్ధితవృత్తిని మువర్ణకలోపము. అడప+అ. అపదాదిస్వరసంధి. అడప. ఇది తాంబూలపేటికను మోయు నాఁడు దానినే చెప్పెడిఁగాని యట్టిపురుషుని బోధించునట్లు ప్రయోగములం దగపడకున్నది.

సూరి తాంబూలకరండవాహీ యని యర్థము వ్రాయుటంబట్టి యిది పుంలింగశబ్దమని యెంచి తాంబూలపేటికను మోయువాఁడని యర్థము తోఁచెడిఁగాని తాంబూలకరండవాహిపదము నణ్ప్రత్యయాంతముమీఁద ఙీప్రత్యయముకల్గిన స్త్రీలింగరూపముగను సంస్కృతవ్యాకృతి ననుసరించి సాధింపనగుం గాన దీనికిఁ దాంబూలపుఁబెట్టెను మోయుపురుషుఁడును స్త్రీయును నర్థము గానోపుదురు. అట్లగుటఁ దాంబూలకరండవాహీ యనుదాని కడపశబ్ద మడపముగల స్త్రీని దెల్పునదేయై ప్రయోగదృష్టమగుటచేతఁ దాంబూలపుఁబెట్టెను మోయుస్త్రీ యనియే యర్థము చెప్పనగును. పుంస్త్వమున నడపకాఁడని యుండనోపు. పెండ్లి+అము:—అపదాదిస్వరసంధి. 'పెండ్లము.' పెండ్లికలది యనునర్థమునన మత్వర్థమునఁ బెండ్లిశబ్దమునకు 'అము' అను ప్రత్యయము గలుగుటచేఁ బైరూపమయ్యెనని సూరియభిప్రాయము. పెండ్లిశబ్దముమీఁద మత్వర్థమున 'అ' ప్రత్యయమని యని పిదప మువర్ణకముఁ జేర్చినఁ బైరూపము సాధువగుంగాని విశిష్టము స్త్రీవాచకమగుటను నాచ్ఛికశబ్దమగుటను బ్రథమైకవచనము నిలువ నవకాశము శాస్త్రవిూయకుండుటంజేసి మువర్ణకమును నిల్పుటకు వీలులేక 'అము' ప్రత్యయమని మువర్ణాంతముగా వివరించెనని తోఁచెడి. ఆదిశబ్దముచేఁ బ్రౌఢవ్యాకర్త వివరించినవని ముందు నిరూపించిన యితరప్రత్యయములు గ్రాహ్యములు. ప్రకృతిప్రత్యయవిభాగ మేర్పఱుపరానిరీతిని సుబంతములమీఁదఁ దవిలి యర్థవిశేషప్రకాశన మొనర్చుచుఁ బ్రకృతిసహజములైన ట్లుంటియుండునవి గాన వీనికిఁ దద్ధితములనియు, వీని నభివర్ణించు నీపరిచ్ఛేదమునకుఁ దద్ధితపరిచ్ఛేదమనియుఁ బేర్లు గలిగియుండనోపును.

ఇది తద్ధితపరిచ్ఛేదము.

---

# క్రియాపరిచ్ఛేదము.

క్రియ యన వ్యాపారము. పని. వ్యాపారవాచకము క్రియాసంజ్ఞకము. ధాతు వనునది క్రియకు నామాంతరము. క్రియలను గూర్చినదైన గ్రంథభాగము గాన నిది క్రియాపరిచ్ఛేదము నాఁబడె.

## ధాతువునకు. ౧.

ఇది యధికారసూత్రంబు - ఇంక నెయ్యది యుపక్రమింపంబడు నయ్యది ధాతువున కగునని యెఱుంగునది

టీ. ఏదానికిఁ దానున్నస్థలమున నర్థోపస్థితి గలుగక తరువాతి విధి సూత్రములతోఁ గలియుట నర్థోపస్థితి గలుగునో యది యధికారసూత్రమని శాస్త్రజ్ఞుల సంప్రదాయము. ఇది యట్టి యధికారసూత్రమగుట నిచట దీని కర్థోపస్థితి లేదనియుఁ దరువాతివిధిసూత్రములతోఁ గలిసి యన్వయమునందుటచేసి యర్థోపస్థితి నందు ననియు నట్లగుట మీఁద విధింపఁబడుకార్యములు ధాతువున కగునవనియు నిది యధికారసూత్రమను నీక్రింది సూరివివరణమున కభిప్రాయము.

## వర్తమానంబున లట్టగు. ౨.

వర్తమానక్రియావృత్తియగు ధాతువునకు లడ్వర్ణకంబగు. వర్తమానంబునాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు - అప్పటికి ముగియకుండునది.

టీ. వర్తమానమన జరుగుచున్నదని యర్థము. ధాతువున కనున దనువర్తించును గాన నద్దానితో వర్తమానంబునం దను దాని కన్వయము గలుగు. ధాతువనఁ గ్రియ వ్యాపారమని యర్థమని ముందె యుక్తము. 'అందు' అనునది యధికరణార్థమున నైన సప్తమీ ప్రత్యయమని కారకప్రకరణమునుబట్టి స్పష్టము. కాఁగా వర్తమానమందలి వ్యాపారమునకు లట్టగునని యర్థము తేలెడి. శబ్దమునకే ప్రత్యయాదులు గలిగెడిఁ గాని వర్తమానవ్యాపారమునకుఁ గలుగుట పొసఁగదు గాన వర్తమానమను దానికి వర్తమాన కాలవాచకమనియు ధాతువునకను దానికి వ్యాపారవాచకమునకనియుం నర్థమును గ్రహించి వర్తమానమునందున్న వ్యాపారమునందుండు ధాతువునకు లట్టగునని యర్థము చెప్పనొప్పు. వర్తమాన క్రియావృత్తి యగు ధాతువునకని ఫలితము తేలెడి.

జరుగుచున్న వ్యాపారమును బోధించు ధాతువునకంటె లట్టగునని భావము. శబ్దముచే నర్థము బోధ్యమగుంగాన నాయర్థమం దాశబ్దము వర్తించెడినని గ్రహించి వర్తమాన క్రియావృత్తి యను వివరణము వ్రాయఁబడెనని గ్రహించునది. వృత్తియన వర్తించు నది. కాని వ్యాపారమనునది పదార్థనిష్ఠముగాన వర్తమానమందను దానికి యోగ్యత ననుసరించి వర్తమానకాలమునందలి పదార్థమునందని యర్థము చెప్పవలెను. కాఁగా వర్తమానకాలికమగు పదార్థమునందున్న వ్యాపారమున నుండునట్టి ధాతువునకు లట్టగు నని యర్థము లభించెడి. కాన జరుగుచున్న కాలమందలి పదార్థమునందున్న వ్యాపార మును బోధించుధాతువునకు లట్టగుననునది సూత్రమునకు స్పష్టమైన యర్థమును బోధించు భావమని గ్రహింపఁదగును. మొదలుపెట్టఁబడి తుదినొందక సాఁగుచుండుట వర్త మానశబ్దమున కర్థము. కావుననే ప్రారబ్ధమై పరిసమాప్తిని బొందనిదనియు నపరిసమాప్త మనుదాని కప్పటికి ముగియకుండునదనియు సూరి వివరించుట సుప్రసక్తమయ్యెడి. 'రత్నము ప్రకాశించుచున్నది' ఈవాక్యమున వర్తమానకాలిక పదార్థము రత్నము. దానివ్యాపారము ప్రకాశించుట. దానిని బోధించునది ప్రకాశించుధాతువు. ప్రకాశించుట ప్రారంభించి ముగియకుండుట యనఁగా నిప్పటికిని ప్రకాశించుచునే యుండుట సువ్యక్తమయ్యెడిఁ గాన నిట ప్రకాశించుననది ప్రారబ్ధాపరిసమాప్త వ్యాపారబోధక మగుచున్నది. జాతి వ్యక్తిలింగ సంఖ్యాకారకంబులేనును బ్రాతిపది కార్థములే గాన ధాతువు వర్తమానకాలిక పదార్థవ్యాపారబోధకమగుట యవిరుద్ధంబు. లడాదులు ధాతువులమీఁదఁ జేరి పైయర్థముల సువ్యక్తముంజేయ సాహాయ్యకారుల యయ్యెడిఁగాన నిక్కముగఁ బరికింపఁ బ్రాతిపదికమే పైయేనర్థములఁ బ్రకాశితము చేయ సమర్థమను శాస్త్రవాదము ననుసరించి ధాతువునకే వర్తమానకాలికపదార్థ వ్యాపారబోధకతాశక్తి గలదనుట పొసఁగెడి.

## భూతంబున లిట్టగు. 3.

భూతక్రియావృత్తియగు ధాతువునకులిడ్వర్ణకంబగు. భూతంబు నా విద్యమానధ్వంసప్రతియోగి - ముందుండి యప్పటికి లేకుండునది.

టీ. ధాతువునకను నధికారసూత్ర మిట కనువర్తించునుగాన భూతమునందు ధాతువునకు లిట్టగునని సూత్రమగును. ముందుచెప్పినరీతినే భూతమునందున్న పదార్థ మందలి వ్యాపారమునందు వర్తించుధాతువునకు లిట్టగునని సూత్రార్థము గలుగును. కానఁ గడచిన కాలమునందున్న పదార్థమునందలి వ్యాపారమును బోధించుధాతువున కని సూత్రాభిప్రాయము తేలెడి. భూతంబునాఁ గడచినదగుటఁ బ్రస్తుతము లేనిది

ముందుండెడిది యని యర్థము లభించెడి. విద్యమానధ్వంస ప్రతియోగి యనఁ బ్రస్తుత మొప్పుచున్న నాశమునకు శత్రువని యర్థము. ధ్వంసమనఁగా నాశము. నాశమనఁగా లేకపోవుట రూపఱుట. ప్రతియోగి యన శత్రువు. వ్యతిరేకమని భావము. లేకపోవుటకు వ్యతిరేకము ఉండుట. ప్రస్తుతము గల లేమికి వ్యతిరేకము పూర్వమున నుండుట గాన విద్యమానధ్వంస ప్రతియోగి భూతమనుట యొప్పెడి. పూర్వమున నుండియుఁ బ్రస్తుతము లేకపోవుట భూతమని ముందుండి యను సూరివివరణమున కభిప్రాయము. దేవదత్తుఁడు వండెను. ఇచట భూతకాలికపదార్థము దేవదత్తుఁడు. తద్వ్యాపారము వండుట. వండెననునది తద్బోధకము. ప్రస్తుతము వంటచేయమియు ముందు వంటచేయుటయుఁ దెలుపుటకై యిట్టివాక్యము ప్రయుక్తమయ్యెఁగాన ప్రస్తుతవచనాభావ వ్యతిరేకము భూతమనియుఁ దద్బోధకము వండెననునదనియు నిర్వచించుట పొసఁగెడి. దేవదత్తుఁడు వండుచున్నకాలములో వంటచేయకుండుట లేదు గాన వంటచేయకుండుట వండుటకుఁ బ్రతియోగి యయ్యెడి. వర్తమానకాలికాభావంబునకు విరోధి భూతమని భావము.

## భావిని ఌృట్టగు. ౮.

భావిక్రియావృత్తియగు ధాతువునకు ఌృడ్వర్ణకంబగు భావినా విద్యమానప్రాగభావప్రతియోగి అప్పటికిఁ బుట్టకుండునది.

టీ. ముందటి సూత్రద్వయమునందువలెనే భావిననుదాని కనువృత్తమగు ధాతువునకనుదానితో నన్వయముగాన భావియందున్న పదార్థమందలి వ్యాపారమునందు వర్తించుధాతువునకు ఌృట్టగునని సూత్రార్థము లభించెడి. కాన రాఁబోవుకాలమునందుండు పదార్థమందలి వ్యాపారమును దెల్పునట్టి ధాతువునకు ఌృట్టగుననియు సూత్రాభిప్రాయము గలుగును. విద్యమానప్రాగభావప్రతియోగి=ఒప్పుచున్న ముందటిలేమికి శత్రువు. ఒప్పుచున్న ముందటిలేమికి శత్రువన వ్యతిరేకము, మీఁదఁ గలుగును గాన నప్పటికిఁ బుట్టకుండునదని సూరి వివరించుట యొప్పు. రాముఁడు రాఁగలఁడు. ఇట రాముఁ డింతకు ముందు రాకుండుటం జేసియును నిప్పటికిని రాకుండుటం జేసియు నింతకుఁ దరువాత వచ్చువాఁడగుటం జేసియు రాముఁడు రాఁగలకాలమం దుండుపదార్థము. తద్వ్యాపారము రాక. దానిని బోధించునది వచ్చుధాతువు. దానికి ఌృట్టగునని సూత్రము చెప్పెడి. ప్రకృతవాక్యమున రామునిరాకయొక్క లేమియే స్పష్టమయ్యెడిఁ గాన నదియె విద్యమానప్రాగభావశబ్దవాచ్యమగు. తత్ప్రతియోగి వానిరాకయే గావునను నది మీఁదఁ గలుగనదగుటచేతను నది భావిశబ్దవాచ్యమగు. ఈగతినే యీతార్కికవాక్యముల

యర్థముల నరసికొనునది. బాలావబోధకై వ్రాసిన యిట్టి దేశభాషావ్యాకరణములలో లక్షణకర్త తర్కాదిపాండిత్యప్రకాశకములగు నిట్టివివరణములను వ్రాయుట విచార్యము.

## తద్ధర్మాదులందు లాట్టగు. ౫.

తద్ధర్మాదిక్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు. తచ్ఛీలసంభావనా సంప్రశ్న సాతత్యవర్తమాన భావ్యాశీరాదు లాది పద గ్రాహ్యంబులు.

టీ. ముందటి సూత్రములందువలెనే తద్ధర్మాదులందనుదాని ననువర్తించినధాతువున కనుదానితోఁ గూర్చి తద్ధర్మాదులందున్నపదార్థమునందలి వ్యాపారమునందు వర్తించుధాతువునకు లాట్టగునని సూత్రార్థము గ్రహింపవలెను. తద్ధర్మాదికాలికపదార్థ వ్యాపారబోధకమన కని సూత్రాభిప్రాయము. "తత్రాచార్యైః కాలమవివక్షిత్వైవ ధాత్వర్థమాత్రే వివక్షా క్రియతే, అత ఏవ తద్ధర్మ ఇత్యన్వర్థా సంజ్ఞా" అను నహోబలుని వ్రాఁతను బట్టి దీనికిఁ గాలవివక్ష లేదనియుఁ ద్రికాలములలో నేదాని వలసిన దానినె బోధింపఁగలదనియు గ్రహింపఁదగు. తద్ధర్మమన దానిసహజధర్మమనుట. రత్నము ప్రకాశించుననుచో రత్నసహజధర్మము ప్రకాశించుటగానఁ బ్రకాశించుట సహజధర్మము. ఇట్లే నీరుపాఱుననుచో నీరునకుఁ బ్రవహించుట సహజధర్మము గాన నిటఁ బ్రవహించుట సహజధర్మము. 'తస్య ధర్మస్తద్ధర్మః' అని వ్యుత్పత్తి. లేదా 'సః ధర్మః యస్య సః' అనియేని వ్యుత్పత్తి చెప్పనగు. ఆధర్మము దేనికిఁ గలదో యది యనుట. ఒకానొకధర్మముగల యొకానొక పదార్థమని భావము. ధాత్వర్థమాత్రమున నీలకారమగునని ఫలితము. (చూ. అహోబలపండితీయము. క్రియ. 459 పుట.) తద్ధర్మాది యను సూత్రమునందలి యాదిపదముచేఁ దచ్ఛీలాది సప్తకము గ్రాహ్యము. 'తస్య శీలమ్' అని లేక 'తత్ శీలం యస్య' అని వ్యుత్పత్తి దీనికగు. దాని సహజస్వభావము లేక యా స్వభావముగలది యని యర్థము. ఒకానొకస్వభావము గల యొకానొకపదార్థమని తాత్పర్యము. ఇట్లే సంభావనాదుల కర్థము నూహించికొనునది. అప్రాణిగతమగునది ధర్మమనియుఁ బ్రాణిగతమగునది శీలమనియు సంభావన సేయనగునని తోఁచెడి. సంభావన యన నూహ. సంప్రశ్నమన నడుగుట. సాతత్యమన నెల్లప్పుడుండుట. సతతభావము సాతత్యము. వర్తమానమన వాక్యము ప్రయోగించుకాలమున నుండునది. భావి యన వాక్యము ప్రయోగించుకాలమునకుఁ దరువాత నుండునది. రాఁబోవునదనుట. ఆశీస్సన దీవన, యాశీర్వాదము. ఈయేడు నాదిపదముచే స్వీకార్యములు. ఇట్లు వలసినకాలము

నెఱింగించుచు నిన్ని యర్థములను బోధింపఁగల లకారముగాని నీలకారముం జెందిన తద్ధర్మకాలికరూపములకు సరియగు రూపములుగాని సంస్కృతమునఁ దోఁపమియు సంస్కృతమునకంటెఁ దెనుఁగునఁగల యొకవిశేషమని యిట చెన్నఁదగు. 22 సూత్రము నొద్ద వీని కుదాహరణములు గననగును.

## ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టగు. ౬.

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు.

టీ. ఆశీశ్శాపసంప్రార్థనవిధులం దున్న పదార్థమునందలి వ్యాపారమున వర్తించు ధాతువునకు లూట్టగును. ఆశీశ్శాపసంప్రార్థనవిధులందున్న పదార్థమునందలి వ్యాపారమును బోధించుధాతువున కని భావము. ఆశిస్సన నాశీర్వాదము దీవన యని ముందు నిరూపితము. శాపమనఁ దిట్టు. సంప్రార్థనమున వేఁడుట - విధి - ప్రేరణ-లేక యాజ్ఞాపించుట - సేవకులు మొదలగువారిని బ్రవర్తింపఁ జేయుట. 26 సూత్రమున వీని కుదాహరణములు గాననగును.

## వ్యతిరేకంబున లజియగు. ౭.

వ్యతిరేకవిశిష్టక్రియావృత్తియగుధాతువునకు లజివర్ణకంబగు.

టీ. వ్యతిరేకార్థమునందున్న పదార్థమునందలి వ్యాపారమున వర్తించుధాతువునకు లజి యగును. వ్యతిరేకమునం దున్నపదార్థమునందలి వ్యాపారమును జెప్పు ధాతువునకని భావము. వ్యతిరేకమన వేఱు. Negative (నాస్తిపక్షము.) 32-37-39-47 మొదలగు సూత్రములందు దీని కుదాహరణములు గననగు. వర్తమానభూతభావులందగు రూపముల నర్థసాంకర్యము లేమిఁ దద్విషయమున 'లట్టు-లిట్టు-లృట్టు' అని సంస్కృత వ్యాకృతిమార్గమే యనుసృతము. తద్ధర్మతచ్ఛీలాదులందనేకార్థములందుఁ గావలసివచ్చుటం జేసియు సంస్కృతమున నీయర్థముల మూఁడు నాలుగు లకారములు గలుగునవగుటం జేసియు నాసంస్కృతలకారముల కంతగ నర్థభేదము ప్రయోగముఖమునఁ బ్రకృతము చూప నవకాశములేమిం జేసియుం నమ్మార్గమును వీడి తద్విలక్షణతం దెలుపఁ గావలయుం సూరి లాట్టని వ్యవహరించె. నిజముగ లూడర్థముల లాడర్థములుగ నెన్ని లూట్టును విడువనగుంగాని 26-27-28-29-30 సూత్రములచే నగురూపభేదముల ననుసరించియు శాపసంప్రార్థనార్థముల ప్రకాశనము రూపభేదము ననుసరించి గలుగుటను గమనించియుఁ గావలయుం సూరి లూట్టును బ్రత్యేకించి యంగీకరించె. ఇందనేకార్థముల నీలకారము గలుగవలసియుండుటచేతను నీయర్థములందు సంస్కృతమున 'లోట్-లిఙ్' అనునవి గావలసి యుండుటచేతను, నమ్మార్గమును వీడి తద్విలక్షణతం దెలుపఁ గావలయు సూరి

లూట్టని వ్యవహరించె. సంస్కృతమున స్వతంత్రముగ వ్యతిరేకరూపముగలుగదు. 'నఙ్' అనుదానిం జేర్చుటంజేసి యది సంభవించును. తెలుఁగున నట్లుగాక యసాహాయ్యముగ వ్యతిరేకరూపము గలుగు. స్వతంత్రముగ వ్యతిరేకరూపము వెలయుంగాన నిది సంస్కృతాంధ్రభాషలకుఁ గల ముఖ్యభేదములలో నొకటి యనఁదగు. కావుననే లక్షణకర్త యీయర్థమునఁ బ్రత్యేకలకారమును విధించుట పొసఁగెడి. కార్యార్థము లజి యని జిత్త్వనిర్దేశము చేయఁబడెననుట స్పష్టము. మూలము 'తద్ధర్మ్య వర్తమానాతీతాగామ్యర్థకాః క్రియాః జ్ఞేయాః' అని నాలుగర్థములనే వివక్షించి ప్రక్రియను నడపెను. ఐనను సూరి బహుల ప్రయోగదృష్టింజేసి లూట్టు లజ్జులను మఱి రెంటిని గ్రొత్తగ నంగీకరించి తద్ధర్మాదులందు లాట్టగునని యాయాయర్థముల విధించి రూపభేదములంజేసి యర్థాంతరము లావహిల్లుటను విశదీకరించె. సంస్కృతవిలక్షణముగ లూట్టు-లాట్టనుట యీతని సంస్కృతవ్యాకృతిమార్గానభిజ్ఞతకు నిదర్శనమండ్రు. కాని పైని వ్రాసిన ప్రకారము సంస్కృతలకారములతో సరిపెట్టుట గుదురమిని రెండుమూఁడులకారము లాయాయర్థముల సంస్కృతవ్యాకృతి మర్యాద ననుసరించినఁ గలుగునని చెప్పవలసివచ్చుటను నమ్మార్గమును వీడి 'యెట్లును నమ్మార్గమును వీడితినిగదా! సంస్కృతమున నాయాయర్థమునఁగలుగు నాలకారమునకును దీనికిని నేమాత్రము సంబంధము లేదని తెల్పుటయే ముఖ్యము'అని యెంచి సూరి తద్విలక్షణముగ 'లాట్టు-లూట్ట'నియెంగాని మఱియొకటిగాదు. 'లట్టు-లిట్టు-ల్ఋట్టు.' అని త్రికాలముల సరిగా సంస్కృతము ననుసరించి లకారముల విధించిన సూరి కితరములు తెలియవని యనుట యెట్లుపొసఁగును? కాన వర్తమానభూతభావులందు సంస్కృతమార్గము సరిపడుట నాదరించెననియు తద్ధర్మాదులందమ్మార్గము గుదురమిని గేవలము వైలక్షణ్యమే యగపఱుప లాట్లూట్టని వ్యవహరించెననియుం నంగీకరింపనగుంగాని యింతమాత్రమున నాతనియం దట్టినిందను నిష్పక్షపాతమతి నీగ్రంథమును బరికించువారలు మోప నవకాశము చాలదనియే యేఁ దలంతును. సూరి యిట్లు సంస్కృతవిలక్షణముగ లాట్లూట్టనుటం గాంచి హరికారికాకర్తలు సంస్కృతవ్యాకృతిపారీణులగుట నయ్యో లకారనిర్దేశము శాస్త్రవిలక్షణమయ్యెఁగదా యేమిదారి? యని చింతించి 'ధాతోర్లడ్వర్తమానే స్యాద్భూతే లిఙ్ల్ఋట్చ భావిని,తద్ధర్మాదిషు లేడాశీశ్చాపసంప్రార్థనే విధౌ; లోట్ స్యాల్లజ్ వ్యతిరేకే స్యాల్లకారా అత్రషణ్మతాః.' అని వేదవాఙ్మయమునందే యగపడు లేట్టును దెలుఁగునను గూర్చి తెనుఁగునకు వేదతుల్యతను సంపాదించి లజ్జునకు వ్యతిరేకార్థకతను దెచ్చిపెట్టి యెట్లో సంస్కృతవ్యాకృతిసమ్మత లకారములకు ముడిపెట్టి తమపాణినీయపారీణతను వెల్లడించికొనిరి. పాఠకసహృదయులారా! పరికింపుఁడు. ఇదే హరికారికల కాంధ్రీకృతియైన సూరి

తదనుసారియై పైనివ్రాసినరీతిని 'లేట్-లజ్' అనియేగదా యని యుండును? శాస్త్ర సంప్రదాయము సురక్షితముగా సూరిమార్గము హరికారికావలి పైరీతిని సంస్కరించు చున్నదనుట కిది యొకప్రబలప్రమాణము గాఁజాలదా? జిత్తు బిందుపూర్వంబగు నను సూత్రము మహత్కర్తృకప్రథమపురుషైకవచనమధ్యమపురుష బహువచనములం దెల్లఁ (వండుచున్నాఁడు-వండఁగలఁడు-వండుఁడు-వండఁడు) బ్రవర్తింపవలసియుండుట నది సుబంతతిఙంతసాధారణమని యంగీకరింపవలసియుండుటచేతను, 'లజ్-మిజ్-నిజ్-పడుఁజ్-కలజ్' అనురీతిని జిత్తులుగఁ జేసిన నక్కఱలేనిబిందువు గలుగవలసివచ్చుటే గాక యూపక్షమున జిత్తు పరంబగునపు డుత్వమున కత్వమగునని యత్వవిధానముం జేయవలసివచ్చుటను (వండుఁడు-చేయుఁడు) లూణ్మధ్యమమహత్కర్తృకబహువచన రూపములందును నత్వము ప్రసక్తము గావలసివచ్చుటచేతను, జిత్తు పరంబగునపు డుత్వ మున కత్వమగు ననుసూత్రవిన్యాసము ననుసరించియే 'జి' అనుదానికంతకు నిత్సంజ్ఞ సిద్ధ మనునంశము పాఠకసుబోధమగు ననుతలంపుచేతను, జిత్కార్యము బిందువును జిత్కార్య మత్వమును నను వైలక్షణ్యముం దెలుపుటకై లూట్టనినట్లే స్వతంత్రించి పైప్రత్యయము లను జిత్తులుగఁ జేసి పేర్కొనెనని తోఁచెడి. ఇట్లే జిత్తులగు ప్రత్యయములం బేర్కొను చోటులం దెల్ల 'జి' అనుదాని కిత్సంజ్ఞ సిద్ధించుటను గమనించి ప్రక్రియ యూహ్యము. అవసరమగునపుడే వక్తవ్యమునకు సరిపడునపు డీయాద్యవ్యాకృతినియమముల నంగీ కరించుటయుఁ దద్వైలక్షణ్యము తోఁచినపుడు వదలి వక్తవ్యానుకూలముగ వర్తించు టయుం దోషములు గాఁజాలవు.

### లకారంబునకు డు ఱు వు రు ను ముఙ్గు ౮.

లడాది లకారంబులం దొక్కొక్కటికి డుఙాదు లాదేశంబులగు. ఇందు ఙకారంబు ప్రత్యాహారార్థంబు.

టీ. 'లట్టు-లిట్టు-లృట్టు-లాట్టు-లూట్టు-లజి' అను నాఱులకారములందును లకారము సామాన్యమగుటం జేసి లకారమున కనుదానిచేఁ బైయాఱులకారములును గ్రహింపఁబడునుగాన నాయాఱింటిలో నొక్కొకదానికి డుఙాదు లాఱు నాదేశమగునని సూత్రాభిప్రాయము. ఆఱులకారములలోఁ బ్రతిలకారమునకును డుఙాదు లాఱును నాదేశము లగునని ఫలితము. ప్రత్యాహారమనఁగా నాది నొకవర్ణమును గ్రహించి యంత్యమగు పొల్లుతోఁ జేర్చి యాదిమవర్ణముతోఁ గూడిన యారెంటికిని నడుమఁగల వర్ణసమూహం బెల్ల నాసంజ్ఞతో సంగ్రహించి చెప్పుట యని ముందె యుక్తము. ప్రకృతము తొలివర్ణమగు డుఙ్ఙు నంత్యమగు పొల్లుతోఁగూర్చి 'డుఙ్' అగుటం జేసి 'డు-రు-వు-రు-ను-ము' అను

నాఱువర్ణములును డుఞ్సంజ్ఞకములై సంగ్రహింపఁబడునని గ్రహించునది. వర్ణసమితి నెల్ల నేకరువుపెట్టుట విస్తృతికారణమగుంగాన నిట్లు ప్రత్యాహారము మూలమున సంగ్రహించుట సామాన్యముగ వ్యాకర్తలసంప్రదాయము. క్రిందఁ జేర్పఁబడువిధుల ననుసరించి యివి ప్రథమమధ్యమోత్తమపురుషములఁ గ్రమముగ నేకత్వబహుత్వముల నగుటను గమనించునది. తెలుఁగుబాస సంస్కృతమువలె సింకను బూర్తిగ నస్పష్ట ప్రత్యయభాష గాక స్పష్టాస్పష్టప్రత్యయభాష యగుచున్నది గాన నీక్రిందివిధమున నీ ప్రత్యయములయుత్పత్తి ననుమానింపఁ దగును. వాఁడు కర్తగాఁగలది ప్రథమపురుషము గాన 'వాఁడు' అనుపదమునందలి వకారము లోపింపఁగా మిగిలినది డుజ్వర్ణకమనియు, వారనుదాని లుప్తశేషము రువర్ణకమనియు, నీవనుదానిలుప్తశేషము వువర్ణకమనియు, మీరనుదానిలుప్తశేషము రువర్ణకమనియు, నేననుదానిలుప్తశేషము నువర్ణకమనియు, మేమనుదానిలుప్తశేషము మువర్ణకమనియుఁ జెప్పనొప్పును. తుదిఞకారమునకు ప్రత్యాహారమే ఫలముగాని వ్యాకృతికార్యప్రయోజనముమాత్రము తోఁపదు. 'డుఞ్' అను దానియందలి ఞకారము బిందువుకొఱకని గ్రహించునది. పైప్రత్యయములయుత్పత్తి ననుసరించి సర్వనామములతోడఁ గ్రియలు మున్ను ప్రయోగింపఁబడుచుండెడివనియు బ్రకృతము సర్వనామాద్యక్షరములు లుప్తములగుట వీనికిఁ బ్రత్యయత్వము సిద్ధించె ననియుఁ నూహింపనగును.

## అందు వరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబు లనంబడు. ౯.

డుఞ్ - రు - ప్రథమము. వు - రు - మధ్యమము. ను - ము - ఉత్తమము.

టీ. 'డు-రు; వు-రు; ను-ము;' అనువానిలో 'డు-రు' అనునవి ప్రథమపురుష మనియు, 'వు-రు' అనునవి మధ్యమపురుషమనియు, 'ను-ము' అనునవి యుత్తమపురుష మనియుఁ జెప్పఁబడును. మిగిలినది స్పష్టము.

## వానిలో రు ము లు బహువచనంబులు పెఱలేకవచనంబులు ౧౦.

టీ. పైయాఱుప్రత్యయములలో 'రు-ము' అనునవి బహువచనములును, నితరము లగు 'డు-వు-ను' అనునవి యేకవచనములును నగు. 'రు-ము' అనునవి బహుత్వమందె గాని యేకత్వమున నెపుడును గావనియు, 'డు-వు-ను' అను మూఁడు నేకత్వముననె గాని బహుత్వమున నెపుడును గలుగవనియును భావము. ప్రథమపురుషైకవచనమున డువర్ణక మును, మధ్యమపురుషైకవచనమున వువర్ణకమును, నుత్తమపురుషైకవచనమున నువర్ణక మును, బ్రథమమధ్యమపురుషబహువచనముల రువర్ణకమును, నుత్తమపురుషబహువచన మున మువర్ణకమును నగునుగానఁ బైవిషయము సుబోధంబు.

నామయుష్మదస్మదర్థములందుం బ్రథమమధ్యమోత్తమంబులగు. ౧౧

టీ. యుష్మదస్మదర్థములకంటె భిన్నమగునది నామమగుట స్పష్టము. ఎదుటనున్నవాఁడు తాను నర్థముగానిది నామార్థమగుంగాన నెక్కఁడనో యున్నవాఁ డర్థమగునది నామార్థమగుట తెల్లము. క్రియ యెచట నున్నవానినో తెల్పునదగునపుడు ప్రథమపురుషమగుననియు, నెదుట నున్నవానిని దెల్పునదగునపుడు మధ్యమపురుషమగుననియుఁ, దన్ను బోధించునదగునపు డుత్తమపురుషమగుననియు సూత్రాభిప్రాయము. యుష్మదర్థమున మధ్యమపురుషమును, నస్మదర్థమున నుత్తమపురుషమును, నా రెండికంటె భిన్నమగునర్థమునఁ బ్రథమపురుషమును నగునని భావము.

అమహదర్థంబునందు డు ఋలకు దువు లగు నున్నానుబంధంబుమీఁద డివి యగు. ౧౨.

టీ. 9 చేఁ జెప్పఁబడిన ప్రత్యయములు మహదర్థమున ననఁగా మహత్కర్తృకక్రియలకే సరిపడెడిఁగాన నీవిధిచే నమహదర్థమున ననఁగా నమహత్కర్తృకక్రియలకుఁ బ్రత్యేకముగ వానికాదేశములుగఁ బ్రత్యయములు విధింపఁబడుచున్నవి. అమహత్కర్తృకక్రియమీఁది డుజ్వర్ణకమునకు దువర్ణమును, నమహత్కర్తృకక్రియమీఁది ఋవర్ణమునకు వువర్ణమును నగును. అమహదర్థకక్రియ 13 చే నున్నానుబంధయుక్తమైనచో దువర్ణమునకు బదులుగ డివర్ణమును, వువర్ణమునకు బదులుగ వివర్ణమును గలుగును.

ఉదంతంబునకు లట్టు పరంబగునప్పు డున్నానుబంధంబగు. ౧౩.

ఉదంతంబయిన ధాతువునకు లట్టు పరంబగునపుడు ఉన్న అను శబ్దం బనుప్రయుక్తంబగు.

టీ. 'వసతిరనుబంధకస్స్యాద్యత్ర లడర్థో వివక్షితస్తత్ర' అనునది మూలము. హ్రస్వోకారమంతమందుఁగల ధాతువునకు లట్టు పరమగుచుండ 'ఉన్న' అనుశబ్దము ధాతువుతుదిని జేరునని సూత్రార్థము. 'అనుబంధము=వెంటఁగట్టుట.' ఉండిన యను దానినుండి యున్న కలిగినట్లు 57 చే విశదమయ్యెడిఁగాన నున్నశబ్దమని వ్యవహృతము. శేషము స్పష్టము. సామాన్యముగఁ దెలుఁగున ధాతువు లుదంతములే. ఇంచుగాగమసంబంధమునను ధాతుసమితి యుదంతమగుట సంభవించెడి.

ఉన్నశబ్దంబు పరంబగునపుడు చువర్ణకంబగు. ౧౪.

టీ. 13 చే నగునున్నశబ్దము పరమగుచుండ 'చు' అనువర్ణము కలుగును. ధాతువున కనునధికారసూత్ర మీప్రకరణమునఁ బ్రతిసూత్రమునందును జొచ్చునుగాన నీచు

వర్ణాదేశము ధాతూచ్చానుబంధములనడుమ నగునని గ్రహించునది. చువర్ణ మేశబ్దము లుప్తశేషమో యూహింప నలవిగామిని నిరర్థకవర్ణమగుటను వర్ణకమని వ్యవహరించెనని తోఁచెడి. ఈచువర్ణక మిందలి ప్రక్రియ ననుసరించి యఖండపదవిషయమనియుం 43 సూత్రముచే నగునది వ్యస్తవిషయమనియు గ్రహింపనగు. 'వండుచున్నాఁడు' ఇదం తయుం నేకపదముగనే పేర్కొనవలెనుగాని 'వండుచుఉన్న' అని యీరీతి ఛేదింప నవకాశము లేదు. 'వండుచున్నవాఁడు' ఇందు 'వండుచున్ + ఉన్నవాఁడు' అని ఛేదించి శత్రర్థకచువర్ణకో కారసంధిచేఁ బైరూపము గలిగెనని చెప్పవలెను. ఈరెండుచువర్ణముల కిదియె భేద మిందగపడెడిఁగాని వేఱొకభేద మగపడదు. సూరి సాధించిన లడ్రూప ములను శత్రర్థకచువర్ణకాంతముమీఁద నుండుధాతు లడ్రూపములు చేరుటంజేసి కల్గి నవిగను, ల్ృడ్రూపములను నుజ్యంతముమీఁదఁ గలుగుధాతులడ్రూపములు చేరుటంజేసి యేర్పడినవిగను సిద్ధాంతింప నవకాశ మగపడుచుండ చువర్ణము నున్ానుబంధమును విధించి యేల శ్రమపడి పైవానిని సాధించెనో యరయవలసియున్నది. 'వండు చున్నాఁడు-వండఁగలఁడు.' అనువానియందు 'వండుచున్ + ఉన్నాఁడు; వండన్ + కలఁడు' అనియేగదా పైసిద్ధాంతముప్రకారము పదవిభాగము చేయవలసియుండును? అట్లైనఁ జువర్ణక మిట శత్రర్థమునందును నుజి భావలక్షణమునందును గల్గెనక తీరదు గదా! శత్రర్థచువర్ణభావలక్షణనుజులకు వర్తమానకాలస్పష్టీకరణశక్తి లక్షణము ననుస రించి కలదని చెప్ప నవకాశము లేమింజేసి లక్షణకర్త యమ్మార్గము నాశ్రయించెనని తోఁచెడి. సరూపతను, 'వండుచున్నాడు, వండఁగలఁడు' మున్నగు వానివలన వర్తమాన శత్రర్థకచువర్ణక, నుజ్యంతార్థములు తోఁపనగుంగాని లాక్షణికముగ వర్తమానార్థకత చువర్ణకనుజ్యంతములవలన గోచరింప నవకాశము లేమిని నఖండపదములవలననే యట్టి యర్థము స్ఫుటముగాదగుటను సూరి చువర్ణకోన్నానుబంధకలజ్యనుబంధవిధానములం జేసి పైరూపముల సాధించెననుటకంటె నితరమగుయుక్తి యీసందర్భమునఁ దోఁప కున్నది. మఱియు సంస్కృత ధాతురూపముల యనుకరణమున వీనిని సూరి యఖండ పదములుగ సంభావించెననుట తగును. 'చురితి క్రియాపదానాం సర్వేషాం వర్తమాన కాలే స్యాత్' అనునది మూలము.

## ద్వితీయంబగుడుఙ్ఞు పరంబగునప్పు డున్నానుబంధంబునకు దీర్ఘంబగు. ౧౫.

ప్రథమము. వాఁడు వండుచున్నాఁడు - వారు వండుచున్నారు- అది వండుచున్నది - అవి వండుచున్నవి. మధ్యమము. నీవు వండు

చున్నావు-మీరు వందుచున్నారు. ఉత్తమము. నేను వందుచున్నాను-మేము వందుచున్నాము.

టీ. 12 చే డుఙ్రులకు విధింపఁబడినదివులు పరమగునపుడు గాక తక్కినయెడల, 13 చే నగు నున్నయను ననుబంధమునందు తుదినున్న హ్రస్వాకారము దీర్ఘమగునని సూత్రాభిప్రాయము. డుఙ్రులస్థానమున నైనవగుట దివులనుగూడ డుఙ్రులనుగా నెంచి యున్నానుబంధమునకు దీర్ఘము సేయ యత్నింతురేమో యని శంకించికొని కావలయు లక్షణకర్త డుఞ్ఞు పరమగునపుడను దశము చేతనే దివులు పరమగునపుడు దీర్ఘము వారింపఁబడుచున్నను దివీతరంబనుదశముగూడ నెలకొల్పికొనె. 'వందుచున్నాఁడు' వందుధాతువు దీనికి వర్తమానంబున లట్ప్రత్యయము. లట్టునకుఁ బ్రథమపురుషైకవచనమున మహత్కర్తృకముగాన 9 చే డుజ్జగును. 'వందు+డుజ్.' డుజ్ ప్రత్యయము జిత్తుగాన బిందువు ముందిడికొని యగును. 'వందు+ఁడు.' తుదినున్న పొల్లుజకార మిత్సంజ్ఞకము గానఁ దొలఁగుననుట స్పష్టము. 13 చే నున్నానుబంధమగు 'వందు+ఉన్న+ఁడు.' 14 చే చువర్ణకమగును. 'వందుచు+ఉన్న+ఁడు.' 15 చే నున్నానుబంధమునకు దీర్ఘమును జువర్ణకోకారమునకు నున్నానుబంధాద్యుకారము పరముగా నపదాదిస్వరసంధియుఁ గలుగ 'వందుచున్నాఁడు' అనురూప మేర్పడును. వాఁడని మొదట నుంచుట ప్రథమపురుషైకవచనసూచనార్థమును దివీతరడుఞ్ఞు పరముగ నున్నదని తెల్పుటకును నని గ్రహించునది. ఇట్లే వందుధాతు ప్రథమపురుషబహువచనరూపము నూహించికొనునది. 'అది వందుచున్నది' అమహాదర్థమున డుఙ్రులకు దువులును నున్నానుబంధముమీఁద దివులును నగుంగాన నిట నమహత్కర్తృకమగు నీవందుధాతువునకు నున్నానుబంధము మీఁద 12 చే దివర్ణకమును 15 చే దివర్ణకము పరముగా నున్నానుబంధమునకు దీర్ఘము కలుగకుండుటయును నగుంగాన 'వందుచున్నది' యనురూపమయ్యె. అది యని ముందిడుట యమహదర్థసూచనార్థము. ఇట్లే యమహదర్థమున రువర్ణమునకు విపర్ణమును నున్నానుబంధమునకు దీర్ఘాభావమును సిద్ధించుటచే వందుచున్నవి యను ప్రథమపురుషబహువచనరూపము గలిగెడినని గ్రహించునది. ఈరీతినే యుష్మచ్ఛబ్దార్థమున నేకవచనబహువచనములందును నస్మచ్ఛబ్దార్థమున నేకవచనబహువచనములందును నవఁగా మధ్యమోత్తమైకవచనబహువచనములందుఁ బ్రక్రియను గమనించికొనుచు నెల్లధాతువులకు వర్తమానమున సిద్ధరూపముల గ్రహించునది.

'వసతిరనుబంధకస్స్యాత్' 'అస్తిరనుబంధకస్స్యాత్' అను మూలమునందలి 'వసతిః-అస్తిః' అనువానికి 'ఉన్నవాఁడ; చేయుచున్నవాఁడ' అను నన్నయ భారత

ప్రయోగముల ననుసరించి 'ఉండు-కలుగు' అనుధాతువులే వర్తమానభావ్యర్థములం
దనుబంధము లగునని గ్రహింపవలసియుండుటచేతను దేశ్యధాతురూపనిష్పత్తిని వర్ణించు
టను జింతామణి విడుచుటంజేసి 'ఉండు' అనునది యున్నగాను గలుగనునది కలగాను
మాఱుటను జెప్పలేదని యంగీకరించుట సరసమగుటచేతను నున్నాఁడున్నారు మొదలగు
దీర్ఘరూపములు నన్నయభారతభాగమున మృగ్యము లగుటచేతను, నున్నకలానుబంధము
లగునని సరస్వత్యహోబలాదులు మూలమును వివరించుటయుఁ దదనుసారియై సూరి
యిట్లు ప్రక్రియంజూపుటయు మూలవిరుద్ధములగువిషయములని యనకతీరదు.(చూ.చిం.
వి. ప. పేరా 112-113.) దీన నున్నానుబంధముతోడి రూపములను గలానుబంధము
తోడి రూపములను సాధించుటంజేసి చింతామణి నన్నయకర్తృకము గాదను కం. వీ.
పంతులుగారివాదము పరాస్తమయ్యెడి. సూరి తననాఁటికిఁ గావ్యముల హెచ్చుగా నట్టి
రూపములు దృష్టములగుటంజేసియు దీని కాధారముగ బాలసరస్వత్యహోబలుల
వ్యాఖ్యానము లుండుటంజేసియు మూలాశయ మెట్లున్నను సరస్వత్యాదులనే యను
సరించువాఁ డయ్యెనని తోఁచెడి. సరస్వత్యాదులును దమనాఁటి కట్టిరూపములే
హెచ్చుగఁ గవిప్రయుక్తములై యగపడుట నీగతిని మూలమున కర్థముఁ వివరించి
యుందురని యనుమానింప నగుచు. 'కలుగువాఁడు; ఉండువాఁడు;' లేక 'కలుగువాఁడు
కలఁడుగను, నుండువాఁ డున్నవాఁడుగను' మార్పునందినరూపములు స్వతంత్రములుగను
బ్రయోగింప నర్హములగుటంజేసి యీవ్యాఖ్యను ముందు వ్రాసినప్రకారము శత్రర్థచువ
ర్ణకనుబ్యంతములమీఁద నివిచేరుటంజేసి వర్తమానభావ్యర్థకరూపములు గల్గుననియే మూల
మభిప్రాయపడెననియు దాన ననుబంధములుగ 'ఉండు-లేక-ఉన్న-కలుగు-లేక-కల' అను
విశేషణరూపములే యగుననియు గ్రహించుట యుచితమని తోఁచెడి. కాని మూలము
చువర్ణమును వర్తమానమున ధాతువులకెల్లను విధించి యుండుటంజేసి మూలమిట్టివాని
నఖండపదములుగనే యెంచెననియు దాన భుజించుచున్నవాఁడు మున్నగువానియందు
'భుజించుచున్ ఉన్నవాఁడు' అని ఛేదింప నవకాశము లేదనియుఁ జెప్పనగునుగానఁ
బైని నిరూపించినవిషయము మూలసమ్మతము గాఁజాలదు. చింతామణివిషయపరిశోధ
కులమతమునను ఉండనునది యున్నగను గలుగనునవి కలగను మార్పునందునని యంగీక
రింపవలసి వచ్చుటంజేసి నన్నయప్రయోగదృష్టినిగాక ప్రక్రియాదృష్టిని బట్టినచో
నున్నానుబంధమునకు దీర్ఘమును నేదోయొకసూత్రముచేఁ గట్టవచ్చుననియు వ్యాకర్త
సాధించినవెల్లను దనగ్రంథమునఁ దప్పక ప్రయోగించియే యుండుననుట పొసఁగని
విషయమనియు శిష్టలోకవ్యవహారసిద్ధమగుట నున్నకలానుబంధరూపముల నాద్య
వ్యాకరణమగు చింతామణి సాధించెననియు నన నవకాశముండుటంజేసి, నన్నయ యట్టి

వానిని బ్రయోగింప లేదుగాన నున్నకలానుబంధములు చింతామణ్యభిప్రేతములు గాఁజాలవనియు నున్న నాఁడిత్యాదుల ననుసరించి యుండనున దున్నగాను గలుగనునని గలగను మాఱుననియు ననుటకంటెఁ దాఁ బ్రయోగింపకున్నను నట్టివి యప్పటిశిష్టలోకముచే మెండుగ నాదృతములగుచుండుట నిట్లు ప్రక్రియను జింతామణి చూపెననుటయే సరసమని తోఁచెడి. ఇమ్మార్గము నాశ్రయించినను జింతామణి ప్రాచీనతకు భంగము రాకుండుటేగాక యాంధ్రవాఙ్మయాదిమవ్యాకరణ మగుటయుఁ గుదురుపడెడినని తోఁచెడి.

## లిడ్లాట్టుల డుజ్జున కెను నువర్ణంబు లగు. ౧౬.

లిడాదేశంబగు డుజ్జునకు - ఎను - అనునదియు - లాడాదేశంబగు డుజ్జునకు - ను-అనునదియు నాదేశంబు లగు.

టీ. సూత్రార్థము వృత్తిమూలమునఁ దెల్లము. లిట్టునకుఁ బ్రథమపురుషైకవచనమున నగు డుజ్జన కెనువర్ణమును లాట్టునకుఁ బ్రథమపురుషైకవచనమున నగు డుజ్జునకు నువర్ణమును నాదేశములగును. ఆదేశమనఁగా నొకదానిం ద్రోసి వేఱొకటి దానిస్థానమున నగుటయని ముందె యుక్తము. డుజ్జు 9 చేఁ బ్రథమపురుషైకవచనమున నగు ననుట తెల్లము. “వండు + డుజ్ = వండు + ఎను = వండెను. వండు + డుజ్ = వండు + ను = వండును.” తక్కిన పురుషవచనములందు మీఁదివిధుల ననుసరించి కార్యాంతరములు గలుగుటను గమనించునది. ఆధునికప్రయోగములందె నువర్ణము ‘అను’ రూపమునంది ‘అయను, పోయను’ అనురీతి నగపడెడి. అవి వ్యావహారికము లగుట నగ్రాహ్యములు. ‘ప్రథమైకస్యైద్భవేచ్చ భూతార్థే’ అనునది మూలము.

## భూతంబునం దిగాగమంబగు. ౧౭.

భూతార్థవృత్తియగుధాతువున కిగాగమంబగు.

టీ. భూతకాలికావ్యాపారమును బోధించుధాతువునకుఁ దుదిని హ్రస్వేకారమగునని సూత్రార్థము. ‘వండు + రు = వండి + రు = వండిరి.’ ‘రు’ అనునది క్రియావిభక్తి యగుటను నికారముమీఁది దగుటను దత్సమము 26 చే నిత్యముగలిగి రివర్ణముగా మాఱుటను గమనించునది. ప్రథమపురుషమున నె నువర్ణమును విధించుటంజేసి యీయిత్వము ప్రథమపురుషబహువచనము మొదలుకొనియె యగును. మఱియుం భూతార్థవృత్తి యగుధాతువునకను సామాన్యోక్తిం జేసి 41 చే నగు నవర్ణకమును 46 చేఁ గ్త్వపదర్థమున నగు నవర్ణకమును బరమగుచుండ నిత్యముగలుగుట ప్రయోజనముగ నూహించునది. వండుధాతువు. 19 చేఁ బ్రథమపురుషైకవచనమున డుజ్జును దానికి 16 చే నెనువర్ణ

మును నపదాదిస్వరసంధియుఁ గలుగ వండెననురూప మేర్పడును. వండు:—దీనిమీఁద 19 చే ప్రథమపురుషబహువచనమున రువర్ణకమును 17 చే ధాతువుతుదినిత్వమును దత్సమము 26 చే రువర్ణకమునుత్వమున కిత్వమును గలుగ 'వండిరి' అనురూపము సిద్ధించును. మధ్యమోత్తమపురుషములం దేకవచనబహువచనముల ప్రక్రియను దరువాతి సూత్రము ననుసరించి గమనించునది. 'ఇక్' అనునది కకార మిత్తుగాఁగల ప్రత్యయము గాన నిది నిర్దిష్టమున కంతాగమముగ నగుననుట స్పష్టము. 'భూతాదుతాం పరేషామిత్' అనునది మూలము.

లిట్టు వుఙ్ఞు పరంబగునపుడు తివర్ణకంబగు. ౧౮.

ఇకారంబుమీఁది కు-ను-వు-క్రియావిభక్తుల యనుసూత్రముచే రుఙ్ఞున కిత్వంబు-ప్ర. వండెను-వండిరి. మ. వండితివి-వండితిరి. ఉ. వండితిని - వండితిమి.

టీ. లిణ్మధ్యమోత్తమపురుషైకవచనబహువచనములు పరముగా ధాతువునకుఁ దుదిని 'తి' అనువర్ణము చేరునని సూత్రాభిప్రాయము. లకారాదేశములగు డు ఋ వురును ముఙ్ఞునువానిలో మొదటి డుఙ్ఞును విడిచి దానితరువాతనుండు వువర్ణకమును దుదినున్న 'ఞ్' అనుదానితోఁ జేర్చి 'వుఞ్' అని చెప్పఁబడియెఁగాన 'వు-రు-ను-ము' అనునవి వుఞ్ ప్రత్యాహారమునఁ జేరెడిఁగాన లిణ్మధ్యమోత్తమపురుషైకవచనబహువచనములు పరముగానని ఫలితము తేలెడి. వండు + వు:—17 చే ఇగాగమము 'వండి-వు.' 18 చే తివర్ణకము. 'వండితి+వు' తత్సమము 26 చే వువర్ణమునుత్వమున కిత్వము. వండితివి. ఇట్లే 'వండు+రు=వండి+రు=వండితి+రు=వండితిరి; వండు+ను=వండి+ను=వండితి+ను=వండితిని; వండు + ము=వండి+ము=వండితి+ము=వండితిమి' అనురూపముల ప్రక్రియను గమనించునది. కొందఱు మధ్యమపురుషబహువచనస్థానమునఁ బ్రథమపురుషబహువచనమును (వండిరి) తివర్ణమగుటను గమనింపక ప్రయోగించుట కలదు. ప్రథమ మధ్యమపురుషములలోఁ బ్రథమపురుషబహువచనమునఁ దివర్ణాభావమును మధ్యమపురుషబహువచనమునఁ దివర్ణము గలిగి యుండుటయును బోసఁగెడిఁగాన నీ భేదమును బాలకులు శ్రద్ధగ గమనింపవలయును. 'దుతివర్ణకౌ క్రమాత్ స్తః, సాద్యస్యాదేః ద్వయోశ్చభూతార్థే' అనునది మూలము.

కలజ్యనుబంధంబు లృట్టు పరంబగునపుడగు. ౧౯.

లృట్టు పరంబగునపుడు ధాతువునకు - కలజి - అనునది యను ప్రయుక్తంబగు

టీ. 'కలజి' అనునది ల్ృట్టు పరముగా ధాతువుతుదిని జేర్పఁబడునని సూత్రాభిప్రాయము. అన్నిపురుషముల నిది యగునని భావము.

జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు. ౨౦.

జీత్తు పరంబగునపుడు ధాతువునుత్వంబున కత్వంబగు.

టీ. 'జి' అనునది పోవుప్రత్యయము జీత్తు నాఁబడును. 'జి+ఇత్=జీత్' అని వ్యుత్పత్తి. కార్యార్థము ప్రత్యయాదులందు మానంబడు వర్ణ మిత్తు నాఁబడునని ముందె యుక్తము. అట్టి 'జి' అనునది మానంబడుప్రత్యయము పరముగా ధాతువుతుదియుత్వమునకు హ్రస్వాకార మాదేశమగునని సూత్రార్థము. జీత్తనుటంజేసి యిత్వముతోఁ గూడిన జకారము గల ప్రత్యయము పరమగునపుడే యీయత్వమగుంగాని జిత్తనఁగా (జ్-ఇత్తు) జకారమాత్రముగల ప్రత్యయము (డుజ్) పరమగునపుడు గాదని తెలియు నది. 'వ్యతిరేకాదౌ భావిని చాత్స్యాత్' అనునది మూలము.

కలజిపడుజులు పరంబులగునపుడు నుగాగమంబగు. ౨౧.

ద్రుతకార్యంబు. ప్ర. వండఁగలఁడు-వండఁగలరు-వండఁగలదు-వండఁగలవు. మ వండఁగలవు - వండఁగలరు. ఉ. వండఁగలను-వండఁగలము.

టీ. 19 చేఁ గలజి యగును. 49 చేఁ బడుజి యగును. పైరెండనుబంధములు పరముగా ధాతువున కంతాగమముగ నువర్ణమగునని సూత్రార్థము. ఇది యాగమ నువర్ణముగాన దీనికి ద్రుతసంజ్ఞయు ద్రుతకార్యములును నగును. వండు+డుజ్:— వండు+ఁడు.' 19 చేఁ గలజియు 20 చే ధాతువునుత్వమున కత్వమును గలుగ 'వండ+కల+ఁడు' అని యుండు. పిదప నీవిధిచే నుగాగనుముగా 'వండను+కల+ఁడు' అని యగు పిదప సరళాదేశబింద్వాదిద్రుతకార్యములు గలుగ 'వండఁగలఁ'డిత్యాదిరూపము లేర్పడును. అమహదర్థమున డుబ్రులకు 12 చే డువులగుటను గమనించుచు 'వండఁగలదు; వండఁగలవు' మొదలగువానిని సాధించికొనునది. ఈనుగాగమవిధాన మనావశ్యకమనియు నుజ్యంతములమీఁదఁ గలఁడిత్యాది కలుగుధాతురూపములు చేరుటంజేసి పైరూపములుగలిగెననియు ముందె యుక్తము. నుక్కు కిత్తుగాన నంతాగమంబగు. 'అస్తి రనుబంధకస్సార్వద్యత్ర ల్ృడర్థో వివక్షితో ధాతోః' అనునది మూలము. ఈయనుబంధములఁ గూర్చివిమర్శకులయాశయములు నిరూపితములయ్యె.

లాట్టురుఙ్ఙు పరంబగునపుడు దుగాగమంబగు. ౨౨.

ప్ర. వండును - వండుదురు. మ. వండుదువు-వండుదురు. ఉ. వండుదును - వండుదుము. లాడర్థంబులయం దోలినుదాహరణంబులు వక్కాణించెద. తద్ధర్మంబు - కులాలుఁడు కుండలు వానును. తచ్ఛీలంబు - జ్వలనజ్వాలంబు లుప్పరం బెగయును. సంభావన - ఇప్పుడు వాఁడింట నుండును. సంప్రశ్నము - ఉందునా - పోదునా. సాతత్యము - సర్వంబునం దీశ్వరుఁ డుండును - సర్వంబీశ్వరునియందుండును. వర్తమానంబు - మేననిప్పుడుంబులకలువొడ మెడును. వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడుగాద్యాగమంబు లగు. భావి - వాఁడు ఱేపు వచ్చును. ఆశీస్సు - శుభంబగును. వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడును.

టీ. లాట్టు ప్రథమపురుషబహువచనము మొదలుకొని మిగిలిన మధ్యమోత్తమ పురుషైకవచనబహువచనములు పరముగా ధాతువున కంతాగమముగ దువర్ణ మగును. దుకు్క కిత్తుగాన నంతమున కగుట తెల్లము. ప్రథమపురుషైకవచనమున మాత్ర మీయాగ మము గలుగదు. 'వండు+డుఙ్' ఇట లాడర్థమున డుఙ్జునకు 16 చే నువర్ణకము గలుగ 'వండును' అని ప్రథమపురుషైకవచనము సిద్ధించును. అమహాదర్థమున లాట్టునఁ బ్రథమ పురుషైకవచనరూపములే బహువచనమునను నగునని 25 సూత్రముచేఁ దెల్లమయ్యెడిఁ గాన నమహదర్థమున నేకత్వ బహుత్వములఁ బ్రథమపురుషైకవచనములే శరణ్యము లని గ్రహించునది. 23 చేఁ బక్షమున నెడు గెడిగాగమములు ప్రథమపురుషైకవచన మున నగుటను గమనించునది. తక్కిన పురుషవచనములందు దుగాగమముం గూర్చుచు రూపముల ప్రక్రియను గమనించికొనవలెను. 5 సూత్రమునందలి యాదిపదముచేఁ దచ్ఛీలాదులు గ్రాహ్యములని దానిక్రింద వివరింపఁబడియెఁ గానఁ దదనుసారముగ నిట నాక్రమము నే యనుసరించి యాయాయర్థముల నుదాహరణములు తద్ధర్మము మొదలు కొని యాక్రింది వివరణమునఁ జూపఁబడుచున్నవి. ఓలి ననఁగాఁ గ్రమముగా నని యర్థము. క్రమము 5 సూత్రముక్రింది వివరణము ననుసరించి గ్రాహ్యము. కర్తననుస రించి యాయాపురుషముల నేకవచన బహువచనము లగుట నూహించునది. కుండలు వానుట కుమ్మరికి సహజధర్మముగాన వానుధాతువునకు లాడర్థములలోఁ దద్ధర్మమునఁ జైని సాధించిన ప్రకారము 'వానును' అను రూపము గలిగి తద్ధర్మార్థప్రకాశకమయ్యె.

అగ్నిజ్వాలలును మింటినంటుట సహజస్వభావము. అనఁగా మీఁదుగాఁ బోవుట. కాన సెగయుధాతు వెగయునను రూపమునంది యగ్నిజ్వాలల సహజశీలమును వెల్లడించున దయ్యెఁగానఁ దచ్ఛీలమున నగు లాడ్రూపమిది యయ్యెనని తెలియఁనది. ఇపుడు వాఁడింట నుండును. ఇట 'నుండు'ననునది యుండవచ్చునను వక్తయొక్క యూహను దెలిపెడిఁగాన నిది లాడర్థములలో సంభావన కుదాహరణమయ్యె. 'ఉందునా? పోదునా?':—ఇట నీరెండు రూపములు వక్తయొక్క సంప్రశ్నమును దెలుపుచున్నవి గాన నివి లాడర్థములలో సంప్రశ్నమున కుదాహృతులయ్యె. సంప్రశ్నమనఁ బృచ్ఛ సేయుట అడుగుట. సర్వంబునం దీశ్వరుండుండును. ఇట ఉండుననునది యీశ్వరుని సర్వపదార్థ సతతవ్యాపిత్వమును బోధించుచున్నదిగాన నిది లాడర్థములలో సాతత్యమున కుదాహరణంబయ్యె. ఇట్లే తరువాతి యుదాహరణమున నుండుననునది యీశ్వరునియందు సర్వపదార్థములు సతతవ్యాప్తములై యుండుటను బోధించెడిఁగాన నదియుం సాతత్యమునకే యుదాహరణమయ్యెనని యెఱుంగునది. 'మేన నిప్పుడుం బులకలు పొడమెడి':—ఇటఁ బొడమెడి ననునది వర్తమానమునను బులకలు పుట్టుటను బోధించుచున్నది గాన నిది లాడర్థములలో వర్తమానమున కుదాహరణంబయ్యె. ఈయుదాహృతికి ముందెల్ల యుదాహరణములను నాయాయర్థములలోఁ గేవలము నువర్ణముతోడనే చూపి వర్తమానమున మాత్రము పొడమెడినని యెడివర్ణముంగూర్చి యుదాహరించుటకుఁ గతమేమని పాఠకులు శంకింతురేమో యని యనుమానించి సూరి తఱచుగ వర్తమానమున 23 చే నెడుగెడిగాగమములు గలుగుట ప్రయోగదృష్టముగాన నెడిగాగమముం గూర్చిన రూపమే వర్తమానమున కుదాహరణముగఁ జూపఁబడెనని వక్ష్యమాణవిధిచేనను వివరణరూపమైన సమాధానమును వ్రాసినవాఁడని యెన్నునది. వివరణమునఁ బ్రాయికముగ ననుటంజేసి యెడుగెడిగాగమములఁ బొందకున్నను నొక్కొకచో వర్తమానార్థమునకు భంగము గలుగదని గ్రహించునది. తఱచుగ మాత్రము నెడుగెడిగాగమములతోఁ గూడియే వర్తమానార్థప్రకాశకములగుట గన్పట్టునని కర్తృహృదయము. 'వాఁడు ఱేపు వచ్చును':—ఇట వచ్చుననునది రాఁగలఁడను నర్థమును బోధించెడిఁగాన నిది లాడర్థములలో భావి కుదాహరణమయ్యె. 'శుభంబగును':—ఇట నగుననునది 'అగుఁగాక అగుత' అను నర్థములం దెలుపుచు నాశీర్వాదమును బోధించెడిఁగాన నిది లాడర్థములలో నాశీస్సున కుదాహరణంబయ్యె. పైని పేర్కొనిన యర్థములందేగాక అను-పలుకు-చెప్పు-ఆడు అను మొదలగు వచ్యర్థములకు భూతార్థబోధకములగునపుడు మాత్రము లాట్ప్రథమపురుషైకవచనము కవిప్రయుక్తమై యగపడుచున్నదని యీ క్రిందివివరణమున కభిప్రాయము. 'అన నతఁ డిట్లనుక్—' ఇట నను ననుదాని కనెనని

యర్థము గాన వచ్యర్థకమగు వనుధాతువు భూతకాలికవ్యాపారబోధకముగ లాట్ప్రథమపురుషైకవచనమునఁ బ్రయుక్తమయ్యెనని యుదాహరణముగ గ్రహించునది. భూతార్థమున మాత్రమే వచ్యర్థములకు లాట్ప్రయోగము ప్రయోగదృష్టము గాని తక్కుంగల యర్థముల యథాసంభవముగనే యాయా లకారములును రూపాంతరములును సిద్ధించునని గ్రహించునది. కాన వచ్యర్థభూతమును దద్ధర్మాదులలో నొకటిగ లెక్కింపవలసియుండునని యాక్రింది సూరివివరణమున కభిప్రాయముగ గ్రహింపనగును. పైయుదాహరణములం దాయాయర్థవిశేషములు కర్తృపదములయుఁ, బూర్వోత్తర పదములయు, మేళనమునంజేసి ప్రకాశితములగుటను నట్టి కర్తృపదములయుఁ బూర్వోత్తరపదములయుఁ బ్రయోగము లేనపు డట్టి యర్థవిశేషములు స్ఫురింపమిని గేవల ధాతురూపముచే నట్టి యర్థములు బోధింపఁబడుచున్నవా యనుశంక గలుగనగుంగాని. యాయాకర్త్రాదులకు సంబంధించిన విషయమునే బోధించునవిగ యాయావాని నంగీకరింపకతీరదు, గాన నాయారూపము లాయాయర్థవిశేషములఁ దెల్పునవిగనె లక్షణకర్త తలంచి యుండునని తోఁచెడి. 'దుతివర్ణకాక్రమాత్ స్తః; నాద్యస్యాదేః' అనునది మూలము.

**లాట్టునుజ్ఞు పరంబగునపు డెదగాగమంబును బ్రథమనువర్ణకంబు పరంబగునపు డెడుగెడిగాగమంబులును బహుళంబుగానగు. ౨౩.**

ప్ర. వండెదును-వండెడిని-వండెదరు. మ. వండెదవు-వండెదరు. ఉ. వండెదను-వండెదము

టీ. లాట్ప్రథమపురుష బహువచనమును మధ్యమోత్తమపురుషైకవచన బహువచనములును బరమగునపుడు 'ఎద' అనునదియుఁ బ్రథమపురుషైకవచనమున మాత్రము 16 చే డుజ్వర్ణకమున కాదేశమైన నువర్ణము పరముగా 'ఎడు-ఎడు' అనునవియుం బహుళముగ నాగమములుగ నగునని సూత్రార్థము. 8 సూత్రము ననుసరించి రువర్ణమును దుది పొల్లు ఇకారముతోఁ గూర్చుటంజేసి రుజ్ఞు సంజ్ఞ గలిగెననుట స్పష్టము. వండు:—లాట్టు ప్రథమపురుషైకవచనమున డుజ్వర్ణకము. దానికి 8 చే నువర్ణము. వండు + ను. అది పరముగా 'ఎడు' అనునదాగమముగనైన 'వండు + ఎడు-ను=వండెడును' అనియు 'ఎడి' అనునదాగమముగ నీవిధిచేనైన 'వండు + ఎడి + ను' అని యై తత్సమము 26 చే నువర్ణమునుత్వమున కిత్వము గలుగ 'వండెడిని' అనియుం రూపము లేర్పడును. ఎడుగెడిగాగమములు కిత్తులగుట నవి ధాతువున కంతాగమములుగ నగుట స్పష్టము. ఎడుగెడిగాగమములు రెండును బహుళములగుటఁగానిపక్షమున 8 చే నువర్ణము

నిత్యముగ నగుగాన 'వండును' అను రూపమగుననుట స్పష్టము. ప్రథమపురుషైకవచనము నుండియుం 'ఎద' అనునదాగమముగ నగుంగాన 'వండు + రు=వండు + ఎద=వండెదరు' అను మొదలగు రూపము లేర్పడుట నూహించికొనునది. 'ఎదు' 'ఎడి' గాగమములును 'ఎద' గాగమమును బరమగునపు డపదాదిస్వరసంధికి నిత్యప్రవృత్తి నూహించికొనునది. దుష్ప్రత్యాహారస్థమగు నువర్ణమునకును (ఉత్తమపురుషైకవచనము) నీయాగమము గలుగుట గల్గెడిఁగాన సామాన్యముగ నువర్ణమున కనక ప్రథమనువర్ణక మనవలసివచ్చె నని గ్రహించునది. ఆంధ్రశబ్దచింతామణి సాధారణముగఁ దత్సమప్రక్రియామాత్ర పరము. తత్సమధాతువు లెడి గెడుగాగమములతోడను దుగాగమముతోడను నన్నయ భారతభాగమునఁ జూపట్టుటరుదు. దేశ్యధాతువు లీయాగమములతోడఁ జూపట్టు. కాని యీయాగమములతోఁగూడిన ధాతురూపములు కాలనియమము లేక ధాత్వర్థ మాత్రమున మాత్రమే నన్నయభారతభాగమున నగపడెడివి. సందర్భము ననుసరించి మాత్రమే యేతదాగమాంతములకుఁ గాలనియమమం దూహింపవలసియున్నది. త్రికాల ముల వానియుపయోగము గాననగును. (చూ. చి. విమ. ప. 58-64) కేతన విన్న కోటిపెద్దన మొదలగు ప్రాచీనలాక్షణికులు 'ఏడు-ఎడి-ఎద' అను ప్రత్యయములతోడి రూపములు వర్తమానార్థకములనియు దుగాగమములతోడి రూపములు భవిష్యదర్థకము లనియుఁ దెల్పుట ప్రాచీనపద్ధతికి విరుద్ధవిషయము. దీనఁ గేతనాదులకు విలక్షణముగ నున్న కలానుబంధయుక్తరూపములఁ జింతామణి వర్తమానభావ్యర్థకములుగఁ దెల్పుటం జేసి నవీనమను కం. వీ. పంతులుగారివాద మగ్రాహ్యమయ్యెడి. పైసందర్భమువలన నేతదాగమాంతములకుఁ గాలనియమములేక ధాత్వర్థమాత్రముననే యుపయోగము ప్రాచీనమున గాననగుటచేఁ గావలయు నథర్వణుఁ డెదగాగముతోడి రూపములకు 'భావి క్రియాసు యస్య స్యాదేత్వమేవ ప్రయోగతః' అని భావ్యర్థకతను సమ్మతించి చెప్పి నాఁడు. మఱియుఁ బరిశీలింప నథర్వణుఁ డిట్లనుట 'పోయెద'- మొదలగువానియం దెకా రము వ్యవహారమున 'పోయద' అనురీతి నత్వముగ వినఁబడుచుండుటంజేసి, యట్లు పరిష్కరించెననియు విశ్వసింపనగును. నాఁడును నేఁడును దు గెద గాఁగమాంతరూప ములకుఁ గాలనియమము తోఁపదనుట సాహసముగాదు.

### లిఙ్లోట్టులవకారంబునకు లోపంబు విభాషనగు. ౨౮.

వండితి-వండితివి. వండుదు-వండుదువు. వండెదవు-వండెదు.

టీ. లిఙ్లోట్టులకు సంబంధించిన మధ్యమపురుషైకవచన ప్రత్యయమగు వకార మునకు లోపము వికల్పముగ నగునని యర్థము. 'వండితివి' ఇందు వకారము లోపింప

'వండిలి-ఇ' అని యుండ నపదాదిస్వరసంధిచే 'వండిలి' అని యగు. వకారముః లోపింపకున్న 'వండితివి' అని యగు. ఇట్లె 'వండుదువు' అనునపుడు వకార మీవిధిచే లోపింప 'వండుదు+ఉ' అని యుండ నపదాదిస్వరసంధిచే 'వండుదు' అని యగును. ఈరీతినె 'వండెదవు = వండెద+ఉ = వండెదు.' అని దాని ప్రక్రియను గమనించు నది. ఇందు వకారముమీఁది అకార ముచ్చారణార్థము గాన పొల్లు వకారము మాత్రమే లోపించునని గ్రహించునది. అచ్చుతోఁడి వకారమే లోపించునని యర్థముచేసిన నెదగాగమాంతరూపములకు మధ్యమపురుషైకవచనమున నెదయందలి దకార మత్వవిశిష్టమగుటచే 'వండెదు' అనిరీతి నుత్వాంత మైనరూపములు గలుగ నవకాశములేమి నట్లన వీలులేదనియు వకారవ్యంజనము మాత్రమే లోపించుననియుం ననక తీరదని గ్రహించునది. 'వండితి' అనునది లిట్టునకును 'వండుదు-వండెదు' అను నది లాట్టునకును నుదాహరణములనుట పూర్వోక్తప్రక్రియజ్ఞులకుఁ దెల్లంబ. లిడ్లాట్టుల మధ్యమపురుషసిద్ధరూపములందుఁ దుదిఁదోఁచువకారము పొల్లుమాత్రము లోపించునని ఫలితము నెన్నునది.

## తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిడ్లాట్టుల ప్రథమ బహువచనంబున కేకవచనంబగు. ౨౫.

చిలుకలు పలికెను - చిలుకలు పలుకును - చిలుకలు పలికెడును.

మేఘములు గర్జిల్లెను- మేఘములు గర్జిల్లును - మేఘములు గర్జిల్లెడును.

టీ. తిర్యక్కులు జడములును క్రియచే బోధ్యములగునపుడు లిడ్లాట్టుల ప్రథమ పురుషబహువచనమునకు బదులుగ నేకవచనమే నిత్యముగ నగునని సూత్రార్థము. తిర్య గ్జడకర్తృకములగు క్రియలకు లిడ్లాట్టులఁ బ్రథమపురుషమున నేకవచనమే గాని బహువచన మమరదని భావము. తిర్యక్కులనఁ బశుపక్ష్యాదులనియుం జడములన నచేత నములనియుం ముందె యుక్తము. అమహత్సంజ్ఞను స్త్రీలును జేరుదురుగాన సామాన్య ముగ నమహత్తనక తిర్యగ్జడములని విశేషించి తెల్పెనని గ్రహించునది. చిలుకలు పలి కెను:—ఇటఁ బలికెననుదానికిఁ జిలుకలు కర్తలగుట నద్దానిచేఁ దిర్యక్కులగు చిలుకలు వాచ్యములగుచున్నవనియుఁ గానఁ బలికినవని బహువచనమగుటకు బదులుగఁ బలికెనని యేకవచనమే యయ్యెనని గ్రహింపవలెను. లాట్ప్రథమపురుషైకవచనమున నెడుగెడిగా గమములచేతను, వానిరామిచేతను రూపత్రయ మేర్పడునుగాన నాయపక్షత్రయమం నను నేకవచనరూపమే గాని బహువచనరూపము పొసఁగదని సూచింప నువర్ణాంతమగు పలుకుననురూపమును నెడుగంతమగు పలికెడుననురూపమును నుదాహృతములయ్యె.

ఇది దేశ్యాదేశ్యక్రియారూపసాధారణమని తెలుపను ముఖ్యముగ నచేతనవాచ్యతను ప్రకటింపను గర్జించె నిత్యాదు లుదాహృతములని తలంపవలెను. 'గర్జించినవి-పలికినవి' అనురీతి రూపములు తిర్యగ్జడకర్తృకములు 'గర్జించిన-పలికిన' అను భూతకాలికవిశేషణములమీఁద నవిశబ్దము చేరుటచే నైనవనుట స్పష్టము. అమహత్తులలోఁ స్త్రీలిందుఁ జేరమినిఁ దత్కర్తృకములు ఆచ్ఛికము 26 విధిం జేసి మహత్కర్తృకము లగునపుడు వలెనే 'పలికిరి-పలుకుదురు' అనురీతి నుండునని యూహింపవలెను.

## లూట్టుడుఙ్ఙున కెడుతవర్ణంబులు ద్రుతాంతంబులగు. ౨౬.

ఆశీస్సు. మీకు మేలుగలిగెడును - మీకు మేలుగలుగుతను.
శాపంబు. నీకు రాక్షసత్వంబు గలిగెడును-నీకు రాక్షసత్వంబు గలుగుతను.
సంప్రార్థనంబు. హరిననుఁ గృపఁగాంచెడును-హరిననుఁగృపఁగాంచుతను.

టీ. లూట్టు ప్రథమమధ్యమోత్తమపురుషైకవచనబహువచనములకు 'ఎడు-త'అను ప్రత్యయములు ద్రుతము తుదిని గలవి యాదేశము లగును. 'మీకు మేలు గలిగెడును':—ఇట మీకు మేలు గలుగుఁగాకను నాశీర్వాదము స్పష్టపడుచున్నదిగానఁ గలుగుధాతు లూట్టు డుఙ్ఙునకు 'ను'అనునదంతమందుఁ గల 'ఎడు' అనునది యాదేశముగా 'కలుగు = ఎడును = కలిగెడును'అనురూపమేర్పడెను. ఇట్లే యీవిధిచే ద్రుతముతుదిని గలతవర్ణ(తను)మాదేశముగా 'కలుగు + తను=కలుగుతను' అనురూపమగును. 'నీకు రాక్షసత్వము గలిగెడును':—ఈవాక్యము శాపమును బోధించుచున్నదిగాన నిటఁ గలుగుధాతువునకు శాపార్థమున లూట్టనుదాని డుఙ్ఙున కెడువర్ణంబు ద్రుతమంతమందుఁ గలదియంనాదేశముగా 'కలుగు = ఎడును = కలిగెడును' అనురూపమగును. ఈగతినే ద్రుతాంతతవర్ణమైన 'కలుగు + తను=కలుగుతను' అని యగును. 'హరి ననుఁ గృప గాంచెడును; కాంచుతను' తన్ను హరి రక్షించుఁగాకని వేఁడుకొనువాఁడుఁగాన సంప్రార్థనమునఁ గలుగుధాతువున కిట నెడుతవర్ణములు ద్రుతాంతములు గలిగె. ఆశీశ్శాపసంప్రార్థనముల లూట్టునందు డుఙ్ఙున కెడుతవర్ణము లాదేశించుటంజేసి యితరతిఙ్ప్రత్యయములతోడి రూపము లిందుఁ గన్పట్టవని గ్రహించునది.

## విధియందు లూట్టునకు మాఱుగా నదియనుతచ్ఛబ్దంబును ముందు నుగాగమంబునగు. ౨౭.

మైత్రుండు నానిర్దిష్టకార్యంబు చేయునది - వానికి నీవు బాసటయయి యుండునది.

టీ. విధి యనఁ దన సేవకులు మొదలగు లోఁగినవారి నాయాయాకార్యములందుఁ బ్రవర్తించునట్లు చేయుట. ఆశీశ్శాపసంప్రార్థనములందుఁ బూర్వసూత్రముచే దుఙ్ఞాన కెడుతవర్ణవములు విధింపఁబడినవి. ఇఁక మిగిలిన విధియందు 'అది' అను తచ్ఛబ్దామహా దేకవచనరూపము లూట్టునకు బదులుగ విధింపఁబడుచున్నది. లూట్టునకనుసామాన్యోక్తిం జేసి లూట్ప్రథమమధ్యమోత్తమైకవచనబహువచనములకు నదిశబ్ద మాదేశమగునని గ్రహించునది. కాఁగా లూట్టునకు బదులుగ నదిశబ్దమును నది పరముగా ధాత్వంతో కార మునకు నుగాగమమును నగునని సూత్రార్థము తేలినది. ఇంచుగాగమసంబంధమున నేమి సహా జో కారాంతత నేమి ధాతువులుదంతములై యయ్యెడిఁగాన నుగాగమవిధానము సార్థకము. 'చేయునది':—శిష్యక మైత్రుఁ డీనిర్దేశించిన కార్యమును జేయవలెనను స్వామిశాసనము వెల్లడియగుచున్నది గానఁ జేయుధాతువుమీఁది లూట్టున కదిశబ్దమును నది పరముగా ధాత్వంతమున 'ను' అనునదాగమముగ నగుటయు నీవిధిచేఁ గుదిరి 'చేఁయు+అది = చేయున్+అది=చేయునది' అనురూపమేర్పడెను. 'ఉండును':—నీవు వానికి సహాయుఁ డవై యుండవలెనను స్వామివిధి వెల్లడియగుచున్నదిగాన, నిట నుండుధాతు లూట్టున కదిశబ్దమును నది పరముగా నుగాగమమును నై 'ఉండు + నది = ఉండు+న్ + అది = ఉండునది' అనురూపమేర్పడెను. పరికింప నిట్లు నుగాగమమును లూట్టున కదిశబ్దాదేశ మును విధించుటకంటె 'చేయును - ఉండును' మొదలగువానిమీద నదిశబ్దము చేరి విధ్యర్థ బోధకతను వానికిఁ గూర్చుననుట సరసమని తోఁచెడి. ఇందులకు 'తద్ధర్మప్రథమైకార్థ వాచకాద్ధి క్రియాపదాత్, అదిశబ్దప్రయోగస్స్యాద్విశేషార్థీ నిరీక్షతే' అనునాథర్వణము ప్రమాణము. కావునఁ బైనాథర్వణమే దీనికి మూలమనఁదగును. సూరి విధ్యర్థమును లూడర్థముగా సమ్మతించినవాఁడగుట నట్లు మాని యిట్లనెనని యెన్నునది. నుక్కకార రము వోప్రత్యయముగాన ధాత్వంతమున కగుననుట స్పష్టము. మఱియు 29 సూత్రము ననుసరించి రెండవయుదాహరణము మధ్యమపురుషార్థ వాచక మగుటంజేసి 'బాస టయై యుండుము' అనియు రూపాంతర మేర్పడ నగునని గ్రహించునది. ఇట్లే 'మీరుత్తరముల నొసంగునది.' మొదలగు నుదాహరణములకును నొసంగుఁడనురూపాంత రము 29 చే సిద్ధించుటను మఱువరాదు. విధియందెడుతలు గావనుట 27-29 లను బట్టి తెల్లము.

ఎడుతలద్రుతంబున కచ్చు పరంబగునప్పుడు మకారంబగు. ౨౮.

నీకు మేలుగలిగెడుమనియెను - నీకు మేలుగలుగుతమనియెను.

టీ 26 చే విధింపఁబడిన ద్రుతాంతములైన 'ఎడుత' అనువాని ద్రుతమున

కచ్చు పరమగునపు డాద్రుతమునకు మకార మాదేశమగునని సూత్రార్థము. 'ఎడు-త' అనునవి యాశీశ్శాపసంప్రార్థనములం దగునను టస్పష్టము. 'కలిగెడున్+అనియె' ఆశీరర్థమునవైన యెడువర్ణము తుదిద్రుతమున కీవిధిచే మకారము రా 'కలిగెడు+మ్+అనియె=కలిగెడుమనియె.' ఇట్లే తవర్ణముయొక్క ద్రుతమునకును మకారంబగుటను గమనించునది. (కలుగుతన్+అనియె=కలుగుతమ్+అనియె = కలుగుతమనియె) ఆశీరర్థమున నుదాహృతమైనను శాపసంప్రార్థనములందును నీవిధి గలుగనగునని గ్రహింపఁదగు. తొల్లిటి భాషనివి 'కలుగెడుమ-కలుగుతమ' అనురీతి నకారవిశిష్టమకారముతుది గలిగియుండెడివనియు మకారము కాలక్రమమున నకారముగాఁ బరిణామమునంద నానంతర వ్యాకర్తలు ద్రుతాంతములుగఁ దీర్మానించుచు వానిద్రుతమునకు మకారమును విధించిరనియు భాషాచరిత్రదృష్టిని గొందఱందురు.

## లూణ్మధ్యమ పురులకు ముడుజ్జులగు. ౭౯.

ఆశీస్సు. దీర్ఘాయువగుము - దీర్ఘాయులరగుఁడు. శాపంబు. రాక్షసుఁడవగుము - రాక్షసులరగుఁడు. సంప్రార్థనంబు. నన్ను రక్షింపుము - నన్ను రక్షింపుఁడు. విధి. నాచెప్పినపనిచేయుము - నాచెప్పిన పని చేయుఁడు.

టీ. లూణ్మధ్యమపురుషైకవచనబహువచనప్రత్యయములగు 'వు-రు' అనువానిలో వువర్ణమునకు ముపర్ణమును రువర్ణకమునకు డుజ్వర్ణమును నాదేశములగునని భావము. ముడుజ్జులగునని నిత్యముగ శాసించుటంజేసి 27 చే నగు నదిశబ్దమున కిది బాధకమని తోఁపనగుంగాన ముజ్జులును నగునని సముచ్చయార్థము ప్రకాశితమగునటుల సూత్రించుట తగు. 27 చే నదిశబ్దము పూర్వము విధింపఁబడెనుగానఁ దదభావమునసె యీవిధియని పాఠకలోకము గ్రహించెడిననునాశయముతోఁడఁ గావలయుఁ సూరి యిట్లు సూత్రించి యుండునుగాని యదియు నిదియు నిత్యవిధానములవలెనే యగపడుచుండుటంజేసి స్పష్టార్థము ముడుజ్జులును నని యనుట సరసము. ఇందులకు విధియందు 'నాచెప్పినపనిచేయుము-చేయుఁడు' అని యుదాహరించుట ప్రమాణము. మఱియు నట్లనకున్న 'నీవు బాసటవై యుండున'దని యుదాహరించుటయు నసంగతమగు. 'అగుము':—ఇట నాశీరర్థమున నగుధాతు లూణ్మధ్యమైకవచనవువర్ణకమునకు ముపర్ణమీవిధిచేఁ గా '(అగు+వు=అగు+ము=) అగుము' అనురూపము సిద్ధించె. ఇట్లే లూణ్మధ్యమబహువచనప్రత్యయ రువర్ణకమునకు డుజ్వర్ణముగా (అగు+రు = అగుఁ+డు)= 'అగుఁడు' అనురూపము గలిగె. 96 చే వీనికగురూపాంతరముల గమనించునది. డుజ్జనుట

బిందువును ఘటించుటకొఱకనుట స్పష్టము. ఇట్లే శాపసంప్రార్థనవిధులం దాయాధాతువులమీఁద వురులకు ముడుఁజు లగుటను గమనించుచు రూపముల గ్రహించునది. విధ్యర్థమునఁ గాక తక్కినయాశీశ్శాపసంప్రార్థనముల నెడు తవర్ణములును గలుగనగుననియుఁ గాన 'నీవు దీర్ఘాయువ వయ్యెడున్; నీవు దీర్ఘాయువ వగుతన్' అను మొదలగురూపములును నుండునని గ్రహించునది. కేవల తుమన్నంతము చేతను గూడ శాపార్థమును బ్రకటించుట వసుచరిత్రకాలమునుండియుఁ జూపట్టెడి. 'ధూళిపాలుగాన్-ధూళిపాలగుఁగాక. అగుత-అయ్యెడి.' అని దీనియర్థము.

ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు. 30.

మనము వండుదము.

జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగునను సూత్రముచే లజీపరంబగునపు డత్వంబు. ప్ర. వండెఁడు - వండరు - వండదు - వండవు. మ. వండవు - వండరు. ఉ. వండను - వండము.

టీ. ఉభయప్రార్థనము తానెదుట నున్నవానిని దాఁజేయుపనియందు సహాయునిఁ గమ్మని వేఁడి గలిపికొనుట. అనఁగా నొకవ్యాపారమున కిరువురు కర్తలగుట యని భావము. 'మనము' అనఁగా నీవును నేనును కర్తలగునపుడు 22 చే లాట్టు రుఙ్గుపరమగునపుడగు దుగాగమము నుత్వమున కత్వ మాదేశమగునని సూత్రార్థము. సంప్రార్థనము లాదర్థములలో నొకటి యని ముందె యుక్తము. అది యుభయప్రార్థనరూపమయ్యెనేని దుగాగమదువర్ణము దకారముగ మాఱునని భావము ఫలించెడి. 'వండుదుము' అనియే యీవిధిచే నత్వము రానిపక్షమున నగుంగాన నత్వ మీవిధిచే విధించి 'వండుదము' అని సాధించె. నీవును నేనునుగలిసి వంటఁజేయుదమని భావము. ఇంతవఱకు లజీకుదాహృతులు జూపలేదుగాన నీక్రింద గ్రంథకర్త యుదాహరణముల నొసంగుచున్నాఁడు. 20 చే ధాతువుతుదినున్న యుకార మకారమగుంగాన వండెఁడు మున్నగు రూపము లేర్పడునని యీక్రిందిసూరివివరణమున కభిప్రాయము. లజీయందుఁ గ్రమముగఁ బ్రథమమధ్యమోత్తమైకవచనబహువచనము లుదాహృతములు. ధాతువుతుది యుత్వమత్వరూపముం దాల్చు విశేషమే గాని యితరమగు ప్రక్రియావిశేష మిందుఁ జూపట్టమిఁ బ్రక్రియాప్రదర్శనము త్యక్తము. 'వండదు-వండవు' అనునవి యమహత్కర్తృకములుగాన 12 చే దువులు గలిగెననుట స్పష్టము.

## మధ్యమ ముడుజ్లులు ముజ్లు నాఁబడు. ౩౧.

టీ. మధ్యమపురుషైకవచనబహువచనములందు 29 చే నగు 'ము-డుజ్' అను వానికి ముజ్లని సంజ్ఞ. ముపర్ణమును 'డుజ్' అనుదానియందలి తుదిపొల్లు 'జ్' అను దానితోఁ గూర్చుటంజేసి యీసంజ్ఞ సిద్ధించెననుట స్పష్టము. 'డుఞ్లు-రుఞ్లు' మొదలగు సంజ్ఞలు ముందు చేయఁబడినవి. వానివలెనే యిదియు నొకసంజ్ఞ యని గ్రహించు నది.

## వ్యతిరేకంబున ముజ్లు పరంబగునపుడు కుజి యగు. ౩౨.

నీవు వండకుము - మీరు వండకుఁడు.

టీ. వ్యతిరేకమున ననఁగా లజియందు మధ్యమపురుషైకవచనబహువచన ప్రత్యయములు 'ము-డు' అనునవి పరముగా 'కుజి' అను ప్రత్యయమగును. 'కుజి' అనునది జిత్తుగాఁ జేయుటకు 20 చే ధాతువుతుది యుత్వమత్వ మగుటయే ప్రయోజన మనుట స్పష్టము. జిత్తనఁగా 'జి' అనునది పోవుప్రత్యయమని ముందే యుక్తము. 'వండకుము' వండుధాతువునకు లజి మధ్యమపురుషైకవచనమున 29 చే ముపర్ణకము నది పరముగా నీవిధిచే కుజియు నది పరముగా 20 చే ధాత్వంతోకారమున కత్వమును గలిగి పైరూపము సిద్ధించె. ఇట్లే 'వండకుఁడు' అనురూపము ప్రక్రియ నరయునది.

## సంప్రార్థనంబుల ముజ్లున కదాదులు విభాష నను ప్రయుక్తంబులగు. ౩౩.

వండుమ - వండుమా - వండుమి - వండుమీ - వండుఁడ - వండుఁడా - వండుఁడి - వండుఁడీ. అ-ఆ-ఇ-ఈ-ఎ-ఏ-ఒ-ఓ-అమ్మ-అయ్య-ఇత్యాదు లదాదులు.

టీ. సంప్రార్థనమున 'ము-డుజ్' అనువాని కీసూత్రముక్రింద వివరింపఁబడిన 10 దియు వికల్పముగఁ జేర్పఁబడునని సూత్రార్థము. మధ్యమపురుషైకవచనబహువచన ప్రత్యయములగు 'ముడుజ్లు'లు తుదిని జేరినక్రియలమీఁద 'అ-ఆ' మొదలగునవి చేర్చి సంప్రార్థనార్థమును బోధించుట యొక్క ప్రసిద్ధమార్గమని భావము. విభాషనుటంజేసి 'వండుము-వండుఁడు' అనునదాదు లనుప్రయుక్తములు గానిరూపములును సంప్రార్థన మున 29 చేఁ దగునని గ్రహించునది. 'వండుము+అ=వండుమ; వండుము+ఇ=వండుమి; వండుఁడు+అ=వండుఁడ;' అనురీతిని 'అ-ఆ-ఇ-ఈ' అనున వనుప్రయుక్త మగునపు డపదాదిస్వరసంధినిగూర్చి సిద్ధరూపముల గమనించునది. వీనిని విభజించి చూపవలసి

వచ్చినఁ బైప్రకారమే చూపునది. వంటచేయఁ బ్రార్థించుచున్నవాఁడనని యర్థము. తరువాతి సూత్రము ననుసరించి ఎదాదు లనుప్రయుక్తము లగునపుడు ప్రక్రియను గమనించునది.' 'అమ్మ' ఆదిశబ్దముచే 'అన్న-అప్ప' మొదలగునవి గ్రాహ్యములు.

## ఎదాదులనుప్రయుక్తంబులగునపుడు ముజ్డునకు వుజీ రుజీ యగు. 38.

వినవె - వినవే - వినరె - వినరే - వినకువె - వినకువే - వినకురె - వినకురే.

టీ. ఎదాదులనఁగా 33 సూత్రముక్రింది అకారాదిదశకమున మొదటి నాల్గిటిని విడిచి ఎకారము మొదలుకొని యైందు నాఱని గ్రహింపవలెను. (ఎ-ఏ-ఒ-ఓ-అయ్య-అమ్మ). పైయాఱును 33 చే ననుప్రయుక్తములై పరములగునపుడు మధ్యమపురుషైకవచనబహువచన ప్రత్యయములగు 'ము-డు' అనువానిలో ముపర్ణకమునకు వువర్ణమును డువర్ణకమునకు రువర్ణమును నాదేశములగునని భావము. ముడుజ్ఞు లుత్వవిశిష్టములుగాన వురులను హల్మాత్రముల వాని కాదేశించినఁ జాలునుగాని హల్మాత్రముల నుచ్చరించుట కష్టమగుంగాన వాని నట్లాదేశింపక యుత్వవిశిష్టములనే యాదేశించెనని తోఁచెడి. ఎదాదులని యనుటంజేసి 33 సూత్రమునఁ జెప్పఁబడిన యదాదులు పదింటిని నదాదులు నాలుగనియుం నెదాదు లాఱనియు రెండుభాగములుగఁ బ్రక్రియాభేదము ననుసరించి విభజించెనని గ్రహించునది. పూర్వసూత్రప్రోక్తమగు విషయమునే యనుసరించి యీసూత్రము సూత్రితమయ్యెఁగాన నిదియుం సంప్రార్థనమునకు సంబంధించినదే యని గ్రహింపవలెను. 'వుజీ-రుజీ'యని జీత్తులుగా నిర్దేశించుట 20 చే ధాత్వంతోకారమకారమగుట ఫలమనుట పునరుక్తము. 'వినుము' దీనికి 33 చే నదాదు లనుప్రయుక్తములగు. అందు నెదాదు లనుప్రయుక్తములుగా నీవిధిచే ముపర్ణమునకు వుజీగా 'వినుము+ఎ=వినువు+ఎ' అనియుండ 20 చే వుజీ పరముగా ధాతువుతుదియుత్తున కత్వము గలుగ 'వినవు+ఎ=వినవె' అనురూప మేర్పడును. ఇట్లే 'వినుము+ఏ=వినువు+ఏ=వినవు+ఏ=వినవే'అను దానిప్రక్రియ నూహించికొనునది. 'వినుఁడు+ఎ' అనియుండ నీవిధిచే రుజీరా 'వినురు+ఏ' అనియుండ 20 చే రుజీ పరముగా ధాతువుతుదియుత్తున కత్వము గలుగ 'వినరు+ఎ=వినరె' అనురూపము సిద్ధించును. ఇట్లే ఏకారము ననుప్రయుక్తముగా 'వినుఁడు+ఏ=వినురు+ఏ=వినరు+ఏ=వినరే' అని రూపమగును. 'వినకుము+ఎ=వినకువు+ఎ=వినకువె' అనియుం, 'వినకుము+ఏ=వినకువు+ఏ=వినకువే' అనియుం, 'వినకుఁడు+ఎ=వినకురు+ఎ=వినకురె' అనియుం, 'వినకుఁడు+ఏ=వినకురు+ఏ=వినకురే'

అనియు వ్యతిరేకముజంతమున నెదాదు లనుప్రయుక్తము లగునపుడు రూపము లగుటను గమనించునది. ముజ్జున కను సామాన్యోక్తిం జేసి సంప్రార్థనమునందలి వ్యతిరేకావ్యతిరేకముజంతములు రెండును గ్రాహ్యములగుంగాన మొదటినాల్గును నవ్యతిరేకముజంతమునకును, దుదినాల్గునువ్యతిరేకముజంతమునకును, నుదాహృతములని గ్రహించునది. 'అయ్య-అమ్మ' అనునవిపరమగు నపుడు 'వినవయ్య-వినవమ్మ-వినరయ్య-వినరమ్మ - వినకువయ్య-వినకువమ్మ-వినకురయ్య-వినకురమ్మ' అనురీతిని రూపము లేర్పడునని గ్రహించునది. వ్యతిరేకముజంతమునందలి కువర్ణము ధాతువునకు సంబంధించినదిగానిదగుటను, 20 సూత్రమధికారప్రాప్తమైనధాతువునకనుదానింజేసి ధాతువునుత్తునకే యత్వ మాదేశించుటను, వుజెరుజులు జిత్తులైనను దమకు ముందుండు కువర్ణమునుత్వమున కత్వముగూర్పం జాలవని గ్రహించునది. ఇట్టిశంక యిట్టిచోటులం గలుగునని యెంచియే గ్రంథకర్త 20 సూత్రమునకు, జిత్తు పరంబగునపుడు ధాతువునుత్వమున కత్వంబగునని వివరించి యర్థము వ్రాసెను.

స్వార్థముజంతసంప్రార్థనార్థకరూపములు 'వినవు-వినరు' అను లజేరూపముల ననుసరించియెదాది సంయోగమున వానికి సంప్రార్థనార్థకత గలిగెనని సాధింప నగుంగాని 'వినకువే-వినకురె' మొదలగు వ్యతిరేక ముజంతసంప్రార్థనార్థకము లట్లు సాధింప నవకాశములేమి నీసూత్ర మావశ్యకమని చెప్పనొప్పును. అంతటను నెదాదియోగ మపదాదిస్వరసంధివిధింజేసి యగుటను స్మరించునది. ఎకారము మొదలుకొని యుండునాలుగును నెదాదులని గ్రహించుపక్షమున నీవిధి నిత్యమగుటంజేసి 'వినుమమ్మ; వినుమయ్య; వినుఁడమ్మ; వినుఁడయ్య;' అనురీతి రూపములును, వ్యతిరేకమున 'వినకుమమ్మ-వినకుమయ్య-వినకుఁడమ్మ-వినకుఁడయ్య' అనురీతి రూపములును నసాధువులు గావలసియున్నది. మఱియు 'వినకువమ్మ-వినకురయ్య అనురీతి రూపములు శ్రుతికసమ్మతము లైనను సాధువులు గావలసియున్నవి. కాన నదాదు లెదాదులను విభాగమచ్చులకు సంబంధించినదే గాని 'యయ్య యమ్మ యప్ప యన్న' మొదలగు పూజ్యార్థకములందుఁ జేరవనియు దాన నదాదులు (అ-ఆ-ఇ-ఈ) నాలుగనియు, నెదాదులు (ఎ-ఏ-ఒ-ఓ) నాలుగనియు గ్రహించి పైనాలుగచ్చులు పరమగునపుడే యీవిధి ప్రవర్తించును గాని యయ్య మున్నగునవి పరమగునపుడు గాదనియు గ్రహించుట యుచితమని తోఁచెడి. ఆపక్షమున 'వినవమ్మ-వినవయ్య-వినరమ్మ-వినరయ్య' అనురీతి రూపములు గుదురవని శంకింప నగుంగాని వాని నమ్మాదులయోగముగల వ్యతిరేకక్రియారూపములనుండి గలిగినవిగ సాధింప నగుంగాన నట్టిశంక కవకాశమే లేదని గ్రహించునది. ఇందు 'అమ్మ-అయ్య'లు పరములుగనుంచి ప్రక్రియంజూపి రూపముల నుదాహరింపమియు నీరీతిని వ్రాయుంటకుఁ

గతమని యూహింతురుగాక. ఈసూత్రముచే సాధింపఁబడిన రూపములను విభజింప వలసివచ్చిన 'వినుము+ఏ' వినుఁడు+ఏ; వినకుము+ఏ; వినకుఁడు+ఏ' అని చూడఁ దగు. ఆదిపదముచే 'అన్న-అప్ప' మొదలగునవి గ్రాహ్యములు. అద్యాదులలో నయ్యో మొదలగునవి కర్తృసందర్భము ననుసరించి క్రియలకుఁ గూర్చునది.

'ప్రార్థనంబునందన్ప్రత్యయాంత క్రియలమీఁదఁ గదకదవు పూర్వకంబు లన్నాదులను ప్రయుక్తములగు'నని త్రిలింగలక్షణశేషము నుభ్యంతములమీఁదఁ 'గదమ్మ, కదవమ్మ' మొదలగు రూపముల సాధించి సంప్రార్థనార్థకములుగఁ జూపుట నీసందర్భమున నరయం నది. మఱియుఁ 'దద్ధర్మభూతక్రియ లార్యార్థపరకంబులయి ప్రశ్నార్థకంబు లగు' ననియు, 'నొక్కొకచోఁ దద్ధర్మక్రియ యార్యాద్యర్థపరకంబయి వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకంబగు'ననియు, 'నార్యాద్యర్థ మొక్కచో నటుశబ్దపూర్వకంబును నగు' ననియు శాసించి, యార్యాద్యర్థకయోగమున నాయాక్రియలకగు నర్థవిశేషస్ఫూర్తిని దెలుపు త్రిలింగలక్షణశేష సందర్భమును గమనించునది.

## టువర్ణకంబు భావంబునందగు. 3౫

భావంబనఁగా ధాత్వర్థంబు-వండుట-పండుట - వినుట - కనుట.

టీ. 'ట' అను ప్రత్యయము భావమున నగును. భావమన ధాతువునర్థమని క్రింద వివరింపఁబడియెను. 'ఫలవ్యాపారయోర్ధాతుః' అనుదాని ననుసరించి ధాతువునకు ఫలవ్యాపారములు రెండును నర్థములయ్యెడి. దీన వ్యాపారమును జెప్పనిధాతువే యుండదని తేలెడి. చేయుట-ఒనర్చుట మొదలగునవి వ్యాపారమునకు నామాంతరము లగును. ఇట్టి వ్యాపారరూపమగు ధాత్వర్థమందే టప్రత్యయమగునని భావము. వండు ధాతువునకు వంటచేయుట యను వ్యాపార మర్థము. కాన నట్టివ్యాపారరూపమగు నర్థమున ధాతువునకుఁ గల్గిన టప్రత్యయముతోడి వండుట యను పదమునకు వంట చేయుట యని యర్థము గలిగెడి. ఇట్లే భుజించుట యనుదానికి భోజనము చేయుట యని యర్థము గలుగును. పండుటయనఁగాఁ బక్వమగునట్లు చేయుట. ఇట్లే తక్కినవి గ్రాహ్యములు. వంటచేయుటచే వండఁబడినది మెత్తనగుట ఫలముగాన వంటచేయుటయుం వండఁబడినది మెత్తనగుటయు నను వ్యాపారఫలములు రెండును ధాత్వర్థములే యగునని గ్రహించునది. ఇట్లే సూక్ష్మబుద్ధిని ఫలవ్యాపారములు రెండును ధాత్వర్థము లగుటయుం నందు ముఖ్యముగ వ్యాపారరూపధాత్వర్థమున టప్రత్యయ మీవిధిచే నగుటయును గమనించికొనునది. భావశబ్దము ణిజంతమైన భూధాతువునకు మీఁద 'అచ్' అను ప్రత్యయముగాఁ గలిగినది గాన భూధాతువున కగుట యర్థమును దానిమీఁది ణిచ్చు

నకుఁ బ్రేరణమర్థమునునై యగుధాతుప్రేరణభావార్థకటవర్ణాంతమగు కావించుట యను నది భావశబ్దమున కర్థమయ్యెడి. దానఁ జేయుట కావించుట ఒనర్చుట మున్నగు నవి వ్యాపారమునకు నామాంతరములగుటయు, వంటచేయుట భోజనముచేయుట మొదలగునవి ధాత్వర్థము లగుటయు నవిరుద్ధములని గ్రహింపవలెను. దీన వండుట యన వంటచేయుట యనియుఁ బండుటయనఁ బండఁజేయుట యనియు వినుటయన వినునట్లొనర్చుట యనియు నర్థము లూహించునది. ఫలవ్యాపారములు ధాత్వర్థములు రెండును భిన్నాశ్రయము లగునపుడు ధాతువు సకర్మకమగుననియు, నవి యేకాశ్రయములైన నకర్మకమగుననియు నూహింపఁదగు. వంటచేయుటకు దేవదత్తుఁడును మెత్తనగుట కన్నమును నాశ్రయములుగాన వండుధాతువు సకర్మకము. పండుట కను రూపమగు నెదుగురూపమైన వ్యాపారమునకును పండుటరూపమైన ఫలమునకును పండే యాశ్రయముగానఁ బండుధాతువకర్మకము. ప్రకృతము ధాత్వర్థమగు వ్యాపారముననే టప్రత్యయ మీవిధిచే నయ్యెడిఁ గాన నీ టప్రత్యయము ధాత్వర్థ మగు వ్యాపారమునే బోధించెడిఁ గాని యన్యమును గర్త్రాదికమును దెలుపఁజాలదని సంభావన చేయఁదగును. సంస్కృతమున ల్యుడంతరూపములగు 'పతన భవన' అను మొదలగువాని కేయర్థమో యీటవర్ణక మంతమందుఁజేరినవాని కదియే యర్థముగాన ల్యుడర్థము ప్రకృతసూత్రస్థభావపదమున కర్థమని గ్రహింపఁదగును. 'భావే టవర్ణ కోఽంతే సర్వేషాం చ క్రియాపదానాం స్యాత్' అనునది మూలము. ఈ టవర్ణకము సర్వధాతుసామాన్య మగుటను నిత్యముగ నగునదగుటను నిట విధింప నావశ్యకమయ్యె. 122 సూత్రమునందలి భావశబ్దమునకుఁ గర్తయగు భావ మర్థమగుటను స్మరించునది. భావార్థక టవర్ణకాంతముమీఁద సముచ్చయార్థకమగు 'యును' అనునది చేర్చిన నది నానంతర్యార్థక మగుట ప్రాచీనప్రయోగదృష్టము. భావార్థకయోగమునఁ గర్తకుఁ బ్రథమ యగుటను స్మరించునది.

కజీవర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునందగు. 36.

వండకమునుపు - వండుటకుమునుపు - చేయకమునుపు - చేయుటకుమునుపు. మునుపు - ముందు - మున్ను - తొల్లి.

టీ. మునుపు-ముందు-మున్ను-తొల్లి పూర్వము మొదలగునవి పురార్థకములని క్రింద వివరింపఁబడియె. క్రియల కట్టివానితో నన్వయరూపమగు సంబంధము తోఁచు నపు డట్టిక్రియలమీఁద భావార్థమున 'కజీ' అను ప్రత్యయము వికల్పముగ నగునని సూత్రార్థము. వంటచేయుటకుముందు వంటచేయకుండుటయే యుండెడిఁగానఁ బురార్థ

కములయోగమున వ్యతిరేకరూపప్రయోగమే తోఁచుట సహజము. 'వండకమునుపు' ఇట మునుపను పరార్థము యోగమున వండుధాతువున కీవిధిచే 'కజి' ప్రత్యయమును (వండు + క) 20 చే ధాతువు తుదియంత్తున కత్వమునునై వండకమునుపను రూపము గలిగె. కజి జిత్తనుట స్పష్టము. ఇట్లే తక్కుంగల యుదాహరణము లూహ్యములు. కజివర్జకము గానిపక్షమున వండుటకు మునుపని యుండును. 'తొల్లి' అను పురార్థము యోగమునఁ గజి గల్గుట యరుదు.

## వ్యతిరేకభావంబున మిజి యగు. 32.

వ్యతిరేకవిశిష్టక్రియాభిధాయిధాతువునకు మిజియగు. వండమి-పండమి.

టీ. వ్యతిరేకధాత్వర్థమున 'మిజి' అను ప్రత్యయమగునని సూత్రార్థము. వంట చేయుట యనుదానికి వంటచేయకుండుట వ్యతిరేకముగాన వంటచేయకుండుట యను నర్థమున వండు ధాతువుమీఁద మిజి వర్ణకమును 20 చే ధాతువుతుదియుత్తున కత్వమునుగలిగి 'వండమి' అను రూపము గలిగె. ఇట్లే పండుటకు వ్యతిరేకము పండకుండుట గానఁ బండకుండుట యను నర్థమున పండుధాతువుమీఁద మిజియుం ధాత్వంతోత్తున కత్వము 20 చేఁ గలిగి పండమి యనురూప మేర్పడెను. ఇట్లే తినమి-కనమి-భుజింపమి-వినమిమొదలగు రూపము లగుటను గమనించికొనునది.

## సమానాశ్రయంబులం బూర్వకాలంబునందివర్ణకంబగు. 33.

ఏకాశ్రయంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వకాలికం బగుం దద్వాచియగు ధాతువున కివర్ణకంబగు. ఇదియె క్త్వార్థంబు నాఁబడు. వండి - పండి - విని - కని. సమానకర్తృకంబులనక సమానాశ్రయంబు లనుటం జేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధంబయ్యె.

టీ. సమానశబ్ద మేకార్థకమగుటఁ గ్రిందివివరణమునుబట్టి స్పష్టము. ఒకపదార్థమునకు సంబంధించిన వ్యాపారములను దెల్పు ధాతువుల సమూహములోఁ బూర్వపూర్వ కాలికంబులగు వ్యాపారముల బోధించు ధాతువులకు 'ఇ' అను ప్రత్యయమగునని సూత్రార్థము. 'ఇ' అను నీప్రత్యయము సంస్కృతమునందలి 'క్త్వా' అనుదానికిఁ దుల్యముగాన నేతదంతమును క్త్వార్థమనుట యొప్పునని యిదియె యను నీక్రింది సూరివివరణమున కభిప్రాయము. (వండు+ఇ=వండి) ఇట్లే తక్కినవాని ప్రక్రియం గమనించు

నది. (రాముఁడు వండి యేతెంచె:—ఇట రాముఁడను నొకనికే సంబంధించిన వండుట యేతెంచుట యను వ్యాపారములలోఁ బూర్వకాలిక వ్యాపారంబగు వండుటను బోధించు వండుధాతువున క్త్వి ప్రత్యయము రా 'వండి' యను రూపము గలిగెనని గ్రహించునది. ఇట్లే 'రాముఁడు వండి బట్టలను గట్టి తాంబూలచర్వణ మొనర్చి పాదు కలధరించి యేతెంచె' అను వాక్యమున రాముని పలువ్యాపారముల బోధించు క్రియ లలోఁ దుదిదానికిఁ దక్కుఁ దక్కుంగల పూర్వపూర్వకాలికవ్యాపారబోధకముల కెల్లను నివర్ణకమగుటను గమనించునది. తుదివ్యాపారమును ననుసరించి పూర్వకాలిక వ్యాపారములఁ దెలిసికొనుచుఁ దద్బోధకముల కివర్ణముం గూర్చునది.

'సమానకర్తృకయోః పూర్వకాలే' అను సంస్కృతవ్యాకరణపద్ధతి ననుసరించి సమానకర్తృకములలోఁ బూర్వకాలికముల కివర్ణక మగునని సూత్రించిన 'చైత్రునిచేత మైత్రుండుకొట్టంబడి మడిసె' అను రీతి నొప్పు కర్మణిప్రయోగవాక్యములందుఁ గొట్టఁ బడు మడియుం నను క్రియాద్వయమునకుఁ గర్త యొకఁడుగాక కొట్టఁబడి యనుదానికి చైత్రుఁడును మడిసె ననుదానికి మైత్రుఁడును గర్తలగుటంజేసి పూర్వకాలిక వ్యాపార బోధకమగు కొట్టఁబడనుదాని కివర్ణకము గలుగకపోవలసి వచ్చునుగాన నాపద్ధతి యనాదృతమయ్యెననియుం గొట్టఁబడనుదానిచేతను మడిసెననుదానిచేతను బోధ్యము లగువ్యాపారముల కాశ్రయుఁడు మైత్రుఁడే యగుటంజేసి యనఁగాఁ దాడనము నందినవాడును, మడిసినవాఁడును మైత్రుఁడే యగుటంజేసి సమానాశ్రయము లన వలసివచ్చెననియుఁ బ్రకృతము కొట్టఁబడినవాఁడును మడిసినవాఁడును నొకఁడే యగు టచే సమానాశ్రయములగు క్రియలలోఁ బూర్వకాలిక క్రియయగు కొట్టఁబడను దాని కివర్ణ మీవిధిచేఁ గలిగెననియు నీక్రిందనున్న సమానకర్తృకంబులనకయను సూరి వివరణమున కభిప్రాయము. ఆంధ్రభాషాశైలిని బాగుగఁ బరికించి సమానాశ్రయ దళము నెలకొల్పఁబడెనని భావము. సంస్కృతమున నిట్టి కర్మణిప్రయోగవాక్యములఁ గ్త్వాప్రత్యయము గలుగుటయే పొసఁగదు. 'చైత్రేణ తాడితో మైత్రో మమార' అనురీతినే యుండునుగాని పూర్వకాలికవ్యాపారబోధకమునకుఁ గ్త్వాప్రత్యయ మిట్టి యదనునఁ గలుగదు. భాషాశైలింజేసి యీవిషయమున సంస్కృతాంధ్రభాషలు భిన్న ములనుట స్పష్టము. 'ఒక్కొకచో భూతకాలికాసమాపకక్రియ హేత్వర్థకంబు నగు' అని త్రిలింగలక్షణశేషకర్త యీసందర్భమును బూరించుట నరయునది. 'క్త్వా భూత యోః క్రియాంతస్యేత్' అనునది మూలము. ధాతువుపసర్గముతోఁ గూడినఁ గ్త్వాస్థాన మును ల్యప్పుగూడఁ బర్యాయమున నందవచ్చుననియు, నుపసర్గముతోఁ గూడకున్నఁ గ్త్వాప్రత్యయమే యందుననియుం సంస్కృతవ్యాకరణమార్గము. ఇందట్టి భేదమగపడమి క్త్వాల్యప్పుల రెంటిస్థానమున నిప్రత్యయమే యగు.

## కజివ్యతిరేకక్త్వార్థంబునందగు. ౩౯.

వండక - పండక - కొట్టక - తిట్టక.

టీ. క్త్వార్థముయొక్క వ్యతిరేకమును బోధింపవలసి వచ్చినపుడు ధాతువునకు 'కజి' అను ప్రత్యయ మగును. కజి జిత్తుగాన నది పరముగా 20 చే ధాతువుతుది యుంత్తున కత్వమగుటను గమనించునది. 'వండు + క=వండ + క = వండక; పండు+క = పండ + క=పండక' అనురీతిని ప్రక్రియ నూహించునది. క్త్వార్థమునందె వ్యతిరేకమున నిదియుఁ గలుగుఁగానఁ గ్త్వానియమములనెల్లను దీనివిషయమునను గమనించునది.

## తుమర్థభావలక్షణంబులందు నుజి యగు. ౪౦.

భావలక్షణంబునా నన్యక్రియకు లక్షణభూతంబగు క్రియ. తుమర్థంబందును భావలక్షణంబునందును ధాతువునకు నుజివర్ణకంబగు. తుమర్థంబు - చైత్రుండు వండను బోయెను. పాకక్రియార్థము పోయె నని యర్థము. భావలక్షణము-చైత్రుండు వండ నతిథి వచ్చెను. ఇచట వంట లక్షణము - వచ్చుట లక్ష్యము.

టీ. సంస్కృతమునందలి తుమున్ ప్రత్యయముయొక్క యర్థమందును వ్యాపారములలోఁ దుదివ్యాపారమునకుఁ జిహ్నమగువ్యాపారముయొక్క యర్థమందును క్రియకు నుజియను ప్రత్యయమగును. 'గంతుమ్-భోక్తుమ్' మొదలగు తుమున్నంతములకు వెళ్లుటకొఱకుఁ జేయుటకొఱకు ననియర్థముగానఁ దుమున్నర్థకనుజ్యంతములగు వండను మొదలగువానికిఁగూడ వంటచేయుటకొఱకనియే యర్థమనియుఁ గావుననే పాకక్రియార్థ మని వివరించుట పొసఁగెననియు గ్రహించునది. వ్యాపారములలో నొకదాని కొకటి సూచకమగు నేని సూచకవ్యాపారబోధకమగుదాని కీవిధిచే నుజి యగునని భావలక్షణంబు నానునువివరణమున కభిప్రాయము. వ్యాపారములలో నొకవ్యాపార మెపుడు జరిగెనో తెలిసికొనుటకుఁ దద్వ్యాపారబోధకక్రియారూప మవకాశ మీయనపు డావ్యాపార మిట్టియదనున జరిగెనని గుర్తించుట కవకాశమొసంగుక్రియ భావలక్షణార్థకమని ఫలి తము గ్రహింపనగును. అనఁగాఁ దెలియనికాలము గలక్రియకు బాగుగఁ దెలియుఁనట్టి కాలము గలక్రియ బోధకంబగునేని యజ్ఞాతకాలక్రియకు బోధకమైన యాప్రసిద్ధ కాలక్రియ భావలక్షణసంజ్ఞక మగునని భావము. క్రియలమీఁద నగు లడాదులను వానిచే నేర్పడు రూపాంతరములనుబట్టి సామాన్యముగఁ గ్రియలకాలము గుర్తింపనగుం గాని భూతభవిష్యద్వర్తమానముల నావ్యాపార మెట్టియదనున జరిగెనో గుర్తింప నవ

కాశము చాలదుగాన నట్లు గుర్తింపననువగు నదనుకు సూచించుక్రియయే ప్రసిద్ధకాల క్రియయగునని గ్రహింపవలయును. ఈభావలక్షణార్థమున సంస్కృతమునఁ బదము సతిసప్తమ్యంతమైయుండు ననునంశము 'చైత్రే పచతి సత్యతిథిరాజగామ' అను మూలము నందలి యుదాహరణవాక్యమునకు సరియైన సంస్కృతవాక్యము నరసినఁ దెల్లమగు. 'యస్య చ భావే భావలక్షణమ్'అను పాణినీయసూత్రము ననుసరించి భావలక్షణార్థము నిరూపితమయ్యెఁగానఁ దత్సూత్రవివరణములఁ బరిశీలించువారల కీసందర్భము సుబోధంబు. 'చైత్రుఁడు వండను బోయెను':—ఇట తుమున్నర్థక నుజ్యంతమగు వండనను దానికి వంటచేయుటకొఱకని యర్థము. వండుధాతువున కీవిధిచేఁ దుమున్నర్థమున నుజియు 20 చే ధాత్వంతోత్తున కత్తును (వండు + ను = వండ + ను = వండను) గా నీరూపము గలిగెననుట స్పష్టము. 'చైత్రుఁడు వండ నతిథి వచ్చెను':—ఇట వచ్చెనను క్రియకు వండ ననునది లక్షణభూతముగాన భావలక్షణార్థక మయ్యెననుట స్పష్టము. ముందు వ్రాసినరీతినె ప్రక్రియ గ్రాహ్యము భావమనఁగాఁ జేయుట కావించుట యని ముందె యుక్తముగానఁ గ్రియకు సూచకమగునర్థమున ననునది భావలక్షణార్థమునను దాని కర్థమగుననుట స్పష్టము. వచ్చెనను భూతకాలికసమాపకక్రియ యతిథి యిదివఱకే వచ్చెనని తెలుపుచున్నదిగాని యారాక యపు డెట్టియదనున జరిగెనో తెలియరాదు కాన నారాక చైత్రుఁడు వంటచేయుచుండ నయ్యెనని యదనను జ్ఞాపకముగసూచించుటను వండుధాతువె భావలక్షణక్రియయై నుజ్యంతమగుట పొసఁగెనని గ్రహించునది. ఇట్లే యంతటను నర్థప్రక్రియల గమనించునది. భావలక్షణక్రియ యన జ్ఞాపకక్రియ యని ఫలితము. కాఁగా, 'వండను' అనునది 30 సూత్రముప్రకారము వ్యతిరేకసమాపకోత్తమపురుషైకవచనమును, నీవిధిచేఁ దుమున్భావలక్షణార్థకాసమాపకరూపంబును, 122 ప్రకారము కర్తృభావార్థకంబును, నగుటను గమనించునది. ఇది యానంతర్యార్థక మగుటయుఁ గలదు.

## చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు నవర్ణకంబు ద్రుతాంతంబగు. ౪౧.

వానలుగురిసినం బంటలువండును. వాఁడు రమ్మనినఁ బోయితిని.

టీ. చేదర్థమునందు ధాతువునకును, గడచిన వ్యాపారమును బోధించు భావలక్షణక్రియకును, ద్రుతముతుదిని గల నవర్ణక మగునని సూత్రార్థము. ధాతువున కనునది యధికారము. భావలక్షణమనా నన్యక్రియకు లక్షణభూతమగుక్రియ యని ముందె యుక్తము. సంస్కృతమునందలి 'చేత్' అనుదానికి 'ఏని-చో-ఆ-అయిన' అను మొదలగునవి తెలుఁగున నర్థవివరణమునఁ దోఁచెడి. (చూ. 119) వృత్తమనఁగా జరిగి

పోయినది. భూతంబనుట. ఇట్టిపట్టులఁ బ్రధానసమాపకక్రియావాచ్యవ్యాపారమున కీదృతాంతవర్ణకమునందు క్రియచే బోధ్యమగు వ్యాపారము జరిగిపోయినదే యెపుడు నగుంగాని వాక్యప్రయోగకాలమున కీద్రుతాంతవర్ణకమునందు క్రియచే బోధ్యమగు వ్యాపారము జరిగిపోయినదగుటయు జరుగఁబోవునదగుటయు సంభవించెడిఁగాన జరుగఁబోవునదగునపుడు చేదర్థకముగ గ్రహించియు జరిగిపోయినదగునపుడు భావలక్షణముగ గ్రహించియు ద్రుతాంతవర్ణకమును జేయవలెననునభిప్రాయము 'చేదర్థమునందు, వృత్తంబగుభావలక్షణమునందు' అను రెండుసప్తమ్యంతదళముల నిడుటంబట్టి గ్రంథకర్తకుఁ గలదని చెప్పనొప్పును. మఱియు ప్రథమోదాహరణమునుబట్టి వాక్యప్రయోగకాలమునకు వానలు గురియలేదనియు మీఁదఁ గురియుచోఁ బంటలు పండఁగలవనియు నర్థము వివక్షించి యవ్వాక్యము ప్రయోగించినట్లు విశదమయ్యెడిఁగాన నటఁ గురియు ధాతువు భావలక్షణంబయ్యు వృత్తవ్యాపారబోధకముగాక చేదర్థకమె యగుటంజేసి చేదర్థమునందె యది ద్రుతాంతవర్ణకము నీవిధిచే నందెనని గ్రహించునది. ద్వితీయోదాహరణమునుబట్టి వాఁడు రమ్మనినపిదపనే వాఁడు పోవుట జరిగెనని విశదమయ్యెడిఁగాన నిటఁ జేదర్థమునకుఁ బ్రసక్తి లేదనియు రమ్మనుట ముందును బోవుట పిదపను జరిగెఁగానఁ బోవుటకు రమ్మనుట యుపలక్షణమును నాపోవుటను బోధించుక్రియ గడచినవ్యాపారమును బోధించునదగుట వృత్తంబగు భావలక్షణము నగుంగాన నద్దానికి వృత్తభావలక్షణమునందె ద్రుతాంతవర్ణకమయ్యెననియుఁ గ్రహింపఁదగును. ముందు చెప్పినరీతిని బ్రధానసమాపకవాచ్యవ్యాపారదృష్టి కీద్రుతాంతవర్ణకమునందిన క్రియచే బోధ్యమగువ్యాపారము భూతంబె యగుంగాన భూతంబున నగు నిగాగమంబును, నది పరముగా యాంకు సాదేశంబును నగుట యవిరుద్ధమె యని తలంపఁదగును. ఇట్లే 'వాఁడు వచ్చినఁ జాలును. నీవుపోయిన సరియ.' మొదలగు వాక్యములందు వచ్చుధాతువునకుఁ జేదర్థమందె నవర్ణకమయ్యెనని గమనించునది. చేదర్థమునందనక కేవలము భావలక్షణత నే యెంచి చేదర్థభావలక్షణమునందని సూత్రించినఁ బైవాక్యమున వచ్చుధాతువునకు ద్రుతాంతవర్ణముగా నవకాశములేదుగాన రెండుసప్తమ్యంతదళములను నిల్పి సూత్రించెనని విభేదము గ్రహింపఁదగును. గుప్తార్థప్రకాశికాకర్త 'చేదర్థేనో ద్రుతాంత; స్తద్వద్వృత్తే భావలక్షణే' అని హరికారిక రెండుసప్తమ్యంతదళములచే 'తద్వత్' అని రెండర్థములందును ద్రుతాంతవర్ణమును విధించుచున్నను నెందులకో దానిఁ బాటింపక చేదర్థమునందను దళమును మీఁదివృత్తంబగు భావలక్షణమునందనుదానికి విశేషణముగ సమన్వయించి చేదర్థమునందున్నట్టి భావలక్షణమునందు ద్రుతాంతవర్ణమగునని వ్యాఖ్యానము చేసినవారు. పరికింప సామాన్యముగ నీచేదర్థకక్రియ భావలక్షణమె

గాఁదగుటను గేవల చేదర్థకము భావలక్షణముగాక పొసఁగుట క్వాచిత్క మగుటను గావలయు వీరిట్లు వ్యాఖ్యానము చేసియుందురని తోఁచెడి. కాని పైని వ్రాసినప్రకారము కేవల చేదర్థము బోధ్యముగావలసి యున్నపుడును, జేదర్థకవాచ్యవ్యాపారము వాక్యప్రయోగకాలమునకు జరుగఁబోవున దగునపుడును, జేదర్థమునకుఁ బ్రసక్తిలేక కేవలవృత్తభావలక్షణతకే ప్రసక్తి తోఁచునపుడును ద్రుతాంతనవర్ణకము గావలసి వచ్చుటంజేసి సూరి చేదర్థమునందును, వృత్తంబగు భావలక్షణమునందును, ద్రుతాంత నవర్ణకము వేర్వేఱ విధించెననియుఁ నదియే సరసమార్గమనియుఁ జెప్పఁదగును. వాఁడు రమ్మనినఁ బోయితి ననుమూలోదాహరణమునఁ జేదర్థమునకుఁ బ్రసక్తి లేదనియుఁ గేవల వృత్తభావలక్షణతయే తోఁచెడుననియుఁ బాఠకులకుఁ దెల్లముగాన నిట గుప్తార్థ ప్రకాశికాకారులమతము ననుసరించి చేదర్థకత పొసఁగమిని రమ్మనినని ద్రుతాంత నవర్ణకంబైనరూపము గలుగ నవకాశము లేమి వారిమార్గ మస్వరసమనుట సాహసము గాఁజాలదు. ఇట్లయ్యు నీపట్టున హరికారికకు విరుద్ధముగఁ జేదర్థకము పొసఁగని భావ లక్షణోదాహృతులకును గేవలచేదర్థములకును నవర్ణకము గలుగనిగతిని వ్యాఖ్య వ్రాయుటకుఁ గతము చింత్యము. మఱియుఁ జేదర్థభావలక్షణంబున నని సంగ్రహించి లక్షణకర్త యనినం జాలియుండఁ జేదర్థమునందు వృత్తంబగుభావలక్షణంబునందని రెండు సప్తమ్యంతములను నిల్పి సూత్రించుటంజేసియే రెండువిషయములకు సంబంధించిన దీవిధియనుట తెల్లము. నన్నయకాలమున నిట్టిది చేదర్థకమై ప్రయుక్తమైనట్లగపడదు. సమాపకక్రియారూపముల కేనిపదము గూర్చి చేదర్థమును సూచించుట గాననగు. ఇట్లే వ్యతిరేకక్రియారూపములమీఁద నేని నిడి చేదర్థమును సూచించుట చూడనగు. వ్యతిరేకముమీఁదఁ గాలముతోఁబాటు చేదర్థమును గూడ దెలుపవలెనన్న నేనితోడి యగుధాతువునాయాకాలవాచకరూపములను వ్యతిరేకక్రియ కనుబంధముగాఁ జేర్చెడివారు. కాన నీనవర్ణకరూపసాధనప్రక్రియ 'చేస్తే చెప్పితే' అను నవీనవ్యావహారికరూపసంస్కారమునుబట్టి యేర్పడిన దనఁదగును. ప్రకృతము 'చో, ఎడ' అనువానింగూర్చినధాతురూపముల నీయర్థమున వాడుచున్నారు. చో-ఎడలను నన్నయాదిప్రాచీనులు చోట సమయమున ననునర్థముల వాడినట్లు తత్ప్రయోగములు విశదపఱచుచుండుటను నట్టిమార్గమును గృతకంబె యగు. (చూ. బాలక శ. ము. పుట 218-20)

ఆనంతర్యంబున ఁడువర్ణకంబు ద్రుతాంతంబగు. ౪౨.

జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె.

టీ. అనంతరభావమానంతర్యము. తరువాత పిదప నని యర్థము. అయినను

నవ్యవహితపరత్వమే యంగీకార్యము. అవ్యవధాన మగపడుచుండుచోఁ గారణక్రియా వాచకమునకు ద్రుతాంతంబగు డువర్ణక మగునని సూత్రార్థము. కారణము ప్రకాశిత మైన యనంతరమందే (అనుపపదమందే) కార్యము గలుగుట గల్గెనేని కారణక్రియా వాచకమునకు ద్రుతాంతడువర్ణక మగునని భావము. దీన నంతరమునఁగా నవకాశమనియు నది లేని దనంతరమనియుఁ దానిభావమానంతర్యమనియు వ్యుత్పత్తి చెప్పనగుటయు దాన నానంతర్యమను దాని కనుపపదమందె యని యర్థము వ్రాయుటయుఁ బ్రసక్తము లయ్యెనని యెఱుంగునది. పూర్వసూత్రముచే నవర్ణకము కారణక్రియ కానంతర్యా భావమున నె యగుననియుఁ గారణక్రియ కానంతర్యమునర్థమగునేని ద్రుతాంత డువర్ణకమే యగుననియు విషయభేదమును గమనించునది. కేవలభావలక్షణమున నుజేసుం నానంతర్యవృత్తభావలక్షణమున నవర్ణకమును నానంతర్యయుక్తభావలక్షణ మున ద్రుతాంత డువర్ణకమును నగునని 40-41-42 సూత్రములకు విషయవిభేద మూహించుకొనుచుఁ గార్యకారణభావమున నుజేనవర్ణకడువర్ణకములఁ గారణక్రియా వాచకములకు గూర్చునది. జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసించె:—ఇటఁ గువలయములు వికసించుటకుఁ జంద్రుఁ డుదయించుట కారణము. మఱియుఁ జంద్రుఁ డుదయించుటతోడనే కలువలు వికసించుట జరుగుఁగాన నుదయించుట యను కార ణముయొక్క ప్రాదుర్భావమున కనుపపదమందె వికసించుట జరిగెననవలయును. కాన నిట నుదయించుట యనునర్థము గల తోఁతెంచునది యానంతర్యార్థకకారణక్రియ యగుటంజేసి యద్దానికి ద్రుతాంతడువర్ణక మీవిధిచే నై 'తోఁతెంచుడును' ననురూప మేర్పడెనని గ్రహించునది. వానలు కురిసిన యనుపపదమందుఁ గాక కొంతకాలము గడచినపిదపఁ బంటలు పండుట జరుగుచుగానఁ బూర్వసూత్రోదాహరణమున, గురియుఁ ననునది కారణక్రియయే గాని యానంతర్యార్థకకారణక్రియ గాదని యెఱుంగునది. కారణక్రియ కనుపపదమందె సంభవము వివక్షితమగునేని ద్రుతాంతడువర్ణకమే యగు. భావార్థకటవర్ణకమును, యుకువర్ణపరకమై యీయర్థమును బోధించెడి.

## చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునందగు. ౮౩.

చూచుచుం బోవుచున్నాఁడు - చూచుచుం బోయెను - చూచు చుం బోవఁగలఁడు.

టీ. సంస్కృతమున శతృప్రత్యయము వర్తమానమున విధింపఁబడినది. తెలుఁగున దానియర్థమున ద్రుతమంతమందుఁగల 'చు' అను ప్రత్యయమగును. ఇది యసమాపక

క్రియగానఁ గ్రియాన్వయముననని యుక్తము. సమాపకక్రియతో నన్వయరూపమగు సంబంధ మగపడునపుడు శతృప్రత్యయార్థమునఁ గ్రియకు ద్రుతాంతచువర్ణక మగునని సూత్రార్థము. చూచుచుం బోవుచున్నాఁడు:—ఇచటఁ బోవుచున్నాఁడను క్రియతో నన్వయము చూచుక్రియకుఁ దోఁచుచున్నదిగాన దానికి శతృప్రత్యయార్థమున ద్రుతాంతచువర్ణక (చును) మీవిధిచే నై 'చూచుచును' అనురూప మేర్పడెనని గ్రహించునది. ఇట్లే తక్కిన రెండుదాహరణములందుఁ జూచుధాతువునకు ద్రుతాంత చువర్ణకము శత్రర్థమున నగుటను గమనించికొనునది. సమాపకక్రియ వర్తమానభూతభవిష్యత్కాలములలో నెద్దానినిబోధించుచున్నను దానితో నన్వయించుక్రియకు శత్రర్థమున ద్రుతాంత చువర్ణకము గలుగవచ్చునని సూచింపఁ గ్రమముగ వర్తమానమునకు మొదటియుదాహరణమును భూతమునకు రెండవదియుం, భావికి మూఁడవదియు నుదాహరింపఁబడెనని గ్రహించునది. క్రియాన్వయమె ప్రధానముగాని సమాపక మేకాలమున నున్నను బాధలేదని తాత్పర్యము. ఈచువర్ణకమునకును నున్నానుబంధపరత్వమున నగుచువర్ణమునకును గ్రమముగ భిన్నాభిన్నతలభేదము గలదని ముందె యుక్తము. ఏకాలమునందున్నక్రియతో నన్వయించినను నిట్టిస్థలముల నసమాపకక్రియావాచ్యవ్యాపార మాకాలమునకు వర్తమానముననున్నవ్యాపారమునే బోధించున దగుంగాన నది వర్తమానకాలికక్రియయే యగుటయుం దాన శత్రర్థకచువర్ణకమునందుటయుం గుదిరెడినని గ్రహింపఁ దగును.

## తృవర్ణకార్థంబునం డెడియెడువన్నియలగు. ౪౪.

ప్రహారించెడివాఁడు - ప్రహారించెడువాఁడు-ప్రహర్తయని యర్థము.

టీ. వన్నియలనఁగా వర్ణకములని యర్థము. వర్ణకమనఁ బ్రత్యయమని ముందె యుక్తము. సంస్కృతమునఁ దృచ్ప్రత్యయము కర్త్రర్థమున విధింపఁబడినది. ఆతృచ్ప్రత్యయమునే వ్యాకర్త యిందుఁ దుదిచకారమును వదలి తృవర్ణకమని పేర్కొనెను. తృవర్ణకార్థమున ననఁగాఁ గర్త్రర్థమున ధాతువునకు 'ఎడి-ఎడు' అను రెండు ప్రత్యయములు పర్యాయమున నగునని సూత్రార్థము. ప్రహారించెడివాఁడు:—ఇటఁ బ్రహారించు వ్యాపారమును గర్తృనిష్ఠమును బోధించు ప్రహారించును దానికి 'ఎడి' అను ప్రత్యయముగాఁ 'బ్రహారించెడివాఁ'డనియు, 'ఎడు' అను ప్రత్యయముగా 'ప్రహారించెడువాఁ'డనియుం రూపము లేర్పడును. దీనికి సంస్కృతమునఁ బ్రహర్తయను తృజంతము సరియగుపదము గానఁ బైరూపములు తృవర్ణకార్థమున నెడియెడులనందినవే యని స్పష్టము సేయఁ బ్రహర్తయని యర్థమని నిర్వచించెనని యెన్నునది. వాఁడని చేర్చి చూపుటఁ గర్త్రర్థక

విశేషణమని తెలుపుటకొఱకని తలంచునది. తత్సమధాతువు నుదాహరించినను నీప్రత్యయములు సమాసమధాతుసామాన్యములని గ్రహింపఁదగును.

వానికి లోపంబు బహుళంబుగానగు. ౨౫.

ప్రహరించువాఁడు - ప్రహర్తయని యర్థము.

టీ. పూర్వసూత్రముచే విధింపఁబడిన 'ఎడి-ఎడు' అనువానికి వికల్పముగ లోపము గలుగునని సూత్రార్థము. వానికీవిధిచే లోపము గల్గిన 'ప్రహరించు' అనియే యుండుననుట స్పష్టము. సమాసము 9 చే నివి గలుగనిపక్షమునఁ గర్త్రర్థకతను దెలుపఁ గల తచ్ఛబ్దము చేరుననుటను బ్రహరించువాఁడని లక్షణకర్త యిచ్చిన యుదాహరణము స్పష్టపఱచెడి. ప్రహరించురాముఁ డనియుఁ బక్షమున విశేషణము విశేష్యసంగతితో నెసఁగుట దగుననుట స్పష్టము. అనఁగా నెడియెడులు గాకున్నను దృవర్ణకార్థము క్రియచేఁ బ్రకాశితమగునని దీని తాత్పర్యమనుట తెల్లము. ఈవిధిచే లోపము బహుళమగుటఁ గలుగకున్న నెడుయెడులు పర్యాయముగ నుండుననుట స్పష్టము.

ఉన్నకలజీనవర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులందగు. ౨౬.

ఉన్నవర్ణకంబు వర్తమానార్థక శత్రర్థంబునందగు-కలజీవర్ణకంబు భవిష్యదర్థక శత్రర్థంబునందగు-నవర్ణకంబు క్తవదర్థంబునందగు - ఇవి సత్వాభిధానంబునం దగునని యెఱుంగునది. సుబంతవాచ్యంబు సత్వంబునాఁబడు. వండుచున్నవాఁడు-వండఁగలవాఁడు-వండినవాఁడు.

టీ. ధాతువునకని యధికారసూత్ర మిట కనువర్తించును. 'శతృ' అనుదానికి 'భవత్', 'భావి;' అనువానితోడ నన్వయము. తుదినున్న 'అర్థ' అనునది 'భవత్; భావి; క్తవత్' అనుమూఁడిటితోడ నన్వయించును. వర్ణకశబ్దమునకు 'ఉన్న-కలజీ-న' అనుమూఁటితో నన్వయము. క్రమము ననుసరించి 'ఉన్న' అనునది భవచ్ఛత్రర్థమందనుదానికిని, 'కలజీ' అనునది భావిశత్రర్థమందనుదానికిని, 'న' అనునది క్తవదర్థమందనుదానికిని సంబంధించెడి. కాఁగా భవచ్ఛత్రర్థమందున్నవర్ణకమును భావిశత్రర్థమందుఁ గలజీవర్ణకమును క్తవదర్థమందు నవర్ణకమును ధాతువున కగునని సూత్రార్థము ఫలించెడి. భూధాతువునకంటె వర్తమానమున శతృప్రత్యయముగా 'భవత్' అనురూపము గలుగును. ఇట్లే భూధాతువుకంటె భావిని శతృప్రత్యయము గలుగ 'భవిష్యత్' అనియగును. కాని మూలమున 'భవత్' అనినట్లే 'భవిష్యత్' అనక 'భావిశతృ' అనియనెను. కాఁగా 'భవదర్థమునందు' అనుదానికి వర్తమానశత్రర్థమందనియు, 'భావి

శత్రర్థమందు' అనుదానికి భవిష్యచ్ఛత్రర్థమందనియు నర్థము లభించెడిఁ గాన నున్న వర్ణకమను నీక్రిందివివరణము తత్ఫలితమే యని గ్రహించునది. క్తవత్ప్రత్యయము సంస్కృతవ్యాకృతిని భూతమున విధింపఁబడియె. కానఁ దత్స్థానికమగు నీనవర్ణకము భూతకాలికమె యని తెలియునది. ఈమూఁడు ప్రత్యయములును బదార్థమును బోధించునపుడే యగునని యివి సత్త్వాభిధానంబుననను నీక్రిందివివరణమున కభిప్రాయము. సత్త్వమనఁగా ద్రవ్యము. ద్రవ్యమనఁ బదార్థము. క్రియచే వ్యాపారమే దెలుపఁబడెడిఁ గాని ద్రవ్యము తెలుపఁబడదు. సుబంతముమాత్రమె ద్రవ్యము నెఱింగింప సమర్థమగుం గాన సుబంతముచే బోధ్యమగునది సత్త్వమని వివరింపఁబడియె. 'రాముఁడు-వృక్షము-జ్ఞానము మొదలగు సుబంతములే ద్రవ్యాభిధానంబు లగుట స్పష్టము. ఉన్నకలజి నవర్ణకాంతములు నామవాచకములకు విశేషణము లగుట సహజముగాన నవి సత్త్వమును దెల్పునని యయ్యెడి. 'వచ్చుచున్న-వండఁగల-వచ్చిన' అనునవి క్రమముగ 'వచ్చుచున్న-వండఁగల-వచ్చిన' దేవదత్తాదిపదార్థములనే బోధించునుగాన వానికున్న కలజిన వర్ణకములు సత్త్వాభిధానంబున నయ్యెననుట స్పష్టము. దీనినే సమాసపరిచ్ఛేదమునందలి తచ్ఛబ్దానుప్రయోగమును క్రియావిశేషణములకు శాసించు 9 విధి తెల్పుచున్నదనియు దాన నేతదంతములు పదార్థబోధకశబ్దములను విడిచియుండవనియు నక్కారణమున సమాసము 9 విధిచేఁ దగిలినపదార్థబోధకశబ్దమును వీనినుండి వేఱుచేయ నవకాశములేదనియు తోఁచెడి, పక్షమున నీధాతుజవిశేషణము లేడింటికి విశేష్యసంగతి యేని సంభవింపక తీరదనుట ముందె యుక్తము. వండుచున్నవాఁడు:—వండుధాతువున కీవిధిచే వర్తమానశత్రర్థమున నున్నవర్ణకమును 14 చే వర్తమానార్థకమగుట నున్న పరముగాఁ జువర్ణకంబును గా 'వండుచున్న' అనురూపము గలిగెననియు దానికి సమాసము 9 చేఁ దచ్ఛబ్దమనుప్రయుక్తమగుట వండుచున్నవాఁడయ్యెననియుఁ బ్రక్రియం గమనించునది. ఇట్లే యీవిధిచే వండుధాతువునకు భావిశత్రర్థమునఁ గలజి వర్ణకమును, గలజి పరముగా 20-21 లచే నత్వనుగాగమములును గా వండఁగలయనురూప మేర్పడెననియుఁ బిదప సమాసము 9 చేఁ దచ్ఛబ్దమనుప్రయుక్తమగుట వండఁగలవాఁడను రూపమయ్యెననియుఁ దెలియునది. ఈగతినే వండుధాతువున కీవిధిచేఁ గ్తవదర్థమున నవర్ణకమును భూతార్థకమగుట 17 చే ధాతువున కిగాగమంబునుగా వండిన యనురూపమగుననియు సమాసము 9 చేఁ దచ్ఛబ్దమనుప్రయుక్తమగుట వండినవాఁడనురూపము సంభవించెననియు నెన్నునది. ఇట్లే యమహదర్థకములైనచో నేతదంతముల కది యవులనుప్రయుక్తములు సమాసము 9 చే నగుటను గమనించునవి. (వండినది-వండుచున్నవి-వండఁగలది) 117 విధి ననుసరించి యున్న కల నవర్ణకాంతములమీఁది తచ్ఛబ్దవకారము

లోపించి నిత్యసంధి యగుటంజేసి వండుచున్నాఁడిత్యాదులు గలిగెడిఁగాని సమాపకము లగు 'వండుచున్నాఁడు-వండఁగలఁడు-వండుచున్నారు' మొదలగునవి యవిభాజ్య రూపములనియు నీసూత్రముచే నేర్పడినట్టియు సమాసము 9 చేఁ దచ్ఛబ్దాంతము లైనట్టియు 117 చే వకారలోపమునందినట్టియుం రూపములు 'వండుచున్న+వాఁడు-' అనురీతిని విభజింప నర్హాములనియుఁ భేదమును నీవ్యాకృతిప్రక్రియామార్గమునుబట్టి గ్రహింపవలసియున్నది. భూతమున మాత్ర మీవిధిచే నైననవర్ణకము తుదిగలవానికి 117 చే 'వండినాఁడు-వండినారు-వండినావు-వండినాఁడను-వండినార'మను రూపములే గలిగెడిఁగాని 'వండెను-వండిరి-వండితివి-వండితిరి-వండితిని-వండితిమి' అనురీతి రూపములు గలుగఁజాలవు. కాఁగా వర్తమానభావ్యర్థకములగు సమాపకక్రియారూపముల కును నీసూత్రముచే నున్నకలజ్యంతములై సమాసము 9 చేఁ దచ్ఛబ్దాంతములై 117 చే వకారలోపమునందినరూపములకును నర్థరూపముల నేకరూపత సంభవించెననకతీరదు.ఏక రూపములగు రూపములను బ్రత్యేకముగ సూత్రన్యాసమొనర్చి సాధించుట యనావశ్యక మనకతప్పదు. అర్థమునందును వీనికి భేదము మృగ్యంబ. విభజింపఁ దగుట దగకుండుట యను భేదము ప్రయోజనశూన్యము. ఈసూత్రముచే నున్నకలజ్యంతములయి సమాసము 9 చేఁ దచ్ఛబ్దాంతములయి 117 చే వకారలోపము నందినవని చెప్పినమార్గమే భాషా సహజస్థితికిని, బదార్థసహజప్రకాశనమునకును, భాషాతత్త్వపరిశీలనమునకును, దోడ్పడెడి. కాన వర్తమానభావులందు సమాపకములఁ గలిగించుప్రక్రియ త్యాజ్యమనియు నరమణీయమనియుఁ జెప్పనొప్పును. నన్నయప్రాచీనభారతప్రయోగముల గమనించిన నున్నకలజ్యంతములమీఁద ననుప్రయుక్తమైన తచ్ఛబ్దరూపములతోడి రూపములే భూత భావ్యర్థకములగుట విశదమయ్యెడిఁగాన వర్తమానభావులందు సమాపకముల సాధించు మార్గము కృత్రిమము త్యాజ్యమని స్పష్టమయ్యెడి. (చూ. విషయప. పేరా. 113)

వ్యతిరేక తృవర్ణకార్థంబున నిజీ యగు ౮౭.

వండనివాఁడు-ఎడిప్రభృతివర్ణకాంతంబు లేదును ధాతుజవిశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు.

టీ. 44 చే నెడియెడులును 45 చే వానికి బహుళముగ లోపమును విధించి తృవర్ణకార్థకరూపములు సాధింపఁబడినవి. ప్రకృతము తృవర్ణకార్థకవ్యతిరేకరూపము లీసూత్రముచే సాధింపఁబడుచున్నవి. తృవర్ణకార్థవ్యతిరేకమున నిజీవర్ణకము ధాతువున కగునని సూత్రార్థము. వండు ధాతువునకు వ్యతిరేకతృవర్ణకార్థమున నీవిధిచే నిజీయు 20 చే ధాత్వంతోత్తున కత్వమునుగా వండని యనురూప మయ్యెననియుఁ బిదప సమా

సము 9 చేఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మయ్యెననియు గ్రహించునది. 44 చే నగు నెడి యెడు లంతమందుఁగలవానిని 45 చే వానికి లోపమునందినవానిని 46 చే నున్న కలజే నపర్ణకముల నందినవానిని 47 చే నిజేని జెందినవానిని ధాతుజవిశేషణములని పూర్వ వ్యాకర్తలనిరని యెడిప్రభృతియను నీక్రింది సూరివివరణమున కభిప్రాయము. (1 ఎడి-2 ఎడు-3 వీనిలోపము 4 ఉన్న-5 కల-6 న 7 ని.)

## లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును లాఁతికిం గర్తయందునగు. ౪౫.

సకర్మకంబునాఁ గర్మాకాంక్షోత్థాపకంబు - అకర్మకంబునాఁ గర్మా కాంక్షానుత్థాపకంబు.

టీ. ఈప్రకరణమున మొట్టమొదట నాయాయర్థములందు విధింపఁబడిన యాఱు లకారములును భావార్థాదులందగు టవర్ణకాదులును సకర్మకధాతువులకుఁ గర్త్రర్థమందును గర్మార్థమందును నకర్మకధాతువునకుఁ గర్త్రర్థమందును గలుగునని సూత్రార్థము. కర్మము గలదిగాన సకర్మకమునకు గర్తృకర్మంబులరెంటను గాఁదగుననుటయుఁ గర్మములేమి నకర్మకమునకుఁ గేవల కర్త్రర్థమందె తగుననుటయు స్పష్టంబ. ఏధాతువునర్థము కర్మము యొక్క ప్రశ్నను బోధమించునో యది సకర్మకమనియు నేది కర్మముయొక్క ప్రశ్నను బోధమఁజేయదో యది యకర్మకమనియు 'సకర్మకమునా, అకర్మక మునా' అను నీక్రింది సూరివివరణముల కభిప్రాయము. 'లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః' అను పాణినిసూత్రమున కిది తెలుఁగుచేఁత. రాముఁడు రావణుని గొట్టెను:— ఇచటఁ గొట్టె ననఁగానే యెవనిఁ గొట్టెనను ప్రశ్న గలిగెడుఁగానఁ గొట్టుధాతువు సకర్మకమయ్యెనని యెఱుంగునది. ప్రకృతవాక్యమునఁ బ్రకృతసూత్రముచేఁ గొట్టు ధాతువుచేఁ గర్తయె బోధ్యుఁడుగాన నద్దానికిఁ గర్త్రర్థమందు లిట్టు కలిగెనని గ్రహించు నది. ధాతురూపముచేఁ గర్త బోధ్యుఁడైనఁ గర్త్రర్థమందు లకారము గలిగెననియు ధాతురూపముచేఁ గర్మము బోధ్యమైనఁ గర్మార్థమున లకారమయ్యెననియు గ్రహింప నగుంగానఁ బూర్వవాక్యస్థమగు కొట్టెననుదానిచేఁ గర్తయె వాచ్యమగుట నటఁ గొట్టు ధాతువునకు లిట్టు కర్త్రర్థమం దయ్యెనని సంభావింపవలయు. మీఁది సూత్రముచేఁ గర్మార్థమునఁ బడుజ్యనుబంధము ధాతువున కగుంగానఁ బడుజ్యనుబంధయుతధాతురూప ములు కర్మమును దెల్పునవని యెన్నునది. 'రామునిచే రావణుఁడు కొట్టఁబడెను.' ఇటఁ గొట్టఁబడె ననుదానిచేఁ గొట్టఁబడినరావణుఁడే బోధ్యుఁడగుటంజేసి యటఁ గొట్టుధాతువు నకు లిట్టు కర్మార్థమున నయ్యెనని గ్రహింపవలెను. 'దీపము వెలిఁగెను; మెఱపు మెఱ

సెను;' మొదలగువాక్యములందు 'వెలిఁగెను; మెఱసెను' అనుక్రియలచేఁ గర్మము బోధ్యము గాఁజాలదుగాన నట్టివకర్మకములని యెంచునది. సకర్మకంబునాఁ=సకర్మకమన; కర్మాకాంక్షోత్థాపకము=కర్మముయొక్క ప్రశ్నను లేవఁదీయునది. అనుత్థాపకము=లేవఁదీయనిది. పుట్టించునది; పుట్టింపలేనిది యని భావము. లాఁతికి=ఇతరమునకు. అకర్మకమునకని భావము. సకర్మకేతరమకర్మకమగుట స్పష్టము. ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తయనియు, ధాత్వర్థఫలాశ్రయంబు కర్మమనియుఁ గారకము 2-3 సూత్రములందుక్తమును స్మరించునది. లకారాదులని యాదిపదముం గూర్చుటంజేసి టవర్ణకాదులును నసమాపకక్రియలకగు ప్రత్యయాదులును సకర్మమునకుఁ గర్తృకర్మార్థములందును నకర్మమునకుఁ గేవలకర్త్రర్థమందును నగునని గ్రహించునది. దీన సమాపకాసమాపకక్రియలకేదానికైనను బ్రత్యయాదులు కర్తృకర్మార్థములందె యగుననుట ప్రకాశితము. సకర్మమున కిట్లగుననిన నకర్మమునకుఁ గర్మము లేమిని గర్తయందెయగుట సిద్ధించుచున్నను సంస్కృతసూత్రానుసరణము చెడకుండను వ్యాకృతిసూత్రమర్యాదాతిక్రమణము గాకుండను, నిపుణముగ సూరి లాఁతికన నకర్మకమున కనక లాఁతికనుటంజేసి హరికారికాచార్యము సూరిపై మోపు గుప్తార్థప్రకాశికోక్తి చింత్యము. 'పరస్మాత్' అని లాఁతి యనుదానిని హరికారికయె యనువదించెననుట తగును. 'ధాతోరర్థాంతరే వృత్తేర్ధాత్వర్థేనోపసంగ్రహాత్, ప్రసిద్ధేరవివక్షాతః కర్మణోఽకర్మికా క్రియా' అనుసంస్కృతవ్యాకర్తలవలెనే తెలుఁగులాక్షణికులును ధాతువున కకర్మకసకర్మకత లర్థమునుబట్టి యగుటను జెప్పినారు. ఇందులకు 'అకర్మణస్సకర్మత్వ మకర్మత్వం సకర్మణః, తద్వతాం క్వచిదైక్యం స్యాచ్ఛబ్దశక్తిర్హి తాదృశీ' అనునథర్వణవాక్యము ప్రమాణము.

## పడుజ్యనుబంధంబు కర్మంబునందగు. ౭౯.

కొట్టఁబడుచున్నాఁడు - కొట్టఁబడుచున్నది - కొట్టఁబడుట - కొట్టఁబడనివాఁడు.

టీ. 'కర్మణ్యనుబంధస్స్యాత్పతిధాతుః కర్తృవచ్చ తద్విధయః' అనునది మూలము. ధాతువునకుఁ గర్మార్థమున 'పడుజి' అనునది తుదిని జేర్పఁబడునని సూత్రార్థము. ఈనిత్యవిధానమునంజేసి పడుజి చేరకున్న ధాతువు కర్మాకాంక్షోత్థాపకము గాఁజాలదనుట తెల్లము. 'కొట్టఁబడుచున్నాఁడు':—ఇటఁ గొట్టుధాతువునకు 48 చే వర్తమానకర్మార్థమున లట్టును గర్మార్థమునఁ బడుజ్యనుబంధమును బడుజి పరముగా 20-21 లచే ధాతువుతుదియుత్తున కత్తును నుగాగమంబును గాఁ బైరూపము గలిగెననుట స్పష్టము. వర్తమానమున నగు నున్నానుబంధాదులు యథార్హ్యముగ యోజ్యములు. (కొట్టు+ఁడు=

కొట్టు+పడు+డు=కొట్ట+పడు+డు=కొట్ట+ఁబడు+ఁడు=కొట్టఁబడు+చు+ఉన్న+ఁడు=కొట్టఁబడుచున్నాఁడు) ఇట్లే యమహత్వమున 12 చే దివర్ణముగాఁ గొట్టఁబడుచున్నది యనురూపమగుటను స్మరించునది. 48 సూత్రమందు లకారాదు లనుటంజేసి బావార్థక టవర్ణకాదులును గ్రాహ్యము లగుంగాన నపుడును గర్మమునఁ బడుజ్యనుబంధ మీవిధిచేఁ గాఁ గొట్టఁబడుట యనురూపము గలుగు. ఇట్లే 47 చే నిజైయైనఁ గొట్టఁబడనివాఁడని యగును. 48 సూత్రమునం దాదిపదము నెలకొల్పుటకుఁ బ్రయోజనమును సూచింపఁ గొట్టఁబడుట కొట్టఁబడనివాఁడను నుదాహరణద్వయము నిరూపితమని గ్రహింపఁదగు. ఇట్లే కర్మార్థమున ధాతువున కగుపడుజ్యనుబంధముమీఁద ధాతువుల కగు నాయా ప్రత్యయాదుల సంభవమును గమనించునది. పడుజి యని జిత్తుగాఁ జెప్పుట యత్వనుగాగమంబులకొఱకనుట తెల్లము (20-21) ఈసూత్రముచే సాధ్యములగు క్రియారూపముల నెల్ల నుజ్యంతములమీఁదఁ గల్గిన యాయాపడుధాతురూపములుగ నిరూపింప నవకాశమగపడుచుండుటను, నది భాషాసహజమగుమార్గముగఁ దోఁచుచుండుటను వీనిని వేఱుగ సాధింప సూత్రించుట యనావశ్యక మనఁదగును. కాని కేవలనుజ్యంతముచేఁ గర్మార్థము స్పష్టముగాక పడుజి చేర్పుననే యది స్పష్టమగుట వ్యాకర్త పడుజ్యంతము నఖండముగ నెంచి ప్రక్రియను నడపెనని తోఁచెడి. నొత్తముమీఁదఁ బడుధాత్వనుబంధమే యిట్టి యర్థమును బ్రకాశితము చేయఁగలిగెననుట తెల్లము.

## గురువిరహితంబులయి యయాంతంబులయిన యేకస్వరద్విస్వరంబుల యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాషనగు. ౫౦.

ఏకస్వరధాతుద్విస్వరధాతువులమీఁది యించుగ్వక్రంబులకియుడాగమంబు విభాషనగు. గురుమంతంబగు ధాతువునకును యాంతంబగు ధాతువునకును మీఁది యించుగ్వక్రంబుల కియుడాగమంబు రాదు. భుజ్ - ఇయ్ - ఇంచు - భుజియించు - పక్షంబున - భుజించు. గుణ - ఇయ్ - ఇంచు - గుణియించు - గుణించు. యించుగ్వ్యవధానంబునంజేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లేవని యెఱుంగునది. యాచ్ - అర్థ - ఇత్యాదులు గురుమంతంబులు. వ్యయ-ఇ యాంతము-యాచించు-అర్థించు-వ్యయించు. జి-ఇంచు-అనుచో నిత్యంబగుటంజేసి యయుగాగమంబు రాఁగా యాంతంబగుటంజేసి యియుడాగమంబు లేదనియెఱుంగునది. కృతాకృతప్రసంగి నిత్యంబునాఁబడు. నగు-

ఇయ్ - ఇంచు - నగియించు - నగించు. నగు - ఇయ్ - ఎను - నగియెను - నగెను. పడు - ఇయ్ - ఎను - పడియెను - పడెను - ఇత్యాదు లెఱుంగునది.

టీ. 'లఘ్వ్యకారాక్షరపూర్వక్రియాంతిమస్యానయో భవేదిద్వా' అనునది మూలము. గురువు గలుగనట్టివియు యకారముతుదను బొందనట్టివియు నొకయచ్చుగాని రెండచ్చులుగాని గల్గినట్టివియు నగు ధాతువులకంటెఁ బరములగు నించుక్కుయొక్క యికారమునకును, వక్రమునకును, 'ఇయుట్' అనునది యాగమముగ నగునని సూత్రార్థము. 'ఇయుట్' అనునది టకారము పోవు ప్రత్యయముగాన నించుగికారమునకును వక్రమునకును ముందగుటను స్మరించునది. 'దీర్ఘములును, జడ్డక్కరములకు ముందటివియును, పూర్ణబిందువునకుఁ బూర్వమున నున్నవియు గురువులనియుఁ దెలియవి లఘువులనియు ఛందశ్శాస్త్రములు దెల్పుచున్నవి. కాన నట్టివర్ణములు లేనిధాతువులు గురువిరహితములని గ్రహించునది. అయాంతములు=యకారము తుదను లేనివి. స్వరములన నచ్చులని ముందె యుక్తము. ఏకస్వరద్విస్వరంబుల=ఒకటిరెండచ్చులుగల. ఆగమమన వర్ణాధిక్యమని యుక్తము. వక్రమన 'ఎ-ఒ' అనునవని యాదినే తెలుపఁబడినది. విభాషనన వికల్పముగ ననుట స్పష్టము. 63-70 లచే నించుక్కు విధింపఁబడినది. ఈయర్థమునే గ్రంథకర్త యేకస్వరేత్యాదివివరణచే స్పష్టపఱచినాఁడు. వ్యతిరేకము ననుసరించిన గురువు గలిగినట్టివియు యకారముతుద నందినట్టివియు రెండిటికి మించిన యచ్చులు గల్గినట్టివియునగు ధాతువుల కియుడాగమము గలుగదని యర్థము గలుగును గానఁ దదర్థము బాలురకు సుబోధముగా గురుమంతంబగు నిత్యాదివివరణము వ్రాసెనని గ్రహించునది. కాఁగా నెట్టిధాతువుల కగునో యెట్టివాని కీయాగమము గలుగదో తెల్లమయ్యె. 63 చే నించుగాగమము సంస్కృతధాతువులకు నిత్యముగ నగుంగాన వక్రమించుక్కు వ్యవధానమునంజేసి యద్దాని కెదురగుట గలుగదు. ఇంచుక్కుధాత్వంతమునఁ జేరకున్నఁ బ్రత్యయాదులు సంస్కృతధాతువులకుఁ గలుగుటకే యవకాశము లేదు గాన భూతతద్ధర్మార్థములనగు 'ఏను-ఎడు-ఎడి' అను ప్రత్యయములసంబంధమైన ఎకారమును (వక్రము) ధాతువునకుఁ బరమగుట పొసఁగదని తాత్పర్యము. దీన సంస్కృతధాతువునకును బ్రత్యయములకును నడుమ నెపుడును నించుగాగమమె యుండునుగాన వక్రపరత్వ మద్దానికి సంభవింపదనునర్థముగల యించుగ్వ్యవధానంబునంజేసి యను నీక్రిందివివరణము సార్థకమగుచున్నది. అంగలాదులకుఁ దక్క సామాన్యముగఁ దెలుఁగుధాతువులకుఁ బ్రేరణమునందె యించుగాగము మగుట 70 చే తోఁచెడిఁగాన వానికిఁ బ్రత్యయసంబంధమైన వక్రము పరమగుట పొసఁగననునని దీనఁ దెలియనగును. కాఁగా వక్రపరత్వము తెలుఁగు

ధాతువులకే యగుననుట (నగు+ఎను=నగు+ఇయు+ఎను) స్పష్టమయ్యె. వక్రములలో హ్రస్వమగు నెకారమె ప్రక్రియాసందర్భమునుబట్టి పరమగుట గుదిరెడుఁగాన మూలస్థమగు వక్రశబ్దమున నెకారము మాత్రమె యర్థమని గ్రహింపవలసియున్నది. భుజ్:—ఇది గురువిరహితమును నయాంతమును నేకస్వరమును నయ్యెఁగాన దీనికి 63 చే నైన యించుగాగమము పరముగా నియుడాగమ మీవిధిచేఁ గలుగ 'భుజ్+ఇంచు=భుజ్+ఇయ్-ఇంచు=భుజియించు' అని రూపంబగు. ఈవిధి వైకల్పికమగుట నియుడాగమము గాకున్న 'భుజ్+ఇంచు=భుజించు' అనియే రూపముండును. 'గుణ+ఇంచు':—ఇది గురువు లేనిదియు యకారముతుదిని లేనిదియు ద్విస్వరమును నగుధాతువుగాన నీవిధిచే నియుడాగమంబైన 'గుణ+ఇయ్+ఇంచు=గుణియించు' అని రూప మపవాదిస్వరసంధిచే నగును. ఇయుడాగమము గానిపక్షమున 'గుణ+ఇంచు=గుణించు' అని రూపమగును. వ్యంజనపూర్వాక్షరములను గందాదులందు గురువులుగ నంగీకరించుట గలదుగాని సూరి యది కేవలము తెలుఁగునఁ బద్యపాదాంతముల ద్రుతపూర్వాక్షరములకు సంబంధించినదే గాని యితరములకు సంబంధించినది గాదని యెంచెనో 'భుజ' అనురీతిని నజంతమె ధాతువనియుఁ బ్రక్రియ సౌలభ్యమునకై సుఖోచ్చారణార్థకమగు దానిపై నున్నయచ్చు విడువఁబడెనుగాన నిట్టిచోటుల వ్యంజనపూర్వాక్షరములకు గురుత్వము గలుగదని యెంచెనో పద్యపాదాంతముల ద్రుతేతరముల కిట్లు వ్యంజనరూపము గలుగుటఁ గ్వాచిత్కముసుగల్గినను ద్రుతేతరవ్యంజనములకు ముందటియక్షరములు గురువులగుట యసంభవమును నగుట గమనించియొ 'భుజ్' అను మొదలగుచోటుల వ్యంజనపూర్వమును లఘువుగ నే నిరూపించెనని యెంచునది. 'యాచ్':—దీనియందలి యాకారము దీర్ఘంబగుట గురువుగాన గురుమంతంబు. కాన దీని కీవిధిచే నియుడాగమంబు గలుగమిని 'యాచ్+ఇంచు=యాచించు' అనియే గాని 'యాచియించు' గాదని గ్రహించునది. ఇట్లే యర్థధాతువునందలి అకారము సంయోగమునకు ముందటిదగుట గురువుగాన గురుమంతంబగుధాతువయ్యె. కాన నియుడాగమ మీవిధిచేఁ గలుగమిని 'అర్థ+ఇంచు=అర్థించు' అనియే గాని యర్థియించని గాదని గ్రహింపవలయును. 'వ్యయ్' ఇది యకారాంతమగుధాతువగుట నియుడాగమము గలుగమిని వ్యయించనియేగాని వ్యయియించునురీతి నుండఁదనుట స్పష్టము. 'జి':—ఈధాతువునకు 63 చే నైన యించుగాగమము పరముగా 64 చే జకారముమీఁది యికారమున కయుగాగమము నిత్యశాస్త్రమగుట వికల్ప విధియగు నియుడాగమవిధిని ద్రోసి గలుగ 'జ్+అయ్=జయ్' అని యిట్లు యకారాంతముగా నేర్పడును గాన నయాంతము గామి నీవిధిచే నియుడాగమము గలుగదనియు దాన 'జయ్+యించు' జయించనియే గాని జయియించునురీతి నుండదనియు జి-యించు-

అను చో నను మొదలగు సూరి వివరణమున కభిప్రాయము. ఇయుడాగమము ప్రత్యయాద్యచ్చులకును నయుంగాగమము ధాతువు నికారమునకును విధింపఁబడుటంజేసి యీవిధిచే జి ధాతువు నించు గికారమున కియుడాగమము గల్గినను ధాతువు నికారము దొఱకు చుండుటకు జిధాతువుమీఁది యికారమునకు 64 చే నయుగాగమ మనివార్యమే కాన నియుడాగమ రూపకార్యము చేసినను జేయకున్నను నయుంగాగమమునకుఁ బ్రాప్తి యగపడుచుండుటంజేసి యయుంగాగమవిధి నిత్యవిధి యయ్యెననియు దాన వికల్పవిధి యగు నియుడాగమ విధానమును నయుంగాగమవిధి బాధించుననియు దాన 'జి' అను మొదలగు నయుంగాగమము నిత్యముగ నందెడు నవి యీవిధిచే నగు నియుడాగమమునకుఁ బాత్రములుగాక నిత్యముగ నయుంగాగమము నె యందుననియుఁ గృతాకృతప్రసంగి నిత్యంబు నాఁబడునను సూరివివరణమున కభిప్రాయము. 'కృతాకృతప్రసంగి = చేసినను జేయకున్నను సంబంధించెడిది. కార్యము చేసినపుడును జేయనపుడును బ్రవర్తించెడిదని భావము. సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధముగునట్టియుఁ బరనిత్యాంతరంగాపవాదవిధులలోఁ బరవిధికంటె నిత్యవిధియు నిత్యవిధికంటె నంతరంగవిధియు నంతరంగవిధికంటె నపవాద విధియు బలీయము లనునర్థము గల్గినట్టియుఁ 'బరనిత్యాంతరంగాపవాదానాముత్తరోత్తరం బలీయః' అను పరిభాష ననుసరించి లక్షణకర్త యీసందర్భమున 'జి' అను మున్నగు నికారాంత సంస్కృతధాతువుల కియుడాగమము వారించెననుట తెల్లమె కాని యయుంగాగమవిధి (64) యియుడాగమవిధానమున (50) కంటెఁ బరవిధి యగుటంజేసి పైపరిభాష ననుసరించి పరవిధి యగుటచేత నయుంగాగమమె యగునని సిద్ధాంతము చేయుట కవకాశమగపడుచుండ నట్లుగాని నిత్యవిధియగుటంజేసి యయుంగాగమమె యగునని వివరించుట కీసందర్భము నత్యంతదృఢముగఁ జేయుటయె ప్రయోజనమని యనవలెను. నగియించు:—నగునది రెండచ్చులుగల (ద్విస్వర) తెలుఁగు ధాతువు. గురుమంతముగాదు. యాంతముగాదు. కాన దీని కీవిధిచే నించుకున కియుడాగమంబుగా 'నగు+ఇంచు=నగు+ఇయ్+ఇంచు=నగియించు' అని రూపంబగు. ఇయుడాగమము రానిపక్షమున నించుగాగమంబుతోడ నగించనియే యుండును. నగియెను:—ఇట భూతార్థకమగు నగుధాతువునకైన యెనువర్ణకము (16 సూ) నెకారమునకు (వక్రమునకు) నీవిధిచే నియుడాగమము గలుగుటంజేసి (నగు+ఎను = నగు+ఇయ్+ఎను=నగియెను) పైరూపము గల్గెననుట స్పష్టము. కాన నగియించనునది యిచ్చుకున కియుడాగమ మగుటకును, నగియెననునది వక్రమున కియుడాగమ మగుటకును నుదాహృతము లయ్యెననియుఁ దెలుఁగుధాతువులకే వక్రము పరమగుట పొసఁగు ననువిషయము దీన సూచితమయ్యెననియు గ్రహించునది. పదను ద్విస్వర

ధాతువు వక్రమున (ఎరు) కిట్లే యియుడాగమ మీవిధిచేఁగాఁ బడియె ననురూపము గల్గెనని యూహించునది. 63 విధి యదంతాచ్ఛికధాతువులకే యించుగాగమము స్వార్థమునవిధించెడిఁ గాన నుదంతములగు నగుపడుల కించుక్కు 70 చేఁ బ్రేరణముననే యగుననియుం దాన 'నగించు పడించు' అను నియుండాగమముగలుగని రూపములకుఁ గ్రమముగ నవ్వించుట పడఁజేయుట యర్థములనియు నెఱుంగునది. ఇట్లే యథార్థా ముగ నియుడాగమ మాయాధాతువుల కగునపుడు ప్రక్రియను గమనించునది.

సంస్కృతధాతువుల కుపసర్గములు చేరుటంజేసి యర్థవిశేషములు గలుగుటయు నర్థవిశేషసంపాదనమునకై యుపసర్గములను వానికిఁ జేర్చుటయు సహజములు. ఉపసర్గమునకు ధాతువే యాశ్రయమనుటయుం సహజము. ఉపసర్గల సంబంధమునఁ దొలుత గురుమంతము గాకున్నను ధాతువు గురుమంతమగుట గలిగెడి. 'తర్' అనుదీనికి 'ఉత్' అను నుపసర్గము చేర్చిన 'ఉత్తర్' అనియై గురుమంతంబగును. 'ఘట్' అను నీయొకాచ్కుమునకు 'సమ్' చేర్చిన 'సంఘట్' అనియై గురుమంతం బగును. ఇట్టి యుపసర్గసంబంధమున గురుమంతములయినవాని కీవిధిచే నియుడాగమము గలుగనగునో గాదో సూరి సూచింపకుండుట విచార్యవిషయము. ధాతువు సహజముగ గురుమంతము గారాదుగాని యుపసర్గయోగమున గురుమంతమైన బాధ లేదన్న నట్టిచోటులం దియుండాగమము గలుగనగును. ఏమూలముగను ధాతువు గురుమంతము గారాదన్న నిట్టిచోటుల నియుడాగమంబు గామి 'ఉత్తరించు-సంఘటించు' అనియే రూపము లేర్పడెడిఁగాని 'ఉత్తరియించు-సంఘటియించు' అనురీతి రూపములు గలుగఁజాలవు. ఏమూలముగను ధాతువు గురువు గారాదనియే ప్రాచీనలాక్షణికు లెంచి 'ఉత్తరియించు-సంఘటియించు' అను రీతి నియుడాగమంబుతోఁ గూడిన రూపముల నసాధువులని వ్రాసినారు. ఇయుండాగమము నందఁదగు ధాతువునందు సహజములై తోఁచు నొకటి రెండక్షరములయచ్చులలో నేదియు గురుమంతము గారాదని గురుమంతంబను సూత్రస్థదళమున కర్థముచెప్పుట యుచితముగాని యుపసర్గసంబంధమున ధాతువునందలి యక్కరమునకుఁ గాక యుపసర్గాక్షరమునకైన గురుత్వము ననుసరించి ధాతువును గురుమంతమని యియుడాగమము గలుగదనుట యుక్తిదూరప్రసంగమని కొందఱని యుత్తరియించు సంఘటియించు మొదలగునవి యియుడాగమము నందినవియు సాధువులే యనిరి. ఇందులకు "నప్రాద్యవ్యయసంబంధస్తన్నిషేధప్రయోజకః, ఇత్యాథర్వణవచనాత్, విఘటియించు ఇత్యాదీని రూపాణి నిర్బాధాని." అను వాక్యములు ప్రమాణములు. (చూ. అహోబలపండితీయము. 488 పుట) కాని యుపసర్గమునకు ధాతువు తప్ప వేఱొకటి యాశ్రయము లేమిని నద్దా

నికి స్వతంత్రప్రయోగార్హతా శూన్యమగుటను, దానియోగమున నర్థవిశేషస్ఫూర్తి ధాతువునకుఁ గలుగుచుండుటను గమనించిన నుపసర్గము ధాత్వవయవమే యగు ననియు నవయవమున కైన గురుత్వము యవయవి కైనయట్లే విశ్వసింప నగుననియుఁ దాన నుపసర్గయోగమునకైన గురుత్వము ననుసరించి ధాతువును గురుమంతముగనే భావించి యట్టివాని కియుఁడాగమము గూర్పరాదనియుఁ బ్రాచీనలాక్షణికులు భావించి యుండురని వారి వ్రాఁతలనుబట్టి చెప్పనగును. సోపసర్గమై గురుమంతమగు ధాతువున కియుఁడాగమము గూర్చి యుదాహరింపమిని సూరి ప్రాచీనమార్గమునే యనుసరించె ననవచ్చునుగాని సందిగ్ధాంశమును దెల్లము సేయకుండుట మాత్ర మాతనిది దోషమని చెప్పవలసియున్నది. కాని నన్నయాది ప్రాచీనకావ్యములందు మాత్ర ముపసర్గము యోగమున గురుమంతమైనను నియుఁడాగమము గలుగకుండుటె తోఁచెడిని. ఇయుఁడాగమముచే నించు ఇకారము ధాతువుతో వేఱుపడినపుడే యచ్చునకు యతి వేయవలెను గాని యట్లు వేఱుపడక ధాతువుతోఁ గలిసినపుడు హల్లునకే యతి వేయవలెనని ప్రాచీనఛందఃకర్తల యాశయము. ఇయుఁడాగమముచే వేఱుపడినను బడకున్నను నించు ఇకారమునకు యతి వేయనగుననియుఁ వేఱుపడనపు డించుఇకారముతోఁ గూడిన హల్లునకును యతి వేయఁదగుననియు నవీనులమార్గము. దీని మంచిచెడ్డలవిచారము ఛందశ్శాస్త్ర విమర్శనావసరమునఁ జేయఁదగిన దగుట నిటఁ బరిత్యక్తము.

## పడ్వాదుల నలవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాషనగు. ౫౧.

పడ్డ - పడిన - పడ్డను - పడినను. పడు - ఇడు - చెడు - తగు - అను - కను - కొను - తిను - మను - విను - చను - ఇవి పడ్వాదులు.

టీ. 'క్వచిన్నవర్ణే డేర్లోపః క్వచిడ్డోశ్చ తథాభవేత్, క్వచిత్తదర్థే డయుగం క్వచిన్నస్యేచ్ఛ లోపవాన్.' అనునాథర్వణము మూలము. నవర్ణకము 41-46 లచే నగును. పడు మొదలగుధాతువులకుఁ బరముగానున్న నవర్ణకమునకు హ్రస్వాకార (అ) మాదేశమును నాధాతువుల తుదినున్నహల్లునకు ద్విత్వమును గలుగునని సూత్రార్థము. పడు ధాతువునకు 41-46 లచే నైన నవర్ణకము పరముగా నానవర్ణకమున నకారమును దుదినున్న డివర్ణమునకు ద్విత్వమును నీవిధిచేనై ('పడ్డి+అ') యపదాదిస్వరసంధి గూర్పఁ బడ్డ యని రూప మేర్పడును. అత్వాదేశ ద్విత్వములు గాకున్న 17 విధిచే ఇగాగమము గలిగి పడిన యని రూపమగును. ఇది 46 చే నైన నవర్ణకము పరముగా నత్వద్విత్వములు గలిగినందుల కుదాహరణము. పడ్డను:—ఇది 41 చే ద్రుతాంతముగ

నైన నవర్ణకము పరముగా నత్వాదేశ ద్విత్వములు గలుగుట కుదాహృతము. కాన 'పడు+నను=పడి+నను=పడినను = పడ్డి+అను = పడ్డను' అను రీతిని ప్రక్రియను గమనింపవలెను. అత్వాదేశ ద్విత్వములు గలుగనిపక్షమునఁ బడినను నని రూపమగుననుట స్పష్టము. ఇట్లే తక్కుంగల రూపముల ప్రక్రియను గమనించునది. తగు ధాతువున కీవిధిచే 'తగ్గ-తగ్గను-తగినను' అనియు, నువర్ణాంతములకెల్ల 'అన్న-అన్నను-అనినను' అనురీతిని రూపము లేర్పడుట నూహించికొనునది. ఈవిధిచే 46 చేనైన నవర్ణకమున కాదేశమైన అకారము నవర్ణకస్థానీయమగుట నవర్ణకముగానే యెంచి 117 చే దానిమీఁది తచ్ఛబ్దవకారమునకు లోపముఁ గూర్పవలసియుండుటుగాన 'పడ్డాఁడు-అన్నాఁడు' మొదలగురూపములును నేర్పడునని గ్రహించునది. 'తగ్గాఁడు-చన్నాఁడు' అనురీతిరూపములు కవిప్రయుక్తములు గామి శ్రుతికటువులగుటఁ గలుగవని గ్రహించునది.

## క్రియాఫలంబు కర్తృగామియగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తంబగు. ౫౨.

ఇదియె యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు - వండుకొనుచున్నాఁడు.

టీ. క్రియాఫలమనఁగాఁ గ్రియావాచ్యంబగువ్యాపారముచే సిద్ధించెడిఫలమని యర్థముగాదు. క్రియావాచ్యవ్యాపార మెట్టిఫలమును గోరి యారబ్ధమయ్యెనో యాఫలమని గ్రహింపవలయును. దీన వంటచేయుటయనువ్యాపారముచే సిద్ధించుఫలము శాస్త్రీయముగ నన్నాదులు మెత్తనగుటయేయైనను నిటమాత్రము వంటచేయుట యనువ్యాపారముచే సిద్ధించెడుఫలము భుజించుటయె యని గ్రహింపవలయును. భుజించుటయె వంట చేయుటకుఁ బ్రధానఫలమని యెంచవలెనని భావము. అట్టిఫలము కర్తనే చెందినట్లు ప్రధానముగఁ జెప్పవలసివచ్చిన ధాతువునకుఁ గొనునది చేర్పఁబడునని సూత్రార్థము. సంస్కృతమునందలి యాత్మనేపదమునర్థమును గొనుతోఁ గూర్పఁబడిన ధాతువు తెలుపునని యిదియె యాత్మనేపదార్థమనువివరణమున కభిప్రాయము. దీనఁ దనకొఱకుఁ దాను స్వయముగ వండుకొనునపుడే కొనుధాతువును ధాతువుతుదఁ జేర్పవలెనుగాని యొకరికొఱకుఁడు వంటచేయునపుడు కొనుధాతువును జేర్పరాదని స్పష్టమయ్యెడి. క్రియాఫలము=ధాతువాచ్యమగు వ్యాపారముచేఁ గోరఁబడినఫలము. కర్తృగామి=కర్తనే చెందినది. అనుప్రయుక్తము=ధాతువు ననుసరించి ప్రయోగింపఁబడుట. వండుకొనుచున్నాఁడు:— ఇట వండుధాతువాచ్యమగువ్యాపారమగు వంటచేయుటచే నగుఫలము భుజించుట. అది

వంటచేయువానినే చెందినట్లు చెప్పఁదలంచితిమిగాన వండుధాతువు ననుసరించి యీ విధిచేఁ గొనను దనుప్రయుక్త మయ్యెను. పిదప లడాదులం దాయాకార్యవిశేషము లాయావిధులచేఁ గల్గుట నరయుచు 'వండుకొనుచున్నాఁడు' మొదలగురూపముల గ్రహించునది. వండుకొనుచున్నాఁ డనఁగాఁ దాను భుజించుటకొఱకుఁ దాను స్వయముగ వంటచేసికొనుచున్నాఁడని భావము. ఇతరునికొఱ కితరుఁడు వండిన 'వండుచున్నాఁడు; వండెను' అనురీతినే ప్రయోగింపవలెననుట స్పష్టము. మీఁదిసూత్రముచే ధాత్వంతమున కికారమగుటను గమనించి 'వండికొనుచున్నాఁడు' మొదలగురూపములను బక్షమున నూహించుకొనునది. భూతమున నెనువర్ణకము నిగాగమును గలిగినపిదప 'వండుకొనియెను-వండికొనియెను' అనురీతి రూపములేర్పడుటను గమనించునది. కొననునది గ్రహించు నర్థమిచ్చు సార్థకక్రియగాన ధాతుపదముచే దానిని వ్యవహరించుట సరసము. చింతామణ్యాథర్వణతద్వ్యాఖ్యానములు కొనియనుదానికి 'క' అనునదాదేశముగా నైన పట్టుకవంటిరూపముల సమ్మతింపమిని వాని ననుసరించుసూరియుం వాని నంగీకరింపకుండుట యుచితమగుటంజేసియు, నొక్కొకపట్టున నాథర్వణాదిచింతామణివివరణమతములంగూడఁ జింతామణ్యేకదృష్టితో పరిగ్రహింపని సూరి పదునేడవశతాబ్దినుండియైనవాఙ్మయమునఁ దోఁచు నిట్టిరూపములఁ దలంపకుండుటే సహజమగుటంజేసియు, నింతవఱకున్నదానినివిడువక మెఱుఁగుపెట్టుచు ననువదించిన సూరి యిప్పట్టునమాత్రమే కొనియనుదానికిఁ గాదేశము చెప్పుమాటనే హరికారికావళిలో నున్నదానిని విడిచెననుట యుక్తిదూరప్రసంగ మగుటంజేసియుఁ, బ్రాచీనాంధ్రవాఙ్మయలక్షణములఁ బ్రమాణీకరించుచు బింబప్రతిబింబములుగఁ దోఁచు బాలవ్యాకృతి హరికారికావళులలోఁ బట్టుకవంటిరూపముల సాధించుసూత్రము గ్రంథసందర్భమునకు విరుద్ధముగ హరికారికావళియందే నిబద్ధమై యుండుటను బాలవ్యాకరణసంవిధానతత్త్వము నెఱుంగక తత్సంస్కృతీకరణమునఁ దద్భిన్నతను దోఁపఁజేయ హరికారికావళియె యట్లు పాటుపడినట్లు విశదమగుటంజేసియుఁ, గొనునకుఁ గాదేశమును హరికారికావళిలో నున్నదానిని విడుచుటను హరికారికాచౌర్యము సూరికి సిద్ధమను గుప్తార్థప్రకాశికోక్తి స్వాశ్రయమతచ్ఛేదకమై ఫలించెడి.

### కొనుధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగానగు. ౪౩.

వండికొనియె-వండుకొనియె. బహుళంబనుటచే యాంతంబునకు నిత్యంబు - చేసికొనియె.

టీ. పూర్వసూత్రముచే ననుప్రయుక్తమైన కొనుధాతువు పరమగుచుండ ధాతువున కిగాగమము బహుళముగ నగునని సూత్రార్థము. 'ఇక్' అనునది కకారముపోవు ప్రత్యయముగాన ధాతువునంతమున కగుననుట స్పష్టము. వండు:—దీనికిఁ బూర్వవిధిచేఁ గొనుధాతువును నీవిధిచేఁ గొనుపరముగా నిగాగమమును నై లిట్టుదుజ్జున కెను పర్ణకము 16 చేఁ గా 'వండికొనియె' ననురూపము గలుగును. ఇట్లే యిగాగమము గలుగనిపక్షమున 'వండుకొనియె' నగుననుట స్పష్టము. వికల్పమనక బహుళమనుటంజేసి చేయు-మోయు-మేయు మొదలగు యకారముతుదిని గల ధాతువుల కీవిధిచేఁ గొను పరమగుచుండ నిగాగమము నిత్యముగ నగునని గ్రహింపవలెనని బహుళమనుటంజేసి యను నీక్రిందివివరణమున కభిప్రాయము. మీఁదివిధిచే యకారమునకు సకార మాదేశమగుట 'ఇ-ఎ'అనునవి పరమగునపుడె పొసఁగెడిఁగాన నికార మట్టియకారాంతములకుఁ బాక్షికమైన నికారము గలుగనిపక్షమున సకారము యకారమున కాదేశముగా నవకాశము లేమిని 'చేయుకొనియె-చేయుకొనుచున్నాఁడు' మొదలగుననిష్టరూపములు గలుగవలసివచ్చునుగాన నిత్య మీవిధిచే నట్టివానికి నిత్యమని శాసింపవలసివచ్చెననియు నిత్యము నిత్యముగనైనఁ దరువాతివిధిచే యూకు సకారము నిత్యముగ నగుంగానఁ బైని నిరూపించినరీతి ననిష్టరూపములు గలుగఁజాలవనియు నెన్ని యిమ్మార్గమును సూరి యాశ్రయించెనని గ్రహించునది. (బహుళమనుట) ఆత్మనేపదార్థకమై యనుప్రయుక్తమగు కొనుధాతువంతమందుఁ గలధాతువుల క్త్వార్థకరూపములు 'వండికొని-వండుకొని' అను రీతి నుండవలసియుండఁ దరువాతి యాంధ్రగ్రంథములఁ గొన్నిట 'వండుక-పట్టుక' అనురీతి నిగాగమము గాకయు 'కొని' అనునది 'క' అనురూపము దాల్చియు నగపడెడి. కాని యిట్టిరూపములు దేశ్యధాతువులకేగాని సంస్కృతధాతువుల కగుట మాత్రము చూపట్టదని గ్రహించునది. 'చోరాత్మనే పదార్థే గృహ్ణాతావాగమస్య వేత్వం స్యాత్' అనుమూలమును; 'ఇంచుగభావేపి నేర్చికొని' అని కేవల సంస్కృతధాతుదృష్టితో నున్న మూలమును సవరించునహోబలుని వ్రాఁతనుబట్టి 52-53 సూత్రములు కల్పితములనుట స్పష్టము.

ఇకారవక్త్రంబులు క్తంబులంచలివి పరంబులగుచో యూకు సకారంబగు. ౫౪.

చేయు - చేసిరి - చేసి - చేసికొను - చేసెను-చేసెడిని-ఇత్యాదు లెఱుంగునది.

టీ. ఉక్తములందలివి = చెప్పఁబడినసూత్రములందున్నవి. పూర్వసూత్రములచే విధింపఁబడినవని భావము. ఇకారవక్రములు=ఇకారము, ఎకారము. వక్రములలో నెకారమె సూత్రవిహితమై గన్పట్టునని ముందె యుక్తము. 17 చే భూతమున నిగాగమము విధింపఁబడినది. 53 చేఁ గొనుధాతువు పరముగా నిగాగమము విధింపఁబడినది. 38 చే క్త్వార్థమున నికారమగును. 16 చే నెనువర్ణకమును, 23 చే నెదగాగమమును నెడుగెడిగాగమములును, 26 చే నెడువర్ణకమును 44 చే నెడియెడులును విధింపఁబడినవి. కానఁ బైవిధులచే నగునికారమును, నెకారమును, నవ్యవహితపరములై యుండ యకారముతుదిని గలధాతువులయంత్యయకారమునకు సకారము నిత్యముగ నాదేశమగునని సూత్రార్థము లభించెడి. చేసిరి:—భూతకాలిక ప్రథమపురుష బహువచనరూపముగాన 17 నైన నివర్ణకము పరముగా యకారమునకు సకారాదేశమగుట కుదాహరణమయ్యెను. రువర్ణక మిట రివర్ణమగుటకుఁ దత్సమము 26 సూత్రమును స్మరించునది. చేసి:—చేయుధాతువున కైన క్త్వార్థకే కారము పరముగా యాకు సకారమగుట కుదాహరణము. చేసికొను:—కొనుధాతువనుప్రయుక్తము పరముగా 53 చేనగు నిగాగమము పరమగుచుండ యాకు సకారమగుట కుదాహృతమయ్యెను. ఇట 53 చే నిగాగమము బహుళమనుటంజేసి నిత్యముగా నగుంగాన చేసుకొనియె ననురీతినిగాని చేయుకొనియెనను రీతినిగాని రూపము లేర్పడవనుట స్పష్టము. చేసెను:—ఎనువర్ణకము వక్రము పరముగా యాకు సకారమగుట కిది యుదాహృతము. చేసెడిని: —23 చే నెడిగాగమము ప్రథమపురుష నువర్ణకము పరముగాఁ గాఁగ నెడిగాగమము నెకారము వక్రము పరముగా యాకు సకారమగుట కిది యుదాహృతము. ఇట్లే చేసెడి-చేసెడు-మున్నగువిశేషణముల ప్రక్రియను వక్రము పరముగా గమనించునది. ఇకారము నెకారము పరమగునపుడె యాకు సకారము నిత్యముగ విధించుటంజేసి-చేసుక-వ్రాసుట-చేసుట-మొదలగునవి యలాక్షణికములని యెఱుంగునది. ఇది కేవలముచ్చారణమున నచ్చుచేర్పున నైన మార్పునుబట్టి యేర్పడినదనుట తెల్లము.

## చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందువేని విభాషనగు. ౫౫.

అన్చున్నాఁడు - అంచున్నాఁడు - అనుచున్నాఁడు. అన్చును - అంచును - అనుచును. అను - కను - కొను - తిను - మను - విను - ఇవి యన్వాదులు.

టీ. 'శత్రర్థే తూతశ్చా నో స్తస్య స్యాచ్చ పూర్ణబిందురపి' అనునది మూలము. 14-43 లచేఁ జువర్ణకములు విధింపఁబడి యుండుటను స్మరించునది. 14-43 లచే నగు చువర్ణకములు పరములగుచుండ 'ను' అనున దంతమందుఁ గలధాతువులలో నువర్ణము మీఁది యుకారమునకు లోపముగాని యానువర్ణమునకు నిండుసున్న గాని యగునని సూత్రార్థము. అనుచున్నాఁడు:—ఇది యనుధాతు లట్ప్రథమపురుషైకవచనరూపము గాన నిందలి చువర్ణక మున్నానుబంధము పరముగ 14 చే నైనదనుట తెల్లము. అది పరముగా నీవిధిచే నువర్ణము మీఁదియుత్వము లోపించిన నన్చున్నాఁడనియుఁ బూర్ణ బిందువైన నంచున్నాఁడనియు నగును. ఈరెండును గానిపక్షమున ననుచున్నాఁడనియే యుండుననుట స్పష్టము. అనుచును:—ఇది 43 చే శత్రర్థమున ద్రుతాంతముగ నైన చువర్ణకరూపమనుట స్పష్టము. ఈచువర్ణకము పరముగా నుత్వలోప మీవిధిచేనైన నన్చుననియు నెఱసున్నయైన నంచుననియు రెండును గాకున్న ననుచును ననియు రూపములగును. ఇట్లే న్వంతములగు నీగణమునందలి ధాతువులకెల్లఁ జువర్ణకములు పరముగా రూపముల నూహించికొనునది. ఇవి యన్వాదు లనుటంజేసియు, దీర్ఘ పూర్వకములగు న్వంతధాతువుల నిందుఁ జేర్పమింజేసియు, నన్వాదులకును జువర్ణక ములు పరములగునపుడె యీకార్యములు విధింపఁబడుటంజేసియు వూను మొదలగు వానికిఁ బ్రేరణార్థకమగు చుక్కు పరముగా మహాకవిప్రయోగములం దగపడు వూంచు మొదలగురూపములు సిద్ధింపవనియే తలంపనగు. మఱియు 73-74 లలో వూను మానను దీర్ఘపూర్వ న్వంతధాతువుల నుత్వలోపముంగూర్చిగాని పూర్ణబిందువుంగూర్చిగాని యుదాహరింపకుండుటయుఁ బైవిషయమునకుఁ బోషకమె యగును. మఱియు నెట్లో యీవిధియందలి చువర్ణకం బనుదానిచేఁ జుక్కును గ్రాహ్యమెయని సమ ర్థించి దీర్ఘపూర్వన్వంతములకును నీకార్యములగునని భావింతమన్న నుత్వలోపబిందు రూపములు రెండును నుండవలసివచ్చును గానఁ బూన్చనియుఁ నుండునని యంగీకరింప వలసివచ్చును. బిందువుతోవలె యతిప్రాసముల నుత్వలోపము గల్గిన వూన్చు మాన్చి త్యాదులును నగపడెనేని యెట్లేని సాధించుటకు యత్నించుట సమంజసము.

ఉన్నశబ్దంబు పరంబగునపు డుండుధాతువునకు లోపంబగు. ౫౭.

ప్ర. ఉన్నాఁడు - ఉన్నారు - ఉన్నది. ఉన్నవి. మ. ఉన్నావు - ఉన్నారు. ఉ. ఉన్నాను - ఉన్నాము. ఉన్నవాఁడు.

టీ. 13 చే ననుబంధముగ లట్టు పరమగునపుడు ధాతువునకగునది యున్నశబ్ద మనుట స్పష్టము. అది లట్టునందె యగుంగాన నపుడె యీవిధిచే నుండుధాతువునకు

లోపమగు ననుట తెల్లము. ఉన్నానుబంధము పరముగా నుండుధాతువు నిత్యముగ లోపించునని సూత్రార్థము. 'ఉండు+ఉన్న+ఁడు'అని యుండ నాదినున్నయుండుధాతు వీవిధిచే లోపించె. ఆశ్రయమైనధాతువు లేమిని 14చే జువర్ణకము గాదు. ఇఁక శేషించిన 'ఉన్న+ఁడు' అనుదానిలోని యున్నకు 15 చే దీర్ఘము గలుఁగ నున్నాఁడని రూపమేర్పడును. ఇట్లే తక్కుఁగలపురుషముల యేకవచనబహువచనములం దుండు ధాతు లోపముచేతను నున్నానుబంధమునకు దీర్ఘము సిద్ధించుటచేతను రూపము లేర్ప డుట నూహించికొనునది. అమహత్వమున నున్నానుబంధముమీఁద 12 చే డుజ్రులకు దివులగుటయుం దివులు పరములుగా 15 చే దీర్ఘమున్నానుబంధమునకుఁ గాకుండుటయు స్మరించికొనుచు నున్నది యున్నవి యనురూపముల సాధించికొనునది.

ఉండుధాతువునకుఁ గ్తవదర్థకనవర్ణకము (46) పరమగునపు డున్నయనురూ పము గలుఁగుననుటకుఁ బ్రమాణ మగపడదు. (డకారము నవర్ణమగుటకుఁ బ్రమాణము మృగ్యము) కాన నున్నయను క్తవదర్థకవిశేషణరూపముమీఁద సమాసము 9 చేఁ దచ్ఛ బ్దముం గూర్చి 117 చే వకారలోపముగూర్చి యున్నాఁడిత్యాదుల సాధించుట పొసఁగమి నీవిధి యావశ్యకమయ్యెనని తెలియఁనది. కాని యున్నవాఁ డుండువాఁ డిత్యాదులే నన్నయాది ప్రాచీనకవిప్రయుక్తము లై యుండుటచేతను, నుండువాఁడు, ఉండువారు అనునట్టివుచ్చారణమున నున్నవాఁడు నున్నవారని మాఱెనని చెప్పుట సహజ మును సార్థకమును నగుటచేతను నుండువాఁడు-ఉండినవాఁడు మొదలగు తచ్ఛబ్దము తోడి యుండుధాతువిశేషణరూపములనుండియె క్రమముగ నీరూపములు గలిగి గ్రాంథి కము లయ్యెననుట యుచితముగాన నీవిధి యసహజ కృత్రిమవిషయ ప్రతిపాదకమన సందియము లేదు. లక్షణకర్తతచ్ఛబ్దముతోడి యుండినవాఁడను రూపమున నున్నయుండిన యనుదాని నన్నఁగాఁజేసియున్నాఁ డిత్యాదుల సాధింప కిట్టిమార్గము పట్టుట కుండిన యనువిశేషణము భూతకాలికమగుట నద్దానినుండి యేర్పడిన యున్నాఁడనునదియుఁ దత్కాలికమె యగుంగాన వర్తమానార్థకత దానికిఁ బొసఁగదని యెంచుటయె కతమని తోఁచెడిని. కాని, 45 చే నెడియెడులకు లోపము గల్గినపక్షమున నుండుధాతువున కుండనువిశేషణరూపము గలుగనగుంగాన దానిపైఁ దచ్ఛబ్దమునుగూర్చి వకారలోపముం జేసి యుండునున్నగా మార్చి ప్రక్రియం జూపుట తద్ధర్మార్థకము త్రికాలవాచికాఁ దగుటంజేసి సరసమని చెప్పనొప్పును. పైని వివరించిన విషయము ననుసరించి యీలక్ష ణముఁ బొప్పుననుండిన యనువిశేషణరూపమునుండి యున్నయనునది గలుగదని ఫలిత మును బ్రధానముగ గ్రహింపఁదగును. చూడుఁడు మీఁదిసూత్రము. ఉచ్చారణసంజాత హల్పరిణామమూలక మిదియగుట స్పష్టము.

## చేదాద్యర్థనాంతంబయిన యుండున కున్నాదేశంబు విభాషనగు. ౪౨.

ఉన్నను - ఉండినను.

టీ. 41 చే నగు ద్రుతాంతనవర్ణకముతోడి యుండుధాతువునందలిఁ ఉండిన యనుభాగమున కున్న యనున దాదేశమగునని సూత్రార్థము. 'ఉండినను':—అనునది చేదర్థనాంతమగునుండుధాతురూపము. ఇందుఁ జేదర్థనాంతమగు నుండిన యనుభాగమున కున్న యనున దాదేశముగాఁ 'ఉన్న + ను=ఉన్నను' అని రూపమగును. ఉన్నాదేశము గానిపక్షమున నుండినను ననియే యుండుననుట స్పష్టము. చేదర్థనాంతమనుటంజేసి నవర్ణకము మీఁది ద్రుతము మాత్రము శేషించుననుటయు నుండినయనుదానికే యున్నాదేశమగు ననుటయుఁ జెల్లను. చేదర్థనాంతమునకె యని విశేషించి యనుటంజేసి క్త్వవదర్థనాంతవిశేషణమున కీవిధిచేనున్న గలుగదనియుఁ గ్త్వవదర్థనాంతముండిన యనియే యుండుననియు దీనఁ గ్త్వవదర్థనాంతములగు నుండుధాతురూపములకుఁ దచ్ఛబ్దమను ప్రయుక్తమగునపుడును వలోపము గల్గినపుడును గ్రమముగ నుండినవాఁడు నుండివాఁడనురూపములే గాని యున్నవాఁ డన్నాఁడను రూపములు గలుగవనియు గ్రహింపవలెను. దీనఁ బూర్వసూత్రము సార్థకమయ్యెడి. కాని దీన నున్నవాఁ డున్నవారను మొదలగు నన్నయప్రయుక్తరూపము లీలక్షణముచే నసాధ్యము లని యనక తప్పదు.

## తిదుటలు పరంబులగునపు డన్వాదులనుస్థానంబున నున్నయు నుండుడులోపంబును విభాషనగు. ౪౩.

అందురు - అంట - ఉందురు - ఉంట. పక్షంబున - అనుదురు - అనుట - ఉండుదురు - ఉండుట - ఇత్యాది.

టీ. 'తి' అనునది 18 చే నగునుగాన భూతార్థవృత్తియగుధాతువునకు లిట్టుపుష్టు పరమగునపుడగు తివర్ణమని యర్థము. 'దు' అనునది 22 చే నగునుగాన లాట్టు రుఙ్ఞు పరమగునపుడగు దుగాగమమని యర్థము. 'ట' అనునది 35 చే భావమునందగు టవర్ణకముగాన దీనికి భావార్థకటవర్ణకమని యర్థము. కాఁగాఁ భూతంబున లిట్టు పుష్టు పరమగునపుడగు తివర్ణమును, లాట్టు రుఙ్ఞు పరమగునపుడగు దుగాగమమును భావార్థమునందగు టవర్ణకమును బరములుగా ననుమొదలగు ధాతువులందలి నువర్ణమున కంతకు నిండునున్నయు నుండుధాతువునకుఁ దిదుటలు పరములుగా నుండుధాతువుతుదినుండు డువర్ణమున కంతకు లోపమును వికల్పముగ నగునని సూత్రా

ర్థము లభించెడి. అనుదురు:—ఇట దుగాగమదువర్ణము పరముగా నీవిధిచే ధాత్వంతమున నున్న నువర్ణమునకు సెఱసున్న గలుగ నుందురని రూపమేర్పడెడి. అనుట:—ఇచట భావార్థకటవర్ణకము పరముగా నీవిధిచే నిండుసున్నగా నంట యనురూప మేర్పడును. ఉండుదురు:—ఇచ్చో నీవిధిచే దుగాగమదువర్ణము పరముగా ధాత్వంతమున నున్న డువర్ణము లోపింప లుప్తశేషంబైన 'ఉం' అనుదానితో 'దురు' అనునది గలిసి యుందురని రూపము సిద్ధించెను. ఉండుట:—ఇక్కడ భావార్థకటవర్ణకము పరముగా డువర్ణ మీవిధిచే లోపింప లుప్తశేషంబగు 'ఉం'అనుదానితో, టవర్ణకముగూడి 'ఉంట'అను రూప మేర్పడెను. బిందుడులోపములు వైకల్పికము లగుటఁ గలుగనిపక్షమున ననుదురిత్యాదిరూపములు గలుగుననుట స్పష్టము. సున్నశబ్ద మఱసున్నను నిండుసున్నను జెప్పఁ గలదియైనను బిందువునందఁదగు నువర్ణములెల్లఁ నుడితొలిహ్రస్వములకు మీఁదివగుట సంధి 22 విధి ననుసరించి యర్థముగా నవకాశములేమి సున్నశబ్దముచే నిండుసున్నయే వాచ్యమగునని గ్రహించునది. ఉండుధాతువునందలి 'ఉం' అనునది నిల్చియుండవలెను గాన నుత్వయుంతడువర్ణమునకే లోపము విధింపఁబడెనని తెలియునది. తివర్ణకము పరముగా బిందువగుట కుదాహృతికై మీఁదిసూత్రము నరయునది. తింట అంట కంట మొదలగు రూపము లలాక్షణికములని 'పూర్వస్య న వికారో నోః'అనునథర్వణోక్తిని మూలముగఁ గొని 'మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి పనిగొంట' అనురీతినొప్పు శ్రీనాథాదుల ప్రయోగముల నరసియు నహోబలపతి వ్రాసియున్నాఁడు. (చూ. అహోబలపం. పుట. 499) దీన నిట్టిరూపములు నన్నయాథర్వణులకాలమున లేవనియుఁ గాలక్రమమున వ్యవహారవశమున నువర్ణము బిందువగుట నిట్టిరూపములు శ్రీనాథాదులకాలమునకుఁ గల్గెననియు నూహింపనగుంగాన నాథర్వణోక్తి నూఁతగాఁగొని యానంతరకాలిక ప్రయోగముల నలాక్షణికము లప్రయోజ్యములనుట యతిసాహసమనియు నన్నయాథర్వణలక్షణములచే నివి సిద్ధింపవని వ్రాయుటయే భాషాపరిణామప్రకాశనమునకు సహజమైయుండుననియు ననుటకు సందియములేదు. నువర్ణము బిందురూపమునందుట తెలుఁగువ్యవహారమున సహజము. కాన నీమార్పునుకరణమున నంతటఁ గాలక్రమమునఁ దోఁచుట యవిరుద్ధంబ.

ఇట బిందువుమీఁది తదలకు నిత్యవైకల్పికంబులయి టడలగు. ఉదా.

అంటివి - అనితివి - అండురు - అందురు. ఉంటివి - ఉండితివి - ఉండురు - ఉందురు.

టీ. పూర్వసూత్రముచే నన్వాదుల నుస్థానమున బిందువగునపుడును నుందు డులోపము గలిగినపుడును 'తి-దు' అనునవి నిండుసున్నకుఁ బరములగుటయె గలిగెడు గాన నట్టిదశయందు 'తి-దు'అనువాని హలంశమునకుఁ (త్-ద్) క్రమముగ 'త్'అను దానికి 'ట్'అనునది నిత్యముగను, 'ద్'అనుదానికి 'డ్'అనునది వికల్పముగను నాదేశము లగునని సూత్రార్థము. తిదులహలంశమునకె 'ట్-డ్'అనున వగుననుటచే వానిమీఁది యిత్వోత్వములు శేషించుననియు నవి 'ట్-డ్'అనువానితో మేళవించి 'టి-డు'అను రూపము నందుననియు స్పష్టపడియెడి. మఱియు దీన సూత్రమున టడలందలి యకార ముచ్చారణార్థకమనియుఁ దెల్లమయ్యెడి. బిందువు సోఁకున నీమార్పు జరుగుట సహజ మనుట పరళాదేశాది ద్రుతకార్యప్రక్రియంబట్టి విశదంబ. అనితివి:—ఇటఁ దివర్ణకము పరముగాఁ బూర్వసూత్రముచే నన్వాదుల నుస్థానమున బిందువు గా 'అం+తివి' అని యుండుననియు నీవిధిచే బిందువుమీఁది తివర్ణకము హలంశమునకు'ట్' అనునది గలుగ 'అంట్+ఇవి=అంటి'వని రూపమగుననియు గ్రహించునది. బిందువుమీఁది తివర్ణము హలంశమునకు టవర్ణమగుట నిత్యముగాన బిందువుగాని పక్షమున ననితివను, నుస్థానమున బిందువేర్పడని, భూతంబున నిగాగమంబైన, రూపమే యొప్పునని గ్రహించునది. అందురు:—ఇటఁ బూర్వవిధిచే నేర్పడినబిందువుమీఁది దువర్ణకము హలంశమున కీవిధిచే డవర్ణము వికల్పముగ సిద్ధింప 'అండురు' అనురూపము గలుగును. డకారము గాకున్న బూర్వవిధిచే నుస్థానమున బిందువుగా 'అందురు' అని యుండును. బిందువును నుస్థానమునఁ గాకున్న ననుదురని యుండుననుట స్పష్టము. 62 చే నుత్వలోపంబైన 'అండ్రు-అంద్రు' అనురూపము లగుటను గమనించునది. ఉండితివి:—ఇట్లుండఁ బూర్వవిధిచే డులోపమును నీవిధిచే బిందువుమీఁది తివర్ణము హలంశమునకు నిత్యముగ టవర్ణమును గా 'ఉంటివి' అనురూపము గలుగును. పూర్వసూత్రముచే దువర్ణలోపము పాక్షికమగుటఁ గలుగకున్న భూతకాలికేగాగమముచే నుండితివని రూపమగుననుట తెల్లము. మధ్యమవకారలోపమున నుండితనియు రూపమగును. ఉండుదురు:—ఇటఁ బూర్వవిధిచే దువర్ణలోపముగా నీవిధిచే డవర్ణము దకారమునకుఁగా నుండురని యగు. డవర్ణమగుట పాక్షికముగానఁ బక్షమున దువర్ణలోపమే గలిగియుండురనియగును. పూర్వవిధిచే దువర్ణలోపమును గాకున్న నుండుదురనియే యుండును. వీనికి 62 చే నుత్వలోపంబైన 'ఉండ్రు-ఉంద్రు' అనురూపములగుట నూహించికొనునది. పైని వివరించినప్రకారముగాక టదలత్వవిశిష్టములే యగునన్న తిదుల శేషించిన 'ఇ-ఉ' అను నచ్చులు పరముగా నపదాదిస్వరసంధి నిత్యముగ జరుగునని యంగీకరింపవలయును.

### ముజ్ఞు పరంబగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగానగు. ౬౦.

బహుళంబనుటచే దీనికి నొకానొకచో నతిచారంబని యెఱుంగునది.

టీ. 31 చే మధ్యమపురుషైకవచనబహువచనములందగు 'ము - డు' అనునవి 'ముజ్ఞు'అనంబడుననుట స్పష్టము. మధ్యమపురుషైకవచనప్రత్యయమగు 'ము'అనునదియు దానిబహువచనప్రత్యయమగు 'డు' అనునదియుం బరముగాఁ గొనుధాతువునకును, 52 చే నాత్మపదార్థమునకైన 'కొను' అనుదానికిని 'కో' అనునది బహుళముగ నాదేశమగునని సూత్రార్థము. తరువాతిసూత్రము ననుసరించి దీర్ఘంబగు దీని 'కో'మీఁది ముపర్ణమునకు ద్విత్వమును, కోశబ్దమునకు హ్రస్వమును గమనించి సిద్ధరూపముల నూహించికొనునది. వికల్పముగ ననక బహుళమనుటంజేసి ముజ్ఞు పరము గాకున్నను నొక్కచోఁ గోశబ్దము కొనుకగుట ఫలమని బహుళమనుటంజేసి యనునీక్రిందిసూరి వివరణమున కభిప్రాయము. అతిచారమన మితిమీఱి సంచరించుట. సూత్రోక్తమగు స్థలమందేగాక యితరస్థలములందును నీకార్యము గలుగుట యతిచారమని తాత్పర్యము. 'చదువుకొనమి చదువుకొననేల చదువుకొనక' అనురీతి నుండుస్థలములఁ జదువుకోనేల చదువుకోమి చదువుకోక యనురీతిని రూపములు దృశ్యము లగుచుండుటఁ గ్వాచిత్కముగ మిఱి నఱి కజులు పరమగునపుడును గొనునకుఁ గోగలుగుననియుం నయ్యతిచారమే బహుళప్రయోజనమనియుం గ్రహింపఁదగును. కాని యీయతిచారముమాత్ర మనుప్రయుక్తమగు కొనునకే గాని సహజమగు కొనుధాతువునకుఁ గాదని గ్రహించునది. వ్యతిరేకమున 'చదువుకోను చదువుకోము జదువుకోఁడు చదువుకోరు' అనునట్టిరూపములును వ్యవహారమున కొనునకుఁ గోకలిగినవి చూపట్టెడి.

### ముజ్ఞు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ముపర్ణకంబునకు మాముడియునగు. ౬౧.

కొమ్ము - కొనుము - కొండు - కొనుఁడు

టీ. 'ము-డు'అనుమధ్యమపురుషప్రత్యయములు పరములుగా వానికిముందున్న దీర్ఘస్వరములకు హ్రస్వమును, నట్లు హ్రస్వములైనవానిమీఁది ముపర్ణకమునకు ద్విత్వమును (మ్ము) నిత్యముగ నగునని సూత్రార్థము. 'కొనుము:'—ఇటఁ బూర్వసూత్రముచేఁ గొనునకుఁ గో యనునది గా 'కో+ము'అని యుండ నీవిధిచే కోయనుదానికి హ్రస్వము ముపర్ణమునకు మాముడి (—) యుంˆగా 'కొ+మ్ము = కొమ్ము' అను రూప మేర్పడును. 'కొనుఁడు':—ఇటఁ గొనునకుఁ గోగా నీవిధిచే హ్రస్వము గా సంధి 22 చే నుడితొలి హ్రస్వముమీఁద నర్ధబిందువుండరాదుగానఁ బూర్ణమే గా 'కొండు'అనురూపము గలుగును,

కొనునకుఁగోయగుట బహుళమగుటఁ గొగాని పక్షమున నీవిధిచే హ్రస్వము మూముడియు గుటకుఁ బ్రసక్తియే లేమిని గొనుము గొనుఁడనురీతినే రూపము లుండుననుట స్పష్టము. ఇట్లే యనుప్రయుక్తమగు కొనునకును జదువుకొమ్ముచదువుకొండనురీతి రూపము లేర్పడుట నరయునది. సూక్ష్మముగఁ బరికింప మువర్ణకమునకు మూముడిమాత్రము విధించినహ్రస్వము సమాసము 13 చేఁ గాఁదగునుగానఁ దద్విషయమున హ్రస్వవిధానము చేయనక్కఱ లేదనియు దాన డుజ్వర్ణకము పరముగా హ్రస్వమును మువర్ణమునకు మూముడియు విధించినఁ జాలుననియుఁ జెప్పనొప్పును. క్రియాప్రత్యయములలో ముడుజ్జు లోకపురుషమునకుఁ జెందినవై యొక్కసంజ్ఞకుఁ బాత్రైనవగుటను, నవి కేవలము క్రియలకగునవగుట నవి పరముగా విధించుకార్యములు కేవలము క్రియావిషయకములే యగుటను, సమాసము 13 సూత్రము సుబంతవిషయమగుట నిందు వర్తింపదనుట కవకాశముండుటను, డుజ్వర్ణకముతోఁబాటుగ ముజ్జు పరమగునపుడని సామాన్యముగనని మువర్ణకమునకు మూముడి యగునపుడును హ్రస్వము విధించెననఁదగు. స్వార్థముజ్జంతరూపములందే యీ హ్రస్వద్విత్వము లగుననుటకు వ్యతిరేకమున ముజ్జు పరముగా 32 చే కుజెవిధానము చేయుటయే ప్రమాణమని గ్రహించునది. యోగ్యత ననుసరించి, ముజ్జు పరమగునపుడని సామాన్యముగ సూత్రమున నన్నను డుజ్వర్ణకము పరముగా హ్రస్వమును మువర్ణమున కొక్కమూముడిని మాత్రమే విధించెననియుఁ గ్రహించిన నీసందర్భము సుసంగతమగును.

**రువర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది తదడల యుత్వంబునకు లోపంబు విభాషనగు. ౬౨.**

పోషింత్రు-పోషింతురు-కొంద్రు-కొందురు-కొండ్రు-కొండురు.

టీ. సున్నశబ్దము నిందుసున్ననే బోధించును. ఈసున్న యించుక్కనందలిదేని 58 చే నైనదేని యగును. కాన మధ్యమపురుష బహువచనప్రత్యయమగు రువర్ణము పరముగా నిందుసున్నకంటెఁ బరములగు 'తు-దు-డు'అనువానియుత్వమునకు వికల్పముగ లోపమగునని సూత్రార్థము లభించెడి. 22 చే నగు దుగాగమదువర్ణమె చువర్ణమున కవ్యవహితపరమైనచో 'తు' అనునదిగ మాఱునని 108 చేఁ దెలియుచున్నదిగాన నిచ్చోటి యుత్వలోపమునందఁదగు తవర్ణము దుగాగమస్థానమున నైనదే యగుట స్పష్టము. దువర్ణము దుగాగమసంబంధియె యనుట తెల్లము. దుగాగమదువర్ణమునకు 59 చే డవర్ణమగుంగాన నదియుం దుగాగమదువర్ణమునకు సంబంధించినదె యనుట విశదము. కాన దువర్ణము నుత్వమున కనిన దాని కగుత-డలయుత్వములకును లోపము గలుగనగుంగాని సుబోధమునకై యిట్లు తదడలయుత్వమున కనెనని యూహించునది.

దీన దువర్ణమునకగు తదరూపమగు పరిణామము సంవేద్యమయ్యెడి. పోషించుదురు:— ఇట 108 చే చుదులకు తువర్ణముగా 'పోషింతురు' అని యగును. పిదప నీవిధిచే నుత్వ లోపము గలుగ 'పోషింత్రు' అని యగును. ఉత్వలోపము వైకల్పికమగుట గాకున్న 'పోషింతురు' అనియే యుండును. కొనుదురు:—ఇట నన్వాదుల నుస్థానమున బిందువు 58 చేఁ గా 'కొందురు' అనియు 59 చే దకారమునకు డవర్ణము గా 'కొండురు' అనియు రూపములగునుగాన నారెండురూపములందున్న దడలమీఁదియుత్వమున కీవిధిచే లోపము గలుగ 'కొంద్రు-కొండ్రు' అనురూపములు సంభవించును. ఈలోపము వైకల్పికమగుట నుత్వలోపము గాకున్న 'కొందురు-కొండురు' అనియే యుండును. తదడలమీఁదియుత్వ మునకె యనుటంజేసి టవర్ణముమీఁదియిత్వమునకుఁ గామి నంట్రి-కొంట్రి మొదలగు నవి యలాక్షణికము లయ్యెడిననుట స్పష్టము.

## సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు. ౬3.

సంస్కృతధాతువుల కంగలాదుల కించుగాగమంబగు. పచించు-వచించు - త్యజించు - భజించు. అంగలించు. అంగల - అడక - ఆరగ-ఆవుల - ఉంక - ఉగ్గడ - ఓసర - కార - గాల - జాడ - తిలక - తులక - పంక - పరిక - పలవ - అప్ప - ఒప్ప - ఆల - ఇత్యాదు లంగలాదులు.

టీ. సంస్కృతధాతువులకును నంగలమొదలగు తెలుఁగుధాతువులకును నించుగాగమము నిత్యముగ నగునని సూత్రార్థము. 'ఇంచుక్కు' కకారము పోవుప్రత్యయముగాన నంతాగమముగ ధాతువున కగుననుట తెల్లము. అంగలమొదలగు తెలుఁగుధాతువుల కించుక్కు లేక ప్రయోగ మగపడమి నదంతములైన వీనికి నిత్యముగ సంస్కృతధాతువులతోఁబాటుగ నించుక్కు విధింపవలసివచ్చెనని యూహింపఁదగును. ఇత్యాదులనుటంజేసి యీయంగలాదిగణ మాకృతిగణమయ్యెడిఁగాన సాదృశ్యము ననుసరించి యదంతాంధ్రధాతువులే యిందుఁ జేరఁదగునవని గ్రహించునది. ఇంచుగ్విరహితములగు నంగలాదులకుఁ బ్రయోగమగపడమి నివి ధాతువులేయని సూరిమతము ననుసరించి వ్యవహరించుట తప్పుగాఁజాలదు. చింతామణి కృదంతాదినామములకే యించుగాగమము విధించి ధాతువులను నిర్మించుచున్నది. 65 సూత్రవివరణముల ననుసరించి నామములకు ధాతుత్వ వివక్షయం దించుగాగమము గాఁదగుననుట స్పష్టము. కాన సంస్కృతకృదంతాదులను దెలుఁగుశబ్దములను గ్రహించి ధాతుత్వవివక్షయం దించుగాగమమును జేయుట యర్హామె గాని యించుక్కు లేక యంగలాదులకుఁ బ్రయోగార్హత లేమిని గృదంతాదుల ధాతువులుగ నెన్నుట ప్రక్రియ కొక్కచో సరిపడమిని నట్లనక సంస్కృత

మున కంగలాదులకని యనువృత్తమగుచున్న ధాతువునకనుదానితో నన్వయము నా షష్ఠ్యంతములకుఁ గూర్చెనని సంభావించునది. 'పచ్' దీనికించుగాగమము గూర్చిన పచిం చని యగును. ఇట్లే హలంతసంస్కృతధాతువుల కించుగాగమముగాఁ బ్రక్రియనూహిం చునది. అంగల+ఇంచు=అంగలించు. ఇంచుగంతముమీఁద లకారాదులును, టవర్ణకాది ప్రత్యయములును నసమాపకక్రియాప్రత్యయములును గూర్చుచు నాయారూపముల సాధించికొనునది. 'ఏము వెలిగాఁగ మాతండ్రి కించునెట్లు' అనుభారతప్రయోగమును గమనించిన నించననది యిష్టమగు ననునర్థమునఁ దొల్లి వాడఁబడుచుండెడిదని విశద మయ్యెడిఁగాన భోజనమున కిష్టపడు - వండుటకిష్టపడు ననునర్థమున భుజించు - పచించు మొదలగురూపము లేర్పడెనేమో యనియుఁ గాలక్రమమున నిది ప్రత్యయ మయ్యె ననియు సంభావింపనగును. 'భవతి క్రియాపదానాం త్రివిధానామించుగాగమో ణేశ్చ' అనునది మూలము. తెలుఁగున సామాన్యముగ ధాతువులెల్లను నుదంతములే యనఁదగుం గాని యీయంగలాదుల ననుసరించి యదంతధాతువులును గలవని యంగీకరింపవల యును. 121 సూత్రమునుబట్టి తదంతములకును నించుగాగమము గలుగునని యంగీకరింప వలయును.

ఇఉఋుల కించుక్కు పరంబగునపు డయుగవుగరుక్కులగు. ౬౮.

జి - జయించు. నీ - నయించు. ద్రు - ద్రవించు. లూ - లవించు. ధృ - ధరించు. తౄ - తరించు.

టీ. 'ఇ-ఉ-ఋ' అనునవి తుదినిగల సంస్కృతధాతువులకు 63 చే నైన యిం చుక్కు పరముగా నికారాంతధాతువు నికారమునకు 'అయుక్' అనునదియు నుకా రాంతధాతువులయుంకారమునకు 'అవుక్' అనునదియు ఋకారాంతధాతువులఋకార మునకు 'అరుక్' అనునదియు నంతాగమములుగ నిత్యముగ నగునని సూత్రార్థము. 'జి' అనునది యికారాంతము. దీనికిఁ బూర్వసూత్రముచే నైన యించుగాగమము పరముగా నీవిధిచే నయుక్కు గలుగ నపదాదిస్వరసంధిచే 'జి+అయ్+ఇంచు=జయించు' అని రూపంబగును. సూత్రమున 'ఇ' యని సామాన్యముగ ననుటంజేసి యీకారాంతమును గ్రాహ్యమగుంగాన 'నీ' అను నీకారాంతధాతువునకును 63 చే నైనయించుగాగమము పరముగా నీవిధిచే 'అయుక్కు' గలిగి యపదాదిస్వరసంధి జరుగ 'నీ+అయ్+ఇంచు= నయించు' అని రూపమేర్పడును. 'ద్రు' ఇది యుకారాంతముగాన నించుక్కు పరముగా 'అవుక్' అనున దీవిధిచే నై యపదాదిస్వరసంధి నిత్యముగ జరిగి 'ద్రు+అవ్+ఇంచు= ద్రవించు' అనురూపము గలుగును. 121 విధిననుసరించి యుపసర్గముతోడి 'అనుభూ'

మొదలగు నూకారాంతములకును నించుక్కుపరముగా నీవిధిచే నవుక్కుగా ననుభవించు మొదలగురూపము లేర్పడుట్ల నరయునది. ఇట్లే 'లూ' అనునూదంతమున కనుపసర్గ మున కును నవుక్కుగా 'లూ+అవ్+ఇంచు=లవించు' అనురూప మగుననుట స్పష్టము. 'ధృ' ఇది ఋకారాంతము. దీని కించుక్కు పరముగా నీవిధిచే 'అర్'అనునదంతమున కాగమ ముగఁ గా నపదాదిస్వరసంధిచే 'ధృ+అర్+ఇంచు=ధరించు' అని రూపమగును. ఇట్లే ౠకారాంతమగు 'తౄ' అను దానికి 'అరుక్కు'గా నపదాదిస్వరసంధిచే 'తౄ+అర్+ ఇంచు=తరించు' అనురూపమగుట నరయునది. ప్రాచీనులు గుణాదులు గలిగినవానినే ధాతువులుగ నెంచి వానికించుగాదులఁ గూర్చిరి. తెలుఁగులక్షణముచే గుణవృద్ధులను సంస్కృతధాతువులయచ్చులకుఁ గూర్చుటకంటె గుణవృద్ధుల సంస్కృతలక్షణముచే నందినవానినే ధాతువులుగ నంగీకరించుట సరసమని తోఁచెడి.

నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు. ౬౫.

నిర్జికి నామధాతువుల కయుగాగమంబు గలుగదు. నిర్జించు - నుతించు - స్తుతించు. ఈజ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వవివక్ష యందించుగాగమంబగునని యెఱుంగునది. శయనించు-పయనించు.

టీ. 'నిర్' అనునుపసర్గముం గూడియుఁన్న జిధాతువునకును నామములకును బూర్వసూత్రముచే నగు నయుక్కు నునాగమము గాదని సూత్రార్థము. నామము లనఁగా ధాతువులనుండి గలిగిన నామవాచకరూపములని 'శయన-నుతి-స్తుతి' అను నీక్రింది యుదాహరణములనుబట్టి స్పష్టము. 'నిర్' అనుదానితోడి జిధాతువునకే యనుటంజేసి యితరములగు నుపసర్గములతోనున్న జిధాతు వీనిషేధమునకు విషయముగాదని యెంచు నది. 'నిర్జి-నుతి-స్తుతి' ఇవి యికారాంతము లగుటంజేసి 63 చే నైన యించుగాగమము పరముగా 64 చే నయుగాగమము నందవలసియున్నవిగాన నీనిషేధముచేయ నావశ్యక మయ్యెననియుఁ దీన నయుగాగమము గామి నించుక్కుతోడఁ గూడి 'నిర్జించు-నుతించు- స్తుతించు'చనియే రూపము లేర్పడుననియు గ్రహింపవలయును. 63 సూత్రము ధాతువున కనునధికారసూత్రసంబంధమున నించుగాగమము ధాతువులకే విధించెడిఁగాని నామ ములకు విధింపదుగాన 'నుతి-స్తుతి-శయన' అనునామవాచకముల కించుక్కు పరమగుటే ప్రసఁగమిని నించుక్కు పరముగా నామముల కయుగాగమము 64 చే నగుట నాశం కించికొని యీనిషేధమును జేయుటకుఁ బ్రసక్తియే యగపడమిని నామంబులకను నిషే ధము వ్యర్థమై నామవాచకములకును ధాతుత్వవివక్షయందించుగాగమము గాఁదగునను విషయమును జ్ఞాపకము చేయుఁననియుఁ దీన ధాతుత్వమును వివక్షించుడు. 63 చే నామ

ముల కించుకాగమ మగుటయు నించుక్కు పరముగా 64 చే నికారాంతము లగువానికి నయుగాదేశ మగుటయుఁ గుదిరెడిఁగాన నామంబులకుఁ గాదనునిషేధము సార్థకతం జెందుననియు నీజ్ఞాపకముచేత నే యను నీక్రిందిసూరివివరణమున కభిప్రాయము. నామములకును నించుగాగమమగుట జ్ఞాపకసిద్ధమయ్యెఁగాన నుతించు మొదలగువానితోఁ బాటుగ శయనించు పయనించు మొదలగురూపములును 'శయన-పయన' మొదలగు నామములకుఁ గలుగునని గ్రహించునది. ఉపసర్గపూర్వములగు నామములకును 121 ననుసరించి యీయయుగాగమము గలుగనగుంగాన నట్టివానికిని నీనిషేధమునం జేసి యయుగాగమము గలుగదని యూహింపనగును. దీన 'సంస్తుతించు-సన్నుతించు' మొదలగురూపములే యగునని యెంచునది. ప్రయాణశబ్దభవము పయనమగుట వైకృతమునకు నామమునకు నించుక్కు గాఁదగుననుట స్పష్టముగాన నించుగ్విధి సమాసమసాధారణ మనుట తెల్లము.

## సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరంబగునపుడు గుణంబగు. ౬౬.

అ - ఏ - ఓ ఈ మూఁడును గుణంబులు నాఁబడు. ఋస్థానికంబగు గుణంబు రపరంబయియుండు. సంస్కృతధాతూపధలకు ఇ-ఉ-ఋ - అనువానికి సొరిదిని-ఏ-ఓ-అర్-అనునవి యించుక్కు పరంబగునపుడగునని యెఱుంగునది. ఛిద్ - ఛేదించు - భిద్ - భేదించు - ఘుష్-ఘోషించు - పుష్ - పోషించు - వృష్ - వర్షించు - హృష్ - హర్షించు.

టీ. ధాతువునకని యధికారము. ఉపధయనఁ దుదివర్ణమునకు ముందుండువర్ణమని ముందె యుక్తము లఘూపధంబున కనునది సంస్కృతంబున కనుదానికి విశేషణము. బిందువులకు ముందుండెడివియు జడ్డలకు ముందుండెడివియు దీర్ఘములును గురువులనియు నట్టివి గానివి లఘువులనియు ముందె నిరూపితము. ఉపధ యనఁగా తుదివర్ణము. నకు ముందున్నదని ముందె యుక్తము. లఘువగువర్ణ ముపధగాఁగల సంస్కృత ధాతువున కించుక్కు పరముగా గుణమగునని సూత్రార్థము. 'అ - ఏ - ఓ' అను మూఁడును గుణసంజ్ఞకములని క్రింద నిరూపితము. ఈమూఁటిలోఁ గ్రమముగ ఋకారమున కకారమును నికారమున నెకారమును నుకారమున నోకారమును నయ్యెడి. ఈ క్రిందివివరణము ననుసరించి ఋకారమునకుఁ గలుగు గుణాక్షర మకారము రేఫ మంత మందుఁగలది యగుంగాన ఋకారమునకు 'అర్' అనునది గుణమగునని గ్రహించునది. ఈ ప్రక్రియ యంతయు సంస్కృతవ్యాకరణమునుబట్టి యైనదేయనుట తత్పాఠకులకు

చెల్లంబు. 'అ-ఏ-ఓ' అనునవే గుణసంజ్ఞకములగుట 'ఋ-ఇ-ఉ' అనునవే లఘూపధంబున కనుదాని కర్థములగునని గ్రహింపఁదగును. సారిదిననఁగాఁ గ్రమముగా నని యర్థము. ఛిద్:—ఇందుఁ బొల్లుదకారమునకుఁ ముందున్న ఛవర్ణముమీఁది యికారముపధ. ఇది లఘువు. వ్యంజనపూర్వాక్షరమునకు గురుత్వము గలుగదని ముందె యుక్తము. ఆఛవర్ణము మీఁది యికారమునకు 'ఏ' అనునది గుణముగా 'ఛేద్+ఇంచు=ఛేదించు' అని రూపమగును. ఇట్లే యికారోపధ సంస్కృతధాతువులకెల్ల నించుక్కు పరముగా గుణమగుటను గమనించికొనునది. 'ఘుష్+ఇంచు':— ఇట ఘుకారముమీఁది యుఁకారమునకు పధకు 'ఓ' అనునది గుణముగా 'ఘోష్+ఇంచు=ఘోషించు' అని రూపమగు. ఇట్లే యుఁకారోపధ సంస్కృతధాతువులకు గుణమగుట నూహించికొనునది. 'వృష్+ఇంచు' ఇందు వకారముమీఁది వట్రువకు లఘూపధకు 'అర్' అనునది గుణమీవిధిచేఁ గా 'వ్+అర్+ఇంచు=వర్షించు' అని రూపమగును. ఇట్లే తక్కినఋకారోపధములకు గుణమగుట నూహించునది. ఋకారము హల్లుపై వట్రువరూపముగ నుండుననుట స్పష్టము. ఇట్లు సంస్కృతధాతువులకుఁ దెలుఁగున గుణంబగునని శాసించుటకంటెఁ బ్రాచీనులవలె సంస్కృతవ్యాకృతిచే సగుణంబైనదానినే గ్రహించి యించుక్కును గూర్చు టుచితమని తోఁచెడి. కాని యాక్రిందివిధులచేనగు గుణముగాని రూపములు సిద్ధింప నవకాశము లేమి నట్లు గ్రహింపలేదని తోఁచెడి. కాని యాపక్షమునను గుణవైకల్పికనిషేధశాస్త్రము లుండినఁ జాలునని చెప్పనగు.

## స్పృశికి గుణంబు విభాషనగు. ౬౭.

స్పర్శించు - స్పృశించు.

టీ. స్పృశియను సంస్కృతధాతువునందలి యుపధాభూతంబైన ఋకారమునకు గుణము వికల్పముగ నగును. స్పృశ్:—ఇట శవర్ణమునకు ముందున్న పవర్ణోత్తరవర్తి యగు ఋకారము లఘూపధము. కాన దీనికిఁ బూర్వవిధిచే నిత్యముగ 'అర్' అనునది గుణము గావలసియుండ నీవిధిచే వికల్పముగఁ గా, గుణము గల్గినపక్షమున 'స్ప్+అర్+శ్+ఇంచు=స్పర్శించు' అనియు గుణము గానిపక్షమున 'స్పృశ్+ఇంచు=స్పృశించు' అనియు రూపములగును. నిత్యముగ గుణము ప్రాప్తింప నీసూత్ర మారబ్ధమయ్యెననుట తెల్లము.

## లిఖ భుజ రుచ కృశంబులకు గుణంబు లేదు ౬౮.

లిఖించు-భుజించు-రుచించు-కృశించు. కుచధాతువునకు గుణంబు లేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబుగాదు.

టీ. 'లిఖ-భుజ-రుచ-కృశ.' అనుధాతువుల లఘూపధలకు, 'ఇ-ఉ-ఋ' అను వానికి 64 చే గుణంబు గలుగదని సూత్రార్థము. కాన నించుక్కుతోఁ గలియుటంజేసి 'లిఖించు, కృశించు' మొదలగురూపములే గాని 'లేఖించు, కర్శించు' మొదలగు రూపములు గలుగవని గ్రహించునది. వీనితోఁబాటుగఁ గుచధాతువునకును గుణంబు గలుగదని యొకఁడ చెనుగాని కుచించనురీతి ప్రయోగము లగపడమి నట్లనుట యసంగతమని కుచధాతువునకను నీక్రిందివివరణమున కభిప్రాయము. కాని 'సంకుచించె' నను ప్రయోగము సంకుసాల నృసింహకవివిరచిత కవికర్ణరసాయనమునఁ గాననగుటచేతను సంకోచించని బహుళప్రయోగదృష్టమగుటచేతను, కుచధాతువు సోపసర్గమగునపుడు గుణము వికల్పముగఁ గాఁదగుననుట యుచితమని గ్రహింపఁదగు.

## సృజికి నిర్మితిని గుణంబు లేదు. ౬౫.

చతుర్ముఖుండు ప్రజలను సృజించె. అతండు విషయంబుల విసర్జించె.

టీ. సృజ్ ధాతువునకుఁ బుట్టించుట యనునర్థమున గుణము 64 చే నగునది గలుగదని యర్థము. 'చతుర్ముఖుఁడు ప్రజలను సృజించెను':— ఇట సృజిధాతువునకుఁ బుట్టించుట యర్థముగాన లఘూపధంబగు ఋకారమునకు 'అర్' అని గుణము గాలేదనియుఁ గాన సృజించనురూపమే గాని సర్జించనురూపము గలుగదనియుఁ గ్రహించునది. పుట్టించుట యనునర్థముననె యనుటంజేసి ధాతువు సోపసర్గమై పుట్టించుట గాక యితరార్థములఁ దెలుపునపుడు గుణము గలుగనగుంగాన విషయంబుల విసర్జించె నిత్యాదులందు విపూర్వక సృజధాతువునకు విడుచుట యర్థమగుటచే గుణము (అర్) కలిగి 'విసర్జించె' ననురూపము గలిగెడునని గ్రహించునది. ఈసూత్రమునందును, 67 నందును, నిదంతములుగ ధాతువుల నిర్దేశించుటకు ధాతునిర్దేశమున హ్రస్వేకారముగాని లిప్పుగాని గలుగునను పాణినీయపద్ధతియే యాధారమని యెన్నునది. అత్వముతో నిర్దిష్టమైన నుచ్చారణార్థము నిల్పఁబడెనని గ్రహించునది. ఈగుణవృద్ధి నిషేధవిధానసందర్భమహాబలపండితీయమూలకము.

## సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు. ౭౦.

పచింపించు - వచింపించు - ఆవులింపించు - వండించు - పండించు.

టీ. "ఇంచుగాగమో ణేశ్చ" అనునది మూలము. సంస్కృతసమ-దేశ్యధాతు సమూహమునకెల్లఁ బ్రేరణమున 'ఇంచుక్' అనునదాగమముగ నగునని సూత్రార్థము.

సర్వంబున కనుటంజేసి యెల్లధాతువుల కనునర్థము గలిగెడి. సంస్కృతంబున కంగ లాదుల కించుక్కు లేక ప్రయోగము లేమిని వానికిఁ బ్రేరణమున నగు నించుక్కు స్వార్థమునసైన యించుక్కనకుఁ దరువాత నున్నదే యగుననియు నంగలాద్యన్యము లగు తెలుఁగుధాతువులకుఁ బ్రేరణమున మాత్రమే యించుక్కగుట నొక్కయించుక్కే ప్రేరణరూపములఁ దోఁచుననియు గ్రహించి యీక్రిందిరూపముల ప్రక్రియను గమనించునది. ప్రేరణమనఁ జేయుంట యని యర్థము. పచించుట:—ఇట పచ్ధాతువునకు 63 చే నించుక్కు స్వార్థమునఁ గాఁ బచించనియు నీ విధిచే వండింపఁజేయుంట యను నర్థమున నించుక్కు గా 87 చే స్వార్థేంచుక్చకారమునకుఁ బత్వము గలుగఁ బచింపించనియు రూపము లగును. ఇట్లే పచింపించనురూపమును పచధాతువునుండి గలుగుటను గమనించునది. ఆవుల:—ఇది యంగలాదిగాన దీనిస్వార్థేంచుగ్రూపమగు నావులించను దానిమీఁద నావులింపఁజేయుంట యనుప్రేరణమున నీవిధిచే నించుక్కు గలుగ 87 చే స్వార్థేంచుక్చకారమునకుఁ బత్వమై యావులింపించనురూపము గలిగెను. వండుధాతువున కీవిధిచేఁ బ్రేరణమున నించుక్కు గా 'వండు+ఇంచు=వండించు'అని రూపమయ్యెను. వండఁజేయుంట యని యర్థము. ఇట్లే పండుధాతువున కించుక్కు గాఁ బండించనురూప మేర్పడును. ప్రేరణమనఁగా నొకవ్యక్తి వేఱొకవ్యక్తిచే నొకదాని జేయించుట యనుట స్పష్టము.

## రంజాదుల యించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారంబగు. ౭౧.

రంజిల్లు-భాసిల్లు-వర్ధిల్లు-విలసిల్లు-రాజిల్లు. ఈయాదేశయోగం బున భిదాదు లకర్మకంబులగు. భేదిల్లు-కంపిల్లు-సంధిల్లు.

టీ 'రంజ్' మొదలగుధాతువుల స్వార్థేంచుక్కునందలి బిందువుతోడి చకారమునకు (ంచ్) ద్విత్వయుతమగు లకారము 'ల్ల్' అనునదాదేశ మగునని సూత్రార్థము. ప్రేరణమునఁ గాదనుటంజేసి యీద్విత్వలకారము స్వార్థేంచుక్కునకేగాని ప్రేరణార్థక మగు నించుక్కునకుఁ గాదనుట స్పష్టము. రంజిల్లు:—రంజించను 63 చే నైన యించుక్కుతోడిరూపమునందలి యించుక్కునకు సంబంధించిన 'ంచ్'అనుభాగమునకు 'ల్ల్' అనున దీవిధిచేఁ గలుగ 'రంజ్+ఇ+ల్ల్+ఉ=రంజిల్లు'అనురూపము గలిగె. ఇంచుక్కునందలి బిందువుతోడి చకారమునకే 'ల్ల్'అనునది యాదేశమగు ననుటంజేసి 'యించుక్కునందలి చువర్ణముమీఁది యుకారము శేషించుననియు నాదేశమగు 'ల్ల్' అనున దాయుకారమును గూడి 'ల్లు' అనురూపము నందుననియుం గ్రహింపఁదగును. ఇట్లే

భాసిల్లు మొదలగువాని ప్రక్రియ నూహించికొనునది. ఇది నిత్యవిధి యగుటంజేసి యీ విధిచే ద్విరుక్తలకారమునందెడుధాతువులకు స్వార్థమున 'రంజించు-భాసించు'అనురీతి నించుక్తోడి రూపములు గలుగవనియు నిత్యముగ ద్విరుక్తలకారరూపములే యమరు ననియు నించుక్తోడి రూపములు వీనికి మీఁదిసూత్రము ననుసరించి ప్రేరణమున మాత్రమే పొసఁగుననియుం దాన రంజిల్లను ద్విరుక్తలకారముతోడి రూపములు స్వార్థమున నైనవనియుం రంజించను నించుగ్రాసములు ప్రేరణమున నైనవనియుం భేదమును గమనించుచు నర్థభేదమును గూడ నూహించికొనునది. ఈద్విరుక్తలకారము ధాతువులకు స్వార్థముననై సకర్మకముల నకర్మకములుగ మార్చునని యీయాదేశయోగమున ననునీక్రిందివివరణమున కభిప్రాయము. భేదిల్లు:—'భిదిర్'అను నీధాతువు సంస్కృతమున సకర్మకంబయ్యు ద్విరుక్తలకారాదేశమునంజేసి తెలుఁగున నకర్మకం బయ్యెను. ఈసంతటఁ దాబ్రద్దలయ్యెనని యర్థము. కంపధాతు వకర్మకంబగాన నగి యట్లగుట సహజంబ. సంధిల్లు:—65 సూత్రజ్ఞాపకముంబట్టి సంధియనునామవాచకమునకు స్వార్థమున ధాతుత్వవివక్షయం దించుక్గా సంధించనురూప మేర్పడి యీవిధిచే నిత్యముగ ద్విరుక్తలకారాదేశమగుట సంధిల్లుననురూపము గలిగెఁగాన నిదియు నకర్మకమయ్యెనని యెఱుంగునది. ఈద్విరుక్తలకారరూపములు గర్తృసిద్ధమగువ్యాపారమునే తెలిపెడిఁగాన 'కార్యము సంధిల్లె-శిల భేదిల్లె-మది కంపిల్లె' మొదలగుచోటులందుఁ గార్యము తనకుఁ దా (స్వయముగ) గుదిరె, ఱాయి తనకుఁ దా బ్రద్దలయ్యె, మనసు తనకుఁ దాఁ గదలె నను నర్థమె గలుగుటంజేసి యవి యకర్మకములె యగునని గ్రహించునది. ఈద్విరుక్తలకారమునంజేసి సకర్మకములును నకర్మము లగుననుటంజేసి యట్లకర్మకములుగాఁదగువానికే యీయాగమంబగుననియుం నట్లయ్యును వర్షించు-ఉదయించు-అస్తమించు మొదలగు నకర్మములకుఁ గాదనియుం దాన లక్ష్యానుసారముగ నీద్విరుక్తలకారమును గూర్పవలె ననియుం గ్రహింపఁదగును. 'రంజతి ఘట్యాదీనాం బిందోశ్చ స్యాపి లావుభౌ భవతః' అనునది మూలము. 'తత్రోభయోర్భవే దేకో లకార ఇతి కేచన'అను నాథర్వణము ననుసరించి ద్విరుక్తలకారమున నొకదానికి లోప మక్కటాదులలోనేని చేర్చి సాధించి 'సంధిలు-భేదిలు' అనుమొదలగురూపములను సాధించికొనఁదగును. ఇందుల కనేకకవి ప్రయోగములు గలవు.

ఇంచుక్కు పరంబగునప్పుడు రంజాదుల యించుక్కునకు లోపంబగు. ౭౨.

లాదేశంబున కపవాదంబు. రంజించు - భేదించు - సంధించు.

టీ. 'న తు ణౌ భవేచ్చ లోపో ణ్యర్థే యో వర్తతే పరే తస్మిన్' అనునది మూలము. 70 చే రంజాదులకుఁ బ్రేరణమున నగు నించుక్కు పరముగా వానిస్వార్థేంచుక్కునకు 63 చే నైనదానికి నిత్యముగ లోపమగును. ద్విరుక్తలకారాదేశము నందఁదగు ధాతువులమీఁద స్వార్థప్రేరణేంచుక్కులు రెండు నుండుటయు స్వార్థేంచుక్కునకు 'ల్లి'అనునదిగాని దానిచకారమునకుఁ బత్వముగాని కలుగుటయు సంభవింపవని భావము. పూర్వసూత్రముచే స్వార్థేంచుక్కునకు ద్విరుక్తలకారాదేశము ప్రాప్తించుచుండ నద్దాని కపవాదముగ నీలోపమువిధింపఁబడియెఁగాన ద్విరుక్తలకారరూపముపైఁ బ్రేరణేంచుక్కు చూపట్టుటయు నించుక్కుమీఁద నించుక్కు గలుగుటయు సంభవింపవని లాదేశంబున కపవాదమును నీక్రిందివివరణమున కభిప్రాయము. రంజించు:—రంజధాతువునకు 63 చే నించుక్కు స్వార్థమునఁగా 'రంజిం'చని యుండును. పిదప 70 చేఁ బ్రేరణమున నించుక్కు గా'రంజించు + ఇంచు'అని యగును. ఇపుడు 71 చే మొదటి యించుక్కునకు ద్విరుక్తలకారాదేశము గావలసియున్నది. కాఁగా నీవిధిచే ద్విరుక్తలకారాదేశమునకు బాధకముగా ద్విరుక్తలకారాదేశమునందఁదగు నించుక్కున కంతకును లోపమీశాస్త్రము విధించెడిఁగాన నిది పూర్వసూత్రప్రాప్తమగు లకారద్వయాదేశమున కపవాదమనుట బొసఁగెనని గ్రహించునది. దీన మొదటియించుక్కువిధిచే లోపింప నొక్క ప్రేరణమున నైన యించుక్కుతోడి రూపములే 'రంజించు - భేదించు'అనునవియే ప్రేరణమున నగునని గ్రహింపవలయును. స్వార్థమున వీనికి ద్విరుక్తలకారరూపములును బ్రేరణమున నించుక్కుతోడిరూపములును నగునని ఫలితము.

చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగానగు. 23.

పూను-పూనుచు-పూనించు. తేలు-తేలుచు-తేలించు. మగుడు - మగుడుచు - మగిడించు. కుదురు - కుదురుచు - కుదిరించు. విను-వినుచు. వక్ష్యమాణంబు పుగాగమంబు - వినిపించు. బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు - అను-అనిపించు. తిను-తినిపించు. కను-కనిపించు. దీని యత్వంబునకు దీర్ఘంబునగు - కానిపించు.

టీ. సంయుక్తములు గాని 'న-ల-డ-ర' అను వర్ణములు తుదిని గల యచ్చ తెలుఁగుధాతువులకుఁ బ్రేరణమున 'చుక్' అనునది బహుళముగ నగునని సూత్రార్థము. 'చుక్' అనునది కకారముపోవుప్రత్యయముగాన నిది ప్రకృతి కంతాగమం బగుననుట

స్పష్టము. ఆచ్ఛికమున కనుటంజేసి సంస్కృతధాతువులకుఁ బ్రేరణమున నించుక్కేగాని చుగాగమము గాదని తెలియునది. బహుళ మనుటంజేసి యాచ్ఛికమునకు సాధారణముగ నించుక్కుగాని చుక్కుగాని ప్రేరణమునఁ గాఁదగుననుట స్పష్టము. పూను:—ఇది యాచ్ఛికధాతువును నసంయుక్తమును నగుట నీవిధిచేఁ బ్రేరణమునఁ జుక్కు గలిగినఁ బూనుచనియుం, నించుక్కు గలిగిన (70 చే) పూనించనియుం రూపము లగును. ఇట్లే తక్కుంగల యుదాహరణము లూహ్యము. బహుళ మనుటంజేసి యను కను తిను విను మొదలగు నాచ్ఛికధాతువు లసంయుక్తనాంతంబు లయ్యును బ్రేరణమున 70 చే నించుగాగమమునేగాని చుగాగమము నీవిధిచే నందఁజాలవనియుం దాన వీనికి 78 చే పుగాగమంబును 85 చే నిత్వమునుగా 'వినుపు + ఇంచు = వినిపించు' అనురీతి రూపములే గలుగుననియుం బాహుళకంబుచే నను నీక్రిందివివరణమున కభిప్రాయము. వక్ష్యమాణమునఁ జెప్పఁబోవుసూత్రముచే నగునదనుట. 78 సూత్రమని తాత్పర్యము. బాహుళకమన బహుళత్వము బహుళముగనగుట యని భావము. ఇట్లే చుగాగమము నందఁదగని యాచ్ఛికముల కించుక్కు 70 చేఁ గూర్చి ప్రేరణమున 78 చేఁ బుగాగమమును జేయుచు నను కను మొదలగువానికి రూపములను సాధించుకొనఁదగును. కనుధాతువునకుఁ బ్రేరణమున కకారముమీఁది యత్తునకు దీర్ఘమును దీనియత్వంబునకను లక్షణకర్త వ్యవరణము ననుసరించి కూర్చి 'కను + ఇంచు = కను + పు + ఇంచు = కాను + పు + ఇంచు = కాని + పు + ఇంచు = కానిపించు' అనురీతిని బ్రక్రియం గమనించుచు సిద్ధరూపముల గమనించునది. ఆచ్ఛికధాతువుల యనాదియుత్వమున కిత్వము 85 చే నగుటను గమనించుకొనునది. దీన మగిడించు-కుదిరించు-అనిపించు మొదలగువాని యందలి గ-ర-న మొదలగువాని మీఁది యిత్వము 85 చే నైనదనుట స్పష్టమయ్యెడి. లక్షణము ననుసరించి గలుగవలసి వచ్చినను గొన్నింటి కన్వాదులకుఁ గాకుండుట బహుళగ్రహణఫలమనుట తెల్లము. 77 చేఁ గానిపించుననపుడు దీర్ఘము గాఁదగుఁగాన నది బహుళఫలము గాఁజాలదు.

## అట్లు పుగాగమంబును మాన్వాదులకగు. ౭౮

మాను-మానుపు-మానుచు. మను-మనుపు-మనుచు. బాహుళకంబున దీని కించుక్కు లేదు.

టీ. పూర్వసూత్రోక్తమగురీతిని బ్రేరణమున నసంయుక్త నాంతములగు మాను మొదలగుధాతువులకు బహుళముగ 'పుక్' అనునది యాగమముగ నగునని సూత్రార్థము. 'మాను + పు = మానుపు' అని పుగాగమం బగునపుడు రూపమగు. బహుళముగ నగున దగుటఁ బుగాగమము గానిచో నసంయుక్తనాంతమగు దీనికిఁ బూర్వవిధిచేఁ జుక్కు

ప్రేరణమునఁగా 'మాను+చు=మానుచు' అని రూపమగును. ఇదియుం బహుళమగుటఁ గాకున్న నించుక్కు 70 చేఁగా 78చే 'మానిపించు, మానిం'చని యగును. ఇట్లే మను ధాతువునకుఁ జుక్పుగాగములచే 'మనుచు-మనుపు' అనురూపద్వయ మగుటను గమనించునది. దీనికించుక్కు, చుక్పుగాగములయభావమునసైన మనించని గావలసివచ్చును. అట్టిరూపము ప్రయోగాప్రసిద్ధమగుటంజేసి యిందుకై 73 సూత్రమునుండి యనువృత్తమైన బహుళపదమట్టిరూపమును గాకుండ నడ్డునని బాహుళకంబుచే ననఁ నీక్రిందివివరణమున కభిప్రాయము. మాన్వాదులున్వంతములని సాదృశ్యమునుబట్టి గ్రహించునది.

### చుక్పువర్ణంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వంబగు. ౨౫.

టీ. ప్రేరణమున నగు చుక్పువర్ణములు పరములుగాఁ దత్పూర్వమున నున్న యికారమున కుకారమగునని సూత్రార్థము.'కలియు+పు=కలుపు-బిగియు+చు=బిగుపు' మొదలగువానియందుఁ దరువాతి సూత్రముచేఁ జుక్పుగాగమములు పరములుగాఁ గడప్రాయి లోపింపఁ బ్రేరణార్థకములైన యాచుక్పుగాగమములకు ముందున్న ధాతువు నిత్వమున కుత్వ మీవిధిచే నై పైరూపము లేర్పడెనని గ్రహించునది.

### అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాది మాయ్వాదులకగు నగుచో వానికడప్రాలు లోపించు. ౨౬.

అడఁగు - అడఁచు-అడఁగించు. మాయు - మాపు - మాయించు. అడఁగు-కరఁగు-కలఁగు-నలఁగు-ఇత్యాదులడంగ్వాదులు. మాయు-ఉడుగు-కడచు-కుడుచు-బిగియు-ఇత్యాదులు మాయ్వాదులు. ఆఁగు ప్రభృతు లుభయగణంబులు. బాహుళకంబునంజేసి కొన్నింటి కించుక్పుగాగమంబులు మూఁడును గొన్నింటి కందు యథాసంభవముగా రెండును గొన్నింటి కొక్కటియు నగునని యెఱుంగునది. ఆఁగు-ఆఁచు-ఆఁపు-ఆఁగించు. రేఁగు-రేఁచు-రేఁపు-రేఁగించు. పాయు-పాచు-పాపు. విఱుగు - విఱుచు. చూచు - చూపు. నేరుచు-నేరుపు. మేయు-మేపు. లేచు - లేపు. కలియు-కలుపు. తడియు-తడుపు. తెలియు - తెలుపు. ఇత్యాదు లెఱుంగునది,

టీ. పూర్వసూత్రద్వయమునఁ జెప్పఁబడినరీతిని బహుళముగ నడఁగు మొదలగు

వానికిఁ జుక్కును, మాయు మొదలగు వానికి పుక్కును ప్రేరణమున నగుననియు నపుడడం గ్వాదులయు మాయ్వాదులయు తుదియక్షరమునకు లోపము నిత్యముగ నగుననియుం సూత్రార్థము. చుక్పుగాగమములు పరములగునపుడె యనుటంజేసి యించుక్కు పరమగు నపుడు కడవ్రాలునకు లోపము గలుగదని గ్రహింపఁదగును. అడఁగు + చు:—చుక్కుపర ముగా గువర్ణముతుదివ్రాలు లోపింప నడఁచని రూపమగును. గువర్ణము లోపించుడు శేషించిన యర్ధబిందువు చువర్ణమునకు ముందు సంజ్ఞ 16 ననుసరించి యుండునని యెంచు నది. చుక్కుగాకున్న 70 చే నించుక్కు గలిగి యడఁగించని యగును. 'మాయు + పు= మాపు' అని కడవ్రాలు లోపింపఁగా నీరూపమేర్పడెను. ఇట్లే తుదివ్రాయిలోపము కరఁగు మొదలగువాని కూహ్యము. ఈక్రింద నిరూపితములైన యాఁగు మొదలగు ధాతువు లడంగ్వాదులలోను మాయ్వాదులలోను గూడఁ జేరునవగుంగాన నడంగ్వాదులందుఁ జుక్కును మాయ్వాదులందుఁ బుక్కును బొందునని యెఱుంగునది. 73 నుండి క్రమ ముగ బహుళపద మనువర్తింపఁబడుచున్నదిగాన నద్దానింజేసి కొన్ని ధాతువుల కించుక్చు క్పుగాగమములును మూఁడును గొన్నింటి కామూఁటిలో నెవ్వి యర్హములైన నవియు నగునని యీక్రిందివివరణమునకు బాహుళకంబునంజేసి యనుదానికర్థము. ప్రయోగాను సారముగఁ బ్రేరణార్థక ప్రత్యయములనించుక్చుక్పుగాగమముల ధాతువులకుఁగూర్చికొన వలెనుగాని సూత్రముల ననుసరించి యర్హత తోఁచెడిఁగదా యని యెల్లవాని కెల్లవానిని గూర్పరాదని గ్రహించునది. ప్రేరణార్థకములగు నించుక్చుక్పుగాగమములలో మూఁటి నందఁదగువానిని గ్రమముగ 70-76 లలోఁ జేర్చి 70 చే నించుక్కును 76 చే నడం గ్వాదులం జేర్చి చుక్కును మాయ్వాదులంజేర్చి పుక్కును గూర్చుకొనవలెననియుం రెండిటినందఁదగువానిని బైని వ్రాసినప్రకార మాయావిధులందుఁ జేర్చి చేసికొనవలె ననియుం నొక్కదానినే యందఁదగువానిని యథార్హముగ నొక్కవిధియందు మాత్రమే చేర్చికొనవలయుననియుఁ దాత్పర్యము. ఆఁగు:—దీని కించుక్పుగాగమములంజేసి 'ఆగిం చు-ఆఁచు-ఆఁపు' అను మూఁడును 70-76 లచే నగునని గ్రహించునది. ఇట్లే రూపత్రి తయము రేఁగుధాతువున కూహ్యము. పాయు:—దీని కించుక్కు గామిఁ జుక్పుగాగమ ములు 76 చే నడంగ్వాదులం జేర్చుటఁ జుక్కును మాయ్వాదులంజేర్చుటఁ బుక్కును గాఁ బాచు పాపు రూపములగునని యెఱుంగునది. పాయించనిమాత్రము గాదు. ఇట్లే విఱుగుధాతువున కొక్కచుక్కె ప్రేరణమున నగుంగాన విఱుచనియే యగు. ఈరీతిగనే తక్కినచూచు మొదలగుధాతువు లేడింటికిని బుగాగమమె యగుంగాన సంత్యాక్షర లోపంబుచేఁ జూపు మొదలగునవి గలుగునని గ్రహించునది. ఈరీతిని యథోచితముగఁ బ్రేరణరూపముల సాధించుకొనునది.

ఇంచుక్చుక్పుగాగమంబులు పరంబు లగునపు డాగమాదేశ లోపంబులు పెక్కుదెఱంగులం గానంబడియెడి. ౭౭.

అగు-కావించు. వచ్చు-రావించు-రప్పించు. విన్నపము-విన్నవించు. మోఁకాలు-మోఁకరించు. కేక - కేకరించు. పలవ-పలవరించు-పలవించు ఆల - ఆలకించు - ఆలించు. ప్రక్క-ప్రక్కలించు. నొచ్చు - నొంచు-నొప్పించు. ఉండు - ఉనుచు - ఉంచు. డిగు-డించు-డిగించు. పెరుగు-పెనుచు-పెంచు. తునుఁగు-త్రుంచు. మునుఁగు - ముంచు - మునుచు. మొగుడు-మొగుడుచు-మొగుచు-మోడుచు - మొగిడించు. చొచ్చు-చొనుపు-చొప్పించు. చినుఁగు-చించు-చింపు. త్రెగు-త్రెంచు-త్రెంపు. తిరుగు-త్రిప్పు. చచ్చు-చంపు. నిలుచు-నిలువరించు-నిలుపు. కొను-కొలుపు. పోవు-పుచ్చు-పనుచు-పంచు-పనుపు-పంపు-అనుచు-అంచు-అనుపు-అంపు. అనుప్రయుక్తంబగు. పోవునకుం బుచ్చుమాత్రంబగు-మోసపోవు-మోసపుచ్చు-ఇత్యాదు లెఱుంగునది.

టీ. ప్రేరణమున నగు నించుక్చుక్పుగాగమములు పరములగుచుండ ధాతువులకుఁ గొన్నివర్ణము లధికముగఁ గల్గుటయుఁ గొన్నివర్ణములకుఁ గొన్నివర్ణము లాదేశములుగ నగుటయుఁ గొన్నివర్ణములు లోపించుటయు నగునని సూత్రార్థము. అగు:-దీని కించుక్కు 70చే నైనది పరముగా నిత్యముగ, 'కావ్' అనునది యాదేశమయ్యెను. ఇట్లే వచ్చు ధాతువున కించుక్కు పరముగా 'రావ్-రప్ప్' అనునవాదేశము లయ్యెను. విన్నవించు:-విన్నపమను నామమునకు 65 సూత్రమునందలి జ్ఞాపకముచేత ధాతుత్వవివక్షయం దించు గాగమము 63చేఁ గా నది పరమగుచుండ నందలి పకారమునకు వకారమాదేశమయ్యెను. మోఁకాలను నామమునకు ధాతుత్వవివక్షయం దించుక్కు గాఁ గాలనుదానికి 'కర్' అనునది యాదేశమై మోఁకరించనురూప మయ్యెను. కేకను నామమున కించుక్కు పరముగా 'ర్' అనునదంతాగమం బగుటఁ గేకరించని యయ్యెను. ఇట్లే పలవను నామమునకుఁ బలవరించను రూపమేర్పడెను. 'ర్' అనునదంతాగమము గాకున్న నించుక్కుతోడఁ బలవించనియే రూపమగుననుట స్పష్టము. 'ఆల' అను నామమున కించుక్కు పరముగా 'క్' అనునదంతాగమంబైన 'ఆలకించు' అనియుఁ గాకున్న 'ఆలించు' అనియు రూపములగును. 'ప్రక్క' అను నామమునకు 63చే నంగలాది యగుట నైన యించుక్కు పరముగా 'ల్' అనునదంతాగమముగ నీవిధిచే సిద్ధింప 'ప్రక్కలించు' అని యగును.

'తొచ్చు' ఈధాతువునకు 70 చేఁ బ్రేరణమున నైన యించుక్కు పరముగా ద్విత్వచ కారములలో నొకదానికి లోపంబును లుప్తశేషంబగు దానికిముందు బిందువునుగా నొంచ నియు, ద్విత్వచకారమునకు ద్విత్వపకార మాదేశముగా నొప్పించనియు రూపములగును. 'ఉండు' ఈధాతువునకుఁ బ్రేరణమున 73 చేనైన చుక్కు పరముగా ధాతువునందలి 'ండు' అనుభాగమునకు 'ను' అనునది యాదేశ మీవిధిచేఁ గా నునుచనియు నొక్కు డులోపమే యైన నుంచనియు రూపములగును. 'డిగు' దీని కించుక్కుపరముగా నంతిమా క్షరలోపంబై యపదాదిస్వరసంధి యగుట డించనియుఁ, నంతిమాక్షరముతోడ నించుక్కు కలియుటంజేసి డిగించనియు రూపములగును. 'పెరుగు' దీని కించుక్కు పరముగా 'రు' అనువర్ణమునకు నువర్ణంబైనఁ బెనుచనియు, దానికి బిందువైనఁ బెంచనియు రూపము లేర్పడును. 'తునుఁగు' ఇంచుక్కుపరముగా నంతిమాక్షరలోపమును శేషించిన నువర్ణ మునకు బిందువును తవర్ణమునకు రేఫాగమంబును నీవిధిచేఁ గా 'త్రుంచు' అని రూప మగును. ఇట్లే మునుఁగుధాతువున కంతిమాక్షరలోపమును నువర్ణమునకు బిందువును గా 'మునుచు-ముంచు' అనురూపములు గలుగును. మొగుడుధాతువునకుఁ జుక్కు పరముగా మొగుడుచనియు నంతిమాక్షరలోపంబైన మొగుచనియును నంతిమాక్షరలోపం బుతోఁబాటుగ నాదిమవర్ణము దీర్ఘంబైన మోడుచనియు నించుక్కు 70 చేనైన గువర్ణము నత్వమున కిత్వ మీవిధిచే నై మొగిడించనియు రూపములగును. చొచ్చు ధాతువునకుఁ బుక్కు పరముగా 'చ్చు' అనుదానికి 'ను' అనునదాదేశముగా 'చొనుపు' అనియు 70 చేనైన యించుక్కు పరముగా 'ప్ప' అనున దాదేశమైనఁ 'చొప్పించు' అనియు రూపములగును. 'చినుఁగు' దీనికిఁ జుక్కు పరముగాను బుక్కు పరముగాను 'నుఁగు' అను భాగమునకు బిందు వాదేశముగాఁ జించు చింపను రూపద్వయము గలు గును. ఇట్లే త్రెగుధాతువు గువర్ణమునకుఁ జుక్పుగాగమములు పరములుగా గువర్ణ మునకు బిందు వీవిధిచే నాదేశముగాఁ ద్రెంచు త్రెంపనురూపములు గలుగును. 'తిరుగు' ఈ క్రియకుఁ బుక్కు పరముగా నంతిమంబగు 'ఉగు' అనుభాగమునకు 'ప్' అనున దాదేశ మును 'ఉగ్' అను భాగమునకుముందటి రేఫము తకారముతోఁ గలియుటయుఁ ననఁగా దవర్ణముమీఁది యికారము రేఫముమీఁదికి వచ్చుటయుఁ గాఁ ద్రిప్పనురూప మేర్ప డును. చచ్చుధాతువునందలి ద్విత్వచువర్ణమునకు బిందు వీవిధిచేఁ గాఁ బుక్కుతోడఁ జంపనురూపము గలుగును. నిలుచుధాతువున కించుక్కు పరముగా నంతిమాక్షరమునకు 'పర్' అనున దాదేశముగా నిలుపరించనియుఁ బుక్కు పరముగా నంతిమవర్ణలోప మీవిధిచేఁ గా నిలుపనియుం రూపద్వయమగును. కొనునకుఁ బుక్కు పరముగా నువర్ణము నకు లువర్ణమాదేశవిధిచేఁ గా 'కొలుపు' అను రూపమగు. పోవుధాతువునకుఁ జుక్కు

పరముగా నంతిమవర్ణమునకు 'చ్' వర్ణ మాదేశంబును ధాత్వాదివర్ణము నోకారమున ఉకారంబును గాc బుచ్ఛనియుc బోవున కంతకును 'పను' అనున దాదేశముగాc బను చనియు నాదేశంబైన పనునందలి నువర్ణమునకు బిందువైనc బంచనియుc బోవున కంతకు 'అను' అనునదాదేశమైన ననుచనియు నుస్థానమున బిందువైన నంచనియుc బుక్కు పరముగాc బోవునకు ముందటివలె 'పను' అనున దాదేశమైనc బనుపనియు నుస్థాన మున బిందువైనc బంపనియు, జుక్కు పరమగునపుడువలెనే 'అను' అనున దాదేశమైన ననుపనియు నువర్ణమునకు బిందువైన నంపనియు రూపములు గలుగును. ఒకశబ్దమునకుc దుది౦జేరిన పోవుధాతువునకుc జుక్పుగాగమములు పరములుగా 'పుచ్చు' అనునదే యాదేశ మగుంగాని పైని నిరూపించిన 'పను—అను' అనునవి యాదేశములగుట యు నుస్థానమున బిందువగుటయుc బొసcగవనియు స్వతంత్రముగ నిలువని మఱి యొకశబ్దముతోc జేరిన పోవుధాతువునకుc బ్రేరణమునc బుచ్చురూపమే గలుగు ననియుc గావున నే మోసమునునామమునకు వెనుకనుండిన పోవునకు మోసపుచ్చనియే ప్రేరణమున రూప మేర్పడెననియు నను ప్రయుక్తంబను నీక్రింది సూత్రవివరణమున కభి ప్రాయము. స్వతంత్రముగ వెలయని పోవునకు మోసపుచ్చునరీతినే ప్రేరణరూపము గలుగునని తాత్పర్యము. ఇట్లే సూక్ష్మబుద్ధిని నించుక్పుక్పుగాగమంబులు పరములుగా మూలధాతుదృష్టిని గ్రొత్తగనైన వర్ణాగమవర్ణాదేశవర్ణలోపవర్ణవికృతుల నితరముల కును గమనించికొనునది. ఇట్లించుక్పుక్పుగాగమములు పరములుగా నైన యాగమా దేశలోపములతోడి పరినిష్ఠితరూపముల మీcద లకారములును నసమాపకక్రియా ప్రత్యయములును భావార్థకాది ప్రత్యయములును నాయావిధులచే నై యాయా రూపము లేర్పడుటను యథార్థముగ గమనించికొనునది. ఇందు 'విన్నపము-మోcకాలు- కేక-పలవ-ఆల 'వ్రక్కు' అనునవి నామధాతువులగుట 65 క్రింది జ్ఞాపకమునుబట్టి యcగలాదులం జేర్చి ధాతుత్వవివక్షయం దించుగాగమమె చేయవలెననియు విన్నపము- లోపము మొదలగువానింబట్టి యించుక్కు పరముగా మువర్ణకలోపము గొన్ని నామ ధాతువుల కగుననియుc దక్కcగలవెల్ల ధాతువులే యగుటc బ్రేరణమున నించుక్పు క్పుగాగమము లాయావిధులచేc (70-73-74-76) గూర్పవలెననియు గ్రహింపవల యును. నామధాతువులకు 63 చే నించుక్కుగాని యన్యము ప్రేరణమునc గాదని గ్రహింపవలెను. ఇట్లాగమాదేశలోపంబు లర్థసాదృశ్యమున విధింపcబడెనేగాని సూక్ష్మ ముగc బరీక్షింప నాయాధాతువులు స్వతంత్రములనియు వ్యవహారమున వానికిc బ్రేరణార్థకత గుదిరెననియు గ్రహించుట యనుచితముc గాcబాలదు.

## అన్వాదుల కించుక్కు పరంబగునపుడు పుగాగమంబగు మానునకు విభాషనగు. ౭౮

అనిపించు. అను - కను - తిను - విను. మానిపించు - మానించు.

టీ. అను మొదలగు న్వంతధాతువులకును మాను ధాతువునకును 70 చే నైన యించుగాగమము పరముగా న్వంతములకు నిత్యముగను దీర్ఘపూర్వన్వంతమగు మాను ధాతువునకు వికల్పముగను 'పుక్' అనునది యాగమముగ నగునని సూత్రార్థము. 'పుక్' అనునది కకారము పోవునది గాన ధాతువుతుదిని గలుగుననుట స్పష్టము. 'అను' దీనికి 70 చే నించుక్కునది పరముగా నీవిధిచే నిత్యముగఁ బుగాగమంబును గా 'అను+ప్+ఇంచు='అనిపించు' అనురూపమగును. నిత్యమనుటం జేసి 'యనించు' మొదలగు రూపములు గావనుట తెల్లము. ఇట్లే కను తిను వినులకు 'కనిపించు-తినిపించు-వినిపించు' అను రూపము లగుటను గమనించికొనవలెను. మానున కీవిధిచేఁ బుగాగమ మించుక్కు పరముగానైన మాను+పు+ఇంచు=మానిపించనియు నది గానిపక్షమున మానించనియుం రూపము లగునని గ్రహించునది. కనిపించు వినిపించనురూపములు ప్రేరణార్థకములుగ వ్యవహారమున నేఁడు విననయ్యెడి. యథార్థముగ నాయాగణములంజేర్చి యాయా వాని కాయారూపముల సంపాదించునది. వీనినంతర్భావిత ప్రేరణార్థకములుగఁ బ్రయోగములంబట్టి గ్రహింపఁదగును.

## అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమంబగు నప్పాదులకు విభాషనగు. ౭౯.

అడ్డము-అడ్డగించు. అడ్డము-ఓర-చిత్తము-పంతము-పెల్ల-బోర-మట్టము - మేళము - ఇత్యాదులడ్డాగులు. అప్ప - అప్పగించు - అప్పించు. అప్ప-ఒప్ప-పల్లము-కోపము. ఇవి యప్పాదులు.

టీ. అడ్డ మొదలగు నామధాతువులకు 63 చేనైన యించుక్కు పరమగునపుడు నిత్యముగను, అప్ప మొదలగు నామధాతువులకు 63 చే నైన యించుక్కు పరముగా వికల్పముగను 'గుక్' అనునది యాగమముగ నగునని సూత్రార్థము. 'గుక్కు' కిత్తుగాన ధాత్వంతమున నాగమముగఁ జేరుననుట తెల్లము. అడ్డము:—దీని కించుక్కు పరముగా గుగాగమ విధిచేనైన 'అడ్డ+గ్+ఇంచు=అడ్డగించు' అని రూపమగును. ఇట్లే యోరగించు చిత్తగించు మొదలగు రూపము లోరచిత్తాదినామధాతువుల కూహ్యములు. 'అడ్డము' అను రీతిని ముపర్ణకాంతములుగ నుదాహరించినవానింబట్టి నామధాతువులకు 63 చే

నించుక్కగునపుడు ముపర్ణకలోపము గలుగునని గ్రహింపకతీరదని ముందె యుక్తము. అడ్డాదులకు నిత్యమనుటంజేసి యడ్డించను రీతి రూపములు గలుగవనుట స్పష్టము. అప్ప మొదలగువానికి 'గుక్' వికల్పమగుట నది యైనపక్షమున 'అప్ప+గ్+ఇంచు=అప్పగించు' అనియు నది గానియెడల 'అప్ప+ఇంచు=అప్పించు' అనియు రూపములగును. ఇట్లే తక్కుంగలవానికిని గుక్కు గలుగుటను గలుగమిని రూపద్వయమూహ్యము. ప్రసక్తమగునెడల నించుక్కు పరముగా ముపర్ణకలోపము కార్యము. యథార్థముగ నాయాగణములంగూర్చి యాయాధాతువుల కాయారూపముల సంపాదించికొనునది. ఇవి యప్పాదులనుటంజేసి యుదాహృతములే యప్పాదులుగాని యిది యాకృతిగణము గాదనియు నిత్యాదు లడ్డాదులనుటంజేసి యడ్డాదు లాకృతిగణమనియు గ్రహించునది. దీన నప్పాదులలో నిందనిరూపితములగుధాతువులు చేరవనుట స్పష్టము. సూరి యిట్లు సంస్కృతలాక్షణికమార్గము పట్టి ప్రక్రియాసుబోధమునకై ధాతుప్రత్యయాగమపర్ణవిభాగప్రదర్శన మొనర్చినను దత్త్వమరయఁ దత్తదంతములు ధాతువులు కొన్ని సహజము లవిభాజ్యములనియుఁ గొన్ని వర్ణాగమాదులంజేసి యేర్పడినవనియుఁ జెప్పక తప్పదు. (చూ. కో. రా. సంధి.)

## ఆడోడుకూడులడకారంబునకుం జుక్కు పరంబగునపుడు రేఫంబగు. ౮౦.

ఆడు-ఆరుచు-ఆడించు. ఓడు ఓరుచు-ఓడించు. కూడు-కూరుచు-కూడించు.

టీ. 'ఆడు-ఓడు-కూడు' అను ధాతువులకు 73 చే నైన చుక్కు పరముగా వానితుది డకారమునకు రేఫ మాదేశమగునని సూత్రార్థము. చుక్కు గాక 70 చే నించుక్కగునేని రేఫాదేశము గాదని గ్రహించునది. 'ఆడు+చు=ఆరుచు; ఓడు+చు=ఓరుచు; కూడు+చు=కూరుచు' అని యీరీతిని బ్రక్రియం గమనించునది. ఇంచుకైన 'ఆడు+ఇంచు=ఆడించు' అనియే రూపంబగును. ఇట్లే తక్కిన రెంటికి నించుక్కు పరముగా రూపములగునను స్పష్టము. 'డు' వర్ణము హలంశమునకే వ్యంజన రేఫంబాదేశమగునని గ్రహింపవలెను.

## చెడునకుం జుక్పుగాగమంబులును డాకలఘురేఫంబు నగు. ౮౧

చెఱుచు - చెఱుపు.

టీ. చెడుధాతువునకుఁ జుక్కును బుక్కును బర్యాయముగఁ బ్రేరణమున నగుననియు నాచుక్పుగాగమములు పరములుగాఁ జెడు ధాతువుతుది డవర్ణమునకు శకట

రేఫ మాదేశమగుననియు సూత్రార్థము. 'చెడు+చు=చెఱుచు; చెడు+పు=చెఱుపు' అని ప్రక్రియను గమనింపవలెను. డకారవ్యంజనమునకే శకటరేఫంబగు. దీని కించుక్కు గారాదనుట తెల్లము. 73 చేఁ జుగాగమంబె గావలసియుండుట రెండును విధింప వలసివచ్చెనని యెంచునది.

పడునకుం జుక్కును డాకలఘురేఫంబు నగు. ౧౨.

పఱుచు.

టీ. పడుధాతువునకుఁ బ్రేరణమునఁ జుక్కును జుక్కు పరముగా ధాతువు తుది నున్న డకారమునకు శకటరేఫమును గలుగునని సూత్రార్థము. పూర్వసూత్రమున దీనిం జొనిపినఁ బుగాగమంబును గావలెనుగానఁ బ్రత్యేకవిధాన మావశ్యకమయ్యెను. 'పడు+చు=పఱుచు' అని ప్రక్రియ నూహించునది. దీని కించుక్కుగాగమములు గలుగ వనుట స్పష్టము. తదంతమునకును నీవిధియగుననుట మీఁది సూత్రమునుబట్టి స్పష్టము

శబ్దపల్లవంబగు పడున కించుక్కు విభాషనగు నగుచో డాకు లఘురేఫంబగు. ౧౩.

వెలువడు - వెలువరించు - వెలువఱుచు. చొప్పడు - చొప్పరించు- -చొప్పఱుచు.

టీ. 118 సూత్రము శబ్దపల్లవలక్షణనిరూపకము. ఒకధాతువునకుఁగాని శబ్ద మునకుఁగాని వేఱొకధాతువుచేరి యేకధాతువుగ నేర్పడి యందలివానియర్థమును గాక వేఱొకయర్థమును దెల్పుచో నది శబ్దపల్లవమని భావము. కాన వేఱొక ధాతువు తుదిని జేరియుండు పడుధాతువునకుఁ బ్రేరణమున నించుక్కు వికల్పముగ నగుననియు నాయించుక్కు పరమగుచో నిత్యముగ ధాతువుతుది డకారమునకు రేఫ మాదేశమగుననియు సూత్రార్థము గలిగెడి. ఇంచుక్కు గానిపక్షమునఁ బూర్వవిధిచేఁ జుక్కును నలఘురేఫాదేశమును గలిగెడి. పూర్వసూత్రముచేఁ దదంతవిధి ననుసరించి నిత్యముగఁ జుక్కును నలఘురేఫమును గావలసివచ్చుటచే నీసూత్ర మావశ్యకమయ్యె నని గ్రహించునది. వెలువడు:—'వెలుఁగు+పడు' అను నీరెండు ధాతువులును గలిసి వెల్లడియను విలక్షణార్థమును బోధించుఁ గాన నిందలి పడుధాతువు శబ్దపల్లవంబయ్యె. కాన దీని కించుక్కువిధిచే వికల్పముగఁ గా నిత్యముగ నది పరముగ డాకు లఘు రేఫము గలుగ 'వెలువడు+ఇంచు=వెలువరించు' అనురూప మేర్పడెను. పాక్షి వాదేశము నిత్యముగ నయ్యెను. ఇంచుక్కు గానిపక్షమునఁ బూర్వసూత్రముచేఁ జుక్కును నలఘురేఫముగా 'వెలువడు+చు=వెలువఱుచు' అనురూప మేర్పడును.

ఇట్లే 'చొప్పు+పడు=చొప్పడు' అనురీతిని జొప్పను దానింగూడి శబ్దపల్లవంబైన పడుధాతువునకు విభాషగ నించుక్కును రేఫాదేశము నిత్యముగను నీవిధిచేఁ గాఁ జొప్పరించనియుఁ బూర్వసూత్రముచేఁ జుక్కును నలఘురేఫమును గాఁ జొప్పఱు చనియుం రూపములగుటను గమనించికొనునది.

ప్రేరణంబునం దించుక్కుమీఁద నించుక్కు లేదు. ౮౪.

ఇటనుటం జేసి ప్రేరణార్థంబయిన యితరాగమంబుమీఁదం బ్రేరణార్థంచుగాగమంబగునని యెఱుంగునది. నొచ్చు - నొంచు - నొంపించు. చచ్చు - చంపు - చంపించు.

టీ. ప్రేరణమున నించు గంతములగు ధాతువులమీఁద మఱల నించుక్కు ప్రేరణార్థమును వివక్షించినను గలుగదని సూత్రార్థము. ప్రేరణమున నించుక్కుమీఁద నించుక్కు గలుగదనుటం జేసి స్వార్థంచుక్కు మీఁదఁ బ్రేరణమున నించుక్కు గావచ్చుననియుఁ బ్రేరణార్థకములైన యించుగితరములైన చుక్పు గాగమములమీఁద నించుక్కు ప్రేరణమునఁ గాఁదగుననియు నర్థము లభించెడినని యిటనుటం జేసి యను నీక్రింది వివరణమున కభిప్రాయము. మఱియు నిట్లే ప్రేరణార్థకమగు నించుక్కంత మునఁ గలధాతువులమీఁద నించుక్కే గాక యితరప్రేరణప్రత్యయములును గలుగ వనియు గ్రహింపఁదగును. ప్రేరణార్థకములగు నితరాగమములమీఁదనే ప్రేరణేం చుక్కగుట కభ్యనుజ్ఞ చూపుటం జేసి ప్రేరణేంచుక్కుపై నితరప్రేరణాగమములు గలుగ వను నర్థ ముద్ఘాటితమగును. నొంచు:—నొచ్చుధాతువునకుఁ బ్రేరణముననైన చుక్కు పరముగా 77 చే 'చ్చు' అనుదానికి బిందువాదేశమగుట నీరూపము గలిగె. ఈవిధిచేఁ బ్రేరణార్థక చుగంతంబైన దీనిమీఁద మఱల నించుక్కైన 87 చే నొంచునందలి చకారమునకు పకారముగలిగి నొంపించను రూపమగును. ఇట్లే 77 చే నైన చంపను పుగాగమప్రేరణరూపముమీఁద నించుక్కువిధిచేఁ గాఁ జంపించను రూపంబగు. చంపిం చించనిగాని చంపించుపు-చంపించుచు అనిగాని ప్రేరణమున నీక్రిందివివరణమునంజేసి రూపము లేర్పడవని యెంచునది. స్వార్థంచుక్కుమీఁదఁ బ్రేరణేంచుక్కు గాఁదగుం గాన నంగలింపించు-ఆవులింపించు మొదలగురూపములు గలుగనగును.

ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు. ౮౫.

నిగుడు - నిగిడి - నిగిడె; మగుడు - మగిడి - మగిడె; ఉడుగు - ఉడిగి - ఉడిగె; మునుఁగు - మునిఁగి - మునిఁగె.

టీ. ఇవర్ణముగాని యెకారముగాని ధాత్వంతమునఁ జేరునపుడు ధాతువునందలి తొలియుకారమునకుఁ దప్పఁ దక్కినయుకారముల కికారమగునని సూత్రార్థము. ఇంచుక్కు 38 చే నగు. ఇత్వము 17 చే నగు. 16 సూత్రముచేనైన 'ఎను' అనునది 23 చే నైన యెదయెడు గెడులు 26 చే నైన యెడువర్ణకము 44 చే నైన యెడు గెడులు అను వీని యోగమున నిత్వ మీవిధిచే నగునని గ్రహింపవలయును. నిగుడుధాతువుతుదియుంత్తుతో 38 చే నైన ఇగాగమము గూడ; నందలి గువర్ణముమీఁది యుత్వమున కిత్వ మీవిధిచే నయ్యెననియుఁ దాన నిగుడి యనిగాక నిగిడియయ్యెననియు గ్రహించునది. ఇట్లే 26 చే నైన 'ఎను' వర్ణకము గూడుచో నిత్వము గలిగి నిగిడెనని రూపమయ్యెను. ఇట్లె తక్కినవుదాహ్యములు. అనాద్య మనుటంజేసి యుండుగు మునుఁ గులలో నాదిమోత్వమున కిత్వము గాదయ్యెననుట ఫలముగ గ్రహించునది. ఇట్లె చదువు ధాతువుమీఁద నిత్త్వైత్వములు గూడుచో చదివించి; చదివించెనని రూపము లగును. కాని 'ఆవులించి; ఆవులించెను' అనునపు డీవిధిచే నిత్వము చదివించి మొదలగు స్థలములందువలెనే గలుగవలసియున్నదిగాని 'ఆవిలించి' మొదలగు నపరూపములు గలుగవలసి వచ్చుటంజేసి కలుగదని గ్రహింపక తప్పదు. ఏది మొదటిదైన దానినే యాదిగ గ్రహింతమన్నఁ జదివించి మొదలగునవియే గాక మూలోదాహరణములే యసంగతము లయ్యెడిఁ గాన నావులించి మొదలగు కొన్నిటి కిత్వము గాదనుటయే యుచితమని తోఁచెడి.

## ముజ్జీత్తులు ముత్తు నాఁబడు. ౮౬.

టీ. 34 చే లూణ్మధ్యమపురుషైకవచన బహువచన ప్రత్యయములగు పురుల కాదేశము లైన ము-డుజ్జులకు ముజ్జుసంజ్ఞ యుక్తము. జీత్తనఁగా 'జి' అనునది పోవు నట్టి ప్రత్యయము. అనఁగా నట్టి జాతివనుట. కాఁగా లూణ్మధ్యమ పురుషప్రత్యయము లగు 'ము-డు' అనువానికిని 'జి' అను నికారముతోఁగూడిన జకారము లోపించు ప్రత్యయములకును 'ముత్తు' అనుసంజ్ఞ యగునని సూత్రార్థము ఫలించెను. సంజ్ఞకు సంగ్రహించి తెల్పుట ప్రయోజనమని ముందె యుక్తము. కలజి-పడుజి-నిజి-మిజి-నుజి-కజి మొదలగునవి జీత్తులనుట తెల్లము.

## ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబునకగు. ౮౭.

పచించు - పచింపించు. వచించు - వచింపించు. పిలుచు - పిలిపించు. వలచు - వలపించు. పత్వంబు హెచ్చునకుం గలుగదు; మెచ్చునకు విభాష నగు. హెచ్చించు-మెప్పించు-మెచ్చించు.

టీ. ప్రేరణార్థకమగు నించుక్కు పరముగా నద్దానికి ముందున్న చకారమునకు పకారము నిత్యముగ నాదేశమగును. ప్రేరణేంచుక్కనుటంజేసి స్వార్థేంచుక్కు పరమగునపుడు దానిముందటి చకారము పకారముగాదని గ్రహించునది. చకారమను సామాన్యోక్తింజేసి యది స్వార్థేంచుక్చకారమైనను, ప్రేరణార్థక చుక్చవర్ణమైనను, ధాతుసంబంధమైనను పకారమగునని యెంచునది. ప్రేరణార్థకచుక్కుమీఁద నించుగాగమము గాఁ దగుననుట 84 పట్టి స్పష్టము గాన నది చుక్కుసంబంధమైనను పకారమగుననుట స్పష్టంబు. స్వార్థేంచుక్కుమీఁదఁ బ్రేరణేంచుక్కు గాఁదగుంగాన నదియించుక్చకారమైనను పకార మాదేశమగుననుట తెల్లంబు. అంగలాదీతరములకుఁ దెలుఁగుధాతువులకుఁ బ్రేరణమునన 70 చే నించుక్కుగుంగాన ధాతు సహజమైనను పకారాదేశవిషయమె యగుననుట విశదంబె. పచింపించు:—ఇటఁ దుదినున్న ప్రేరణేంచుక్కు పరముగాఁ దత్పూర్వమున నున్న స్వార్థేంచుక్చకారమునకు పకారమయ్యెఁగాన 'పచింపు+ఇంచు=పచింపించు' అని రూపము గలిగెను. ఇట్లె వచింపించను రూపముప్రక్రియ గ్రాహ్యము. పిలుచుధాతువునకు 70 చే నించుక్కుగా ధాతువు తుదిని సహజమై యించుక్కునకుఁ బూర్వమైయున్న చకారమునకు పకారముగా 'పిలుపు+ఇంచు=పిలిపించు' అనురూపము గలిగె. ఇట లువర్ణమునుకారమున కికారము 85 చే నించుగిత్వయోగమునఁ గలుగుటను స్మరించునది. ఇట్లె వలచు ధాతువునందలి చకారమున కించుక్కుపరముగా పకారమగుటను గమనించుచు వలపించను రూపమును సాధించికొనునది. హెచ్చుధాతువున కించుక్కు పరముగా ధాతువునందున్న చకారములకుఁ బత్వ మీవిధిచేఁ గలుగవలసియున్నది. మఱియు చకారమునకను సామాన్యోక్తింజేసి యెన్నిచకారములున్న నన్నిపకారము లగునని స్పష్టపడెడిఁగానఁ బ్రకృతమున రెండు చకారములకు రెండుపకారములు గలుగవలసియున్నది. కాని హెచ్చు ధాతువునకు 'హెప్పించు' అనురీతిని బత్వము గలిగిన ప్రయోగము లగపడమిని నీవిధి దానివిషయమున వర్తింపదని గ్రహింపవలెనని పత్వంబు హెచ్చునకుఁ గలుగదను వివరణమున కభిప్రాయము. ప్రయోగములంబట్టి మెచ్చుధాతువు చకారముల కించుక్కు పరముగాఁ బత్వము వికల్పముగఁ గావలసియున్నది గాన నద్దానివిషయమున నీపత్వవిధి యొకపక్షమున వర్తించుననియుఁ నొకపక్షమునఁ గాదనియు గ్రహించి వర్తించినపక్షమున మెప్పించనియు, వర్తింపనిపక్షమున మెచ్చించనియుఁ రూపములను సాధించికొనవలెనని మెచ్చునకు విభాష నగునను నీక్రింది వివరణవాక్యమున కభిప్రాయము.

ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం
బగునపుడు పవలగు. ౫౫.

ఆగమంబు - పచింపఁడు - పచింపుము. అడఁపఁడు - అడఁపుము, అన్యము - పిలువఁడు - పిలువుము.

టీ. ముజ్జును 'జి' అనునది పోవు ప్రత్యయములును బరముగా ద్విత్వరహితము లగు నాగమముగఁ గల్గిన చకారములకును నట్లుగాని చకారములకును (శబ్దసహజముల కును) క్రమముగ నాగమచకారమునకు పకారమును శబ్దసహజమునకు వకారమును నిత్యముగ నగునని సూత్రార్థము. ఆగమచకారమునకుఁ బకారమగుట కుదాహృతులు. పచింపఁడు:—'పచించు+ఁడు' అని యుండ లజిని మధ్యమపురుష డుజ్వర్ణకము ముత్తు గాన నించుగాగమసంబంధమైన చువర్ణమునకుఁ బకార మీవిధిచే సిద్ధింప 20 సూత్రముచే లజి జిత్తుగాన పకారము నుత్వమున కత్వము గలుగ 'పచింపఁడు' అను రూప మగును. పచింపుము:—ఇట మధ్యమపురుషైకవచన ముపర్ణకము ముత్తగుంగాన నీవిధిచే నది పరముగా నించుగాగమ చకారమాత్రమునకుఁబకారముగాఁ 'బచింపు'మని రూప మగును. అడఁగు:—దీనికిఁ బ్రేరణమునఁ జుక్కునది పరముగా 76 చే నంతిమాక్షర లోపంబును గా నడఁచని యుండుననియు దానిమీఁద లజి మధ్యమపురుష బహువచన ప్రత్యయము డుజ్జు చేర్పఁగా డుజ్వర్ణకము ముత్తగుంగాన నీవిధిచేఁ జుగాగమ చువర్ణ మున కీవిధిచే పకారమును లజి జిత్తుగాన 20 చే పకారము నుత్వంబున కత్వమును గలిగి అడఁపఁడను రూపమయ్యెననియుఁ దెలియునది. ఇట్లే యడఁగుధాతు చుగంతము నునుండి గలిగినట్టియు, మధ్యమ పురుషైకవచనమున ముపర్ణకము పరముగాఁ జుగాగమ చువర్ణమునకు పకారముగలిగినట్టియుం, నడఁపుమనురూపపుఁ బ్రక్రియను గమనించునది. శబ్దసహజమై తుదినున్న చకారము పకారమగుట క్రీక్రిందివుదాహరణములు. పిలుచు ధాతువునకు లజి మధ్యమపురుషబహువచనము ముత్తుపరముగా నిది ధాతుసహజ చకార మగుటంజేసి వకారమీవిధిచే నయ్యెననియు దానియుత్వమునకు లజి జిత్తగుట 20 చే నత్వమయ్యెననియు దాన పిలువఁడను రూపముగలిగెననియు గ్రహించునది. ఇట్లే పిలుచు ధాతువునందు సహజమైయున్న చకారమునకు మధ్యమపురుషైకవచనము ముపర్ణకము పరముగా చకారమునకు వకార మీవిధిచే నగుటను పిలువుమను రూపమయ్యెనని యెఱుంగునది. ఇట్టివానికి 101 చే బహుళముగనగు కడవ్రాయి లోపమును గమనించుచు, రూపాంతరముల నూహించికొనునది. అద్విరుక్తములనుటంజేసి హెచ్చు మెచ్చు పుచ్చు మొదలగువానికి 'హెవ్వఁడు మెవ్వఁడు పువ్వఁడు' అను మొదలగు ననిష్టరూపములు

గలుగకుండుట ఫలమని గ్రహించునది. చకారము వ్యంజనమునకే పకార పకారవ్యంజనము లాదేశములగునని గ్రహించునది. కవిత్రయేతర ప్రయోగములం దన్ప్రిత్యయాదులు పరములగునపుడును బకారం బింతుక్చకారంబునకేని గానఁబడదని సోదాహరణముగఁ ద్రిలింగలక్షణశేష మీసందర్భమును సవరించుట నరయునది.

**ఖండబిందువుమీఁది సిద్ధచకారంబునకు ముత్తు పరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగనగు. ౮౯.**

తలఁపక - త్రేఁపక - తోఁపక. ఏఁచునకు వైభాషికంబు - ఏఁపక ఏఁచక. నోఁచునకుం గలుగదు - నోఁచక.

టీ. ముజ్జీత్తులు పరములుగా నర్ధబిందువుకంటెఁ బరములైయున్న శబ్దసహజములగు చకారములకు పకారము ప్రాయికంబుగ నగునని సూత్రార్థము. ప్రాయికమనఁగా సాధారణముగ నగుటయుఁ గ్వాచిత్కముగఁ గాకుండుటయు నొక్కొకచో వికల్పముగ నగుటయు నని గ్రహించునది. తలఁచుధాతువునకు కజీవర్ణకము ముత్తు పరముగానందలి యర్ధబిందువుమీఁది ధాతుసహజచకారమున కీవిధిచేఁ బకారముగాఁ దలఁపకను రూపము సిద్ధించెను. ఇట్లె త్రేఁచుధాతువునందలి యర్ధబిందువుమీఁది చకారమునకుఁ గజీ పరముగాఁ బత్వమగుటను గమనించునది. 20 చే నుత్వమున కత్వమగుటను నిట్టి చోటులందు స్మరించికొనునది. ఏఁచు ధాతువునందలి సహజచకారమున కర్ధబిందువుమీఁదిదైనను ముత్తు పరమగునపుడు వికల్పముగనే యగునని యీక్రిందివివరణమునుబట్టి తెలిసెడిఁగానఁ బత్వమైన నేఁపకయనియుఁ గాకున్న నేఁచకయనియు రూపములగును. నోఁచుధాతువున కీవిధిచేఁ బకారము గారాదు గాన దానికి ముత్తు పరమగునపుడు 'నోఁచఁడు - నోఁచక' అను మొదలగు రూపములేగాని నోపఁ డిత్యాద్యనిష్టరూపములు గలుగవని గ్రహించునది. ప్రాయికగ్రహణమున కివియె ఫలములుగ నూహింపఁదగు. పూర్వవిధిచే ధాతుసహజంబగు దీనికి నిత్యముగ పకారము సిద్ధింపవలసివచ్చుటచే నీసూత్రమును సూత్రింపవలసివచ్చెననుట స్పష్టము. ఖండబిందువుమీఁది యనుటంజేసి పూర్ణబిందువుమీఁదిదానికిఁ బూర్వవిధిచే నిత్యముగ ముత్తు పరంబగునపుడు పకారమగునని గ్రహించునది.

**ఆగమచకారంబునకు నెఱసున్నమీఁదిదానికి దుక్కుపరంబగునపుడు పకారంబు విభాషనగు. ౯౦.**

ఆకర్ణింపుదురు - దంపుదురు - చింపుదురు. పత్వంబు రానిపక్షంబున వక్ష్యమాణతాదేశంబు ఆకర్ణింతురు - దంతురు - చింతురు.

టీ. నిందుసున్నకంటెఁ దరువాత నున్నట్టి యాగమచకారమునకు దుగాగమ ముపర్ణము పరముగాఁగలదానికి వికల్పముగ పకార మాదేశమగునని సూత్రార్థము. 108 చే నగు తాదేశమున కపవాదంబు. అపవాదమన నొకకార్యమును గలుగనీయక తానే సంభవించుటనుట స్పష్టము. ఆకర్ణించుదురని యుండ నీవిధిచే చకారమాత్రమునకుఁ బకారాదేశముగా 'ఆకర్ణింపుదు'రని యగును. చకారమునకు పకారముగానిపక్షమున 108 చే తాదేశంబైన 'ఆకర్ణింతు'రని యగును. (చు దు + త్ = తు) పకారము గల్గిన పక్షమున 'చుదు' అను భాగము లభింపదుగాన తాదేశము గలుగ నవకాశము లేదనుట స్పష్టము. ఇట్లే దంతురనురూపము దంచుదురు అనుదానినుండియు చింతు రనురూపము చించుదురనురూపమునుండియుఁ 108 చే నగునని గ్రహించునది. పత్వము రానిపక్షమున తాదేశము నిత్యముగానఁ జించుదు రను మొదలగు రూపములు గలుగవనుట స్పష్టము. ఇవియెల్లను బూర్ణబిందుపూర్వమిాఁదివగుట తెల్లము. 22 చే లాట్టు రిజ్ఞు పరమగునపుడు దుగాగమంబగుటను స్మరించికొనవలెను. 'అనుబంధప్రార్థనయోర్ణావ్యతిరేకాదికేచ చోః పస్స్యాత్' అనుచింతామణి సూత్రమును మూలముగఁగొని సూరిప్రాచీన గ్రాంథికప్రయోగదృష్టితో నీపత్వవిధాయక సూత్రములను రచించెనని చెప్పఁదగును.

అగు వచ్చు చొచ్చు చూచులకు ముజ్జు పరంబగునపుడు కా రా చొరు చూడు లగు. ౯౧.

అగు - కాఁడు - కమ్ము. వచ్చు - రాఁడు - రమ్ము. చొచ్చు - చొరఁడు - చొరుము. చూచు - చూడఁడు - చూడుము.

టీ. ముజ్జిత్తులు పరములగునపుడు అగుధాతువునకు 'కా' అనునదియుఁ, వచ్చుధాతువునకు 'రా' అనునదియు, చొచ్చుధాతువునకు 'చొరు' అనునదియుఁ, చూచుధాతువునకు 'చూడు' అనునదియు నిత్యముగ నాదేశములగునని సూత్రార్థము. అగు వచ్చు చొచ్చు చూచులను క్రమము ననుసరించి కా రా చొరు చూడు లనునవి నిర్దిష్టములయ్యెనని గ్రహించునది. అగుధాతువునకు వ్యతిరేక (లజి)మునఁ బ్రథమపురుషైకవచనప్రత్యయము డుజ్జు పరముగా 'కా' అనునది ధాతువున కంతకు నీవిధిచే నాదేశమగుటంజేసి కాఁడను రూపము గల్గెనని తలంచునది. ఇట్లే యగుధాతువునకు మధ్యమపురుషైకవచన ప్రత్యయము (ము), 29 చే 'వు' అనుదానికైనది, పరముగా నీవిధిచేఁ గాదేశమును; 61 చే ముపర్ణమునకు ద్విత్వమును నీవిధిచే నైన 'కా' అనుదానికి హ్రస్వమును; (క) గలుగ 'కమ్ము' అనురూపమయ్యెనని భావించునది. ముజ్జు పరమగునపు డీవిధిచేనగు కాదేశమునకు వికల్పత 96 చే నగుట నెంచి రూపాంతరము లూహించునది. అట్లే వచ్చు

ధాతువునకుఁ బ్రథమపురుషైకవచనము పరముగా నీవిధిచే రాదేశముగా రాఁడనురూప మగును. వచ్చు ధాతువునకు మధ్యమపురుషమున మువర్ణకము పరముగా (29) రాదేశ మీవిధిచే నైనపిదప 61 చే ముపర్ణమునకు ద్విత్వమును 'రా'అనుదానికి హ్రస్వమును గలుగ 'రమ్ము'అనురూపము సిద్ధించును. ఇట్లే చొచ్చుధాతువునకు వ్యతిరేకప్రథమపురుషైకవచనమున డుజ్జువర్ణకము పరముగా 'చొరు'అనున దాదేశముగా 'చొరు+ఁడు'అని యుండ 20 చే రువర్ణమునుత్వమున కత్వముగాఁ జొరఁడనురూపమేర్పడును. మధ్యమపురుషైకవచనప్రత్యయము 29 చే నైనది పరముగాః జొచ్చునకుఁ జొరనున దాదేశమైనఁ జొరుమని రూపమగును. అరీతినే చూచుధాతువునకు లజేని ప్రథమపురుషైకవచనము డుజ్జు పరముగా 'చూ'అనున దీవిధిచేతను గలిగి 20 చే నుత్వమున కత్వంబై చూడఁడనురూపంబగు. మధ్యమపురుషప్రత్యయము ముపర్ణకము పరముగా (29) చూచునకుఁ జూడనున దాదేశ మీవిధిచే నై చూడుఁడని రూపమగును. ఇట్లే ముజ్జీత్తులు పరమగునపు డెల్ల నీయాదేశము లాయాధాతువులకుఁ గలుగుటను గమనించుకొనుచు రూపాంతరము లూహ్యములు. లాణ్మధ్యమబహువచనములందు 61 చే దీర్ఘములగు కారా అనువానికి హ్రస్వమును సంధి 22 చే నుడితొలిహ్రస్వముమీఁద నర్ధబిందువు నిల్వ నవకాశము లేమిని, నిండుబిందువును నై కండు-రండు-రూపములగుటను స్మరించుకొనునది. ముజ్జీత్తులు పరములుగా నగుధాతువునకుఁ గాదేశము వికల్పముగ 96 చే నగుటను గమనించికొనుచు రూపాంతరముల నూహించికొనునది.

ఇచ్చునకు సర్వంబున కీయగు. ౯౨.

ఇచ్చు - ఈఁడు - ఇమ్ము ఈయయనునాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి; బలిమినీయనిభూమివలయపతుల.

టీ. మధ్యమముడుజ్జులును జీత్తులును బరములుగా నిచ్చుధాతువున కంతకును 'ఈ'అనునది యాదేశమగునని సూత్రార్థము. సర్వంబున కనఁగా నిచ్చునంతను ద్రోచి ఈయగునని యర్థము. ఇచ్చుధాతువునకు లజేని బ్రథమపురుషైకవచనమున డుజ్జు పరముగా నీసూత్రముచే నీయాదేశంబైన నీఁడనురూపమగు. లాణ్మధ్యమైకవచనమున ముపర్ణకము పరముగా నీయాదేశ మీవిధిచేనై 61 చే ముపర్ణకమునకు మామడియుం నీకారమునకు హ్రస్వమును నై యిమ్మనురూపము గలిగెను. ఇట్లే సంధి 22 చే నిండను రూపము లాణ్మధ్యమబహువచనమున నగుటను గమనించునది. ఇచ్చుధాతువునకుఁ గజి నిజ్యాదులు పరములుగా నీయక యీయని మొదలగురూపము లగపడుచుండుటను నారూపము లీయయనునదాదేశింపక సిద్ధింపకుండుటను గమనించి గ్రంథకర్త యొకానొకచో నీయయనునాదేశమును గానంబడియెడి నను వివరణముచే నీయయనునాదేశ

మును విధించెనని గ్రహించునది. కావుననే 'బలిమినీయని' అను నీక్రిందివివరణమునం దున్న 'ఈయని' అను నన్నయప్రయుక్తమైన నిచ్చుధాతునిజిరూపము సాధువయ్యెనని గ్రహించునది. అట్లని 'ఈని-ఈక' అనురూపము లుండవని గ్రహింపరాదు. ఈయ యను నదియుఁ బక్షమున నిట్టియెడల నగునని యెంచవలెను. ఇట్లే ముత్తు పరంబగునపు డంతట 'ఈ' అనునది సర్వాదేశమగుట యూహ్యము. "ఈయ" అను నాదేశము ముత్తుసంజ్ఞ గలిగిన యెల్లస్థలములఁ బ్రసక్తముగామి నొకానొకచోనని వ్యాకర్త వివరించుట గలిగె నని గ్రహించునది.

## తేతేరులు తెచ్చునకగు. ౯౩.

తెచ్చు - తేఁడు - తేరఁడు - తెమ్ము - తేరుము.

టీ. ముజ్జిత్తులు పరములగునపుడు తెచ్చుధాతువునకు 'తే-తేరు' అనున వాదేశము లగును. ఒకమాఱు 'తే' అనునదియు నొకమాఱు 'తేరు' అనునదియు నాదేశం బయ్యెడి. తెచ్చుధాతువునకు లజిని బ్రథమపురుషైకవచనము డుజ్జు పరముగా నీవిధిచేఁ దేయాదేశంబైన 'తేఁడు' అనియుఁ దేరాదేశంబైన 'తేరఁ'డనియు రూపములగును. 20 చే నత్వ మీపక్షమున నుత్వమున కగును. ఇట్లే లూణ్మధ్యమైకవచనమునఁ దేయాదేశంబైన 61 చే ద్విత్వహ్రస్వములు గాఁ దెమ్మనియుఁ దేరనున దాదేశంబైనఁ దేరు మనియు రూపములగును. వీనిబహుత్వమున 61 చేఁ దెండని యగుటను గమనించునది.

## చావునోవులు చచ్చునొచ్చులకగు. ౯౪.

చచ్చు - చావఁడు - చావుము. నొచ్చు - నోవఁడు - నోవుము. వక్ష్యమాణంబు ద్విత్వంబు - నొవ్వఁడు.

టీ. ముత్తు పరమగునపుడు చచ్చుధాతువునకు 'చావు' అనునదియు నొచ్చు ధాతువునకు 'నోవు' అనునదియు నాదేశములగునని సూత్రార్థము. చచ్చుధాతువునకు లజి ప్రథమైకవచనమునఁ జావాదేశముగాఁ జావఁడనియు నట్లే లూణ్మధ్యమైకవచన మునఁ జావాదేశమైనఁ జావుమనియు, రూపములగును. లజియం దత్వము 20 చే నగు. ఇట్లే నొచ్చునకు లజి ప్రథమైకవచనమున 'నోవు' అనున దాదేశమైన 20 చే నత్వము గలిగి నోవఁడనియు లూణ్మధ్యమైకవచనమున ముపర్ణకము పరముగా నోవాదేశమైన నోవుమనియుం రూపములగును. నోవాదేశమైనపిదపఁ బ్రకీర్ణము 6 చే వకారమునకు ద్విత్వముగాఁ బిదప సమాసము 13 చే హ్రస్వమును గలుగ నొవ్వఁడను మొదలగు రూపములు నొచ్చుధాతువునుండి యేర్పడునని యీక్రింధివివరణమున కభిప్రాయము.

కాని యిట్లు ప్రకీర్ణము 6 నఁ జేరమిఁ జవ్వఁడనురీతిరూపములు చచ్చుధాతువునకు మాత్రము గలుగవని యెంచునది.

**జిత్తు పరంబగునపుడు వాని వువర్ణంబు విభాషను లోపించు. ౫౫.**

చాక - చావక - చాకుము - చావకుము. నోక - నోవక - నోకుము - నోవకుము.

టీ. 'జి' అనునది పోవుప్రత్యయములు పరములగునపుడు మాత్రము పూర్వ సూత్రముచేనైన చావునోవుల తుదివర్ణములకు లోపము గలుగునని సూత్రార్థము. చచ్చు ధాతువునకు 39 చేఁ గాని 36 చేఁగాని కజిగా నది జిత్తుగానఁ బూర్వసూత్రముచే నది పరముగా 'చావు' అనునది యాదేశమయ్యెననియు నీసూత్రముచే వువర్ణము లోపింప 'చాక'అనురూప మేర్పడెననియు గ్రహించునది. వువర్ణమనుటంజేసి 20 చే నుత్వమున కత్వము గలుగకముందె వువర్ణలోప మగునని గ్రహించునది. వువర్ణలోపము గానిపక్ష మున 20చేఁ, బూర్వసూత్రముచే నైన 'చావు' అనుదాని వువర్ణము నుత్వమున కత్వం బై చావకయను రూపమగును. ఇట్లే లజియందు మధ్యమపురుషైకవచనము 'ము'అను నది పరముగా 32 చే కుజి యగుననియు కుజి జిత్తుగాన నది పరముగాఁ బూర్వసూత్ర ముచేఁ జచ్చుధాతువునకు 'చావు' ఆదేశమగుననియు నీవిధిచే వువర్ణలోపముగా 'చా కుము' అనురూపమయ్యెననియు నీవిధిచే వువర్ణలోపము గాకున్నఁ గుజి పరముగా 20 చే వువర్ణము నుత్వమున కత్వంబై 'చావకుము' అనురూప మగుననియు గ్రహించునది ఇట్లే నొచ్చుధాతువునకు కజివర్ణకము పరముగాఁ బూర్వసూత్రముచే 'నోవు' అనున దాదేశంబై 20 చే నత్వంబైన నోవక యనియుం నీవిధిచే వికల్పముగ వులోపంబైన నోక యనియుం నాగతినే వ్యతిరేక మధ్యమైకవచనము పరముగా నైన కుజి, జిత్తు, పరమగుచుండఁ బూర్వవిధిచే నోవాదేశమై 20 చే వువర్ణము నుత్వంబున కత్వముగా నోవకుమనియు వువర్ణ మీవిధిచే లోపించినపక్షమున నోకుమనియుం రూపములగునని యెఱుంగునది. ఈముత్తు పరంబగునపు డాదేశాదుల విధించు నీసందర్భమున మహాదర్శక రూపములనే యుదాహరించుట స్పష్టార్థముగాని యమహదర్థమున నిట్టిరూపములు గావని మాత్రము గ్రహింపరాదని యెఱుంగునది. జిత్తు పరమగునపుడె యనుటంజేసి ముజ్జు పరమగునపు డికార్యము గలుగ దనుట స్పష్టము.

**అగున కను కనులకు ముజ్జిత్తులు పరంబులగునపుడు కా నా కానలు విభాషనగు. ౫౬.**

అపవాద్యసూత్రముచే గాకు వకారంబు. వక్ష్యమాణం

బౌత్వంబు. కమ్ము - అగుము - అవుము - ఔము. కండు - అగుఁడు - అవుఁడు - ఔఁడు. నాఁడు - అనఁడు. కానఁడు - కనఁడు.

టీ. అనుకనులనునది ద్వంద్వము. అగునకనుదానికి ముఙ్ అనుదానితోను నను కనులకు జీత్తనుదానితోను నన్వయము. కాఁగా ముడుఙ్జులు పరములగునపు డగునకు 'కా' అనునదియు 'జి' అనునది పోవు ప్రత్యయములు పరములగునపుడు 'అను-కను' అనుధాతువులలో ననునకు 'నా' అనునదియుఁ గనునకు 'కాన' అనునదియు నాదేశములు వికల్పముగ నగునని సూత్రార్థము. కాదేశ మగునకుఁ గానిపక్షమున నాచ్ఛికము 27 చే 'అగు' అనుదానియందలి గకారమునకు వకారమును 103 చే 'అవు' అని వకారాదేశముచే నేర్పడినభాగమున కౌత్వమును గలుగునని యుపదాద్యంబను నీక్రింది వివరణవాక్యద్వయమున కభిప్రాయము. మఱియు ముడుఙ్జులకంటె నితరములు జీత్తులు పరములగునపు డగునకుఁ గాదేశమీవిధిచే వికల్పముగఁ గలుగక 91 చే నిత్యముగగలుగు ననియు జీత్తులకంటె భిన్నములు పరములగునపు డనుకనులకు నాకానాదేశములు గలుగ వనియుం ఫలితమును గ్రహించి ప్రక్రియను నడుపుకొనవలెను. అగుధాతువునకు లోణ్మధ్యమ పురుషముపర్ణకము పరముగా నీవిధిచే కాదేశముచు 61 చే ముపర్ణమునకు మూముడియు నాదేశమైన కాకు హ్రస్వమును గాఁ గమ్మనురూపము గలుగును. ఇట్లే లజీని గాదేశము డుఙ్జు పరముగాఁ గాఁ గాఁడనురూప మేర్పడును. కాదేశము గానిపక్షమున 'అగుము' అనియు నాచ్ఛికము 27 చే వాదేశమైన నవునునియు 103 చే నవునకు 'ఔ' అను నదియైన 'ఔము' అనియు రూపములు గలుగును. అగుధాతువునకు లోణ్మధ్యమబహు వచనప్రత్యయము డుఙ్జు పరముగా నీవిధిచేఁ గాదేశంబును 61 చే హ్రస్వము గాదేశమునకును గలిగి సంధి 22 చేఁ బూర్ణబిందువగుటంజేసి కండనురూపము గలుగును. కాదేశముగాకున్న అగుఁడనియుఁ గకారమునకు వకారంబైన నవుఁడనియు నౌత్వంబైన నౌఁడనియుం రూపములగుననుట పూర్వోదాహరణప్రక్రియంబట్టి స్పష్టము. అనుధాతువునకు లజీ ప్రథమపురుషైకవచనము పరముగా లజీ జీత్తుగాన నీవిధిచే నా యనునది యాదేశముగా నాఁడని రూపమగును. నాదేశము గానిపక్షమున ననుధాతూత్వమునకు 20 చే నత్వముగలిగి 'అనఁడు' అని రూపమగును. ఇట్లే కనుధాతువునకు లజీ ప్రథమైకవచనము పరముగా నీవిధిచేఁ గానాదేశంబైనఁ గానఁడనియుఁ గానాదేశము గాకున్న 20 చే ధాతువుతుదియుత్వమున కత్వంబై కనఁడనియుం రూపములు సిద్ధించును. ఇట్లే యగునకు ముఙ్జు పరమగునపుడును ననుకనులకు జీత్తు పరమగునపుడును నీయాదేశములగుటను గమనించుచుఁ గానపుడు యథాసంభవముగఁ గలుగుకార్యవిశేషములఁ జూచికొనుచు రూపాంతరము లూహ్యములు. 91 చే ముఙ్జీత్తులరెంటను నగుధాతువునకుఁ గాదేశము-

నిత్యముగ వచ్చుచోచ్చుచూచులకు రాచోరుచూడులవలె సంప్రాప్తమగుచుండుటంజేసి ముజ్జు పరమగునపుడద్దానికి వికల్పముగ నీవిధిచే విధించునక్కఱ గలిగెననియెఱుంగునది.

## నేరుచునకు లిడ్లాట్టులు ముత్తుంబరంబులగునపుడు రుచులకు లోపంబు బహుళంబుగానగు. ౯౭.

నేచెను - నేరిచెను. నేచును - నేరుచును. నేరఁడు - నేరువఁడు.

టీ. ముత్తనుదానికి రుచులను ద్వంద్వములోని చువర్ణముతో నన్వయము. లిడ్లాట్టులను ద్వంద్వమునకు రుచులను ద్వంద్వమునందలి రువర్ణముతో నన్వయము. కాఁగా నేరుచుధాతువునకు లిడ్లాట్టులు పరములుగా నందలిరువర్ణము వికల్పముగ లోపించుననియు నేరుచుధాతువునకు ముడుజ్జులును జేత్తులును బరముగా నందలి చువర్ణము వికల్పముగ లోపించుననియు సూత్రార్థములభించెడి. నేరుచు ధాతువునకు లిట్టునందు డుజ్జునకు 17 చే ఎనువర్ణకమును నీవిధిచే రులోపమును గా 'నేరుచు=నేచు+ఎను=నేచెను' అని రూపమయ్యెను. రులోపము గానిపక్షమున 85 చే రువర్ణము నుత్వమున కెనువర్ణకము సంబంధమైనయెకారము గూడుచో నిత్వము గలుగ 'నేరిచెను' అనురూప మగును. నేరుచు ధాతువునకు లాట్టునందుఁ బ్రథమపురుష డుజ్వర్ణకమునకు 16 చే నువర్ణక మాదేశముగా 'నేరుచు+ను' అనియుండ నీవిధిచే లాట్టు పరమగునపుడు రులోపముగా 'నేచు'ననియుఁ గానిపక్షమున 'నేరుచును' అనియు రూపములగును. నేరుచు ధాతువునకు లజిని బ్రథమపురుషయందు డుజ్వర్ణకము పరముగా లజి జేత్తుగాన ముజ్జేత్తులు ముత్తు నాఁబడుట నీవిధిచే చువర్ణలోపము గలుగ 20 చే రువర్ణము నుత్వమున కత్వంబై 'నేరఁ'డనురూపమేర్పడును. చువర్ణలోపము గానిపక్షమున నేరుచుధాతువునందలి ధాతుసహజచకారమునకు 88 చే వకారమును 20 చే దానియుత్వమున కత్వమునుగా 'నేరువఁ'డనురూపమగును. మహత్క్రర్త్రైకక్రియలే యుదాహరించుట స్పష్టార్థముగాన నమహత్క్రర్త్రైకము లగునపుడును నిట్లే రూపము లగుటను గమనింపవలెనని ముందె యుక్తము. లిడ్లాట్టులు పరములగునపుడు రులోపమును ముత్తు పరమగునపుడు చులోపమును విధించుటంజేసి శత్రర్థాదులందు 'నేచున్, నేచి' అనునట్టి యపరూపములు గలుగకుండుట ప్రయోజనమని యెఱుంగునది.

## పోవునకు దుజ్ముత్తులు ముజ్జుంబరంబులగునపుడు వులోపంబుం బొదపదలును విభాషనగు. ౯౮.

పోదురు - పోవుదురు. పోఁడు - పోవఁడు - పోవుము. పొదము - పదము - పొమ్ము.

టీ. దుజ్ముత్తులను ద్వంద్వమునకు వులోపమునుదానితోను, ముజ్జునుదానికిఁ బోద పదలనుదానితోను నన్వయమగు. కాఁగా పోవుధాతువునకు దుక్కు-ను ముజ్జీత్తులును బరములగునపుడు వుకారలోపమును, ముజ్జు పరమగునపుడు 'బొద-పద' అను నాదేశములును వికల్పముగ నగునని సూత్రార్థము. 22 చే లాట్టునందు దుగాగమము ప్రథమపురుషబహువచనము మొదలుకొని యయిందు నెల్లపురుషముల వచనములందును నగుననుట తెల్లము. 'ము-డుజ్జులును' జీత్తులును ముత్తునాఁబడున వనుట 86 చే స్పష్టము. మధ్యమము డుజ్జు ముజ్జునాఁబడుననుట తెల్లము. పోవుధాతువునకు లాట్టునందు ప్రథమపురుషబహువచనము (రు) పరముగా 22 చే దుగాగమమగునని యుం నాదువర్ణము పరముగా నీవిధిచే వులోపంబుగా పోదురనియుం వులోపముగాకున్న పోవుదురనియు రూపములగును. పోవుధాతువునకు లజెని ప్రథమైకవచనము డుజ్జు పరముగా లజె జీత్తుగాన 86 చే ముత్తునాఁబడుట నీవిధిచే నదిపరముగా వులోపముగా పోఁడనియు వులోపము గానిపక్షమున 20 చే వువర్ణము నుత్వమున కత్వంబై పోవఁడనియుం రూపములగును. పోవుధాతువునకు లాట్టునందు మధ్యమైకవచనము (ము) పరముగాఁ బోవునకుఁ బోదయనునదైనఁ బొదమనియుం పద యాదేశంబైన పదమనియు నీరెండును గాకున్న ముజ్జును 86 ననుసరించి ముత్తు నాఁబడుంగాన వులోప మీవిధిచే గా 'పో + ము' అని యుఁండ 61 చేఁ బోయనుదానికి హ్రస్వమును మువర్ణకమునకు మాముడియుఁ గాఁ బొమ్మనియుం రూపములగును. ఇట్లే లాట్టునందు మధ్యమబహువచనమునఁ 'బోవుఁడు-పొదఁడు-పదఁడు-పొం' డను రూపము లగుటను గమనించునది. ఇట్లే దుజ్ముత్తులు పరంబులగుటను గమనించుచు మిగిలినరూపములను సాధించికొనునది.

## అగుపోవుల కడవ్రాల కిద్వ్యక్రంబులు పరంబులగునపుడు యకారంబగు. ౯౯.

వక్ష్యమాణం బైత్వంబు - అయి - ఐ. అయిరి - ఐరి - పోయి - పోయిరి - పోయెను - పోయెడు.

టీ. 'అగు-పోవు' అనునీరెండుధాతువుల తుదియక్షరములగు 'గు-వు' అనువానికి ఇకారముగాని ఎకారముగాని పరములైనపుడు యకార మాదేశమగును. 'అగు' ధాతువునకుఁ క్త్వార్థమున 38 చే నైన ఇకారము పరముగా నీవిధిచే 'గు' అని దానికి యకారాదేశమైన 'అయ్+ఇ=అయి' అని రూపమగును. 103 చే 'అయి' అనుదానికి 'ఐ' అనునదైన 'ఐ' అనురూపమగు. చెప్పఁబోవు 103 సూత్రమునుబట్టి ఐకారమగుటను గమనింపవలెనని వక్ష్యమాణంబను వివరణమున కభిప్రాయము. అగుధాతువునకు లిట్టునందు

ప్రథమపురుషబహువచనము పరముగా 17 చే నిగాగమముగా 'అగు+ఇ+రు' అని యుండ నీవిధిచే 'గు' అనుదానికి యకారముగా 'అయు+ఇ+రు' అని యుండఁ దత్సమము 25 చే క్రియావిభక్తియగుట రువర్ణకోత్వమున కిత్వముగా నయిరి యనియు 103 చే నైకారమైన నైరనియు రూపములగును. ఇట్లే పోవుధాతువునకుఁ ద్వ్యర్థమున నైనయికారము పరముగా నీవిధిచే తుదివుకారమునకు యకార మాదేశమై 'పోయ+ఇ=పోయి' యనియు లిట్టున భూతంబునందైన యిగాగమేకారము పరముగాఁ బోయిరనియు లిట్టు డుజ్ఞునకైన యెనువర్ణకము నెకారము వక్రము పరముగాఁ బోయెననియు నెడువర్ణకము నెకారము వక్రము పరముగా పోయెడుననియు రూపము లగును. ఈ రీతినిద్వ్యక్రములు పరములగుటను గమనించికొనుచు నగుపోవులకడవ్రాలకు యకారమగుటను గమనించికొనునది. యకారమగుపోవుల కడవ్రాలహాలంశమునకే యని యెఱుంగుచుఁ బ్రక్రియలో నపదాదిస్వరసంధిని బ్రవర్తింపఁ జేసికొనునది.

అగునకు వక్రంబు గూడుచో దీర్ఘంబగు. ౧౦౦.

వక్ష్యమాణంబు ద్విత్వంబు - ఆయెను - అయ్యెను - ఆయెడు- అయ్యెడు.

టీ. పూర్వసూత్రమున నగుధాతువునకు వక్రము పరముగనుంచి యుదాహృతులంజూపలేదు. వక్రము గలియునపు డగుధాతువు తుదివర్ణమునకు యకారము పూర్వసూత్రముచే నగునపుడగుధాతువునందలి మొదటి అకారము దీర్ఘమగునని సూత్రార్థము. అగుధాతువునకు 16 చే నైన యెనువర్ణకమునెకారము గూడునపుడు పూర్వవిధిచే గువర్ణము హాలంశమునకు యకారముగా 'అయు+ఎను' అని యుండ నీవిధిచే వక్రము గూడునపు డకారము దీర్ఘముగా 'ఆయెను' అనురూప మేర్పడును. ప్రకీర్ణము 6 చే నాకారముమీఁది యకారమునకు ద్విత్వమును సమాసము 13 చే నాకారమునకు హ్రస్వమునుగా 'అయ్యెను' అని రూపమగును. ఇట్లే యెడుగెడిగాగమములవక్రము పరమగునపుడును 99 చే యకారమును, వక్రము గూడుచో నీవిధిచే నకారమునకు దీర్ఘమును, బ్రకీర్ణము 6 చే ద్విత్వమును, సమాసము 13 చే నాకారమునకు హ్రస్వమును, గూర్చుచుఁ గ్రమముగ 'ఆయెడు-అయ్యెడు' అనురూపములను సాధించికొనవలయును. వక్ష్యమాణ మనఁ జెప్పఁబోవునది. ప్రకీర్ణము 6 సూత్రమని భావము.

పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు ౧౦౧.

పిలఁడు - పిలువఁడు - పిలుము - పిలువుము. లేచునకు ముజ్ఞు

పరంబగునపుడు చులోపంబగు. లెమ్ము - లెండు. పిలుచు - నిలుచు - తలఁగు - ఇత్యాదులు.

టీ. పిలుచు మొదలగు ధాతువులకు ముజ్జీత్తులు పరములగునపుడు వాని తుది యక్షరము బహుళముగ లోపించునని సూత్రార్థము. పిలుచుధాతు సాదృశ్యము ననుసరించి సహజచువర్ణాంతధాతువులు గ్రాహ్యములు. పిలుచుధాతువునకు 7 చే లజీయుం డుజ్జును గా, లజీ జీత్తుగాన నీవిధిచే చువర్ణము లోపింప 20 చే లువర్ణము నుత్వమున కత్వము గలిగి పిలఁడను రూపమయ్యెను. చువర్ణలోపము గలుగనిపక్షమున 88 చే ధాతుసిద్ధ చకారమునకు వకారమును 20 చే దాని యుత్వమున కత్వమును గా, పిలువఁడను రూప మయ్యెనని యెంచునది. ఇట్లె లూణ్మధ్యమ ముపర్ణకము పరముగా నీవిధిచే చు లోపం బైన పిలువమనియుఁ గాకున్న 83 చే చకారమునకు వకారంబగుట పిలువుమనియు రూపములగునని గ్రహించునది. బహుళగ్రహణమునంజేసి పిలుచు మొదలగువానికి వలెఁ గాక లేచుధాతువునకు మాత్రము లూణ్మధ్యమైకవచన బహువచన ప్రత్యయములు ము-డులు పరములగునపుడు చులోప మీవిధిచే నిత్యముగ నగునని లేచునకను నీక్రిందివివరణమున కభిప్రాయము. లేచుధాతువునకు లూణ్మధ్యమైకవచ నము ముపర్ణకము పరముగా నీవిధిచే నిత్యముగ నంత్యవర్ణలోపము గలిగి 'లే+ము' అని యుండ 61 చే లే యనుదానికి హ్రస్వమును ముపర్ణమునకు మామిడియుఁ గా 'లెమ్ము' అను రూపమగు. ఇట్లే మధ్యమ బహువచనము డుజ్జు పరమగునపుడు నిత్య ముగ నీవిధిచే నంతిమవర్ణలోపమును 61 చే హ్రస్వమును గా 'లె+ఁడు' అని యుండ సంధి 21 చే జిత్తు బిందుపూర్వం బగునను విధిచేనైన బిందువు పూర్ణమై నిలువ 'లెండు' అను రూపమగును. లేచునకు ముజ్జు పరమగునపు డనుటంజేసి జీత్తు పరమగు నపుడు చువర్ణలోపము గాదనియుం దాన లజీ మొదలగు జీత్తులు పరములగునపుడు లేవఁడు మొదలగు 88 చే నైన వకారముతోడి రూపములే యమరుననియుం నెంచు నది. 'పిలుచు నిలుచు తలఁచు' అను రీతి నొప్పు చువర్ణాంతములే యీ సూత్ర మునకు విషయములనియు నా చువర్ణములు సిద్ధబిందుపూర్వకములైనను నీవిధి వర్తించుననియుం నీక్రిందఁ జూపఁబడిన ధాతుత్రయమునుబట్టి తెల్లము. కొందఱు తలఁగు ధాతువునుండి తలఁడను రూపము నుద్ఘాటింపవలెనుగాన నీవిధి చువర్ణాంతము లందే గాక మఱికొన్నిటియందును గవిప్రయోగానుసారముగ వర్తించునని యంద్రు. (చూ. సంధి 13 వ్యాఖ్య.)

## లాఁతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి. ౧౦౨.

కావుతను - కాతను. అగుట - కావుట. అగుదును - కావుదును. కానను - కావునను. అనుడును - అనవుడును - నావుడును. ఇత్యాదు లెఱుంగునది.

టీ. ముజ్జీత్తులు పరములగునపుడేగాక వానికంటె నితరములు గొన్ని పరములగునపుడును 'కా' మొదలగు నాదేశము లగు మొదలగువానికిఁ బ్రయోగములందుఁ గన్పట్టుచున్నవని సూత్రార్థము. ఆదిశబ్దముచేఁ బూర్వోక్తప్రకార మాయాధాతువుల కాయాయాదేశములేగాక వానికిఁ గొన్నిక్రొత్తగఁ జేరినవర్ణములతోడి యాదేశములును గలిగెడినని గ్రహించునది. అగుధాతువునకు 96 చే ముత్తు పరమగునపుడు కాదేశము శాసింపఁబడినది కాని 26 చేనగు తవర్ణకము పరమగునపుడు వువర్ణపరకంబగు 'కావు' అనునాదేశమీవిధిచేఁ బ్రయోగదృష్ట మగుట సాధువగుచున్నదని గ్రహించునది. పక్షమునఁ గాదేశంబైన తవర్ణకముతోడ కాతననురూప మేర్పడుచున్నది. కావుత నను నుదాహరణమున నగుధాతువునందలి గకారమునకు వకారముగాఁ బిదప ధాత్వాదివర్ణమున కకారమునకు మాత్రమే కాదేశ మయ్యెననియుఁ గాత నను నుదాహరణమున ధాతువున కంతకుఁ గాదేశమయ్యెననియు ఫలితము సెంచునది. అగుధాతువునకు భావార్థకటవర్ణకము పరమగునపుడును నీవిధిచేఁ గాదేశముగాఁ గావుట యనురూప మేర్పడెడి. ఇట్లే యానంతర్యార్థకడువర్ణకము పరముగా నగుధాతువునందలి గకారమునకు వకారాదేశంబైన పిదప ధాత్వాదినున్న అకారమునకే కాదేశమైన కావుదుననియు లేక కావాదేశంబైనఁ గావుదుననియు రూపంబు గలుగును. అగుధాతువునకు 41 చే నైన నువర్ణకము పరముగా నీవిధిచేఁ గావాదేశంబైనఁ గావుననుననియుఁ గానాదేశంబైన కానననియు రూపము లేర్పడును. ఇట్లే యనుధాతువున కానంతర్యార్థకడువర్ణకము పరముగా 'అనవు' అనునదాదేశంబైన 'ననవుడు' ననియు 'నావు' అనునదాదేశంబైన నావుడుననియు నీరెండును నీవిధిచేఁ గాకున్న ననుడు ననియు రూపములు గలుగును. ఇట్లు ప్రయోగదృష్టములు సాధ్యములు.

## అచ్చికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగానగు. ౧౦౩.

అయిదు - ఐదు. అయిరేని - ఐరేని. అవుడు - ఔడు. గవుసెన - గౌసెన.

టీ. 'వాయిరవుర్వ్యత్రతమా' అనునది మూలము. ఆచ్ఛికశబ్దములందలి 'అయి' అవు' అను భాగములకుఁ గ్రమముగ 'అయి' అనుదానికి 'ఐ' అనునదియు 'అవు' అనుదానికి 'ఔ' అనునదియు నాదేశములుగ నగునని సూత్రార్థము. సామాన్యముగ నయియవులకనుటంజేసి శబ్దసహజంబగునట్టియుఁ వ్యాకృతిప్రక్రియచే నేర్పడినట్టియుఁ నయియవులకు 'ఐ-ఔ' అనునవి గావచ్చునని గ్రహించునది. అయిదనుదానియందలి శబ్దసహజమగు 'అయి' అను భాగమున కీవిధిచే 'ఐ' కాఁగా నైదనురూపము గలుగును. ఇట్లే యగుధాతువు తుదివర్ణమునకు గకారమునకు భూతంబున నైన యిగాగమము పరమగునపుడు 99 చే నైన యకారమునం జేసి యేర్పడిన 'అయి' అను భాగమున కైకార మీవిధిచేఁ గా, నైరనియు దాని కేని గూర్చినరూప మైరేని యనియు నెఱుంగఁదగును. పెదవియను నర్థముగల అవుడను శబ్ద రూపమునందలి 'అవు' అనుదాని కౌకారాదేశము గా నౌడనురూప మగును. ఇట్లే గవుసెనశబ్దమున సహజమై తోఁచు నవున కౌకారంబైన గౌసెనరూపము గలుగును. గౌసెన యన నింటికప్పని యర్థము. ఇట్లే యాచ్ఛికశబ్దములందు సహజముగఁ గాని వ్యాకృతిప్రక్రియచేఁగాని తోఁచు నయియవుల కైయాలను బహుళముగఁ గూర్పవలయును. 'అవు, అయి, అను' నుత్వేత్వములతోడి భాగములు తోఁచునపుడేగాని వేఱొకరీతి నగపడునపు డీయాదేశములు గావని యెంచునది. అదియుఁ బ్రయోగానుసారము శ్రుతిశ్రావ్యతననుసరించి చేయవలయునేగాని తప్పక గావలెననునియమము లేదని యెఱింగింప బహుళగ్రహణముం జేసెనని గ్రహించునది. వ్యాకృతిప్రక్రియను 'అయి-అవు' అనుభాగములే తొలుతటివని యాయాధాతువులంజేసి తోఁచెడిఁగాన నయియవులకే ఐఔలు విధింపఁబడినవి. 'ఏచో యవాయావః' అనుసంస్కృతవ్యాకృతిసూత్రము ననుసరించి ఐఔల కయియవులగుట తోఁచెడి. కాని యుచ్చారణమున నయియవులు గలిసిపోయి యైయౌలుగా మారినవనుట సహజముగాన నిమ్మార్గము రమణీయమనఁదగు.

కలుగు నకర్త్రర్థంబునందు లట్టు పరంబగునపుడు కలయగు. ౧౦౪.

ప్ర. కలఁడు-కలరు-కలదు-కలవు మ. కలవు-కలరు. ఉ. కలను-కలము.

టీ. 'ఉన్నవాఁడు-ఉన్నది' అనునర్థమున లట్టు పరమగుచుండఁ గలుగుధాతువునకు 'కల' అనునది యాదేశముగ నిత్యముగ నగునని సూత్రార్థము. డుజ్జు పరముగాఁ గలాదేశంబైనఁ గలఁడనియుఁ రువర్ణకము పరముగాఁ గలాదేశంబైనఁ గలరనియు నిట్లే యమహదర్థమున డుజ్జున. కాదేశంబైన దువర్ణము పరముగాఁ గలదనియుఁ నీరీతినే

రువర్ణకమున కమహదర్థమున నాదేశంబైనవువర్ణము పరముగాఁ గలవనియుం నిట్లే లణ్ధ్యమైకవచనమున వువర్ణకము పరముగాఁ గలాదేశంబైనఁ గలవనియు లణ్ధ్యమరువర్ణకము పరముగాఁ గలాదేశంబైనఁ గలరనియు నుత్తమైకవచనబహువచనములు పరములుగాఁ గలాదేశంబైనఁ గ్రమముగఁ గలను - గలమనియు రూపములగును. ప్రథమైకవచనబహువచనములందే యమహత్త్వమున దువులమూలంబున భేదము గోచరించెడిఁగాన నంతవఱకె యుదాహృతము. లట్టు పరంబగునపుడనుటంజేసి తక్కినచోటులం దెచ్చుటను గలాదేశము గాదనియుం నిత్యవిధింజేసి, లట్టు పరంబగునపుడు మాత్రము కలుగుచున్నాఁ డిత్యాదులు గలుగవనియుం నెఱుంగునది. అస్త్యర్థమున ననుటంజేసి యుండుట యనునర్థమునకంటె నితరములగు 'పొందు-పుట్టు' మొదలగునర్థములు గల కలుగుధాతువున కీవిధిచేఁ గలాదేశము గాదని గ్రహించునది.

త్రర్థంబునం గలాదేశంబు విభాషనగు. ౧౦౫.

ఎడియెడులకు లోపం బిట నిత్యంబు-కలవాఁడు-కలుగువాఁడు.

టీ. 44 చేఁ దృవర్ణకార్థకమున నెడియెడువన్నియలు ధాతువుల కగునని చెప్పఁబడినది. 45 చే వానికి లోపము బహుళముగ విధింపఁబడినది. త్రర్థమనఁగఁ దృవర్ణకార్థమున నని యర్థము. ('తృ+అర్థ=త్రర్థ') సంస్కృతమునందగు 'తృచ్' అను ప్రత్యయమునర్థమునఁ దెనుఁగుననగు నెడియెడు వర్ణకములు పరములుగాఁ గలుగు ధాతువునకుఁ గలాదేశము వికల్పముగ నగునని సూత్రార్థము. కలాదేశ మీవిధిచే నగు పక్షమున నెడియెడు వర్ణకములు నిల్చియున్నచో 'కలెడి - కలెడు'అను నపరూపములు సంభవించునుగాన వానిని వారింపఁ గలాదేశంబైనపక్షమున 44 చే నైన యెడియెడులు నిత్యముగ లోపించునని యెడియెడులను వివరణముచే శాసించెననియుం దానఁ గలాదేశమగుపక్షమున సమాసము 9 చే నైన తచ్ఛబ్దముతోడనే గలవాఁడు కలదనురీతినే రూపములగుననియుంఁ దచ్ఛబ్దముగూడఁ గాకున్న నిత్యముగఁ గలయనియే విశేషణరూపమమరుననియుం నెఱుంగవలెను. అస్త్యర్థకమగుకలుగుధాతువే యీవిధికి విషయము. కలుగు ధాతువునకు 44 చే నైన యెడియెడులు పరములుగా నీవిధిచేఁ గలాదేశమును 45 నందలి బహుళగ్రహణమునంజేసి కలాదేశంబుమీఁది యెడియెడులకు నిత్యముగ లోపమును సమాసము 9 చే తచ్ఛబ్దమనుప్రయుక్తమును గాఁ 'గలవాఁ'డనియుఁ గలాదేశము గానిపక్షమునఁ 'గలుగువాఁడు గలిగెడివాఁడు గలిగెడువాఁడు' అనియును, రూపములు గలుగునని గ్రహించునది. కలాదేశముమీఁది తచ్ఛబ్దవకారమునకు 117 చే లోపం బయ్యేనేని 'కలాఁడు కలా'రనురూపములగుటను గమనించికొనునది.

అస్త్యర్థంబునకు లజీ మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు. ౧౦౬.

ప్ర. లేఁడు - లేరు - లేదు - లేవు. మ. లేవు - లేరు. ఉ. లేను - లేము. లేమి - లేక - లేని - లేవడి.

టీ. అస్త్యర్థకమగు కలుగుధాతువునకు లజీయు, 37 చే వ్యతిరేకభావమున నగు మిజీయు, 39 చే వ్యతిరేకక్త్వార్థమున నగు కజీయు 47 చే వ్యతిరేకతృవర్ణకార్థమునందగు నిజీయుఁ గృదంతము 22 చే నగు వడీయుఁ బరములుగా 'లే' అనునది యాదేశమగునని సూత్రార్థము. అస్త్యర్థకమగు కలుగున కనుటంజేసి 'పొందు-పుట్టు' అనునర్థములు గలదాని కీయాదేశము గలుగదనియు దాన యథార్థ్యముగ వ్యాకృతి ప్రక్రియ ననుసరించి రూపములు గలుగనగుననియు గ్రహించునది. కలుగుధాతువునకస్త్యర్థమునకు లజీ ప్రథమపురుషైకవచనము డుజ్లు పరముగా నీవిధిచే 'లే' అనునదాదేశముగా లేఁడనియు దానిబహువచనము రువర్ణకము పరముగా లేయాదేశమైన లేరనియు నమహాదర్థమున లజీని దువులు పరములుగా లేయాదేశమైన లేదు లేవనియు మధ్యమమున వురులు పరములుగా లేయాదేశమైన లేవు లేరనియు నుత్తమపురుషమున నైకవచనబహువచనప్రత్యయములు నుములు పరములుగా లేయాదేశమైన లేను లేమనియు రూపములు సంభవించును. ఈగతినే మివర్ణకము పరమగునపుడు లేయైన లేమి యనియు కజీ పరమైనపుడు లేయైన లేక యనియు నిజీపరముగా లేయైన లేని యనియు వడి పరముగాఁ గలుగునకు లే యాదేశ మీవిధిచేఁ గా లేవడి యనియు రూపము లేర్పడును.

వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాషనగు. ౧౦౭.

ప్ర. ఒల్లఁడు - ఒల్లరు - ఒల్లదు - ఒల్లవు. మ. ఒల్లవు - ఒల్లరు. ఉ. ఒల్లను - ఒల్లము. ఒల్లమి - ఒల్లక - ఒల్లని. పక్షంబున వలవఁడిత్యాది. ఒల్లమి కొల్లఁబాటని ప్రయోగంబులం గానంబడియెడి.

టీ. వ్యతిరేకమున వలచుధాతువునకు 'ఒల్ల' అనునది వికల్పముగ నాదేశమగునని సూత్రార్థము. 'లజీ-మి-క-ని' అనునవి వ్యతిరేకార్థకములని ముందె యుక్తము. లజీని ప్రథమపురుషమున డు-రులును నమహాదర్థమున దు-వులును బరములుగా నీవిధిచే నొల్లయైన నొల్లఁ డొల్లరనియు దువులు పరములుగా నొల్లయైన నొల్లదొల్లవనియు

నిట్లే మధ్యమమున పురుషు పరములుగా నొల్లయైన నొల్లవొల్లరనియు నుత్తమమున నుములు పరములుగా నొల్లనొల్లమనియు మిపరముగా నొల్లయైన నొల్లమి యనియుం కజి పరముగా నొల్లయైన నొల్లకయనియు నిజి పరముగా నొల్లయైన నొల్లని యనియుం రూపములు సిద్ధించును. ఒల్లాదేశము గానిపక్షమున వ్యతిరేకమున 88 చే వలచుధాతువునందలి సిద్ధచకారమునకు వకారమును 20 చే చువర్ణమునుత్వమున కత్వమును నంతటఁ గూర్చుకొనుచు 'వలవఁడు-వలవరు; వలవదు-వలవవు; వలవవు-వలవరు; వలవను-వలవము; వలవమి-వలవక-వలవని' అని రూపములను సిద్ధింపఁజేసికొనవలెనని పక్షమున వలవఁడిత్యాది యనువివరణమున కభిప్రాయము. ఒల్లమి యనునర్థమున నొల్లమియను పదమునకు మాఱుగ నొల్లఁబాటని కవిప్రయోగములం దగపడుచున్నదనియుం దాన నొల్లమియందలి మివర్ణకమునకుఁ బాటు పరముగా వృత్తియందు లోపము గలిగెనని యంగీకరింపవలెననియు, నిది సంధి 26 లోఁ దలఁబ్రాల్వాదులఁ బఠింపఁబడుటంజేసి ద్రుతలోపముగామి నర్థబిందు సరళాదేశములతోడి రూప మమరెననియుం నొల్లమికను నీక్రిందివివరణమున కభిప్రాయము. ఇటఁ బ్రాతాదిశాస్త్రముచే నంత్యవర్ణలోపము మాత్రమే గలిగెననియు 37 చేఁ బాటుశబ్దపరుషము పరముగా నుమాగమమయ్యెననియుఁ బ్రక్రియార్థ మూహింపవలసియున్నది.

## చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారంబగు. ౧౦౮.

నిలుతురు-పిలుతురు-అడఁతురు-కడతురు-చింతురు-పెంతురు-పచింతురు-వచింతురు. చేతురు - కోతురిత్యాదు లసాధువులని యెఱుఁగునది.

టీ. 22-చే దుగాగమము విధింపఁబడినది. ఈదుగాగమము చువర్ణమున కవ్యవహితపరముగ నుండునపుడు 'చుదు' అనురెండిటికి'తు'అనునది యాదేశమగునని సూత్రార్థము. చువర్ణముతోఁ గూడిన దుగాగమదకారమునకు 'త' అనునది యాదేశమగు ననుటంజేసి దుగాగమదువర్ణముమీఁది యుత్వము నిల్చుననియు 'చుద్' అనుదానికి 'త్' అనునది యాదేశమగుననియు గ్రహించునది. 30 చే దుగాగమదువర్ణమున కత్వమగునపుడును నాదకారముమీఁది యకారమునకు తవర్ణ మాదేశముగామి నకారము నిల్చియే యుండునని గ్రహించునది. దీన 'త్' అనునదే యాదేశ మగునని తేలినది గాన తకారముమీఁదియకార ముచ్చారణార్థకమని యెంచఁదగును. లేదా తకార మాదేశమగునని గ్రహించి దుగ్దకారముమీఁది మిగిలిన యచ్చుతోడఁ దకారముపైనున్న యకారము నపదాదిస్వరసంధివిధిచే నిత్యముగ సంధించె ననియేని యంగీకరింపవలెను.

దుర్ధకారమునకు ముందటిచువర్ణము ధాతుసహజమును బ్రత్యయసంబంధియును గావచ్చును. మఱియు నట్టి చువర్ణము పూర్ణార్ధబిందుపూర్వకమైనను నీవిధిచే తకారము సిద్ధించెడి. నిలుచుధాతువునకు లాట్టు ప్రథమపురుషబహువచనప్రత్యయము రువర్ణకము పరముగా 22 చే దుగాగమముగలుగ 'నిలుచు+దు+రు' అని యుండ నీవిధిచే చుదులకు తకారము గాఁగ 'నిలుతురు' అనురూపము సిద్ధించును. ఇట్లే పిలుచుధాతువునందలి చుదులకు తకార మీసూత్రముచేఁ గలుగ 'పిలుచు+దు+రు = పిలుతురు' అని రూప మగును. ఈరీతినే 'అడఁచు' అనుధాతువునందలి చుదులకు తకారము గలుగ 'అడఁతురు' అనురూపమగు. ఇట ధాతుసిద్ధమగు నర్ధబిందువు తకార మీవిధిచే నగు నపుడును సంజ్ఞ 16 ననుసరించి నిల్చియే యుండునని గ్రహించునది. ఇట్లే 'కడచు+దు+రు=కడతురు' అని యగును. చించుధాతువునకు 'చించు+దు+రు = చింతురు' అని రూపమగుననుట స్పష్టము. ఇట్లే పెంచుధాతువునకు 'పెంతు'రని రూపమగుటను గమనించునది. పచధాతువునకు 63 చే నించుక్కు-గా 'పచించు' అని యైనపిదప లాట్టున రువర్ణకము పరముగా 22 చే దుగాగమము గలుగ 'పచించు+దు+రు' అని యుండ నీవిధిచే తకారము చుదులకుఁ గా 'పచింతురు' అనురూపము సిద్ధించెడి. 22 చే ప్రథమపురుషబహువచనము మొదలుకొనియే దుగాగమ మగుంగాన చుదులు ప్రథమ పురుషబహువచనము మొదలుకొని యుత్తమబహువచనాంతము తోఁచుననియు, నాయైదువచనముల తకారము గల్గిన రూపములు సహజకృత్రిమచువర్ణాంతముల కమరుననియు భావము గ్రహింపనగు. ప్రథమైకవచనమున మాత్రమే తకారము గల్గిన రూపమీచువర్ణాంతములకు లాట్టున తోఁపదని ఫలితము. చుదులకే తకారము విధింపఁ బడుటంజేసి చేయు కోయు మొదలగుధాతువులు యువర్ణాంతములగుట వానికి లాట్టు రుఞ్ఞు పరమగునపుడు దుగాగమంబుగా 'యుదు' అనుభాగమే దొఱకును గాని 'చుదు' అనుభాగము దొరకమి నీసూత్రముచే తవర్ణక మట్టివానికిఁ గలుగ నవకాశము లేదు గాన వానికి 'చేయుదురు; కోయుదురు' అనియే రూపములు శాస్త్రీయము లగుంగాని 'చేతురు కోతు'రను రూపములు శాస్త్రీయములు గాఁజాలవనియు నవి వ్యావహారికము లగుట సాధువులు గావనియు చేతురు కోతు రిత్యాదు లసాధువులను నీక్రిందివివరణ మున కభిప్రాయము. కొంతమంది లక్షణకర్త లివి సాధువులనిరి. కొంతమంది కవులు వీనిని వాడిరి. (చూ. శ్రీ గి. రా. పం. బా. క) కాని యలాక్షణికములగుట నగ్రాహ్యా ములనియే సూరితలంపు. చుదులకుఁ దవర్ణము గల్గినరూపములలోఁ దవర్ణముమీఁదియు త్వము 62 చే లోపించినపక్షమునఁ జింత్రు పెంత్రు రూపములు గలుగుటను స్మరించి కొనునది. 'దా చోర్లుక్తథర్మే; బిందుపరస్య తకారో దోస్స్యాత్' అను చింతామణి సూత్రములనుండి ఫలించినయర్థ మీసూత్రరూపమును దాల్చెననుట స్పష్టము.

పడుజి కొను లొకానొకచో స్వార్థంబునం దను
ప్రయుక్తంబులగు. ౧౦౯.

చొచ్చు - చొరఁబడు. నిలుచు - నిలువఁబడు. కూడు - కూడఁబడు. పండు - పండుకొను.

టీ. 49 చేఁ బడుజి కర్మమున విధింపఁబడినది. 52 చేఁ గొను క్రియాఫలము కర్తృగామి యగుచో నగుననియుక్తము. కాఁగాఁ గర్మమున నగుపడుజియు నాత్మనేపదార్థకంబగుకొనును గర్త్రాత్మనేపదార్థములందేగాక ధాత్వర్థమాత్రమునను గాఁదగునని సూత్రాభిప్రాయము స్పష్టపడియెడి. పడుజికొనుల కీచోటుల విశేషార్థప్రకాశనశక్తి గలుగదని తాత్పర్యము. చొచ్చుధాతువున కీవిధిచేఁ బడుజియం నది పరముగా 91 చే 'చొరు' అనునది చొచ్చున కాదేశంబును 21 చే నుగాగమమును 20 చే రువర్ణము నుత్వమున కత్వంబునై 'చొరఁబడు' అనురూపము సిద్ధించెడి. దీనికి 'చొచ్చుట' అనియే యర్థముగాన నిది ధాత్వర్థమాత్రమునని యనుప్రయుక్త మయ్యెనని గ్రహింపవలెను. వాఁడు చొరఁబడెనన వాఁడు చొచ్చెనని యర్థముగాన నిటఁ గర్త్రార్థమునఁ గాక పడుజి స్వార్థమున నయ్యెననుట తెల్లము. ఇట్లే నిలుచుధాతువున కీవిధిచే స్వార్థమునఁ బడుజియు నది పరముగా ధాతుసహజచకారమునకు 88 చే వకారమును 21 చే నుక్కును 20 చే నత్వమును గా 'నిలువఁబడు' అనురూపమగును. దీనికి నిలుచుటయే యర్థముగాన నిట స్వార్థమునఁ బడుజి యయ్యెనని గ్రహింపవలెను. వాఁడు నిలువఁబడె ననఁగా వాఁడు నిలిచెనని యర్థముగాన నిటఁ బడుజి ధాత్వర్థమాత్రమున నయ్యెననుట తెల్లము. ఇట్లే కూడుధాతువునకు స్వార్థమునఁ బడుజి గాఁ బైరూప మేర్పడెననియుఁ గూడఁబడనఁగాఁ గూడుట యర్థముగానఁ బడుజి స్వార్థమునం దగెనని యెఱుంగునది. ఈగతినే పండుధాతువునకు 'కొను' అనున దీవిధిచే స్వార్థమునఁగాఁ బండుకొనునురూపము గలిగెననియు దీనికిఁ బండుట యర్థముగాన నిది ధాత్వర్థమునందె తగెననియు గ్రహించునది. (పండుట శయనించుట) పండుకొననునపుడు గల కొనను దీవిధిచే స్వార్థమున నను ప్రయుక్తముగాన ధాతువుగాదనియుం దాన 53 చే నిగాగమము గాదనియేని లేక 53 నందలి బహుళగ్రహణమునంజేసి యాత్మనేపదార్థకము పరమగునపుడేగాని స్వార్థమునఁ గాదనియేని గ్రహించి పండికొనునురూపము గాకుండ వారించికొనునది.

తెంచుధాతువగ్వాదుల కనుప్రయుక్తంబగు నగుచో నుత్వంబుపయిని దానితకారంబు దకారంబగు. ౧౧౦.

అగుదెంచు - నెగయుదెంచు - పోవుదెంచు. అగు - నెగయు-

పోవు - చొచ్చు - పుచ్చు - తోఁచు - నడచు - పఱచు - మొలచు - వీచు - ఇత్యాదులు.

టీ. అగు మొదలగుధాతువులకు స్వార్థమున 'తెంచు' అనుధాతువుతుదిని జేరు ననియుం నుదంతములగు నాయగుమొదలగువాని యంత్యుకంటెఁ బరమగు తెంచుధాతువు నాదియున్న తకారము దకారమగుననియు సూత్రార్థము. అగు దీని కీవిధిచేఁ దెంచుధాతు వనుప్రయుక్తమై తకారము దకారముగా 'నగుదెం'చనురూపము గలుగును. ఇట్లే నెగయుపోవులకు తెంచనుప్రయుక్త మగునపుడు రూపము లూహ్యములు. చొచ్చు మొదలగుచువర్ణముతుదిని గలధాతువుల చువర్ణము 112 చే లోపించుటను గమనించుచు వానికి రూపము లూహ్యములు. స్వార్థమున నని పూర్వసూత్రమునుండి యనువృత్తం బగును. చొత్తెంచు మొదలగురూపముల ప్రక్రియ 112 టీకలో నరయునది.

## అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది యనుప్రయుక్తంబగు నగుచో గువర్ణంబు విభాషను లోపించు. ౧౧౧.

అరుదెంచు - అరుగుదెంచు. ఏతెంచు - ఏగుదెంచు - చనుదెంచు.

టీ. అభ్యాగతి యన నెదురుగా వచ్చుటయని యర్థము. అభిముఖాగమనమని భావము. ఎదురుగా వచ్చుట, లేక రాక యనునర్థమున 'తెంచు' అనుధాతువు 'అరుగు' మొదలగువాని తుదిని జేర్పఁబడుననియుం నట్లు చేర్పఁబడునపుడు ధాతువు తుదివర్ణము వికల్పముగ లోపించుననియుం సూత్రార్థము. అరుగుధాతువున కీవిధిచే తెంచనుప్రయుక్తముగాఁ బూర్వవిధింజేసి తకారము దకారముగా నీవిధిచే గువ ర్ణము లోపింప 'నరుదెం'చని యగును. గువర్ణలోపము గానిపక్షమున 110 చే తకారము దకారమైన 'నరుగుదెం'చని యగును. ఇట్లే యేగుధాతువుమీఁద తెంచనుప్రయుక్తముగా, గువర్ణలోపంబైన నుత్వంబుమీఁదిది గామి తకారమునకు దకారము గాదుగాన 'నేతెం'చ నియు గువర్ణలోపము గానిపక్షమున తకారమునకు దకారంబై 'యేగుదెం'చనియురూపము లగును. ఏగుదెంచన వచ్చుటయని యర్థము. ఈ తెంచుధాతు వభ్యాగతినేగాక పంపుట వెళ్లుటనునర్థములను ననుప్రయుక్తమగునటుల భారతప్రయోగాదులనుండి తెలియనయ్యెడి. పుత్తెంచెను=పంపెను. చనుదెంచెను=ఏగెను. మఱియుఁ దొల్లి క్త్వార్థకము ముందిడికొని యిట్టిరూపములు ప్రయుక్తములగుటయుఁ గవిప్రయోగదృష్టంబు. (అడిగి పుత్తేఁడు; చెప్పి పుత్తెంచె) (చూ. బాలకవిశరణ్యము. నీలిచంద్రికపీఠిక. శ్రీ. గి. రా. పం.) ఇందుఁ జేరునవి గువర్ణాంతక్రియలె యనుట తెల్లము. 'పంపుట- వెళ్లుట' అనునర్థములం దిట్టివి ప్రయుక్తములైనను పంపఁబడిన లేక వెడలినవ్యక్తిదౌగమనము వాని సందర్శింపవలసిన

వ్యక్తికభ్యాగతియే యగుంగానఁ దత్క్రియ లభ్యాగత్యర్థకములే తుదికగుచున్నవని తోఁచెడి.

### అయ్యాది పరంబగునపుడు చువర్ణంబు లోపించు. ౧౧౨.

చొచ్చు-చొత్తెంచు. పుచ్చు-పుత్తెంచు. తోఁచు-తోఁతెంచు.

టీ. అనుప్రయుక్తమగు తెంచుధాతువనఁగా స్వార్థమున 110 చే విధింపఁబడినదియు 111 చే నాగమనార్థమున విధింపఁబడినదియుం బరమగుచుండ ధాతువుతుదినున్న చువర్ణము నిత్యముగ లోపించునని సూత్రార్థము. చువర్ణమను సామాన్యోక్తిం జేసి సద్విత్వమగునదియు లోపించునని చొచ్చు మొదలగు నుదాహృతులంబట్టి గ్రహింపఁదగును. చొచ్చుధాతువునకు 111 చే నైన తెంచుధాతువు పరముగా నీవిధిచే 'చ్చు' అనునది లోపింప 'చొ+తెంచు' అని యుండ సంధి 39 చేఁ గాని ప్రకీర్ణము 6 చేఁ గాని తకారమునకు నిత్యముగ ద్విత్వము గలుగఁ జొత్తెంచనురూపము సిద్ధించును. ఈ రీతినే పుచ్చుధాతువునందలి 'చ్చు' అనున దీవిధిచే లోపించి తెంచుధాతువు తకారము ద్విత్వముగా 'పుత్తెంచు' అనురూపము గలుగును. ఇట్లే తోఁచుధాతువు తుదిచువర్ణ మీ విధిచే లోపింప నుత్వమిూఁదిది గామిఁ దెంచుధాతువు తకారమునకు దకారము గాకున్న 'తోతెంచు' అనురూప మగును. లేదా ప్రకీర్ణము 8 చే నొకచకారమును లోపింపఁ జేయుచుఁ బ్రక్రియను నడుపుకొననగును. పిదప వీనిపై నాయూలకారములం దాయారూపము లాయావిధుల ననుసరించి సాధ్యములు. చువర్ణమనుటం జేసి యితరములు లోపింపవని గ్రహించునది. నిత్యవిధానమునం జేసి 'పుచ్చుదెంచు; చొచ్చుదెంచు; తోఁచుదెంచు' అని రూపములు గలుగవని యెఱుంగునది. నడచను మొదలగుధాతువులకు నత్తెంచను మున్నగురూపములు గలుగకుండ నడ్డుటకై సంధి 39 కంటె భిన్నముగ నీసూత్రము ప్రారబ్ధమనియేని లేక యది సుబంతపదసంధికి సంబంధించినది యగుటఁ గ్రియారూపముల విషయమున నద్దానిం బ్రమాణముగఁ గొన నవకాశము లేమి నిది యారబ్ధమనియేని ఫలమును గ్రహించునది.

### అద్దానికి ముత్తు పరంబగునపుడు తే తేరులగు. ౧౧౩.

అగుదేఁడు - అగుదేరఁడు - అగుదెమ్ము - అగుదేరుము.

టీ. స్వార్థమునను నభ్యాగతిని ననుప్రయుక్తమగు తెంచుధాతువునకు ముజ్జేత్తులు పరములుగా 'తే; తేరు;' అనురెండును బర్యాయముగ నాదేశములు నిత్యముగ నగునని సూత్రార్థము. 110 చే నగుధాతువునకుఁ జేరిన తెంచుధాతువుతోడి యగుదెంచనుదానికి

లజేని ప్రథమపురుషైకవచనము డుజ్జు పరముగా లజే జేత్తుగాన నీవిధిచేఁ దేయాఁదేశంబైన నగుదేఁడనియుఁ దేరాదేశంబైన నగుదేరఁడనియు రూపములు గలుగును. ఇట్లే యమహాదర్థమున దుపులైన నగుదేదునగుదేరదనురూపము లగుననవలెను. ఈరీతినే యనుప్రయుక్తమగు తెంచుధాతువుతోడి యగుదెంచను దానికి లూట్టున మధ్యమముపర్ణకము పరముగాఁ దేయాదేశ మీవిధిచేఁగా 'అగుదే+ము' అని యుండుననియుఁ బిదప 61 చే నాదేశంబైన 'తే' అనుదానికి హ్రస్వము ముపర్ణకమునకు మాముడియుఁగా నగుదెమ్మను రూపము సిద్ధించుననియు నెంచునది. ఇట 'తేరు' అను నాదేశంబైనపక్షమున నగుదేరుమని రూపంబు గలుగును. ఇట్లే మధ్యమబహువచనమున నగుదెం డగుదేరఁ డనురూపములగుటను గమనించికొనునది. ఈరీతినే జేత్తులు పరములగునపుడును దేదేరులగుటను 20 చే నుత్వమున కత్వమగుటను గమనించుచు 'నగుదేక-యగుదేరక-యగుదేమి-యగుదేరమి' మొదలగురూపముల సాధించికొనవలయును. 93 సూత్రము స్వతంత్రమగు తెచ్చుధాతువునకుఁ దేతేరులు విధించునదియు నిది యనుప్రయుక్తమగు తెంచుధాతువునకుఁ దేరులను విధించునదియుననని భేదము గమనించునది.

**భూతంబున లజేకి లిడంతంబగు నగుధాతువనుప్రయుక్తంబగు. ౧౧౪.**

వాఁడు రాఁడయ్యెను - వారు రారయిరి. అది రాదయ్యెను - అవి రావయ్యెను నీవు రావయితివి-మీరు రారయితిరి. నేను రానయితిని - మేము రామయితిమి.

టీ. భూతకాలబోధకంబగు లజే కనఁగా వ్యతిరేకార్థకప్రత్యయము లంతమందుఁ జేరిన భూతకాలబోధకసమాపక ధాతురూపములకు, లిడంతంబగుననఁగా లిట్టునందగు ప్రత్యయములతోఁగూడిన, యగుధాతువన నగుధాతురూపములు తుదిని జేరునని సూత్రార్థము. లజే ప్రథమమధ్యమోత్తమైకవచన బహువచనములకుఁ గ్రమముగ లిడంతాగు ధాతుప్రథమమధ్యమోత్తమైకవచన బహువచనము లనుప్రయుక్తములగునని గ్రహించునది. అనుప్రయుక్తమనఁగా వెన్నంటియుండుటయని ముందెయుక్తము. అగు ధాతువునకు లిట్ప్రథమైకవచనమున 'అయ్యెను'అనురూప మగుననుట 100 చేఁ దెల్లము. వ్యతిరేకమున (లజేని) వచ్చుధాతువునకుఁ బ్రథమైకవచనమున 91 చే 'రాఁడు' అను రూప మగుననుటస్పష్టము. కాఁగా రాఁడనుదాని కయ్యెననున దనుప్రయుక్త మీవిధిచేఁగా 'రాఁడయ్యెను' అనురూపము సిద్ధించును. ఇట్లే 100 చే నైన యగుధాతులిట్ప్రథమబహువచనము 91 చే నగు 'రారు' అను లజే ప్రథమబహువచనమునకుఁ జేర 'రారయిరి'అను రూపము గలుగును. ఇట్లే యమహత్త్వమున లజే నేర్పడినరాదను ప్రథమైకవచనమున

కయ్యెనను నగుధాతు ప్రథమైకవచనము చేర 'రాదయ్యెను' అనురూప మేర్పడెడి. ఇట్లే తక్కినపురుషములందు రూపము లూహ్యములు.

'అప్పులు కింకను నమ్మ నేరనయ్యెద; ఓలి మఱి వృష్టి లేదవు;' అను మున్నగు భారత ప్రయోగముల ననుసరించి లజిని లిడంతంబగు నగుధాతు వేగాక లాడంతంబగు నగుధాతువును గావచ్చునని యంగీకరింపక తీరదుగాన లిడంతంబనుట చింత్యము. లిడంతము సాధారణముగఁ గానవచ్చుటం జేసి యిట్లు సూత్రించె ననవలయును. 'నేరను+అయ్యెదను = నేరనయ్యెదను. లేదు+అగును = అవును=లేదవును' యతిప్రాసములందలి ప్రయోగము లగుట నివి దిద్దరానివి. (చూ. బాలక. శరణ్యము. శ్రీ. గి. రా. పం.)

## నుజ్యంతంబగు నగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తంబగు నుజికి విభాషనగు. ౧౧౫.

కాను-అనునది నుజ్యంతం బగునగుధాతువురూపంబు.

టీ. క్రియావిశేషణములతుదిని నుజిప్రత్యయముతోడి యగుధాతురూపము 'కాను' అనునది నిత్యముగను; నుజ్యంతధాతురూపములమీఁద వికల్పముగను; జేరునని సూత్రార్థము. అగుధాతువునకు 40 చే నుజియు జిత్తగు నుజి పరముగా 96 చే 'కా' అనునాదేశమును గా 'కాను' అని రూపమగుంగాన 'కాను' అనునది నుజ్యంతమగు నగుధాతురూపమగునని 'కాను' అను నీక్రిందివివరణమున కభిప్రాయము. మీఁదిసూత్రమున దీనియుదాహరణములం గాంచునది. క్రియావిశేషణము లనఁగాఁ గ్రియతో నన్వయించునట్టి విశేషణములని యర్థముగాని క్రియలనుండి గల్గిన వచ్చినమొదలగునట్టివి గావని గ్రహించునది.

## దానికి హ్రస్వంబు విభాషనగు. ౧౧౬.

లెస్సగాను-లెస్సగను - న్యాయ్యముగాను - న్యాయ్యముగను-ఇట సరళంబు నిత్యంబు. చూడఁగాను - చూడఁగను - చూడను-ఇట స్వత్వంబు లేదు.

టీ. పూర్వసూత్రముచేఁ గ్రియావిశేషణములమీఁదను నుజ్యంతములమీఁదను జేరిన 'కాను' అనుదానికి హ్రస్వము వికల్పముగ నగునని సూత్రార్థము. 'లెస్స' అను క్రియతో నన్వయించువిశేషణము మీఁదఁ బూర్వసూత్రముచే 'కాను' అనునదను ప్రయుక్తముగా, సంధి 13 నందలి బహుళగ్రహణమునంజేసి నిత్యముగ 'కాను' అను దానియందలి కకారమునకు గకారము గా 'లెస్సగా'ననియుం నీవిధిచే హ్రస్వముగా

'లెస్సగ' ననియురూపములగును. సరళాదేశము నిత్యముగ నైనపిదపనే హ్రస్వము గలుగు నని కాని హ్రస్వము గల్గినపిదప నిత్యముగ సరళాదేశమగుననిగాని గ్రహింపఁదగును. సంధి 13 చే సరళము బహుళపదముళక్తిం జేసి నిత్యముగ నగుననియుట సరళము నిత్యమను వివరణమున కర్థము. చూచుధాతువునకు 40 చే నుజియు 91 చే 'చూడు' అనునదియు 20 చే నుత్వమున కత్వమునుగాఁ జూడనను నుజ్యంతరూప మేర్పడును పూర్వసూత్రము చే 'కాను' అనున దనుప్రయుక్తము వికల్పముగఁ గా సరళాదేశము నర్ధబిందువునుగాఁ జూడఁగా ననియుఁ నీవిధిచే హ్రస్వముగాఁ జూడఁగననియు రూపములు సిద్ధించును. కా ననునది గానిపక్షమునఁ జూడననియే యుండును. 'చూడను' అను నుజ్యంతమునందలి 'ను' అనుద్రుతమునకంటెఁ బరమైన; యనుప్రయుక్తమైన 'కాను' అను దాని యాదిమ కవర్ణమునకు, సరళముగా 17 చే బిందుసంశ్లేషస్వత్వములు ప్రాప్తించుచుండ నిట స్వత్వముమాత్రమందలి విభాషాపదమునకు వ్యవస్థ గల్పించుటం జేసి గాదని యిట స్వత్వములేదను నీక్రిందివివరణమున కభిప్రాయము. దీనఁజూడనుగాననురూపము గాదని భావము తేలెడి. స్వత్వమువలెనే యప్రసిద్ధమగుట సంశ్లేషమును నిట రాదనుట లెస్స. 'క్రియావిధేయవిశేషణములమీఁది యగుధాతువున కన్నంతమునకు లోపంబు విభాష నగు' అని సూత్రించి త్రిలింగలక్షణశేషకర్త యీసందర్భమును బూరించుట నరయుం నది. గకారమునకు సరళసంజ్ఞయుఁ గలుగుటం జేసి సామాన్యోక్తిని సరళమనెననితోఁచెడి. సరళాదేశము ద్రుతముమీఁదిదగుట విశేషించి కకారమునకు గకారమగుననుట యుచిత మని తోఁచెడి.

## ఉన్నకలనవర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాషనగు. ౧౧౭.

బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు. వండుచున్నవాఁడు - వండుచున్నాఁడు - వండుచున్నవారు - వండుచున్నారు. వండుచున్న వాఁడవు - వండుచున్నాఁడవు. వండుచున్నవారరు - వండుచున్నారరు. వండుచున్నవాఁడను - వండుచున్నాఁడను. వండుచున్నవారము-వండు చున్నారము-ఇట్లు వండఁగలవాఁడు - వండఁగలాఁడు - వండినవాఁడు- వండినాఁ డిత్యాదు లెఱుంగునది.

టీ. సమాసము 9చేఁ గ్రియావిశేషణములమీఁదఁ దచ్ఛబ మగుటనుస్మరించుకొను నది. క్రియ 46 చే నున్న కలనవర్ణకము లగుటను గమనించుకొనునది. కాఁగా నున్న

కలనవర్ణకములను జెందిన క్రియలమీఁది సమాసము 9 చే నైన తచ్ఛబ్దమునకు సంబంధించిన వకారమునకు లోపము వికల్పముగ నగునని సూత్రార్థము. 'వాఁడు-వారు' అనునవగునపుడే వకారము లభించెడిఁగాన నీవకారలోపము మహద్వాచకతచ్ఛబ్దాంతములగుచున్న కలనవర్ణకములకు సంబంధించిన దగుట స్పష్టము 'వాఁడు-వారు' అనువానిలో వకారహల్మాత్రము లోపింప 'ఆ' అనునచ్చు శేషించుననియు దాని కత్తునకు సంధి బహుళమను సూత్రమునందలి బహుళగ్రహణమునంజేసి పూర్వమునసుండునకారముతో నిత్యముగ నిట సంధి యగుననియు బాహుళకంబుచే నను నీక్రింది వివరణమున కభిప్రాయము. వండుధాతువునకు 46 చే నున్న వర్ణకమును 14 చే చువర్ణమును గా వండుచున్న యను రూపమును దానికి సమాసము 9 చే వాఁడను ప్రయుక్తముగా వండుచున్నవాఁడను రూపమగును. ఇందు వాఁడుశబ్దము వకారమున కీసూత్రముచే లోపముగా 'వండుచున్న+ఆఁడు' అనియుండ సంధి 4 చే నిత్యముగ నత్వసంధి గలుగ వండుచున్నాఁడనియు వకారమునకు లోపము గలుగనిపక్షమున వండుచున్నవాఁడనియు రూపములు సిద్ధించును. ఇట్లే తచ్ఛబ్దము వకారము లోపించినపక్షమున శేషించిన ఆకారముతోఁడనున్న కలనవర్ణముల తుదియకారములు సంధింప రూపములు దీర్ఘాకారముతోఁడ నగుటను గమనించునది. యుష్మదస్మద్విశేషణములకు కారకము 33 చే నైన 'వు-ను-రు-ము' అనునవి పరముగా 34 చే నైన యత్వముంజేసి 'వండుచున్నాఁడవు' అను మొదలగు రూపములు గలిగెనని స్మరించుకొనునది. 'వండినవాఁడను, వండినవారము' అను మొదలగు వానివకారమే యీవిధింజేసి లోపించుటంజేసియు 'డ-ర' అనువానిలోపమునకు శాస్త్రము లేమింజేసియుం 'వండినాను-వండినాము' అను మొదలగురూపము లలాక్షణికములని యెంచునది. 14-15 విధులంజేసి 'వండుచున్నాను-వండుచున్నాము వండుచున్నారు' అను మొదలగునవి వర్తమానమునఁగలుగుటను స్మరించికొనునది.

**ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు. ౧౧౮**

కూరుచుండు-నిలుచుండు-పరుండు-పన్నుండు-ఆఁకొను-ఈకొను-ఈయకొను-ఇయ్యకొను-గక్కొను-త్రెక్కొను-మేకొను-మయికొను-మేలుకొను-మేలుకను-మేలుకాంచు-అలవడు-ఏరుపడు-చొప్పడు-వెలువడు-తలపోయు-వాసపోయు-ఆపోవు-కొంపోవు-కొనిపోవు-విజయంచేయు-కయివ్రాలు-తూఁపాడుచు-ఇత్యాదులు శబ్దపల్లవంబులు.

టీ. 'క్రియాః ప్రసిద్ధా బహవశ్శబ్దపల్లవసంజ్ఞికాః' అను నథర్వణకారికకు, "ధాత్వాదుల కనుప్రయుక్తంబులై విలక్షణార్థాభిధాయకంబులగు ననేకధాతువులు శబ్ద

పల్లవములనిపించికొనును'' అను కవిజనమండనవివరణమును నూఁతగాఁగొని ప్రయోగదృష్టి నీసూత్రమును సూరిరచించెను. ఒకధాతువునకు వేఱొకధాతువు గాని యొకనామవాచకమున కొకధాతువుగాని చేరుటంజేసి పూర్వపరపదములకుఁ జెందని యొకవిలక్షణమగునర్థము సంభవించుచో విలక్షణార్థముం జెప్పుటచే నేకపదముగా నేర్పడిన యాపదద్వంద్వము శబ్దపల్లవమనుసంజ్ఞ నందునని సూత్రార్థము. శబ్దపల్లవ మనఁగా శబ్దముల మేళనమునఁ గలిగినదని యర్థము. శాఖలు కాండము మొదలగువానితోడి చెట్టున కపూర్వముగఁ జిగురు గలుగుగతి ననుప్రయుక్తములగు ధాతువుల మేళనముం జేసి యేకపదత్వము భాసించుటయు నపూర్వార్థప్రకాశనము జరుగుటయుఁ గలుగుంగాన శబ్దపల్లవసంజ్ఞ సార్థకము. మేలు చేయుం లేక యిష్టము చేయు ననునర్థముగల కూరుచునుధాతువుతో నుండుధాతువు గలిసి యాసీనతయను విశేషార్థమును దెల్పుచుండుటంజేసి కూరుచుండనునది శబ్దపల్లవమయ్యెను. స్థిరముగనుండు శాశ్వతమగు ననునర్థముగల నిలుచుధాతువుతో నుండుధాతువు చేరి నిలఁబడి యుండు టనునర్థవిశేషమును ధాతుద్వయమేళనమున ముందటిదానికంటె విలక్షణమగు దానిని దెల్పుటంజేసి నిలుచుం డనునది శబ్దపల్లవ మయ్యెను. 'పడు; ఉండు' అను ధాతువుల మేళనమున శయినించను నర్థము గలిగెఁగానఁ బరుండనునది శబ్దపల్లవమయ్యెను. ఇట డకారమునకు రేఫాదేశమయ్యె. 'పన్ను-ఉండు' అను ధాతువు లేకపదముగా నేర్పడి శయనించనునర్థమును దెల్పెడిఁగానఁ బన్నుండనునది శబ్దపల్లవము. 'ఆఁకలి+కొను=ఆఁకొను; ఆకలిని బొందు' ఇటఁ గలికి లోపము. ఇచ్చు+కొను=ఈకొను; అంగీకరించు. ఇట నిచ్చున కీయనునది యాదేశము. ఈయయాదేశమైన నీయకొను. ఇయ్య యైన నియ్యకొను. 'రేకు+కొను = రెక్కొను = రక్కొను' విజృంభించు. 'రేకు' అనుధాతు వీసందర్భమున 'రెక్; అని రక్' మాఱెను. త్రెంచు+కొను=త్రెక్కొను= చంపు. ఇటఁ ద్రెంచుధాతువాద్యక్షరశేషంబై పరకకారమునకు ద్విత్వముం గూర్చె. మే+కొను = మేకొను = సమ్మతించు. మయి+కొను = మైకొను = మయికొను సమ్మతించు. మేలు+కొను = మేలుకొను = ప్రబుద్ధమగు. మేలు+కను = మేలుకను= తెలివినందు. మేలు+కాంచు = మేలుకాంచు = తెలివినందు. అలవు+పడు = అలవడు. ఇట వువర్ణలోపమును నిత్యముగ వకారము పకారమున కయ్యె. సిద్ధించు. ఏర్చు+పడు=ఏర్పడు. ఇటఁ జుకారమునకు పకార మత్వవిశిష్టమయ్యె. బయలుపడు. చొప్పు+పడు=చొప్పడు. ఇటఁ జొప్పునది యుచ్చారణమున నాద్యక్షరశేషణంబై. పరపదాదిపకారమునకు ద్విత్వముం గూర్చె. సరిపడు. వెలి+పడు=వెలువడు. ఇట లివర్ణమునిత్వమున కుత్వము పాకు వాదేశము నిత్యము. ప్రకాశితమగు. తలపు+పోయు= తలపోయు. ఇటఁ బువర్ణలోపము. చింతించు. వాయి+పోవు=వాపోవు. ఇట యివర్ణ

లోపము. పిడుప్పు. ఆదట+పోవు=ఆపోవు. ఇట దటలకు లోపము. తృప్తినందు. కొని+పోవు=కొంపోవు. ఇట నివర్ణమునకుఁ బూర్ణబిందువు మాత్రమయ్యె. తీసికొనిపోవు. విజయము+చేయు = విజయంచేయు. ఇట మువర్ణకమునకు బిందువు. వచ్చు-పోవు. కయి+వ్రాలు=కయివ్రాలు. ఒఱగు. అయికై రైయినఁ గైవ్రాలనియు నగు. తూ+పొడుచు=తూపొడుచు. ఉమియు. 'తూ' అనునది యుమియుటయందలి ధ్వనికనుకరణము. శబ్దపల్లవసంజ్ఞ కేవలాంధ్రలాక్షణికకల్పితము. వ్యాకృతిలక్షణముల ననుసరించి ప్రక్రియ చూపఁజాలమిని విలక్షణార్థప్రకాశకములగుటను నివియు వీనివంటివియు నీ సంజ్ఞకుఁ బాత్రము లగునవని యెంచునది. రెండును ధాతువు లగుటగాని మొదటిది నామవాచకము తరువాతిది ధాతువును నగుటగాని యిందుఁ జూపట్టెడిఁగాన మొదట ధాతువును బిదప నామవాచకమును, నిందుఁ గలియుటఁ గాని తన్మూలమున విలక్షణార్థాభిధాయకత్వము సిద్ధించుటగాని గలుగదని గ్రహింపవలసియున్నది. ఈనియమము ననుసరించియే 'అందిమ్ము'అను మొదలగువానికి శబ్దపల్లవసంజ్ఞ గలిగి సాధుత్వము సిద్ధించునంద్రుగాని 'అంది+ఇమ్ము' అనురీతి నుండువాని కలయికంజేసి యారూప మేర్పడినట్లును విశేషార్థస్ఫురణము గలుగలేనట్లును విశదమయ్యెడిఁ గాన భారతప్రయోగములఁ గ్వార్థేకారసంధిని నిర్మూలించుటకై యీమివను బైమార్గ మాదృతమయ్యెనని యేరికేని తోఁపకపోదు.

## చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. ౧౧౯.

ఆబుషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్. వాఁడు తేపు వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము.

టీ. భావ్యర్థకమగు లృడంతమునకుఁ జేదర్థకములగు 'ఏని-ఆ' అనువానితో సంబంధము గలిగెనేని లృడంతము లిడంతముగ మాఱునని యీసూత్రమున కభిప్రాయము. ఆబుషీశ్వరుఁడు వచ్చెనా ఫలించుఁ గార్యములను నీయుదాహరణమున నామునివాక్యప్రయోగకాలమునకు రాక, మీఁద వచ్చువాఁడగుటంజేసి వచ్చుధాతువున కిట లృడ్రూపమే (రాఁగలఁడు) యగును. కాన నాబుషీశ్వరుఁడు రాఁగలఁడా ఫలించుఁ గార్యములను వాక్యమే మొదటిదనియు నందు రాఁగలఁడను లృట్టునకు చేదర్థకమగు 'ఆ' అను దానితోడి యోగమున నీవిధిచే లిట్టుగా వచ్చెనా యను రూపము గలిగెననియు గ్రహించునది. ఇట్లే వాఁడు తేపు రాఁగలఁడేని యనువాక్యము నందలి రాఁగలఁడనుదానికేని యను చేదర్థకయోగంబున లిట్టుగా తేపు వచ్చెనేని యను రూపము గలుగును. తేపనుట భావిని లిట్టగుటను లెస్సగ సూచింపనని గ్రహించు

నది. ప్రధానసమాపకవాచ్యవ్యాపారము దృష్టికి చేదర్థయోగముగల ధాతువుచేఁ దెల్పఁబడు వ్యాపారము ముందటిదె యగుంగాన లిట్లు గలుగుట పొసఁగెనని తోఁచెడి. ఇది యేని, యా యను చేదర్థముల యోగముగల సమాపకక్రియలకు సంబంధించిన విధి యని యెఱుంగునది. (చూ. 41.) నిత్యవిధానమునంజేసి వాఁడు రాఁగలఁడేని కార్యము ఫలించుననుట పొసఁగదని సూరి యభిప్రాయపడినట్లు తోఁచెడిఁగాని వైరిలినిగూడ నుండఁదగునని తోఁచెడి.

## ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయి వచనంబు ధాతువిశేషణంబుల కగు. ౧౨౦.

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగం బుష్పకారూఢుం డయి సాకేతంబున కేతెంచె.

టీ. వాక్యమున నాత్మార్థమగు తాను శబ్దము ప్రయోగింపఁబడి యున్నపుడు కర్తృబహుత్వ మమరియున్నను నాకర్తలకుఁ జెందిన విశేషణములును క్రియలును దాను శబ్దమునే ప్రధానముగ నాశ్రయించిన లింగవచనము నందునని సూత్రాభిప్రాయము. వాక్యప్రయుక్తమైన సమాపకమున కితరపదార్థవాచకములతోఁ బాటుగఁ దాను శబ్దమును నొకకర్తయై యమరి క్రియావిభక్తిచేఁ దెలుపఁబడునపుడు విశేషణములును క్రియలును దాను శబ్దము లింగవచనములనే పొందునుగాని తక్కిన కర్తల లింగవచనములను బొందవని భావము. కారకము 19 ప్రకారము బహు విశేష్యముల కగు విశేషణములు బహుత్వాదులనే యందవలసి యుండుటంజేసి యీవిధి ప్రత్యేకించి యారంభింప నావశ్యకత గలిగెనని సంభావించునది. తాననునది వాక్యమునఁ బ్రధాన విశేష్యమును బోధించునదిగాన దానినే ప్రధానముగ నెంచి యితరము లప్రధానములుగఁ దలంచియుఁ, బ్రధానము ననుసరించియే యప్రధానముండును గానఁ బ్రధానము ననుసరించిన నప్రధానమును ననుసరించినట్లే యై యప్రధానప్రకాశనమునకు భంగము గలుగదని భావించియు నిట్టిసందర్భముల నిట్లు తద్విశేషణక్రియలకుఁ దల్లింగ వచనములనే గూర్చుట జరిగెనని చెప్పనొప్పును. నామవాచకము లేనిది తాను శబ్దము ప్రయుక్తము గాదనియుఁ బ్రధాననామముం దెలుపనే తాను శబ్దము ప్రయుక్తమగు ననియు నాంధ్రవాక్యరచనాభిజ్ఞులకుఁ దెల్లంబ. రాముఁడను మొదలగు నుదాహరణ వాక్యమున 'రాముఁడు-సీత' అనునవి రెండును నేతెంచెనను క్రియకు కర్తలుగాన వాని విశేషణంబగు 'ఆరూఢ' అను దానికిని 'ఏతెంచు' అను క్రియకును సీతానిష్ఠమగు స్త్రీలింగసంఖ్యలు గాక రామునిఁ బ్రధానకర్తను దెలుపు తాను శబ్దముయొక్క

పుంలింగవచనములే యీవిధిచే నయ్యెంగాన 'ఆరూఢుండై-ఏతెంచెను' అనురీతి నమరె నని గ్రహించునది. సీతయుం రాముఁడును సమానముగానే క్రియాన్వయము నందు చుండుటను నేతెంచుధాతువాచ్యవ్యాపారమునకుఁ గర్తలగుటను దద్విశేషణక్రియలు బహుత్వము నందఁదగును. మఱియుఁ దద్విశేషణములకు పుంస్త్రీలింగములలో నేదానిని నిల్పవలెనో యను సందియము పొడముసుగాని సీతంగూడి రాముఁడు వచ్చుట సూచిత మగుటంజేసి స్త్రీతోఁ బురుషునిఁ జెప్పునపుడు పురుషవాచకము మిగులునను (పుమాన్ స్త్రియా) పద్ధతి ననుసరించి పుంలింగమే వాని కగునని తీర్మానింపఁదగును. కాఁగా నీవిధింజేసి తాను శబ్దము ననుసరించి యేకత్వమును బుంలింగమును నిట శాసింపఁబడె నని గ్రహించునది. విశేషణమునకు లింగమగుంగాని క్రియ కెట్లు లింగమగునని శంకింప వలదు. క్రియ మహతీమహదమహత్కర్తల కనుకూలముగ నుండవలయుం గాన నిటఁ 'బుష్పకారూఢుండై రాఁగలఁడు-వచ్చుచున్నాఁడు' అను రీతి నుండునపుడు క్రియకు లింగవిధానము సార్థకమగునని గ్రహించునది. నిత్యవిధానమునంజేసి పుష్పకారూఢులై ఏతెంచిరనురీతిని వాక్యరచన యిట్టిసందర్భమునఁ జేయరాదని సూరియభిప్రాయమైనట్లు గ్రహింపఁదగు. ఇందలి యుదాహరణమునుబట్టి మహదాచక ప్రథమైకవచనాంతము తానుశబ్దము ప్రయుక్తమగునపుడే యీవిధి వర్తించునని విశదమగునుగాని సూత్రము నందలి యాత్మార్థంబను సామాన్యోక్తింజేసి యది ప్రథమ నేవచనంబైనను, మహన్మహత్య మహదావాచకములలో నేదియైనను, నీవిధి వర్తింపనగుననియే తోఁచెడికర్తృపదముగానఁ దానుశబ్దము ప్రథమావిభక్తిలో నే యిట్టిచోటులం దుండుననుట స్పష్టము. "ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాషనగు. 'విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీనిషాదియున్" మొ. అను సూత్రోదాహరణములంజేసి త్రిలింగలక్షణ సూత్రకర్త యీసందర్భమును బూరించుట నరయుంనది. 'ఆత్మార్థము = ఆత్మన్ శబ్దముయొక్క యర్థముగలది. తాను శబ్దమని యర్థము. అభిహితము = చెప్పఁబడుట. వాక్యమునఁ బ్రయుక్తమగుట యని యర్థము. తల్లింగసంఖ్యాభిధాయివచనంబు = ఆయాత్మన్ శబ్దముయొక్క లింగమును వచనమును జెప్పునట్టి వచనము. విశేషణములు సుబంతములు లేక క్రియావిశేషణములును గావచ్చును.

అగతికంబులగు భ్వాదుల కింద యోగంబు లేదు. ౧౨౧.

భూ - స్మృ - కృ - రేకృ - లోకృ - లోచ - పచి - లప-ఇత్యాదు లకు గతివిరహితంబులగుధాతువుల కీభాషం బ్రయోగంబు లేదు.

ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ - వి - ఆఙ్ - ని - అధి - అపి - అతి - సు - ఉద్ - అభి - ప్రతి - పరి - ఉప- ఊరీప్రభృతులును సాక్షాత్ప్రభృతులును గతిసంజ్ఞాకంబులు, ప్రాదులిరువదిరెండు నుపసర్గంబులు నాఁబడు. ప్రభవించు - ఆవిర్భవించు - ప్రసరించు - సంస్కరించు - భస్మీకరించు - సాక్షాత్కరించు - అతిరేకించు - ఆలోకించు - ఆలోచించు - ప్రపంచించు - ప్రలపించు - ఇత్యాదులార్యప్రయోగంబుల నెఱుంగునది.

టీ. గతిసంజ్ఞకము లగువానితోఁ గూడియుండని 'భూ' అను మొదలగు సంస్కృతధాతువుల కీతెనుఁగుభాసయందుఁ బ్రయోగము గలుగదని సూత్రార్థము. దీన గతి విరహితములగు 'భూ' అను మొదలగువానికి 63 చే నించుక్కు గలుగదనియు దాన నితరములు కార్యవిశేషములును గలుగవనియుఁ గ్రహించునది. 63 చే సామాన్యముగ సంస్కృతమున కెల్ల నించుక్కు గలిగి ప్రయోగయోగ్యత గలుగుచుండుటం జేసి యీవిధాన మావశ్యక మయ్యెనని తెలియుచున్నది. ఈక్రిందను జూపఁబడిన 'ప్ర' మొదలగు నిరువదిరెండుపసర్గములకుఁ గ్రియాయోగమున గతిసంజ్ఞయుఁ సిద్ధించునని సంస్కృతవ్యాకృతి తెల్పెడి. సంస్కృతధాతువుల కెల్లవానికిఁ గాక 'భూ' మొదలగు కొన్నిటికే యీవిధి యావశ్యకమగుటం జేసి సంస్కృతధాతువుల కెల్లవానికి ననక 'ఇత్యాదులకు' అని వివరింపవలసి వచ్చెనని గ్రహింపఁదగు. 64-72 వఱకుఁ గల సూత్రములం జేసి గతివిరహితములకుఁ బ్రయోగము తేల్లముగదా! కానఁ గొన్నింటి విషయమున మాత్రమే యీవిధానమని యెఱుంగవలెను. ప్రాదులలోఁ జేరకున్నను 'ఊరీ' అను మొదలగునవియు 'సాక్షాత్' అను మొదలగునవియు సంస్కృతవ్యాకృతి ననుసరించి గతి సంజ్ఞకము లయ్యెడుఁగాన నవ్వానితోడి భ్వాదులకుఁ బ్రయోగార్హత గలదని యూరీ ప్రభృతులును నను నీక్రిందివివరణమున కభిప్రాయము. ప్రాదు లిరువదిరెండు నుపసర్గములును, నాఁబడు ననుటం జేసి వానికి గత్యుపసర్గసంజ్ఞలు రెండును గలవని యర్థము గ్రహింపవలెను. నాఁబడు ననుపదమునకు ముందటి సముచ్చయ నువర్ణము స్థిరము పరముగ లోపించెనుగాన నద్దాని నూఁతఁగఁగొని యొక్క యుపసర్గసంజ్ఞయె ప్రాదులకుఁ గూర్చెననియు నూరీ ప్రభృతులకు గతిసంజ్ఞ కూర్చెననియుఁ గ్రహింపరాదు. అట్లైనఁ బ్రాదుల కుపసర్గసంజ్ఞయే గాని గతిసంజ్ఞ గామి నీసూత్రమును నిందలి యుదాహరణములును నసంగతము లనవలసివచ్చును. కానఁ బైరీతిని సూత్రతదుదాహరణముల సార్థకముగఁ జేయఁ బైరీతిని గత్యుపసర్గ సంజ్ఞాద్వయ సంధా

నము జేయుంటే సరసమని చెప్పఁదగును. కేవల భూధాతువునకుఁ దెలుంగునఁ బ్రయోగము లేమిని గతిసంజ్ఞకమగు 'ప్ర' అనుదానితోడి దానిని గ్రహించి యించుక్కు 63 చేఁ గూర్చ 64 చే గుణంబై ప్రభవించను రూపమేర్పడును. 'ఆవిర్' అనునది యూరీప్రభృతులలోఁ జేరినదిగాన దీనికి గతిసంజ్ఞ గలదనియు దాన నద్దానితోడి భూధాతువున కించుక్కు గలిగి యావిర్భవించను రూపం బేర్పడి ప్రయోగయోగ్యత సిద్ధించెననియుఁ దెలియునది. ఇట్లే ప్రపూర్వక సృధాతువున కించుక్కును గుణముం గూర్చఁ బ్రసరించనియు సమ్ పూర్వక కృఞ్ ధాతువునకు 'సంస్కృ' అనుదాని కించుక్కు గూర్చ గుణంబై సంస్కరించనియు రూపములు సిద్ధించును. సంస్కరించు మొదలగు వానియందు 'సమ్' అనుదానికిఁ బరముగ సకారము సంస్కృతవ్యాకృతిచే సిద్ధించునని యెఱుంగునది. 'భస్మీ' అనునది చ్విప్రత్యయాంతముగాన సంస్కృతవ్యాకృతి ననుసరించి దీనికి 'ఊర్యాదిచ్విడాచశ్చ' అని గతిసంజ్ఞ సిద్ధించెడి. కాన దీనితోడి సంస్కృతధాతువును దెనుఁగున గ్రహింపఁదగునని గ్రహించునది. ఇట్లే చ్విప్రత్యయాంతములతోడి సంస్కృతధాతువులకు 'ఏకీభూ-స్వీకృ-' అను మొదలగువాని కించుక్కు గూర్చి తెలుఁగునఁ బ్రయోగింపఁదగును. సాక్షాత్ప్రభృతులు గతిసంజ్ఞకములగుటంజేసి 'సాక్షాత్కృ' అను మొదలగువానిని గ్రహించి యించుక్కు గూర్చి ప్రయోగింపవచ్చును. ఇట్లే సాంతంబగు 'నమస్' అనుదానికి గతిసంజ్ఞ సంస్కృతవ్యాకృతిచే సాక్షాత్ప్రభృతులలోఁ జేరుటఁజేసి సిద్ధించెఁగాన నమస్కరించని రూపంబు గావచ్చును. ఇట్లు పూజ్యులగు కవీశుల ప్రయోగములను గతిగాఁ గొని వేనిని గతులతో గ్రహింపవలెనో వేనిని నగతికముల గ్రహింపవలెనో యెఱుంగవలెననియుఁ, బూజ్యప్రయోగముల గతిలేనివానిని గ్రహింపరాదనియు నిత్యాదులను తుదివివరణమున కభిప్రాయము. ఇట్లు సంస్కృతవ్యాకృతిచే గతిసంజ్ఞ సిద్ధించువానితోడ సంస్కృతధాతువులంగూర్చి యించుక్కుచేర్చి రూపములను సాధింపనగునుగాన 'తిరస్కరించు-పురస్కరించు-సత్కరించు-అలంకరించు.' మొదలగునవి సగతికము లగుచున్నవని యెఱుంగునది. 'విహోపపద భాజస్స్యు స్సాధవో భ్వాదయః క్రియాః' అను నాథర్వణము మూలము.

**వలయ్యాదిక్రియలకుం గర్తయగుభావంబునందు నుజీయగు. ౧౨౨.**

వలయ్యాదిక్రియలకుంగర్తృభూతక్రియావృత్తియగు ధాతువునకు నుజీవర్ణకంబగు. వాఁడుచూడవలయు-వారలుచూడఁగావలయు-నీవుచూడవలయు - మీరుచూడవలయు - నేనుజూడవలయు - మేము

చూడవలయు-మనము చూడవలయు. వలయును - వలదు - కూడును - కూడదు - చెల్లును - చెల్లదు - తగును - తగదు - ఇత్యాదులు వలయ్వాదులు.

సకర్మకంబునకు స్వరూపప్రేరణార్థంబులు రెండును గొనుపద్వాను బంధంబులం దొక్కొక్కటితోడ రెంటితోడం గూడుచో నగు నవియాఱుం గూడ రూపంబు లెనిమిదయ్యె; వాని సొరిది నుదాహరించెద.

కర్త్రర్థకము.

మైత్రుఁడు-వంటకమును-వండెను.

ఆత్మనేపదకర్త్రర్థకము.

మైత్రుఁడు-వంటకమును-వండుకొనియెను.

కర్మార్థకము.

మైత్రునిచేత-వంటకము-వండఁబడియెను.

ఆత్మనేపదకర్మార్థకము.

మైత్రునిచేత-వంటకము-వండుకొనఁబడియెను.

ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుఁడు-మైత్రునిచేత-వంటకమును-వండించెను.

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము.

చైత్రుఁడు-మైత్రునిచేత-వంటకమును-వండించుకొనియెను.

ప్రేరణకర్మార్థకము.

చైత్రునిచేత - మైత్రునిచేత - వంటకము-వండింపఁబడియెను.

ప్రేరణాత్మనేపదకర్మార్థకము.

చైత్రునిచేత-మైత్రునిచేత-వంటకము-వండించుకొనఁబడియెను.

టీ. వలయు మొదలగు సమాపకక్రియలకు కర్తృభూతమైన వ్యాపారమునందు వర్తించు ధాతువులకు నుజి యనునది యగునని సూత్రార్థము. అనఁగాఁ బ్రధానవలయ్వాది సమాపకక్రియలచే బోధ్యమగు వ్యాపారమునకు వేఱొకవ్యాపారమే కర్త

యగునపుడు ప్రధానవలయ్వాది సమాపకవాచ్య వ్యాపారమునకుఁ గర్తృభూతమైన వ్యాపారాంతరమును బోధించు ధాతువులకు నుజ్ ప్రత్యయమగునని భావము. 40 చేఁ దుమర్థభావలక్షణములందె నుజ్ విధింపఁబడినది. ఇటుఁ గర్తృత్వార్థమున నుజ్ శాసింపఁ బడెనని యెఱుంగవలయును. కర్తృత్వార్థమున నీసూత్రముచే నుజ్ యగుంగాన నీనుజ్ కర్తృత్వార్థమునే బోధించుననియుం నేతదంతము గర్తగ భాసిలుననియుఁ దెలియునది. కావుననే వలయ్వాది సమాపకము లెపుడు నేకవచనాంతములుగనే యుండుట పొసఁగెడినని గ్రహించునది. వాఁడు చూడవలయును:—ఇట వలయుంనను సమాపకక్రియకుఁ జూడనుననునదే కర్తగాన 'చూడు' అనుదాని కీవిధిచే నుజిగుం 20 చే డువర్ణము నుత్వమున కత్వమును గా 'చూడవలయును' అని యయ్యెను. కర్తృత్వార్థమున నిట నుజ్ యయ్యెగాన 'చూడన్' అనుదానికిఁ జూచుట యని యర్థమని గ్రహించునది. కర్తకుఁ బ్రథమార్థమగుట ప్రసిద్ధముగదా! ఇట వలయునన నావశ్యకమని యర్థముగానఁ జూచుటయే కర్తయుం వాఁడనుదానికిఁ జూచుట యను నర్థమును బోధించు 'చూడన్' అనుదానితోనే సంబంధమనియుఁ దెలియునది. ఇట్లే వారలు-మీరు-మనము-మేము మొదలగువానికి నుజ్యంతముల తోడనే యన్వయముగాని వలయ్వాదులకుఁ గర్తలు గామి నట్టియన్వయసంబంధము లేదనియు దాన వలయ్వాదు లేకవచనంబులే యగుట యవిరుద్ధ మనియుం గ్రహించునది. వలయ్వాదిసమాపకక్రియావాచ్యమగు వ్యాపారమునకు వ్యాపారాంతరమే కర్తయు నావ్యాపారమొక్కటియే యగుటంజేసి క్రియ యేకవచనాంతమె యెపుడునగుటయుఁ బొసఁగెడి. ఇట్లే 'మీరు చేయఁదగదు-మన మాడఁ జెల్లును-మేము వెళ్లవచ్చును' మొదలగు నుదాహరణములందుఁ బ్రధానక్రియావాచ్య వ్యాపారములకుఁ జేయుట యాడుట వెళ్లుట మొదలగువ్యాపారములె గర్తలు గానఁ దద్వాచకములకుఁ గర్తృత్వార్థమున నుజ్ యయ్యెనని తెలియవలయును. ఇత్యాదులనుటంజేసి యిది యాకృతిగణమని తెలియఁదగు. ఎచట సమాపకవాచ్య వ్యాపారమునకు వ్యాపారాంతరమె కర్తయగు నచట వ్యాపారాంతర బోధకక్రియకు నుజ్ యగునని ఫలితమును గ్రహించునది.

## సకర్మంబున కనుదానికి టీక.

సకర్మకమగు ధాతువునకు 'స్వార్థరూపము-ప్రేరణరూపము' అను రెండురూపములు ప్రధానముగఁ గలుగుననియు నందు స్వార్థరూపమున నొకమాఱు కొనును, నొకమాఱు పడుజేయుం, నొకమాఱు కొనుపడుజులు రెండును, గూర్ప మూఁడురూపములును, నిట్లే ప్రేరణరూపమున నొకమాఱు కొనును నొకమాఱు పడుజేయుం నొకమాఱు కొనుపడుజులు రెండును గూర్ప మూఁడురూపములును గలిగి యారై, ప్రధానములగు తొలుతటి

స్వార్థప్రేరణరూపముల రెండిటితోడఁ గూడ నెనిమిది యగునని భావము. ఇందు స్వార్థరూపమును గర్త్రర్థకమనియు, దానికిఁ గొను చేర్ప నేర్పడినదాని నాత్మనేపద కర్త్రర్థకమనియుఁ, బడు జి చేర్ప నేర్పడినదానిని గర్మార్థకమనియుఁ, గొనుపడుజులు చేర్ప నేర్పడినదాని నాత్మనేపద కర్మార్థకమనియు, నిట్లే ప్రేరణరూపమును బ్రేరణకర్త్రర్థకమనియుఁ, గొను చేరిన ప్రేరణము నాత్మనేపద కర్త్రర్థకమనియుఁ, బడు జి చేర్చిన ప్రేరణరూపమును బ్రేరణకర్మార్థకమనియుఁ, గొను బడుజులు రెండును జేర్పఁబడిన ప్రేరణరూపమును బ్రేరణాత్మనేపదకర్మార్థకమనియు, శాస్త్రము ననుసరించి యాయా ప్రత్యయములు లాయాయర్థములం దగుటను నాయాప్రత్యయములతోడిరూపములను నాయారీతిని వ్యవహరించెను. వరుసగ నుదాహరణములఁ జూచుకొనునది. ప్రక్రియ ముందె నిరూపితముగానఁ దవ్యక్తము. అకర్మకమును గూర్చి 124 క్రింది వివరణము నరయునది. సొరిది=క్రమము. మొదటి నాలుగును స్వార్థరూపములనియుఁ దరువాతి నాలుగును బ్రేరణరూపములనియు వరుస నెఱుంగునది.

గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మంబగు. ౧౨౩.

పొందు మొదలయినవి గత్యర్థకంబులు. తెలియు మొదలయినవి బుద్ధ్యర్థకంబులు. తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు. విను - చెప్పు - చదువు - మొదలయినవి శబ్దకర్మంబులు. అకర్మకంబులు ప్రసిద్ధంబులు. మైత్రుండు గ్రామంబుం బొందెను. చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెను. లాఁతిచోసహిత మిక్కార్యంబు గానంబడియెడి మైత్రుండు పుడమి నేలెను - చైత్రుఁడు మైత్రునిం బుడమి నేలించెను.

టీ. ఇందర్థశబ్దము గతిబుద్ధిప్రత్యవసానపదములతో నన్వయించుఁగానఁ గత్యర్థములకుఁ బుద్ధ్యర్థములకుఁ బ్రత్యవసానార్థములకు శబ్దకర్మములకు నకర్మములకు నప్రేరణమునఁ గర్తయగునది ప్రేరణమునఁ గర్మమగునని సూత్రార్థము గలిగెడి. అనఁగా గత్యర్థాదులకు ధాతువులకు స్వార్థమునఁ గర్తలైనవానికి, గత్యర్థాదులు ప్రేరణార్థములైనపుడు కర్మత్వము గలుగునని భావము. గతి యన గమనము. పొందుట - చనుట- చేరుట మొదలగునవి గమనసాధ్యములుగానఁ బొందు మొదలగునవి గత్యర్థములయ్యె. బుద్ధియన జ్ఞానము తెలియుట-ఎఱుంగుట-మొదలగునవి బుద్ధిచే నగునవిగానఁ దెలియు మొదలగునవి బుద్ధ్యర్థములయ్యె. ప్రత్యవసానమన భక్షణము. తినుట-ఆరగించుట

మొదలగునవి భక్షణ సాధ్యములగుటఁ దిను మొదలగునవి ప్రత్యవసానార్థము లయ్యె, శబ్దమన ధ్వని. ధ్వనిసాధ్యములఁ జెప్పునవి ధ్వనివాచక శబ్దములు. అట్టిధ్వనివాచకములు కర్మగాఁ గల ధాతువులు శబ్దకర్మములు నాఁబడును. విను-చెప్పు-చదువు-పఠించు మొదలగువానికి శబ్దజాతములగు మాటలు-పాఠము మొదలగునవి కర్మము లయ్యెడుఁ గాన విను మొదలగునవి శబ్దకర్మంబులయ్యె. కర్మమును బొందఁజాలని ధాతువులకర్మకములు. కాఁగా గత్యర్థాదులకు స్వార్థమునఁ గర్తలగు పదములకుఁ గత్యర్థాదులు ప్రేరణరూపములుగ మాఱినపుడు కర్మత్వము సిద్ధించునని సూత్రభావము తేలెడి. చైత్రుండు గ్రామంబును బొందెను. ఇటఁ జైత్రుఁడు గ్రామమును బొందుట గమనసాధ్యముగానఁ బొందుధాతువు గత్యర్థము. పొందెననునది స్వార్థరూపమనుట స్పష్టము. స్వార్థావస్థయందు గ్రామమును గమనముచేఁ బొందినవాఁడు చైత్రుఁడుగాన కర్తయయ్యె. స్వార్థమునఁ గత్యర్థమగు పొందుధాతువునకుఁ గర్తయైన చైత్రునకుఁ బొందించెనను గత్యర్థము ప్రేరణరూపముగ మాఱఁగఁ గర్మత్వ మీవిధిచే సిద్ధించి కారకము 2 చే ద్వితీయగాఁ బ్రేరణకర్త కర్తయైయుండ, చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెనని రూపము గలుగును. ఇట్లే ప్రేరణకర్త యొకఁడు ప్రేరణావస్థయందుఁ గర్తగ నొప్పుటంజేసియుం, నప్రేరణమునందలి కర్తకుఁ గర్మత్వము సిద్ధించుటంజేసియుం, స్వార్థమునందలి సహజకర్మ మట్లె ప్రేరణావస్థయందును గర్మముగ నిల్చియుండుటం జేసియుం, నీవిధి వర్తించిన స్థలములందు సకర్మక గత్యర్థములు ద్వికర్మకములును సకర్మములు సకర్మములును నయ్యెడి. ఈరీతినే శత్రువులు స్వర్గమునందిరనుదానికి దేవదత్తుఁడు శత్రువులను స్వర్గమునందించెననియు దేవతలమృతమును ద్రావిరనుదానికి విష్ణువు దేవతల నమృతమును ద్రావించెననియు శిష్యుఁడు వేదమును జదివెననుదానికి గురువు శిష్యుని వేదమును జదివించెననియుం నన్నముడికెననుదానికి దేవదత్తుఁడన్నము నుడికించెననియుఁ స్వార్థావస్థయందలి కర్తకుఁ గర్మత్వము సిద్ధించుటంజేసి రూపములు గలిగెడి. అకర్మమునకు నన్నముడికెననునదుదాహరణమగును. అకర్మమునకు స్వార్థమునఁ గర్మము గలుగదుగానఁ బ్రేరణమున మాత్రమే యీవిధింజేసి కర్మము గలుగుననుటయుఁ బ్రేరణమున నొక్కకర్మమే యకర్మముల కగుననుటయుం స్పష్టములు. గత్యర్థాదులకు స్వార్థమున నగుకర్తలకే గాక గత్యర్థభిన్నములగు నేతత్సూత్రప్రోక్తములు గానివానికర్తలకును గర్మత్వము సిద్ధించుట చూపట్టునని లాఁతి-చోనను నీక్రిందివివరణమున కభిప్రాయము. లాఁతి యన నితరము. మైత్రుండు పుడమినేలె ననువాక్యమున నేలెనుక్రియ యీసూత్రమున నిరూపింపఁబడిన గత్యర్థాదులలో నెందును జేరకున్నను, నేలుధాతువునకుఁ బ్రేరణావస్థ గలుగఁగనే స్వార్థావస్థయందుఁ గర్తయైన మైత్రునకుఁ బ్రేరణావస్థయందుఁ గర్మత్వము

సిద్ధించుటంజేసి చైత్రుఁడు మైత్రునిం బుడమినేలించె ననురూపము గలిగెను. ధాతు రూపము ప్రేరణరూపముగ మాఱఁగనే ప్రేరణకర్తయే కర్త యగుటంజేసియుం స్వార్థ కర్త కర్తగా నవకాశము లేమింజేసియు నిట్టిరూపములు గలిగెడిననుట స్పష్టము. క్రియచే ననభిహితముగాని కర్తకుఁ దృతీయ గలుగవలసిరా నీవిధి యారబ్ధమయ్యె ననియుఁ దానఁ బ్రేరణమున ననుక్తములగు మైత్రాదులకనఁగా స్వార్థమున నుక్తములై ప్రథమాంతములగు కర్తలకుఁ దృతీయయైన రూపము లపరూపములనియుఁ గ్రహింపఁ దగును. ఈనియమముంజేసి శిష్యుఁడు శబ్దమును బలికెననుదానికిఁ బ్రేరణమున గురువు శిష్యునిచే శబ్దమును బలికించెననియు, మైత్రుండు పుడమి నేలె ననుదానికిఁ జైత్రుఁడు మైత్రునిచేఁ బుడమి నేలించెననియుఁ వాక్యములు గలుగవని తేలుచున్నది. కాని పై రీతిని దృతీయతోఁడివాక్యము లాంధ్రభాషాశైలింజేసి సాధువులు గాఁదగునని తోఁచెడి. 'గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకాణామణి కర్తా స ణౌ' అను పాణినిసూత్ర మీ సూత్రమునకు మూలము. కారకప్రకరణమున నీవిధి యుండఁదగినదైనను బ్రేరణసందర్భముననున్న సుబోధమగునని యెంచి యిట నిల్పెనని యెఱుంగునది. ఇంచుకప్పగా గమములంజేసియుఁ నుజ్యంతమునకుఁ జేయుధాతువుం గూర్చుటంజేసియుఁ బ్రేరణరూపములు ధాతువుల కగుననువిషయము ముందె యుక్తము.

## అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు. ౧౨౮.

రాముఁడు మిథిలంగనియె. రామునకు మిథిలగనంబడియె-రామునిచే మిథిల గనంబడియె. మైత్రుండు తత్త్వంబుం దెలిసెను. చైత్రుండు మైత్రునకుం దత్త్వంబు దెలిపెను. కన్వాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగానగు - విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను. కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను.

అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపదకర్మానుబంధంబులు లేమింజేసి రూపభేదంబు లయిదని యెఱుంగునది

కర్త్రర్థకము.

మైత్రుండు-మనియెను

ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుండు-మైత్రుని-మనిచెను.

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము.

చైత్రుండు-మైత్రుని-మనుచుకొనియె.

ప్రేరణకర్మార్థకము.

చైత్రుని చేత-మైత్రుండు-మనుపఁబడియె.

ప్రేరణాత్మనేపదకర్మార్థకము.

చైత్రుని చేత-మైత్రుండు-మనుచుకొనఁబడియె.

వెండియుం బ్రేరణంబునం దించుగాగమంబు గలిగినచో సకర్మకంబునకుం బండ్రెండు నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహించునది.

ఇది క్రియాపరిచ్ఛేదము.

---

టీ. క్రియచేఁ జెప్పఁబడనికర్తకుఁ గొన్నియెడల బహుళముగ షష్ఠి యగునని సూత్రార్థము. సాధారణముగఁ బడుజియోగముతోడి క్రియయుఁ బ్రేరణప్రత్యయములతోడి క్రియయుఁ గర్తను స్వార్థకర్తను గ్రమముగఁ జెప్పఁజాలవుగాన నట్టిక్రియలుగల వాక్యములందలి యట్టికర్తల కీవిధిచే షష్ఠి యగునని గ్రహించునది. పడుజ్యంతానభిహితకర్తకు కారకము 3 చేఁ దృతీయ సిద్ధింపవలసిరాఁ బ్రేరణ ప్రత్యయాంతముచే ననభిహితమగు స్వార్థకర్తకుఁ బూర్వవిధిచే ద్వితీయ గలుగవలసిరా నీసూత్ర మారబ్ధమయ్యెను. 'రాముఁడు మిథిలం గనియె' నను వాక్యమునఁ గనియెనను క్రియకుఁ గర్తయైన రాముఁడను దానికిఁ బడుజ్యనుబంధమునంజేసి కనుధాతువు కర్మార్థముగ మాఱఁగఁ గర్మమగుమిథిలయే దానిచేఁ జెప్పఁబడుటయుఁ గర్తయగురాముఁడు చెప్పఁబడకుండుటయుఁ గలిగెఁగాన ననభిహితకర్తయగురాముని బోధించుదానికి షష్ఠియీవిధిచేఁ గలుగ 'రామునకు మిథిలఁ గనంబడియె' ననురూపము గలుగును. ఇట్లే మైత్రుండు తత్త్వంబుం దెలిసెనను వాక్యమునందలి తెలిసెనను స్వార్థక్రియకుఁ గర్తయైన మైత్రుఁడనుదానికి తెలిసెననునది పుగాగమయోగమునంజేసి తెలిపెనని ప్రేరణార్థముగ మాఱఁగ నద్దానిచేఁ బ్రేరణకర్తయగు చైత్రుఁడే చెప్పఁబడుటను స్వార్థకర్తయగు మైత్రుఁడు చెప్పఁబడకుండుటను మైత్రుఁడనుస్వార్థకర్తకుఁ బూర్వవిధిచే గాఁదగు ద్వితీయనడ్డి యీవిధిచే షష్ఠిగాఁగఁ జైత్రుండు మైత్రునకుఁ దత్త్వంబుం దెలిపె నను వాక్య మేర్పడెడి. బహుళంబగుట షష్ఠి గానిపక్షమున

కారకము 3 చే 'రామునిచే మిథిలగనంబడియె' ననురీతిని గర్మార్థధాతురూపఘటితవాక్యములం దనభిహితకర్తకుఁ జేతపర్ణకయోగము గలుగును. ఇట్లే ప్రేరణార్థధాతురూపఘటిత వాక్యములందలి యనభిహితకర్తకుఁ బూర్వసూత్రముచే ద్వితీయయుఁ గొండొకచో బహుళగ్రహణమునం జేసి గలుగఁదగు. ఏతద్వివేకము ప్రయోగానుసారముగ నుండును. ఈసూత్రమునందలి బహుళపదముశక్తిం జేసి కన్వార్థప్రేరణధాతురూపములతోడి యన్వయమున వాని యప్రేరణమునందలి కర్తకు నీవిధిచే నిత్యముగ షష్ఠి పూర్వసూత్రముచే నగు ద్వితీయను బాధించి యగునని కన్వాదియోగంబునను నీక్రిందివివరణమున కభిప్రాయము. ప్రయోజ్యకర్తయన స్వార్థావస్థయందుఁ గర్తయై ప్రేరణావస్థయందు వేఱొకకర్తచే వ్యాపారమునందుఁ బ్రవేశపెట్టఁబడు కర్తయని యర్థము. ప్రేరణమున ననుక్తమగు స్వార్థకర్త యని భావము. రాముఁడు మిథిలం గాంచె ననునపుడు గాంచె ననుస్వార్థక్రియకుఁ గర్తయైనరాముఁడనునదిఁ గాంచెననురూపము కానిపించెనుప్రేరణ రూపమును ధరింపఁగఁ బ్రేరణకర్తంజేసి ప్రయోజ్యకర్త యయ్యెఁగాన దాని కీవిధి యందలి బహుళపదమునం జేసి నిత్యముగ షష్ఠి గలుగ విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెనని వాక్యమేర్పడెను. ఇట్లే అర్జునుఁడు విశ్వరూపముం జూపె నను వాక్యమునఁ గర్తయైన యర్జునుఁడనునది చూచెననునది చూపెనను ప్రేరణరూపమును దాల్పఁ బ్రేరణకర్తంజేసి ప్రయోజ్యకర్త యయ్యెఁగాన నీవిధిచే నిత్యముగ షష్ఠి గలుగఁ గృష్ణుఁ డర్జునునకు విశ్వరూపముం జూపెనను వాక్యము గలుగును. సంస్కృతవ్యాకృతి ననుసరించి (దృశేశ్చ) దృశ్యర్థధాతుయోగమునను, నప్రేరణకర్తకుఁ బ్రేరణమునఁ గర్మత్వము గలుగవలసియున్నది. పూర్వసూత్రముచే గత్యర్థాదుల యప్రేరణకర్తలకు మాత్రమే ప్రేరణమునఁ గర్మత్వము విధింపఁబడుటయుఁ గన్వాదిదృశ్యర్థయోగమున నిందలి బహుళగ్రహణమునం జేసి నిత్యముగ షష్ఠి శాసింపఁబడుటయు గమనించిన నప్రేరణకర్తలకెల్ల వానికి 123 చేఁ గర్మత్వము గలుగదనియుఁ, గన్వాదిదృశ్యర్థధాతు యోగమునందలి యప్రేరణకర్తలకుఁ బ్రేరణమున సంస్కృతమునందువలెఁ గాక యాంధ్రమందు నిత్యముగ షష్ఠియే గలుగుననియుఁ గాన దృశ్యర్థయోగమున సంస్కృత వ్యాకృత్యనుసారముగ నప్రేరణకర్తలకుఁ బ్రేరణమున నగు ద్వితీయ గ్రాహ్యము గాద నియు దాననే కన్వాదియోగమనువివరణము ప్రసక్తమై యన్వర్థమగుచున్నదనియుం దెలియంగునది. గత్యర్థాదుల ప్రయోజ్యకర్తకుఁ బూర్వవిధిచే ద్వితీయయుం దృశ్యర్థముల ప్రయోజ్యకర్తకు నిత్యముగ షష్ఠియు నాంధ్రమందగునని ఫలిత మీసందర్భమున గ్రహింపవలెను. దృశ్యర్థములలోఁ బ్రేరణరూపంబైన కానిపించనుదాని కప్రేరణార్థ మును బ్రయోగప్రసిద్ధ మగుటం జేసి యట్టిరూపము యోగమున మాత్రము ముందటివివ

రణమునంజేసి ప్రేరణార్థాభావమున షష్ఠి కర్తకుఁ గలుగదని గ్రహింపవలెను. సంజయుఁడు కానిపించి యనునపుడు సంజయుఁడు తానగపడి యని యర్థముగాన సంజయపదమునకు షష్ఠి గాలేదని యెఱుంగునది. కాని తన్నుఁదాను గనపఱచికొనెనని యెంచినఁ బ్రేరణార్థమిట్టితట్టులందు గోచరించెడినని తోఁచెడి. ప్రేరణకర్తకును బ్రయోజ్యకర్తకును సమావేశము గలిగినపుడే ప్రయోజ్యకర్తకు నిత్యముగ షష్ఠి యగునని సూత్రోదాహరణములంబట్టి గ్రహింపవలెను. కను-చూచు-దర్శించు-మొదలగు దృశ్యర్థములు కనాదులని తెలియునది. రూపప్రక్రియ యాయాసందర్భముల నిరూపితముగానఁ దృక్తము.

## అకర్మకంబున కను మొదలగు వాక్యమునకుఁ డీక.

అకర్మకమున కనఁగాఁ గేవల కర్త్రర్థకమునకని యర్థము. కర్మలేని దకర్మకముగానఁ గర్మార్థమున నగు పడుజె యట్టిదానికిఁ గలుగ నవకాశము లేదనియు, నాంధ్రభాషాశైలి ననుసరించి యాత్మనేపదార్థమగు కొనుధాతువు స్వార్థమున ననుప్రయుక్తము గాఁజాలదనియు, దాన స్వార్థమునఁ గర్త్రర్థకరూప మొకటే మైత్రుండు మనియెననురీతిది గలుగుననియుఁ, బ్రేరణప్రత్యయము లకర్మకములకుఁ గలుగనగుంగావునఁ బ్రేరణకర్త్రర్థము చైత్రుండు మైత్రుని మనిచె ననురీతిది గలుగుననియుం, స్వార్థకర్త్రర్థమున నె కొనుపడుజులు గలుగవుగాని ప్రేరణకర్త్రర్థకరూపములమీఁదఁ గొనుపడుజులు సంభవింపనగుంగానఁ బ్రేరణాత్మనేపదకర్త్రర్థమునఁ గొనుగలిగినపుడు చైత్రుండు మైత్రుని మనుచుకొనియె ననురీతి రూపము గలుగుననియు, నిట్లే ప్రేరణరూపముమీఁదఁ బడుజె యైనఁ బ్రేరణకర్మార్థమునఁ జైత్రునిచేత మైత్రుండు మనుపఁబడియె ననురీతి రూపమగుననియుం, నీరీతినే ప్రేరణకర్త్రర్థముమీఁదఁ గొనుపడుజులు రెండును జేరినఁ బ్రేరణాత్మనేపదకర్మార్థమునఁ జైత్రునిచేత మైత్రుండు మనుచుకొనఁబడియె ననురీతి రూపము గలుగుననియు, నిట్లకర్మకమునకు స్వార్థరూప మొకటియుఁ బ్రేరణరూపములు నాల్గును నేర్పడుట నైదురూపములు గలుగుననియుం, నీవివరణమున కభిప్రాయము. ప్రేరణమున స్వార్థావస్థయందలి కర్తకుఁ గర్మత్వము సిద్ధించెడిఁగానఁ బ్రేరణమున నకర్మకమునకుఁ బడుజె గావచ్చుననుట స్పష్టము. ఆయాయర్థములం దాయాప్రత్యయము లగుట నాయాప్రత్యయాంతముల నాయాసంజ్ఞలతో వ్యవహరించుట గుదిరెనని యెఱుంగునది.

సకర్మకములకు 122 సూత్రవివరణటీకలలోఁ నిరూపింపఁబడిన ప్రకార మేర్పడిన స్వార్థప్రేరణరూపము లెనిమిదింటిలోఁ దుదినున్న ప్రేరణరూపములు నాల్గిటిమీఁద మరలఁ బ్రేరణప్రత్యయములు గూర్చునెడలఁ బ్రేరణకర్త్రర్థకమునుండి పునఃప్రేరణకర్త్రర్థకము 'దేవదత్తుఁడు చైత్రునకు మైత్రునిచేత వంటకమును వండింపించె'ననియుఁ, బ్రేరణాత్మనేపదకర్త్రర్థకమునుండి పునఃప్రేరణాత్మనేపదకర్త్రర్థకము 'దేవదత్తుఁడు చైత్రునకు మైత్రునిచేత

వంటకమును వండింపించికొనె'ననియుఁ, బ్రేరణకర్మార్థకమునుండి పునః ప్రేరణకర్మార్థకము 'దేవదత్తుఁడు చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండింపింపఁబడియె'ననియుఁ, బ్రేరణాత్మనేపదకర్మార్థకమునుండి పునః ప్రేరణాత్మనేపదకర్మార్థకము 'దేవదత్తుఁడు చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండింపించుకొనఁబడియె'ననియు, నాలుగురూపములు గలిగి తొలుతటి యెనిమిదింటితోఁ గలియ సకర్మమునకుఁ బండ్రెండురూపభేదములు గలుగుననియు, నీరీతినె యకర్మమున కిందు నిరూపితమైనరీతి నేర్పడిన యైదురూపభేదములలోఁ బ్రేరణార్థకములగుతుదినాలుగిటిమీఁద మఱలఁ బ్రేరణప్రత్యయములఁ గూర్చునెడలఁ బ్రేరణకర్త్రర్థమునుండి పునః ప్రేరణకర్త్రర్థము 'దేవదత్తుఁడు చైత్రునిచేత మైత్రుని మనిపించె' ననియుఁ, బ్రేరణాత్మనేపదకర్త్రర్థకమునుండి పునః ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము 'దేవదత్తుఁడు చైత్రునిచేత మైత్రుని మనిపించుకొనియె' ననియుఁ, బ్రేరణకర్మార్థమునుండి పునః ప్రేరణకర్మార్థకము 'దేవదత్తునిచేత చైత్రునిచేత మైత్రుఁడు మనిపింపఁబడియె' ననియుఁ, బ్రేరణాత్మనేపదకర్మార్థకముచుండి పునః ప్రేరణాత్మనేపదకర్మార్థకము 'దేవదత్తునిచేతఁ జైత్రునిచేత మైత్రుండు మనిపించుకొనఁబడియె' ననియు నాల్గురూపభేదములు గలిగి తొలుతటి యేనింటితోఁ గలియ నకర్మకమునకుఁ దొమ్మిదిరూపభేదములు గలుగుననియుం వెండియునను సూరివివరణమున కభిప్రాయము. 81 విధి ననుసరించి ప్రేరణప్రత్యయములమీఁదఁ బ్రేరణప్రత్యయములు మరలఁ గాఁదగుటయు గమనించికొనునది. రూపముల ప్రక్రియ పూర్వోక్తసూత్రముల ననుసరించి గ్రహించునది. ప్రేరణార్థకములమీఁద మరల మరలఁ బ్రేరణప్రత్యయములనుగూర్చు నీప్రక్రియ సంస్కృతవ్యాకృతి సంప్రదాయసిద్ధము. కాని యీప్రక్రియచే సిద్ధమైనరూపములకెల్ల ప్రయోగము లగపడుటరుదని చెప్పనొప్పును.

ఇది క్రియాపరిచ్ఛేదము.

# కృదంతపరిచ్ఛేదము.

కృదంతశబ్దములంగూర్చియైన గ్రంథభాగముగాన నిది కృదంతపరిచ్ఛేదంబునాఁ జనె. కృత్ప్రత్యయము లంతమునఁ జేరినశబ్దములు కృదంతము లనంబరగును. కృత్తని కృఞ్ ధాతువు నిట ముందిడుటంజేసి యివి శుద్ధధాతువులకగు ప్రత్యయములనుట స్పష్టము.

## కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు. ౧.

ధాతువునకు విహితంబగు డుఙ్భిన్నప్రత్యయంబు కృత్తునాఁబడు. కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృకర్మాద్యర్థంబులు మహాజనవ్యవహారానుసారిగా నెఱుంగునది. ఆఁక-బంధనము మొలక-నవోద్భిదము. ఏలిక - పాలకుఁడు. కోరిక - వాంఛయు, వాంఛితంబును. మూఁక - సంఘము. ఆడిక - నింద. ఓడిక - స్రోతస్సు.

టీ. కృత్ప్రత్యయములయర్థములు వ్యవహారమునుబట్టి గ్రహింపఁదగునని సూత్రార్థము. ఇది గ్రాంథికభాషకు వ్యాకృతియగుట నిందలివ్యవహారశబ్దము కవి వ్యవహారబోధకమను టర్థము గాన గ్రాంథికపుఁబ్రయోగముల ననుసరించి కృత్ప్రత్యయము లేయే యర్థముల నైనవియుఁ దెలియఁదగునని భావము తేలెడిఁగాని వానికెల్లను బ్రయోగములు వాఙ్మయమునందుఁ జూపరాని వగుటను, మహాజనవ్యవహారానుసారముగ వీనిని గవీశులు ప్రయోగించుట యనాది సిద్ధమగుటను, గృత్తుల యర్థములు మహాజనవ్యవహారానుసారిగా నెఱుంగునదని వివరించెనని తోఁచెడి. క్రియాపరిచ్ఛేదప్రథమసూత్రమిందును ననువృత్త మగుంగానఁ గ్రియాపరిచ్ఛేదమున ధాతువునకు విహితములగు డు 'జ్రు వు రు ను ము' అనునవిగాక యితరము లగునని కృత్ప్రత్యయములని వివరించుట పొసఁగెడి. కృత్తులును డుజాదులవలెనే కర్తృభావకర్మాద్యర్థముల నగునవిగాన భావకర్తృకర్మాద్యర్థములని వ్యాఖ్యానము వ్రాయుట సార్థకము. 'కృదతిఙ్' అని పాణినీయము తిఙ్భిన్నమైనదానిం గృత్తుగఁ జేర్కొనెడిఁగాన దాని ననుసరించి యీసూత్రము క్రింది ధాతువున కనువివరణము వ్రాయఁబడెననుట స్పష్టము. భావకర్తృకర్మార్థములం దెందుఁ బ్రత్యయంబగుఁ దదంతముచే నదియె బోధ్యమగుననుట స్పష్టము. ఆఁగు ధాతువునకు 3 చేఁ గవర్ణకమును 2 చే గువర్ణలోపమునుగా 'ఆఁక' అనురూపమయ్యె. ఇది భావార్థమున నుదాహృతి. మొలచుధాతువునకుఁ గర్త్రర్థమునఁ గవర్ణకముగా

మొలక యగును. ఇట్లే మూఁగుధాతువునకుఁ గర్త్రర్థమున 'మూఁక' అగును. 2 చే గువర్ణలోపము. ఏలుధాతువునకు 128 చే నిక వర్ణకము కర్త్రర్థమునఁగా నేలిక యగును. కోరుధాతువునకుఁ గర్మార్థమున నిక వర్ణకము గలుగఁ గోరిక యగును. కోరఁబడినదని యర్థము. ఆడుధాతువునకు భావార్థమున నిక గలుగ 'ఆడిక' అగును. నింద యని యర్థము. ఓడుధాతువున కిక ప్రత్యయము కర్త్రర్థమునఁగా నోడిక యగును. ప్రవాహము-నది యని యర్థము. ఈరీతి నొకే ప్రత్యయము కర్తృకర్మభావాద్యర్థముల నగుటను, నొకేయర్థమున ననేకప్రత్యయము లగుటను, నర్థవిశేషములందు వివిధప్రత్యయము లగుటను, మీఁదిలక్షణముల ననుసరించియుఁ గవిప్రయోగముల ననుసరించియు గ్రాహ్యము. (చూ. శ. ర. ము).

## ఇటం గృత్కగతపవేములు పరంబులగునపుడు కగచయవలకు లోపంబగు. ౨.

కృత్సంబంధులగు కాదులు పరంబులగునపుడు ధాతువునంతంబులగు కగచయవలకు లోపంబగు. మీఁదిలక్ష్యంబులం జూడంబడు.

టీ. కృత్ప్రత్యయసంబంధములగు 'క-గ-త-ప-వ-ఇమి' అనునవి పరములగునపుడు ధాతువులయంతముననున్న 'క-గ-చ-య-వ' అనువర్ణములకు లోప మిందగునని సూత్రార్థము. క గ త ప వే ములను సామాన్యోక్తిం జేసి యవి యేయచ్చులతోఁగూడినను గృత్సంబంధులైన నీవిధులుగలుగుననియు నిట్లే క గ చ య వ లనుటం జేసి యవియే యచ్చులతోఁగూడినను లోపము గలుగుననియుఁ దెలియునది. కృత్ =కృత్ప్రత్యయములను సంబంధించిన - క గ త ప వే ములు. ఈసూత్రమునకు లక్ష్యములఁ దరువాతి సూత్రములం దరయునది.

## కవర్ణకం బలుగ్వాదుల కగు. 3.

అలుగు - అలుక. ఆఁగు - ఆఁక. ఎలుఁగు - ఎలుక. ఇట బిందులోపంబు ఇట్లు గొన్నింట గ్రహించునది. కడఁగు - కడఁక. కలఁగు - కలఁక. కాఁగు - కాఁక. తునుఁగు - తునుక. నడచు - నడక. నలఁగు-నలఁక. పోవు - పోక. మడఁగు - మడఁక. మలఁగు - మలఁక. మునుఁగు-మునుక. మూఁగు - మూఁక. మొలచు-మొలక. వచ్చునకు - రా - రాక. వంగు - వంక. వీఁగు - వీఁక. ఇఁక కవులు పరంబులగునపుడు కనునకు

దీర్ఘంబగు - కానుక. కినియు ముదియుల కుత్వంబునగు. కినియు - కినుక. ముదియు - ముదుక. ఇత్యాదు లలుగ్వాదులు.

టీ. అలుగు మొదలగుధాతువులకు 'క' అను ప్రత్యయమగును. అలుగుధాతువున కీవిధిచేఁ గవర్ణకమును బూర్వవిధిచేఁ గృత్సంబంధమైన కవర్ణము పరముగా ధాతువుతుది గకారమునకు లోపమును గలుగ నలుక యనురూప మేర్పడును. విఱుఁగుధాతువునకుఁ గవర్ణకముగా గువర్ణలోప మగుడు గువర్ణమునకు ముందటిబిందువును గవర్ణము గల్గినపిదప నుండుటకు సంజ్ఞ 16 చే నర్థాత సంభవించినను దొలఁగుననని యిట బిందులోపంబను వివరణమున కభిప్రాయము. ఇట్లు బిందులోపం బగుటఁ గొన్నిరూపములందే చూపట్టుటం జేసి యిట్లు కొన్నింటి గ్రహించునదని వివరించెను. మలఁగు - మూఁగు మొదలగువాని యందుఁ గవర్ణకము గల్గినపుడు బిందువు నిల్చియుండుటకై మీఁదఁ జూడవలయును. వచ్చుధాతువునకు రాదేశము ముత్తు పరమగునపుడే గావలసియున్నది గాని యీవిధిచే నగుకవర్ణకము పరమగునపుడును బ్రయోగములంబట్టి గాఁగ రాక యనురూప మేర్పడును. కనుధాతువున కీవిధిచేనైన కవర్ణకమును 11 చే నగు పువర్ణకమును బరమగుచుండ ధాత్వాదివర్ణముమీఁది యచ్చునకు దీర్ఘముగాఁ గానుక యనియుఁ గానుపనియు రూపములగును ఇట్లొకేధాతు వర్థవిశేషముల ననుసరించి ప్రత్యయవిశేషముల నందుటయు నొకేయర్థమునఁగూడ భిన్నప్రత్యయముల నందుటయు నాయాసూత్రోదాహరణములంబట్టి గ్రహింపవలయును. (కానిక) కినియు, ముదియు నను ధాతువులకుఁ గవర్ణకము పరముగా ధాతుమధ్య నున్నవర్ణము మీఁది యికారమున కుకార మగుననియుం దాన కినుక ముదుక యనురూపము లగుననియుఁ గినియు ముదుకలకను వివరణమున కభిప్రాయము.

ఇమివర్ణకంబు కలుగ్వాదుల కగు. ౮.

కలుగు - కలిమి. ఓరుచు - ఓరిమి. కూరుచు - కూరిమి. నేరుచు - నేరిమి. ప్రేలుచు - ప్రేలిమి. బడియు - బడిమి. బ్రదుకు - బ్రదిమి. ఒడ్డు - ఒడ్డిమి. తాలు - తాలిమి.

టీ. 'ఇమి' అనుప్రత్యయమలఁగు మొదలగుధాతువుల కగును. కలుగుధాతువున కిమి గలుగఁ బ్రపూర్వవిధిచే నంతిమాక్షరలోపము గలుగ 'కలు+ఇమి = కలిమి' అని రూపమగును. బడియుధాతువున కిమియుం ధాత్వంతయుంవర్ణలోపమునుగా, నపధాది

స్వరసంధిచే బడిమి యగును. దిగఁదుడుచుట యని యర్థము. ఇట్లే మిగిలినవాని ప్రక్రియయుం నూహ్యము.

## తజ్వర్ణకంబు చేయ్యాదులకగు. ౫.

చేయు - చేఁత. అలయు - అలఁత. కూయు - కూఁత. కోయు- కోఁత. గీయు - గీఁత. నేయు - నేఁత. పూయు - పూఁత. పోయు - పోఁత. మూయు - మూఁత. మేయు - మేఁత. మ్రోయు - మ్రోఁత. రోయు - రోఁత. లాయు - లాఁత. వ్రాయు - వ్రాఁత. వ్రేయు - వ్రేఁత.

టీ. చేయుం మొదలగుధాతువులకు 'తజ్' అను ప్రత్యయ మగును. తజ్ ప్రత్యయము జకారముపోవు ప్రత్యయము గానఁ దత్సమము 19 చే బిందువు ముందిడికొని యగుననియుం హ్రస్వముమీఁద నర్ధపూర్ణములు రెండు నగుననియు నెఱుంగునది. కూయుఁ ధాతువున కీవిధిచేఁ దజ్వర్ణకమును 2 చే యువర్ణలోపమును గాఁ గూఁత యని యగును. 'కూయి' అనియుం నిప్రత్యయాంతమగురూపము ప్రయోగప్రసిద్ధమై తోఁచెడి. ఇట్లే మిగిలినరూపముల ప్రక్రియ యూహ్యము.

## కువవర్ణకం బడంగ్వాదులకగు. ౬.

అడఁగు - అడఁకువ. ఎఱుఁగు - ఎఱుకువ. కలఁగు - కలఁకువ. నలఁగు - నలఁకువ. పెనఁగు - పెనఁకువ. పొలయు - పొలకువ. మఱచు - మఱకువ. మెలఁగు - మెలఁకువ. లోఁగు - లోఁకువ. వేగు - వేకువ.

టీ. అడఁగు మొదలగుధాతువులకు 'కువ' అను ప్రత్యయమగును. అంతట 2 చే నంత్యవర్ణలోపంబగును. అడఁగుధాతువున కీవిధిచే 'కువ' వర్ణకముగా నడఁకువ యగును. ఇట బిందువు లోపింపదు. ఇట్లే శేషించినవాని ప్రక్రియ యూహ్యము.

## టవర్ణకం బాడ్వాదుల కగు నగుచో నంతలోపంబగు. ౭.

ఆడు - ఆట. ఊరు - ఊట. ఊఱడు - ఊఱట. ఏఁకరు - ఏఁకట. ఓడు - ఓట. తిప్పరు - తిప్పట. తేరు - తేట. త్రిమ్మరు - త్రిమ్మట. పండు - పంట. పాడు - పాట. మండు - మంట. వండు - వంట. వేసఱు - వేసట. అనుప్రయుక్తం బయినయాటశబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీబసమం బగు. కోలాటము - పోరాటము - మంద్రాటము, ఇత్యాదులు.

టీ. ట ప్రత్యయ మాడు మొదలగుధాతువుల కగునని యు నది పరముగా ధాత్వంతవర్ణము లోపించుననియు సూత్రార్థము. ఆడుధాతువున కీవిధిచే టవర్ణకమును డువర్ణలోపమునుగా 'ఆట' అనురూప మగును. మిగిలినవాని ప్రక్రియ యిట్లే యూహ్యము. టవర్ణకము పరముగా 2 చే నంతిమవర్ణలోపము సిద్ధింపమిని నంతలోపంబగు నని సూత్రితము. కొన్నిశబ్దముల వెనుకఁ జేర్పఁబడు నాటశబ్దముమాత్రము తఱచుగఁ గ్లీబసమంబగుంగాన మువర్ణకమునంది 'కోలాటము, పోరాటము' మొదలగురూపముల నందుననియుఁ గోలాట, పోరాట-ముండ్రాట' అనురీతిని మువర్ణకవిరహితమై యాట శబ్దము వ్యస్తమందువలె నుండదనియు నెఱుంగునది. దీన వ్యస్తమున నిది నిత్యముగ స్త్రీసమంబె యగుననుట తెల్లము.

## టువర్ణకంబు పడ్వాదుల కగు నగుచో నవి యాద్యక్షరశేషంబు లయి దీర్ఘంబు నొందు. ౮.

పడు-పాటు. చెడు-చేటు. అడుచు-ఆటు. కఱచు-కాటు. పొడుచు-పోటు. వయిచు-వాటు. ఏయు-ఏటు. ఓడు-ఓటు. ప్రేయు-ప్రేటు.

టీ. 'టు' అనుప్రత్యయము పడు మొదలగుధాతువుల కగుననియు, నది పరముగా ధాతువు నాదిమాక్షరము మాత్రమే మిగిలి తక్కినవర్ణములు లోపించుటేగాక శేషించినధాత్వాదివర్ణము మీఁదియచ్చునకు దీర్ఘమును నగుననియు సూత్రార్థము. పడుధాతువునకు టువర్ణమును డువర్ణలోపమును బకారము నత్తునకు దీర్ఘమునుగాఁ బాటను రూపము గలుగును. అడుచను దీనికి 'టు' అనుప్రత్యయ మీవిధిచేఁ గా ధాతువాద్యక్షరశేషముగా శేషించిన యాదిమవర్ణముతోడఁగూడి 'ఆటు' అనురూప మగును. శేషించినది దీర్ఘంబయ్యెనేని యావశ్యకతలేమి దీర్ఘముగాదనియుఁ శేషించినది హ్రస్వమగునపుడే దీర్ఘమగుననియుఁ నెంచునది. ఇట్లే రెండిటికి మించినవర్ణములు గలవానివిషయమున నే యాద్యక్షరశేషం బగుననువిధానము సార్థకంబగునని యెఱుంగునది. రెండు వర్ణములు గలవానికి 2 చే నంతిమవర్ణలోపము సిద్ధముగాన నవ్వానివిషయమున దీర్ఘవిధానమే యావశ్యకమగును. కఱచనుదాని కాద్యక్షరశేషమునకు దీర్ఘము సిద్ధింపఁగాఁ గాటనురూప మేర్పడును. శేషము స్పష్టము.

## పవర్ణకంబు తిరియ్వాదుల కగు. ౯.

తిరియు-తిరిపము. కలియున కత్వంబునగు - కలపము. పొలయు-పొలపము మురియు-మురిపము. సొలయు-సొలపము. వలియు-వలిపము.

టీ. 'ప' అను ప్రత్యయము తిరియుం మొదలగు ధాతువుల కగును. తిరియుం ధాతువున కీవిధిచే పవర్ణకమును 2 చే ధాత్వంతిమవర్ణలోపమును నాచ్ఛికము 2 చేఁ గ్లీబసమత్వమును దత్సమము 39 చే మువర్ణకమును గాఁ దిరిపమనురూపమగును. పవర్ణకాంతములకెల్ల నిట్లే క్లీబసమత్వమునం జేసి మువర్ణకమంతట నూహ్యము. కలియుఁ ధాతువునందలి లివర్ణము నిత్వమున కిత్వము పవర్ణకము పరముగా నగుననియుం దానఁ గలపమని రూపమగుననియుఁ గలియుంన కత్వంబునగునను వివరణమువ కర్థము. ఇట్లు తక్కినవాని ప్రక్రియ యూహ్యము.

## తవర్ణకం బావులించు లోనగువాని కగు ౧౦.

ఆవులించు-ఆవులింత. ఇగిలించు - ఇగిలింత. ఓకిలించు - ఓకిలింత. కుళ్లగించు-కుళ్లగింత. కుసిలించు-కుసిలింత. కొక్కరించు-కొక్కరింత. కొప్పరించు-కొప్పరింత. గిలిగించు-గిలిగింత. ఇత్యాదు లెఱుఁగునది

టీ. క్రియ 63. చే నంగలాదులు నిత్యముగ నించుక్కుం బొందును. వానికించు గ్వరహితములకుఁ బ్రయోగము లేమిని నించుగంతములమీఁదనే తవర్ణక మావులించు మొదలగువాని కగునని యెంచునది. 2 చే నంతిమంబగు నించుక్కునందలి చువర్ణమునకు లోపము. కాఁగా నించుక్కునందు 'ఇం' అనుభాగమే శేషించుంగాన నీవిధిచే నగు తవర్ణకముంగూడి 'ఇంత' అని యై 'ఆవులింత' అను మొదలగురూపము లేర్పడును. శేషము స్పష్టము.

## పువర్ణకంబు మాయ్వాదుల కగు ౧౧.

మాయు - మాపు. మేయు - మేపు. అడుచు - అడుపు. ఇంచు- ఇంపు. ఏఁచు-ఏఁపు. ఏచు-ఏపు కను-కానుపు. కాచు-కాపు చూచు - చూపు తలఁచు - తలఁపు. తోఁచు - తోఁపు. త్రేఁచు - త్రేఁపు. త్రోచు-త్రోపు. పూఁచు - పూఁపు. పెనుచు - పెనుపు. పొలుచు - పొలుపు. ప్రోచు - ప్రోపు. మెచ్చు - మెప్పు. మోచు - మోపు. వలచు - వలపు. వాచు - వాపు. ఇత్యాదులు మాయ్వాదులు.

టీ. 'పు' అను ప్రత్యయము మాయుం మొదలగు ధాతువుల కగును. 2 చే నంతిమాక్షరలోపము. 'మాయు + పు=మాపు; కను ధాతువునకు 3 సూత్రమునందలి వివరణమునం జేసి పువర్ణకము పరముగా దీర్ఘముగాఁ గానుపనురూప మగును. ఇట నంతిమవర్ణలోపము గాదు. ఇట్లంతట నూహ్యము. మెచ్చుధాతువునకుఁ బువర్ణకము యోగమున

మెప్పను సద్విత్వపకారరూపమగుట కాధారమగపడకున్నది. పడిప్రభృతులలోఁ జేర్చి సాధింపఁదగునేమొ? లేక యక్కటాదులలోఁజేర్చి ద్విత్వమును జేయవలెనో? సూరి విశదపఱుపకుండుట విచార్యము.

ఇకవర్ణకం బంజ్వాదుల కగు. ౧౨.

అంజు - అంజిక. అమరు - అమరిక. అరయు - అరయిక. అలయు- అలయిక. ఆడు - ఆడిక. ఓడు - ఓడిక. ఓపు - ఓపిక. కను - కానిక. కూడు - కూడిక. కోరు - కోరిక. పొందు - పొందిక. పోలు - పోలిక. తూను తూఁగునకగు - తూనిక. ఇత్యాదు లంజ్వాదులు.

టీ. 'ఇక' అను ప్రత్యయము 'అంజు' అను మొదలగుధాతువుల కగును. 2 సూత్రమునకు విషయము గామి నంతిమవర్ణలోప మిటఁ గలుగదు. 'అంజు+ఇక=అంజిక.' ఇక పరముగాఁ దూఁగుధాతువునకుఁ దూననునదాదేశముగా 'తూను + ఇక = తూనిక' అనురూపమగునని దీనిక్రిందివివరణమునుబట్టి యెఱుఁగునది. శేషము స్పష్టము.

అప్పాదులకు నజె యగు. ౧౩.

అప్పు-అప్పన. ఉజ్జ-ఉజ్జన. ఒప్పు-ఒప్పన. గట్టి-గట్టన. గడ-గడన. దట్టి-దట్టన. దీవ-దీవన. పాట-పాటన. మన్ను-మన్నన. వీచు-వీవన.

టీ. అప్పు మొదలగుధాతువులకు నజె యనుప్రత్యయమగును. జెత్వముం గూర్చుటకు వీవన మొదలగువానియందు చకారమునకు వకారంబు క్రియ 88 చే నగుటయుఁ క్రియ 20 చే నత్వమగుటయుఁ బ్రయోజనములు. అప్పాదు లదంతము లంగలాదు లందలివి. ఇంచుక్క చేరని యదంతములకే యప్పాదులను నిర్దేశమునంజేసి నజెయగు. 'వీచు' అనునదుదంతము. ఈవిధిచేనైన నవర్ణకముతోడి రూపములు గొన్ని క్లీబసమములుగఁ గాన్పించెడిఁ గాన మువర్ణకాంతములుగ నుండవలసినఁ గ్లీబసమత్వమును మువర్ణకాంతముగా నుండ నక్కఱ లేకున్న స్త్రీసమత్వమును నాచ్ఛికము 2 చేఁ గల్పించికొనునది. 'అప్పు+న = అప్పన = అప్పనము.' వీచు+న:—ఇట నజె జిత్తుగాన ధాత్వంతచువర్ణము నుత్వమున కత్వము క్రియ 20 చేఁ గలుగఁ బిదపఁ గ్రియ 88 చే వకారము చకారమునకుఁ గా 'వీవన' యనురూపమగు. శేషము స్పష్టము.

బడి యేల్వాదుల కగు. ౧౪.

ఏలుబడి - కట్టుబడి - కనుబడి - కొనుబడి - గిట్టుబడి - చెల్లు

బడి - చేరుబడి - తగులుబడి - తీఱుబడి - పెట్టుబడి - పోబడి మ్రొక్కు-బడి - వచ్చుబడి - సాగుబడి

టీ. ఏలు మొదలగుధాతువులకు బడి యనుప్రత్యయమగును. ఏలు+బడి = ఏలుబడి. ఇట్లు తక్కినవూహ్యములు.

## గడ చేర్వాదుల కగు. ౧౪.

చేరుగడ - తిరుగడ - తీఱుగడ - తేఱుగడ - తేగడ - మనుగడ - విడుగడ - వీడుగడ.

టీ. చేరు మొదలగుధాతువులకు గడవర్ణకమగును. చేరు + గడ = చేరుగడ. శేషము స్పష్టము.

## ఇకి కోర్వాదుల కగు. ౧౬.

కోరికి - పూనికి - పోలికి - మనికి - వినికి. చూడు చూచున కగు - చూడికి.

టీ. కోరు మొదలగువానికి 'ఇకి' అనుప్రత్యయమగు. కోరు+ఇకి=కోరికి. శేషము స్పష్టము. ఇకివర్ణక మగునపుడు చూచుధాతువునకుఁ జూడనున దాదేశమగుంగానఁ జూడికి యనియే గాని చూచికి యని గావని చూడనువివరణమున కభిప్రాయము.

## వువర్ణకంబు మన్వాదుల కగు. ౧౭.

మను - మనువు. కాచు - కావు. కొలుచు - కొలువు చచ్చు - చావు. తడయు - తడవు నిలుచు - నిలువు. నొచ్చు - నోవు. పూచు - పూవు. ప్రుచ్చు - ప్రువ్వు.

టీ. వుప్రత్యయము మనుమొదలగుధాతువులకగు. 'మను+వు=మనువు.' చచ్చు నొచ్చుమొదలగు సద్విత్వచువర్ణాంతధాతువుల ద్విత్వచువర్ణమునకు వుప్రత్యయముగా 2 చే లోపంబును శేషించిన యాదిమవర్ణముల స్వరములకు దీర్ఘమును నగునని గ్రహించి చావునోవులనురూపముల సాధించుకొనునది. పిదపఁ బ్రకీర్ణము 6 చే ద్విత్వమును సమాసము 13 చే నాదిమవర్ణమునకు హ్రస్వమును గూర్చి నొచ్చునకు నొవ్వనియు రూపమును సాధించికొనునది. ఇట్లే ప్రువ్వు-పుచ్చునకును, బువ్వ-పూచునకును నగుటను గమనించికొనునది. యథార్థ్యముగ రూపనిర్మాణముఁ జేయువలయును. ఇట్లు సర్వమూహ్యము.

## అవర్ణకంబు గీఱ్ఱాదుల కగు. ౧౮.

గీఱు - ఊఁద - ఎండ - కాయ - చదియ - తునియ - పరియ - పాయ - పిడుచ - మీఁట - ముడియ - వదర - వ్రయ్య.

టీ. 'అ' అను ప్రత్యయము గీఱు మొదలగు ధాతువులకగు. 'గీఱు-అ = గీఱ' అప దాదిస్వరసంధి యంతటం గూర్చునది. శేషము స్పష్టము. ఈధాతువులెల్లను దంతములే.

## అకవర్ణకంబు మాఱ్ఱాదుల కగు. ౧౯.

మాఱు - మాఱకము. అమ్ము - అమ్మకము. అంపు - అంపకము. పంచు - పంపు - పంపకము. వండుడకారంబు టకారం బగు - వంటకము. తోఁము - తోఁమకము. అద్దు - అద్దకము

టీ. 'అక' అను ప్రత్యయము మాఱుమొదలగువాని కగు. 'మాఱు=అక' మాఱకము. ఇయ్యవి క్లీబతుల్యములు. వండుధాతువునందలి డకార మీయకప్రత్యయము పరముగా టకారమగుననియు దాన 'వండు+అక=వంటు+అక = వంటకము' అని రూపమగుననియు వండుడకారమనువివరణమున కభిప్రాయము. శేషము స్పష్టము. డకారము హల్లునకై టకారము హల్మాత్రమగును. ఇట్లే తక్కినవి సాధ్యములు.

## డువర్ణకం బాఱ్ఱాదుల కగు నగునపుడు పకారంబు చయలకగు ౨౦.

ఆఱు-ఆఱుడు. అమ్ము-అమ్ముడు అల్లు-అల్లుడు. ఎక్కు - ఎక్కుడు. క్రుమ్ము-క్రుమ్ముడు. చోఁపు-చోఁపుడు. త్రొక్కు - త్రొక్కుడు. త్రోఁచు - త్రోఁపుడు. దంచు-దంపుడు. దాఁచు-దాఁపుడు. దిగు - దిగుడు. దోఁచు - దోఁపుడు. పెంచు పెంపుడు - ప్రేఁపుడు. ప్రాఁకు-ప్రాఁకుడు. మాయు-మాపుడు. రాచు - రాపుడు ఇత్యాదులు.

టీ. ఆఱు మొదలగువానికి డుప్రత్యయ మగుననియు నాడుప్రత్యయము పరముగా ధాతువులతుదినున్న చకారయకారములకు పకారమాదేశ మగుననియు సూత్రార్థము. త్రోఁచుధాతువున కీవిధిచే డువర్ణకమును నది పరముగా చకారమాత్రమునకుఁ బకారమును గాఁ ద్రోఁపుడనియు, మాయుధాతువునందలి యకారమాత్రమునకుఁ బకారము గా మాపుడనియు రూపములగును. ఇట్లే చయాంతములగు దాచు త్రోయు మొదలగువానిచయలకుఁ బవర్ణము గా దాపుడు త్రోపుడు మొదలగురూపములు

గలుగుటను గమనించికొనునది. మిగిలినది స్పష్టము. హల్మాత్రములకె పకారము హల్మాత్ర మగునని గ్రహించునది.

ఉవర్ణకం బడుక్వాదుల కగు ౨౧.

అడుకు - అంటు - ఒప్పు - ఒఱుగు - ఒసఁగు.

టీ. అడుకు మొదలగువానికి 'ఉ' అనుప్రత్యయమగు. అపదాదిస్వరసంధిచే రూపము లూహ్యములు. 'అటుకు'లను వ్యావహారికపదమునర్థమున నీధాతురూపము నిత్య బహువచనాంతముగఁ జూపట్టెడి. ఒఱఁగకారమధ్యముగఁ బ్రయోగములందగపడు. మీఁద స్పష్టము.

వడిప్రభృతు లిట్లెఱుంగునది. ౨౨.

వడి; కొలువడి - గెలువడి - నడవడి. వ్యతిరేకంబున లేవడి. వి; తనివి - తెలివి - విరివి. అవు; తగవు - నగవు - ఉఱవు. ఇ; చేయి - వ్రాయి. కలి; కనుకలి - వినుకలి. ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది.

ఇది కృదంతపరిచ్ఛేదము.

---

టీ. పూర్వోక్తప్రత్యయములే గాక 'వడి-వి-అవు-ఇ-కలి' మొదలగు ప్రత్యయము లాయాధాతువుల కాయాయర్థములం దగుటను మహాజనవ్యవహారము ననుసరించి గ్రహింపఁదగునని సూత్రభావము. 'కొలుచు+వడి-గెలుచు+వడి-నడుచు+వడి' అని యుండ 2 చే నంతిమవర్ణము లోపించి 'కొలువడి' మొదలగురూపత్రయము గలిగె. 'కలుగు+వడి' అని యుండఁ 'క్రియ 116 చేఁ గలుగుధాతువునకు 'లే' అనున దాదేశముగా 'లేవడి' యనురూపమయ్యెను. తనియు ధాతువునకు 'వి' అనుప్రత్యయము పరముగా 2 చే యువర్ణలోపముగాఁ 'దనివి' యని యగును. ఇట్లే తెలియు విరియుధాతువులకు విప్రత్యయయోగమునఁ దెలివి విరివి యనురూపములగుటను గమనించునది. 'తగు-నగు-ఉఱు'అను వీనికి 'అవు'ప్రత్యయముం జేసి యపదాదిస్వరసంధి చేయఁగా 'తగవు-నగవు-ఉఱవు' అనురూపములగును. చేయు-వ్రాయుధాతువుల కిప్రత్యయముం జేసి చేయి వ్రాయి యనురూపముల సాధించికొనునది. విను-కనులకు 'కలి' అనుప్రత్యయమును గూర్చి 'కనుకలి-వినుకలి' యనురూపముల సాధించికొనునది. ఇట్లే యనుక్తముల నెల్ల

మహాజనవ్యవహారము ననుసరించి గ్రహించి ప్రకృతిప్రత్యయవిభాగము నూహించి రూపసాధుత్వమును సంపాదించికొనవలెనని క్రిందివివరణమున కాశయము.

త్రిలింగలక్షణశేషము 'డయ్యు దయ్యు నొచ్చు పుచ్చు'ల కివర్ణంబగు. అగుచో వాని కడహల్లులు పకారంబులగు 'డప్పి-దప్పి-నొప్పి-పుప్పి' రాచున కిడివర్ణకంబునగు. రాయిడి-రాపు. ఈర్చుబ్బుకందు దువ్వువడ్డించుల కెనవర్ణకంబగు. అగుచో ఈర్చు ఉబ్బుల చకారబకారంబులు పకారంబులగు. వడ్డించు నించులు త్తంబగు. ఉప్పెన-కందెన ఈర్పెన, దువ్వెన-వడ్డెన. పురవర్ణకంబు కాఁచు దాఁచు దాయ్యాదుల కగు. కాఁపురము, దాఁపురము దాపురము. ఎక్కుడిగులకుం బ్రేరణార్థమున మతివర్ణకమగు. అగుచో నెగు ఎక్కున కాదేశంబగు. ఎగుమతి-దిగుమతి. ఇట్లు ఎగువ. వువర్ణం బులియ్యాదులకగు. ఉలివు. కాచు వీచులకు వలివర్ణకంబగు. కావలి-'వీవలి' అను సూత్రోదాహరణములచే నీసూరి కృదంతపరిచ్ఛేద సందర్భమును బూరించుటను గమనించికొనునది. సరిపడెడురీతిని శబ్దమును విభజించి ప్రకృతిప్రత్యయవిభాగము చేయుటయే యాంధ్రలాక్షణికుల మార్గమనుట తెల్లము. ధాతురూపమునుగాని నామమునుగాని ప్రయుక్తమగు సహజావస్థను దలంచికొని వానిపై విశేషించి యగువానిని బ్రత్యయములుగ నెంచుట జరిపిరనుట స్పష్టము. దీన నొక్కొకచో భాషాంతరసాదృశ్యపరిశీలన మొనర్చువారి సిద్ధాంతముల కిమ్మార్గము విరుద్ధమై యాంధ్రలాక్షణికులు ప్రత్యయములన్నవి పదభాగములును నర్థవత్పదములును నగుట యేర్పడెడి.

ఇది కృదంతపరిచ్ఛేదము.

---

# ప్రకీర్ణక పరిచ్ఛేదము.

పూర్వోక్తపరిచ్ఛేదములకు సంబంధించిన వివిధవిషయములను వివరించు గ్రంథభాగముగాన దీనికిఁ బ్రకీర్ణపరిచ్ఛేదమను సంజ్ఞ యొనర్చె. ప్రకీర్ణ మనఁ బాగుగఁ జల్లఁబడినదని యర్థము. విశాలమైనదని భావము. నానాపరిచ్ఛేదముల కగు నానావిషయములఁ బ్రకాశితముం జేయుం గ్రంథభాగమనుట తెల్లము.

## పదాద్యంబులు ఋౠ వర్ణంబులు రల తుల్యంబులు. ౧.

అతఁడు ఋషి - ఇట సంధి లేదు. ఆఋషి - ఇట యడాగమము లేదు. వచ్చె ఋషి - వచ్చెన్ ఋషి - వచ్చెను ఋషి - ఇట ద్రుతమునకు లోప సంశ్లేష స్వత్వములు.

టీ. పదము తొలుత నుండు 'ఋ-ౠ' అను నచ్చులు రేఫలకారములవంటివగునని సూత్రార్థము. ప్రాకృతాంధ్రవర్ణసమామ్నాయనిరూపకసూత్రద్వయము ననుసరించి యీయచ్చులు సాంస్కృతికపదనిష్ఠములే యని గ్రహింపక తీరదు. ఆయా యచ్ సంధిసూత్రములం జేసి యీయచ్చులు పరములుగా సంధి గలుగవలసి వచ్చుటం జేసి యట్టిసంధిసూత్రప్రవృత్తిని వారింప నీసూత్ర మారంభింపవలసివచ్చెనని యెఱుంగునది. సంధిపరిచ్ఛేదమున ఋ ౠ వర్ణముల కచ్చుపరముగా సంధివిధానము లేమిని, ఋౠకారాంతములుగఁ బదములు తెలుఁగున సుబంతప్రక్రియ ననుసరించి గలుగఁజాలమిని, ఋౠకారాంతముల కచ్చు పరమగునవస్థను దలంపక పదాద్యవస్థనే గమనించి యేతత్సూత్రము నారంభించుట జరిగెనని యెంచునది. కాన దీని నాయాసంధిసూత్రములయొద్ద స్మరించుకొనవలెననుట స్పష్టము. అతఁడు+ఋషి:—ఇట నతఁడను పదము తుది యుంకారమునకు ఋషియనుపదము మొదటనుండు ఋకార మచ్చు పరముగా నుత్వసంధి నిత్యముగఁ గావలసియుండఁ నీవిధిచే నాఋకారము రేఫవంటిదిగా నచుని పరముగుట సంభవింపమిని సంధి గలుగక యతఁడు ఋషియనియే యగునని తెలిసికొనునది. ఆ+ఋషి:—ఇచట నత్తునకేగాని యాకారమునకు సంధిపరిచ్ఛేదమున సంధివిధానము లేమిని సంధి 3 చే యడాగమము గావలసిరా ఋషి శబ్దాదిమఋకారము రేఫము వంటిదగుటచే స్వరముకంటె స్వరము పరమగుట గుదురమి యడాగమము గలుగదు

యిట యడాగమంబు లేదను వివరణమున కభిప్రాయము. 'వచ్చెను+ఋషి':—అను నీచోటున ద్రుతప్రకృతికమగు వచ్చెనను దానికంటెఁ బరమగు ఋకారమున కీవిధిచే రేఫతుల్యత్వము సిద్ధించుటంజేసి యచ్ సంధిగాక సంధి 18 చే ద్రుతమునకు లోప సంశ్లేషస్వత్వములుగా 'వచ్చెఋషి-వచ్చెన్ఋషి-వచ్చెనుఋషి' అను రూపత్రయము క్రమముగ నేర్పడునని యిట ద్రుతమునకు లోపసంశ్లేషస్వత్వములను వివరణమున కాశయము. మఱియు నిట్టివిధానమునంజేసియే ఋౠవర్ణములకు రేఫలకారతుల్యత గలిగి ప్రాసములందలి రేఫలకారములతోఁ బ్రాసమైత్రినందుట సంభవించుచున్నదని తెలియునది. ఋకారము హల్లుపై వట్రువ ( ృ ) రూపమున నిల్చుననుట స్పష్టము. ౠకారాదిపదము సాధారణముగ దొరకుట యరిదిగాన నద్దాని కుదాహరణముం జూప లేదు. సంస్కృతవ్యాకరణమునందువలె ౠకారము ౡకారమనునట్లు పదమును నిర్మించి ప్రక్రియ నడుపవలసియుండును. ప్రాసమున మాత్రము ౠకారము లకారమువంటిదను టకు సార్థకత గుదిరెడి. ఋౠవర్ణములు రేఫలకారముల ధ్వనిగలవగుటను నివి హల్లుల మీఁదఁ గ్రమముగ వట్రువరూపముగను ౠకారముగను నుండునవగుటను వీని కీగతి గలిగెనని యెఱుంగునది. ఈవిధానమునకు సంధిగలిగెడి స్థలములె విషయములని యెంచు నది. కావుననే ఛందఃకర్తలు యతిప్రాసములనియమముల నేర్పఱచికొనుట జరిగెను.

ఆచ్ఛికపదంబులం దుత్తమంబు లగు రులుడుల ముందఱియేత్వంబు నకు హ్రస్వంబు విభాషనగు. ౨.

నల్లేరు - నల్లెరు. పల్లేరు - పల్లెరు. పెన్నేరు - పెన్నెరు. మానేరు - మానెరు. ఆడేలు-ఆడెలు. కుందేలు - కుందెలు. తోఁడేలు - తోఁడెలు. నాఁగేలు - నాఁగెలు. నేరేడు - నేరెడు. మారేడు - మారెడు. పూరేడు - పూరెడు. తంగేడు - తంగెడు.

టీ. అచ్చతెలుఁగుపదములందు మూఁడువర్ణములు గలపదములలో మూఁడవ వర్ణములగు 'రులుడు' అను వర్ణములు పరములుగా వానికిఁ బూర్వమున నుండు నేకార మునకు హ్రస్వము వికల్పముగ నగునని సూత్రార్థము. 'త్ర్యాదీనామంత్యముత్తమమ్' అను నభియుక్తోక్తినిబట్టి యుత్తమమన మూఁడవది యను నర్థము లభించెడి. ఇది యఖండపదవిషయముగాని రెండుపదముల కలయికచే నైనపదములకు సంబంధించినది గాదనుట యుదాహృతులంబట్టియుం నుత్తమవ్యవహారము ననుసరించియుం స్పష్టము. 'నల్లేరు' అను పదమునందలి మూఁడవవర్ణమగు రువర్ణము పరముగా దానిముందటి 'ల్లే' అనుదాని యేకారము వికల్పముగ హ్రస్వముగా హ్రస్వము గల్గినపక్షమున నల్లె

రనియుఁ గానిపక్షమున నల్లేరనియు నగును. ఇట్లే లుడువర్ణములు పరములగునపు డఖండపదముల వానిముందటి యేకారము హ్రస్వమగుటను గమనించికొనునది. ఇది యఖండపదవిషయముగ నెన్నుటంజేసి 'మిన్ను+ఏరు=మిన్నేరు' అను మొదలగు సంధిచే నేకపదములుగ నేర్పడినవానియం దీవిధి ప్రవర్తింపదనియు దాన మిన్నెరు మొదలగునవి గలుగక మిన్నేరను మొదలగునవే సిద్ధించుననియు ఫలమును గమనించునది.

ఉయ్యేల పయ్యెదతాయెతులం ద్రిక్కనామంబులందు యాకుం
దాలవ్యవక్రయోగంబు లేదు. 3

స్పష్టము.

టీ. త్రిక్కనఁగాఁ దప్పనని యర్థము. తాలవ్య వక్రమన 'ఏదైతోః కంఠతాలు' అను సంస్కృతవ్యాకృత్యుక్తింజేసి తెనుఁగునఁ గల ఎఏలు తాలవ్యములయ్యెడి. సంజ్ఞ 2 సూత్రముక్రింది వివరణమునుబట్టి వీనికివక్రసంజ్ఞసిద్ధించెడి. కాఁగాఁ దాలవ్య వక్రశబ్దముచే ఎఏలు వాచ్యములగునని గ్రహింపఁదగు. సూత్రస్థమగు మూఁడుదాహరణములందుఁ దప్పఁ దెనుఁగునఁ బ్రాతిపదికములందు యకార మెకారముతోఁగూడి గన్పట్టదని సూత్రార్థము. ఇదియు నఖండపదవిషయమె యని యెఱుంగునది. 'డోలాభూషోత్తరీయాణి వినైత్వం నాస్తి మధ్యమః' అను నాథర్వణము మూలము. శబ్దరత్నాకరము 'ఊచు+ఏల' అని వ్యుత్పత్తి చూపుటంబట్టి 'తాయి+ఎత్తు=తాయెతు' అనియు, 'ఎద+పై=పయ్యెద' అనియు వ్యుత్పత్తులను వానికిని నూహించుచుఁ బైరూపములు సంధ్యాదులంబట్టి సాధ్యములుగామి వ్యాకర్తలు వీని నఖండపదములుగ సంభావించిరని గ్రహించునది. హేలా శబ్దభవమేల యనియుఁ దల్లియర్థము నిచ్చుశబ్దము తాయి యనియు నెత్తులన దండలనియు గ్రహించి తల్లి దండలకుఁ గట్టనవి తాయెతులనియు గుండెపై నుండునది పయ్యెద యనియుఁ దెలియునది. 'ఉయ్యేల-పయ్యెద-తాయెతు' అను మూఁడుశబ్దములందప్ప నెత్వ మితరములఁ గలుగదని శాసించుటంజేసి యితరములందుఁ గలుగనే గలుగదనియు నీమూఁటిలో తాయెతునకుఁ దప్పఁ దక్కినరెంటికి నెత్వము మాత్రమేగాక యత్వమును గలుగఁ దగుననియు నుండిన యెత్వ మీమూఁటి యందు మాత్రమే నడుమ గోచరించుననియు గ్రంథకర్త యభిప్రాయపడినట్లు 4-5-6 సూత్రములనుబట్టియు, నందలి యుదాహృతులనుబట్టియు స్పష్టము.

ఉయ్యేల యుయ్యాలలచాఁపుల నొండొంటికిం గుఱుచ
యొండె నగు. ४.

ఉయ్యేల - ఊయెల - ఊయేల - ఉయ్యాల - ఊయల - ఊయాల -

వక్ష్యమాణంబు యద్విత్వంబు - ఉయ్యేల - ఉయ్యొల - ఉయ్యాల - ఉయ్యల.

టీ. 'ఒండె' ఇది వికల్పార్థకము. ఒండొంటికినని బరస్పరమునకని యర్థము. 'ఊయేల-ఊయాల' అను రెండుపదములందలి దీర్ఘములకుఁ బర్యాయమున హ్రస్వము వికల్పముగ నగునని సూత్రార్థము. ఊయేల యనుపదమునందలి యూకారమునకు హ్రస్వం బీవిధిచేనైన నుయేల యనియు యేకారమునకైన నూయెల యనియుం నీరెంటికిని గాకున్న నూయేల యనియు రూపము లేర్పడును. ఇట్లే యూయాల యనుదానియందలి యూకారమునకు హ్రస్వంబైన నుయాల యనియు యాకారము కుఱుచయైన నూయల యనియు నీరెండిటికిని గాకున్న నూయాల యనియుం రూపములుగలుగు. పై రూపములలో నేదానికేని 6 చే ద్విత్వము హ్రస్వము గలుగనగుంగానఁ బైరూపములందలి యేకారమునకైనపక్షమున సమాసము 13 చే నూకారము కుఱుచయై యుయ్యేల యని రూపమగును. ఈవిధిచే యేకారమునకు హ్రస్వము గలిగి యూకారమునకు హ్రస్వము గలుగని రూపమునందలి యెకారమునకు 6 చే ద్విత్వంబై సమాసము 13 చే నూకారమునకు హ్రస్వంబై యుయ్యొల యనురూప మగును. ఇట్లే యేచాఁపునకును హ్రస్వముగాని యూయాలపదమునందలి యాకారమునకు 6 చే ద్విత్వము సమాసము 13 చే హ్రస్వము గలఁగ నుయ్యాల యనియు యూకారమునకు హ్రస్వంబైన నుయాలయనియుం, నద్దానికి ద్విత్వహ్రస్వములు గలుగ నుయ్యల యనియు రూపము లుప్పతిలును. ఒండొంటి కనుటంజేసి రెండిటికి నేకకాలమందు హ్రస్వముగల్గిన నుయల యుయెల యనునట్టి రూపములు గలుగవని గ్రహించునది.

## పయ్యోద పయ్యెద. ౫.

టీ. పయ్యోదశబ్దము యకారమధ్యముగను నుండఁదగునని సూత్రార్థము. శబ్దరత్నాకరము సంధియం దెదశబ్దము నెకార మకారరూపమునం దెనని తెల్పుచున్నది.

## ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు. ౬.

ఉయ్యేల - ఊయేల. ఊయేల - ఊయెల - ఊయాల - ఊయల. ఆయె - ఏలిదము - ఓయ-ఓయారము-కోపు (ధనురగ్రము)-జాజర - తీనియ - తీయము - తేప (ప్లవము) తేమ - తోయలి-దీవియ - నూపు - నోవి - నోవు - పూవు - పేయ-మోక (అంకురము)-మోటిక - మోపు - వీయము ఇత్యాదు లూయేలాదులు.

టీ. 'ఊఁయేల' అను మొదలగు శబ్దములందుఁ బదము తొలియచ్చుకంటెఁ బరము లగు హల్లులకు ద్విత్వము వికల్పముగ నగునని సూత్రార్థము. తొలియచ్చుమీఁది యనుటంజేసి పదముతొలుత నచ్చున్నను హల్లున్నను బాధ లేదనియు హల్లున్న నద్దానిమీఁదిదే తొలియచ్చని భావింపఁదగుననియుఁ దేప మొదలగు నీక్రింది యుదాహరణములంబట్టి స్పష్టమయ్యెడి. మఱియుఁ దొలియచ్చుమీఁది యనుటంజేసి యది పదము నడుమదైనను దుదిదైనను గావచ్చుననుటయుఁ స్పష్టంబె. ఈసూత్రముచే ద్విత్వమునంది నపుడు సమాసము 13 చే హ్రస్వ మాచ్ఛికదీర్ఘమునకు నిత్యముగ నగుటను స్మరించికొనునది. 4 నందుఁ జూపిన ప్రకారము ద్విత్వమును హ్రస్వమును గూర్చుచుఁ బ్రక్రియ యెల్లవాని కూహ్యము. సమాసము 13 విధి సమాస క్రియాభిన్నాఖండపదముల కగునదని ముందే నిరూపితము.

## అకారంబు క్రింది అకారంబునకుం దుదినులుల క్రిందినలలకు లోపంబు బహుళంబుగ నగు. ౭.

అఱ్ఱు - అఱు. గొఱ్ఱియ - గొఱియ. కన్ను - కను. నన్ను - నను పల్లు - పలు. విల్లు విలు.

టీ. 'ఱ్ఱు' అను సద్విత్వశకటరేఫమును గలిగినట్టివియు, 'న్ను-ల్లు' అనునవి తుదిని గల్గినట్టివియు నగు శబ్దములలోని శకటరేఫనకారలకారములకు లోపము బహుళముగ నగునని సూత్రార్థము. అకారమునకు నలల కనుటంజేసి క్రింది హల్మాత్రములే లోపించుననియు నుత్వయుతములగు ప్రధాన వర్ణములు లోపింపవనియు గ్రహించునది. అకారము క్రిందియను సామాన్యోక్తింజేసి 'న్ను-ల్లు' అనువానివలె లోపించెడు శకటరేఫము శబ్దము తుది నుండుటగాని యుత్వముతోఁ గూడి యుండుటగాని గానక్క ఱలేదనియు దాన గొఱ్ఱియ మొదలగువానియందుఁ దుదిని లేకున్నను నుత్వయుతము గాకున్నను నీలోపముగలిగి గొఱియ మొదలగు రూపములు గలుగుననియుఁ దెలియుఁగునది. 'న్ను-ల్లు' అనువానిలోని నలలు మాత్రము శబ్దాంతముల నున్నపుడే లోపించునని లక్షణకర్త్రభిప్రాయమైనట్లు పైసందర్భమునుబట్టి గ్రహింపఁదగును. ప్రక్రియ స్పష్టంబగుటఁ బరిత్యక్తము. బహుళగ్రహణమునంజేసి 'మఱ్ఱి-కఱ్ఱ-గుఱ్ఱము' మొదలగువానికిని, వెన్ను-(సస్యాదులవెన్ను) మొదలగువానికిని, (వాన) 'జల్లు' మొదలగువానికిని లోప మీవిధిచేఁ గలుగదని యెంచునది. ఇట్లే యాయాస్థలముల బహుళ ప్రయోజనమును గమనించికొనునది.

అక్కటాదులజడ్డకు లోపంబు విభాషనగు. ౮.

అకట - అక్కట. అక్కట-అట్టిక - అట్టుక - అట్టె - అయ్యో - అయ్యారె - అవ్వారి - ఇట్టిక - ఉప్పవడము - ఉమ్మి-ఎక్కసక్కియము - ఎక్కసెక్కియము - ఎక్కిరింత - ఎడ్డ - ఎన్నిక - ఎమ్ముక - కజ్జాయము - కట్టా - కట్టిక - కప్పురము - కమ్మటము - కమ్మతము - కువ్వాడము - కొట్టిక - కొమ్మ - కొయ్యగూర - గయ్యాళము - గిజ్జిగాఁడు-గుజ్జరాతి - చిట్టి - చిన్న - చిమ్మట - చెన్నఁటి - చెప్పుము - చెప్పుఁడు-చెమ్మట-చెల్లియలు - జవ్వాజి - జాబిల్లి - తమ్మటము - తమ్ములము - తల్లి - తుమ్మికి-తువ్వర - తెల్ల - దవ్వు - దివ్వియ - నవ్వు - నిద్దుర-నివ్వరి - నివ్వాళి-నువ్వు - నెట్టిక - నెమ్మలి - పవ్వళించు - పిన్న - పుల్లియ - పువ్వు - పెద్ద - పొట్టి - ప్రాకెన్న - ప్రెగ్గడ - బెగ్గడు - బొమ్మ - బొమ్మికము-బొమ్మిడికము-బొమ్మిడీకము - మజ్జ - మత్తాబు - మల్లారము - ముక్కు - ముద్దియ - మెట్టిక-మొక్కరము - మొగ్గరము - మొల్లాము - రడ్డి - లొట్టిపిట్ట-వట్టి-వయ్యాళి- సన్నియ - సవ్వడి - సివ్వంగి - అట్టు - ఇట్టు - ఎట్టు - అప్పుడు-ఇప్పుడు - ఎప్పుడు - అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - మమ్ము-మిమ్ము-తమ్ము-అమ్మ - అక్క - అవ్వ - అయ్య - అప్ప - అచ్చోటు- ఇచ్చోటు- ఎచ్చోటు-అచ్చటు - ఇచ్చటు - ఎచ్చటు ఇత్యాదు లక్కటాదులు.

టీ. 'అక్కట' అనుమొదలగుశబ్దములందుఁ గల జడ్డకు లోపము వికల్పముగ నగునని సూత్రార్థము. ఏహల్లున కాహల్లుతోడి కూడికయే యిచటి జడ్డశబ్దమున కర్థ మనుటయుం నొకహల్లునకు వేఱొకహల్లుతోడి కలయిక యిచటి జడ్డశబ్దమున కర్థము గాదనియుఁ గ్రిందియుదాహరణసమూహమునుబట్టి స్పష్టము. ఇది యాకృతిగణము. కాన నక్కటాదిగణమునందుఁ గలశబ్దములలోని సద్విత్వములలోఁ గ్రిందిదానికి లోప మీవిధి విధించునదనుట తెల్లము. 'అక్కట' అనుదానిలోని జడ్డకుఁ గకారమునకు లోపం బైన నకట యగును. ఇట్లే సర్వమూహ్యము. సులభము.

జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు. ౯.

అక్కటత్తె - కన్నదరె - నన్నడిగె - పల్లొత్తె - విల్లందె.

టీ. జడ్డక్కారమజాదిపదముతోఁ గలియునపుడు జడ్డకు లోపము పూర్వసూత్రముచేఁ గలుగదని సూత్రార్థము. ఇది నిత్యవిధానము. జడ్డక్కారము తుదిని గలశబ్దము తుదియచ్చుజాదిపదము నాద్యచ్చుతో సంధించునెడలఁ బూర్వవిధిచే నగుజడ్డ లోపము గలుగదని ఫలితము. జడ్డక్కారంబుతోఁ బదాదిస్వరము గలియుచో ననుటంజేసి ద్విత్వ లోపముచే సిద్ధించిన 'యఱు-కను' మొదలగువానినిగాని వాని క్లప్తరూపము (16 చే) లగు 'కన్-నన్-కల్-విల్' మొదలగువానినిగాని పదాదిస్వరముతోఁ గూర్పరాదనియుం జడ్డలతోడివానినే పదాదిస్వరముతోఁ గూర్పవలెననియు ధ్వనితమయ్యెడి. 'అట్టు+ఎత్తె' ఇట నెత్తె ననుపదమునాద్యచ్చగు నెకారముతోడ 'ట్టు' అనుజడ్డ కూడుచున్నదిగానఁ బూర్వవిధిచే నిట జడ్డలోపముగాక 'యట్టెత్తె' ననియేగాని 'యటెత్తె' ననురూపముగాదని గ్రహించునది. ఇట్లే సర్వమూహ్యము. ద్విత్వరహితంబగు ద్వితీయోకారమునకు సంధి రాదని త్రిలింగలక్షణశేషకర్త చెప్పినసూత్రము దీనిచే నప్రసక్తమగుచున్నదనుటకు నన్నడిగెనను నుదాహరణమె ప్రమాణమండ్రు. ఈసూత్రము మూలముననే 'నిన్ను-తన్ను-మమ్ము-మిమ్ము-తమ్ము' మొదలగువానికిఁ బదాదిస్వరముతోఁ గలియునెడలఁ బూర్వవిధిచే జడ్డలోపము గాదనుటయుఁ దెల్లమెగాని ప్రథమేతరసూత్రమున నద్విత్వములగు మిము తము నను మొదలగువానికిఁ బ్రవేశ మీసూత్ర మడ్డఁజాలమిని ద్రిలింగలక్షణ శేష కర్త కట్లు సూత్రించుట ప్రసక్తమయ్యెనని యెంచునది. (చూ. సంధి 2 టీక).

హాదులయు నీలుగులోనగువానితొలిహల్లునకు లోపంబు
బహుళంబుగ నగు. ౧౦.

హడపము - అడపము. హరిదళము - అరిదళము. హాలఁది-అలఁది. నీలుగు-ఈలుగు. నీలుగు-నెగయు. పొందు - పొనరు. పూను పొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచారమూలకంబు.

టీ. హకార మాదియందుఁ గలపదములందుఁ దొలినున్న హకారహల్మాత్రమునకును నీలుగు మొదలగుపదములందున్న యాదిమహల్మాత్రమునకును లోపము బహుళముగ నగునని సూత్రార్థము. హరిదళమనుశబ్దమున హకారహల్మాత్రము లోపింప నరిదళ మనియుం హడపమను శబ్దమున హకారము లోపించి దానియకారము శేషించుట నడప మనియుం నీలుగుశబ్దమున నకారములోపించి యీకారము మిగులుటంజేసి యీలుగనియుం రూపములగును. ఇట్లే సర్వమూహ్యము. ఈలోపము గాకున్న హడపమిత్యాదులు గలుగు నని యెఱుంగునది. ఇది సార్వత్రికము గామిని బహుళపదము ననుసరించి ప్రవృత్త్య

ప్రవృత్తుల గమనించికొనవలయును. సకర్మకాకర్మకభేదమునఁ బూనూనులును బొదవొదవులును భిన్నములగుటను, బైద్వంద్వములు సమానార్థకములనుట కొసంగిన ప్రయోగము లాయర్థమును సమర్థింప సమర్థములు గాకుండుటను, నప్పకవి చెప్పిన పూనుపొదవులయాదిమవర్ణములలోపవిధానమును సూరి యాలోచింపక చెప్పినదిగ వివరించుట జరిగెనని తోఁచెడి. శబ్దరత్నాకరమున: బొదవుధాతువు నిరూపితము గాలేదు. 'ఒదవు:- వై. అ. క్రి.' అని యకర్మక తద్భవక్రియగ నుదాహృతము. దీననిది యుద్భవశబ్దభవముగ విశ్వసించెననుటయు నకర్మకమనుటయుఁ దెల్లము. దీనఁ బొదవనుధాతువు ప్రయోగసిద్ధమై తోఁపనపుడు 'ఒదవు' అనునది దానియాదిమవర్ణలోపముచేఁ గలిగినదనుట గగనకుసుమమునుండి ఫలము గల్గెననునట్టిదే యని సూరి తలంచెనని తోఁచెడి. 'పూను:—దే. అ. క్రి. కడఁగు-ఉద్యమించు' 'స. క్రి. వహించు, ధరించు' అని యర్థములను వ్రాయుచు (ఈయర్థమునందు 2 హరించు 3 ధరించు) దీని కాదిహల్లు వికల్పముగ లోపించును 'చూ-ఊను)' అని యప్పకవీయపద్యముల 'పూనె నెగనె' అను మొదలగువాని నుదాహరించి యాదిమవర్ణలోపమును సామాన్యముగా విధించిన విధికిఁ జిన్నయసూరిగారు వ్యవస్థయేర్పఱుపక (ఈయర్థమున నకర్మకము. ఈయర్థమున సకర్మకము) ('పూనుపొదవుల కాదిలోపం బొకానొకండు వక్కాణించె నదియ విచారమూలకంబు' అని వ్రాయుటకుఁ గారణమేమో తెలిసినదికాదు.) అనుశబ్దరత్నాకరము ననుసరించి యాదిలోపంబునందిన సకర్మకమగుననియు నందదున్న నుభయంబగుననియు నుభయంబగుదానినుండి గల్గినదిగాన నూనుధాతువు సకర్మకము గాఁదగుననియు నీతని సిద్ధాంతమైనట్లు స్పష్టమయ్యెడి. సకర్మకాకర్మకపూనుధాతువునుండియే యూననునదియుఁ గలిగినచో నిదియు నుభయమే గాఁదగియుండునుగాని యట్లుగాక యొక్క సకర్మకత మాత్రమే గలిగియుండుటంజేసి యిది దానినుండి గలిగినదిగాక ప్రత్యేక స్వతంత్ర ధాతువే యనఁదగునని సూరి సంభావించెనని తోఁచెడి. తద్భవంబైన నర్థభేద మేర్పడుటయుఁ దన్మూలమున సకర్మకాకర్మకవిపరిణామ మగుటయుఁ దోఁపనగుంగాని యాదిమవర్ణలోపమునంజేసి యేర్పడినరూపమునం దిట్టిభేదము గోచరించుట పొసఁగమిని, నాదివర్ణలోపమునందు నీక్రిందియుదాహరణములం దెద్దానియందును నిట్టిభేదము గోచరింపమిని, నీయొండురెండిటియందు మాత్రమే యీభేదము గల్గుననుట యుక్తిదూరప్రసంగ మనఁదగుటను, సూరి యూనొదవులను స్వతంత్రములనియే తలంచుట సరససాధార సయుక్తికప్రసంగంబనుటకు సందియము లేదని తోఁచెడి.

## ఆరాటాదులం బ్రథమేతరదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు. ౧౧.

ఆరాటము-ఆరటము. ఆరాటము - కక్కూఱితి - కేళాకూళి - కౌమారుఁడు - కౌమారిత - గంబూరము - పెండారము - బంగారము-బేహారము - వీటతాటము - సంతోసము.

టీ. 'ఆరాటము' మొదలగుశబ్దములందలి తొలిదీర్ఘమునకంటె నితరములగు దీర్ఘములకు హ్రస్వము వికల్పముగ నగునని సూత్రార్థము. 'ఆరాటము.' ఇందుఁ దొలి దీర్ఘంబగు నాకారమునకుఁగాక రెండవదీర్ఘంబగు రేఫముమీఁదియాకారమునకు హ్రస్వం బైన నారటమనియు హ్రస్వము గానిపక్షమున నారాటమనియు రూపములగును. ఇట్లే ప్రథమేతరదీర్ఘముల కంతట హ్రస్వ మూహ్యము. ప్రథమేతరదీర్ఘములను హ్రస్వములు గాఁదగువానినే యిందుఁ జేర్పవలెననుట తెల్లము. ప్రథమదీర్ఘమునకుమాత్రమే హ్రస్వము గలుగువానిని దరువాతిసూత్రమునను బ్రథమేతరదీర్ఘమునకుమాత్రమే హ్రస్వము గలుగు వాని నిందును జేర్పవలెననుట స్పష్టము.

## ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు. ౧౨.

ఓయారము-ఒయారము. ఓయారము-కేళాకూళి-కోలె-గూడారము - గోరువంకపక్షి - జోహారు - నీలుగు - పేఁడ-బేహారము. దీర్ఘమధ్యంబు - మాఱు - మూలుగు - మోఱకు - వీటతాటము - వీడియము ఇత్యాదులు.

టీ. 'ఓయారము' మొదలగు శబ్దములందలి మొదటిదీర్ఘమునకు వికల్పముగ హ్రస్వమగునని సూత్రార్థము. ఓయార మనుదానియందలి తొలియోకారమున కీవిధిచే హ్రస్వమగునెడల నొయారమనియుఁ హ్రస్వముగాకున్న నోయారమనియుఁ రూపములు గలఁగును. ఇట్లే సర్వమూహ్యము. ఈగణమునందలి శబ్దములలోని తొలిదీర్ఘములకంటె నితరములగు దీర్ఘములకుఁ బూర్వవిధిచే హ్రస్వము గలుగదనియుఁ బూర్వవిధిప్రాప్తమగు ప్రథమేతరదీర్ఘముల కగుహ్రస్వమును వారించుటకే తొలిదీర్ఘమునకు హ్రస్వమును విధించు నీసూత్రమును సూత్రించుట యావశ్యక మయ్యెననియు నెఱుంగఁదగును. బెహారమని హ్రస్వము గల్గినచో దీర్ఘమధ్యమై యగునని వివరించుటంజేసి రెండవదీర్ఘమునకు హాయనుదానియాకారమునకుఁ బూర్వవిధిచే హ్రస్వము గలుగదనుట నిర్వివాదము. పేఁడ హ్రస్వమైనచో దీర్ఘముమీఁది బిందువు ప్రథమహ్రస్వము మీఁదిదగుట నిండు సున్నయై పెండ యగుననుట స్పష్టము.

## అడంగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు. ౧౩.

అడఁగు - అణఁగు - అడఁగు - కడఁగు - చిల్లాడము - తడగము - నాఁడెము - పోఁడి - మిడుఁగు - వడఁకు - మిడుఁగుఱు ఇత్యాదు లడంగ్వాదులు.

టీ. 'అడఁగు' అను మొదలగుశబ్దములందలి డకారమునకు హల్మాత్రమునకు ణకారము హల్మాత్రము వికల్పముగ నాదేశమగునని సూత్రార్థము. డకారమునకు ముందు బిందువుండిన ణకారాదేశము గల్గుడు సంధి 16 విధిం జేసి యది యంతరించునని స్మరించి కొనునది. 'అడఁగు' ఇందు డకారమునకు ణకారంబైన నణఁగనియుఁ గాకున్న నడఁగనియు రూపములగును. ఇట్లే తక్కినవూహ్యములు ఇందుఁ జేర్పఁబడిన పోఁడియను దానికిఁ దక్కినవానికివలె స్వతంత్ర ప్రయోగ మగపడమిని బహువ్రీహిని సూరిమతమున నాదేశమగు పోఁడిశబ్దమే యిది యనియుఁ దానికి ణత్వముంగూర్చి 'చిగురుఁబోణి' మొదలగురూపముల సంపాదింపనే దీని నిందుఁజేర్చుట జరిగెననియుఁ విశ్వసింపఁదగును. (చూ. సమా 23 టీక.) ఇది సార్వత్రికము గామిఁ బ్రయోగములంబట్టి యుపయోగించికొనఁదగును. మఱియుఁ శబ్దసహజడకారమునకే గాని యాదేశప్రాప్తమగుదాని కీవిధి గలుగదని యెఱుంగునది.

## దక్కులోనగువాని దాకు డకారంబు విభాషనగు. ౧౪.

దక్కు - డక్కు. దక్కు - దగ్గఱు - దాఁగు - దాఁకలి - దిగు - దిగ్గియ-దూయు-దెందము-దెప్పరము-దెప్పు-దొంగ-దొప్ప-ఇత్యాదులు.

టీ. 'దక్కు' అను మొదలగుశబ్దములందుఁగల దకారమునకు డకారము వికల్పముగ నాదేశమగునని సూత్రార్థము. దక్కను నిందలిదకారము డకారమైన డక్కనియుఁ గాకున్న దక్కనియు రూపములగు. శేషము స్పష్టము. ఉదాహరణములంబట్టియుఁ దక్కనుసూత్రనిర్దేశము ననుసరించి శబ్దాదిదకారమునకే యీడకారాదేశ మగుననుట తెల్లమగు. ఆదేశప్రాప్తమగుటను నడంగ్వాదులని తొలిడకారమునకుఁ గాదని సూత్రకర్త సూచించుటను బూర్వవిధిచే నీడకారమునకు ణకారము గలుగదు. ఇదియుఁ సార్వత్రికముగాక ప్రయోగానుసారముగ నగునని యెఱుంగునది.

## ఏతాదులకు మువర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు. ౧౫.

ఏతము - ఏతాము. ఏతము - కళ్లము - గాలము - గుడ్డము - గోణము-గోతము-జాజము-జుంజము-జోతము - తణగము - బొండ్లము- మండము - లాతము - వీణము-ఇత్యాదులు,

టీ. 'ఏతము' అను మొదలగుశబ్దములందు ముపర్ణకమునకు ముందటిహల్లు మీఁది యచ్చునకు దీర్ఘము వికల్పముగ నగునని సూత్రార్థము. ఏతమనుశబ్దమునందు ముపర్ణకము పరముగాఁ దవర్ణముమీఁది యకారము దీర్ఘ మీవిధిచేఁగలుగ నేతామనియుఁ గాకున్న నేతమనియు నగు. ఇట్లే తక్కినవూహ్యములు.

## పదాంతంబులయి యసంయుక్తంబు లయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు. ౧౬.

ఇందు నురుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపఁబడెడు. మ్రాన్పడె-మినువడె - మిన్వడె - వత్తురువారు - వత్తుర్వారు-కారుకొనియె-కార్కొనియె-రాములు-రాముల్-వనములు-వనముల్.

టీ. పదములతుదల నుండునట్టియుఁ హలంతరముతోఁ గూడనట్టియు 'ను-లు-రు' అనువాని యుత్వమునకు లోపము బహుళముగ నగునని సూత్రార్థము. తఱచుగ 'నురు' అనువానియుత్వమునకు లోపము పదాంతరమునకు సంబంధించిన తొలిహల్లు పరమగునపుడే ప్రయోగదృష్టమని యిందు నురులకను నీక్రిందివివరణమున కభిప్రాయము. ఇది బహుళప్రయోజనముగఁ దలంపనగును. ప్రాయికముగ నని వివరించుటంజేసి యొకపుడవసానంబునందును గాఁదగునని సూరి యభిప్రాయపడుట తెల్లము. 'మిన్ను+పడె:'-పకారమునకు గసడదవాదేశము. 'మిన్ను+వడె.' 7 చే నవర్ణలోపము. 'మిను+వడె. ఇట నువర్ణము పదాంతమున నున్నదగుట నుత్వలోపము వడెననుదాని హల్లు పరముగాఁ బొంద మిన్వడెననురూపమగును. ఉత్వలోపము గాకున్న మిన్నువడె మినువడె నని యగు ననుట స్పష్టము. 'రాముల్-వనముల్' అనుమొదలగునవి యవసానమున లువర్ణము నుత్వము లోపించుట కుదాహరణములు. నురులకేగాని లువర్ణమునకు హల్లు పరమగునపుడను నియమము చేయమింజేసి యవసానంబునను లువర్ణమునుత్వము లోపించుట నిర్బాధమనుట స్పష్టము. సూరి యిట్లు నురుల కుత్వలోపము ప్రాయికంబుగ హల్పరకంబులకే యగునని వివరించుటంజేసియుఁ నురుల కవసానమున స్పష్టముగ నుత్వలోపంబగుట చూపి ప్రాయికప్రయోజనమును విశదపఱుపకుండుటంజేసియుం లువర్ణమునుత్వలోపము హలవసానంబులు పరములగునపుడును గావచ్చునని సూచించియు హల్లు పరమగునపు డగుట కుదాహరింపకుండుటంజేసియుఁ ద్రిలింగలక్షణశేషకర్త 'హలవసానంబులు పరంబులగునపుడు లురువర్ణకముల యుత్వమునకు లోపంబు వైకల్పికంబుగ నగు' అని సూత్రించి హలవసానంబులు రెండును పరములగునపుడు ప్రత్యయంబులైన లురులయుత్వము లుప్త

మగునని పూరించుట జరిగెనని సంభావించునది. వర్ణకములనుటంజేసి ప్రథమాబహువచనంబును రేఫాదేశమునసైన దాని రువర్ణాకృతియు గ్రాహ్యములనుట తెల్లము. వీనికి మాత్రమే హాలవసానంబుల నుత్వలోపము ప్రౌఢవ్యాకర్తచే నంగీకృతమని యెఱుంగఁ దగును. ఈగతిని సర్వమూహ్యము.

## అచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు. ౧౭.

కినుక - కిన్క. కానుక - కాన్క. చిలుక-చిల్క. కాలువ - కాల్వ అడుగు - అడ్గు. కడుపు - కడ్పు. పెరుగు - పెర్గు. కూరుకు - కూర్కు.

టీ. అచ్చతెనుఁగుపదములందు నడుమనున్న 'నలడర' అనువర్ణముల యుత్వమునకు లోపము బహుళముగ నగునని సూత్రార్థము. పదమునడుమనున్న నలడరల యుత్వమున కనుటంజేసి యీవిధి యఖండపదవిషయంబనుట స్పష్టము. 'కినుక' ఇందు నడుమంగలనువర్ణము నుత్వమునకు లోపంబు గల్గినఁ గిన్కయనియుఁ గాకున్నఁ గినుక యనియుం రూపములగు. ఇట్లే తక్కినవూహ్యములు. పదమధ్యముల నలడరల యుత్వమున కనుటంజేసి మూఁడువర్ణములుంగల యఖండపదములందలి నలడరలయుత్వ మీవిధికి విషయమగునని యెఱుంగునది. 'నలడాదేరంతరుతశ్చ' అనునది మూలము.

## లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి. ౧౮.

కలికి-కల్కి. ములికి-ముల్కి. బుడిపి-బుడ్పి. పొలఁతి-పొల్తి.

టీ. పూర్వసూత్రమునఁ జెప్పఁబడిన రీతిగాఁగాక యచ్చతెనుఁగు పదముల నడుమనున్న 'నలడర' అను వర్ణముల యుకారేతరమగు నచ్చునకుఁగూడ లోపమొకానొకచో నగునని ప్రయోగములంబట్టి యంగీకరింపవలెనని సూత్రాభిప్రాయము. 'కలికి' ఇందు నడుమనున్న లవర్ణము మీఁది యిత్వము లోపింపఁ గల్కి యనియుఁ గాకున్నఁ గలికి యనియు నగును. ఇట్లే పదము మధ్యనున్న యికారము లోపించుట కిడిన తక్కిన యుదాహరణము లూహ్యములు. బుడ్పి:—ఇది డకారముమీఁది యికారము లోపించుట కుదాహరణము. పొల్తి:—ఇది పొలఁతి యనుపదము నడుమంగల లకారము మీఁది యకారము లోపించుట కుదాహరణము. ఇట్లే వినికి మొదలగువానికి విన్కి యను మొదలగురూపములగుటను గోరికి కోర్కి యగుటను గమనించికొనునది. ఇది

సార్వత్రికము గామిఁ బ్రయోగానుసారమగునని యెఱుంగునది. పాలఁతి పాల్తి గాఁ దకారము లకారముతోఁ గలియుటంజేసి తన కాశ్రయంబైన యచ్చు తలంగుట బిందు వంతరించెనని గ్రహించునది. 'అన్యేషాం చ ప్రయోగమహితానామ్' అనునది మూలము.

## అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాషనగు ౧౯.

అబ్బురము-అబ్రము. అబ్బురము-కప్పురము-అప్పుడు-ఇప్పుడు-ఎప్పుడు-చప్పుడు-నెత్తురు-ఇత్యాదులు.

టీ. అబ్బురము మొదలగుపదములం దున్న యుత్వమునకు లోపము వికల్పముగ నగునని సూత్రార్థము. ఇదియుఁ నడుమనున్న యక్షరముమీఁది యుత్వలోపమును విధించు నదేగాని పైరెండువిధులును (17-18) మూఁడువర్ణములపదములకు సంబంధించినవే గాక నలడలయిత్యాదులనె లోపింపఁజేయుట కుద్భవించినవగుటంజేసి నలడరేతరవర్ణములందలి యుత్వమును లోపింపఁ జేయఁజాలమి నీసూత్ర మారబ్ధమయ్యెనని యెఱుంగునది. మఱియు నద్విత్వములకే పూర్వవిధానములచే నుత్వలోపంబగు. ఈవిధిచే సద్విత్వములకును నగుననుట యబ్బురమప్పుడిత్యాద్యుదాహరణములంజేసి తెల్లము. అకౄటాదులలో నప్పుడిత్యాదులంజేర్చి యుండుటంజేసి జడ్డలోపంబైనపిదపనే యీయుత్వలోపవిధానమునకవి విషయము లగునని శంక గలుగనగుంగాని జడ్డలోపము వైకల్పికముగ నగునదగుటంజేసి జడ్డలోపము గల్గినపుడును గలుగనపుడును నుత్వసంభవమునంజేసి యప్పుడెప్పుడిప్పుడనునవి యీసూత్రమునకు విషయములే యగుననుట యుచితమని తోఁచెడి. 'పోశ్చతదాద్యర్థవాచకేష్వాతః' అని యప్పుడిత్యాదులు సద్విత్వము లగుటంజేసియే, వీనినడుమంగల యుత్వము సామాన్యసూత్రములచే లుప్తము గాఁజాలదని యెంచి యీసూత్రమును బ్రత్యేకముగ రచించె ననవలసి యుండును గాన నీసూత్రమునకు సద్విత్వములును నద్విత్వములునునగు నప్పుడిత్యాదులు విషయములేయని సంభావింపఁదగును. కాని యుత్వలోప మద్విత్వములకైన అకారాదులకు గురుత్వ మప్పుడిత్యాదిత్రయమునఁ గుదిరెడిఁ గావునను సద్విత్వముల కుత్వలోపమయినను గాకున్నను నకారాదులు గురువులే యగుంగావునను నీప్రకరణమున నచ్చులలోపవిధానములు పూర్వాక్షరములకు గురుత్వముం గూర్చుటకే యేర్పడినవిగావునను సద్విత్వముల కుత్వలోపము గలుగదనుటయే యుచితమని తోఁచెడి. ఉచ్చారణమున నగు నచ్చులలోపము లీప్రకరణమున ముఖ్యముగ సూచితములయ్యె. ఎప్పుడిత్యాదులకు వలెనే నెత్తురిత్యాదులందును నుత్వలోపము గలుగు ననఁదగుంగాని జడ్డకు లోపంబైన 'నెతురు-అబురు'అను

రూపములు ప్రయుక్తములై యగపడమిని సద్విత్వంబులగు నిట్టివానియందలి యుత్వము నకే లోపంబగునని యంగీకరింపక తీరదుగాన నెప్పుడిత్యాది సద్విత్వములకును లోపం బగునని యంగీకరించుటయె యుచితమని సూరి సద్విత్వములుగ నప్పుడిత్యాదుల నుదాహరించెనని తోఁచెడి. ఉత్వలోపంబైనపక్షమునను జడ్డ దొరకెడిఁగావునను, జడ్డలోపమపుడు గల్గినను, బూర్వమునకు గురుత్వము పోదు గావునను నుత్వలోపంబైనపిదపనే జడ్డలోప మీసందర్భమున నగునని సూరియెంచిన ట్లబ్రమిత్యాదులంబట్టి యూహింప నగును. 'అబ్బురము:—ఇందుత్వలోప మీవిధిచేఁ గాఁ బిదప 8 చే జడ్డకు లోపంబైన నబ్రమనియు నుత్వలోపము గాకున్న జడ్డకును లోపము గలుగక యబ్బురమనియు రూపము లగును. ఇట్లే నెత్తురు మొదలగువానికి నెత్రు మున్నగురూపము లగునని యెఱుంగునది. 'కప్పురము=కప్రము. అప్డు-ఇప్డు-ఎప్డు' అనురీతి నగుట యూహ్యము.

## చుక్పరక రువర్ణంబునకు ముందఱి దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాష నగు నగుచోఁ దత్పూర్వంబు గురువుగాదు. ౨౦

అదురుచు-అద్రుచు. ఎదురుచు - ఎద్రుచు. పదురుచు-పద్రుచు.

టీ. ప్రేరణప్రత్యయంబగు చుక్కు పరముగాఁగల రువర్ణమునకుఁ బూర్వమున నున్న 'దు' అనువర్ణము నుత్వమునకు లోపము వికల్పముగ నగుననియు నుత్వలోపము చేత సంయుక్తమైనను నాసంయుక్తాక్షరమునకు (ద్రు)ఁ బూర్వమున నున్నవర్ణము గురువు గాఁజాలదనియు సూత్రార్థము. సంయుక్తాక్షరమునకు ముందటిది గురువగునను ఛందోవిధాన మీసూత్రముచే సంయుక్తాక్షరముగ నేర్పడిన వర్ణమునకుఁ బూర్వమున నున్నయక్షరము విషయమున మాత్రము వర్తింపదని భావము. 'దురు' అనువర్ణము లంతమునఁ గ్రమముగఁ గల్గిన ధాతువులు ప్రేరణప్రత్యయమగు చుక్కును గూడియున్నపుడీసూత్రమునకు విషయములయ్యెడి వనుట స్పష్టము. అదురుధాతువునకుఁ బ్రేరణమునఁ జుక్కుగా నదురుచని యగును. ఇట నీవిధిచే దువర్ణమునుత్వమునకు లోపంబు గా నద్రుచని రూపమగును. ఇట సంయుక్తాక్షరంబైన 'ద్రు' అనుదానిచే నకారము గురుత్వము నందమిని నకారమును నొక్కి పలుకరాదని గ్రహించునది. ఇట్లే యెదురచను దానినుండి యెద్రుచనియుఁ బదురుచనుదానినుండి పద్రుచనియు రూపములు గలుగుననియు ద్రువర్ణమునకు ముందటి యక్షరములు గురువులు గావనుటంజేసి యూఁది వానిని బలుకరాదనియు నెఱుంగునది. గురుత్వ మూఁదిపల్కుటకతన సిద్ధించునదగుటయుం సంయుక్తము మూలమున సంయుక్తపూర్వవర్ణ మూఁదఁబడిన దగుటయుం నక్కారణమున గురుసంజ్ఞ ఛందఃకర్తలు చెప్పినది సార్థకమగుటయు సంభవించెడిఁగాన గురుత్వ

సంపాదకంబగు నూఁదిపల్కుట నిటఁ ద్యజింపవలెననుట స్పష్టము. చంద్రికకర్తలు వీనిని లఘుద్విత్వములని వ్యవహరించిరి. 'రభసంబునఁ బృథివి యద్రువ రాఁదొడఁగిరి' అని ప్రయోగము. ఇట్టిద్రువర్ణము ముందటివర్ణములు గురువులు గాఁజాలమిని ప్రాసమున నిట్టిద్రువర్ణము గల్గినచోఁ దక్కుంగలపాదముల ప్రాసస్థానములందును నిట్టిద్రువర్ణములనే నిల్పవలెనని ప్రాసపూర్వాక్షరము తొలిపాదమున గురువైనఁ దక్కినపాదములందును గురువే గావలెననియుం లఘువే యైన లఘువే గావలెననియుఁ దాము చేసిన నియమమును రక్షించుకొనుటకై శాసించిరి. ఈగురుత్వాభావము 'పదేపి చ తథా త్వం స్యాత్' అను నాథర్వము ననుసరించి ప్రతిపాదితము.

## జూదాదుల దాకు జకారంబు విభాష నగు. ౨౧

జూదము - జూజము. అవుదు - జవాది-జాది - జాదు-విరవాది.

టీ. జూదము మొదలగుశబ్దములందున్న దకారమునకు జకారము వికల్పముగ నగునని సూత్రార్థము. అచ్చతెలుఁగుపదములలోఁ బ్రయోగానుసారముగ నీసూత్రమును వర్తింపఁజేయవలయును. ఇందు మొదటిదానికని గాని రెండవదానికనిగాని మూఁడవ దానికనిగాని నియమము లేదనుట యుదాహరణములంబట్టి స్పష్టము. జూదమను ద్యూతశబ్దభవంబగుదానియందలి రెండవవర్ణంబైన దకారమునకు జకారముగా జూజ మనురూప మగుననియుం జకారము గాకున్న జూదమనియుఁ నగును. తెలుఁగువర్ణమున కైన జకారము గాన దీనిని మొదటిదానినివలెనే దంత్యముగఁ బలుకవలెను. ఇట్లే యవుదను మొదలగువానినుండి యవుజను మొదలగురూపములు సిద్ధించుటను గమనించి కొనునది. అవుజన నెఱుపని యర్థము. ద్యూతజాతీశబ్దములనుండి జూదజాదీశబ్దములు గలిగినవగుట దకారమధ్యరూపము మొదటిదనియుం జకారముగల్గినరూపము తరువాతఁ గల్గినదనియుఁ నిశ్చయింపఁదగును.

## నిందయం దామ్రేడితంబునాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకు గిగీ లగు. ౨౨.

కుంభకర్ణుఁడు - గింభకర్ణుఁడు - రావణుఁడు - గీవణుఁడు.

టీ. నింద ప్రకాశితము చేయవలసినపుడు ద్విరుక్తముగుశబ్దము రెండవరూపము తొలియక్షరమునకు నది హ్రస్వమైన హ్రస్వమగు గివర్ణమును దీర్ఘమైన దీర్ఘమగు 'గీ' అనునదియుం నిత్యముగ నాదేశము లగునని సూత్రార్థము. ఆమ్రేడితమన ద్విరుక్తము యొక్క పరరూపమని సంధిపరిచ్ఛేదమున నుక్తము. ద్విరుక్తము రెండవరూపము నాద్య

క్షర మేయచ్చు గల్గియున్నను గిగీలే యగుంగాని యాయచ్చు హ్రస్వంబైన 'గి' అను నదియు దీర్ఘంబైన 'గీ' అనునదియు నగునని యెఱుంగునది. కుంభకర్ణుఁడు - గింభకర్ణుఁడు:—ఇట నామ్రేడితము నాద్యక్షరమగు కవర్ణము హ్రస్వాచ్చు గలదిగాన గివర్ణ మీవిధిచేఁ గా గింభకర్ణుఁడని రూపమయ్యెను. రావణుఁడు-గీవణుఁడు:—ఇట ద్విరుక్తమున రెండవరూపంబగు రావణుఁడను దాని యాద్యక్షరము దీర్ఘాచ్చుతోఁ గూడినది గాన గీకార మీవిధానముచే సిద్ధింప గీవణుఁడను రూపమయ్యెను. ఇట్లే యంతట హ్రస్వదీర్ఘాచ్చులసంబంధమును జూచికొనుచు నామ్రేడితాద్యక్షరమునకుఁ గ్రమముగ గిగీల నాదేశించునది. హాలాదిపదము లిందుదాహృతము లైనను నజాదిపదములందును నీ సూత్రము వర్తించుననియు నిది సమసమేతరపదసాధారణవిధానమనియు నెఱుంగునది.

## పాదంబునం బ్రథమద్వితీయాక్షరములు వళిప్రాసంబులు నాఁబడు. ౨౩.

టీ. పద్యపాదమునందలి తొలియక్షరమునకు వళియనియు ద్వితీయాక్షరమునకుఁ బ్రాసమనియుఁ బేర్లు. 'వళిరాద్యమనంతరాక్షరః ప్రాసః' అనునది మూలము. దీని ననుసరించి గల్గిన యీసూత్రమునకును బ్రథమమును వళియనియు ద్వితీయాక్షరమును బ్రాసమనియు ఛంధఃకర్తలు వ్యవహరింతురని యర్థము చేయుట యుచితము. దీనఁ బ్రథమమను సామాన్యవ్యవహారముంజేసి పాదము తొలియున్న యజ్ఝల్సమితికెల్ల వళిసంజ్ఞ సిద్ధించి పడియం దజ్ఝల్లులకు రెంటికిఁ బ్రాధాన్యమును శాసించు ఛందఃకర్తల విధానములును, ద్వితీయాక్షరమను సామాన్యవ్యవహారముంజేసి ప్రాసమున హల్లులకె ప్రాససంజ్ఞ సిద్ధించి ప్రాసమున నచ్చులకగ్రాహ్యతను శాసించు ఛందఃకర్తలవిధానములును సార్థకములయ్యెడి. మూలము యతిప్రాసములతోఁ గూడిన గణబద్ధములగు పద్యములతో నొప్పు కావ్యములందలి భాషకే యీనియమమని యెఱింగింపఁ గావ్యలక్షణపద్యగణయతిప్రాసరూపములను సూచనామాత్రసారముగ నెఱింగించెను గానఁ దన్మార్గానుసారియగు నీ సూరి వ్యాకృతియందుఁగల యీసూత్రములకును నదియె ప్రయోజనము గాని వేఱొక ప్రయోజనము లేదని యెఱుంగునది. కాని వ్యాకరణప్రక్రియంజేసి కొన్నిటి కట్టిమైత్రి సంభవింపవలసి రాఁగ ముందుగ స్పష్టార్థము యతిప్రాసములరూపును దిఙ్మాత్రమెఱింగించెననుట యుచితమని తోఁచెడి. యతికిఁ బర్యాయముగ లక్షణకర్తలు చెప్పిన విశ్రాంతీత్యాదిపదజాలములోని సంస్కృతసమపదము లెల్లను బదచ్ఛేదరూపమగు సంస్కృతయతినే బోధించునవగుటంజేసి వానిని విడిచి సూరి వడిరూపాంతరమగు వళిపదమును, దేశ్యమును, దెనుఁగునఁగల యక్షరమైత్రిగ లింబోవు పదమధ్యయతిని గూడ

బోధింప సమర్థమైనదానిని యతికి నిందుఁ బర్యాయముగ వాఁడుట యెంతయు సార్థకము.

## యవలలు లఘ్వలఘువులు మైత్రింబొరయు రేఫంబులు పొరయవు. ౨౮.

టీ. సంజ్ఞ 18 చే యరలవలు నాల్గును లఘ్వలఘు భేదమున ద్వివిధము లగుననుట తెల్లము. అట్లు లఘ్వలఘు భేదమున ద్వివిధములైన యరలవలలో యవలలు మూఁడు మాత్ర మన్యోన్యము ననఁగా నలఘుయవలలతో లఘుయవలును లఘుయవలలతో నలఘుయవలును యతిప్రాసములందు మైత్రి నందుననియు రేఫశకటరేఫములు మాత్ర మట్లు మైత్రి నందవనియు సూత్రార్థము. మైత్రియన నొకదాని కొకటి నిల్పఁబడుట యనుట తెల్లము. 'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్' అను చింతామణి మూలము. దీని విస్తృతి సంజ్ఞ 16 లో నరయునది. 'అనయోస్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ, అస్యా అత్యంతదుష్టత్వాద్దుష్కవిస్స హి కథ్యతే' అనునథర్వణోక్తి ననుసరించియు నద్దాని నూఁతగఁ గొని మెలంగిన ఛందఃకర్తల సూక్తుల ననుసరించియు రేఫశకటరేఫముల మైత్రి నానాఁటికి లుప్తమయ్యెననియు, నున్నవియు నిట్టి లక్షణముల వాసనగలపండితప్రవరులచే సవరింపఁబడి యదృశ్యము లయ్యెననియు, నట్లయ్యును విజయవిలాసాదుల వీనిమైత్రి స్పష్టముగ గోచరించుచునే యున్నదనియుఁ బాఠకలోక మెఱుంగుదురుగాక. రేఫశకటరేఫముల విభాగము నిస్సంశయముగఁ దెలిసికొన నవకాశ మే గ్రంథమును నీయకుండుటను, నొకపదమే యుభయరేఫములతో నుండుట కోశాదులంజేసి స్పష్టపడుచుండుటను, దెనుఁగున శకటరేఫము రేఫము ధ్వని గలిగి రేఫముకల్గియుండఁగనే యధికముగఁ దోఁచుటను, మున్ను వ్రాసినరీతి నిది వివిధ ధ్వనులకు సంకేతమై తుద కిట్టిరూపమందుటను నొకశకటరేఫపదము ననుసరించి యతిప్రాసములంగల తక్కంగలవెల్ల శకటరేఫయుతపదములే యని యిటీవల నిర్ణయము జరిగియుండుటను, గవిలోకమునకును బాఠకలోకమునకును నిప్పటికిని రేఫశకటరేఫ నిషేధాంగీకారవిషయమున నొకనిర్ణయము గలుగకున్నదనుట సాహసోక్తి గాఁజాలదు. పైని వ్రాసినవిషయము ననుసరించి రేఫశకటరేఫములమైత్రి కొంతకాల మాదిని గవిప్రవరులచే ననంగీకృతమయ్యెఁ బిదప నది యసంగతమనుతలంపు గతానుగతికముగా గలిగి యంగీకృత మయ్యెననియుఁ, బ్రాచీనగ్రంథములందును బేరందిన కవులకావ్యములందును నివ్వానిమైత్రి గానఁబడకుండఁ దరువాతిలక్షణములవాసన ననుసరించి సంస్కర్తలొనర్చిరనియు, నాధునికకావ్యములందు నిరాఘాటముగఁ జూపట్టుట యేతన్మూలకమే

యనియుఁ బొరకు లూహింతురుగాక. అథర్వణుఁడు శకటరేఫములపదముల లెక్కను సరిగ నిదమిత్థమని యొకనిర్ణయము ననుసరించి చూపలేకుండుటయు మతభేదప్రదర్శనముంజేసి యనిర్ణయమె తెలుపుటయుఁ దరువాతివారలును నిట్టియవస్థపాలే యగుటయుఁ బైవిషయమునకుఁ బ్రమాణములు. (చూ. అథ. సంజ్ఞ 17-18-19-20-21) మఱియు నలఘురేఫము లఘురేఫమగుట విషయమునను నొక నిర్ణయము లక్షణకర్తలకు లేమిని, నిర్వానిమైత్రివిషయమునను మతభేదములే తోఁచుటను, నీసందర్భ మంతశుద్ధము గాదనియే తోఁచెడి. ప్రాసము హల్ప్రధానమగుట నవ్విషయమున లఘ్వలఘుభేద మగ్రాహ్యమందురేమో? దంత్యతాలవ్యచజలకంటె నీరేఫముల కెక్కుడుభేదము లేదుగాన నట్లనుట యయుక్తము. యతిమైత్రివిషయమున ఛందఃకర్త లంగీకరించు సాధర్మ్యమున కంటె దూరమగు పద్ధతి (వైలక్షణ్యము) రేఫములవిషయమున గోచరింపమిని రేఫములకు యతిమైత్రి లేదనుటయు నయుక్తప్రసంగమె. కాన నీవిధానము గతానుగతికముగా, లాక్షణికకవిలోకమునఁ గలిగినదియు నయుక్తిక మగునదియు ననుట దోషము గాఁజాలదు.

## రేఫంబులు లఘ్వలఘువులుం దక్కంగల విశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు. ౨౫.

టీ. లఘ్వలఘురేఫములను మిగిలిన విశేషములను బూజ్యులగు కవులవ్యవహారమునుబట్టి యెఱుంగుటయే శ్రేయమని సూత్రార్థము. 'అథర్వణము - అప్పకవీయము-అహోబలపండితీయము' అను మొదలగులక్షణములు రేఫశకటరేఫములవిభాగమును వానితోడిపదములును వానిమైత్రి విచారమును, వాని యన్యోన్యపరిణామమును విపులముగ నెఱిగించునవిగాన వానివలనఁ దద్ద్వయవిభాగము నెఱుంగనగుంగాన గ్రంథవిస్తరభీతి నిందు విడిచితిననియు, నింకను జెప్పక విడిన రూపాదులకు సంబంధించినవిశేషము లేమేని మిగిలినవానిం గూడ నితరాథర్వణాప్పకవీయాహోబలపండితీయాదిలక్షణములనుబట్టియే తెలియవలెననియు సూరియాశయ మైనట్లు దీన స్పష్టముగ గ్రహింపఁదగును. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే' అనుభాష్యోక్తి ననుసరించి సూరి వ్యాకరణశాస్త్రంబగు నిందు గ్రంథాంతమున మంగళార్థకమగు శ్రేయశ్శబ్దమును గర్తృపాఠక మంగళకరంబగుదానిని బ్రయోగించుట సరసము. తక్కంగల విశేషము లనుటంజేసి కొఱంత లేనియట్లు తాను వ్యాకృతి రచింపలేదనియు నింకను దెలిసికొనవలసిన విశేషము లనేకములు గలవనియు సూరి యూహించుట తెల్లము. ఆర్యవ్యవహారములఁ దెలియుట శ్రేయంబనుటంజేసి గ్రామ్యవ్యవహార మాధారము

గాదనుటయు వ్యాకృతిసూత్రమునందలి యార్యపదంబగుటఁ బూజ్యకవిప్రయోగము లద్దాని కాధారములనుటయు స్పష్టములు. ఇట్లు సర్వము శుభము.

శ్లో. శ్రీస్తనాఞ్చితకస్తూరీపఙ్కసంకలితోరసే,
పఙ్కజాక్షాయ నాథాయ వేంకటేశాయ మఙ్గళమ్.

ఇది ప్రకీర్ణకపరిచ్ఛేదము

---

టీక. 'శ్రీస్తనాంచితకస్తూరీ' అను మంగళశ్లోకమునందలి 'సంకలితోరసే' అను ప్రయోగము బహువ్రీహిని 'కప్' అను ప్రత్యయము వికల్పముగఁ గానఁగునను దృష్టిని జేయఁబడినదని యెంచునది.

తే. పద్మపాలిండ్లకస్తురిపంకమునను, సంకలితమైనయెదగల్గు వేంకటేశు
నకు సరసిజాక్షునకు సర్వనాథునకును, మంగళము సర్వమంగళమాప్రదునకు.

ఇది ప్రకీర్ణకపరిచ్ఛేదము.

---

టీకాంతిమగద్యము.

ఇది శ్రీకౌండిన్యసగోత్ర, దూసిసదన్వయదుగ్ధాబ్ధికువలయమిత్ర, కాశ్యన్నపూర్ణాసూర్యప్రకాశసత్పుత్ర, మద్రవిశ్వకళాపరిషద్దత్తవిద్వద్బిరుదాంకిత, నందితిమ్మన పారిజాతాపహరణసురభివ్యాఖ్యోదయ సుందరీరుక్మిణీకల్యాణజీవనప్రభావికావ్యనాటక రచనాభిశోభిత, శ్రీవఝులాన్వయవారాశికళానిధి శ్రీచిన సీతారామస్వామిశాస్త్రిగురు పరసంప్రాప్తాంధ్రలక్ష్యలక్షణజ్ఞానధౌరేయ సుజనవిద్వద్విధేయ శ్రీవిజయనగరమహారాజ సంస్కృతకళాశాలాంధ్రోపాధ్యాయ రామమూర్తిశాస్త్రినామధేయప్రణీతంబగు బాలవ్యాకరణసారస్యసర్వస్వపేటికయను నామాంతరముగల గ్రాంథికాంధ్రకల్పకమను టీక సర్వము సంపూర్ణము.

శ్రీశ్రీశ్రీ మంగళం మహత్.

బాలవ్యాకరణము

సంపూర్ణము

---

క. మును మదుపజ్ఞం బగుచుం
దనరినవ్యాకృతిని సూత్రతతి యొకకొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగుభంగిఁ దగన్.

క. తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్క నందినవారల్
తనరఁగ నీవ్యాకరణం
బున మూలంబయినకృతిని బోలఁ గనఁదగున్.

---

# బాలవ్యాకరణము
# సూత్రానుక్రమణిక.

| ఫుట. | | | సూత్రము. |
|---|---|---|---|
| | ఆ | | |
| 323 | ఆఈఏయనుసర్వనామంబులు త్రికంబు నాఁబడు | సమా | ౪ |
| 347 | ఆకారంబునకా మ్రేడితంబునకుందదర్థకంబునకయియాయియను | సమా | ౨౧ |
| 458 | ఆగమచకారంబునకు నెఱసున్న మీఁది దానికిదుక్కుపరంబగు | క్రియా | ౯౦ |
| 140 | ఆగమముపువర్ణంబుల కందువర్ణకము పరంబగునపుడు | తత్స | ౩౦ |
| 457 | ఆగమాన్యచకారంబులకద్విరుక్తంబులకు ముత్తుపరంబగునపుడు | క్రియా | ౭౭ |
| 463 | ఆచ్ఛికంబులందయియవులకువక్రతమంబులుబహుళంబుగానగు | క్రియా | ౧౦౩ |
| 518 | ఆచ్ఛికంబుల బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు | ప్రకీ | ౧౮ |
| 508 | ఆచ్ఛికపదంబులం దుత్తమంబు లగు రులుడుల ముందటి | ప్రకీ | ౨ |
| 328 | ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమఁబు ప్రాయికంబుగాద్వంద్వంబగు | సమా | ౮ |
| 206 | ఆచ్ఛికశబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీసమంబులుం గ్లీబసమంబులయి | ఆచ్ఛి | ౨ |
| 452 | ఆడోడుకూడులడకారంబునకుంజుక్కుపరంబగునపుడు | క్రియా | ౭౦ |
| 483 | ఆత్మార్థంబభిహితంబగుచోఁదల్లింగసంఖ్యాభిధాయివచనంబు | క్రియా | ౧౨౦ |
| 189 | ఆత్మేమనిజంతంబులకు నాంతములగు మనుజసంజ్ఞలకు | తత్స | ౮౮ |
| 70 | ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు | సంధి | ౧౮ |
| 411 | ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతంబగు | క్రియా | ౪౨ |
| 102 | ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది | సంధి | ౪౦ |
| 114 | ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమముడుజ్ఞులకు | సంధి | ౪౯ |
| 103 | ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా | సంధి | ౪౧ |
| 515 | ఆరటాదులం బ్రథమేతరదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు | ప్రకీ | ౧౧ |
| 36 | ఆర్యవ్యవహారంబులదృష్టంబు గ్రాహ్యంబు | సంజ్ఞా | ౨౩ |
| 213 | ఆల్వాదుల బహువచనలకారంబునకు రేఫంబును ముందటి | ఆచ్ఛి | ౧౧ |
| 331 | ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టగు | క్రియా | ౬ |
| | ఇ | | |
| 443 | ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు | క్రియా | ౮౨ |
| 448 | ఇంచుక్చుక్పుగాగమంబులు పరంబులగునపుడాగమాదేశ | క్రియా | ౮౮ |
| 57 | ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు | సంధి | ౯ |
| 13 | ఇఈఏఏలం గూడిన చజలు తాలవ్యంబులు | సంజ్ఞా | ౭ |
| 437 | ఇఉబుల కించుక్కు పరంబగునపుడయుగపుగరుక్కులగు | క్రియా | ౬౪ |

ఈ



ఉ

జ



ట



డ

| పుట. | | | సూత్రము. |
|---|---|---|---|
| | **స** | | |
| 245 | సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమంబగు | ఆచ్ఛి | ౨౫ |
| 47 | సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయినస్వరంబునకు | సంధి | ౩ |
| 273 | సంప్రదానంబునకుం జతుర్థియగు | కార | ౪ |
| 401 | సంప్రార్థనంబులముజ్జునకదాదులు విభాషనను ప్రయుక్తంబు | క్రియా | ౩౩ |
| 142 | సంబోధనంబునందుఁ బదంబుతుదియుకారేకారంబులకు | తత్స | ౩౩ |
| 145 | సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు | తత్స | ౩౬ |
| 142 | సంబోధనంబునం దేకార్థంబయినపదంబుతుదియుకారంబున | తత్స | ౩౨ |
| 436 | సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు | క్రియా | ౬౩ |
| 439 | సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కపరంబగునపుడు | క్రియా | ౬౬ |
| 31 | సంస్కృత ప్రాకృతతుల్యంబగు భాష తత్సమంబు | సంజ్ఞా | ౧౯ |
| 33 | సంస్కృతప్రాకృతభవంబగుభాష తద్భవంబు | సంజ్ఞా | ౨౦ |
| 2 | సంస్కృతమునకు వర్ణము లేఁబది | సంజ్ఞా | ౧ |
| 14 | సంస్కృతసమంబులం దికారాంతములయిన శబ్దముల | సంజ్ఞా | ౧౦ |
| 204 | సంస్కృతసమేతరంబయిన యాభాష యచ్ఛ యనంబడు | ఆచ్ఛి | ౧ |
| 25 | సంస్కృతసమేతరములయిన తెలుఁగుశబ్దములయందుఁ | సంజ్ఞా | ౧౬ |
| 316 | సమర్థంబులగుపదంబు లేకపదంబగుట సమాసంబు | సమా | ౧ |
| 219 | సమానపదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో | ఆచ్ఛి | ౧౫ |
| 312 | సమానాధికరణంబగును తత్పరంబు పరంబగునపుడు మూఁడు | సమా | ౧౭ |
| 406 | సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకంబగు | క్రియా | ౩౪ |
| 81 | సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు | సంధి | ౨౮ |
| 96 | సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల | సంధి | ౩౬ |
| 86 | సమాసంబులందు ద్రుతంబునకు ప్రకృతిభావంబు లేదు | సంధి | ౨౬ |
| 83 | సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం | సంధి | ౨౫ |
| 355 | సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు | సమా | ౨౫ |
| 441 | సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు | క్రియా | ౭౦ |
| 247 | సర్వనామక్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుం | ఆచ్ఛి | ౨౬ |
| 297 | సర్వనామసంఖ్యాభిధానతద్విశేష్యంబులయం దెయ్యది ముందు | కార | ౨౬ |
| 329 | సర్వశబ్దంబులు సంబంధంబునందుం దచ్ఛబ్దంబుతోడ సమసించు | సమా | ౮ |

| పుట. | | | సూత్రము. |
|---|---|---|---|
| 193 | సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగానగు | తత్స | ౮౦ |
| 317 | సాంస్కృతికాచ్ఛికమిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు | సమా | ౨ |
| 170 | సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా | తత్స | ౬౦ |
| 411 | సృజికి నిర్మితిని గుణంబు లేదు | క్రియా | ౬౯ |
| 130 | స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు | తత్స | ౧౭ |
| 167 | స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు | తత్స | ౫౭ |
| 196 | స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులం | తత్స | ౮౫ |
| 289 | స్త్రీసమంబులగు విశేషణంబులయు మువర్ణకాంత విశేషణంబు | కార | ౨౦ |
| 327 | స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు | సమా | ౬ |
| 440 | స్పృశికి గుణంబు విభాషనగు | క్రియా | ౬౭ |
| 169 | స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగిం | తత్స | ౫౯ |

హ

| | | | |
|---|---|---|---|
| 177 | హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బింద నామంబగు | తత్స | ౬౭ |
| 513 | హాదులయు నీలుగులోనగువానితో లిహల్లునకు లోపంబు | ప్రకీ | ౧౦ |
| 22 | హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు | సంజ్ఞా | ౧౪ |
| 254 | హ్రస్వముమీఁది టివర్ణంబునకుముందు పూర్ణబిందువు | ఆచ్ఛి | ౩౨ |

P35, Ex1




చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1937.